# కపిల కాశీపతి

పత్రికా, చలనచిత్ర, రేడియో, సాహిత్య, నాటక రంగాలలో జగమెరిగిన బ్రాహ్మణుడు.

ఆంధ్ర, కాశీహిందూ విశ్వవిద్యాలయాలలో ఆర్థిక, న్యాయ శాస్త్రాలలో పట్టభద్రుడు.

మద్రాసులో న్యాయవాదవృత్తి విసర్జించి, ప్రకాశం పంతులు 'స్వరాజ్య' పత్రికలో ప్రవేశించినాడు. 'మెయిలు' పత్రికలో పనిచేసినాడు.

నిజాం రాజ్యంలో ప్రత్యేక విలేఖరిగావుండి నిజం వ్రాసినాడు. నిజాం ప్రభుత్వం 'దేవిడీమన్నా' చేసినది, రాజ్యంలోంచి వెళ్లగొట్టబడినాడు.

చలన చిత్రలోకంలో ప్రవేశించి 'సారథి', 'ప్రాగ్జ్యోతి'లో పనిచేసి 'ఆకాశవాణి'లో చేరినాడు. వార్తాసంస్థలో ప్రధాన సంపాదకుడైనాడు.

కేంద్రప్రభుత్వ సమాచారశాఖ ఉపసంచాలకుడై, కలకత్తాలోనూ, మద్రాసులోనూ సెంట్రల్ ఫిల్ముసెన్సారుబోర్డు ప్రాంతీయ అధికారిగా పనిచేసి రిటైరైనాడు.

మధ్యలో మద్రాసు, హైద్రాబాదు ప్రభుత్వాలలో ప్రత్యేకాధికారిగా నియమితుడై, సమాచారశాఖలు పటిష్టం చేసినాడు. ఆంధ్రప్రదేశ ప్రభుత్వానికి ప్రథమ సమాచార డైరెక్టరు.

అటు ఆంధ్ర మహాసభతోనూ, ఇటు తెలంగాణా ఆంధ్ర మహాసభతోనూ ప్రత్యక్ష పరిచయంకలవాడు. హైద్రాబాదు స్టేటు కాంగ్రెసు అజ్ఞాతవాసంలోవున్ననాడు, చేదోడు వాదోడైనాడు. నెహ్రూ ఆశీర్వచనంతో, కృష్ణమీనన్ సహాయంతో, స్టేటు కాంగ్రెసు కోరికమీద, మద్రాసు ప్రభుత్వం ద్వారా లండనువెళ్ళి, అక్కడ నిజాం ప్రతినిధుల ప్రచారానికి ప్రతిప్రచార ఉద్యమం నడిపినాడు.

కాసు బ్రహ్మానందరెడ్డి సమకాలికుడేకాక కొన్నాళ్ళు సహాధ్యాయి కూడాను. ఆంధ్ర, జాతీయోద్యమాలకి కేంద్రమైన గుంటూరుసీమలో, గాంధీయుగంలో, జగద్విఖ్యాతిపొందిన సత్యాగ్రహోద్యమాల మధ్యలో ఇద్దరి బాల్యయవ్వనదశలు గడిచినవి.

ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ వ్యవహారాలతోనేకాక ఆయా నాయకులు చాలామందితో పరిచయంకలవాడు.

అనేక విషయాలమీద వ్రాసినవాడు, వ్రాస్తున్నవాడు.

ప్రకాశకులు

# ఇందులో

# మనవి

ఇది యాత్ర.

కాసు బ్రహ్మానందరెడ్డి జీవిత చరిత్ర మాత్రమే కాదు. విదేశీయుల పరిపాలనలో పంచబంగాళమైన తెలుగుల ఏకీకరణ యాత్ర. ఇందులో ఎన్నో మజిలీలు, ఎందరో మహానుభావులు.

అంతఃకలహాలతో అంతరించకుండా, స్వరాష్ట్రంలో, ఇంతవరకూ, జాతీయ కాంగ్రెసుని కాపాడుకొచ్చినాడు బ్రహ్మానందరెడ్డి.

రాష్ట్రాంతర, భాషాంతర బలదర్పాలతో కొందరు సంకల్పించిన ప్రాంతీయ విభాగ ఉద్యమం ధిక్కరించి, ఆంధ్రప్రదేశ సమైక్యతా సంరక్షకుడుగా నిలువ గలిగినాడు.

అతని జన్మసీమ కాంగ్రెసుకి కాణాచి; ఆంధ్రోద్యమానికి పుట్టినిల్లు. ముప్పైఏడు సంవత్సరాల రాజకీయ అనుభవం, పరిజ్ఞానం పరిపక్వమైన స్థితిలో బ్రహ్మానందరెడ్డి జీవిత పరమావధి వేరుగా వుండడానికి వీలులేదు. ఆ అవధుల పూర్వాపరాలు ఈ కథకి నేపథ్యం.

ఇది వో పురాణం; ఆధునికాంధ్ర పురాణం. ఒకానొక రాజకీయ పరిణామదశలో ఈ పురాణానికి బ్రహ్మానందరెడ్డి పురుషుడైనాడు.

ఈ పురుషుడి పుట్టుపూర్వోత్తరాలు, సమకాలిక చరిత్ర ఈ రచనకి కథావస్తువు.

అందుకే ఇది యాత్ర.

బ్రహ్మానందంతో యాత్ర.

తప్పులు తప్పవు. ప్రాజ్ఞులు మన్నించగలరు.

హైద్రాబాదు,
15-5-1970.

రచయిత

**1969,**

మార్చి 19.

సౌమ్యఉగాది.

నూతనసంవత్సర పుణ్యకాలంలో,
ఆకాశవాణి ఘోషించినది.

మహాంధ్రమహాకవి దాశరథి కంఠం ఆక్రోశించినది.

రావమ్మా, శాంతమ్మా !
నీవు రావన్నాయి మోళ్లు,
నీవు లేవన్నాయి ముళ్లు,
నిజం నిజమన్నాయి రాళ్లు.

ఆ యెడారి అలాగే వుండాలా ?
ఆ దుమారం అలాగే రేగాలా ?
ఆ గుడారం అలాగే కూలాలా ?
ఆ గులాబీ అలాగే వసివాడాలా ?

పీడకలగన్నాడు నవనీతుడు, నారాయణరెడ్డి :

కొమ్మలు కొట్టుకునె,
కనుబొమ్మలు తిట్టుకునె,
తీగలు పోట్లాడుకునె,
కడుపులో పేగులు కాట్లాడుకునె.

నోళ్లు ధిక్కరించుకునె,
నొసళ్ళు వెక్కిరించుకునె
చిలుకలు చిచ్చులుమిసె,
నాలుకలు, ఉలుకలుమిసె.

ఊరూ నాడూ చెప్పుకునె,
ఇరుగూ పొరుగూ నవ్వుకునె !

సౌమ్యవాదం చేసినాడు ఆధునికాంధ్రకవి ఆరుద్ర :

ఇదికాదు, కాదు, కాదుకాదు పిల్లలపితూరీ
ఏనాటికి ముమ్మాటికి ఇది వృద్ధుల కంగాళీ !

వాపోయినాడు కవికులగురువు శ్రీశ్రీ :

అసలు సమస్యలజోలికి
ససేమిరా పోనివాళ్ళు
స్వప్రయోజనాలకు భే
షైన రంగులు పులుముతారు

చూశావా గాంధీజీ
దేశం, ఈదేశం, నీ
దేశం, ఎటుపోతోందో ?
చూశావా, చూశావా !

అన్నదమ్ముల కథ చెబుతూ, అన్నది ఆడకూతురు నాయని కృష్ణకుమారి :

"పొద్దున్నంతా గర్భశత్రువుల్లా కొట్టుకున్నారు.
నిద్రపొద్దుకు నిండుగా కావలించుకుని పండుకున్నారు.
ఆగ్రహమూ, అనుగ్రహమూ
ఏదొచ్చినా పట్టలేని
వెర్రినాగన్నలు,
ఎల్లా బతుకుతారో ఏమో !"

ఏమో !

తెలుగువాణి పలుకనేర్చిన తర్వాత, తెలుగుకవిత పాడనేర్చినతర్వాత, ఇంత మందికవులు ఒకసారి, ఒకచోట, ఒకవిషయమై హృదయాలు స్పందించి, ఇంత విచారంతో విలపించలేదు. ఇంతగా ధ్వనించలేదు.

ఏమిటాధ్వని ?

తెలంగాణ రణగొణధ్వని.

కవిజన హృదయాంతరాళాలలో పలికిన ప్రతిధ్వని.

తెలుగువాడు, వుండబట్టలేక, ఉక్రోషంతో, సాటివాడిమీద చెయ్యిజేసుకున్నధ్వని.

"నువ్వు నాసొమ్ము తినేశావు, నా అన్నం తింటున్నావు. నా పనిపాట్లు నీ చేతులో చిక్కించుకున్నావు, నా భూమి ఆక్రమించుకున్నావు, నీ దొంగరికం చాలు, నన్ను మోసంచేశావు, నీ పెద్దరికం నా కొద్దు, నీకూ నాకూ పడదు, నా భాగం నాకు విడిచిపెట్టు, రాచ్చిప్ప పగలగొట్టు, ఇల్లు మధ్యకి తెగ్గొట్టు, ఎవరికి వారే మూసేతీరే, నీ దారి నీది, నా దారి నాది, పో అయ్యా, నన్ను విడిచిపెట్టిపో" అనే గృహ చ్ఛిద్రంలోంచి వినిపించినధ్వని.

రైళ్లమీదా, బస్సులమీదా టపటపరాళ్ళు రువ్వినధ్వని; ఆబళ్ళకి నిప్పంటించగా అవి భగభగమండిన ధ్వని; టెలిగ్రాఫ్ టెలిఫోను తీగెలు తంగున తెంచిన ధ్వని; ఇళ్లకీ, దుకాణాలకీ అగ్గిముట్టించగా ఆసాములు భోరున ఏడ్చిన ధ్వని; స్వప్రాణసంరక్షణార్థం పారిపోయే కాందిశీకుల 'హాహా' రవధ్వని; ఉద్యోగ ధర్మంలో ఆవూళ్లోవున్న శ్రీవైష్ణవుడిమీద పెట్రోలుపోసి అంటించగా, ఆ మంటల యమయాతనలో ఆ నిర్భాగ్యుడు చేసిన ఆర్తధ్వని; కాలీకాలని యజమాని శరీరం చూసుకుని, దిక్కూదివాణంలేని ఆలుబిడ్డలు, దిక్కులు పిక్కటిల్లేటట్టు ఘోషించినధ్వని; తెల్లవారకముందే స్నేహితుల ముఠాతో కలిసి రైలుస్టేషను అంటించి, ఆమంటలో తానే కాలిపోయిన విద్యార్థి ఆఖరిధ్వని; అట్టే బయటికి వెళ్లి ముక్కుపచ్చలారనిముద్దుబిడ్డ, అల్లరిమూకలో చిక్కుబడి, పోలీసుతుపాకీలకి గురి అయి ప్రాణాలుపోగా, అమాయికులైన తల్లిదండ్రులు, శవం మీదపడి ఘోలు ఘోలున గుండెలు బాదుకున్న ధ్వని; వేళపట్టుని ఇంటికిరాని కుర్రకుంకనివెతుక్కుంటూ, అర్ధరాత్రిదాకా, వాడవాడా వీధివీధి తిరిగి, పేరెట్టిపిలుస్తూ, చివరికి పోలీసు అదుపులోవున్న కొడుకుని చూసుకుని, ఏమీ అనలేక బతికున్నాడు చాలనే సంతృప్తితో, కన్నకడుపు ఆపేక్షతో, 'నాన్నా, అన్నంపెట్టారా?' అన్న బీద తండ్రి బేలమాటల ధ్వని; పిల్లలపితూరీలో దుండగీళ్ళుదూరి, ఉన్నవాళ్ల ఇళ్లూ, కన్నె పడుచుల వొళ్లూ దోచుకున్న ధ్వని; గుంపులుగుంపులుగా వీధులవెంబడి తిరుగుతూ వొచ్చేపొయేవాళ్లని చందాలకోసం ముష్టెత్తిన అభంశుభం తెలియని పిల్లల అల్లరిధ్వని; ద్వారబంధాలదగ్గిరా, ఢేరాలకిందా ధరణాలలో కూచున్న కిరాయి బాలబాలికల అకలిపేగులగురగురధ్వని; రాళ్ళు తగలగా బొప్పెలు కట్టించుకున్న పోలీసులధ్వని; వాళ్ల తుపాకిదెబ్బకి ప్రాణాలు విడిచిన నిర్దోషి న్యాయవాదిభార్య ఆక్రందనధ్వని; అన్నిటినీమించి లారీలమీద వూరేగుతూ, ఆందోళనకారులు మూడుభాషలలో చేసిన నిరంతర నినాదాలధ్వని :

ఆంధ్రోళ్లని నమ్మరాదు
ఆంధ్రోడా గోబ్యాక్ !

తెలంగాణా లేకే రహేంగే
పోలీసు జులుం నై చెలేంగే !
జై ! తెలంగాణా :
బ్రహ్మానందరెడ్డి గోవిందా !
సి. యం. .... .... ....

ఉరుం వురిమి మంగలంమీద పడింది. వారికెదురుగా ప్రత్యక్షమైన శత్రువు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి కాసుబ్రహ్మానందరెడ్డి, ఇంట్లోవారి ఇక్కట్లన్నీ ఇంటి పెద్దమీద పడిపోతాయి. ముఖ్యమంత్రి పోవాలని కేకలు వేసినారు. పాపాలకల్లా భైరవుడన్నారు. ఇతడు ఏ నరకాసురుడో, . హిరణ్యాక్షుడో, హిరణ్యకశిపుడో అన్నట్టు ప్రచారంచేసినారు.

పన్నెండు సంవత్సరాల పాపంపండింది.

పుణ్యం పుచ్చింది.

ఆంధ్రప్రదేశం కంపించింది.

ఆ భూకంపానికి గోదావరీతీరాన పర్ణశాలలో శ్రీసీతారామాలయం శిధిలమైనది. ఆంధ్రప్రజానీకం హడలిపోయినది. ఏంకీడో ! ఏమో !

నెలరోజులు తిరక్కుండా, మూలిగేనక్కమీద తాటిపండు పడింది. నాలుగు జిల్లాలలో కనివిని యెరుగని తుఫాను చెలరేగినది. దేశం జలమయమైనది. రైళ్లు, బస్సుల రాకపోకలు ఆగిపోయినవి. రెండువేలగ్రామాలు దెబ్బతిన్నవి. కొన్ని గ్రామాలు కొట్టుకు పోయినవి. నూరుకోట్లరూపాయిలనష్టం. వెయ్యిమందికిపైగా జననష్టం. అంతులేని పశునష్టం.

తెలంగాణ రాజకీయ కల్లోలంతో, కోస్తాజిల్లాల జలప్రళయంతో, రాయలసీమ అనావృష్టితో, శ్రీకాకుళం నక్సలైట్ల దుండగాలతో ఆంధ్రప్రదేశం అంతర్జాతీయ దృష్టి ఆకర్షించినది. లండనురేడియో ఆంధ్రప్రదేశంలో అంతర్యుద్ధం చెలరేగినదని ప్రసారంచేసినది. చీనారేడియో ఇది కమ్యూనిష్టు ఉగ్రవాదుల విప్లవం అని ఆశీర్వదించినది. నిజస్వరూపం ప్రత్యక్షం కాలేదు. అది ఎన్నో బహిరంగ, అంతర్వాహినులు సంగమించిన సాగరకల్లోలం.

తెలంగాణాలో ఇంత ప్రకోపం, ఇంత ప్రకంపనం ఇవురుగప్పిన నిప్పులా వున్నాయని ఎవరికి తెలుసును ? తెలుసుకోకపోవడం పొరబాటు. తెలిసి వూరుకోవడం కునికిపాటు.

భూకంపంలాటిదే తెలంగాణాపోరాటం. లోలోపల వేడెక్కిపోయి, కుమిలి కుమిలి, ఆత్మాభిమానం అణుచుకోలేక, అశక్తి అవగాహనచేసుకోలేక, దొరికిన ప్రతిఅవకాశంలోంచీ పైకి పెల్లుబికి, పువారాలాగ చిమ్మి, బాణసంచాలాగా పేలి, నాటుబాంబులతో పగిలి, అన్యాయం అనుకున్నది తట్టుకోలేక, తననితాను పట్టుకోలేక, కోపం దిగమింగలేక, తిక్క తిప్పుకునే ఆస్కారంలేక, లక్ష్యం ఏమిటో మర్చిపోయి, ద్వేషరోషాలతో రెచ్చగొట్టిన పిల్లమూకల విధ్వంస కార్యక్రమాలలో, దుండగీళ్ల వికృతదౌర్జన్యరూపందాల్చినది.

ఈ ఉద్యమం వెనకాల మొదట్లో, నేను, అనినిలబడిన నాయకుడులేడు. రాజకీయపార్టీలేదు. ప్రత్యక్షంగా అందరూ దూరాన నిలబడినారు. మౌనముద్ర ధరించినారు. తమాషా చూసినారు. చివరిదశలో అందుకున్నారు. ఒకరితర్వాత ఒకరు దిగినారు. వారిలో వైరుధ్యం కలిగినది. ఒకరు తెలంగాణా పరిరక్షణల అమలుకోసం, ఇంకొకరు ప్రత్యేకతెలంగాణా వ్యవస్థాపనకోసం. ఇద్దరూ కోరినది ముఖ్యమంత్రి రాజీనామా.

నాయకులికే నాయకత్వం వహించవలసివచ్చిన తెలంగాణా యువకులు, ఇదివరకు జరిగినరీతిలో, తెలిసినదారిలో, చాటునించి పెద్దలు చూబించిన మార్గంలో, దౌర్జన్యకాండకి దిగవలసి వచ్చినది. ఆస్తినష్టం, ప్రాణనష్టం కలగజెయ్యక తప్పలేదు. ఆంతవరకొచ్చేదాకా ఎవరికీ వినబడలేదు. ఎవరూ వినిపించుకోలేదు. ఈ ఆందోళనలోఎంతో అసభ్యత, అశ్లీలం, జుగుప్స, భీభత్సం తప్పలేదు.

ఈ అసభ్యతలో, అశ్లీలంలో, జుగుప్సలో, భీభత్సంలో, అశాంతిలోతాను ఒకడై నిలిచినాడు బ్రహ్మానందరెడ్డి. ఒక సమస్య పరిష్కారానికిగాని, ఒకఉద్యమం ప్రతీకారానికిగాని విచారయోగం, విషాదయోగం తప్పవు. ఇదిరాజకీయసమస్య, ఆర్థిక ఇబ్బందులవల్ల రూపొందినది, దీనికి రాజకీయ, ఆర్థిక పరిష్కారమే జవాబని, సహేతుకంగా ఆలోచించి కృషిచేసినాడు. అన్నిపార్టీల నాయకుల్ని ఆహ్వానించినాడు. వారసత్వంగా సంక్రమించిన సాధకభాధకాలు విచారించినాడు. వారి వాదన విన్నాడు. ప్రభుత్వంలో మంత్రులూ, శాసనసభలో సభ్యులూ, ప్రాంతీయసంఘం పాలించే బాధ్యులూ అయిన మీకుకూడా పాపం జరిగితే పాలు వుంటుందిగదా అనే మాటకూడా అనలేదు. ఇన్నాళ్లెందుకు వూరుకున్నారనికూడా అడగలేదు. "తెలం

గాణాకి అంతో ఇంతో అన్యాయం జరిగినమాట వాస్తవం; అది పొరబాటు. దిద్దుకుందాం, అవసరచర్యలు తీసుకుందాం" అని వారు చెప్పినకార్యక్రమమే అంగీకరించినాడు. అంతా సంతకాలు చేసినారు. సమైక్య ఆంధ్రదేశమే శరణ్యమని ఘోషించినారు. ఆ వేళ్ళమీద సిరా తడి ఆరిపోక పూర్వమే ఆ ఒప్పందం సరికాదని కొందరు ఎదురుతిరిగినారు. శకునిమామలూ, శల్యసారథ్యం వున్నవేగదా !

'పొరబాటు' అన్నమాటతో ఉద్యమం ఉన్మత్తస్థాయి అందుకున్నది. రెచ్చిపోయినది. చెయ్యి దాటిపోయినది. ఎవరిమాటా ఖాతరు చెయ్యలేదు. రాజకీయంగా దీనికి దండనీతి జవాబు. నిజమే ! అది రాజు అనేవాడు నిరంకుశంగా పాలించిన కాలంలో. ఇది ప్రజాయుగం, ప్రజా ప్రభుత్వం. ప్రజలకి నచ్చజెప్పాలి. ఎవరి తప్పో నిరూపించాలి. తగిన చర్యతీసుకోవాలి. నాయకులమధ్యా ప్రజలమధ్యా ఆరవానా ఎప్పుడో ఆగిపోయినది. అదే జాతీయకాంగ్రెసు నీరసానికి కారణం. తటపటాయించినాడు. పరిస్థితులు దిగజారినవి. పత్రికలన్నీ ఏకమైనవి. విరుచుకు పడిపోయినవి. బందోబస్తుచేసి, ప్రజల ఆస్తులూ, ప్రాణాలూ కాపాడలేని ముఖ్యమంత్రి పోవాలని వ్రాసినవి. ఈ నినాదం దేశం మూడుచెరగుల్లోనూ ప్రతిధ్వనించినది. 1968 ప్రారంభంలో ఎంత ఘనుడన్నారో, 1969 ప్రారంభంలో అంత అవాంఛనీయుడన్నారు. ముఖ్యమంత్రి ఏకాకిగా నిల్చినాడు. ఈయనకెవరైనా స్నేహితులున్నారా అనిపించినాడు. కాని, చెదరలేదు, బెదరలేదు.

అన్నెంపున్నెంతెలియని పిల్లగుంపుమీద దండనీతిప్రయోగం పాపంగదా ! పోలీసువారికి విడిచిపెడితే వారేచెయ్యగలరాపని. ముఖ్యమంత్రి విడిచిపెట్టలేదు. నాయకుల నోళ్లూ, పోలీసువారి కర్రలూ వీలైనంతవరకు ఆపుదల చేసినాడు. ఈ పాపభీతివల్ల కొంతజాప్యం కలిగినది. సామానికి లొంగలేదు, దానానికి లొంగలేదు. భేదదండోపాయాలు అమలులోకి రాకతప్పదుగదా ! చివరికి దండనీతిప్రయోగమే పనిచేసినది. ఏ పరిస్థితులలోనూ దౌర్జన్యం సహించరాదన్నాడు గాంధి. అందుకని మానవత్వం విడనాడకూడదన్నాడు. అమానుషచర్యకి ప్రతీకారం అమానుషచర్య కాదు. ఆ విషయం మనసులో వుంచుకున్నాడు ముఖ్యమంత్రి.

ఉద్యమవాదులు ప్రచారవిజయం సాధించినారు. ప్రభుత్వంతరఫుని నిక్కచ్చిగా మాట్లాడినవారు లేకపోయినారు. ఏకముఖవాదనలో అసలువిషయాలు మునుగులో పడిపోయినవి. వివరాలు ఎవరికీ ఇదమిద్ధమని తెలియవు. ప్రభుత్వచక్రాలకి ఏప్పుడూ కందెనవేసి సిద్ధంగావుంచరు, అవి కిరకిరలాడతాయిగాని త్వరగా కదలవు. బయలుదేరేసరికి పుణ్యకాలంకాస్తా వెళ్ళిపోతుంది. ఇంతలో తెలంగాణసమస్య భారత జాతీయసమస్యగా పరిణమించినది.

ఈ విషమపరిస్థితులలో, ఆరునెలలు, అహోరాత్రాలు నిద్రాహారాలు లేకుండా, ఢిల్లీ హైద్రాబాదు నగరాలమధ్య పావురంలా ఎగుర్తూ, వూళ్లోవున్నప్పుడు, గంటల తరబడి, ఉదయాస్తమానమూ అందరితో మంతనాలు జరుపుతూ, ప్రతిక్షణం పత్రికలవారి కష్టమైన ప్రశ్నలకి సమంజసమైన జవాబులు చెబుతూ, పదితలలూ ఇరవై చేతులూవున్న రావణాబ్రహ్మలాగ వ్యవహరించినాడు.

కేంద్రకాంగ్రెసు నాయకత్వంకూడా వికేంద్రీకరణావస్థలో చిక్కుకుని ఇద మిద్ధమని చెప్పేస్థితిలోలేకపోయినది. ఈ సంధిలో అర్రులుచాచుకుని కూచున్న మిత్రులవంటి శత్రువులెందరో ఛాన్సుకోసంచూస్తున్నారు. ఎవరికితోచినపుల్ల వారు వేస్తున్నారు. ప్రత్యర్థిపక్షనాయకులికి కావలసినది కాంగ్రెసు పరాభవం. ఈ పరిస్థితులలో ప్రకాశంవుంటే వీరుడై రాజకీయరంగచాతుర్యం, చైతన్యం ప్రకటించి, ప్రజల్ని ఆకర్షించినా, సహచర్యుల జిత్తులికి పాచికలలో పడిపోయి పరాజితుడై పోయేవాడు. సంజీవరెడ్డి అయితే వుందనుకుంటే తప్పువొప్పుకుని, ప్రాయశ్చిత్తంగా రాజీనామా చేసేవాడు. రెండుపద్ధతులూ సమైక్యరాష్ట్రానికి హానికరంగానే పరిణమించి వుండవచ్చు. సమర్థుడైననాయకుడు మిగిలేవాడుకాడు.

ఒకవేపు రాజకీయప్రతిఘటన, మరోవేపు ఆర్థికఅసంతృప్తి, ఇంకోవేపు ప్రకృతిప్రకోపం, నాలుగోవేపు విప్లవవాదులదౌర్జన్య కార్యక్రమం, అన్నివేపులా ప్రజలఇక్కట్లు; ఈ అస్తవ్యవస్థంలో నిబ్బరంగా నిలబడ్డవాడు బ్రహ్మానందరెడ్డి. ఒకర్ని దూషించక, రోషం చూపించక, తొణక్కుండా బెణక్కుండా, విసుక్కోకుండా, చీకాకుపడకుండా, నవ్వుతూ, శాంతంగా, నెమ్మదిగా, నిశ్చలంగా, ఆర్భాటం లేకుండా, ఆడంబరంలేకుండా అన్నీసద్దుకొచ్చినాడు. అసాధ్యంఅనుకున్న చిక్కులోంచి బైటపడినాడు. బైటవారి వుచ్చులూ, లోపలివారి వ్యూహాలూ దాటుకున్నాడు. కంచెలో చిక్కుకున్న వస్త్రం, చాకచాక్యంగా, చిరక్కుండా పైకిలాక్కున్నాడు. ఆ ఓపిక చరితార్థమైనది.

ఈ మహాసముద్రం ఈదగలడా అని గట్టుమీదనించి తిలకించినారు. మిత్రులూ, శత్రువులూకూడా, ఈదిపారేసినాడు; దరిచేరుకున్నాడు.

బ్రహ్మానందరెడ్డి రాజీనామాఇచ్చి పోవాలన్న కోపోద్రిక్తమైన నినాదంలో, పరాజితులైనవారి వ్యక్తిగత ద్వేషమేగాని రాజకీయమైనసబబు లేదు. రెడ్డిని శాసనసభకి ఎన్నుకున్నది ప్రజలు. ఆ సభకి ఏకగ్రీవంగా నాయకుడిగా ఎన్నుకున్నది ప్రజాప్రతినిధులైన కాంగ్రెసు సభ్యులు. ఆ సభలో అతనికి బలంవున్నంత కాలం పోవలసిన అవసరంలేదు. అది రాజ్యాంగసంప్రదాయం, ప్రజాతంత్రనీతి,

ఆ బలం వున్నదీ లేనిదీ వ్యతిరేకులికి తెలుసును. అయినా వోవూపు వూపిచూసినారు. అవిశ్వాసతీర్మానం ప్రతిపాదించడానికి అవసరమైన కనీసపు వోట్లుకూడా లభించలేదు. అందుకనే బయటినించిఅల్లరి. సభలో వ్యతిరేకపక్షనాయకుడు ముఖాముఖీ సవాల్ చేసినాడు: "ముఖ్యమంత్రి రాజీనామా ఇవ్వాలి" అని "అది నా ధర్మంకాదు, నా స్వభావంకాదు. నా విధులు విడిచిపెట్టి పారిపోయేరకంకాదు, నేను" అని స్పష్టంగా జవాబు చెప్పినాడు. తీరా రాజీనామాఇచ్చి, రాష్ట్రశ్రేయస్సుకోసం, తెలంగాణా ప్రగతికోసం, తాను తప్పుకుంటున్నానని ప్రకటించినప్పుడు, పార్టీశాసన సభ్యులు, అధిష్ఠానవర్గ ప్రతినిధులసమక్షంలో, ఏకగ్రీవంగా, అతనే వుండాలని తీర్మానించినారు.

బ్రహ్మనందరెడ్డి ఆంధ్రప్రదేశశ్రేయస్కామిగాని, తెలంగాణప్రజావిరోధికాడన్నదిస్పష్టం. అడిగినదానికంటె ఎక్కువతలబెట్టినాడు. కేంద్రనాయకులికి నచ్చజెప్పినాడు. ఈ పదిపన్నెండేళ్లలో పొరపాట్లు జరిగినవని పదేపదే ప్రకటించినాడు. కేంద్రం సంపూర్ణసహాయం, సానుభూతీ తెలంగాణావారికి హామీగా ఇప్పించినాడు. ప్రధానమంత్రి అష్టాంగసూత్రపథకానికి కారకుడైనాడు. ఆ సూత్రప్రకారం సత్వరచర్యతీసుకున్నాడు. విస్తృత మంత్రివర్గంలో తెలంగాణా ఉపముఖ్యమంత్రితోసహా, అనుకూల వాతావరణం ఏర్పడేవరకూ, రాజ్యరథం నడపడానికి సంసిద్ధుడై, ముఖ్యమంత్రిగా వుండడానికి నిశ్చయించినాడు.

ఇది బ్రహ్మానందవిజయం.

బ్రహ్మాండమైన విజయం!

పదిపదకొండు సంవత్సరాల వయస్సులో గాంధీమహాత్ముడి ప్రథమదర్శనం చేసుకుని, ఖద్దరువస్త్రదీక్షవహించి, గుంటూరుజిల్లాలో సర్వతోముఖమైన సత్యాగ్రహోద్యమాల నడవడిక కళ్లారాచూసి, కాంగ్రెసువాదిగాపెరిగి, గ్రామ మునసబీ ఉద్యోగంతో జీవితం ప్రారంభించి, చదువుపూర్తి అయీకాకమునుపు, ప్లీడరుపట్టా పుచ్చుకునీ పుచ్చుకోకమునుపు, ఇరవై మూడేళ్ళవయస్సులో పెద్దన్నప్రోద్బలంతో ప్రకాశంప్రభృతుల ఆశీర్వచనబలంతో జస్టిసుపార్టీకిపెరటితోటగా పెరిగిన గుంటూరు జిల్లా రాజకీయరంగంలో ప్రవేశించి, ఒకేసారి జిల్లాతాలూకాబోర్డులలో సభ్యుడై, తొలి విజయం సాధించినాడు. ఇరవై యేడేళ్లునిండకమునుపు ఒంగోలుజిల్లాబోర్డు అధ్యక్షుడై చిన్ననాడే చాకచక్యం ప్రదర్శించి, అధికారదర్పంకిందవుండే ప్రజాసంస్థలో ప్రజాప్రతినిధుల గౌరవప్రతిష్ఠలు నిలబెట్టినాడు. న్యాయవాదవృత్తిలో ధనకీర్తులు ఆర్జించినాడు. జాతీయోద్యమంలో రెండుసార్లు శ్రీకృష్ణజన్మస్థాననివాసం చేసినాడు. మద్రాసుశాసనసభలో సభ్యుడై, ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకార్యదర్శిగాపనిజేసి, ఆంధ్ర

ప్రదేశావతరణసమయంలో మంత్రిపదవి స్వీకరించి, పదమూడేళ్ల అవిరామంగా అధికారంలో వున్నాడు. అయిదారేళ్లగా ముఖ్యమంత్రిగా వున్నాడు.

ఇది బ్రహ్మానందయాత్ర.

సార్థకమైనయాత్ర.

సాటిరాష్ట్రాలలో కాంగ్రెసుసంస్థ పేకమేడలా కూలిపోయిన విషమసమయంలో ఆంధ్రప్రదేశంలో ఆసంస్థని అందలమెక్కించి, జాతీయనాయకులలో అగ్రపంక్తి అందుకున్నాడు. అతిస్వల్ప వ్యవధిలో హైద్రాబాదుకాంగ్రెసుమహాసభకి చక్కని ఏర్పాట్లుచేసి మహానాయకుల మన్ననలందినాడు. కాంగ్రెసుకార్యవర్గనిర్వాహకవర్గ సభ్యుడై అధిష్ఠానవర్గంలో స్థానం అందుకున్నాడు. అతని ప్రమాణం పెరిగినది. పేరు ప్రతిష్ఠలు పెరిగినవి. జాతీయసదస్సులలో అతనిమాటకి, సలహాకి గౌరవం, విలువ కలిగినవి.

వేదంలో రెండుశక్తులపేర్లు వినబడతవి, ఒకటి శ్రేయస్సు. ఇంకొకటి ప్రేయస్సు. శ్రేయస్సు మానవజాతిని కూడదీసి కలిపేది. ప్రేయస్సు మనుషుల్ని విడదీసి విచ్ఛిన్నంచేసేది. తెలంగాణా చిన్నవాళ్ల లేతచేతుల్తో మంటలో జీడిగింజలు తీయించుకుతిందామనుకున్న ప్రదేశాంతర, భాషాంతర అదృశ్యహస్తాలు, ఆంధ్రుల చరిత్ర, సంస్కృతి, జీవితం, పుట్టకీళ్లతో కదిలించి చెల్లాచెదరు చెయ్యాలని సంకల్పించినవి. ఆ విషమపరిస్థితులతో శ్రేయస్కాముడై ఆంధ్రప్రదేశసమైక్యతాసంరక్షణకి కంకణంకట్టుకుని నిలబడినాడు బ్రహ్మానందరెడ్డి. ఒక సామాన్యరాజకీయనాయకుడు విశిష్టరాజనీతివిశారదుడుగా విస్ఫారినాడు.

తలలుపండిన ఆంధ్రనాయకులెవరికీ ఇటువంటిపరిస్థితులు ఎదుర్కోవలసిన అవసరం కలగలేదు. ఇప్పుడే అరవయ్యేళ్లునిండిన బ్రహ్మానందరెడ్డికి ఇది సదవకాశంగా పరిణమించినది.

ఇద్దరు అగ్రనాయకుల స్నేహభంగం రాష్ట్రంలో ముఠాలకి కారణమైనది. కొందరు నాయకుల ఆశాభంగం విచ్ఛిన్నశక్తుల్ని రెచ్చగొట్టినది. క్రమేణా ఈ స్నేహ ఆశాభంగాలే అఖిలభారత జాతీయకాంగ్రెసు సంస్థకీ, ఇన్నాళ్లుగా, ఆ సంస్థ నడుపుతున్న ప్రజాప్రభుత్వానికీ భగ్నకారణాలైనవి.

ఆంధ్రుల ముఖాన్నే పొద్దుపొడిచినట్టున్నది. ఇద్దరు తెలుగువారు రాష్ట్రపతి పదవికి పోటీచేసినారు. ఓడిపోయిన అభ్యర్థి ఆశాభంగమే కాంగ్రెసును రెండుగా చీల్చినది. ఒకచీలిక పాతవాసనలతో చిట్లంకట్టిన 'సిండికేటు' రెండోది ప్రగతికిదారి

తీసే 'ఇండికేటు'. అధికారం చెడ్డది. దానికోసం ఒకేవ్యక్తి, రాష్ట్రసమైక్యతకే కాక దేశసమైక్యతకే కారణభూతుడు కావడం విచారకరం.

ఈ చీలికలో, రాష్ట్రసమైక్యతాసంరక్షణకుగా, మిన్నువిరిగి మీదపడ్డా, చలించకుండా నిలబడిన బ్రహ్మానందరెడ్డి, ప్రగతిమార్గమే అవలంభించినాడు. సామ్యవాద సమాజనిర్మాణానికే మొగ్గినాడు.

చరిత్రకి చివరిపత్రంలేదు. వర్తమానరూపకంలో భరతవాక్యం వుండదు. ఏవ్యక్తి ప్రజాశ్రేయస్సు సాధించగలుగుతాడో ఆవ్యక్తి ధన్యుడు. ఏ ఉద్యమం లోక కల్యాణకారణ మవుతుందో ఆ ఉద్యమం సార్థకం. ఇవి నిర్ణయించవలసిన వారు భావి చరిత్రకారులు.



# కొండవీడు

**1968.**

గుంటూరుజిల్లాలో సంపన్నులూ, సంఘహితాభిలాషులూ, ఒకచోట సమావేశమైనారు. "మనజిల్లాలో కళాశాలలువున్నవిగాని చాలినన్నిలేవు; ఉన్నత విద్యాభ్యాసంచెయ్యాలని కుతూహలపడే యువతీయువకులందరికీ అవకాశం దొరకడం లేదు, ఈ కొరత తీర్చుకోవాలి." అని సంకల్పించినారు. అయితే ఈ కార్యసాధనకి వోసంస్థ అవసరం అనుకున్నారు. సరే, ఆ సంస్థకి ఏంపేరుపెట్టాలీ అన్నారు. ఎవరికోతోచింది. కిటికీలోంచి, ఆట్టేదూరంలేని కొండవీటికొండలు పచ్చగా, నీలంగా, నల్లగా కనబడుతున్నవి. 'కొండవీడువిద్యాసంఘం' అన్నారు. అంతా అమోదించినారు. అది మంచిముహూర్తంకూడా అయివుండాలి. పెట్టి పుట్టినవారూ, పుట్టి పెడుతున్నవారు తల్చుకుంటె లోపమా ? లక్షలు కురిసినవి. భారసాలనాడే అన్ని కట్నాలు చదివించుకున్న ఆ చిరంజీవి జీవితం సుస్థిరం, సుభిక్షం అనుకున్నారు.

కలిసొచ్చిందిగదా, కార్యక్రమం ఏమిటన్నారు. కనీసం రెండుకళాశాలలైనా స్థాపించడానికి కావలసినంతపణం చేతులోపడింది, ఆ పని చేతామన్నారు. సరే నంటే సరేనన్నారు. ఒక కళాశాల గుంటూరులోనూ, రెండవది నరసారావుపేటలోనూ పెట్టాలని నిర్ణయించినారు. మరివాటికిపేర్లో ? చల్లనివేళ కాసువంశపు రెడ్లసేవ తల్చుకున్నారు. గుంటూరులో కళాశాల కీర్తిశేషుడైన కాసు వెంకటరెడ్డి స్మారకార్థం వుండాలనీ, నరసారావుపేటలో స్త్రీలకళాశాల, శ్రీమతి కాసు రాఘవమ్మ గౌరవార్థం వుండాలనీ నిర్ణయం జరిగినది.

కాసు వెంకటరెడ్డి చిన్నతనంలోనే వెళ్లిపోయినాడు. ప్రతిభగలవాడు, న్యాయ వాదిగా పేరుమోసినాడు, సంఘరాజకీయసేవాకార్యక్రమంలో ముందంజ వేసినవాడు. అవిభక్త మద్రాసురాష్ట్ర శాసనసభలో సభ్యుడు. వెంకటరెడ్డి, ఆంధ్రప్రదేశ ముఖ్య మంత్రి. కాసు బ్రహ్మానందరెడ్డి అన్నగారు. చిరంజీవి సౌభాగ్యవతి రాఘవమ్మ, రెడ్డిపాలెం – చేబ్రోలువీరుడు, గాదె చిన్నపరెడ్డిజ్ఞాతులు, చిరుమామిళ్ళగాదెవారి ఆడ బడుచు. భర్తురాలు. పాదంపెట్టినప్పటినించీ అత్తవారింటికి కలిసొచ్చినది. అందంతో పాటు అదృష్టంకూడా అందించిన రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి భార్య.

దీనిభావమేమితిరుమలేశా !

ఆలోచిస్తే. ఒకోనామధేయంలో సవాలక్షగ్రంథం వుంటుంది. 'కొండవీడు విద్యాసంఘం'లోకూడా వున్నది. ఆ సంఘం సంకల్పించిన కళాశాలలు, గుంటూరు జిల్లాకి కాసు వంశీయులుచేసిన సేవాధర్మానికి చైతన్యమైన శాసనాలు; మనరాష్ట్రంలో విద్యావ్యాపకానికి బ్రహ్మానందరెడ్డిచేస్తున్న అవిరళకృషికి ఆనవాలు. ఆ సంఘ నామంలో, ఒకనాటి ఆంధ్రవిద్యావిజ్ఞాన వీరభోగవైభవచరిత్ర ప్రతిధ్వనిస్తున్నది. నలుగురుకలసినప్పుడు, ఆపేక్షతో, అభిమానంతో, 'కొండవీడు' అన్న నామా క్షరాలు తల్చుకుంటే ఆంధ్రహృదయంలో, ఆషాఢమాసమేఘమాలల్లాగ ఊహలు మసుల్తాయి, స్మృతులు ముసుర్తాయి. ఆంధ్ర సంస్కృతి శిఖరారోహణం చేసిన యుగాలు మనసుకొస్తాయి.

కొండలలో రాజవీడు కొండవీడు.

వీరులికీ, దేశభక్తులికీ పుట్టినిల్లై, జాతీయ ఉద్యమానికి ఆటపట్టై, చరిత్రప్రసి ద్ధమైన గుంటూరుసీమ, ఒకనాడు కొండవీటిసీమలో అంతర్భాగం. కొండవీడు కొన్నాళ్లు ముఖ్యనగరం. ఈ కొండవీటిపర్వతశ్రేణి నరసారావుపేటతాలూకాలో ఈశాన్యభాగాన ప్రారంభించి, నైరృతిమూలగా తొమ్మిదిన్నరమైళ్లు వ్యాపించినది. ఉన్నతమైన ఏభై శిఖరాలతో, ఈ శ్రేణిచుట్టుపట్లదేశం పదిపన్నెండుమైళ్ళు కొట్టొచ్చి నట్టు కనిపిస్తుంది. ఈ శిఖరపంక్తిలో నాలుగు మహోన్నతమైనవి. ఒకదానిమీద తెలుగుజాతిఇలవేల్పు, కలియుగప్రత్యక్షపరమేశ్వరుడూ అయిన శ్రీ వేంకటేశ్వర స్వామి వెలిసినాడు. దానిపేరు మూరువేంకటేశ్వరశిఖరం. మరొకదానిమీద సర్వ ఐశ్వర్యాలూ ప్రసాదించే శివదేవుడు వెలిసినాడు. దానిపేరు రుద్రపాదశిఖరం. శివ కేశవాలయాలతో విరాజిల్లే ఈకొండలమధ్య విశాలసమతలప్రదేశం వున్నది. ముచ్చ టగా మూడుసరోవరాలతో, శిధిలమైన ఒకనాటి రాజప్రాసాదాలతో, దుర్భేద్యమైన శిలాప్రాకారాలతో, ఇరవై యొక్క కోటబురుజులతో, రెడ్డిరాజుల పూజ్యరాజ్యగాధలూ, పూర్వాంధ్రప్రతిభ, తెలుగులబలదర్పాలూ, ప్రకటిస్తూవున్నది శేషించినకొండవీడు అనే మహాశైలనగరం.

అదేపేరుతో కొండకింద మరొక రాజవీడు. ముప్ఫైమైళ్ళవైశాల్యంతో, ఎత్తైనకోటగోడలచుట్టూ లోతైన అగడ్తలతో ఏడురాజవీధులూ, పద్నాలుగువాడలూ కలిగిన నేలకొండవీటి శిధిలాలువున్నవి. కొండవీడు ఈనాడొకకుగ్రామం. గుంటూరు నగరానికి పదిపన్నెండుమైళ్ళలో పర్వతపార్శ్వంలో పడుకుని నిద్రపోతూవుంటుంది. ఈప్రదేశం ఒకశతాబ్దం అఖండరాజ్యవైభవంతోవెలిగిన రెడ్డిరాజుల ముఖ్యనగరం. ఆశ్చర్యకరమైన అత్తకోడళ్లపొత్తుతో, సిరిసరస్వతులొకచోట చెలగినచోటు. మూడు దిక్కుల్నించి ముసురుకునే శత్రురాజుల నిరంతరదాడులు ధిక్కరించి, నిర్భయంగా, నిస్సంకోచంగా, నిండుమనస్సుతో, చతుర్విధపురుషార్థాలైన, ధర్మార్థకామమోక్షాలు సరిసమానంగా సాధించి, సంస్కారధనులైన ప్రజాబాహుళ్యపు నివాసం. ధర్మమనే ప్రథమపురుషార్థనిర్వచనభారం మనుగడమీద మమకారం మానుకున్న మహాత్ము లది. అది దేశకాలమాన పరిస్థితులమీద ఆధారం. ఆరోగ్యవంతులైన ఆగర్భ శ్రీమంతులికి ద్వితీయతృతీయపురుషార్థాలైన అర్థకామాలమీద ఆసక్తి అసహజం కాదు. అర్థంలేనిదే కామమోక్షాలుదుస్సాధ్యం అన్నాడు కౌటిల్యుడు. "కామిగాని మోక్షగామికాడు" అన్నమతం కొండవీటి వేమారెడ్డిది. శ్రీమంతులైన ఆ శైలనగర వాసులు అర్థకామాభిలాషులన్నమాట నిజం. ఆ అభిలాష మోక్షసాధనకేనన్నమాట నిజంకాకూడదా? వారుధర్మమార్గం తప్పినట్లులేదుగదా! నవవసంతకాలంలో, ప్రభువులూ పాలితులూ, సుగంధద్రవ్యసేవానుభూతితో నృత్యగీతవాద్యాదులతో ఉయ్యాల లెక్కి ఉర్రూతలూగినారంటే, అది వీరప్రజానీకపు ఉత్సాహశక్తికీ, జవసత్తువలకీ తార్కాణం. అదివారి విశిష్టత, వారి విధానం. నూరుసంవత్సరాలు నిత్యకల్యాణం పచ్చతోరణంగా, బతుకుబరువులూ సుఖవులూకూడా అనుభవించిన ఆ శైలనగర వాసులీనాడులేరు. ఆ వేడిపాలు పొంగిపోయినవి; ఆ వేడినెత్తురు స్వరాజ్యపరిరక్షణలో ప్రవహించినది. ఆ సుగంధద్రవ్యాలు హరించిపోయినవి; ఆ నృత్యగీత వాద్యాలు నిలిచిపోయినవి. ఆ శిధిలాలుమాత్రము మిగిలిపోయినవి.

నేలకొండవీటిలో నేడు హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు నివసిస్తున్నారు. మూడుమహాయుగాల మహారాజ్యాలప్రతినిధిశేషాలు. కొండలకి నైరృతిగా నాలుగుమైళ్లదూరంలో, కేతలిక్కు క్రైస్తవఫాదరీలకేంద్రమైన ఫిరంగిపురం, రంగురంగులుగా వుంటుంది. ఆ గ్రామవాసులు చాలావరకు ఫాదరీలప్రజాసేవ స్వీకరిస్తారు. వారి సందేశంఅనుసరిస్తారు; ఆదికాలంనించీ వొచ్చేహిందూధర్మంమాత్రం విడిచిపెట్టరు. కంఠసీమలో క్రాసుధరిస్తారు ముఖసీమ తిలకంతో అలంకరిస్తారు. స్త్రీజనం పసుపుకుంకాలతో మంగళసూత్రం మహాధనంగా మనుగడ సాగిస్తారు. చుట్టుపట్ల గ్రామసీమలన్నింటిలోనూ ఇదేకథ. కొండలమీది రెడ్డిరాజుల కోటబురుజులు కొండకింది క్రైస్తవాలయాలశిఖరాలకేసి ఉదాసీనంగా చూస్తూవుంటాయి.



# రెడ్డి ప్రభువులు

ఈ రెడ్లెవరు ?

ఈ రెడ్డిరాజులెవరు ?

ఈ కొండవీడు ఎప్పుడు, ఏవిధంగా ఆవిర్భవించినది-?

రెడ్డిశబ్దం రాజరికాన్ని సూచిస్తుంది. రెడ్డికం అంటే పరిపాలన, పరిపాలించే ప్రాంతం. రాట్ అనగారాజు, రాట్ శబ్దంలోంచి రెడ్డిశబ్దం పుట్టిందని కొందరు. రాఠోడ్లు ఉత్తరహిందూస్థానంలో ప్రభువులు. వారివంశస్థులే వీరని. శాతవాహనుల కాలంలో మహారఠీలు పుగీరఠీలు అనే రాజవంశస్థులువుండేవారు. తెలుగుదేశానికి వలస వచ్చిన రఠీలు రెడ్లుఅయినారు. రేడు శబ్దమే రెడ్డిఅయినదని ఒకమతం. రెడ్డి అనగా గ్రామపెద్ద. రెడ్లు గ్రామమునసబులు. ప్రశాంతపరిస్థితులలో వారు నాగలిపట్టినరైతులు. యుద్ధకాలంలో కత్తిపట్టినరౌతులు. ఆదిలో వీరందరూ కాపులేనట, దేశానికికాపులు, పంటకికాపులు. రెడ్లని పంటాన్వయులనికూడా అంటారు. కాకతీయులికి పూర్వమే కాపులలోంచే కమ్మలూ, వెలమలూ, రెడ్లూ విడిపోయినారని ఒకచరిత్ర.

కృష్ణాతీరాన శ్రీకాకుళంలోనూ, ధరణికోటలోనూ, గోదావరీతీరాన ప్రతిష్ఠానపురంలోనూ అది ఆంధ్ర సామ్రాజ్యస్థాపనచేసిన శాతవాహనుల తర్వాత, సర్వాంధ్రసామ్రాజ్యపునస్సంస్థాపనచేసిన కాకతీయప్రభువుల సంరక్షణలో పేరుపొందినవారు రెడ్లు. ఆ చక్రవర్తులికి చేసినసహాయానికి ప్రతిఫలంగా, సామంతులుగా సంస్థానాలు స్వీకరించిన యోధులు. పన్నెండువందలఎనభైతొమ్మిదోసంవత్సరంలో గోపాలరెడ్డి అనే వీరుడికి ప్రస్తుతం తెలంగాణాలోవున్న అమర్చింతసంస్థానం దత్త

మైనది. పన్నెండువందలతొంభైలో బుక్కాప్రోలివిరెడ్డి అనే యోధుడుకి, 'సర్‌నాథ్ గౌడ్' అనే బిరుదుతో గద్వాలసంస్థానం దత్తమైనది. కోమటిప్రోలారెడ్డి కాకతీయులసేనాని. పదమూడువందలఇరవైలో అతను అద్దంకిసామంతుడైనాడు. మరో ముఖ్యమైనరెడ్డిసంస్థానం వనపర్తి. వనపర్తి పదిహేనువందలనాటికిగాని ప్రభవించలేదని కొందరుచరిత్రకారులు. ఏమైనా రెడ్డివీరులు కాకతీయులికి కుడిభుజంగావున్న మాట వాస్తవం.

ఓరుగల్లు, నేటి వరంగల్లు, ముఖ్యనగరంగా యావదాంధ్రదేశమేకాక, ఆంధ్రేతర ప్రాంతాలుకూడా పదకొండుమొదలు పధ్నాలుగోశతాబ్దంవరకూ ప్రతిభతో పరిపాలించిన కాకతీయసామ్రాట్టులు, సంగీతసాహిత్యకళాపోషకులు. శైవమతస్థులైనా, సర్వమతసామ్యసిద్ధాంతంపాటించి, హిందూమతమేకాక, హిందూసామ్రాజ్యంకూడా సంరక్షించుకున్న ప్రభువులు. ఢిల్లీసామ్రాజ్య విస్తరణానికి బలమైన ఓరుగల్లు, ప్రబలప్రతిబంధకంగా వుండడంసహజం. సుల్తానులకన్ను కుట్టినది. దక్షిణదేశదండయాత్రలు చేసినారు. ఒకసారికాదు, పలుసార్లు. ఆంధ్రదేశం ఒక్కమనిషిగాలేచి నడుముకట్టినది. "ఇదంబ్రాహ్మ్యం, ఇదంక్షాత్రం" అనే నినాదంతో ఉగ్రులైన బ్రాహ్మణులుకూడా కత్తిపట్టి, యోధులై, అపరపరశురాములై శత్రుసంహారదీక్ష పూనినారు. ఆ సామ్రాజ్యసంరక్షణ సంగ్రామాలలో వీరులైన రెడ్లఅండదండలు కాకతీయులికేకాక సర్వాంధ్రప్రదేశానికీ శ్రీరామరక్షగా వర్ధిల్లిన్నవి. ఢిల్లీసింహాసనం మీద సుల్తానారజియా, వోరుగంటిసింహాసనంమీద సామ్రాజ్ఞి రుద్రమదేవి తరాలు, ఢీ అంటే ఢీ గా వెళ్ళిపోయినవి. దురదృష్టవంతుడు రెండవప్రతాపరుద్రచక్రవర్తి రాజ్యానికి వచ్చినాడు. అతనిసేనాని దొడ్డారెడ్డి. పినాకినీతీరపు పాకనాటివాడు. ఓరుగల్లుముట్టడి తిరిగిప్రారంభమైనది. దొడ్డారెడ్డిబంధువూ, అద్దంకికోమటి ప్రోలారెడ్డి కుమారుడూఅయిన ప్రోలయవేమారెడ్డివంటి మహాయోధులు శత్రుసేనలతో తలపడినారు. సంకులసంగరం జరిగినది. చివరికి ద్రోహంజరిగినది.

సప్తపాతాళవిష్టపమహాప్రస్థాన
ఘంటాపథంబైన ఘనసుపరిఖ
తారాకామండలస్తబకావతంసమై
కనుచూపుగొనని ప్రాకారరేఖ
పుంజీభవించి భువనగోళముభంగి
సంకులాంగణమైన వంకదార
మెరుగురెక్కలతోడి మేరుశైలముబోలు
పెనుపైడితలుపుల పెద్దగవిని

తో ప్రకాశించిన ఒరుగల్లుకోట 1323లో ఢిల్లీసేనల హస్తగతమైనది. కాకతీయాంధ్ర సామ్రాజ్యలక్ష్మి అంతర్ధానమైనది. మాధవవిద్యారణ్యస్వామి ఆశీర్వచనబలంతో, తుంగభద్రానదీతీరాన విశాలవిజయనగరాంధ్ర కర్ణాటసామ్రాజ్యం అవతరించవలసి వున్నది.

ఈ లోపుగా ఢిల్లీసుల్తానులు కృష్ణానదికి ఉత్తరానవున్నదక్షిణాపథం ఆక్ర మించుకున్నారు. నేటితెలంగాణం ఢిల్లీసామ్రాజ్యభాగమైనది. ఈప్రాంతంలో సంస్థా నాధీశ్వరులైన రెడ్డిరాజులు యుగసంధిలో సంగతిగ్రహించినారు. దురుసుతనంతో పనిజరగదనుకున్నారు. సామోపాయంతో ఢిల్లీశ్వరుల ఆధిపత్యం అంగీకరించి, తమకువారసత్వమైన సామంతపరిపాలనాధికారాలు సంరక్షించుకుని, స్వదేశస్వభా షలకి ఇతోధికంగా సహాయంచేస్తూ వుండిపోయినారు. దక్షిణాపథ రాజ్యాధికారానికి క్రమంగావచ్చిన, విజయనగర రాయళ్ళతో, గోలుకొండనవాబులతో, హైద్రాబాదు నిజాములతో, ఏయెండకాగొడుగుపట్టి, నిలదొక్కుకున్నారు. భావనాశక్తిలేక, ప్రత్యక్షప్రపంచపరిస్థితుల జ్ఞానంలేక, దురాలోచనలుచెప్పిన దుష్టమంత్రులమాయ మాటలునమ్మి, తాత్కాలికంగా ఎదురుతిరిగిన ఉస్మానల్లీ, 1948 సెప్టెంబరులో స్వతంత్రభారతప్రభుత్వానికి లొంగిపోయిన నాటివరకూ అల్లాగేవుండి, వారసత్వపు భూఖామందులవిధానం తిరోగమించినమార్గంలోనే పురోగమించినారు.

ఢిల్లీశక్తులు ఆక్రమించుకోని, ఆక్రమించుకోలేని కాకతీయసామ్రాజ్యం చాలా మిగిలిపోయినది. అందులో, కృష్ణాదక్షిణతీరానవున్న అద్దంకి, కొండవీడు, విను కొండరాజ్యాలుకూడావున్నవి. అంతవరకూ ఆప్రాంతాలు సురక్షితంగా, తనబాహు బలంతో సామ్రాజ్యంతరఫున కాపాడుతున్నవాడు ప్రోలయవేమారెడ్డి. శ్రీశైలవాసు డైన శైవస్వామి, మోడెరాయగంగ ఆశీర్వచనం పొంది, కొండవీడు, వినుకొండ రాజ్యాలు ఆక్రమించుకుని, రెంటికీమధ్యగావున్న తనతండ్రిరాజధాని, అద్దంకి ముఖ్యపట్టణంగా, స్వతంత్రరాజ్యం స్థాపించినాడు. రెడ్డిరాజులవంశానికి ప్రోలయ వేమారెడ్డి మూలపురుషుడు (1325–55).

అతని చిన్నతమ్ముడు మల్లారెడ్డి ప్రోలయకి సేనాని మంత్రికూడాను. మల్లారెడ్డి సహాయంతో, ప్రోలయ గుంటూరుసీమగెల్చి, శ్రీశైల, అహోబిల, త్రిపురాంతకాల వరకూ తనబలదర్పాలు వ్యాపింపజేసి, మన్నెరాజులతో పోరాడిగెల్చి, తూర్పుకను మలు ఆక్రమించి, గోదావరీదక్షిణతీరాన గోవుపాదక్షేత్రంలో కత్తులుకడిగి, అఖండ గౌతమీస్నానంచేసినాడు. తూర్పుసముద్రతీరాన మోటుపల్లిరేవు స్వాధీనంచేసు కున్నాడు. నౌకావ్యాపారం, ఎగుమతిదిగుమతులూ వృద్ధిచేసినాడు. రేవులో పరదేశ వ్యాపరస్థులకీ, నౌకలకీ పరిరక్షణ కల్పించినాడు. ఆంధ్రనౌకలు చీనా, కాంబో

డియా, సువర్ణద్వీపాదిప్రాచ్యదేశాలకి సరుకులు ఎగుమతిచేసి, ఆయాదేశాలనించి దిగుమతులు తెస్తూ వుండేవి. ప్రోలయకాలపువాడే శంభుదాసుఅనే ఎఱ్ఱాప్రగడ, మల్లారెడ్డికి కావలసినవాడు. తత్కారణంగా రాజుకి హితుడైనాడు; ఆశ్రయంసంపాదించినాడు. హరివంశాదిరచనలు చేసినాడు. ఏనాడో పదకొండోశతాబ్దంలో, గోదావరీ తీరాన, రాజరాజుప్రోద్బలంతో నన్నయభట్టారకుడు ప్రారంభించగా, పెన్నా తీరపు మనుమసిద్ధిఆస్థానంలో తిక్కనామాత్యుడు చాలావరకు నెరవేర్చగా, మిగిలిపోయిన మహాభారతాంధ్రీకరణకార్యక్రమం పూర్తిచేసి పుణ్యమార్జించినాడు.

రెడ్డిరాజులు కాకతీయులవలెనే శైవమతస్థులు. వారికివలెనే సర్వమతసామ్య సిద్ధాంతప్రవక్తలు. ప్రోలయవేమారెడ్డికి హరిహరాభేదం. శైవమైన శ్రీశైల క్షేత్రంలో పాతాళగంగకిసోపానాలు నిర్మించినాడు. అదేశ్రద్ధాభక్తులతో వైష్ణవమైన అహోబిలక్షేత్రంలో భవనాసినదికీ, కొండమీది లక్ష్మీనృసింహస్వామి ఆలయానికీ మెట్లుకట్టించినాడు. ప్రోలయవేముడు 'మధ్యాంధ్రదేశసముద్ధారకుడు; రెడ్డిరాజ్య ప్రతిష్ఠాపకుడు, విద్యావినోది, హరిహరభక్తితత్పరుడు.' రాజ్యానికిరాగానే బాల సరస్వతి అనే పండితుణ్ణి విద్యాధికారిగా నియమించినాడు.

ప్రోలయవేముడికి ఇద్దరుదత్తపుత్రులు, అనపోతారెడ్డి, అనవేమారెడ్డి. ఇద్దరూ తండ్రినాడే రాజనీతినేర్చి, కార్యఖడ్గ ధురీణులైనారు. తండ్రితర్వాత అనపోతారెడ్డి అయిదారుసంవత్సరాలు రాజ్యపాలన చేసినాడు. రాజధాని, అద్దంకి, గుండ్లకమ్మగట్టుని నిర్మించిన స్థలదుర్గం. శత్రురాజులదాడులు తట్టుకోడం కష్టం. అందుచేత ముఖ్యనగరం ఉన్నతమైనగిరిదుర్గం కొండవీటికి మార్చినాడు. కొండవీడు అప్పటికే చాళుక్యులకాలంలోనూ, కాకతీయులకాలంలోనూ రాజప్రతినిధిముఖ్య పట్టణంగా పేరుగన్నది. కళింగ గణపతులకాలంలో విశ్వంభరుడుఅనేరాజు ఇక్కడ మొదట కోటగట్టినాడు. శత్రుదుర్భేద్యంగా, క్షేమంగావుండేప్రదేశం. రాజ్యం చేసిన స్వల్పకాలంలోనే అనపోతారెడ్డి విశేషంగా బ్రాహ్మణులికి దానాలు చేసినాడు. చేజిక్కిన ఒకనగరాన్ని చేజార్చి, శత్రువుని క్షమించి, అపూర్వరాజధర్మం పాటించినాడు.

అనపోతారెడ్డితర్వాత, అతనితమ్ముడు అనవేమారెడ్డి (1364–86) రాజ్య భారం వహించినాడు. అప్పటికి అనపోతారెడ్డికుమారుడు, కుమారగిరిచంటివాడు. రాజ్యం సుస్థిరం చెయ్యడమేకాక, విస్తరింపజెయ్యడానికికూడా ఇతనికి వ్యవధి కలిగినది. కొండవీటికోట బలపరిచినాడు. కృష్ణకద్దరిని కొండపల్లికోట నిర్మాణం చేసినాడు. అతడు, "సింహాచలాది వింధ్యపాద ప్రతిష్ఠాపిత కీర్తిస్తంభుడు, సాగర గౌతమీసలిలసంగమ సకలజలదుర్గ సాధన రఘురాముడు, రాజమహేంద్రవర

నిరవద్యనగరాది బహువిధ స్థల దుర్గ విగళన బలరాముడు." అనవేమారెడ్డి, తండ్రి తాతలవలెనే దానశీలుడు; మీదుమిక్కిలి పరిపాలనాసమర్థుడు. ఆర్షరాజనీతి అనుసరించినాడు. రాజ్యానికి గ్రామమే పునాది అని తెలిసినవాడు. అతడి పరిపాలనలో గ్రామం సర్వస్వతంత్రంగానూ, స్వయంపోషకంగానూ వుండేది. గ్రామ పంచాయతీ విధానం అమలులో వుండెను. దేశరక్షణాకార్యక్రమం, విదేశవ్యవహారం మాత్రం తానే స్వయంగా, మామిడిపెద్దనవంటి మహామంత్రులసలహాతో పరిశీలించేవాడు. తక్కిన పరిపాలనావిధానం వికేంద్రీకరణ సూత్రంమీద నడిచేది. ప్రజలకి, అర్హతలు పరిశీలించి, బతుకుతెరువుచూపడంలో ఇతనిప్రభుత్వం శ్రద్ధవహించినది. పరిపాలనాసౌలభ్యంకోసం రాజ్యాన్ని నాడులుగానూ, విషయాలుగానూ విభజించి చక్కజేసినాడు. అనవేముడు ఎంతటి ప్రతిభాశాలి, ఎంతటివీరశిరోమణి, ఎంతటి పరిపాలనాదక్షుడో అంత వినోదాభిలాషి. రాజ్యంలో వసంతోత్సవక్రీడలు ప్రారంభించినది అనవేముడే.

అనవేముడితర్వాత, అనపోతారెడ్డికుమారుడు, కుమారగిరిరెడ్డి (1386–1403) కొండవీటిసింహాసనం అధిష్ఠించినాడు. కుమారగిరికి మంత్రీ, సేనానీ కాటయవేమారెడ్డి. రాజుకి కాటయవేముడు, చెల్లెలిమగడు. రాజూమంత్రీ సంస్కృతాంధ్రభాషాపాండిత్యంలో అసమానులు, పరస్పరసమానులు. కుమారగిరిరాజు రూపురేఖావిలాసాలలో అసమానుడు; 'సుకుమార రత్నాకరుడు.' అతడు, 'త్రిలింగాధీశ్వర, రత్నసింహాసనాధ్యక్ష, జగదగోపాలరాయ, వేశ్యాభుజంగ, పల్లవాదిత్య, జంబూద్వీపేశ్వర' బిరుదాంచితుడు.

కాటయవేముడిదండబలంతో రాజ్యం సువిశాలం, సురక్షితం, సుభిక్షంగా విలసిల్లినది. శత్రువినాశనంతో, ఇద్దరికీ జీవితమాధుర్యం అనుభవించగలిగిన వ్యవధి లభించినది. గ్రంథరచనావ్యాసంగానికి సమయం చిక్కినది. కాటయవేముడు కాళిదాసకృత నాటకత్రయానికి అమోఘమైన వ్యాఖ్యానాలు రచించినాడు. ఆగ్రంథంపేరు, రాజుపరంగా, 'కుమారగిరిరాజీయం' అనిపెట్టినాడు. కుమారగిరి, వసంతరాజీయం అనేపేరుతో నాట్యశాస్త్రగ్రంథం రచించినాడు.

నాట్యం ప్రత్యక్షంగా అధ్యయనం చెయ్యవలసినకళారూపమైన శాస్త్రం. వివిధ భంగిమముద్రాపరిచయభాగ్యంలేనిదే ఆశాస్త్రంలోపాండిత్యసాధన దుర్లభం. తత్కళారాధకుడైన కుమారగిరికి సంప్రదాయసిద్ధమైన నృత్యప్రదర్శనంచెయ్యగలిగిన కళోపాసకురాండ్రు కావలసివచ్చినారు. ప్రభువులుతల్చుకుంటే కొదవా? రాజ్యంనలుమూలలనించీ నాట్యకత్తెలు ప్రత్యక్షమైనారు. రాజుకొలువుకూటంలో ప్రదర్శనలు జరిపినారు. రాజాశ్రయం పొందినారు. వారిలో లకుమాదేవి లోక

ప్రసిద్ధిగన్నది. లకుమ, కాపరట్టడికీ, బాపట్లభావనారాయణస్వామి ఆలయనట్టువ రాలైన వల్లియమ్మకూ పుట్టినది. ఈవిణ్ణి, దోరపరెడ్డి సేనాని కుమారగిరికి కానుకగా సమర్పించినాడు. ఆమెతో రాజు 'గృహరాజసౌధం'లో వినోదించినాడు. ఆమె కుమారగిరికి సంప్రాప్తమనోహరి. ఆయన ఇంద్రుడు. ఆమె రంభ. ఆయన భావంలో :

"ఆటవెలదులయింటిపడుచే
నాటికైనను కాదు లకుమ
శక్తియై దివినుండి భువిపై
జారివచ్చిన అచ్చరసుమ!"

శాకుంతల వ్యాఖ్యానపీఠికలో కాటయవేమారెడ్డిచెప్పినట్టు ఆమె :

జయతిమహిమాలోకాతీతః
కుమారగిరిప్రభో,
స్వదసి లకుమాదేవీయస్య
ప్రియా సదృశీప్రియా,
నవమభినయం నాట్యార్థానాం
తనోతిసహాస్ర సధా
వితరతి బహూనర్థానర్థి
ప్రజాయసహస్రశః

కుమారగిరి సభామందిరంలో లక్ష్మీసమానురాలైన లాస్యకత్తెవున్నది. ఆమెపేరు లకుమాదేవి. ఆమె ప్రియురాలు. నాట్యార్థాలకు వివిధ నూతన అభినయాలు ప్రస్తరించి ప్రదర్శిస్తూవుంటుంది. ఆమె ధనవంతురాలు. అడిగినవారికి లేదనక దాన ధర్మాలు చేస్తుంది. ఈ ఆస్థానలాసిక ఉనికిచేత కుమారగిరిప్రభువు మహిమ లోకాతీతమైనదని, అతిశయించినాడు కాటయ వేమ కవీంద్రుడు.

కుమారగిరికాలంలో అన్ని ఋతువులూవసంతమే సంతరించుకున్నవి.అప్పుడు:

"యువతులెల్లరు రతీరాములు
యువకులో మన్మధస్వాములు
నాడు నిజముగ పండుముసలులు
గూడ నవ యువతాభిరాములు."

కుమారగిరి వసంతమందిరం నిర్మించినాడు. ఎన్నోజలక్రీడాగారాలు కట్టించినాడు. అంతఃపురస్త్రీలతో జలక్రీడావినోదాలు చేసేవాడు. వసంతోత్సవాలు మహా

వైభవంగా జరిగేవి. నిత్యనృత్యగీతవాద్యాలు పర్వతదుర్గప్రాసాదాలలో ప్రతిధ్వనించేవి. మల్లెపూలు మంచిగంధం, కర్పూరం కస్తూరి, పన్నీరు పసుపుకుంకం ఒకరి మీద ఒకరు వెదజల్లుకున్న. ప్రభువూ పాలితులూ, పుష్పహారాలుధరించి, బుక్కావసంతాలు విరజిమ్ముకునేవారు. కళ్ళారాచూసి ఆనందించిన కాటయవేముడే, అన పర్తిశాసనంలో వర్ణించినాడు :

వసంతవేలాసుదిశా వధూనాం
కర్పూర ఖండైః కృతిమండనశ్రీః,
కుమారగిర్యాఖ్య వసంతరాయః
కీర్తిప్రతాపాభరణోవిభాతి.

కుమారగిరికి ప్రజానీకం ఆదరాభిమానాలతో పెట్టుకున్నముద్దుపేరు వసంతరాయలు. ఆయన నిజానికి వీరభోగవసంతరాయడు. కాటయవేముడుచెప్పినదేమంటే, ఆ వసంతరాయడు, నవ వసంతకాలంలో, స్త్రీజనముఖబింబాలు కర్పూరఖండాలతో అలంకరించినాడు. వసంతాగమనంతో దిక్కాంతలముఖాలు వికసించినట్టు వుండేదని భావం. ఆయనకి కీర్తి, ప్రతాపమూ ఆభరణాలు.

ఈ ఉత్సవాలు దర్శించడానికీ, ఆనుఖంలో పాలుపంచుకోడానికీ దేశదేశాల నించీ ఆపిల్లబాలాదీ, వేలకువేలుగా కొండవీడు వచ్చేవారు. ఈ కర్పూరాది సుగంధ ద్రవ్యాలు ప్రభువులికీ, అంతఃపురస్త్రీలకీ, పరస్పరసేవానిరతికోసం సమర్పించిన వాడు, వసంతరాయుడిప్రాణమిత్రుడు అవచి తిప్పయ్యచెట్టి. ఇతడు కాంచీపురవాస్తవ్యుడు. మోటుపల్లిరేవులో ఎగుమతిదిగుమతివ్యాపారం చాలావరకు ఇతని స్వాధీనంలోవుండేది. ఇతడు కవితావినోది. శ్రీనాథుణ్ణి సత్కరించి సత్కావ్యం అంకితం పొందిన సాహిత్యపోషకుడు.

ఆనాటి కొండవీటి కళాసాహిత్య శృంగారప్రియజీవితం అనర్గళంగా, అనన్యసామాన్యంగా వర్ణించినాడు కవిసార్వభౌముడైన శ్రీనాధుడు. కుమారగిరి–లకుమా ప్రణయగాథ, ఈనాడు అపూర్వంగా పాడినాడు 'కర్పూరవసంతరాయలు' అనే కావ్యంలో మహాకవి నారాయణరెడ్డి.

కుమారగిరి తర్వాత రెడ్డిరాజ్యం రెండుభాగాలైనది. ఒకటి గోదావరీ దక్షిణ తీరంనించి పినాకినీనదివరకూ వ్యాపించిన కొండవీటిరాజ్యం. రెండు గోదావరి కుత్తరాన చిల్కానరస్సువరకూ వ్యాపించిన రాజమహేంద్రవరరాజ్యం. రాజమహేంద్రవరరాజ్యం కుమారగిరిప్రభువే, కాటయవేముడికి కృతజ్ఞతతో దత్తంచేసినట్టు శాసనాలు వున్నవి. కాటయవేముడు 1403 మొదలు 1415 వరకూ అనమాన ప్రతి

భతో ఉత్తరరెడ్డిరాజ్యం పరిపాలించినాడు. అతనితర్వాత అల్లాడవేమారెడ్డి, వీరభద్రారెడ్డిసోదరులపరిపాలనలోకివచ్చినది. రాజు, చిన్నవాడైన వీరభద్రారెడ్డి; మంత్రీ, సేనానీ, పెద్దవాడైన వేమారెడ్డి. అన్నగారి భుజభలంతో రెడ్డిరాజ్యం కటకంవరకూ వ్యాపించినది. ఇరవైసంవత్సరాలపాటు రాజమహేంద్రవరం, తిరిగీ రాజరాజునాటి వైభవంతో, కళాసాహిత్యపోషణకీ, ప్రోత్సాహానికీ క్షేత్రమైనది. శ్రీనాధ కవిరాజు ఇక్కడే వీరభద్రారెడ్డివల్ల కరకంకణ ప్రదానమందినాడు. వీరభద్రారెడ్డి ఎన్నోఅగ్రహారాలు దానంచేసి, బ్రాహ్మణుల్ని సత్కరించినాడు. ఆకాలంలో విప్రులు విపుల సంపదలతో తులతూగినారు. భీమఖండంలో శ్రీనాధుడు వర్ణించినట్టు :

ధరియింపనేర్చిరి దర్భవెట్టెడి వ్రేళ్ళ
లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింపనేర్చిరి గంగమట్టియమీద
గస్తూరికా పుండ్రకముల నొసల,
సవరింపనేర్చిరి జన్నిదెంబులవ్రోల
తారహారములు, ముత్యాలసరులు
చెరువంగనేర్చిరి శిఖలనెన్నడుముల
గమ్మని క్రొత్తచెంగల్వ విరులు

ధామముల వెండియును బైడి తడబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారముల యందు
వేమభూపాలు డనుజన్ము వీరభద్రు
ధాత్రియేలింప గౌతమీ తటమునందు.

దక్షిణరెడ్డిరాజ్యమైనకొండవీటిలో, వారసుడుకాకపోయినా, పెదకోమటి వేమారెడ్డి (1403–1420) కుమారగిరిసింహాసనం స్వాధీనం చేసుకున్నాడు. పెదకోమటి తనపూర్వులవలెనే పరాక్రమవంతుడూ, సంస్కృతాంధ్రభాషాపండితుడు, పోషకుడు, స్వయంగా రచయిత. అతనిగ్రంథాలు: శృంగారదీపిక, సప్తశతీసారటీక, సాహిత్యచింతామణి, సంగీతచింతామణి. వామనభట్టబాణుడు అనే మహాసంస్కృతపండితుడు ఇతని ఆస్థానకవి. మామిడిసింగన మంత్రి. శ్రీనాధకవిరాజు విద్యాధికారి. సింగనకి శ్రీనాధుడు 'శృంగారనైషధం' అంకితం ఇచ్చినాడు. కొండవీటివారు సంస్కృతభాషాభిమానులు. "నైషధం విద్వదౌషధం" నారికేళపాకంతో వారికి రుచించినది.

కొండవీటివారికీ రాజ మహేంద్రంవారికీ సయ్యోధ్యలేదు. ఒకర్నొకరు పరిమార్చాలనే ప్రయత్నంలో వుండేవారు. జాతిసామంతాది విరోధాలేకదా మన దేశాన్ని పరాయివారికర్పించినది! దక్షిణాన విజయనగరపురాయల్లు, పశ్చిమాన

రాచకొండవెలమ నాయళ్లు. తూర్పున జ్ఞాతులైన రాజమంద్రీరెడ్లతో సతమతమై కొండవీటిరాజ్యం, దాంతోపాటు రాజమహేంద్రవరం రాళ్ళపాలైనవి. రాజ్యలక్ష్మి రెడ్లని విడిచిపెట్టినది.

ఒకనాడు సామంతులైనరెడ్లు, తమభుజబలంతో, స్వతంత్రరాజ్యాధిపతులైనారు. ఉత్తరాన చిల్కానరస్సుమొదలు దక్షిణాన పినాకినీనదివరకూ, తూర్పున బంగాళాఖాతంమొదలు పడమర కృష్ణా తుంగభద్రా అంతర్వేదివరకూ తమరాజ్యం విస్తరింపజేసి, గిరిదుర్గ, జలదుర్గ, వనదుర్గ, స్థలదుర్గబలంతో నూరుసంవత్సరాలు పైగా పరిపాలించి, ఎన్నోదానధర్మాలుచేసి, నృత్యసంగీతసాహిత్యకళాపోషకులై చరిత్రలో శాశ్వతస్థానం అలంకరించినారు. తెలుగునాట అశ్వపతులున్నారు, గజపతులున్నారు, నరపతులున్నారు, భూపతులున్నారు. చూడగా రెడ్డిరాజులు గిరిపతులుగా వన్నెకెక్కినారు. పంచగిరి ప్రభువులు. దక్షిణరాజ్యంలో కొండవీడు, బెల్లంకొండ, నాగార్జునకొండ, వినుకొండ. కొండపల్లి పంచగిరులనదగినవి. ఆ పేర్లతోనే ఇంకా నిలిచివున్నవి. ఉత్తరరాజ్యంలో, రాజమహేంద్రవరంచుట్టూ నాలుగుగిరిదుర్గాలు వుండేవి. అన్నిటినీకలిపి పంచగిరులని వ్యవహరించేవారు. హేమగిరి, నేటివేమగిరి; ధవళగిరి, నేటిధవిళేశ్వరం; పద్మగిరిలేకపుష్పగిరి, (గోదావరి రైలుస్టేషనువున్న మెట్టమీదవుండేది.) భద్రగిరి, రాజమంద్రీకి ఉత్తరాన 12 మైళ్ళలోవున్న వీరభద్రుడికొండ; రామగిరి, పట్టిసానికి ఈశాన్యంగా ఆరుమైళ్ళు.



# రెడ్డి ప్రముఖులు

గిరిపతుల వైభవ విలాసాల స్మృతులలో, ఆ వసంతోత్సవాల సువాసనా శేషంలో, తుదినాటి నిర్వీర్య నిర్వేదంలో, ఆకొండవీటనే ఆవిర్భవించినవాడు వేమా రెడ్డి అనే వేమన. తొలుత కామి, తరువాత మోక్షగామి. మాటలుదాచక, నిర్మోహ మాటంగా, సమకాలిక సంఘదురాచారాలూ, ధూర్తవ్యవహారాలూ ఖండిస్తూ, దిగంబరుడై, పరివ్రాజకుడై పరమపదించినాడు. అందరికీ అర్థంఅయేటట్లు, సహస్రాధికంగా ఆటవెలదులు ప్రసాదించిన అతనినోట, 'చేటచెరిగినట్లుమాటలొచ్చినవి.' వేమన ఆంధ్రప్రజానీకానికి అందుబాటైన ఆదికవి. వెమన రెడ్డి; కొండవీటిరెడ్డి.

గిరిదుర్గాలువిడిచిన రెడ్లు విజయనగరసామ్రాజ్యంలో సేనానులుగా, దండనాథులుగా ఉద్యోగాలుస్వీకరించి, స్వామిభక్తులై, దేశస్వాతంత్ర్య పరిరక్షణలో పేరు పొందినారు. ఆసామ్రాజ్యంతోపాటు, ఉద్యోగధర్మంలో దక్షిణదేశం నాలుగు మూలలికీ పాకిపోయినారు. చాలాచోట్ల గ్రామాధికారాలు సంపాదించి వున్నచోటనే వుండిపోయినారు. పదిహేనువందల అరవై అయిదో సంవత్సరంలో తళ్లికోట యుద్ధంలో విజయనగరం పడిపోయేవరకూ తమ కర్తవ్యం శ్రద్ధాభక్తులతో నిర్వహించినారు. బ్రిటిషు యుగంలో దక్షిణాపథంలో చాలాగ్రామాలకు మనసబులుగా నిలదొక్కుకున్నారు.

చింతచచ్చినా పులుపుచావదు. పాతపౌరుషంతోనే మనుగడసాగిస్తూవచ్చినారు. భారతదేశం ఈస్టిండియా కంపెనీకి స్వాధీనమై ఇక్కట్లలోచిక్కినినాడు, 1857లో సిపాయీలు తిరుగుబాటుచేసినారు. ఝాన్సీలక్ష్మీబాయి, తాంతియాతోపే, నానా సాహెబుల నాయకత్వంలో స్వాతంత్ర్యయుద్ధం ప్రకటించినారు. ఉత్తరహిందూ

స్థానం దద్దరిల్లినది. ఆవిప్లవసమయంలో, గోదావరీతీరాన, పాపికొండలసమీపాన, కొరటూరుగ్రామమునసబు, కారుకొండసుబ్బారెడ్డి విప్లవకారులతో ఉత్తరప్రత్యుత్తరాలు జరిపినాడు. కొండకోయరాజుల సహాయంతో తిరుగుబాటు లేవదీసినాడు. నాగవరందుర్గం పట్టుకుని పదిహేనురోజులు బ్రిటిషుబలాల్ని ధిక్కరించినాడు. అతనిమీద మామూలు దోపిడీ, ఖూనీ కేసులు బనాయించి. అధికబలంతో పట్టుకుని విచారించినారు. కేసువిచారించిన ఇంగ్లీషుజడ్జీముందు సుబ్బారెడ్డి తనతిరుగుబాటు రహస్యం బాహాటంగా ప్రకటించినాడు. ఉత్తరాన తిరుగుబాటుకి నాయకులలో ఒకడైన నానాసాహెబు గోదావరీప్రాంతానికి వస్తున్నాడని బాతిసీవచ్చినదనీ, ముందుగా తాను రంగం తయారుచేసినాననీ, ఉత్తరాదినించి మద్దతురాకపోవడం మూలాన్ని తనప్రయత్నం విఫలమైందనీ వాంగ్మూలం ఇచ్చినాడు. సుబ్బారెడ్డితోపాటు. ఏడుగురు ముద్దాయిల్ని విచారించి ఉరిశిక్ష విధించినారు. వారందరూ రెడ్లే.

తమిళనాడులో రెడ్లున్నారు, మైసూరురాజ్యంలో రెడ్లున్నారు. బ్రిటిషుపాలనాకాలంలోకూడా పేరుమోసినారు. అవిభక్తమద్రాసులో జస్టిసుపార్టీనాయకుడుగా రాజా పానుగంటి రామారాయణింగారు మంత్రిత్వంస్థాపించినప్పుడు తమిళనాడువాసి సుబ్బరాయలురెడ్డి మంత్రిగావున్నాడు. తిరునెల్వెల్లి జిల్లావాసి, ఎస్. కుమారస్వామిరెడ్డి కూడా కొంతకాలం జస్టిసుపార్టీప్రభుత్వంలోమంత్రి. ప్రకాశంపంతులుతర్వాత మద్రాసు ముఖ్యమంత్రిగా ఎన్నుకోబడినవాడు, దక్షిణఆర్కాడుజిల్లా, ఒమ్మాందూరుగ్రామమునసబు రామస్వామిరెడ్డి. స్వరాజ్యంవచ్చినతర్వాత పుదుచ్చేరిరాష్ట్రంలో ముఖ్యమంత్రిగావున్నాడు, వి. వెంకటసుబ్బారెడ్డి.

మైసూరులో, కోలారుజిల్లావాసి, కే. సి. రెడ్డి ముఖ్యమంత్రిగాపనిజేసి, కేంద్రమంత్రిగావుండి. మధ్యప్రదేశగవర్నరైనాడు. మద్రాసులో కాంగ్రెసుమంత్రిగావున్న హలహర్వి సీతారామరెడ్డి బళ్లారితోపాటు మైసూరులో కలిసినాడు. భాషారాష్ట్ర విభజనజరిగి సరిహద్దులు మారినప్పుడు ఎందరోరెడ్లు రాష్ట్రేతరాంధ్రులైనారు. వారిలో మేధావీ, సంస్కారీ, సుప్రసిద్ధచలనచిత్రదర్శకుడూ అయిన బి. ఎన్. రెడ్డి ఒకడు. అతనితమ్ముడు, విఖ్యాత ఫిలింనిర్మాత, విజయ — వాహినీ అధిపతీ నాగిరెడ్డికూడా అంతే. దర్శకుడు కే. వి. రెడ్డికూడా మద్రాసులోనే వుండిపోయినాడు. వీరందరికీగురువు, 'సినిమాపులి' హెచ్. ఎం. రెడ్డి ఇప్పుడు లేడు.

ఆంధ్రప్రాంతంలో రెడ్లు వివిధశాఖలలో దేశసేవచేసినారు, చేస్తున్నారు. చిత్తూరుజిల్లా మహానాయకులకి పుట్టినిల్లు. ఆ జిల్లావాసి, కీర్తిశేషుడు కట్టమంచిరామలింగారెడ్డి, పండితుడు, కవి, గ్రంథకర్త, విద్యావేత్త, రాజకీయవేత్త; హరివిల్లు వంటివ్యక్తి, ఆంధ్రవిశ్వకళాపరిషత్తునిర్మాత. ఆంధ్రప్రదేశరెవెన్యూమంత్రి, పెద్ది

రెడ్డితిమ్మారెడ్డి, బహువచనరెడ్డి; పేరులోరెండురెడ్లు, నిజానికి ఇద్దరిరెడ్లపెట్టు. నిజంచెప్పి నిష్ఠూరంతెచ్చుకుంటాడు. నెల్లూరు అంటే రెడ్లనిపిస్తుంది. గాంధీజీ తొలిసారి తెలుగుదేశం, అనగా నెల్లూరు, వచ్చినప్పుడు ఆతిథ్యంఇచ్చినవాడు రేబాలలక్ష్మీనరసారెడ్డి. అది అవిభక్తమద్రాసురాష్ట్రకాంగ్రెసు నెల్లూరులో, జరిగిన కాలం. రెండవసారి ఆతిథ్యమిచ్చినది తిక్కవరపురామిరెడ్డి. రామిరెడ్డిధర్మదాత. సాహిత్య పోషకుడు. పొణకా కనకమ్మ దేశసేవచేసి, స్త్రీవిద్యాలయం నెలకొల్పినది. బెజవాడ రామచంద్రారెడ్డి, జస్టిసుపార్టీనాయకుడు, మద్రాసుశాసనసభాధ్యక్షుడు, పార్లమెంటు మెంబరు. బెజవాడగోపాలరెడ్డి నాగరికుడు, సరసుడు, సహృదయుడు, 'సాహితీ బంధువు', 29వ యేట మద్రాసులో రాజాజీ మంత్రివర్గంలో సభ్యుడై, ఆంధ్రరాష్ట్రం అవతరించినతర్వాత, ప్రకాశం గద్దెదిగినప్పుడు కర్నూలులో తాను గద్దెయెక్కి, ఆంధ్రప్రదేశావతరణానంతరం ఆర్థికమంత్రిగావుండి, కేంద్రకేబినెట్టులో మంత్రిఅయి ఉత్తరప్రదేశగవర్నరుగావున్నాడు. ఏ. సి. సుబ్బారెడ్డి నెల్లూరునగర రాజకీయాలలోంచి రాష్ట్రరాజకీయాలలోకి ఆలస్యంగావచ్చినాడు. త్వరగావెళ్ళిపోయినాడు.

కడపకోటిరెడ్డి, భార్య రామసుబ్బమ్మ, దేశసేవలో ఆరితేరినవారు. కోటిరెడ్డి ఆంధ్రమహాసభాధ్యక్షుడు; మద్రాసులోకాంగ్రెసుమంత్రి. భార్యాభర్తలిద్దరూ జిల్లా బోర్డుపాలించినారు. ఆంధ్రోద్యమానికి దంపతులిద్దరూ ఆజిల్లాలో పట్టుగొమ్మలు.

అనంతపురం జిల్లావాసి, సర్దార్‌నీలంసంజీవరెడ్డి. చిన్నతనంనించీ ఆంధ్ర కాంగ్రెసుకి అపారసేవచేసి, మద్రాసులో పూసపాటి కుమారస్వామిరాజుదగ్గిర మంత్రిగావుండి, ఆంధ్రకాంగ్రెసు అధ్యక్షతవహించడానికి మంత్రిత్వం విడిచిపెట్టి, కర్నూలులో అందర్నీకూడగట్టుకుని, పారిపోయిన ప్రకాశాన్ని బతిమాలిపట్టుకొచ్చి. సింహాసనం ఎక్కించి, తాను డిప్యూటిమంత్రిగా వినయభక్తిశ్రద్ధలతో వ్యవహరించి, గోపాలరెడ్డి అభిలాషకి అవకాశంకల్పించడానికి తానుతప్పుకుని, ఆయనకిందకూడా డిప్యూటీగా పనిచేసి, ఆంధ్రప్రదేశం అవతరించినతర్వాత యావదాంధ్ర ప్రజానాయకుడై, ముఖ్యమంత్రిగా ప్రతిభతో పరిపాలించి, నూతనరాష్ట్రానికి రూపురేఖలు దిద్ది. జాతీయకాంగ్రెసుఅధ్యక్షపీఠం అలంకరించడానికి ముఖ్యమంత్రిపదవికి రాజీనామా యిచ్చి, అధ్యక్షుడుగా దక్షుడనిపించుకొని, కేంద్రమంత్రిగా ప్రతిభప్రకటించి, లోకసభకి అధ్యక్షుడై మంచిపేరు సంపాదించుకున్నాడు. సంజీవరెడ్డిబావమరది తరిమెలనాగిరెడ్డి కమ్యునిస్టునాయకులలో అగ్రగణ్యుడు. పుచ్చలపల్లి సుందరయ్య కమ్యూనిస్టుపార్టీ సంస్థాపకులలో ముఖ్యాతిముఖ్యుడు. నాటి కృష్ణాజిల్లావారే కొవ్వూరి బసివిరెడ్డి, కుమారుడు చంద్రారెడ్డి. ఉప్పుఏలూరులో ఉప్పుకావిళ్ళుమోసి బియ్యపుమరపెట్టి మహాధనవంతుడైనాడు బసివిరెడ్డి. నిడదవోలులో ఆంధ్ర

రాజకీయమహాసభ ఆహ్వానించి, 1912లోనే ఆంధ్రోద్యమ బీజాలునాటడానికి పొలం పదునుచేసినవాడు చంద్రారెడ్డి. ఆంధ్రప్రచారిణిగ్రంథమాల పోషకుడు. శ్రీబాగ్ వొడంబడిక సంతకంచేసిన టి. యన్. రామకృష్ణారెడ్డి రాయలసీమవాసి. కర్నూలు వాడు బి. వి. సుబ్బారెడ్డి, ఆంధ్రశాసన సభాధ్యక్షుడు. పిడతల రంగారెడ్డి శాసన మండలి అధ్యక్షుడు. కాంగ్రెసుసేవజేసినవాడు. మాజీమంత్రి. భావిలోపైకిరావలసిన వాడు. కే. వి. రఘునాథరెడ్డికేంద్రమంత్రి. కే. విజయభాస్కరరెడ్డి, రాష్ట్రఆర్థిక మంత్రి. సమర్థుడు, ఉత్సాహవంతుడు.

తెలంగాణాలో రెడ్లు ఆదినించీ పేరుప్రఖ్యాతులు గణించినవారు. గద్వాల మహారాణిఆదిలక్ష్మిదేవమ్మ, కళాసారస్వతపోషకురాలు. అన్నపూర్ణమ్మ. వనపర్తి రెడ్డిరాజులు సంస్కృతాంధ్రభాషాభిమానులు, రాజారామేశ్వరరావు, స్వతంత్రభారత రాయబారవర్గంలోపనిచేసినాడు. పింగళి వెంకటరామరెడ్డి మొదటి తెలుగు జడ్జి. దేశ ముఖు. కొత్వాలు వెంకటరామరెడ్డి, ఉన్నతాధికారి, రెడ్డిఉద్యమ సంస్థాపకుడు. తాను విద్యావంతుడుకాడు; కాని విద్యని పోషించినాడు. స్త్రీల కళాశాల ఆయనసేవకి స్మృతిచిహ్నం. ఆంధ్రప్రదేశముఖ్యనగరంలో నెలకొల్పినశిలావిగ్రహాలలో ఆయనదే మొదటిది. కొండా వెంకటరంగారెడ్డి తెలంగాణాంధ్రోద్యమ నాయకుడు. హైద్రాబాదు ప్రభుత్వంలో రామకృష్ణరావుతో, ఆంధ్రప్రదేశప్రభుత్వంలో సంజీవరెడ్డితోమంత్రి. నిజాయితీ అయినమనిషి. యువజననాయకుడైన మర్రిచెన్నారెడ్డి, హైద్రాబాదు ప్రభుత్వంలోనూ, ఆంధ్రప్రదేశంలోనూ మంత్రిగావుండి కేంద్రమంత్రిగావెళ్ళి ప్రత్యేక తెలంగాణా విప్లవనాయకుడైనాడు. ప్రతిభాశాలి రావి నారాయణరెడ్డి కాంగ్రెసుసేవ చేసి, కమ్యూనిస్టునాయకుడై అఖిల భారత ఖ్యాతి కాంచినాడు. అతని బంధువూ, పోచంపల్లిమునసబూ అయిన, వెదిరె రామచంద్రారెడ్డి భూదాన యజ్ఞానికి ఆది సోమ యాజిగా ప్రపంచఖ్యాతి ఆర్జించిననాడు. మార్గదర్శిఅయిన ఆచార్య వినోబాకి మార్గం చూపినాడు. నూకల రామచంద్రారెడ్డి, నరోత్తమరెడ్డి సోదరులు అభ్యుదయ మార్గస్థులు. రామచంద్రారెడ్డి మంత్రిగావున్నాడు. నరోత్తమరెడ్డి గోల్కొండ పత్రిక సంపాదకుడై పార్లమెంటు సభ్యుడై, ఆడంబరంలేకుండా దేశసేవ చేసే సంస్కారులలో ఒకడు. కొన్నాళ్ళు ఆంధ్రప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుడుగావున్నాడు. శీలం సిద్దారెడ్డి రాష్ట్రమంత్రి. ఇంకాపైకిరావలసినవాడు.

రెడ్లకి రెడ్డికమేకాదు, ఆదినించీ సాహిత్య, కళాసేవలు సంప్రదాయంగా వస్తు న్నవి. ఈ సంప్రదాయంలో అన్నీ రంగరించి ఇచ్చినవాడు సురవరం ప్రతాపరెడ్డి, గోలకొండపత్రిక సంపాదకుడై శంఖం వూదినాడు.

సాధారణంగా, రాయలసీమలోగాని, నెల్లూరులోగాని మధ్యాహ్నంవేళల్లో ఏభాగవతమో, ఏరామాయణమో పారాయణచెయ్యడం వినబడుతూవుంటుంది రెడ్ల

ఇళ్లలో. స్త్రీ పురుషులందరూ భాషాభిమానులు. దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి పండితుడు, రచయిత, దానశీలుడు. మరుపూరి కోదండరామరెడ్డి ఉత్సాహవంతుడైన భాషావేత్త, విమర్శకుడు, ఆంధ్రసాహిత్యఅకాడెమీలో ఉల్లాసవంతుడైన సభ్యుడు. డాక్టరు జి. సుందరరెడ్డి, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు హిందీపీఠాధ్యక్షుడు. పాండిత్యమేకాక రెడ్లు కవులుకూడాను. అది వారి వారసత్వం. దువ్వూరి రామిరెడ్డి భారత జాతీయత పుంజీభవించిన ఆంధ్రకవిరాజు. తిక్కవరపు పట్టాభిరామరెడ్డి (పఠాభి) అధునాతనాంధ్రకవి. మహాకవి నారాయణరెడ్డి పాటా, మాటా కూడా ప్రతిదినం సినిమాలోనూ, రేడియోలోనూ మారు మోగుతూవున్నవి. హైద్రాబాదు, పి. టి. రెడ్డి అంతర్జాతీయ కీర్తి సంపాదించిన కళోపాసి. కీర్తిశేషులు పర్వత రామచంద్రారెడ్డి, లచ్చారెడ్డి పేరు మోసిన నటకులు రామిరెడ్డి టెన్నిసుఆటగాడు.

రెడ్లలో ఉన్నతతోద్యోగులున్నారు; ఈనాడేకాదు, ముందునాటినించీకూడా. పి. చంద్రారెడ్డి. పి. జగన్మోహనరెడ్డి, ప్రధానన్యాయమూర్తులు. చంద్రారెడ్డి మద్రాసు గవర్నరుగా, అణ్ణామలై విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడుగా పనిచేసినాడు. జగన్మోహనరెడ్డి సుప్రీంకోర్టుజడ్జీ అయినాడు. డాక్టరు డి. యస్. రెడ్డి ఉస్మానియావిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడుగా సేవచేసినాడు. పరిపాలనాదక్షుడనిపేరు సంపాదించి, ఆంధ్రప్రదేశ్ ప్రధమ, ప్రధానకార్యదర్శిగా, కేంద్రంలో రక్షణశాఖకార్యదర్శిగావుండి, ఆంధ్రప్రదేశ వ్యవసాయ విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షుడుగా వున్నాడు ఓ. పుల్లారెడ్డి డాక్టరు డి. జగన్నాధరెడ్డి శ్రీవేంకటేశ్వరవిద్యాలయానికి ఉపాధ్యక్షుడైనాడు. పద్మశ్రీ డాక్టరు పి. శివారెడ్డిసుప్రసిద్ధ నేత్రవైద్యుడు. ఇంకాఎందరో.

రెడ్లు సాధారణంగా దృఢకాయులు, స్వాతంత్ర్యాభిలాషులు. వీరు నన్నయ చెప్పిన రాజులవంటివారుకారు. విప్రులవంటివారు. "నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము." అనాదినించీ వారసత్వంగా వచ్చిన కాస్తడాబు, కొంతదర్పం, కొంత రైతుదనం, ఇంకొంత రౌతుదనం. పాండిత్యం అంటే అభిలాష; పండితులంటే అభిమానం. రెడ్డి ప్రేమపాత్రుడు, ప్రేమికుడు. రెడ్డిగారు ప్రణయంలో ప్రాణంఇస్తారు అవసరంపట్ల తీస్తారు.

వడ్లు ఎన్నిరకాలో రెడ్లు అన్నిరకాలంటారు. రకాలు అన్నికులాల్లోనూ వున్నవేగద! వారికి అభిమాన కవీ, వారిని అభిమానించినకవీ శ్రీనాధుడువివరించినట్టు;

పంటాన్వయమునను బదునాల్గుశాఖలఁ
జక్కగావివరింతు సత్యమరసి
మోటాటి, వెల్నాటి, మొరస, నే రెడ, యొాధ్య
పంట, పొంగలినాటి, పాకనాటి,

భూమంచి, కురిచేటి, మున్నూటి, దేసటి,
యొనర గండియకోట, యోరుగంటి,
యనఁబరగుచుండు నంధ్రావనీ స్థలి
గౌరవాధిష్ఠిత కాపుకులము

పంట పదునాల్గుకులములంచంట జగతిఁ
దరతరంబులనుండియు వరలెడినుడి
వీని కుపజాతులున్నవి వివిధములుగ.

స్వతంత్ర రెడ్డిరాజవంశస్వామి ప్రోలయవేమారెడ్డిమొదలు స్వతంత్ర భారత మాజీ లోకసభావతి నీలం సంజీవరెడ్డివరకూ, రెడ్లు దేశాభిమానులై, భాషా కళాపోష కులై యావదాంధ్రావనీ ప్రజానీకపుప్రేమ విశ్వాసగౌరవపాత్రులైనారు. కొండవీటిలో ఇంత చేంతాడున్నది. అది రెడ్లకథ. ఆ కొండ విడిచి ఈనాడు గోల్కొండచేరినది.

పరరాజ్య పరదుర్గ పరవైభవ శ్రీల
గొనకొని విడనాడు కొండవీడు
పరిపంథి రాజన్య బలముల హరియింప
గురువైన యురిత్రాడు కొండవీడు
ముగురురాజులకును మోహంబు పుట్టించు
కొమరుమించిన జోడు కొండవీడు
చటుల విక్రమ కళాసాహసం బొనరించు
కుటిలాత్ములకు గాడు కొండవీడు

జవనమోటక సామంత సరసవీర
భట నటానేక హాటకప్రకటగంధ
సింధురార్భట మోహనశ్రీల దనరు
కూర్మి నమరావతికి నీడు కొండవీడు

అటువంటి కొండవీటిసీమ కాసు బ్రహ్మానందరెడ్డి జన్మసీమ.

# పుట్టుపూర్వోత్తరాలు

ఆయన ఒక వూళ్ళో వుండడు; ఒకరు పిలిస్తే రాడు, ఏమన్నా ఇస్తే పుచ్చుకోడు. వేళపట్టున ఏతల్లో ఇంత తెచ్చిపెడితే తింటాడు, వూరచెరువులో నీళ్ళు తాగుతాడు. ఇల్లూ, ఇల్లాలు, సంసారం వున్నాయో లేవో ఎవరికీ తెలియదు. ఆయన పరివ్రాజకుడు; అవధూత. పేరు నందయ్య, జలాలపురపు నందయ్య.

చిరుమామిళ్ళలో సంజ వాలుతున్నది. పగలల్లా కొండవాగుపక్కని పచ్చిక మేసిన పశువులు, మందలు మందలుగా ఇళ్ళకి చేరుకుంటున్నవి. వాటి వెనకాలే నందయ్య, వాగుదాటి గ్రామం పొలిమేరల్లో ప్రవేశించినాడు. గొడ్లకాడి బుడ్డవాళ్ళు కర్రలు బుజాన వేసుకుని, నందయ్య వెనకాల నడుస్తున్నారు. ఓ గోపాలుణ్ణి నందయ్య అడిగినాడు, "కరణంగారి కపిలగోవు ఈనిందిరా" అని. ఈనిందని జవాబు. "సరే, మంచిది." అని నందయ్య ముందడుగుగా నడిచి వూళ్లో ప్రవేశించి నాడు. తిన్నగా వూరచెరువుగట్టుమీదికి వెళ్ళినాడు. దారిలో వీధిఅరుగులమీద కూచుని కాలక్షేపంచేస్తున్న పిన్నలూ, పెద్దలూ లేచి నుంచున్నారు. తలవంచుకుని వెళ్ళిపోయిన నందయ్య, నీలాటిరేవుదగ్గిర, రావిచెట్టుకింద అమ్మవారి బండపక్కని కూచున్నాడు.

చిరుమామిళ్ళచెరువు పునీతమైనది, ఆగ్రామం పురాతనమైనది. చెరువు తవ్వించిన ప్రభువులెవరో, చెరువులోనే ఆలయం కట్టించినారు. పన్నెండవ శతాబ్దంలో ఈ సరోవరదేవరకి కుళోత్తుంగ చోడగొంకరాజు, రాజేంద్రచోడుడూ నిత్య నైవేద్యదీపారాధనలకోసం భూదానాలు చేసినారు. ఈ గ్రామంలో అనంతేశ్వరుడి దేవాలయంకూడా వున్నది. ఈ దేవుడికి ప్రోలి అనే రాజు భూదానాలు చేసినాడు. ఈ వివరాలు తెలియజేసే శాసనాలు, ఆ వూరిలోనే సంపన్నులైన వైశ్యుల ఇంట్లో

వున్నవి. దరిమిలాని కొలిశెట్టి హనుమయ్య అనే వైశ్యప్రముఖుడు, శ్రీ సీతా రాములికి ఆలయం నిర్మించినాడు. అంతకుపూర్వమే కాబోలు, కేథలిక్కు క్రైస్తవ మిషనరీలు నిర్మించిన చర్చి ఈ వూళ్ళో పెద్దకట్టడం. చిరుమామిళ్ళ నరసారావు పేటకి తూర్పుగా తొమ్మిదిమైళ్ళ దూరంలో వున్నది. గుంటూరునించి పేటకిపోయే మార్గంలోంచి అడ్డరోడ్డుమీదుగా చేరుబడి. ఉత్తరాన కొండవీటికోట, దక్షిణాన కోటప్పకొండ కనుచూపుమేరలో వుంటాయి. జలాలపురపు నందయ్యయోగికి ఆ వూరిమీద ఎందుకో అభిమానం. తరుచు వస్తాడు, చెరువుగట్టుని, రావిచెట్టు కింద, అమ్మవారి బండపక్కని కూచుంటాడు.

అమ్మలక్కలు మంచినీళ్ళకోసం బుజాన బుంగలతో వచ్చి, కాసేపు నుంచుని, నందయ్య చందంచూసి, నీళ్ళు ముంచుకుని పోతున్నారు. వారు 'దణ్ణం తాతా,' అంటారు. ఆయన స్వీకరించడు, తిరస్కరించడు; మందహాసంతో ఆశీర్వ దిస్తాడు. వయసుమీరిన వైశ్యుల బంగారమ్మ కుండతో నీటికొచ్చి చెట్టుకింద నిండుకుండని చూసినది. బుజానకుండ భూమిమీదపెట్టి, సాష్టాంగ దండప్రణామం చేసినది. నందయ్య చిరునవ్వునవ్వి వూరుకున్నాడు. వైశ్యుల భాగ్యశాలిని మించి పోయే పనులేవీ లేవుగదా అని, చెట్టుకింద నందయ్యపక్కగా కూచున్నది. చెట్టు మీద గూళ్లుచేరుకునే పిట్టలు కిలకిలారావాలు చేస్తున్నవి. పక్కఇళ్ళ కొట్టాలలో ఇళ్ళకొచ్చే తల్లుల్నిచూసి దూడలు అంభారావాలు చేస్తున్నవి. బంగారమ్మని చాటు చేసుకుని, నీటికొచ్చిన వూరిపడుచులు అక్కడే నుంచున్నారు.

"చాలారోజులైంది, స్వామీ, మీరు మావూరొచ్చి" అన్నది బంగారమ్మ.

నందయ్య మందహాసమే జవాబు. ఎవరూ మాట్లాడలేదు. తనకితానే అన్నాడు నందయ్య, 'గాదె వెంగళ్రెడ్డి పెద్దకూతురు నీలాడుతుంది గదా!"

కట్టుకథలా వుంటుంది; కాశీమజిలీలా అనిపిస్తుంది. కాని, నిజం. వెంగళరెడ్డి పెద్దకొమార్తె, ఛాయమ్మ నొప్పులు పడుతోంది. పొద్దుణ్ణించీ కొంచెం ఆయాసపడు తున్నది. మధ్యాహ్నం మంచంమీద బాగా నొప్పులు ప్రారంభించినవి. తల్లి లక్ష్మి దేవి ఏవో ఉపచారాలు చేస్తున్నది. మంత్రసానికి కబురు పంపించినది. చుట్టు పక్కల కన్నమ్మలంతా వచ్చి చూసి పోతున్నారు. కొందరక్కడే వొత్తాసికి వుండి పోయినారు.

ఒక ఆవిడ : "తొలిచూలుకాదు, మలిచూలుకాదు, ముగ్గురు పిల్లల తల్లి, ఈ బాధ ఏమిటమ్మా ?"

మరో ఆవిడ : "ఛాయమ్మకి కానుపుసుళువే, మరేమిటో ఈ విడ్డూరం ?"

ఛాయమ్మ ఓర్చుకుంటున్నది. నిబ్బరమైన మనిషి. తోటివారి తొందరలు లేకపోతే ఆమె బాధలో వున్నట్టు మగపురుక్కి తెలిసేదికాదు.

వీధివాకిట్లోకి వచ్చి, ఎవరో నులకమంచంమీద కూచున్నారు. బజార్లో పిన్నలూ, పెద్దలూ ఆయనవెనకే వచ్చినారు. కొందరు కూచున్నారు, కొందరు నుంచున్నారు. వచ్చినది మెట్టు రామయ్య. రామయ్య పరమభక్తుడు, పేరున్న మంత్రశాస్త్రవేత్త. మంచివాడు. ఒక్షణం కూచున్నాడు. తరవాత స్నానంచేసి, తడి వస్త్రాలతో, మిద్దెలో వోమూల కూచుని, ప్రార్థనచేసి. పంచపాత్రలో మంచినీళ్ళు మంత్రిస్తున్నాడు.

ఈలోపుగా చెరువుగట్టుని నందయ్య జోస్యం చెప్పినాడు. "ఛాయమ్మ కడుపుని రాజ్యమేలే రాజు పుడతాడు, వాడికి నేనే నామకరణం చేస్తాను."

రాత్రి ఎనిమిది గంటలు.

మెట్టు రామయ్య పూజ పూర్తి అయినది. లక్షిందేవిని పిల్చి మంత్రజలం ఛాయమ్మ కిమ్మన్నాడు. ఛాయమ్మ పుచ్చుకున్నది, బాధ తగ్గినది, సుఖప్రసవం అయినది. నందయ్యమాట నిజమైనది. మగశిశువు కలిగినాడు. మూడోకొడుకు నాలుగో కడుపు. ఆ శిశువే బ్రహ్మానందరెడ్డి. గొప్పజాతకుడు.

శ్రీ సౌమ్యనామ సంవత్సర శ్రావణశుద్ధ ఏకాదశీ బుధవారం,
జ్యేష్టానక్షత్ర, చతుర్థ చరణం, కుంభలగ్నం,
ది : 28–7–1909, రాత్రి 8–00 గంటలు.




జననకాల బుధమహాదశాశేషం

15 సంవత్సరాల, 10 మాసాల, 0 రోజులు.

# వంశచరిత్ర

గాదె వెంగళరెడ్డి భూఖామందు. చిరుమామిళ్ళలోనేకాక, తాలూకా మొత్తంమీద పలుకుబడి కలిగినవాడు. వెంగళరెడ్డి తాతల కాలంలోనే బ్రిటిషువారితోపాటు క్రైస్తవ మిషనరీలుకూడా మన దేశంలో దిగినారు. ముఖ్యంగా గుంటూరు జిల్లాలో వీరి చైతన్యం ఎక్కువగా వుండేది. గ్రామగ్రామానికీ, వాడవాడకీ తిరిగి, క్రీస్తు సందేశం, ఆ సందేశం అనుసరించడంవల్ల ఆధునిక యుగంలోగల అనుకూలాలూ బోధించి, నిమ్నజాతుల్నేకాక కులస్థుల్నికూడా మతస్థుల్ని చేసినారు. గుంటూరు జిల్లాలో వున్నంతమంది క్రైస్తవులు ఏ తెలుగు జల్లాలోనూ లేరు, 14 శాతం. నరసారావుపేట తాలూకా ఫిరంగిపురంలోనూ, పల్నాడుతాలుకా రెంటచింతలలోనూ మిషనరీలు ముఖ్యస్థావరాలు ఏర్పరుచుకుని, సత్తెనపల్లి తాలూకాతోసహా, చుట్టుపట్ల ప్రజలలో ప్రబోధం చేసినారు. నరసారావుపేట తాలూకా రావిపాడు గ్రామస్థుడే ప్రథమాంధ్ర కేథలిక్కు బిషప్పు, పొతకమూరి థామస్. ఆసుపత్రులు, విద్యానిలయాలు, కార్ఖానాలూ స్థాపించి, బీదజనానికి ఆరోగ్య విద్యావసతులేకాక జీవనోపాధికూడా కల్పించినారు. వేలకిమైళ్లు సముద్రాలకవతల, శీతలమైన స్వదేశం, ఇల్లూ వాకిలీ, బంధుజనాన్నీ విడిచిపెట్టి. మనదేశంలో ఏ వసతీలేని గ్రామాలలో నిత్యనివాసం ఏర్పాటు చేసుకుని, ఎండనక వాననక, కాలినడకని తిరిగి, ప్రజాసేవ చేసిన, వారి దీక్ష, శ్రద్ధ, శాంతం, మంచితనం మనదేశీయుల్ని ఆకర్షించడంలో ఆశ్చర్యంలేదు. అంటరానితనంతో, ముట్టరానితనంతో, చూడరానితనంతో, అజ్ఞానంలో వున్న ప్రజానీకానికి అన్నదాతలేకాక నాగరక జీవనదాతలుగాకూడా వున్నారు ఈ మిషనరీలు. శ్వేత ప్రభుత్వం అండదండలు వారికి వుండడం సహజం. అవసరంపట్ల అధికారులైన తెల్లదొరలు వీరి సిఫారసులు వినడంకద్దు. అందు

చేత వీరికి పలుకుబడిహెచ్చు. ఒక్క నరసారావుపేట ప్రాంతమేకాదు, ఆంధ్ర దేశమేకాదు, యావద్భారతదేశంలోనూ మిషనరీలు వ్యాపించినారు.

మన జనానికి ఆర్యమతం ఎటువంటిదో చెప్పేనాధుడులేడు. మతంపేరుతో అగచాట్లేగాని, అనుకూలాలులేవు. ఆకాశాత్‌పతితంతోయం యధాగచ్ఛతి సాగరం, సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతిః" ఆకాశంమించి వర్షం భూమి మీద పడి, వాగులై, ఏరులై, నదులై చివరికి సముద్రంలో కలిసినట్టు ఎన్ని పేర్లతో, ఎన్నిమతాల ద్వారా, ప్రార్థించి నమస్కారంచేసినా, ఒకే ఒక దేవుడికి చెందుతుందనే పరమరహస్యం వారికి తెలియజేసినవారు లేరు. సృష్టి అంతా ఒకటి, సర్వం జగన్నాధం, ఏకమేవాద్వితీయం, 'అహం బ్రహ్మాస్మి' అనే సనాతన ఉపనిషత్సందేశాన్ని వారికి అందించినవారులేరు. మనమతంలో అన్నిమతాలూ వున్నవనీ, ధర్మార్థకామమోక్షాలు సాధించడానికి మతం మారవలసిన అగత్యంలేదనీ, ఇది దేనికీ వ్యతిరేకంకాదనీ తెలుసుకోవలసిన బాధ్యత వారికి కలిగించినవారులేరు.

అటువంటి పరిస్థితులలో, 'యధారాజా తధాప్రజా'అని వూరిలోవారు కొందరు మతం పుచ్చుకున్నా, చలించకుండా తమమతాన్ని సంరక్షించుకున్నవారు, చిరుమామిళ్ళ గాదెవంశపు రెడ్లు. ఆ వూరి కులస్థులలో చాలామంది కమ్మవారు ముందుగా క్రాసు ధరించినారు. అందుకనికాబోలు ఆ వూరిరెడ్లు మతం పుచ్చుకోలేదు. ఈ వైరుధ్యం మనకున్నదేగదా! గాదెవారి కుటుంబం సనాతన హిందూ ధర్మపాలనలో పేరుపొందినది.

వెంగళరెడ్డికీ లక్షిందేవికీ అయిదుగురు సంతానం: పెద వెంకయ్య, చిన వెంకయ్య, ఛాయమ్మ, లింగమ్మ, వీరారెడ్డి. పెద్ద కూతురు ఛాయమ్మని పక్కనే పొలిమేర దాటితే రెండుమైళ్ళలోవున్న, తూబాడు గ్రామముననబు కాసు వెంకట కృష్ణారెడ్డి కిచ్చి వివాహం చేసినాడు. ఆ వివాహవిషయంలోగూడా వెంగళరెడ్డి గాదెవంశీయుల విశాలహృదయం నిరూపించినాడు.

తూబాడు నరసారావుపేటకి పన్నెండుమైళ్ళు. ఇది పురాతనగ్రామం, చరిత్ర ప్రసిద్ధిగన్న గ్రామం. కొండవీటిసీమ, రెడ్డిరాజులికి పూర్వం, కుళోత్తుంగచోళుడి పరిపాలనలోవుండేది. ఈ సీమల పడమరిభాగం 1115 లో కుళోత్తుంగుడు తన తమ్ముడైన బుద్ధవర్మకి దత్తంచేసినాడు. బుద్ధవర్మకి సేనాని గోపన్న. గోపన్న సేనాని ఇక్కడ నగరం నిర్మించినాడు. ఊరికి ఉత్తరాన, భీమేశ్వరస్వామిని ప్రతిష్ఠించి, ఆలయనిర్మాణంచేసి, కొత్తనగరానికి 'తూంబాడు' అని పేరుపెట్టినాడు. ఈ పరగాణాని 1436 వరకూ రెడ్లు పరిపాలించినారు. తరువాత నరపతులు, కర్ణాటకులు, నవాబులూ పాలించినారు. చివరి రాజ్యంలో తూబాడులోవున్న పురా

తన దేవస్థలాలు చెదిరి కొండవీటి మసీదులైనవి. నవాబుల కాలంలోనే సముతులు ఏర్పాటుచేసినప్పుడు తూబాడు నాదెండ్లసముతులో చేరినది. నల్లబోతుచౌదర్లూ, దేశ పాండ్యాలు అయిన పాత్రునివారు జమీందారీ చేసినారు. కొండవీడుజిల్లా జాగీరైన ప్పుడు తూబాడు అందులోభాగం. నిజాములకింద 1720 లో మధ్వ బ్రాహ్మణు లైన రాజా మానూరివారి రాజ్యంలో భాగమైనది. 1752 లో నిజాం-ఉల్-ముల్క్ కుమారుడు నాసర్‌జంగ్, ఈ ప్రాంతం, తూబాడుతోసహా, ఫ్రెంచివారికి దత్తం చేసినాడు. వారు కొంతకాలం కొండవీటినించీ, తరువాత పాతగుంటూరులోకట్టిన కోటనించీ పరిపాలన చేసినారు. 1770 లో బ్రిటిషువారు గుంటూరు ఆక్రమించిన తర్వాత తిరిగీ, రాజా మానూరి నరసన్నారావుగారికి సంక్రమించినది. మానూరి జమీందారీ చిలకలూరిపేట, సత్తెనపల్లిగా భాగించినప్పుడు, తూబాడు చిలకలూరి పేట వంతుకి వచ్చినది. జమీందారీలు పోయేవరకూ అల్లాగేవున్నది.

ఇన్ని చేతులుమారిన ఈ గ్రామం ప్రాంతీయచరిత్రలో ప్రాముఖ్యమైనది. వూరిమీద వూరుబడ్డా కరణంమీద కానుపడదన్నట్టు, ఇంతమంది రాజులుమారినా కరణాలు మారలేదు. 1145 లో గోపరాజు రామన్నమంత్రి ఎందరికో కరణీకా లిచ్చినాడు. అప్పుడు తూబాడు కరణీకం తూబాడు గంగరాజుకి వచ్చినది. కరణీకం నేటివరకూ వారివంశంలోనే వున్నది. వీరినే తూమాటివారనికూడా అంటారు.

తూమాటి అక్కరాజు గ్రామానికి పడమరగా, చెరువుపక్కని ఉమామహేశ్వ రాలయం నిర్మించినాడు. ఇంకో కరణం శివాలయంసమీపంలోనే ఆంజనేయ స్వామి ఆలయం కట్టించినాడు. ఈ ఆలయానికి ఉత్తరంగా చిలకలూరిపేట జమీం దారిణి, మానూరి వెంకమ్మ కేశవస్వామి ఆలయం కట్టించినది. ఇప్పుడు సంకల్పం మానూరివారిపేరుతోనే జరుగుతుంది.

తూబాడు కరణాలు మారలేదు గాని, మునసబుల్ని మార్చగలిగినారు. ఇప్పుడు మునసబీచేసేవారు కానువారు, అనాదినించీ తూబాడు వాస్తవ్యులుకారు. వారి ఆగమనం వోకథ, గ్రామీణరాజకీయగాథ. మొదట తూబాడుగ్రామ మునసబీ చౌదర్లది. కరణాలకీ మునసబులికీ పడలేదు. పడితే గ్రామం చల్లగా వుంటుందిగదా! ఈ కక్షలు, రానురాను, నువ్వా, నేనా అనే స్థితికి వచ్చినవి. కరణాలు కార్య కర్తలు. వ్యక్తుల్నేకాదు, అసలు చౌదర్లనే తీసిపారవెయ్యాలని దీక్షపట్టినారు. పోతే రావలసినవారు రెడ్లు. శత్రువుశత్రువు మనమిత్రుడనే కౌటిల్య దండనీతి. సరి పోయే వ్యక్తులకోసం పెద్దవల పన్నినారు. వెళ్ళగా వెళ్ళగా, వెదగ్గా వెదగ్గా సత్తెన పల్లి తాలూకా, సిరిపురం గ్రామంలో దిగ్గంతులలాటి అయిదుగు రన్నదమ్ము లున్నారు. వీరు సంయుక్తకుటుంబీకులు. అసలైన సిసలైన ఖాసారెడ్లు; మోటాటి

రెడ్లు; ములుగుట్ల గోత్రికులు కాసువారు. వీరిని ఎన్నికచేసుకోడంలో మరో విశేషం వున్నది. వారు మతస్థులు; అందుచేత అధికారులైన తెల్లదొరలు అనుకూలిస్తారు. కాసు పంచకం తూబాడుభారతంలో పంచపాండవులైనారు. కరణాలు కల్పించిన సదుపాయాలు వారికి అంగీకారమైనవి. సిరిపురంనించి కాసుకుటుంబం తూబాడు మారినది. కరణాలు చాకచక్యంగా చౌదర్లని బర్తరుఫు చేయించినారు, వారసత్వపు గ్రామమునసబీ కాసువారికి వేయించినారు. ప్రస్తుతం వారివంశంలోనే వున్నది. బ్రహ్మానందరెడ్డి మొదటిఉద్యోగం తూబాడు గ్రామమునసబీ.

కాసురెడ్లు తూబాడులో ఆస్తిపాస్తులు సంపాదించుకుని, ఇళ్లూ వాకిళ్లూ కట్టుకుని స్థిరపడినారు. ఆ పురాతన మిద్దెయింట్లోనే ఈతరంవారుకూడా పెరిగినారు. అది మార్చకుండా అల్లాగే వుంచినారు. ఇప్పుడుకూడా కాసువారిది సంయుక్త కుటుంబమే. ఆ సంప్రదాయం విడిచిపెట్టరు. మరో కారణంకూడా ఈ సంస్థకి తోడై వుండవచ్చు. ఎంతమంది అన్నదమ్ములు వున్నా, అందులో ఏ ఒక్కరికో మాత్రం సంతానప్రాప్తి. అయిదుతరాలుగా ఆ వంశధర్మం అల్లాగే వున్నది. బైటికి పోరు, పెంపుళ్ళు చేసుకోరు. ఈ మహాప్రస్థానం ప్రథమ భారతీయ స్వాతంత్ర్య సమరానికి ముందే జరిగినది.

ఈ వంశీయుడై, గ్రామమునసబీ చేస్తున్న కాసు పాపిరెడ్డికీ, భార్య ప్రకాశమ్మకీ ఒకే ఒక్కకొడుకు: వెంకటకృష్ణారెడ్డి. వూళ్లో అంతయ్య అనేవారు. అది క్రైస్తవ ప్రయోగం. ఆ రివాజు ఆపుజేసినాడు వెంకటకృష్ణారెడ్డి.

ఆయన ఎంత కార్యధీరుడో, అంత ఆలోచనాపరుడు. లోకంపోకడ శ్రద్ధగా గమనించేవాడు. అభ్యుదయమార్గాలమీద మోజు, నూతన వికాసంమీద మనసు, సమకాలిక విషయాలమీద ఆసక్తి. మనదేశీయులికి, గ్రామాలతోసహా, అందరికీ కనీసం ప్రాథమిక విద్య అయినా నిర్బంధంగా వుండాలన్న గోపాలకృష్ణ గోఖలే నినాదం అతన్ని ఆకర్షించినది. దేశం నలుమూలలా జరుగుతున్న సంగతులు క్షుణ్ణంగా అవగాహన చేసుకున్నాడు. తన తరంవారిలో, సాటివారిలో విజ్ఞానిగా, నాగరికుడుగా, సంస్కారిగా పాటించబడినవాడు. చిన్నతనంలో వివాహం జరిగినది. భార్య కాపురానికి వచ్చినది. వెంకటకృష్ణారెడ్డి బహిరంగంగా, తన ఉద్యోగవ్యవహారం, సొంత వ్యవసాయం, ఇంట్లో సంసారం సక్రమంగా చేస్తున్నాడు. కాని అంతర్ముఖుడైనాడు. భారతదేశం మేలుకున్నది. దేశంతోపాటు రెడ్డికూడా మేలుకున్నాడు.

కలకత్తాదగ్గిర, గంగాతీరాన, దక్షిణేశ్వరంలో శ్రీరామకృష్ణపరమహంస తపస్సు చేసినాడనీ, ఆమహర్షి ప్రత్యక్షంగా భగవంతుణ్ణి దర్శించినాడనీ విన్నాడు.

మతాలన్నీ ఒకటేననీ, అన్నిమతాలూ ఒకే దేవుడిదగ్గిరికి దారి చూపిస్తాయనీ శ్రీరామకృష్ణుడు నిరూపించినాడని తెలుసుకున్నాడు. ఆ వేపునించే రాజారామ మోహన్‌రాయ్ బ్రహ్మసమాజసందేశం అందినది. రాజమండ్రీలో వీరేశలింగం, హిందూసంఘంలో, కారణాంతరాలవల్ల సంక్రమించిన దురాచారాలూ, దుష్టనమ్మకాలూ, రూపుమాపి కొత్తపంథా ఏర్పాటు చేస్తున్నాడని విన్నాడు. ఆఉద్యమం గుంటూరుదాకా చేరినసంగతి చూసినాడు. ఇంతలో దివ్యజ్ఞానసమాజసంస్థాపకురాలు మేడం బ్లేవట్‌స్కీ, ఆమె అనుచరుడు కల్నల్ ఆల్‌కాట్ గుంటూరువచ్చి, ఉపన్యాసాలుచేసినారు. ఈ శ్వేతాజ్ఞానులు, సంస్కృతం పఠించి, భారతీయమతవేదాంత గ్రంథాలు పరిశోధించి, పాశ్చాత్యుల భౌతికజ్ఞానంకంటె భారతీయుల ఆధ్యాత్మిక జ్ఞానం ఉన్నతమైనదని నిరూపించినారు. హిందువులుపాటించే చాలా ఆచారాల ప్రాశస్త్యం ఆధునికశాస్త్రరీత్యా ధ్రువపరచవచ్చునని ఉద్ఘాటించినారు. భారతీయుల ఆత్మగౌరవం పునరుద్ధరించినారు.

అటు పంజాబులో మహ్మదీయమతప్రచారం అరిగట్టడానికి స్వామీ దయానందసరస్వతి ఆర్యసమాజం స్థాపించినాడు. హిందువుకావడానికి ఆమతంలో పుట్టనవసరంలేదనీ, వేరే మతంపుచ్చుకున్నవార్ని తిరిగీ హిందూమతంలోకి తీసుకోవచ్చుననీ, శుద్ధికార్యక్రమం ప్రారంభించినాడు, ఆ ఆర్యసమాజంకూడా గుంటూరు ప్రవేశించినది.

ఇంతలో మార్గరెట్‌నోబుల్ అనే ఇంగ్లీషుస్త్రీ వివేకానందస్వామిశిష్యురాలై హిందూమతంలో చేరి, దేశసేవ ప్రారంభించినది.

ఈ నూతనవాతావరణంలో వెంకట కృష్ణారెడ్డి ఆలోచించినాడు. భార్యతో సంప్రదించివుండవచ్చు. అభిప్రాయభేదం కలిగివుండవచ్చు. పర్యవసానం క్రైస్తవ మతానుసారంగా విడాకులు. విడుదల పొందినరెడ్డి తాను హిందువునని ప్రకటించినాడు. ద్వితీయవివాహం చేసుకుంటానన్నాడు. హిందువులై, సత్సంప్రదాయం కలిగిన కుటుంబంలో వధువునే చేసుకుంటానన్నాడు. పక్కవూళ్లోవుండి ఈపరిణామం గమనిస్తున్న గాదె వెంగళరెడ్డి తనపెద్దకూతురు ఛాయమ్మని, కాసువెంకటకృష్ణారెడ్డికిచ్చి వివాహంచేసినాడు. ఆడపెళ్లివారిది ముదునూళ్లగోత్రం.

ఒక మహాయోగి ఆశీర్వచనంతో, ఒక మహాభక్తుడి మంత్రశక్తితో ఆవిర్భవించిన ఛాయా వెంకటకృష్ణుల మూడవకుమారుడికి సశాస్త్రీయంగా భారసాల చేసినారు. జలాలపురం నందయ్యని ఆహ్వానించి, ఆయనచేత నామకరణం చేయించినారు. ఆ పుణ్యపురుషుడుపెట్టినపేరే బ్రహ్మానందం. కొత్తపేరు. వారియింటలేదు. కాసువారి

పెద్దకుమారుడిపేరు వెంకటరెడ్డి, మలిచూలు ఆడపిల్ల; శైశవంలోనేపోయినది. రెండవకుమారుడు వెంగళరెడ్డి, మాతామహుడిపేరు. మూడవవాడు బ్రహ్మనందరెడ్డి.

రెడ్లు శైవభక్తులు. కాని, గాదెవారి యింట్లోనూ, కాసువారియింట్లోనూ హరిహరాభేదంతో వేంకటేశ్వరస్వామిపేరు పెట్టుకుంటారు. ఆ దేవుడు వీరిఇలవేల్పు కాబోలు. మరోవినికిడి, కాసువారికి గంగమ్మ ఇలవేల్పని.

ఛాయమ్మకి బ్రహ్మనందం తరవాత కూతురు మాణిక్యమ్మా, నాలుగో కుమారుడు పాపిరెడ్డి కలిగినారు. ఇవి కాసురెడ్ల పుట్టుపూర్వోత్తరాలు. రెండు సన్నిహిత కుటుంబాల, రెండు ఇరుగుపొరుగు గ్రామాల సంబంధబాంధవ్యాలు.

# వంశవృక్షం


చిరుమామిళ్ళగాదె రెడ్లు
వెంగళరెడ్డి
లక్షిందేవి
పెదవెంకయ్య
చినవెంకయ్య
పిచ్చెమ్మ
ఛాయమ్మ
లింగమ్మ
వీరారెడ్డి
రాఘవమ్మ
వెంగళరెడ్డి
తూబాడు కాసు రెడ్లు
పాపిరెడ్డి
ప్రకాశమ్మ
వెంకటకృష్ణారెడ్డి
ఛాయమ్మ
వెంకటరెడ్డి
ఆడపిల్ల
వెంగళరెడ్డి
శేషమ్మ
బ్రహ్మానందరెడ్డి
రాఘవమ్మ
మాణిక్యం
పాపిరెడ్డి
వెంకటకృష్ణారెడ్డి
ప్రసాదరెడ్డి
ఛాయ
సత్య
అంజలి
రాజగోపాలరెడ్డి

# వందేమాతరం

మహాశివరాత్రి.

దాపునున్న కొండమీద కోటప్ప తిరునాళ్ళు. ఆ చుట్టుపట్టుల నించేకాదు, జిల్లా మొత్తంమీంచి తండోపతండాలుగా విర్చుకు పడతారు. వూరికే వుట్టి చేతులతోరారు: బ్రహ్మాండమైన ప్రభలుకట్టి, అవి రెండెడ్ల బళ్ళమీద ఎక్కించి. తోలుకొస్తారు. తాహతుకొద్దీ ప్రభలు వుంటవి. దివ్యంగా అలంకరించి, పడిపో కుండా పగ్గాలతో బిగిస్తారు. బళ్ళుకూడా చక్కగా రంగురంగులుగా తయారు చేస్తారు. ఇంక ఎడ్లసంగతి చెప్పనక్ఖర్లేదు. వాట్లని అల్లారు ముద్దుగా పెంచుతారు; జాగ్రత్తగా మేపి ఏనుగుల్లాగ తయారు చేస్తారు. గుంటూరుజిల్లా పశువులు ప్రసిద్ధి. ఒంగోలుజాతి ఎద్దులు విదేశాలకి ఎగుమతీ అవుతూ వుంటాయి. కండలుపెరిగి. కొమ్ములుతిరిగిన ఆ బసవళ్ళు రంకెలు వేస్తూ, గంటలూ గజ్జెలు మోగుతూ, ఠీవితో నందికేశ్వరుళ్ళలాగ కదంతొక్కుతూ, ప్రభల్ని కొండకి లాక్కొస్తాయి. వాటిమీద ఈగవాలనివ్వరు భక్తులు. ప్రభలు వైభవ విలాసాలతో ఒకర్ని మించి ఒకరు పోటీగా తయారు చేస్తారు. మావూరు గొప్పంటే మావూరు గొప్పని ఖర్చూ కష్టం లెఖ్ఖచెయ్యరు. ఒకోప్రభతోటి కనీసం పదిమందైనా రౌతుల్లాటి, జమ్మాజట్టీలు వస్తారు. వారులేక ఎడ్లని పట్టుకోడం కష్టం. పిల్లలొస్తారు, బాలలొస్తారు, వారి తల్లి తండ్రులొస్తారు. అటువంటి ప్రభలు కొన్నివేలు వస్తాయి. ప్రభలు కట్టలేని కడుబీదవారు వీపుప్రభలైనా కట్టుకుని మొక్కుబడులు చెల్లిస్తారు. ఈ రంగురంగుల ప్రభలతో. బళ్ళతో. వాటిని లాగే ఎద్దులతో, మువ్వల చప్పుడుతో. గంటల ఘల్లులతో, కిక్కిరిసిన మనుషులతో, యాత్రీకుల వినోదానికివచ్చిన రంగుల రాట్నాలతో. ఆడే దొమ్మర్లతో. పాడే భక్తులతో కోటప్పకొండ శివరాత్రినాడు కలి

యుగకైలాసంలావుంటుంది. ఆ జనం నేల ఈనినట్టు, ఇసుకవేస్తే రాలకుండా ఆ పర్వతప్రాంతం అంతా కిటకిటలాడి పోతారు.

కోటేశ్వరుడి కొండ ఏకాకిగా వుంటుంది. చుట్టుపట్ల పదిపన్నెండు మైళ్ళు కానవస్తుంది. కొండకింది వూరిపేరు యల్లమంద. కొండకీ వూరికీ పక్కగా ప్రవహిస్తుంది, ఓగేరు అనే ఓంకారనది. శ్రీశైలం, త్రిపురాంతకం తర్వాత రెండు మూడు జిల్లాలలో పేరుగాంచిన శైవక్షేత్రం ఇదే. కోటప్ప ప్రభలు ఆ ప్రాంతపు సంస్కృతిలో భాగం: ఈ యేడాదిపండుగ ఆ జనానికి ప్రాణం. కొండయెత్తు 1580 అడుగులు. కొండకి నగం ఎత్తులో వుంటుంది కోటేశ్వరాలయం. ఆపేక్ష కొద్దీ, భక్తి పారవశ్యంతో కోటప్ప అంటారు ప్రజలు. మెట్లు ఏనాడో కట్టినవి, రాళ్ళు కాలికిలొంగని ఎత్తులో వుంటాయి. ఎక్కడం కష్టం. ఆయాసంతో భక్తులు 'చేదుకో కోటయ్యా' అని నినాదాలు చేస్తూ ఎక్కుతారు. దిగేటప్పుడు దూకుడు. కొండ పైనా కిందా చాలా దేవాలయాలు వున్నవి. ఒకో దేవుడికి ఒకో కథ, ఒకో స్థలపురాణం. ఈ దేవర్లలో ఒకాయిన త్రికోటేశ్వరస్వామి. కొండశిఖరం మీద వెలిసినాడాయన. ఒకరు 'బొచ్చు' కోటేశ్వరస్వామి. ఆయనకీ గొర్రెలకీ బంధుత్వం.

రాధ అనే యల్లమంద గొల్లభామ గొర్రెల్ని కాసుకుంటూ కొండమీదికి తోలుకొచ్చేది. కోటప్పకీ ఆవిడికీ స్నేహం కుదిరినది. ఆ అమ్మాయి పిలిస్తే పలికేవాడు కోటయ్య. ఆ భక్తపారిజాతుడికి రోజూ ఇంటినించి పంచభక్ష్య పరమాన్నాలు తెచ్చి సమర్పించేది రాధ. ఒకనాటి సందెవేళ గొర్రెల్ని మళ్లేసుకుని ఇంటికి పోతూ, "స్వామీ, ఈ చలిలో వొణికిపోతూ, ఈ కొండమీద ఒక్కడవూ ఏమివుంటావు, ఇంటికి రారాదా, నీకు సమస్త ఉపచారాలూ, సేవలూ చేస్తాను" అన్నది రాధ. ఎంతకైనను మగవాడు కోటవిభుడు. రాధాదేవి ప్రార్థన మన్నించినాడు. 'సరే, నీతో వస్తాను, వెనకాలే వస్తాను. నువ్వుమాత్రం వెనక్కి తిరిగి చూడకూడదు' అని షరతు పెట్టినాడు. ముందు గొర్రెలమంద, వెనక గొల్లరాధ, ఆ వెనక కోటప్పదేవుడూ, దిగువదారిన యల్లమందకేసి సాగుతున్నారు. రాధకా దేవుడిమీద అంత ఆపేక్ష, అంత ప్రేమ. కొంగుబంగారమైన ఆ నాథుడు వస్తున్నాడా లేదా, తనని మోసపుచ్చినాడా అనే అనుమానం నిగ్రహించుకోలేక పోయినది. తలవనితలంపుగా గిరుక్కుని వెనక్కి తిరిగినది. దేవుడు వున్నట్టుగా శిలఅయిపోయినాడు. చూస్తూనే రాధకూడా శిలారూపం పొందినది. అది రాధా కోటేశ్వరుల భక్తిప్రణయగాథ.

అరవయ్యేళ్ళనాటి కీలకనామ సంవత్సరం శివరాత్రి అది. ఎందుకో జనం మామూలుకంటె ఎక్కువగా మూగిపోయినారు. దూరదూరాల్నించి ప్రభలు కట్టుకొచ్చినారు. సమీపగ్రామాలైన తూబాడునించీ, చిరుమామిళ్లనించీకూడా ఎప్పటికి

మళ్లేనే ప్రభలూ, వాటితోపాటు భక్తులూ రావడం జరిగినది. అన్నివేల ప్రభల లోనూ రెడ్డిపాలెంచేబ్రోలునించి గాదెచిన్నపరెడ్డికూడా తన మనుషులతోకలిసి బ్రహ్మాండమైన ప్రభ, మాంచి పొగరెక్కిన ఎడ్లతో, తోలుకొచ్చినాడు. ఆ ప్రభ జయస్థంభంలా వున్నది; ఆ యెడ్లు కొండలలావున్నవి.

తండోపతండాలుగా వచ్చిపడిన ఈ ప్రజల్నీ వారి ప్రభల్నీ బందోబస్తు చెయ్యడానికి చాలినంత పోలీసుబలగం రాలేదు. ప్రభలు ఒకదారిలో నడవాలి. ఈ మందిలో, ఈ రణగొణధ్వనిలో, ఈ రాంధాళిలో, ఎద్దులు బెదిరి చెప్పినమాట వినవు. బెదిరిన ఎడ్లని ఎంతమందైనాపట్టడం కష్టం. అక్కడికీ ముక్కులికి తాళ్లు నేస్తారు. ఎడ్లేకాదు ఈ తొడతొక్కిడిలో మనుషులే బెదిరి వున్నారు. వారితోపాటు రాత్రింబవళ్లు నిలువుజీతంమీదవున్న తగుమాత్రమైన పోలీసుజవానులుకూడా బెదిరి వున్నారు. వారు చేతుల్లో బెత్తాలతో మందల్నీ మందినీ కూడా మందలిస్తున్నారు. ఎడ్లు మరింత చెదిరి బెదుర్తున్నాయి. జనం భయపడుతున్నారు. నెత్తిమీదయెండ, జనసమ్మర్దంలో ఉక్క, దానికితోడు యాత్రికులు రాత్రంతా జాగారం, రోజుల్లా ఉపవాసం. ఎద్దుల వీపులమీద పోలీసులబెత్తాలు ఆడినవి. శేషయ్యనాయుడు అనే పోలీసుహెడ్డుకనిస్టేబు చిన్నపరెడ్డి యెడ్లమీద కర్రజేసుకున్నాడు. అవి బెదిరిపోయి పట్టపగ్గాలు లేకుండా జనంలోంచి దున్నుకు పోయినవి. పోలీసులు తుపాకీలతో ఎద్దుల్ని కాల్చి చంపేసినారు. చిన్నపరెడ్డి తిరగబడ్డాడు. అతనితోపాటు జనం పోలీసులమీద విర్చుకు పడ్డారు. ప్రజాసంరక్షణకోసం, స్వప్రాణసంరక్షణార్థం పోలీసులు మళ్ళీ తుపాకులు కాల్చినారు. మందిలో కొందరు మరణించినారు. శివ రాత్రి యాత్రికజనం శివమెక్కి చిందులుతొక్కి, ప్రళయకాలరుద్రావేశంతో పోలీసు దళంమీద దండెత్తినారు. ఎవరి చేతులలో ఏది వుంటే అదే ఆయుధం. ఆడవాళ్లు బళ్ల వుసికర్రలుపీకి, కొన్ని వందలమహిషాసురమర్దనిలులాగ సంగ్రామరంగంలోకి వురికినారు. శేషయ్యనాయుణ్ణి అతని సిబ్బందినీ కట్టేసి, నేలమీద పడేసి ప్రాణాలు వుండగానే నిప్పంటించినారు. ఆ జీవచ్ఛవాలు మంటలబాధ తట్టుకోలేక హాహా రావాలు చేస్తూవుంటే చుట్టూ మూగిన జనం, వందేమాతరం, అని ఒకపెట్టున నినాదాలు చేసినారు. అందుబాటులోలేని అధికారులు పలాయనమంత్రం పఠించినారు. మర్నాడు ఉదయం ఆ పర్వతప్రాంతం అంతా పీనుగులపెంటగా, యుద్ధానంతర రణరంగంలా, సగముకాలిన శవాల కంకాళసమితితో, రుద్రభూమిలా వున్నది. పోలీసువారి శవాల అంగాలు, పూలుపట్టీలుకప్పిన కాళ్లూ, పూర్తిగా చ్యుతిగాని టోపీలతో ధూళిలో పొర్లాడినవి. ఈ భీభత్సంతో ప్రజలూ, ప్రభుత్వముకూడా హడిలిపోయినారు. నరసారావుపేట సబుమేజస్ట్రీటు గోళ్లమూడి సుబ్బారావుని డిస్ మిస్ చేసినారు. కెర్షాస్పు అనే పార్శీ సబుకలెక్టరు రాజీనామా ఇచ్చి వెళ్లిపోయినాడు.

చిన్నపరెడ్డినీ అతని అనుచరుల్నీ, బంధించి, కేసు పెట్టి, విచారణ చేసి, ఉరి తీసినారు. చిరుమామిళ్లనించీ, తూబాడునించీ వెళ్లిన బంధుజనం ఈ దురంతం స్వయంగా చూసినారు. ఆందోళనలోవున్నారు. వేడినెత్తురు చల్లారలేదు.

చిన్నపరెడ్డి వీరుడైనాడు, ధీరుడైనాడు, విక్రమార్కుడైనాడు. పల్నాటి వీరగాథలాగా ఒక వీరగీతం వెలిసినది:

పుట్టింది రెడ్డిపాలెంలో
పెరిగింది చేబ్రోలు
రెడ్డీ, 'సైర' చిన్నపరెడ్డీ !
నీ పేరే బంగారపు ఖడ్డీ !

పలనాటికథలాగే వూరూరా తిరిగి జంగాలు బుర్రకథ చెప్పినారు. ఒక బందోబస్తు విషయం, 'వందేమాతరం' అనే నినాదంతో రాజకీయస్థాయికి వెళ్ళి పోయినది. ప్రజల మనసులలో నిలిచిపోయినది. జిల్లా జిల్లా అట్టుడికినట్టు వుడికి పోయినది. కేసు విచారణ జరుగుతున్న వేడి వాతావరణంలో జన్మించినాడు బ్రహ్మానందరెడ్డి. దురంతం జరిగి నాలుగు నెలలు పూర్తి కాలేదు.

కోటప్పకొండ దౌర్జన్యం ఆ రోజుల్లో మనదేశాన్ని ఆవేశపరిచిన 'టెంపరు' చిహ్నాలలో ఒకటిమాత్రమే. భారతీయ వాతావరణంలోనే దౌర్జన్యం రంగరించినారెవరో. ఆ గాలి పీల్చిన యువజనానికి శివమెత్తినది.

బెంగాలులో రామమోహనరాయ్, మహారాష్ట్రంలో మహాదేవ గోవింద రానడే, ఆంధ్రదేశంలో కందుకూరి వీరేశలింగం, పంజాబులో దయానందసరస్వతి ప్రారంభించిన సాంఘిక మత విప్లవ బీజాలు ప్రజలప్రగతిలో ఇమిడిపోయినవి. సూటు బూటు వేషధారులైన సంపన్నులు, కాంగ్రెసు అనే పేరుతో ఏదో మహానగరంలో సమావేశమై, ఏడాదిపండుగ చేసుకుని, అనర్గళవాగ్ధారతో, అవమానకరమైన మహజర్లు మనవి జేసుకునేకాలం వెనకబడుతున్నది. 1885 లో బ్రిటిష్‌వారి ప్రోద్బలంతోనే ప్రారంభించబడిన కాంగ్రెసు, వారి అశ్రితులచేతుల్లోంచి జారిపోతున్నది. 1906 లో కలకత్తాలో జరిగిన కాంగ్రెసుకి లండనునించివచ్చి, దాదాభాయి నౌరోజీ అధ్యక్షత వహించినాడు. ఆ కాంగ్రెసులో స్వరాజ్యమే కాంగ్రెసు ఆశయం అని తీర్మానం ప్రతిపాదించి నెగ్గించినారు యువకులు. దాదాభాయి బ్రిటిషు పార్లమెంటులో సభ్యుడు, తత్కారణంగా కలకత్తా తీర్మానం లండనుప్రజల్ని ఆకర్షించినది. ఇండియా ప్రభుత్వానికి కొంత వెష్ట తగిలినది. వారితరఫు కాంగ్రెసు వాదుల్ని వారుమండలించి వుండవచ్చు. 1907 డిసెంబరు లో సూరతు కాంగ్రెసు జరిగే సరికి అశ్రితులికీ అనాశ్రితులికీ తగాదాలు వచ్చినవి. కాంగ్రెసుసభ ఫిరోజ్‌షా

మెహతా చెప్పుచేతల్లో వుండేది. గోఖ్లే ఆయన పక్షమే. వీరికి వ్యతిరేకులు బాల గంగాధర తిలక్, లాలాలజపత్‌రాయ్. సూరతు కాంగ్రెసుకి ఆంధ్రదేశంనించి న్యాపతి సుబ్బారావు, మోచెర్ల రామచంద్రరావు, టంగుటూరి ప్రకాశం కూడావెళ్లినారు. తనకి అనుకూలుడైన రాస్ విహారీ ఘోష్ అధ్యక్షుడుగా వుండాలని మెహతా ప్రతి పాదించినాడు. కాదు, లాలా లజపతిరాయ్ వుండాలని తిలక్ గర్జించినాడు. తిట్టు కున్నారు, కొట్టుకున్నారు. కుర్చీలేకాదు కపర్దీ పాదరక్షలుకూడా ప్రయోగించడం జరిగినది. అతివాదులూ, మితవాదులూ చీలిపోయినారు. కాని, మితవాదులు కాంగ్రెసుని కట్టుదిట్టం చేసుకున్నారు. సుబ్బారావు, రామచంద్రరావు మితవాదులు. ప్రకాశం అతివాద పక్షపాతి. ఆంధ్రప్రతినిధులు చాలామంది అతివాదులే.

ఈ పరిస్థితులలో, 1908 కాంగ్రెసు మద్రాసులోనే, మితవాదిప్రతినిధి రాస్ విహారీ ఘోష్ అధ్యక్షతన జరిగినది. ఈ ఘోషలలో ప్రజల వీనులలో ప్రతి ధ్వనించినది ఒకే ఒక గంభీరకంఠస్వరం. లోకమాన్య బాలగంగాధర తిలక్ చేసిన నినాదం. "స్వరాజ్యము నా జన్మహక్కు". దేశంలో దౌర్జన్యవాతావరణానికి కారణం బ్రిటిషువారేనని ఆయనవాదన. తరవాత తిలక్ అరెస్టుకి మితవాదులు కారణం అని ఒకనమ్మిక.

వైస్రాయి కర్జను, 1904 లోనే పాకిస్థాను ఎల్లా వుంటుందో రుచి చూబించినాడు. మహమ్మదీయులు ఎక్కువగాఉన్న తూర్పుబెంగాలు ఒక రాష్ట్రం గానూ, హిందువులు ఎక్కువగావున్న పశ్చిమబెంగాలు మరోరాష్ట్రంగానూ విభజించి పరిపాలన సాగించినాడు. ఆ వేర్పాటు అప్పట్లో మహమ్మదీయులికీ నచ్చలేదు. హిందువులికీ నచ్చలేదు. ప్రభుత్వంతో మొరబెట్టుకున్నారు. వారికి వినబడలేదు. అలజడి చేసినారు. ప్రభుత్వాన్ని చీమైనాకుట్టలేదు. దేశవ్యాప్తమైన ఉద్యమం లేవదీసినారు. 'స్వదేశీ' అన్నారు; విదేశవస్తు బహిష్కారం అన్నారు; జాతీయ విద్య అన్నారు. ఆపదలో వున్నవారు 'అమ్మా' అంటారు. వంగదేశీయులు 'అమ్మా' అన్నారు. "అమ్మా, నమస్కారం." అన్నారు. "వందేమాతరం". సేతుశీతనగపర్యంతం భారతీయులందరూ "వందేమాతరం" అని ప్రతిధ్వనించి నారు. అది త్రింశత్కోటికంఠకలకలనినాదం అయినది. ఆ మాట వింటే ఉలిక్కి పడేవారు బ్రిటిషువారు. "వందేమాతరం" అనగానే వెర్రెక్కి పోయేవారు. "వందే మాతరం" అన్నది ఒకగీతం; మనజాతీయగీతం. ఆ నాడు కాదు. 'ఆనందమఠ' అనే బెంగాలీ నవలలో వున్నది. ఆ నవల వోసన్యాసులమఠం బ్రిటిషు ప్రభుత్వం మీద తిరుగుబాటు చేసిన కథ. ఆ నవల రచించిన మహానుభావుడు బంకించంద్ర ఛట్టోపాధ్యాయుడు. ఆ కథలో ఆ మహర్షి వ్రాసిన గీతం మహామంత్రమై భారతీయప్రజ స్వరాజ్యతపస్సులో మూలమంత్రమైనది. 'ఆనందమఠ' అన్ని

భాషలలోకి అనువదించినారు. ఆపిల్లబాలాదీ చదివినారు. వందేమాతర గీతం వల్లించినారు.

కాకినాడలో కెంప్ అనే జిల్లా డాక్టరు వుండేవాడు. ఆయన తన బంగాళా నించి ఉప్పుటేరుకవతల జగన్నాథపురంలో వున్న ఆసుపత్రికి వెడుతున్నాడు. కోపల్లె కృష్ణారావు అనే యువకుడు కెంప్‌దొర దారికి ఎదురుగా వస్తున్నాడు. దొర దగ్గిరికి రాగానే 'వందేమాతరం' అని కేక వేసినాడు. డమాను తాడులా మీసాలూ ఆయనా కెంపుదొర కొంచెం దుడుకుమనిషి. కోపధారి. సైకిల్ దిగి కృష్ణారావుని ఆ చెంపా ఈ చెంపా వాయించినాడు. రోడ్డుమీద అటూఇటూ నడుస్తున్నజనం ఇదంతా చూసినారు. దొరగార్ని ముట్టడించినారు. ఆయన తప్పించుకుని పారిపోయినాడు. జనం వెంబడించినారు. చావుతప్పి, కన్ను లొట్టబోయి దొరగారు ఇంగ్లీషు క్లబ్బులో దాక్కుని ప్రాణాలు కాపాడుకున్నాడు. పెద్దపేరయ్య, చిన్నపేరయ్య అనే ఇద్దరు సోదరులతోసహా ఇరవై మందిని అరెస్టుచేసి ఖైదులో పెట్టినారు. కుర్రవాణ్ణి కొట్టినందుకు కెంపుదొరకి జరిమానా వేసినారు. దీన్నే వందేమాతరంకేసు అనేవారు. అదే ఆంధ్ర దేశంలో మొదటి రాజకీయమైనకేసు ఆ కేసుతో తెలుగుదేశం అంటుకున్నది.

ఈ వేడిలో 1908, ఏప్రిల్ 3వ తారీఖుని బెంగాలులో ముజప్ఫరీపూరు నగరంలో ఇద్దరు ఆంగ్లేయస్త్రీలమీద ఎవరో బాంబు విసిరినారు. వారిద్దరూ మరణించినారు. ఖుదీరాం బోస్ అనే యువకుణ్ణి అరెస్టు చేసినారు; విచారించి మరణశిక్ష విధించినారు. ఖుదీరాం భగవద్గీత చేతులో పట్టుకుని ఉరిస్థంభం ఎక్కినాడు. భారతదేశ స్వాతంత్ర్యంకోసం తన ప్రాణాలు బలి ఇస్తున్నానని ఘోషించినాడు. స్వాతంత్ర్య సమరంలో ప్రాణాలు కోల్పోయిన తొలివీరుడు ఖుదీరాం బోసు. అతడు జాతీయ వీరుడైనాడు.

ముజప్ఫర్‌పూర్ ఉదంతం తర్వాత కొద్ది రోజులికే కలకత్తామహానగరంలో మానిక్‌తొలా ప్రాంతంలో ఒక యింట్లో బాంబులు తయారు చేసే కర్మాగారం పోలీసువారి కంటబడినది. ఆ యింటిమేడమీదే అరవింద ఘోష్ కాపురం వుండేవాడు. అరవిందుణ్ణీ, అతని సోదరుడు బీరేంద్రుణ్ణీ అరెస్టు చేసినారు. అప్పుడే ప్రాక్టీసు ప్రారంభించిన బారిస్టరు చిత్తరంజన్‌దాస్ ఘోష్ సోదరుల మీది కేసు ఫీజులేకుండా వాదించి ఇద్దర్నీ విడిపించినాడు. అటుతర్వాత అరవిందుడు ఆధ్యాత్మిక మార్గం అనుసరించి పుదుచ్చేరీలో ఆశ్రయం సంపాదించి ఆశ్రమం స్థాపించి, అక్కడే నిర్యాణం పొందినాడు. అప్పుడు పుదుచ్చేరి ఫ్రెంచిరాజ్యం. బ్రిటిష్‌వారి అధికారం అక్కడ చలామణీలో లేదు.

అదే కాలంలో సర్కార్ అనే వంగయువకుడు ఆంధ్రదేశం అంతా సంచారం చేసినాడు. సర్కార్ దౌర్జన్య విప్లవవాది. తెలుగువారికి కొందరికి బాంబులు చెయ్యడం నేర్పినాడు. గుంటూరులో ఉన్నవ లక్ష్మీనారాయణతో సహా కొందరు యువకుల్ని కలిసినాడు. విజయవాడలో అయ్యదేవర కాళేశ్వరరావుని కలిసినాడు. తెలుగుదేశంలో సర్కారుకిగాని, అతని దౌర్జన్య విప్లవవాదానికిగాని ఆట్టేబలం సమకూడినట్టు కనబడదు.

కాని తరవాత కొద్దిరోజులికే, గుంటూరుజిల్లా తెనాలి పొలిమేరలోవున్న కఠేవరం అనే గ్రామంలో ఒక బాంబు పేలినది. ఎవరికీ ప్రమాదం కలగలేదు. కోటంరాజు రాజేశ్వరరావునీ, మరో ఇద్దర్నీ అరెస్టుచేసినారుగాని, సాక్ష్యం లేనందున విడిచిపెట్టినారు.

1908 జులైలో తమిళనాడు తిరునెల్వేల్లిలో, జిల్లా మేజస్ట్రీటు యాష్ అనే తెల్లవాడిని, పట్టపగలు, రైలుస్టేషనులో ఎవరో తుపాకితోకాల్చి చంపేసినారు. చుట్టూమూగిన అమాయికప్రజమీద వో తెల్లపోలీసుఅధికారి తుపాకి కాల్చినాడు. ఇద్దరు నిర్దోషులు మరణించినారు. చిదంబరంపిళ్ళె, శంకరకృష్ణన్ అనే యువకుల్ని అరెస్టు చేసినారు. పిళ్ళెకి యావజ్జీవ ఖైదు విధించినారు. కృష్ణన్‌కి రెండుసంవత్స రాలఖైదు. ఈ ముద్దాయితరఫున వాదించినవారు, కొత్తగా బారిష్టరై వచ్చి, మద్రాసులో ప్రాక్టీసు ప్రారంభించిన టంగుటూరి ప్రకాశం. హైకోర్టులో ఆయన కదే మొదటి క్రిమినలుకేసు. ఈ దురంతం జరిగిన వార్త రాగానే, 'స్వరాజ్య' అనే తెనుగుపత్రిక సంపాదకీయం వ్రాసినది. ఈ పత్రిక మొదటిపేరు శ్రీ వేంకటేశ్వర. భక్తియోగంలోంచి, రాజకీయయోగంలోకి మారినది. అది ఆనాటి వాతావరణం. కొత్తపేరు పెట్టుకున్న పత్రికకి గాడిచర్ల హరిసర్వోత్తమరావు సంపాదకుడు. హరిసర్వోత్తమరావు తెలుగుదేశంలో ఆది రాజకీయ బాధితుడు. ఎం. ఏ. పరీక్షలో నెగ్గి, రాజమండ్రి ట్రెయినింగుకాలేజీలో ఎల్. టి. చదువుతున్నాడు. బిపిన్ చంద్రపాలు ఆ రోజుల్లో ఆంధ్రదేశసంచారం చేసినాడు. ఆ తరుణంలో కాలేజీ విద్యార్థులు 'వందేమాతరం' అని వ్రాసిన బిళ్ళలు చొక్కాలికి అంటించుకుని క్లాసులోకి వెళ్ళినారు. వారిలో రావు ఒకడు. తెల్లవాడైన ప్రిన్సిపాలు ఆ బిళ్ళలు తీసెయ్య మన్నాడు. రావు తియ్యలేదు. కాలేజీలోంచి బహిష్కరించబడినాడు. ఆయన రాయలసీమవాడైనా బెజవాడలో పరిస్థితులు అనుకూలంగా వుండడంవల్లనూ, మునగాలరాజా, కొమర్రాజు లక్ష్మణరావు, అయ్యదేవర కాళేశ్వరరావూ మద్రాసులో స్నేహితులు కావడంవల్లనూ ఆ నగరంలోనే వుండిపోయినాడు. 'స్వరాజ్య' పత్రిక సంపాదకుడుగావుండి, దేశసంచారంచేస్తూ, స్వరాజ్య సందేశం ప్రచారం చేస్తున్నాడు. 'స్వరాజ్య' భాగస్వాములు పింగళి లక్ష్మీనారాయణ, బోడి నారాయణ

రావు. పాల్ బెజవాడ వచ్చి వెళ్ళిన మర్నాడే ఈ పత్రిక కొత్తపేరుతో పునర్జన్మ ఎత్తినది.

తిరునెల్వెల్లిలో అన్యాయంగా ఇద్దరు నిర్దోషుల్ని చంపినారని హరిసర్వోత్తమ రావు సంపాదకీయం వ్రాసినాడు. "అరే, అరే, ఫిరంగిక్రూరవ్యాఘ్రమా, ఇద్దరు భారతీయుల్ని పొట్టని పెట్టుకొంటివిరా" అని గర్జించినాడు. ప్రభుత్వం పట్టుకున్నది. లక్ష్మినారాయణ పుదుచ్చేరి పారిపోయి, 1912 లో రాజకీయఖైదీల విడుదల వరకూ అక్కడే వుండిపోయినాడు. హరి సర్వోత్తమరావుకీ, బోడి నారాయణరావుకి కొన్నినెలలు ఖైదు విధించినాడు కెర్షాస్ప అనే పార్సీ సెషన్సుజడ్జి. చప్పిడిచప్పిడి దెబ్బలికి చావదురా ఈ పాము అని ప్రభుత్వం కక్షతో అప్పీలు చేసినది. కేసు హైకోర్టుకి పోయినది. ఒక తెల్లదొర విచారించినాడు. హరిసర్వోత్తమరావుకి మూడు సంవత్సరాలు కఠినఖైదు, నారాయణరావుకి తొమ్మిది నెలలు ఖైదూ విధించినాడు. తక్కువ శిక్ష విధించిన కెర్షాస్ప, పారశీవాడు, జాతీయాభిమానం కలవాడని, అతన్ని హోదా తగ్గించి, నరసారావుపేట సబుకలెక్టరుగా బదిలీ చేసినారు. ఈ కెర్షాస్ప కోటప్ప కొండకేసులో రాజీనామా ఇచ్చిన ఐ. సి. యస్. ఆఫీసరు.

హరిసర్వోత్తమరావుని అరెస్టుచేసిన రోజునే అటువంటినేరానికే, బొంబాయిలో బాలగంగాధర తిలక్‌ని అరెస్టు చేసినారు. తిలక్ 'కేసరి' పత్రికకి సంపాదకుడు. కేసరివలె గర్జించినాడు. బ్రిటిషువారి దుష్పరిపాలనికి ప్రతిఫలమే బాంబు అని వ్రాసినాడు. ఆరుసంవత్సరాలు శిక్షవేసి, రాత్రికిరాత్రి, పడవలో, బర్మాలోవున్న మాండలేజైలుకి రవానా చేసినారు. ఆ రోజుల్లో ఇండియా, బర్మా, సిలోను ఒక దేశంగా, ఒకే కేంద్రప్రభుత్వంకింద వుండేవి. కలకత్తా భారతదేశపు ముఖ్యనగరం.

ఆంధ్రదేశంలోకూడా కొన్నిపత్రికలు ఈ దౌర్జన్యవాదం సమర్థించినవి. బందరు 'కృష్ణాపత్రి'లో ముట్నూరి కృష్ణారావూ, 'నవయుగ' పత్రికలో చిల్లరిగె శ్రీనివాసరావూ చాలా తీవ్రంగా వ్రాసినారు. ఈ రెండు పత్రికలకీ ప్రభుత్వం వారంట్లు పంపినది. స్నేహితుడైన, శిడింబి హనుమంతరావు, గవర్నమెంటు ప్లీడరుగా వుండడంచేత ఆ కాగితాలు అణిచిపెట్టి, చర్య జరగకుండా చేసినాడు.

ఆంధ్రోద్యమ అంకురాలు కూడా 1908 లోనే మొలకెత్తినవి. ముఖ్యంగా, రాజకీయంగా గుంటూరు, బందరు పట్టణాలు మేలుకున్నవి. గుంటూరు 1904 వరకూ కృష్ణాజిల్లాలో భాగమే. శెనగపల్లి రామస్వామిగుప్త అనే ఉత్సాహవంతుడు, రెండో కాంగ్రెసుకే హాజరైనాడు. మొదటి కాంగ్రెసు బొంబాయిలో 1885 లో జరిగి నప్పుడు వున్నడెబ్భైఇద్దరిలోనూ ఆంధ్రప్రతినిధి పి. రంగయ్యనాయుడు ఒక్కడే.

రామస్వామిగుప్త గొప్ప దేశభక్తుడు. మిషనుకాలేజీలో గుమాస్తా. దేశానికంతకీ జాతీయకాంగ్రెసులాగ, దానిశాఖగా జిల్లాకి ఒక కాంగ్రెసు ఎందుకు వుండగూడదని, కృష్ణాజిల్లా కాంగ్రెసుసభ స్థాపించి అది గుంటూలో జరిపించినాడు. 1894 లో జరిగిన ఈ జిల్లాకాంగ్రెసు యావద్భారతదేశంలోనూ మొదటి ప్రాంతీయ సమావేశం. దీనికి అధ్యక్షుడు వావిలాల శివావధాని. ఈ గుంటూరు మహాసభ తర్వాతనే బందరులో కృష్ణాజిల్లా మహాసభ ఏర్పాటైనది. కొండా వెంకటప్పయ్య అప్పుడు బందరులో న్యాయవాదిగావుండెను. జిల్లాసభకి ఆయన కార్యదర్శిగా ఎన్నుకోబడెను. వెంకటప్పయ్య సభ ప్రచారంకోసం 'కృష్ణాపత్రిక' స్థాపించెను. అది గుంటూరు ప్రయత్నము. అప్పటికి కాంగ్రెసువారిలో కార్యవాది అయినవాడు గుంటూరువాసి రామస్వామిగుప్త.

ఒకసారి, గుంటూరుజిల్లా కేంద్రం అయిన తర్వాత గవర్నరు వచ్చినాడు. గవర్నరుసభలో గుప్త ఏదైనా అల్లరి చెయ్యగలడని సందేహించి ప్రభుత్వం అతన్ని ఏదోవిధంగా నిర్బంధించాలని నిశ్చయించినది. ఈ సంగతి ఎల్లాగో తెలుసుకున్న గుప్త అంతకుముందే అంతర్ధానమైనాడు. గవర్నరుగారి స్పెషలురైలు స్టేషనులో ఆగగానే, గుప్తకూడా గవర్నరుతోపాటు ఆ రైలే దిగి, కలెక్టర్నీ, ప్రముఖుల్నీ గవర్నరికి పరిచయం చేసినాడు. అంతా తెల్లబోయినారు. గుప్త బెజవాడవెళ్ళి, అక్కడే గవర్నరుతో ఏనకేనవ్యుపాయేనా పరిచయం సాధించి, గుంటూరు అధికార్లకి బురిడీ వేసినాడు.

అప్పటికే 1900 సంవత్సరంలో కొమఱ్ఱాజు లక్ష్మణరావు, మునగాలరాజా నాయని వెంకట రంగారావు, రావిచెట్టు రంగారావు, ఆదిపూడి సోమనాధరావు, మూడుముక్కలూ ఆరుచెక్కలూ అయిన మహాంధ్ర పునర్నిమాణానికి పునాదులు వేసినారు. ఆ పునాది శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయం అనే పేరుతో హైద్రాబాదులో పడినది. కాకతీయ సామ్రాజ్యానికి ఆటపట్టైన తెలంగాణసీమలో శ్రీకృష్ణదేవరాయలపేరు పెట్టడంలో ఔచిత్యం కానరాకపోవచ్చును. అది ప్రాంతీయ భావము. శ్రీకృష్ణదేవరాయల నామస్మరణ చేసినవారి ఊహ విశాలమైనది.

అదే హైద్రాబాద్‌లో లక్ష్మణరావు విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి స్థాపించినాడు. ఈ మండలి. 1907 లో కార్యక్రమం ప్రారంభించి, చరిత్ర, శాస్త్ర, సాహిత్య గ్రంథాలు ప్రచురించి తెలుగువారికి జ్ఞానబిక్ష పెట్టినది. ఈ సంస్థాపనలో సహాయపడిన ముఖ్యులు, రావిచెట్టు రంగారావు, మునగలరాజా, గాడిచెర్ల హరి సర్వోత్తమరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, ఆదిరాజు వీరభద్రరావు. ఆదిలో ఆంధ్రోద్యమం ఇటు చీకటి అంధకారంలోనూ కాక, అటు పట్టపగలు ఎండతీక్షంలోనూకాక చల్లని

వెన్నెలలో పురోగమించవలసి వచ్చినది. ఉద్యమం విజ్ఞానచంద్రికలలో నడిచినది. అది ఎక్కినబండికి రెండుచక్రాలు. ఒకటి గ్రంథం. రెండు గ్రంథాలయం. ఇది స్థాపించిన మహానుభావులందరూ, తెలుగునేల మూడుచెరుగుల్నించీ వచ్చినవారు; సేతువులు నిర్మించి మహాంధ్రకి మార్గదర్శకులైనారు.

1908 లో బందరులో 'ఆంధ్రమహాసభ' జరిగినది. ఆ సభ రాజకీయేతర విషయాలు చర్చించినది. ఏమిచర్చించినా, ఆంధ్రభావమే ఆ మహాసభకి బీజం. 1908 లోనే బందరులో ఆంధ్రజాతీయ కళాశాల సంస్థాపన జరిగినది. స్థాపించిన వారు భోగరాజు పట్టాభి సీతారామయ్య, కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణ రావు. ప్రారంభోత్సవానికి కొండా వెంకటప్పయ్య అధ్యక్షత వహించినాడు. 1908 లోనే గుంటూరులో జొన్నవిత్తుల గురునాథం 'ఆంధ్ర' అనే పత్రిక ప్రారంభించినాడు. బొంబాయిలో కాశీనాథుని నాగేశ్వరరావు, 'ఆంధ్రపత్రిక' స్థాపించినాడు. ఆంధ్ర శబ్దం ప్రచారంలోకి వచ్చినది. ఆంధ్రత్వానికి నామ రూపాలూ, వ్యక్తిత్వం కలిగినవి.

ఇరవైమూడు సంవత్సరాల జాతీయకాంగ్రెసు తీర్మానాల వొత్తిడివల్లనేమి, దౌర్జన్య రూపందాల్చిన జాతీయభావాల ప్రభావంవల్లనేమి, విదేశవస్తు బహిష్కారం వల్ల బ్రిటిషువారికి కలుగుతున్న నష్టంవల్లనేమి, ప్రభుత్వం 1909 లో మింటో-మోర్లే రాజకీయ సంస్కరణలు అమలు జరిపినది. బిగింపు కాస్త సళ్లినది. ఆ సంస్కరణల ప్రకారం, కేంద్ర ప్రభుత్వంలోనూ, మూడు ముఖ్యమైన రాష్ట్రీయ ప్రభుత్వాలలోనూ, ప్రత్యక్షంగా కాకపోయినా. పరోక్షంగానైనా ప్రజా ప్రాతినిథ్యం లభించినది. బ్రిటిషుఇండియా ప్రభుత్వానికి కంట్రోలు లండనులో వుండేది. ఇండియా కార్యదర్శికి ఒక సలహా సంఘంవుండేది. కొత్త సంస్కరణలప్రకారం, ఆ సలహా సంఘంలో ఇద్దరు భారతీయులు వుండడానికి ఏర్పాటు జరిగినది. వైస్రాయి కార్య నిర్వాహక వర్గంలో, ఒక భారతీయుడు వుండాలని నిశ్చయం అయినది. మద్రాసు, బొంబాయి, బెంగాలు రాష్ట్రాలలో ఒకో దేశీయుణ్ణి గవర్నరు కార్య నిర్వాహకవర్గంలో నియమించవచ్చు. రాష్ట్రశాసన సభలకి ప్రభుత్వనామినేషనుకాక, పరోక్ష ఎన్నికలు చేస్తామన్నారు. కొంతమంది సభ్యుల్ని మునిసిపాలిటీల, జిల్లా బోర్డుల ద్వారా ఎన్నుకుంటారు, ఆరు ఉన్నతోద్యోగాలూ, కొన్ని శాసన సభా స్థానాలు లభించినవి. ఇన్నాళ్లుగా కబడ్డీ ఆడినట్టు ఆడి, కూతపట్టి అలిసిపోయిన మహానాయకులు అదే మహాధనం అని సంతుష్టిపడి, పదవులు స్వీకరించి శాంతించి నారు. వాటిప్రకారం గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలకి మద్రాసు శాసనసభలో ఒకస్థానం లభించినది. అది మోచర్ల రామచంద్రరావుకి దక్కినది.

ఆంధ్రదేశంలో, ప్రవక్త, సంఘ విప్లవనాయకుడు, ఆధునికాంధ్ర సారస్వత నిర్మాత, రావుబహదూరు కందుకూరి వీరేశలింగంపంతులు అప్పుడే షష్ఠిపూర్తి చేసుకుని విశ్రాంతిదశలోకి వెళ్లనున్నాడు. ఆంధ్రభీష్ముడు, ఇంపీరియల్ కౌన్సిలు సభ్యుడు, 'హిందూ' పత్రికాసంస్థాపకులలో ముఖ్యుడూ అయిన న్యాపతి సుబ్బరావు పంతులు ఇంకా కాంగ్రెసు కార్యదర్శి కాలేదు. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు గుంటూరులో పెద్దన్యాయవాదిగా పేరుసంపాదించి, జాతీయకాంగ్రెసుకీ, ఆంధ్రోద్యమానికీ నాయకుడుకానున్నాడు. బారిస్టరు, త్యాగి, ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులు మద్రాసులో సుప్రసిద్ధన్యాయవాదిగా పైకివచ్చి, అతివాదిగా కాంగ్రెసుకి దగ్గిరా దూరమూకూడా కాకుండా వున్నాడు. మేధా సంపన్నుడు, వక్త వ్యవహర్త డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య, వ్యక్తులరోగాలేకాక, ఆంధ్ర జాతీయ అస్వస్థతకికూడా కారణాలు, చికిత్సా ఆలోచిస్తూ, బందరులో తనకార్య సాధనాచాతుర్యం ప్రకటిస్తున్నాడు. వంగ, మహారాష్ట్ర సంస్కృతులు ఆస్వాదించి ఆంధ్రవికాసానికి పునాదులు వేసిన కొమర్రాజు వేంకట లక్ష్మణరావు ఆంధ్ర తెలంగాణాలమధ్య రాయబారిగా విశాలాంధ్ర విజ్ఞాన చంద్రికలు వెదజల్లుతున్నాడు. దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు బొంబాయిలో తానుపెట్టిన దీపం 'ఆంధ్రపత్రిక' కొడిగట్టకుండా కాపాడుకుంటూ, దేశహితైషి కార్యకలాపాలకి ధర్మంచెయ్యడానికి ధనార్జన చేస్తున్నాడు. ఆంధ్ర పితామహ, పద్మభూషణ మాడపాటి హనుమంతరావు వరంగల్లులో విద్యాధికారి ఆఫీసులో గుమాస్తాగా వున్నాడు. నేటి స్వతంత్ర పార్టీనాయకుడూ, కిసాన్ ఉద్యమ సంస్థాపకుడూ, ఆచార్య గోగినేని రంగనాయకులు విద్యార్థిదశలో వున్నాడు. నీలం సంజీవరెడ్డి ఇంకా పుట్టలేదు.

లోకమాన్య బాలగంగాధర తిలక్ మహాశయుడు మాండలే జైలులో కర్మే ప్రధానమన్న గీతారహస్యరచన చేస్తున్నాడు. మోహనదాసు కరంచెందు గాంధీ దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహమంత్రప్రయోగం ప్రారంభించినాడు. మహాత్ముడు కాలేదు. ఆ మాహాత్మ్యం భారతావనికి ప్రచండతేజం కలిగించలేదు. అది సంధి, యుగసంధి.

ఇవి బ్రహ్మానందరెడ్డి జన్మించిన సంవత్సరం 1909 లో దేశీయ స్థితి గతులు.

---

# ఛాయమ్మ

పెద్దయింటి పెద్దాడబడుచు, గాదె ఛాయమ్మ. కాసు ఛాయమ్మగామారి. చిరుమామిళ్లలో పుట్టింటి గడపదాటి, పొలిమేరపక్కని తూబాడులో, పెద్దలుకట్టిన అత్తింట్లో అడుగు పెట్టగానే రథాలు మళ్ళినవి. ఇచ్చినవారికీ పుచ్చుకున్నవారికీ కూడా శుభోదయం అయినది. ముఖ్యంగా వెంకటకృష్ణారెడ్డి వైఖరిలో తీరుతెన్నులు రూపొందినవి. లోపలి స్వయంపాకం లోలోపలే పోయినది. భార్య స్వహస్తాలతో పక్వంచేసి, పక్కని కూచుని ఆపేక్ష అనురాగాలతో పెట్టిన పాకం రుచి తెలిసినది. తనలోంచి తాను బైట పడినాడు. లోకంకేసి కళ్ళు తెరిచి చూసినాడు. ఇదో కొత్త చూపు. ఆతురతలూ, అశాంతులూ అణిగిపోయినవి. దాంపత్యంలోవున్న మధురానుభూతితో ప్రపంచమే మధురమైనది. మనమేకాదు, ఇంకా చాలామంది వున్నారని గ్రహించినాడు. కచేరిచావిట్లో వున్నప్పుడు పాతమునసబులో కరణం వో కొత్తదనం గమనించినాడు. ముఖంలో వోఛాయా, మాటలో వో నిండుదనం, నడకలో వో వూపు. పొలం వెడుతోంటే ప్రజలంతా "అంతయ్య ఎంత మంచిగా మారిపోయాడు" అనుకున్నారు. అత్తింటి అచ్చట్లలో ముచ్చట్లలో వియ్యాల బిగువులు సళ్ళినవి. అడుగువేస్తే అత్తిల్లు. భార్య తనతో ఇదీ అని చెప్పదు; కాని ఆవిడ పద్ధతిలో తన అంతస్సు అర్ధమయేటట్టు చేస్తుంది. పెద్దబావమరదులు కొంత పెద్దవాళ్ళు, చిన్నబావమరిది వీరారెడ్డి చిన్నవాడు. చదువుసంధ్యలు లేకుండా తిరుగుతున్నాడు. బావగారితో చనువుగా వుండేవాడు. చిన్నవాడి తెలివితేటలు గ్రహించినాడు రెడ్డి. ఆమాటా ఈమాటా చెప్పి చదువుదారికి మళ్ళించినాడు. వీరారెడ్డికి పధ్నాలుగేళ్ళు. బావగారి ప్రోద్బలం, పెద్దక్క మందలింపు, చిన్నవాడు చురుగ్గా విద్యాబుద్ధులు నేర్చినాడు. నరసారావుపేట చదువుకి వెళ్ళినాడు.

ఇంట్లో ఛాయమ్మ వూరిపెద్దలికీ చిన్నలకీ ఆప్యాయురాలైనది. బీదవారికి ఆమె తల్లి; దిక్కులేనివారికి దిక్కు. ఒకపూట అన్నం లేదన్న బక్కవాడికి వడ్డించినది; తిండితిప్పలు లేవన్నగొల్లకి పనికల్పించి పోషించినది. ఇంట్లో పని వాడు పెద్దవాడైనాడు. పెళ్ళిపేరంటంలేదు. తాను కల్పించుకున్నది; సంబంధం కుదిర్చినది. తాలిబొట్టూ, మధుపర్కాలూ తానే కొని యిచ్చినది. పైగా పైఖర్చుకి పైకమిచ్చినది. అటువంటి ఆశ్రితులు ఎందరో!

ఈ దంపతులికి 1903 లో ప్రథమ సంతానం కలిగినది. కాసువారికీ గాదె వారికీ కూడా సంతానం అంటే సంతోషం. ఆ ప్రాప్తి వారివారి అన్నదమ్ములలో ఎ వొక్కరికో. ఛాయమ్మ పురుళ్ళన్నీ పుట్టింట్లోనే పోసుకునేది. తొలిచూలు మగ పిల్లవాడు. ఇలవేల్పుని తల్చుకుని వెంకటరెడ్డి అని నామకరణం చేసినారు. అటు తర్వాత త్వరగా వచ్చిన మలిచూలు ఆడపిల్ల. అంతా సంబరపడ్డారు. ఇచ్చిన దేవుడు మర్చిపోలేదు. మూడోకాన్పు మగపిల్లవాడు. 1907. మాతామహుడు వెంగళరెడ్డి పేరు పెట్టుకున్నారు. రెండు సంవత్సరాల తర్వాత జన్మించినవాడు బ్రహ్మానందరెడ్డి.

సంసారంలో ఆరితేరిన ఛాయమ్మకి తనపిల్లలేకాక ఇతరులపిల్లలన్నా ముద్దే. ఆవిడికి కొట్టంలో దూడ, పెరట్లో మొక్క, ఉయ్యాలలో పాప ఏకవత్సల బాంధవ్యం. ఆవిడ మంచితనం వూరివారికి లాభించినది. బీదాబిక్కా ఆశ్రయించే వారు, అవసరమైన సహాయం పొందేవారు. వూళ్లో పాటకజనంలో ఎవరి పెళ్ళి అయినా మంగళసూత్రం కాసువారింట్లోంచే వెళ్ళేది. మధుపర్కాల మామూలే. అందరి తెలుగుతల్లులలాగే ఆవిడకూడా అన్నపూర్ణమ్మే. వండడం, వడ్డించడం తెలుగుతల్లికి పరమానందం. కష్టంలో ఎవరొచ్చినా కాదనలేదు. బదులుచేసి వారి బాధ తీర్చేది. అదే పద్ధతిలో పెళ్ళిళ్ళకి సహాయం చేసేది. ఆ పెళ్ళివారు ఒకో సారి అమ్మగార్నికూడా తర్లి రమ్మనేవారు. వీలున్నప్పుడు వెళ్ళేది. ఇదంతా వెంకటకృష్ణారెడ్డి ఆమోదం పొందేది. ఆయనకి ఆనందం. మునసబుగారిలోగిలి అన్నసత్రం, అనాధశరణాలయం అయిందనుకునేవారు. వున్నది, పెద్దలు ఆర్జించి పెట్టినది; తాను ప్రయోజకత్వంతో పండిస్తున్నది నూటఏభైయకారాల భూదేవి. నిశ్శంకగా భార్య దానధర్మాలు చూసి సంతోషించేవాడు. దానివల్ల ఇహమూ పరమూ కూడా వున్నాయన్న విషయం అతనికితెలుసు. ఛాయమ్మపేరు చుట్టుపక్కలందరికీ తెలుసు. ఒకసారి ఆమె వోపెళ్ళివారితో దూరగ్రామం వెడుతున్నది. రాత్రివేళ దారిలో దొంగలు దోచుకోడానికి వచ్చినారు. పెళ్ళివారుగదా, నగానట్రావుండడం సహజం. బళ్ళవరస అంతా ఆగిపోయినది; జనం ఖంగారు పడుతున్నారు, ఎడ్లు బెదురుతున్నవి. ఏమిటంటే దొంగలన్నారు. తన బండిలోంచి ఛాయమ్మ ఒక్క

కేక వేసినది. "ఎవర్రావాళ్ళు?" దొంగలూ మనుషులే. వూళ్లోతిరిగేవాళ్ళే. ఈ దొంగలు ఛాయమ్మ చేతికూడు తిన్నవాళ్ళే! ఆవిడ కంఠస్వరం ఎరుగున్నవాళ్ళే. ఆవిడ తెలిసి కేకవెయ్యలేదు. అసలావిడ ధైర్యం, నిబ్బరం అంతటివి. దొంగలు విన్నారు, గుర్తెరిగినారు. ఛాయమ్మ బండిదగ్గిరికొచ్చి, దణ్ణంపెట్టి, "అమ్మా, మీ పెళ్ళివారని తెలియక బుద్దిగడ్డితిని వొచ్చాంతల్లీ?" అని చెంపలు వేసుకుని, పెళ్ళివార్ని, మరో దొంగలగుంపు కొట్టకుండా అడంగుదాకా సాగనంపి, ఛాయమ్మ దగ్గిర శెలవు తీసుకుని వాళ్ళదార్ని వాళ్ళు వెళ్ళిపోయినారు. ఇక్కడా అక్కడా కూడా మంచితనానికీ దానశీలానికీ మించిన బందోబస్తు లేదుకదా!

చిన్నన్నగారు చినవెంకయ్య పెళ్ళి చేసుకోలేదు. తండ్రీతల్లీ మేనమామ కూతురు పిచ్చమ్మని చేసుకోమంటూరు. ఈయన హోదాకి ఆవిడ చాలలేదు. మేన మామలు తగుమాత్రంవారు, తాను గాదెవారి చిన్నవాడు, మోతుబరి. ఛాయమ్మ కల్పించుకున్నది. పిచ్చమ్మని తీసుకొచ్చి తనదగ్గిర పెట్టుకుని, పెంచిపెద్దచేసినది. అది ఉభయతారకం. ఆవిడ ఆడపిల్ల మనసూ తీరింది, పిల్లా బాగుపడింది. నెమ్మదిగా ఆ మాట ఈ మాటా చెప్పి, చిన్నన్న మెడలు వొంగదీసి, పిచ్చమ్మ నిచ్చి పెళ్ళి చేసినది.

పెద్దకొడుకు వెంకటరెడ్డి ఎదిగినాడు. అయిదోయేట అక్షరాభ్యాంచేసి వూళ్ళోనే మాగంటి రామమూర్తి అనే సద్బ్రాహ్మణుడి దగ్గిర తెలుగు చెప్పించినారు. రామమూర్తి వూళ్ళో అందరికీ దస్తావేజులూ అవీ రాసిపెడుతూ వుండేవాడు. మంచి దస్తూరి. విద్య అంటే చెవికోసుకునేవాడు వెంకట కృష్ణారెడ్డి. కొడుకు చదువు సంధ్యలు తల్లిదండ్రులిద్దరూ శ్రద్ధగా చూసేవారు. పిల్లవాడు చురుకైనవాడు. పైకి రాగలడు. ఇంతలో నరసారావుపేటలో వీరారెడ్డి చదువు పూర్తి అయినది. అప్పుడా వూళ్ళో మూడోఫారందాకానే విద్యాసౌకర్యాలు వుండేవి. పైచదువుకి గుంటూరు వెళ్ళవలసి వచ్చింది. మేనమామ వీరారెడ్డినీ మేనల్లుడు వెంకటరెడ్డినీ వెంకట కృష్ణారెడ్డి గుంటూరు పంపించినాడు. రెండు సంవత్సరాలకి వీరారెడ్డి అయిదో ఫారందాకా వచ్చినాడు. చదువు చాలా బాగా వచ్చినదిగాని వయసు ముదిరినది. పాతికసంవత్సరాలు. అతనికి చదువుకోవాలని వున్నది, అప్పకీ బావకీ చెప్పిం చాలని వున్నది. ఇంతలో కడపలో ఏదో పెళ్ళి వచ్చినది. గాదెవారూ, కాసువారూ కూడా తర్లి వెళ్ళినారు. ఆ వివాహసందర్భంలో, ఒక పొడుగాటి, ఎర్రని యువకుడు టాకుటీకుగా తిరుగుతున్నాడు. పిల్లాపెద్దా, ఆడామగా ఆయన్ని పలక రించి మాట్లాడుతున్నారు. ఆ యువకుడి అందచందాలూ, ఠీవీ, షోకూ చూసి వీరారెడ్డికి కూడా ఆకర్షణ కలిగినది. ఆ అబ్బాయి అప్పుడే ఇంగ్లండులో చదువు పూర్తిచేసి వచ్చినాడనీ, బారిష్టరనీ తెలిసినది. ఇద్దరికీ చనువైనది. వీరారెడ్డి తెలివి

తేటలూ, ఉత్సాహం చూసి ఇంగ్లండబ్బాయి సలహా చెప్పినాడు. ఎన్నాళ్లు ఈ దేశంలో చదివితే నువ్వు పైకి రాగలవు, ఇప్పటికే పాతికేళ్ళు నిండిపోయాయి. ఇంకో అయిదేళ్ళు చదివి, ప్యాసు అయితే బి.ఏ. డిగ్రీ వొస్తుంది; తర్వాత బి.ఎల్. రెండేళ్ళు; మొత్తంఏడేళ్ళు, అప్పటికి నీకు ముప్పైరెండేళ్ళు నిండుతాయి. ఇంగ్లండు వెడితే మూడు నాలుగు సంవత్సరాలలో అన్నీ పూర్తిచేసుకు రావచ్చు" అని సలహా ఇచ్చినాడు. సలహాచెప్పిన యువకుడి పేరు కడప కోటిరెడ్డి.

కోటిరెడ్డి చెప్పిన సులువు గ్రహించిన యువకులు ఆనాడాంధ్రదేశంలో చాలా మంది వున్నారు. గుంటూరుజిల్లానించికూడా చాలామంది ఇంగ్లండు వెళ్ళినారు. కొందరు తిరిగిరాగా ఇంకాకొందరు ఇంగ్లండులోనే వున్నారు. అటువంటివారే నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావు, ఉన్నవ లక్ష్మీనారాయణ, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, పంగులూరి సుబ్బారావు. ఈ సంగతులు కోటిరెడ్డి చెప్పగానూ విన్నాడు, ఇతరత్రాకూడా తెలుసుకున్నాడు వీరారెడ్డి. కొత్తదారి దొరికినది. ఇంటికి వచ్చి అప్పగారితో ప్రస్తావించినాడు. "మీబావనడుగు" అన్నది. వీరారెడ్డికంటె ముందే భర్తతో తమ్ముడి అభిలాష తెలియజేసినది. అడగ్గా బావగారి జవాబు, "ముందు మీనాయన్ని కదిలించి చూడు".

అమ్మకీ అబ్బకీ ధనలోపం ఏమీ లేదు. లోభం కూడా లేదు. కొంచెం అబ్బాయి మీద ఆపేక్ష అధికం. అందుకనే పెద్దబ్బాయిలల్లావున్నారనుకుంటాడు అల్లుడు. తల్లిదండ్రులు ఆ సంగతులెత్తలేదు. ఒకటే పెద్ద అడ్డంకి. ప్రథమ ప్రపంచ మహాసంగ్రామం ప్రారంభం అయినది. ఇంగ్లండుకీ జర్మనీకీ విరోధం. ఎందుకనో భారతీయుల మొగ్గు జర్మనీ వేపే వుండేది. మన్ని పరిపాలిస్తున్నారు గనక బ్రిటిషు వారిమీద కొంచెం, కాదు చాలా అయిష్టం. అయినా దారిద్ర్యంవల్లనో, అధికారుల పోరువల్లనో చాలామంది భారతీయులు యుద్ధభటులుగా చేరి బ్రిటిషువారి తరఫున యుద్ధంచేసి, ప్రాణాలు అర్పించినారు, గాంధీజీకూడా వారికి సహాయం చేసినాడు. అప్పుడు విమానాలు లేవు; విమానదాడులూ, పైనించి బాంబులువెయ్యడాలూ లేవు. ఎంతసేపూ యుద్ధం భూమిమీదా, సముద్రంలోనూ. బ్రిటను ప్రపంచంలోకల్లా పెద్ద నౌకాబలంవున్న దేశమనిపేరు. నీటిమీదేకాక నీటిలోపలకూడా యుద్ధం జరిగేది. జలాంతర్గామి నౌకలు వుండేవి. సబ్‌మెరీన్ అంటారు. ఈ జలాంతర్గాములలో జర్మనీ పేరు మోసింది. వీటిని అన్ని సముద్రాలలోనూ తిప్పేవారు. 'ఎండెన్' అనే సబ్‌మెరీను చెన్నపట్నం దగ్గర సముద్రంలోకి వొచ్చి వో బాంబు వూరిమీదికి విసిరింది. దాని పెంకులు హైకోర్టు ప్రహరీగోడకి తగిలి పగలగొట్టినవి. ఆ తగిలిన చోట ఆ విషయం జ్ఞాపకంచేస్తూ ఒక శిలాఫలకం వేయించినారు బ్రిటిషువారు. ఎండెన్ అంటే హడలు. ఉద్దండులైనవార్ని చూస్తే ఎండెన్ అనేవారు. "ఇటు

వంటి యుద్ధసమయంలో ఏం వెడతావు, ఏం చదువుతావు, వొద్దు" అన్నారు, వీరా రెడ్డి పెద్దలు. బావ వెంకటకృష్ణారెడ్డి కల్పించుకుని తానే స్వయంగా డబ్బిచ్చి, వీరారెడ్డిని ఇంగ్లండు పంపించినాడు.

ఇంటిదగ్గిర రెండోకొడుకు వెంగళరెడ్డికి ఏడేళ్లు వొచ్చినా బళ్లోకి వెళ్లకుండా మొరాయిస్తున్నాడు. కొంచెం దుందుడుకువాడు. ఎంతసేపూ ఆటలు, అల్లరి. కాస్త చెయివాటుతనంకూడాను. తానొక్కడూ చాలక తమ్ముడు బ్రహ్మానందాన్నికూడా తోడవేదంకింద లాక్కుపోయేవాడు. ఎప్పుడోవొచ్చి రెండుమెతుకులు తినేసి మళ్లీ పారిపోయేవారు. ఏవేళకో నిద్రముంచుకొస్తే ఇంటిముఖం పట్టడం. లేస్తూనే బ్రాహ్మణవీధికి నడవడం. అప్పుడు తూబాడులో పదిపన్నెండు వైదీకి గడపలూ, పదిపదిహేను నియోగిలోగిళ్లూ వుండేవి. ఆ వీధి పిల్లల్తో స్నేహం ఈ చిన్న రెడ్లకి. పొలాలమ్మటా, గట్లమ్మటా తిరగడం, ఎండనక వాననక ఆగమ్మకాకుల్లా తిరిగేవారు. ఛాయమ్మ కొన్నాళ్లు చూలింత. తరవాత బాలెంత. అటుతర్వాత చంటిపిల్లతల్లి. ఈ మాటు ఆవిడ మనసుతీరి ఆడపిల్ల పుట్టినది. పేరు మాణిక్యమ్మ. తండ్రి పని మీద కచేరీ చావిడికీ, పొలానికీ వెళ్లేవాడు. ఈ సందు చూసుకుని ఈ సుందోప సుందులు చాంద్రాయణం చిత్తగించేవారు. ఇద్దరికీ వయసులో ఆట్టే తేడాలేదు; కవలల్లా వుండేవారు. చిన్నవాడు కాస్త నెమ్మది; పెద్దవాడు దురుసు. కానైతే యుద్ధంలో ఒకరికి ఒకరు తీసిపోయేవారు కారు. ఎంత సయ్యోధ్యో అంత వైరం. ఏదో చిలిపితగాదా, ఢాం, ఢీం, ఢాం, ఢీం, గుద్దుకోడం, తన్నుకోవడం, కిందపడి దొర్లడం, కుస్తీ, మల్లయుద్ధం. వీధి వాకిట్లోపడి కొట్టుకుంటోంటే, ఇంట్లో పని చేసుకునే తల్లి ఏం చేస్తుంది? ఇంట్లోవున్నప్పుడు తండ్రి, తన కొడుకుల మల్లయుద్ధ ప్రావీణ్యం చూసి సంతోషించేవాడు, పకపక నవ్వేవాడు. కొంచెం వయసువచ్చి క్రమశిక్షణ అలవడేవరకూ ఈ మల్లయుద్ధ కార్యక్రమం జరుగుతూనే వుండేది. పెద్ద అన్నగారు వూళ్లో వుంటే సద్దేవాడు.

ఈ వీరులిద్దరూ ఒకప్పుడు వూళ్లో వున్నారాలేరా అనికూడా వెతుక్కోవలసి వచ్చేది. తాతగారింట్లోనూ ఇక్కడాకూడా వీళ్ళే పిల్లలు. అందుకని అక్కడా ఇక్కడాకూడా వుండేవారు. నాలుగడుగులేసి వాగుదాటితే అమ్మమ్మగారివూరు. వీరిప్రతాపం అక్కడకూడా ప్రసిద్ధే. చద్దిఅన్నం ఇక్కడ తింటే మధ్యాహ్నం భోజనం అమ్మమ్మగారింట్లో. ఏరిరా వీళ్ళు అని వీధులు వెతికితే ఏ జీతగాడో చెప్పేవాడు "చిన్నదొరలు చిరుమామిళ్ల చిత్తగించినా"రని.

ఒకరోజుని పొట్టేళ్ళపోటీ మరీ తీవ్రంగా సాగుతోంది. తల్లి మండలిస్తోంది; ఇంతలో తండ్రి వచ్చినాడు. ముష్టియుద్ధం తిలకించినాడు. సంతోషించినాడు. మర్నాడు మాగంటి రామమూర్తికి కభురు వెళ్ళినది. ఆయన వచ్చినాడు. మంచి

ముహూర్తంచూసి ఇద్దరికీ అక్షరాభ్యాసం ఒకేమాటు చేసి, రామమూర్తికి అప్పజెప్పి నాడు తండ్రి. రామమూర్తి బడి గొడ్లకొట్టంలో వుండేది. అది వెంకటకృష్ణారెడ్డి ఏర్పాటు చేసినదే. ఓనమాలతో ప్రారంభించి, పెద్ద బాలశిక్షతో పెంచి, రామమూర్తి చిన్నరెడ్లిద్దరకీ క్షుణ్ణంగా తెలుగూ, లెఖ్ఖలూ నూరిపోసినాడు. అల్లరి ఎంతచేసినా, ఆటలెన్ని ఆడినా పిల్లలికి చదువు అంటుతూనే ఉన్నది. ఇంతలో వీళ్ళకితోడు ఇంకో తమ్ముడు పుట్టినాడు. పితామహుడి పేరిట పాపిరెడ్డి అని నామకరణం చేసినారు. ఛాయమ్మకది కడసారి కానుపు.

పందొమ్మిది వందల పదిహేడులోగావును వూళ్లో కేథలిక్కులకీ తక్కిన వాళ్ళకీ తగాదాలు బయలుదేరినవి. ఆంబోతులు పోట్లాడుతోంటే లేగదూళ్ళ కాళ్ళు విరిగినట్టు, ఎవరో మాగంటి రామమూర్తి పూరిల్లు తగలబెట్టినారు. ఆ బీదబ్రాహ్మ ణుడు అవస్థపడుతోంటే వెంకటకృష్ణారెడ్డి స్వయంగా పెంకుటిల్లు వేయించి పెట్టినాడు.

వూళ్ళోనే సింగపాటిచౌదర్ల కుటుంబం వుండేది. వారు ఒకప్పుడు కలవారు కాని చితికిపోయినారు. వెంకటసుబ్బయ్య అనే కుర్రవాడు, బుద్ధిమంతుడు వున్నాడు. కొంచెం హెచ్చుతగ్గు వెంగళరెడ్డి ఈడువాడు. ఆ అబ్బాయిని చేరదీసి, చదువు సంధ్యలు చెప్పించినాడు వెంకటకృష్ణారెడ్డి. తరవాత ముక్త్యాల జమీందార్లు, చల్లపల్లి వారూ ఆయన పైచదువుకి ఆదుకున్నారు. ఆయనే సి. వి. సుబ్బయ్యచౌదరి; ఈమధ్యనే పంచాయతీ శాఖలో ఉన్నతోద్యోగంచేసి పింఛను పుచ్చుకున్నాడు.

పిల్లలికి ఇంగ్లీషుకూడా ఇప్పట్నించీ చెప్పించాలని, రుద్రూరుపాడునించి హనుమంతరావనే యువకుణ్ణి పిలిపించినాడు తండ్రి. ఆ చిన్నవాడు ఏ స్కూలు ఫైనలుదాకానో మాత్రం చదువుకున్నాడు. తొమ్మిదినెలలపాటు ఇంగ్లీషుపాఠాలు చెబుతూవుండేవాడు. గుంటూరునించి పెద్దబ్బాయి వెంకటరెడ్డి సెలవులికివచ్చి ఇంటి దగ్గరే వున్నాడు. అప్పుడతను స్కూల్‌ఫైనలు చదువుకుంటున్నాడు. హనుమంత రావు పంచలో పిల్లలిద్దరికీ పాఠాలు చెబుతున్నాడు. 'గ్రాస్‌హాపర్' అనే మాట వొచ్చినది. 'గ్రాస్' అంటే గడ్డి, 'హాపర్' అంటే కోసేవాడు అని ప్రతిపదార్థం చెప్పినాడు గురువు. వెంకటరెడ్డి విన్నాడు. 'గ్రాస్‌హాపర్' అంటే గడ్డిమీద ఎగిరే సీతాకోకచిలుకలాంటి పురుగు. పంతులికి తెలియదు పాపం. వెంకటరెడ్డి తండ్రితో చెప్పినాడు, ఆ కుర్రవాడికి ఇంగ్లీషురాదని. అప్పుడు హనుమంతరావుకి స్వస్తిచెప్పి చీరాలనించి గోపాలకృష్ణయ్య అనే ఆయన్ని పిలిపించినారు. ఆయన పొట్టిగా, లావుగా గూటంలా వుండేవాడుగాని ఇంగ్లీషుపాఠాలు బాగానే చెప్పేవాడు.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది. బ్రహ్మానందానికి పదేళ్ళుంటాయేమో ! వోనాడు ఇంటికి వచ్చేసరికి, వీధి వాకిట్లో వో మనిషిని తాళ్ళతో స్థంభానికి కట్టి

వుంచారు. ఎందుకల్లా కట్టేశారని అడిగినాడు. తండ్రి గ్రామమునసబుకదా! థిలేజి మేజిస్ట్రీటుకూడా. కట్టేసిన మనిషి, ఎవరిదో మేకని దొంగిలించాడనీ, అందుకని శిక్ష వేశారనీ చెప్పారు. "చూడండి, వాడివొళ్ళు ఎంత రాసుకుపోతోందో తాళ్ళతో, పాపం, విప్పెయ్యండి" అన్నాడు. పక్కనున్న వెట్టివాడు వినలేదు. "విప్పుతావా, నిన్ను కట్టెయ్యనా" అని బెదిరించినాడు. చివరికి, ఎల్లాగైతేనేం, కట్లువిప్పించి నాడు. తల్లి తగ్గరికివెళ్ళి, 'అమ్మా, వాడికి అన్నంపెట్టు, ఎంత ఆకలేస్తోందో, పాపం, అన్నాడు. తను తినవలసిన వరి అన్నం వాడికి పెట్టించి తాను ఇంట్లో మిగిలిన జొన్నన్నం తిన్నాడు. ఆ రోజుల్లో, కాసువారి యింట్లోతప్ప, ఆ వూళ్ళో ఎవరింటోనూ, వరి అన్నం తినేవారుకారు. అంతా జొన్నన్నమే.

పాతాలు చురుగ్గా అప్పజెప్పేవాడు. వెంగళరెడ్డి వెనుకబాటుగా వుండేవాడు. బ్రహ్మానందం 'వట్టి మాటల పుట్ట'. ఈనాడు ఎంత మాట్లాడడో, చిన్నతనంలో అంత పలికేవాడు.

పిల్లలు వృద్ధిలోకి వస్తున్నారు. ఇంగ్లండు వెళ్ళిన వీరారెడ్డి కూడా చక్కగా చదువుకుంటున్నాడు. ఆతను బారిస్టరీ ఒకటేకాక ఏవో డిగ్రీలూ పి. హెచ్. డి. కూడా సాధించాలని ప్రయత్నిస్తున్నాడు. ఈలోపుగా 1918 నవంబరు 11వ తారీఖుని పదకొండు గంటల 11 నిమిషాలికి యుద్ధం ఆగిపోయినది. లోకంతో పాటు ఇండియాకూడా నిట్టూర్చినది. యుద్ధభయం పోయింది వీరారెడ్డి ఎన్నాళ్లైనా అక్కడే వుండవచ్చునని పెద్దలు సంతోషించినారు. కాని వీరారెడ్డి ఆరోగ్యం చెడి పోయినట్టు ఉత్తరం వచ్చినది. అప్పుడు విమాన టపాలుగాని, లండనుకి ఇండియానించి టెలిఫోను సౌకర్యాలుగాని లేవు. వోడమీద ఉత్తరాలు ఇరవై రోజులు పట్టేవి. చిన్నవాడికి సంభవించిన వ్యాధి క్షయ. విశ్రాంతీ, ఆహారం, శరీరాన్ని బలపర్చి వ్యాధి లొంగదీసుకోడమేతప్ప, ప్రత్యేకంగా క్షయకి మందులు వుండేవికావు. పరిస్థితి క్షీణించగా వీరారెడ్డిని పడవ ఎక్కించినారు. అతను దారి లోనే పడవలో ప్రాణాలు విడిచినాడు. సముద్రసమాధి చేసినారు. చిరుమామిళ్ల లోనూ, తూబాడులోనూకూడా ఈ దుర్వార్త విపరీత విషాదం కలిగించినది. వారు అనలేదుగాని, వెంకటకృష్ణారెడ్డి తనలోతను అనుకున్నాడు, "నేను వొద్దంటోంటే పంపించానుగదా, బతికిబట్టగట్టి పైకివస్తాడనుకుంటే ఇల్లా అయిందని" బాధపడ్డాడు.

యుద్ధంవల్ల కలిగిన ఆస్తి జననష్టం అల్లావుండగా యుద్ధానంతర భీభత్సం లోంచి ఒక మహామారివంటి విషజ్వరం ఉద్భవించినది. దానిపేరు ఇన్‌ఫ్లూయంజా అన్నారు. ఆ జ్వరం ప్రపంచం అంతా వ్యాపించినది. కొన్ని లక్షలమంది జనం మరణించినారు. ఆ జ్వరం ఇండియా మీదకూడా పడినది. గుంటూరు వచ్చినది.

జిల్లాలో వ్యాపించి, తూబాడు ప్రవేశించినది. కాసు వెంకటకృష్ణారెడ్డి మంచం పట్టి నాడు. మళ్ళీ లేవలేదు. తనుకన్న పిల్లలూ, భార్యా, అత్తింటివారూ అంతా వున్నారు. అవసానకాలంలో భార్యని దగ్గిరికి పిలిచినాడు. అందరూ వింటూండగా చేతిలోచెయ్యివేసి చెప్పినాడు: నా కొడుకులందరూ బి.ఏ., బి.ఎల్., పట్టాలుపొంది, ప్లీడర్లు కావాలి. అవసరమైతే భూమి అమ్మేసి అయినా వాళ్ళకి చదువు చెప్పించు అన్నాడు. చుట్టూమూగిన బిడ్డల్ని చూసినాడు; పిల్లాపాప ఒక్కసారి 'నాయనా' అని ముందుకి వొరిగినారు, 'ఆః' అన్నట్టు నోరు తెరిచినాడు. అంతే. ఇంట్లో వుండి ఎంత ఆరిందా వ్యవహారం నడిపినా, ఆగర్భ శ్రీమంతురాలై ఎండకన్నెరు గని భార్య ఛాయమ్మ, ఇంతాఅంతా ఆరుగురు సంతానం, విశేషబంధువర్గం, వీరి నందర్నీ విడిచిపెట్టి వెళ్ళిపోయినాడు. వెంకటరెడ్డికి 16 సంవత్సరాలు; చదువులో చురుకేగాని, సిగ్గుపడే స్వభావం కలవాడు. రెండవవాడు వెంగళరెడ్డికి 12; ఈ దురుసుతనంతగ్గి పెరిగి పెద్దవాడు కావాలి. మూడు బ్రహ్మానందం 10. నెమ్మదైనవాడే, పుణ్యపురుషుల జోస్య ఆశీర్వచనబలాలు వున్నవాడు, వాళ్ళు చెప్పిన రాజ్యం ఎప్పటికేల్తాడో ? ఆడపిల్లకి అప్పుడే అయిదేళ్లు వెళ్ళినవి. చంటివాడు 3; తల్లిచాటువాడు. పోయిననాటికి వెంకటకృష్ణారెడ్డికి 45 సంవత్సరాలు నిండలేదు.

కాసువారి పూర్వులు తూబాడు ప్రవేశించి స్థిరపడ్డ తర్వాత, తమ సొంత స్థలంలో కొంతకేటాయించి మిషనరీలకిచ్చినారు. అందులో వోచిన్న చర్చి. దాని పక్కనే పాదిరీలు వుండడానికి వసతీ ఏర్పాటైనవి. చర్చి చిన్నది కావడంచేత సరి పోలేదు. దానికి మించుమలె వూరిబయట విశాలంగా కొంతచోటు కాసువారే మళ్ళీ మిషనరీల కిచ్చినారు. ఆ స్థలంలో వారు పెద్దచర్చి నిర్మించినారు. పాత ఆలయం స్థలం వీరికి విడుదల చేసినారు. ఈ ఆలయం కాసువారిలోగిలికి చాలాదగ్గిర. అందులో పుణ్యవేదిక అల్లాగే వున్నది. ఆ ఆల్టార్ ముందుగా సమాధి చేసినారు వెంకటకృష్ణారెడ్డిని. పాదిరీలు ఇది ఒక గౌరవంగా మేము హిందువైన రెడ్డికి సమర్పిస్తున్నామన్నారు. తర్వాత ఆ ఆలయం, తోటా, పక్కని విశ్రాంతివసతీ, కొడుకులు "కాసు వెంకటకృష్ణారెడ్డి స్మారక ఉద్యానవనం"గా ప్రజలపరంచేసినారు.

# గుంటూరు

శుభంశుభం ఎరగని ఆరుగురు పిల్లల్ని అప్పజెప్పి అకాలమరణం పొందిన మొగుడికోసం ఒకవేపూ మొగుడిప్రోద్బలంతో విదేశాలకెళ్ళి తిరిగి యింటికి రాకుండానే నడిసముద్రంలో ప్రాణాలు విడిచిన తమ్ముడుకోసం వోవేపూ పుట్టెడు దుఃఖంలో మునిగిపోయిన ఛాయమ్మ, ఆ పిల్లల్ని చూసుకుని, వాళ్ళకోసమే జీవాలు కాపాడుకుంటున్నది. అన్నలిద్దరూ వస్తూపోతూ, యోగక్షేమాలు కనుక్కుంటూనే వున్నారు. అయినా ఈ బాధ్యతా, ఈ భారం తానే స్వయంగా భరించవలసిన అవసరం ఆవిడ గ్రహించినది. పిల్లలకేమీ తెలియదు. పెద్దవాడు కొంచెం జ్ఞానం తెలిసినవాడు, ఆలోచనాపరుడు. రెండోవాడూ మూడోవాడూ అంతా చూస్తోనే వున్నారు. 'నాయన' దగ్గర మాలిమి. కొన్నాళ్ళు దిగాలుపడినారు. కాలుగాలిన పిల్లుల్లాగ వూరంతా తిరగడం. చివరికి క్రమేణా ఆటల్లో మర్చిపోయారు. చిన్న పిల్లలిద్దరూ 'నాయనా' అంటే, తన దుఃఖం దిగమింగుకుని ఏవో కల్లిబొల్లి కబుర్లు చెప్పేది. మొగుడు అవసానకాలంలో చెప్పిన అప్పగింతల మాటలు మాత్రం ఆవిడ యావజ్జీవం మర్చిపోలేదు.

అంత్యక్రియల తర్వాత వెంకటరెడ్డి గుంటూరు వెళ్ళిపోయినాడు. ఆయేడు స్కూలుఫైనలు పరీక్షలో కృతార్థుడై కాలేజీలో చేరవలసివున్నది. తల్లీకొడుకూ ఆలోచించుకున్నారు. చిన్నవాళ్ళని ఇద్దర్నీకూడా గుంటూరులోనే బళ్ళోవేస్తే అన్నగారిచాటుని చదువుకుంటారు. ఇంటిదగ్గిరవుంటే చెప్పినమాట వినకుండా చెడిపోతారనుకున్నారు. ఆలోచన కార్యరూపం దాల్చినది. కొడుకులు ముగ్గుర్నీ గుంటూరు పంపినది. ఏ హోటలులోనోవుంటే వాళ్ళకి తిండిసౌఖ్యం వుండదని రైలుపేటలో ఇల్లు అద్దెకు తీసుకుని వంటవాళ్ళనీ పనిమనుషుల్నీ పెట్టి, వాళ్ళ సౌఖ్యమే పరమావధిగా వ్యవహరించినది.

వెంకటరెడ్డికి అప్పటికే స్కూలులో మంచి పేరున్నది. అతని తమ్ముళ్ళు తెలివైనవాళ్ళు కాకపోరని పంతుళ్ళు ముందే అనుకున్నారు. అందులో అబద్ధమూ లేదు. ఇంటిదగ్గిరపంతుళ్ళు రామమూర్తి తెలుగూ, లెఖ్ఖలూ, గోపాలకృష్ణయ్య ఇంగ్లీషూ బాగానే చెప్పినట్లున్నారు. ఇద్దర్నీ పరీక్షచేసి మూడోఫారంలో చేర్చుకున్నారు.

బ్రహ్మానందం మొదట ప్రవేశించిన పాఠశాల ఎ. ఇ. ఎల్. ఎమ్. హైస్కూలు. అమెరికన్ ఎవాంజెలికల్ లూథరన్ మిషను హైస్కూలు. దీనిపక్కనే కాలేజీకూడా వున్నది. అదే ఇప్పుడు ఆంధ్రా క్రిస్టియన్ కాలేజీ. కాలేజీ ప్రిన్సిపాలు డాక్టర్ జె. రాయ్-స్ట్రాక్. ఆయనకి ఒకటే కన్ను. ఎంతో ఉత్సాహవంతుడు. పిల్లలంటే ఆపేక్ష; ఆటలంటే ఇష్టం. అమెరికానించి బేస్‌బాలుఆట తీసుకువచ్చి పిల్లలికి నేర్పినాడు. ఇంగ్లండులో ఫుట్‌బాలులాగ, అమెరికాలో బేస్‌బాలు ప్రజలకిష్టం. ఇవిగాక టెన్నిస్, హాకీవంటి ఆటలుకూడా ప్రోత్సహించి, కుర్రవాళ్ళని వ్యాయామంలోనూ, విద్యాసాధనలోనూ కూడా పైకి తీసుకువచ్చేవాడు. ఎన్నాళ్లైనా తనదగ్గిర చదువుకున్న పిల్లలపేర్లు జ్ఞాపకం పెట్టుకునేవాడు. ఆనాటికీ ఈనాటికీ కూడా గుంటూరుచుట్టుపట్ల కనపడే పెద్దకట్టడం కాలేజీ టవరే. హైస్కూలు హెడ్‌మాస్టరు వలబర్ల చినజాన్. ఈయన చాలామంచివాడు, సరదామనిషి. జస్టిసుపార్టీ ప్రాబల్యంతో రాజకీయాలలో ప్రవేశించి శాసనసభ్యుడు అయినాడు. టెన్నిస్ అంటే ఈయనికి ఇష్టం. ఒక బ్రాహ్మణ వితంతువుని వివాహం చేసుకున్నాడు. ఇంగ్లీషు భాషలో అంతప్రావీణ్యం లేదు. ఆయన ప్రయోగాలు పిల్లలికే నవ్వువచ్చేవి. అంతా చెప్పుకునేవారు. ఆయన అమెరికా వెడుతున్నాడు. ఆ సందర్భంలో వో సభ జరిగినది. అందులో అన్నాడు. "I am going to the other world" "నేను పరలోకానికి పోతున్నాను" అని అర్థం.

బ్రహ్మానందానికి ఒకమాదిరి నగరంలో ప్రవేశించి, నివసించడం అదే మొదలు. తమవూరంటే బందరువారికి ఎక్కువ బడాయో గుంటూరువారికి ఎక్కువ గర్వమో చెప్పడం కష్టం. ఒకప్పుడు బందరు కృష్ణాజిల్లా ముఖ్యనగరం. అందులో ఒక్క ఒంగోలుతాలూకాతప్ప యావత్తు గుంటూరుజిల్లా వుండేది. కృష్ణాజిల్లా కొవ్వూరుదాకా వ్యాపించివుండేది. 1904 లో గుంటూరు ప్రత్యేకించి జిల్లా చేసినారు. నెల్లూరులో వుండే ఒంగోలు ఇందులో కలిపినారు. అదివరదాకా పెద్ద పెద్ద ప్లీడర్లంతా బందరులోనే వుండేవారు. కొండా వెంకటప్పయ్య ప్రథమంలో బందరులోనే ప్రాక్టీసు ప్రారంభించినాడు. జిల్లా విడిపోయిన తర్వాత గుంటూరు చేరినాడు. ఆయన ఉనికితో గుంటూరు రాజకీయరంగంలో ముందంజ వేసినది. గుంటూరు

పౌరులు ఉత్సాహవంతులు, ఆపేక్ష, అభిమానవంతులు. వారినోరు మాట్లాడితే నొసలు వెక్కిరించదు.

ఆది ఆంధ్రరాజ్యం కృష్ణా ఉత్తరతీరపు శ్రీకాకుళంలో ప్రభవిస్తే, ఆది శాతవాహనాంధ్రసామ్రాజ్యం దక్షిణాన ధరణికోటలో ఆవిర్భవించినది. ఒకనాడు గుంటూరుజిల్లా బౌద్ధానికి నిలయం; నాగార్జునాచార్యుడి నివాసం. బుద్ధదేవుడి స్మారక చిహ్నాలురెండు గుంటూరుజిల్లాలోనే దొరికినవి. ఒకటి భట్టిప్రోలులోనూ, రెండు నాగార్జునకొండలోనూ. భట్టిప్రోలు చిహ్నం కలకత్తా మహాబోధిసంఘ భవనంలో వున్నది. నాగార్జునకొండచిహ్నం వారణాసి సమీపాన సార్‌నాథ్‌లో మూల గంధకుటివిహారంలో వున్నది. అమరావతి, నాగార్జునకొండ అంతర్జాతీయ విశ్వవిద్యాలయాలికి ఆటపట్టులు; శిల్పకళకు కాణాచులు, ఆలయనిర్మాణానికి అంకురాలు. గుంటూరుజిల్లా రెడ్డిరాజుల పుట్టినిల్లు. గుంటూరు కవిసార్వభౌముడైన తిక్కనామాత్యుడి పుట్టినిల్లు. కమ్మప్రభువులూ, దానశీలురూ అయిన వాసిరెడ్డివారి నిలయం. వారిచ్చిన అగ్రహారం. గుంటవూరో, గుండువూరో చెప్పడం కష్టం. పదకొండవశతాబ్దంలోనే రాజధానిగా పేరుగన్నది. 1752 లో ఫ్రెంచివారి ప్రభుత్వంలో కోట పాతగుంటూరులో వుండేది. ప్రస్తుతం హిందూకాలేజీ ఆవరణే ఫ్రెంచి సైనికశిబిరం. 1866 లోనే ఇక్కడ పురపాలకసంఘం ఏర్పడినది. పెద్ద పత్తిఎగుమతికేంద్రగా పేరుపొందినది. మిరపకాయలు ఎప్పుడూ వున్నవే. ఇప్పుడు పొగాకు ఉత్పత్తికీ ఎగుమతికీ అంతర్జాతీయ కేంద్రం. 1888 లో ఇక్కడ చిన్నరైలు పడినది. 1914 లో గుంటూరు-తెనాలి–రేపల్లె పెద్దరైలు వేసినారు. గుంటూరులోనే 1894 లో ప్రథమ కృష్ణాజిల్లాకాంగ్రెసు జరిగినది. 1908 లో ఇక్కడే ఆంధ్రోద్యమభావాలు అంకురించినవి. అప్పుడే ఆంధ్రదేశంలో మొదటి బాంబుకూడా కతేవరంలో పేలినది. ప్రథమ ఆంధ్రమహాసభ 1913 లో బాపట్లలో జరిగినది.

నాయకుల పుట్టినిల్లు గుంటూరు. కొండా వెంకటప్పయ్య, టంగుటూరి ప్రకాశం గొల్లపూడి సీతారామశాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణ, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి, గోగినేని రంగనాయకులు, నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావు. నేతి చలపతి, గుళ్ళపల్లి పున్నయ్యశాస్త్రి వంటివారు గుంటూరు జిల్లావారే. ఆధునికాంధ్ర సాహిత్యాభివృద్ధికి రాజబాట నిర్మించిన సాహితీ సమితి గుంటూరులో పుట్టినది. ఆ సభాపతి శివశంకరస్వామి గుంటూరువాడే. ప్రథమాంధ్ర జాతీయ మహాకవి రాయప్రోలు సుబ్బారావు గుంటూరువాడు. త్రిపురనేని కవిరాజు, కళాప్రపూర్ణులు, తుమ్మల సీతారామమూర్తిచౌదరి, గుర్రం జాషువా గుంటూరువారు. జీవితారంభంలో, ఆ తరుణంలో, గుంటూరులో నివసించడం ఒక విశేషమే. కాసు సోదరులికి ఆ అవకాశం లభించినది.

వెంకటరెడ్డి నగరానికి పాతకాపేగనక ఉత్సాహవంతులైన జాతీయవాదులతో పరిచయం కలిగినది. పైగా అతను చదువరి. కొత్తపుస్తకాలుకొనీ, బదులు తీసుకునీ చదువుతూ వుండేవాడు. వార్తాపత్రికలు చదవడం అలవాటు. ఈ సద్గుణాలన్నీ తమ్ములిద్దరికీ అలవాటైనవి. దృష్టి దేశవ్యాప్తమైనది; జాతీయమైనది. అన్నగారి చెప్పుచేతల్లో తమ్ముళ్ళు మంచి బాటల్లోనే నడుస్తున్నారు.

బ్రహ్మానందం పాఠశాలలో చేరిన కొద్దివారాలకే బొంబాయిలో 1920 జూలై 31 వ తారీఖు అర్ధరాత్రివేళ లోకమాన్య బాలగంగాధర తిలక్ మహాశయుడు పరమపదించినాడు. ఒకయుగం అంతరించినది. కొత్తయుగం ప్రారంభించినది. అది గాంధీమహాయుగం. 'స్వరాజ్యరథం'లో గుంటూరువాసి బలిజేపల్లి లక్ష్మీకాంత కవి శంఖం పూరించినాడు.

తరి గాంధీయుగమేగుదెంచె నిక ఏతత్ భారతీయ స్వరా
జ్యరథం బాతని సారధిత్వముననే సాగించుడంచున్ జగ
ద్గురు డేగెన్ దివి లోకమాన్యు డవె యుద్ఘోషించు తూర్యధ్వనుల్
ఉరు తద్దివ్యరథంబు లాగుటకు రండో భారతీయ ప్రజల్ !



# గాంధీపర్వం

గాంధీ మహోదయం

జలియన్‌వాలాబాగ్

సహాయ నిరాకరణం

గాంధీ దర్శనం

చీరాల రామదాసు

మించాలపాడు హనుమంతు

పెదనందిపాడు వీరయ్య

# గాంధీ మహోదయం

**1919** వ సంవత్సరం కానువారి కుటుంబానికేకాదు ఆంధ్రదేశానికేకాదు, యావ ద్భారత దేశానికీ కష్టకాలం. ఆ యేడే వీరపురుషుడు వీరేశలింగం కన్ను మూసినాడు; మన పెద్దదిక్కు మాసినది.

ప్రపంచమహాయుద్ధంలో వేలకివేలు భారతీయయోధులు బ్రిటిషువారి తరఫున రణరంగంలోకి వురికి, ప్రాణాలకుతెగించి, ఫ్రాన్సులో శత్రుఫిరంగులు కైవశం చేసుకున్ననాడు బ్రిటిషు పార్లమెంటులో అంతా శ్లాఘించినారు; ఆశావచనాలు పలికినారు. యుద్ధానంతరంమాత్రం 'నోరు అప్పాలపండు, చెయ్యి బలుసుముల్లు' అన్నట్టు ప్రజలమీద కక్కులకళ్లెములు బిగించినారు. ఆ కళ్లెమే 1919 లో వచ్చిన రౌలట్టు చట్టము. బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకులూ అని అధికార్లకి అనుమానం వుంటే చాలు పట్టుకుని విచారణలేకుండా ఎన్నాళ్లైనా బంధించడానికి వీలు కలిగినది; చర్య నడిచినది.

జర్మనుసామ్రాజ్యం విచ్ఛిన్నం చెయ్యడమేకాకుండా, జర్మనీకి సహాయం చేసిన దేశాల రాజులమీద కూడా కసి తీర్చుకున్నారు. ఆ కక్షకి బలి అయినవాడు మహమ్మదీయ మతాధిపతీ, టర్కీసుల్తానూ, అబ్దుల్‌మజీద్. అన్యాయంగా నిర్బంధం చేసి సుల్తానుచేత దుర్మార్గపు సంధిషరతుల పత్రంమీద సంతకం చేయించినారు. సుల్తాన్ని ఖలీఫా అంటారు మహమ్మదీయులు. భారత దేశంలో మహమ్మదీయులికి వొళ్లు మండినది. షౌకత్‌ఆలీ, మహమ్మదాలీ, డాక్టరు అన్సారీ వంటి ముస్లిం నాయకులు బ్రిటిషువారి అన్యాయం ఖండిస్తూ ఖిలాఫత్ ఉద్యమం లేవదీసినారు.

దక్షిణాఫ్రికాలో విజయవంతంగా సత్యాగ్రహ ప్రయోగంచేసి గాంధీజీ ఇండియా తిరిగివచ్చి నాలుగు సంవత్సరాలు మాత్రమే అయినది. విదేశాలలో

దీనజనరక్షణలో ఆయన విజయపరంపర విన్న స్వదేశీయులు ఆయన బహిరంగ సభలలో చేతులు జోడించి "మహాత్మాజీ" అని సంబోధించడం ప్రారంభించినారు. ఆ సంబోధన సార్థకం చేసినాడు గురుదేవుడైన విశ్వకవి రవీంద్రనాథ్ టాకూర్. మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ మహాత్ముడైనాడు. అహమ్మదాబాదు పొలిమేర లలో, సబర్మతీ తీరాన ఆశ్రమం స్థాపించి నివాసం ఏర్పాటు చేసుకున్నాడు. తూర్పున శాంతినికేతన గురుకులంలో రాజర్షి రవీంద్రుడూ, పశ్చిమాన సబర్మతీ ఆశ్రమంలో మహర్షి మోహనదాసు; భారతీయ చరిత్రలో ఇద్దరు మహాపురుషులు; ఈ శతాబ్దార్థంలో మానవమనోవీధులలో ప్రకాశించిన విద్యుద్దీపాలు. రవీంద్రుడు కాంచనశృంగం; గాంధీ కైలాసపర్వతం. ఒకరు భోగి, ఇంకొకరు త్యాగి. విశ్వ మానవకల్యాణమే వీరి ఆశయం. జాతీయవాదులు, అంతర్జాతీయహితైషులు. ధ్యేయం ఒకటే మార్గాలువేరు. ఇద్దరూ సనాతనులే, మళ్ళీ ఇద్దరూకారు. సనాతన అధునాతనులు, అధునాతన సనాతనులు. పాతకొత్తల మేలికలయికలు. ప్రాచ్య వాతావరణంలో ఆవిర్భంచి పాశ్చాత్యులకి వెలుగు చూపినవాడు గురుదేవుడు. పాశ్చాత్య ప్రభావంలో పరిణతిపొంది ప్రాచ్యులైన భారతీయులికేకాక మానవ లోకానికే కొత్తపంథా చూబించినవాడు మహాత్ముడు. ఇద్దరినీ పాశ్చాత్యులు గౌర వించినారు. ఒకరు నోబెల్‌లారియేట్, ఇంకొకరు కెయిజర్-ఇ-హింద్. ఇద్దరికీ బ్రిటిషువారి శీలంలో, క్రమశిక్షణలో, నీతినిజాయితీలలో, స్నేహభావంలో నమ్మకం మెండు. అది వారు రహస్యంగా వుంచలేదు; ప్రకటించినారు. కాని, పరిస్థితులు మారినవి. బ్రిటిషువారు సామ్రాజ్య కాంక్షతో, స్వలాభాపేక్షతో ఆడినమాట తప్పి నారు. అభినవ భారతమహర్షులిద్దరూ అసహ్యించుకున్నారు. ఇండియాలో అడుగుపెట్టిన కొద్ది రోజులకే గాంధీ శాంతినికేతనంలో గురుదేవుణ్ణి సంద ర్శించినాడు.

ఎంతటివాడికైనా గురువు అవసరం. గాంధీ గురువు గోఖ్లే. ఇండియా రాగానే ఆయన్ని సందర్శించినాడు. గోఖ్లే సలహా "ఒక సంవత్సరం కళ్ళతోచూడు, చెవులతో విను, నోరుమాత్రం విప్పకు తరవాత ఏమన్నాచెయ్యి". అక్షరాలా అనుసరించినాడు శిష్యుడు. 1916 లో గోఖ్లే పరమపదించినాడు. గాంధీ డిసెం బరులో జరిగిన లక్నో కాంగ్రెసుకి వెళ్ళినాడు. అప్పటికింకా బ్రిటిషువారి మంచి తనంలో నమ్మకం పోలేదు. మనపరాధీనత మనపొరబాటేనని గాంధీ నమ్మకం: రవీంద్రుడు వ్రాసినాడు: "ఖైదీ, నీకీ సంకెళ్ళు ఎవరు వేసినారు. నేనే స్వయం కృషితో సృష్టించుకున్నాను." గాంధీకి భారతదేశ స్వాతంత్ర్యంకంటె ముందు భారతీయుల ఆత్మస్వాతంత్ర్యం ముఖ్యం. మనిషి మనిషైతే మరోమనిషి ఏమీ చెయ్యలేడు. భారతీయుడు కుంగిపోయినాడు. వంగిన నడుము సద్దుకుని, ఛాతీ విర్చి, నిర్భయంగా, నిలువుగా, నిలబడాలి. వంగినవాడి వీపుమీద ఎవరన్నా

ఎక్కుతారు. గాంధీ ప్రయత్నం ఆ వంకర తీర్చడం. మనసు వంకరపోతే మనిషి వంకర పోతుంది. "మనం అందరం కలవాలి. హిందూ మహమ్మదీయులు ఒకటే కావాలి, మనకాళ్ళమీద మనం నిలబడాలి; సత్యవచనం పలకాలి, ఋజుమార్గంలో నడవాలి" అని ప్రబోధించినాడు. ఈ పద్ధతి ముస్లింలీగు నాయకుడు మహమదల్లీ జిన్నాకి నచ్చినది. సరే, మాసంస్థ తయార్, చేతులూ, చేతులూ కలిపి, అడుగులో అడుగు వేతామన్నాడు. గాంధీ ప్రయత్నంతో హిందూ–ముస్లిం సహకారం చేకూరినది. తిలక్ మహాశయుడు భరతవాక్యం పలికినాడు: We are united in the United Provinces. We have found luck in Lucknow. "సంయుక్త పరగణాలలో సంయుక్తకార్యక్రమం ప్రారంభించాం, లక్ష్మణపురంలో అదృష్టలక్ష్మి అవతరించింది."

ఆశాలత పెరిగినది. ఎడ్విన్‌మాంటేగు ఇండియా కార్యదర్శిగా నియమితుడైనాడు. 1917 ఆగస్టులో భారతీయుల ఆశాలతకి కుసుమాలు తొడిగినాడు. సుశీఘ్రంగా స్వాతంత్ర్య ప్రతిపత్తికి మార్గం కల్పించే రాజకీయసంస్కరణలు అమలు జరుపుతామన్నాడు. బ్రిటిషుసామ్రాజ్యంలో భాగంగా భారతజాతికి స్వాధీనత లభిస్తుందన్నాడు. కెనడావలె, న్యూజిలెండువలె ఇండియాకూడా వుండవచ్చునని నాయకులు ఆశపడినారు.

గాంధీ ఆశావాది, రాజీవాది, శాంతివాది. తాడు తెగేముందే విడిచి పెడతాడు. ఆశ దురాశ అయినది; వారు రాజీకి రాలేదు; కయ్యానికి కాలు దువ్వినారు; తాడు తెంపుకున్నారు.

ఇంతలో గాంధీకి సత్యాగ్రహప్రయోగానికి మరో అవకాశం లభించినది. రాజకుమార్ శుక్లా అనే బీహారు రైతు, లక్నోనించి గాంధీ వెంటబడినాడు. మాకు కొన్ని చిక్కులు వున్నవి. మీరు మావూరు దయచెయ్యాలి అన్నాడు. పనులు వున్నాయి ప్రస్తుతం వీలులేదంటే, వీలున్న సమయం శెలవియ్యమన్నాడు. గాంధీ కలకత్తా వొచ్చేదాకా కాసుకున్నాడు. తమ జిల్లా, బీహారులో, హిమాలయపర్వత పార్శ్వంలో, నేపాలు సరిహద్దులలో వున్నది. దానిపేరు చంపరాన్. గాంధీ వెళ్లినాడు. అక్కడ బ్రిటిషు భూస్వాములు కొన్ని లక్షల యకరాలు గుత్తకి తీసుకుని, పదిలక్షల రైతులికి కౌలుకిచ్చి, కొంతభాగంలో నీలిమందు కోసం మొక్కలు వేయించి, ఆ మందు అమ్ముకుంటున్నారు. ఆరోజుల్లో మన దేశంలో చాలా గ్రామాలలో వూరిబయట నీలిమందుతొట్లు వుండేవి. నీలివ్యవసాయం లాభసాటిగా వుండేది. ఇంతలో జర్మనీ రసాయనికంగా నీలిమందు తయారు చేసినది. మన దేశంలో వ్యవసాయంమీద ఆధారపడిన ఒకపెద్ద గ్రామపరిశ్రమ పడుకున్నది. బీహారులో కూడా అంతే. తెల్లవారు రైతుల్ని నీలినాట్లు నిలిపెయ్యమన్నారు. వారి కౌలు

కాగితాలలో నీలివ్యవసాయం ఒక షరతు. అమాయకులైన రైతులు మానేసినారు. గడుసువారైన తెల్లవారు నీలి మానేశారుగనక శిస్తులు ఎక్కువ ఇమ్మన్నారు. ఎంత అమాయకులైనా, ఇంగితజ్ఞానం లేనివారుకారు రైతులు. జర్మనీ మందు సంగతి వారికి తెలిసినది. ఎక్కువశిస్తు కట్టం అన్నారు. బ్రిటిషుభూస్వాములు రైతుల్ని నానా బాధలు పెట్టినారు. తిట్టినారు. కొట్టినారు. ఇళ్లూ వాకిళ్లూ జప్తులు చేయించినారు. ఈ బాధ 1912 లోనే ప్రారంభమైనది.

చంపరాన్‌లో రవానాసౌకర్యాలు తక్కువ. సంగతులు తెలుసుకునేందుకు గాంధీ సంచారం చెయ్యవలసి వచ్చినది. ఏనుగు ఎక్కించినారు. ఒకరోజు సంచారంలో ఒక పోలీసు జవాను అడ్డొచ్చి వూళ్లోకి తిరగదోలినాడు. తక్షణమే చంపరాన్ విడిచి పోవలసినదిగా నోటీసు ఇచ్చినారు. ఆ నోటీసు గాంధీ అందుకున్నాడు. రసీదుమీద సంతకం చేసినాడు; దాని వెనకమాత్రం "నేను ఈ ఆజ్ఞ ఉల్లంఘిస్తాను" అని వ్రాసి పంపినాడు. మర్నాడు కోర్టుకి పిలిపించినారు. ఎవరో మహాత్ముడు తమ బాధలు తీర్చడానికి వస్తే ఆయన్ని ప్రభుత్వం పట్టుకున్నదన్న వార్త పర్వతసీమ అంతా పాకిపోయినది. వేలాదిజనం కోర్టుచుట్టూ మూగి పోయినారు. అంత మంది జనాన్ని పోలీసులు బందోబస్తు చెయ్యలేక పోయినారు. బుద్ధిశాలి, వో పోలీసు అధికారి, మహాత్ముణ్ణి ఆశ్రయించినాడు. "బాబూ, ఈ జనం శాంతంగా వుండేటట్టు చూడండి" అని. సరే, నని గాంధీ జనాన్ని సద్దుమణిగేటట్టు చేసినాడు. "ఇంత బలంవుండి మనం పట్టుకోలేని మందిని మాటతో మంత్రముద్ధుల్ని చేశాడు, ఈయన ఎవరు?"

కోర్టువారిముందు గాంధీ తాను నేరంచేసినట్టు వొప్పుకున్నాడు. "చట్టంమీద నాకు అగౌరవంలేదు. ఇంతకంటె గొప్పదైన చట్టం వుంది. దాన్ని శాసించేది ఆత్మ. ఆ శాసనాన్ని గౌరవిస్తున్నానేగాని, మీ శాసనం ధిక్కరించడం నా భావం కాదు. నాకు ఇవ్వవలసిన శిక్ష విధించండి" అన్నాడు. మేజస్ట్రీటుకి అగమ్యగోచరంగా వున్నది. ఇటువంటి ముద్దాయిని ఆయనెప్పుడు చూడలేదు. "సరే, ఆలోచించి, రెండు గంటలలో తీర్పు చెబుతాను, ఈలోపుగా ముద్దాయిని జామీను మీద విడుదల చేస్తున్నాను" అన్నాడు. ముద్దాయి జామీను ఇవ్వనన్నాడు. విధిలేక కోర్టువారు జామీనులేకుండానే రెండు గంటలసేపు విడుదల చేసినారు. మధ్యాహ్నం బెంచిమీదకొచ్చిన మేజస్ట్రీటు, "కొద్దిరోజులలో తీర్పు చెబుతాను" అన్నాడు. గాంధీని విడుదల చేసినాడు. ఆ తీర్పు ఎన్నాళ్లకీ రాలేదు. ప్రభుత్వం వారి ఆజ్ఞప్రకారం కేసు ఉపసంహరించుకోవడమైనది. ఇండియాలో సత్యాగ్రహ ప్రయోగం విజయవంతమైనది.

గాంధీ భార్యతోసహా చంపరాన్‌లో స్వేచ్ఛగా ఏడు నెలలు సంచరించి, తెల్ల భూస్వాముల్ని లొంగదీసి ఎక్కువశిస్తు తప్పించి, కట్టినవారికి ముజరా ఇప్పించి నాడు. భార్యాభర్తలిద్దరూ, ఒక డాక్టరుతో సహా, గ్రామస్థులికి ఆరోగ్య జీవనంలో, గ్రామపారిశుద్ధ్యంలో తరిఫీయదు ఇచ్చినారు. బాబూ రాజేంద్ర ప్రసాద్‌తో సహా ఒక కమిటీ ఏర్పాటు చేసి, రైతులికి పరిరక్షణలు కల్పించినాడు. "ఈ కమిటీలో ఆండ్రూస్‌వంటి ఇంగ్లీషు సభ్యుడు వుంటే మంచి" దన్నారు కొందరు సభ్యులు. "మీలో మీకు నమ్మకం లేదా? ఇది న్యాయమైన వ్యవహారం. మీ శక్తి మీద మీరు ఆధార పడితే విజయం చేకూరుతుంది" అన్నాడు మహాత్ముడు. వారికి ఆత్మ విశ్వాసం కలిగించి, తాను ఇనుమడించిన ఆత్మవిశ్వాసంతో చంపరాన్ విడిచినాడు విజయగాంధి.



# జలియన్ వాలాబాగ్

**1919** జనవరి ఆరంభంలో రౌలటు కమిటీ రిపోర్టు ప్రకటించినారు. ఆ సిఫార సులు బిల్లురూపంగా శాసనసభ ముందు పెడితే తాను సత్యాగ్రహం చేస్తానని గాంధీ ప్రకటించినాడు. ప్రభుత్వం అది వుట్టి బెదిరింపు అని నిర్లక్ష్యం చేసి, ఫిబ్రవరి 6వ తారీఖున కేంద్ర శాసనసభలో బిల్లుగా ప్రవేశపెట్టినది. అన్యాయం అన్నాడు గాంధి. మానవుడి ప్రాథమిక హక్కులికి భంగం, సంఘానికి ముప్పం, స్వాతంత్ర్యానికి విరోధం, మానవత్వానికే మానభంగం అన్నాడు. తన మాట ప్రకారం సత్యాగ్రహ ఉద్యమం ప్రారంభించడానికి శిష్యబృందాన్ని చేర్చుకోడానికి దేశసంచారం ప్రారంభించినాడు. శికింద్రాబాదు వచ్చినాడు. సభలు చేసినాడు. బెజ వాడలో ఆగినాడు. కాశేశ్వరావు ఆతిథ్య మంగీకరించినాడు. ఆయన్ని శిష్యుడుగా కూడగట్టుకున్నాడు. మద్రాసు వెళ్లినాడు, రాజగోపాలాచారి యింట బస చేసినాడు, టంగుటూరి ప్రకాశం అక్కడ చేరిన శిష్యులలో ముఖ్యుడు. సభలు చేసినాడు, సంప్రదింపులు జరిపినాడు. విరేచనములతో బాధపడి అప్పుడే కోలుకుంటున్నాడు. మార్చి పద్దెనిమిదో తేదీని శాసనసభ రౌలట్టుబిల్లు చట్టం చేసినది. గాంధీ నిర్ఘాంత పోయినాడు. ఇంత దర్పమా, ఇంతనల్లేరుమీద బండినడకా? భారతీయ ప్రజ అంటే ఇంత తీసికట్టా? ఏ విధంగా, నోరూవాయా లేని ఈ మూడుంముక్కోటి అమాయక ప్రజల్ని మేలుకొలపడం, వారికి ఈ అమర్యాద, అక్రమం తెలియ జెప్పడం? ఏమిటి దీనికి జవాబు?

ఒక తెల్లవారు ఝామున లేచినాడు. రాజగోపాలాచారితో అన్నాడు. "నాకు కలలో కాంతి కనిపించింది. జవాబు దొరికింది."

"ఏమిటి?"

"ఆసేతుహిమాచలపర్యంతం హర్తాళ్."

"అటు తర్వాత?"

"శాంతిగా శాసనోల్లంఘనం"

"అనగా ?"

"పుస్తక పత్రిక ప్రచారం"

మహాత్ముడు ఆలోచించి వూరుకోడు. ఆచరణలో పెడతాడు. ఆచరణలో ఆయన ఆలోచన చిలవలూ పలవలూ వేస్తుంది. మార్చి 30 వ తారీఖుని యావద్భారత దేశంలోనూ హర్తాళ్ చెయ్యాలని ప్రకటించినాడు. ఉపవాసాలుచేసి, ప్రార్థనలుచేసి, ఉత్సవాలతో, వూరేగింపులతో బహిరంగసభలు చెయ్యాలి. ఆ సభల్లో రౌలట్‌శాసనం ఖండిస్తూ ఉపన్యాసాలు చేసి, తీర్మానాలు ఆమోదించాలి. సత్యాగ్రహ శపథాలు తీసుకోవాలి. ఆ తేదీ దరిమిలాని ఏప్రిల్ 6 కి మార్చబడినది.

ఢిల్లీ జాతీయవాదులికి ఈ మార్పు తెలియలేదు. మార్చి 30 నే వారు కార్యక్రమం ప్రారంభించినారు. ఊరేగింపు సైనికులు తుపాకులు కాల్చి చెదరగొట్టినారు. మర్నాడు స్వామీ శ్రద్ధానంద ఊరేగింపుతో బయలుదేరినాడు. సైనికులుఅడ్డగించి, తుపాకులు బారుపెట్టినారు. కాల్చమని స్వామి తన ఛాతీచూపినాడు. వారు కాల్చలేకపోయినారు. ఆయన వూరేగింతోపోయి సభచేసినాడు. మరో సభలో సైనికులు తుపాకులతో అయిదుగుర్ని చంపినారు, చాలామందిని గాయపర్చినారు.

ఏప్రియల్ 6 న మాత్రం దేశం అంతటా బ్రహ్మాండమైన హరతాళములు. ఊరేగింపులు, సభలు జరిగినవి. ఆంధ్రదేశంలో గుంటూరు, బందరు, బెజవాడ, రాజమండ్రి వంటి ప్రదేశాలలో సభలు జరిగినవి, హిందూమహమ్మదీయులు ఏకమైనారు. గాంధి భారతీయ ప్రజానీకానికి తన సందేశం, తన ధైర్యం అందజెయ్యగలిగినాడు. అనుకోని విజయం. సంతోషించినాడు.

పంజాబులో అన్నిచోట్లా హరతాళములు జరిగినవి. అమృతసరములో కూడా మార్చి 30, ఏప్రిల్ 6 రెండురోజులూ జరిగినవి. అమృతసరం శిఖ్ఖు మతస్థులికి పుణ్యక్షేత్రం. అక్కడే వారి బంగారుగుడివున్నది. శిఖ్ఖులు పౌరుషవంతులు. పేరుగాంచిన యుద్ధవీరులు. వారికీ మహమ్మదీయులికీ జాతిసామంతాది విరోధాలు ఉన్నవి. గాంధీమంత్రంతో అవి మాయమైనవి. హిందువులు, మహమ్మదీయులు, శిఖ్ఖులు అందరూ కలిసి ఐకమత్యంతో శాంతంగా, వూరేగింపులుచేసి, సభలు జరిపేసరికి బ్రిటిషువారి గుండె బెదిరినది. వీరి విభేదాలే మనబలం. వీరు కలిస్తే మనం నిలవం అని హడలిపోయినారు. పైగా డాక్టర్ కిచ్లూ అనే మహమ్మదీయుడూ,

డాక్టర్ సత్యపాల్ అనే హిందునాయకుడూ అమృతసరంలో పెద్దలు. వారినిద్దర్నీ మర్నాడు కోర్టుకి పిలిపించి, ఎవరికీతెలియకుండా ఎక్కడికో సంపించివేసినారు. గొల్లలేనిమందవలె మంది చెల్లా చెదరై ప్రభుత్వభవనాలు ధ్వంసం చేసినారు. కొందరు ఇంగ్లీషువార్ని చంపినారు. రెండు మూడు నగరాలలో ఈ విధంగా జరిగినది. అల్లర్లు ఆపుచెయ్యడానికి గాంధీ పంజాబు బైలుదేరినాడు. ఆయన్ని రైలులో పట్టుకుని తీసుకుపోయి తిరిగి అహమ్మదాబాదులో విడిచిపెట్టినారు. అమృత సరం మార్షల్‌లా కింద పెట్టి బ్రిగేడియర్‌జనరల్ రెజినాల్డ్ ఇ. హెచ్. డయర్ అనే బ్రిటిషు సైన్యాధికారికి పెత్తనం ఇచ్చినారు. ఆయన ఇండియాలోపుట్టినవాడే. జనానికిబుద్ధి చెప్పాలను కొన్నాడు. భీతాహం కలగజేసి ఇటువంటి చర్యలు మళ్ళీజరగకుండా చెయ్యాలని పురుషుల్ని, స్త్రీలని యువకుల్ని యమయాతన పెట్టినాడు. హిందూ ముసల్మానులికి జంటసంకెళ్లువేసి వీధుల్లో నడిపించినాడు. స్త్రీలని బజారులో పొట్టలమీద పాకించినాడు, యువకుల్ని మండుటెండలో ఇరవై మైళ్లు నడిపించి కొరడాలతో కొట్టి హింసించినాడు. నిర్దోషుల్ని బంధించినాడు, విచారణలేకుండా యావజ్జీవశిక్షలు విధించినాడు. చాలామంది ఆస్తులు జప్తుచేసినాడు. ఇహలోక నరకం సృష్టించినాడు. ఏప్రిల్ 13 వ తేదీన జలియన్ వాలాబాగ్ అనే నాలుగుగోడలమధ్య ఆవరణలో ఇరవై వేలమంది ప్రజలు సభచేసినారు. శాంతియుతంగా సభ జరుగుతున్న సమయంలో, ఏమరుపాటున సైనికులతో డయర్ ప్రత్యక్షమైనాడు. వెళ్లిపొమ్మని అరిచినాడు. అరిచినవెంటనే అక్కడకూడిన స్త్రీపురుష సమూహంమీద అన్నివేపుల్నించీ 1650 బారులు తుపాకులు కాల్పించినాడు. పారిపోడానికి కూడా జనానికి వ్యవధిలేదు. పారిపోడానికి సందులేదు. మందుగుండు సామాను అయిపోయేవరకూ కాలుస్తునేవున్నాడు. 379 మంది మరణించినారు. 1137 మందికి గాయాలుతగిలినవి. తుపాకి దెబ్బలు తిన్నవారి హాహా రావాలు మిన్నుముట్టినవి. హిందువుల, మహమ్మదీయుల, శిఖ్ఖుల రక్తం వారి హృదయాలలాగే కలిసి, స్రవంతిగట్టి, అమృతసరం పేరు సార్థకమైనది. ఆ అమృతసరంలోంచే, ఆ భీభత్సంలోంచే, ఆ హాహా రావాలలోంచే భారతజాతి చైతన్యం, ఆగ్రహం, సత్యాగ్రహంగా మారినవి. త్యాగం లేకుండా, రక్తస్రావం లేకుండా, బాధ లేకుండా మనదేశానికి స్వరాజ్యం ఆకాశం మీదనించి రాలిపడింది అనుకోడం తప్పు. ఎంతమందిదో సాధుజనరక్తం ప్రవహించి, ఎంతమందో బలిదానం అయినతర్వాతనే స్వతంత్ర భారతభూమి తిరిగి అవతరించినది. అది యుద్ధభూమికాదు, యజ్ఞభూమి. హోత గాంధీ. ఏప్రిల్ 18వ తారీఖున సత్యాగ్రహం ఆపుజేసినాడు మహాత్ముడు. అమృతసరం దురంతాలుపైకి తెలియకుండా బందు చేసినది ప్రభుత్వం.

డిసెంబరులో కాంగ్రెసు అమృతసరంలో పెట్టడానికి నిశ్చయం అయినది. జలియన్‌వాలాబాగ్ దగ్గిరే సభ జరపడానికి ప్రభుత్వం అనుమతి ఇచ్చినది. ఆలీ

సోదరుల్ని జైలునించి విడుదల చేసినది. వారు ఖైదునించి తిన్నగా కాంగ్రెసు సభకే వెళ్లినారు. అదే నెలలో, చేసిన గాయానికి మందులాగ, మాంటెగూ-షెంస్ ఫర్డు రాజకీయసంస్కరణలు ప్రకటించినారు. వీటిప్రకారం రాష్ట్రాలలో కొన్ని మంత్రి పదవులు దేశీయులికి చెందుతవి. కొంత పరిపాలనాధికారం ఈ మంత్రులికి వుంటుంది. దీన్నే (Dyarchy) ద్వంద్వ ప్రభుత్వం అన్నారు. ఇవి ప్రకటిస్తూ పంచమ జార్జి చక్రవర్తి, 'కొత్త శకం ప్రారంభం అవుతున్నది' అన్నాడు.

నిజమేనని ఆశించినాడు గాంధీ. ఆ ఆశాభావంతోనే అమృతసరం వెళ్ళినాడు. సభాధ్యక్షుడు మోతిలాల్ నెహ్రూ. మితవాదులూ, అతివాదులూ కలిసి జరిపిన ఆఖరి కాంగ్రెసు సమావేశమదే. తిలక్, జిన్నా మొదలైనవారు హాజరైనారు. హోంరూలు లీగు సంస్థాపకురాలు అనిబిసెంటు కూడా వచ్చినది. ఒకనాడు కాంగ్రెసు అధ్యక్ష పదవి అలంకరించిన ఆమె అప్పటితో రాజకీయరంగంలోంచి తప్పుకోవలసిన అవసరంకలిగినది. ఆవిడ గాంధీ కార్యక్రమానికి వ్యతిరేకురాలు. అటుతర్వాత గాంధీ వ్యతిరేకులెవ్వరూ కాంగ్రెసులో నిలువలేకపోయినారు. మితవాదులు లిబరల్ ఫెడరేషనుగా విడిపోయినారు.

అమృతసరంలో చర్చించిన ముఖ్యవిషయం ఒకటి కొత్త రాజకీయ సంస్కరణలు స్వీకరించడమా తిరస్కరించడమా ? అందరూ సంతృప్తికరంగా లేవన్నారు. పనికిరావన్నారు. తీర్మానం వ్రాసినారు. గాంధీకూడా బాగులేవన్నాడు, కాని "అయినంతవరకు ఆ చట్రంలోనే పనిచేస్తూ స్వరాజ్యసాధనకి కృషిచేస్తాం; ఈ సంస్కరణలు ప్రకటించినందుకు బ్రిటిషువారికి ధన్యవాదములు" అనే సవరణ తగిలించి నెగ్గించినాడు.

అమృతసరం దురంతాలు ఎల్లా జరిగాయో, ఎందుకు జరిగాయో విచారించడానికి ఓ అనధికారసంఘం నియమించినారు. గాంధీ, మోతీలాల్ నెహ్రూ, మదన మోహన మాలవీయ మొదలైనవారందులో సభ్యులు. విచారించగా చేసిన దుండగాలు బైటపడినవి. ఆ సంగతులు ప్రకటించడమేకాక, ఇంగ్లండువెళ్ళి కొందరు ప్రచారం చేసినారు. బ్రిటిషు ప్రభుత్వం హంటరు కమిటీని నియమించినది. వారు డయర్ నిర్దోషి అన్నట్టు తేల్చినారు. ప్రభుత్వం డయరికి సన్మానంచేసి బంగారు ఖడ్గం బహుమతీ ఇచ్చినది.

అందరికీ వొళ్లు మండిపోయినది. గాంధీ అమృతసరంలో అవలంబించిన రాజీవైఖరి మార్చుకున్నాడు. తాను రాజీకి వచ్చినాడేగాని, ఇతరనాయకులికి ఇష్టం లేదు. డైయార్కీ డొమినియను ప్రతిపత్తి కాదన్నారువారు. దీనికితోడు ఖిలా

పత్తు ఉద్యమం తీవ్రమై ముస్లింలకి బ్రిటిషువారిమీద కోపం హెచ్చినది. రాజీభావం వారిలోలేదు. ఈ పరిస్థితులలో గోరుచుట్టుమీద రోకటిపోటులాగ పంజాబు దురంతాలు, వాటి విషయంలో ప్రభుత్వ ఉదాసీనవైఖరి. తనతప్పు తానుతెలుసుకోడంలో, తెలుసుకుని ఒప్పుకోడంలో, ఒప్పుకుని ప్రకటించడంలో, ప్రకటించి కొత్తదారి అనుసరించడంలో గాంధీకి గాంధీయే సాటి. ఆయనకి మోమోటమిలేదు. సత్యం అనుకున్నది అనుసరిస్తానన్నాడు.



# సహాయ నిరాకరణం

**1920** జూలై నెలాఖరులో అస్వస్థతగావున్న తిలకు మహాశయుణ్ణి సందర్శించినాడు. ప్రజానీకం ఆ సమావేశానికి అర్థం చెప్పకున్నారు. తిలక్ తన శక్తి గాంధీకిచ్చి దేశాన్ని ఆయనచేతుల్లో పెట్టినాడని. ఆ ధ్వనితోనే దామరాజు పుండరీకాక్షుడు "గాంధీ మహోదయం" నాటకం వ్రాసినాడు. తిలక్ భౌతిక శరీరం, బొంబాయి సముద్రతీరంలో గంధపుచెక్కల చితిమీద పంచభూతాలలో కలిసిన తర్వాత, ఆయన రాజకీయవారసుడైన గాంధీ షౌకత్ ఆలీని వెంటబెట్టుకుని సత్యాగ్రహ ఉద్యమదీక్షతో ఏడునెలలు విధివిరామంలేకుండా దేశసంచారం చేసినాడు. అదివరకే మద్రాసులో గాంధీ ముస్లిం నాయకులతో కలిసి సహాయనిరాకరణ కార్యక్రమం ప్రకటించినాడు. అనగా :

1) బ్రిటిషువారిచ్చిన బిరుదులు విసర్జించడం, గౌరవోద్యోగాలికి రాజీనామాలివ్వడం; స్థానికసంస్థలలో సభ్యత్వం మానెయ్యడం;
2) ప్రభుత్వసభలికీ సమావేశాలకీ హాజరుకాకుండా వుండడం;
3) ప్రభుత్వ కళాశాలలనించీ, పాఠశాలలనించీ విద్యార్థుల్ని మళ్ళించి, కొత్తగా జాతీయవిద్యాలయాలు స్థాపించి వాటిలో చేర్పడం;
4) న్యాయవాదులు బ్రిటిషుకోర్టులికి వెళ్ళకుండా మానెయ్యడం; తగాదాలు మధ్యవర్తులద్వారా పైసలు చేయించుకోవడం;
5) బ్రిటిషువారి సైన్యాలలో చేరడానికి అన్నితరగతులవారూ నిరాకరించడం ;
6) కొత్తగా స్థాపించబోయే శాసనసభలకి పోటీలు చెయ్యకపోవడం, చేసేవారికి వోట్లు వెయ్యకపోడం;
7) విదేశీవస్తు బహిష్కరణ, స్వదేశీవస్తు ఉత్పత్తి.

దేశాన్ని ఎదుర్కొంటున్న సమస్యలన్నీ చర్చించడానికీ, ముందు కార్యక్రమం ఆలోచించడానికీ సెప్టెంబరు మొదటివారంలో కలకత్తాలో ప్రత్యేక కాంగ్రెసు సమావేశం ఏర్పాటు చేసినారు.

ఆ సమావేశానికి వెడుతూ, మద్రాసునించి, రాజగోపాలాచారితోసహా గాంధీ బెజవాడలో దిగినాడు. అసహాయోద్యమం విషయం బహిరంగసభలో ఉపన్యాసం చేసినాడు. అప్పటికి ఆయన కాంగ్రెసునాయకుడేగాని, ఏకైక నాయకుడుకాడు.

కలకత్తాకాంగ్రెసు సెప్టెంబరు 4 వ తారీఖున ప్రారంభమై 9 వ తారీఖున ముగిసినది. లాలా లజపతిరాయ్ అధ్యక్షుడు. మితవాదులెవరూ ఆ సభకి రాలేదు. ఆ సభ చర్చించినది ఒక్కటే ముఖ్యతీర్మానం. అది గాంధీ తీర్మానం. సత్యం, అహింస అనే నిత్యమానవధర్మానికి కట్టుబడి శాంతంగా సహాయనిరాకరణకార్యక్రమం అమలు జరపడం.

అదివరకు కాంగ్రెసుముందు తీర్మానాలూ, కోరికలూ, మహజర్లు, దీర్ఘోపన్యాసాలేగాని నిర్దిష్టమైన కార్యక్రమం రాలేదు. బ్రిటిషువారు స్వరాజ్యం బిగపడుతున్నారు. దీనికేం మందు ? దానికి జవాబు కాంగ్రెసుతో సంబంధంలేని యువకులు చెప్పిన, చేసిన దౌర్జన్యం, బాంబులూతప్ప వేరే ఏ సంస్థకీ కార్యక్రమం లేదు. తీర్మానాల వెనకాల ఒక బెదిరింపుగాని, ఆ బెదిరింపు అమలుచెయ్యగలిగిన శక్తి సామర్థ్యాలు అటుంచి, ఆలోచనగానిలేవు. చచ్చినవాడి పెళ్ళికి బొక్కిందే కూడన్నట్లు అల్పసంతోషులై మితవాదులు మెతుకు లేరుకు తిన్నారు. ఆ మితవాదు లీసభలో లేరు. ఉన్నవారిలో పెద్దలకి ఈ కార్యక్రమం వేళాకోళంగానూ, కొందరికి అసాధ్యంగానూ కనబడినది. ఏం చెయ్యాలి అని ఆత్రుతపడే యువజనానికి ఆశాజనకంగానే వున్నది. విషయ నిర్ణయసభలోనూ, మహాసభలోనూ తర్జనభర్జనలు జరిగినవి. తీవ్ర వాదోపవాదములు జరిగినవి. చివరికి గాంధీమార్గం గెల్చినది. కొద్ది మెజారిటీతో గెల్చినది. సభలో గాంధీతీర్మానం బలపర్చినవారిలో కొందరు : రాజగోపాలాచారి, మోతీలాల్ నెహ్రూ, రాజేంద్ర ప్రసాద్, వల్లభాయ్ పటేల్. మహమ్మదాలీ, షౌకత్ ఆలీ, హకీం అజ్మత్ ఖాన్, అబుల్ కలాం అజాద్, కాశేశ్వరరావు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య. గొల్లపూడి సీతారామశాస్త్రి, బులుసు సాంబమూర్తి. దండు నారాయణరాజు, ఆత్మకూరి గోవిందాచార్యులు. పేట బాపయ్య. గంపలగూడెంరాజా, కోటగిరి వెంకటకృష్ణారావు.

వ్యతిరేకించినవారిలో కొందరు :

లాలాలజపతిరాయ్, విఠల్ భాయ్ పటేల్, చిత్తరంజనదాసు, ఎస్. శ్రీనివాసయ్యంగారు, కస్తూరి రంగయ్యంగారు, కొండా వెంకటప్పయ్య. టంగుటూరి ప్రకాశం.

డాక్టరు పట్టాభిసీతారామయ్య విషయనిర్ణయసభలో తటస్థంగా వుండి. మహా సభకి హాజరు కాలేదు. కాని ఆ కార్యక్రమం తు. చ. లు తప్పకుండా అమలు చేసినవాడాయనే.

వోటింగు ఏవిధంగావున్నా అధికసంఖ్యాకులు ఆమోదించిన సహాయ నిరాకర ణోద్యమం అన్ని రాష్ట్రాల నాయకులూ అమలు జరిపినారు. తమతమ శాసన సభ్యత్వాలికి రాజీనామాలు ఇచ్చినారు. నిలబడదల్చుకున్నవారు మానేసినారు. నవంబరులో జరిగిన ఎన్నికలలో వోట్లు వెయ్యకుండా చాలావోట్ల ఖాళీపెట్టెలే పంపించే ప్రయత్నం సఫలమైనది. చాలామంది న్యాయవాదులు తమ వృత్తులు మానివేసినారు. మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజనదాస్ నలభై ఏభై వేల రూపాయల ఆదాయం వచ్చే వృత్తి విడిచిపెట్టినారు.

కలకత్తా ప్రత్యేకకాంగ్రెసు ప్రత్యేకత ఈ దేశవ్యాప్తమైన కార్యక్రమంలోనే కాక, గాంధీజీ దిగ్విజయంలోకూడా వున్నది. మహాత్ముడు కాంగ్రెసుకేకాక భారత దేశానికే ఏకైకనాయకుడైనాడు. ఆఫ్రికాలో తగుమాత్రమైన ప్రయోజనంకోసం విజయవంతంగా ప్రయోగించిన సత్యాగ్రహం, ఒక జాతీయ ఉద్యమంగా పరిణమించి ప్రపంచలోకల్లా పెద్దదైన సామ్రాజ్యశక్తిని ధిక్కరించి, ధైర్యంగా నిలబడింది. మట్టితో సమానమైపోయిన ప్రజానీకాన్ని మంత్రించి మహాశక్తివంతుల్ని చేసినది. రాజకీయాలకు సత్యం సంధించినది, నాయకుల ప్రవర్తనకి నీతి నియమం కల్పించి నది. త్యాగమే బలమన్నది, ధైర్యమన్నది. అర్థంలేని ఆగ్రహ దౌర్జన్యాలు అరికట్టినది. దీనుల్ని దీప్తిమంతుల్ని చేసినది. అనాథల్ని సనాథల్ని చేసినది. అన్యాయమైన ప్రభుశక్తిముందు న్యాయమైన ప్రజాశక్తి నిలబడే ఆస్కారం కల్పించినది. అదే ఆత్మశక్తి. సనాతన భారతసందేశం. ఉపనిషత్తులనాటి సత్యం, బుద్ధభగవానుడినాటి అహింస, ఋషివాక్కులు కార్యరూపందాల్చి విజయం సాధించి నవి. ఆ సూక్తే స్వతంత్రభారత జాతీయ చిహ్నంమీది, "సత్యమేవజయతే !" ప్రపంచమే నివ్వెరపోయినది. మానవచరిత్రలో నూతన అధ్యాయం ప్రారంభ మైనది.

# గాంధీ దర్శనం

**1920** డిసెంబరులో కాంగ్రెసు నాగపురంలో సమావేశమైనది. సేలం విజయ రాఘవాచారి అధ్యక్షత వహించినాడు. కలకత్తానించి నాగపురం చేరేలోగా గాంధీ కార్యక్రమం మరింత నిర్మాణాత్మకమైనది. హిందూ ముసల్మాను ఐకమత్యం, అస్పృశ్యతానివారణ, మధ్యపాన నిషేధం, ఖద్దరు ఉత్పత్తి, ధారణ. మొదటి రెండు అంశాలూ భారతదేశాన్ని బలపరుస్తాయని చెప్పినాడు. సంఘీభావంతో సంఘం బల బడుతుంది. చివరి రెంటితో కల్లుసారాలమీదా, ఇంగ్లీషు వస్త్రాల మీదా డబ్బు చేసుకుంటున్న బ్రిటిషువారికి దెబ్బ. మనదేశంలో బీదవారికి ఆరోగ్యం, ఆదాయం. సత్యం, అహింసా అనే పునాదులమీద, పై నాలుగు స్థంభాలు నిలబెట్టి, వాటిపైన సహాయనిరాకరణ ఉద్యమం నిర్మించాలన్నాడు గాంధీ. ఆ విధంగా అక్షరాలా సత్యాగ్రహం అమలు జరిపితే ఏడాది తిరిగేలోపల అనగా 1921 డిసెంబరులో స్వరాజ్యం ప్రత్యక్షమవుతుందన్నాడు. అవసరమైతే పన్నులు నిరాకరించే పని పెట్టుకుందామన్నాడు. మోతీలాల్ నెహ్రూ ఈ కార్యక్రమం బలపర్చినాడు. ఆయన కుమారుడు జవహరిలాల్ అప్పుడే రాజకీయాలలో ప్రవేశిస్తున్నాడు. తనకి అంత రుచిగా లేకపోయినా, కొడుకు ప్రోద్బలంవల్ల మోతీలాల్ గాంధీ పక్షం చేరినాడు.

గాంధీ కార్యక్రమం సమర్థిస్తూ చిత్తరంజన్‌దాసు తీర్మానం ప్రతిపాదించినాడు. సభవారి ఆమోదం పొందినది. దాసు ఆదిలో గాంధీకి వ్యతిరేకం. ప్రథమ సమావేశంలోనే పరమ శిష్యుడైనాడు. నెహ్రూ, దాసు కుటుంబాలు గాంధీ ఉద్యమంలో లీనమైపోయినవి. దాసు భార్య, కొడుకు, కోడలు అంతా దేశసేవలో ప్రాణాలు అర్పించినారు. ఆయన సంతతిలేదు. నెహ్రూ కుటుంబం కూడా అంతే. జవాహరిలాలు స్వరాజ్యం స్వీకరించి ప్రధాని అయినాడు. ఆయన ఏకమాత్ర

సంతానం, కూతురు ఇందిర (బంధుత్వం లేకపోయినా) గాంధీ ఇంటిపేరుతో తండ్రి పీఠం అలంకరించినది.

నాగపురంలో గాంధీ కార్యక్రమం, నాయకత్వం స్థిరపడడమేకాక, కాంగ్రెసు సంస్థకి కాళ్లూ, చేతులూ, తక్కిన అవయవాలూ ఏర్పడినవి. అంతవరకూ కాంగ్రెసుకి తలేగాని శరీరంలేదు. అది గాలిలో చెట్టు. 'ఆర్కిడ్' అనే పుష్పం వంటిది. వేళ్లులేవు. వూడలసలే లేవు. కాంగ్రెసుని ఒక చెట్టుగా రూపొందించినది నాగపురం. అప్పటికి వున్న రాష్ట్రీయశాఖలేకాక, జిల్లా, తాలుకా, గ్రామశాఖలు ఏర్పాటు చేసి, సభ్యుల్ని చేర్చాలని తీర్మానించబడినది. నాలుగు నెలలలో గాంధీ నాయకత్వాన కాంగ్రెసు ఇంతింతై ....త్రివిక్రమరూపం దాల్చినది.

ఎందరో న్యాయవాదులు, డాక్టర్లు, ప్రభుత్వోద్యోగులు తమ వృత్తులు మానుకుని సహాయనిరాకరణ ఉద్యమంలో చేరినారు. ఎంతమందో విద్యార్థులు చదువుమాని ఉద్యమంలో వురికినారు. ఆంధ్ర దేశంలో, ఇతర రాష్ట్రాల అన్నిటికంటె గాంధీ తత్వం ప్రబలంగా వ్యాపించినది. ఇంత మంది న్యాయవాదులు, డాక్టర్లు, ఉద్యోగస్థులు, గ్రామాధికారులు, విద్యార్థులు ఏ రాష్ట్రంలోనూ గాంధీమార్గం అనుసరించలేదు. గుంటూరులో అదివరకే మూడు నాలుగు సంవత్సరాల క్రితం కొండా వెంకటప్పయ్య తన న్యాయవాదవృత్తి మానుకుని, ఆంధ్రోద్యమం స్థాపించి, దేశసేవ చేస్తున్నాడు. గాంధీ శంఖారావం విన్న తర్వాత గొల్లపూడి సీతారామశాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణ, నడింపల్లి లక్ష్మీనరసింహారావు, మాడభూషి వేదాంతం నరసింహాచార్యులు, పోలిశెట్టి హనుమయ్య గుప్త, గోవిందరాజు శ్రీనివాసరావు, దామరాజు పుండరీకాక్షుడు, మొదలైన ప్రముఖులు న్యాయవాదవృత్తి విడిచిపెట్టినారు. సీతారామశాస్త్రి, లక్ష్మీనారాయణ యావజ్జీవం కాంగ్రెసు వాదులుగా వుండి, నాయకులై, దేశసేవ చేసినారు. లక్ష్మీనారాయణ, ఆయన సతీమణి లక్ష్మీబాయమ్మ సంఘ సంస్కారులు, శారదానికేతన సంస్థాపకులు, నడింపల్లి ఎక్కువగా నగర రాజకీయాలలోనే నిలిచి ఛైర్మనుగా వుంటూ వచ్చినాడు. నగరానికి చిరకాలం ఆయన కిరీటంలేని రాజు.

నరసారావు పేటలో కోలవెన్ను రామకోటీశ్వరరావు న్యాయవాద వృత్తి మానుకున్నాడు. "స్వరాజ్య" పత్రికలో పనిచేసి, 'త్రివేణి' స్థాపించి, తన సర్వస్వం దానికే వినియోగించినాడు. కొన్నాళ్లు బందరు జాతీయ కళాశాల ప్రిన్సిపాలుగా పని చేసినాడు. జిల్లాలో ఉద్యోగస్థులు రాజీనామా లిచ్చినారు. వారిలో దిగుమర్తి వెంకటరామస్వామి, రావూరి రంగారావూ, వడ్లమూడి ముక్తేశ్వర ప్రసాదరావు, గుండ్లపల్లి రామకృష్ణయ్య ముఖ్యులు.

గుంటూరుజిల్లా గ్రామోద్యోగులు ఏటేటా సమావేశమై తమ యోగక్షేమాలు చర్చించుకునేవారు. ఆ యేడు పుసులూరులో సమావేశమైనారు. గాంధీ సందేశం చర్చించినారు. గ్రామోద్యోగులు మూకవుమ్మడిగా రాజీనామాలు చెయ్యాలన్నారు. జిల్లాలో చాలామంది గ్రామమునసబులూ, కరణాలూ, వెట్టివారూ రాజీనామా లిచ్చి నారు. ముఖ్యంగా, పుసులూరు సమీపంలో వున్న పెదనందిపాడు ఫిర్కాలో అంతా రాజీనామా ఇచ్చినారు. రాజీనామా లిచ్చిన వారిలో, బాపట్లతాలూకా, చందవోలు కరణం మాచిరాజు రామమూర్తి నాయకుడు. ఆయా గ్రామాలలో గాంధీ కార్యక్రమం అమలు జరపడానికి నిశ్చయించినారు.

విద్యార్థులలో చాలామంది తాత్కాలికంగానూ, కొందరు శాశ్వతంగానూ చదువులు మానేసినారు. వారిలో గోవిందరాజు వెంకటకృష్ణరావు, వింజమూరి అనంతాచారి, దేశంలో సంచారం చేసి, కాలేజీ విద్యార్థుల సభలు చేసి, ఉద్యమంలో చేరమని వారిని ప్రోత్సహించినారు. కృష్ణరావు రచయిత, విభేఖరి. 'స్వరాజ్య'లో పనిజేసి, తర్వాత తన స్వంతపత్రికలు నడిపినాడు. అనంతాచారి గొప్పవక్త.

ఈ పరిస్థితులలో, 1921 మార్చి 31, ఏప్రిల్ 1 వ తారీఖులలో అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశం బెజవాడలో , జరిగినది. ఆసమావేశానికి మహానాయకులంతా బెజవాడ వచ్చినారు. మహాత్ముడు వచ్చినాడు. అది కాంగ్రెసు మహాసభ కాదు, కమిటీ సమావేశం మాత్రం. మహాత్ముడు అదివరలో ఆంధ్రదేశం వచ్చినాడు. 1917 లో మద్రాసు రాష్ట్ర కాంగ్రెసు సమావేశం నెల్లూరులో జరిగినది. ఆ సభకి శ్రీనివాసశాస్త్రి, శ్రీనివాసయ్యంగారితో పాటు గాంధీ వచ్చినాడు. అప్పుడాయన దక్షిణాఫ్రికాలో పేరుపొందిన ఒక భారతీయుడు. 1919 లో వచ్చినాడు. 1920 లో వచ్చినాడు. అప్పుడాయన ఒక కాంగ్రెసు నాయకుడు. 1921 ఏప్రిల్ లో ఆయన భారతదేశపు ఏకైక నాయకుడు, మహాత్మా గాంధీ.

ఏ కాంగ్రెసు మహాసభకీకూడా అంతమందిజనం రాలేదు. ఆంధ్రదేశం నలుమూలలన్నించీ పిల్లలూ పెద్దలూ, రైళ్ళమీద, కార్లమీద, బళ్ళమీద, పడవల మీద, కాలినడకని బెజవాడ చేరినారు. కొన్నిలక్షలమంది. పుష్కరానికికూడా కృష్ణా స్నానానికి అంతమందిరాలేదు. అప్పుడు విజయవాడ చిన్ననగరం. పౌరులు వీధి పొడుగునా పందిళ్లువేసి, తోరణాలుగట్టి, అలికి ముగ్గులు పెట్టి, పండుగచేసుకుని, మహాత్ముడికి మంగళహారతులిచ్చినారు. నేల ఈనినట్టు తండోపతండాలుగా విర్చుకు పడ్డ జన సమూహాలు, కరిగి నీరై ప్రవహించినట్టు తరంగాలుగా, గాంధీదర్శనం కోసం, వూరిమీద పడ్డారు. సభలుచేయడానికిగాని, నాయకులు నడవడానికిగాని వీలు లేకపోయినది. పోలీసుబందోబస్తు చాలలేదు. మనుషులు మనుషుల్ని మల్లించగలరు

గాని ప్రవాహాన్ని అరికట్టగలరా? అప్పుడు దుగ్గిరాల గోపాలకృష్ణాయ్యని ఈ పనికి నియోగించినారు. ఆయన 500 మంది రామదండుతో చీరాల-పేరాలనించి స్పెషల్ రైలుతో దిగినాడు. అందరూ రక్తాంబరధారులు, దండధరులు. "శ్రీమద్రమారమాణ గోవిందోహారి" అని ఆయనా ఆయన స్వచ్ఛందభటులూ, జనాన్ని సర్ది, బారులు తీర్చి, బాటలు కల్పించి, అపాయాలులేకుండా జనాన్ని కాపాడి, ఆమందిని ఒకతీరుకీ తెన్నుకీ తీసుకువచ్చినారు. గాంధీ బహిరంగసభ ఏర్పాట్లు సరిగా జరిగినవి. బెజవాడ కాంగ్రెసు సమితి సభలో ఒక నిర్ణీత కార్యక్రమం ఆమోదించినారు. అది నడపడానికి తిలక్‌స్వరాజ్యనిధి అని లోకమాన్యుడి స్మారకచిహ్నంగా కోటిరూపాయలు సేకరించడానికి నిర్ణయమైనది. అడిగింది తడవుగా ఆంధ్రులిచ్చినారు. స్త్రీలు తమ నగలువొల్చి ఇచ్చినారు. వారిలో ఏలూరువాసి మాగంటి అన్నపూర్ణదేవి మహా త్యాగం చేసినది.

ఈ బెజవాడ సభల సమయంలోనే పింగళివెంకయ్య ప్రోద్బలంతో గాంధీ త్రివర్ణజాతీయ పతాకం ఆమోదించినాడు. ఛరఖాబదులు ధర్మచక్రంతో ఆ పతాకం మన జాతీయపతాకం. అది ఆంధ్రపయత్నం. వెంకయ్య గొప్ప మేధావి. భూగర్భ శాస్త్రంలో, వ్యవసాయంలో నిపుణుడు, పది పన్నెండేళ్లు జండాసంగతి కాంగ్రెసులో ప్రస్తావించినాడు. గాంధీయుగంలో ఆయన ఆశయం ఫలించినది. అదివరకు జండా లేదు. కాంగ్రెసు అధికార చరిత్ర వ్రాసిన పట్టాభి ఆయన పేరు చెప్పలేదు. ఆంధ్ర యువకుడన్నాడు.

ఆ బెజవాడ తిరునాళ్లలో ప్రజలు చూసినది ఇద్దర్నే. ఒకరు మహాత్మా గాంధి. ఇంకొకరు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య. ఆంధ్రదేశం మహాత్ముడికి ప్రణమిల్లినది. ఆయన ప్రభావంలో పడినది. ఆయన దర్శనం చేసిన వారిలో అనేకమందిమీద, అనేక విధాలుగా, అనేక స్థాయిలుగా ఆ ప్రభావం పరిణమించినది. చాలామంది తమవిదేశ వస్త్రాలు పోగుచేసి, భోగిమంటచేసి ఖద్దరు వస్త్రధారణ ప్రారంభించినారు. అది ప్రజలుచేసిన కనీసత్యాగం. ఆవిధంగా బెజవాడవచ్చి గాంధీమహాత్ముడి దర్శనం చేసుకుని, ఆ ఉత్సాహకార్యక్రమం చూసిన వారిలో, గుంటూరు విద్యార్థి కాసు బ్రహ్మానందరెడ్డికూడా వున్నాడు. అన్నలిద్దరితోను, స్నేహితులతోను కలిసి గాంధీని తొలిసారి చూసినాడు. అన్నదమ్ములు ముగ్గురు కనీస త్యాగం చేసినారు. ఖద్దరు ధారణ ప్రారంభించినారు. శాఖాహారదీక్ష పట్టినారు. అప్పుడు కాంగ్రెసు అభిమానులు, తరువాత కాంగ్రెసు సభ్యులు. ఎన్ని అవాంతరాలు వచ్చినా కాంగ్రెసుని విడిచిపెట్టలేదు. 1921 లో జరిగిన అహమ్మదాబాదు కాంగ్రెసుకి అన్నగారు వెంకటరెడ్డి వెళ్లివచ్చినాడు.

ఈ వాతావరణంలో ఆ యేడుపరీక్షలై పోయినవి. సెలవల్లో ఇంటికి వెళ్ళినారు. పెద్దవాడు వెంకటరెడ్డి బాధ్యతకలవాడు, తెలిసినవాడు. తల్లితో అన్నీచెప్పినాడు. గాంధీకార్యక్రమం విశదంగా బోధించినాడు. ఆమె ఏమీా అనలేదు. అవసాన సమయంలో 'నాయన' అన్నమాట జ్ఞాపకంచేసినది. తమ్ముళ్ళుకూడా పెద్దవాళ్ళై, చదువు సంధ్యలునేర్చుకుని, 'నాయన' ఆశయం నెరవేర్చిన తర్వాత, దేశసేవచెయ్యడానికి చాలావ్యవధివున్నది అన్నది. ఆ సంగతి ఆవిడముందు మళ్లీ రాలేదు. తొందర కాసువారి స్వభావంలో లేదు.



# చీరాల రామదాసు

బెజవాడ సభల తర్వాత గాంధీ ఆంధ్రదేశ సంచారం చేసినాడు. అప్పటికే గుంటూరుజిల్లాలో సహాయనిరాకరణ ఉద్యమం ప్రారంభమైనది. ఉద్యమానికి స్థానం చీరాల-పేరాల అనే జంటగ్రామాలు. దీనికి నాయకుడు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య. గోపాలకృష్ణుడు 'లీలామానవుడు. స్ఫురద్రూపి. వక్త. మంచి శారీరం కలవాడు; పాటాపద్యం చక్కగా పాడగలిగినవాడు. ఆంగ్లాంధ్ర గీర్వాణ భాషలలో పండితుడు. కృష్ణాజిల్లా పెనుగంచిప్రోలులో పుట్టినాడు. గుంటూరుజిల్లా రేపెల్లెతాలూకా కూచినపూడి అగ్రహార కాపురస్థుడు. ఎడింబరాలో ఎం. ఏ. పరీక్షలో కృతార్థుడై, రాజమండ్రి ట్రెయినింగు కాలేజీలో ఉపన్యాసకుడుగా పనిచేసి, రాజీనామాఇచ్చి, బందరు జాతీయ కళాశాలలో పనిజేసి, పట్టాభితో పడక మానేసి, కాంగ్రెసులో పనిజేసి, ఆ కార్యక్రమంలోనే చీరాల-పేరాల సత్యాగ్రహ ఉద్యమం ఒక్క చెయ్యిమీద నడిపినాడు.

చీరాల-పేరాల చేతినూలు వస్త్రాల ఎగుమతికి పేరుపొందినది. 1918 లో గుంటూరుజిల్లాలో ప్లేగు వ్యాపించినది. చీరాల-పేరాలలోకూడా వచ్చినది. ఆ గ్రామాలు రెండూ, రెండు యూనియన్లుగా వుండేవి. అశుభ్రతవల్ల జాడ్యం వచ్చినది. ఇవి రెండూ కలిపి ఒక మునిసిపాలిటీ చేసి, పన్నులు అధికంచేసి, ఆ డబ్బుతో వూళ్లో మరుగుదొడ్లు, నీటిసదుపాయం, ఇతర నగర పరిశుభ్ర కార్యక్రమం అమలు జరపాలని ప్రభుత్వం నిర్ణయించినది.

ఆనాటి ప్రభుత్వం ద్వంద్వప్రభుత్వం. మాంట్-ఫర్డు సంస్కరణలు అమలులోకి వచ్చిన తర్వాత, కాంగ్రెసు వాటిని తిరస్కరించినది. శాసనసభ ఎన్నికలకి కొత్తగా రూపొందిన జిస్టిసుపార్టీమాత్రం అభ్యర్థుల్ని నిలబెట్టినది. జిస్టిసుపార్టీకి

మరోపేరు బ్రాహ్మణేతర సంఘం. అంతవరకూ చదువుకున్నవారు బ్రాహ్మణులే కావడంవల్ల, బ్రాహ్మణులు కానివారికి ప్రభుత్వోద్యోగాలు దొరకలేదు. న్యాయవాదులు, డాక్టర్లు, ఇంజనీర్లు, ప్రభుత్వోద్యోగులు నూటికి ఎనభైకి పైగా బ్రాహ్మణులే వుండేవారు. విద్యాసంస్థలలో ఉపాధ్యాయులు వారు, విద్యార్థులు వారు. సర్వీసుపరీక్షలలో జయంపొందేది వారు. యూనియన్, మునిసిపాలిటీ, తాలూకా బోర్డు, జిల్లాబోర్డు, శాసనసభలలో బ్రాహ్మణులు. అంతా బ్రాహ్మణ ప్రభావం. ఇంతకీ బ్రాహ్మణుల జనాభా నూటికి మూడువంతులు మాత్రం. చివరకి కాంగ్రెసులో చేరి సహాయనిరాకరణం చేసి ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమం నడిపించేది కూడా బ్రాహ్మణులే. మద్రాసురాష్ట్రం అంతా ఇదేరీతిలో వుండేది. ముఖ్యంగా మలబారులో సంఘవ్యవస్థ నంబూద్రి బ్రాహ్మణుల యాజమాన్యంలో వుండేది. తత్కారణంగా ఆధునిక సంప్రదాయాలకీ, ఆచారాలకీ, భావాలకీ కష్టంతోచే కొన్ని దురాచారాలు కూడా ప్రబలినవి. తత్కారణంగా బ్రాహ్మణ వ్యతిరేక భావాలు బ్రాహ్మణేతరులలో పెరిగినవి. బ్రాహ్మణేతర సంఘీభావం అనే నినాదం బయలుదేరినది. మలబారులో టి. మాధవన్ నాయర్, మద్రాసులో పిట్టి త్యాగరాయచెట్టి ఈ ఉద్యమానికి నాయకులు. సౌత్ఇండియన్ పీపుల్స్ సంఘం స్థాపించినారు. సమావేశాలు జరిపి సంఘీభావం చేకూర్చి, జస్టిసుపార్టీ స్థాపించినారు. ఇంగ్లీషులో, తెలుగులో, అరవంలో పత్రికలు స్థాపించినారు. జమీందార్ల, రైతుల సహాయం పొందినారు. ఈ కృషికి ధ్యేయం, బ్రాహ్మణేతర వర్ణాల పురోగమనం, బ్రాహ్మణేతరులకి ప్రభుత్వోద్యోగాలలో జనాభాలెక్క ప్రకారం ఉద్యోగాలు. 1916 లోనే కార్యదర్శి, పిట్టి త్యాగరాయచెట్టి, సంతకంతో ఒక నివేదిక ప్రకటించినారు. త్యాగరాయచెట్టి స్వయంగా బ్రాహ్మణభక్తుడు, దైవభక్తుడు. మద్రాసులో పలుకుబడి కలిగినవాడు. కాని న్యాయంకోసం ఈ పార్టీ స్థాపించినాడు. జస్టిసుపార్టీ స్వరాజ్యానికి వ్యతిరేకం కాదు; అయినా ప్రభుత్వానికి కూడా వ్యతిరేకంకాదు. మితవాద రాజకీయాలతో, బ్రాహ్మణేతరులకి న్యాయంకోసం కృషి సల్పినది. అమృతసర్ కాంగ్రెసుదాకా జస్టిసు నాయకులు చాలామంది కాంగ్రెసులోనే వుండేవారు. వీరిలో ముఖ్యులు కూర్మా వెంకటరెడ్డినాయుడు, అన్నెం పరశురామ పాత్రో. ఇద్దరూ న్యాయవాదులే, దేశసేవకులే. వీరందరూ ఆంధ్రోద్యమానికి మాత్రం అనుకూలురు. ఆ సందర్భంలో చాలా కృషి చేసినారు.

కాంగ్రెసుకి వ్యతిరేకంగా ఒక పార్టీ అవసరమని బ్రిటిషువారికి తోచినది. వారు అభిమానించినారు. 1920 నవంబరులో శాసన సభలకి ఎన్నికలలో జస్టిసు పార్టీవారు నిలిచినారు. అసహాయ ఉద్యమం మూలాన్ని ఆంధ్రదేశంలో చాలా చోట్ల వోట్లపెట్టెలు ఖాళీగానే వెళ్ళినవి. ఏమైనా సహకరించే జస్టిసు సభ్యులు ఎన్నికైనారు. అవిభక్త మద్రాసులో అనగా, "తెలుగుజిల్లాలు, మొత్తం తమిళజిల్లాలు,

ఒక కన్నడజిల్లా, ఒక కేరళ జిల్లాలతోలోకూడిన రాష్ట్రంలో, జిస్టిసు మంత్రివర్గం ఏర్పడినది. ద్వంద్వ ప్రభుత్వం ప్రకారం ఈ మంత్రులకి కొన్ని అధికారాలు సంక్రమించినవి. ఆ మంత్రివర్గానికి నాయకుడు, కాళహస్తి వాస్తవ్యుడూ, జమీందారూ అయిన పానుగంటి రామారాయణింగారు. ప్రధాన మంత్రి. తమిళనాడు వాస్తవ్యుడు సుబ్బరాయలురెడ్డి, ఏలూరువాసి కూర్మా వెంకటరెడ్డి నాయుడు ముచ్చటగా ముగ్గురు మంత్రులు. ముగ్గురూ తెలుగువారే. మద్రాసులో కామరాజు మంత్రి వర్గం ఏర్పడేవరకూ, కొంతకాలం డాక్టరు సుబ్బరాయన్, కాంగ్రెసు పదవులు స్వీకరించి 1937 లో మంత్రిత్వం ఏర్పాటు చేసినప్పుడు రాజగోపాలాచారి తప్ప 1921 మొదలు 1950 వరకూ తెలుగువారే ముఖ్యమంత్రులు.

పానుగంటి రామారాయణింగారు, తరవాత పానుగల్లు రాజా బిరుదాంచితుడైనాడు. ఎం. ఏ. పట్టభద్రుడు. ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతభాషలలో పండితుడు. వీరి వంశస్థులు తెలంగాణా పానుగంటివారు. కాళహస్తి ఇల్లరికం పోగా అక్కడే సువర్ణముఖినదికి ఉత్తరతీరంలో నివాసం ఏర్పర్చుకుని అక్కడో పానుగల్లు నిర్మించుకున్నారు. పానుగల్లురాజా మహామేధావి. రాజులాగే వుండేవాడు. అపరచాణక్యుడనేవారు ఈయన్ని. దేవాదాయ సంస్కరణలకీ, ఇప్పటి శ్రీ వేంకటేశ్వరవిద్యాలయానికి పూర్వరూపం ఆయన కల్పించినాడు. ఒకసారి అల్లాడి కృష్ణస్వామిఅయ్య అనే గొప్ప న్యాయవాది ఈయనకి వ్యతిరేకంగా, భూస్వాముల నియోజకవర్గంలో శాసనసభకి అభ్యర్థిగా నిలిచినాడు. ఒక్క వోటులో వోడిపోయి నాడు. కాని ఎప్పటికైనా గట్టివ్యతిరేకే. పార్టీలో కూర్మా వెంకటరెడ్డినాయుడు ఎదురు తిరిగినాడు. కట్టమంచి రామలింగారెడ్డి శాసనసభలో వ్యతిరేకపక్ష నాయకుడై విశ్వాసరాహిత్యతీర్మానం ప్రతిపాదించినాడు. ఆయన ఉపన్యాసం సభూతో నభవిష్యతి. సి. పి. రామస్వామిఅయ్యరు జస్టిసుపార్టీకి ప్రత్యక్షంగా నిలిచి, ఎదురై తమిళనాథులో బ్రాహ్మణసంఘాన్ని నిలబెట్ట పూనినాడు. వీరందరి వ్యతిరేకతా దూరం చెయ్యడానికి పానుగల్లురాజా గొప్ప మంత్రాంగం పన్నినాడు. అల్లాడి కృష్ణస్వామిని అడ్వకేటు జనరల్ చేసినాడు. అంతకంటె పాత్రుడు లేడన్నారందరూను. రెడ్డినాయుణ్ణి దక్షిణాఫ్రికా ఏజంటు—జనరలుగా పంపించినాడు. ఆ నియామకం గాంధీ ఆమోదంకూడా పొందినది. రామలింగారెడ్డిని కొత్తగా స్థాపించిన ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడుగా వేసినాడు. ఉన్నవారిలో అర్హుడు మాత్రమే కాదు, అంతకంటె ఉత్తములు లేరన్నారు. రామస్వామిఅయ్యర్ని అంతర్జాతీయసమితికి పంపించినాడు. భేష్ అన్నది ప్రజాపత్రికాలోకం. అవసరం పట్ల కేంద్ర ప్రభుత్వాన్ని బెదిరించేటంత శక్తిసామర్థ్యాలు సాధించినాడు.

పానుగల్లురాజాతర్వాత, చిత్తూరుజిల్లావాడే బొల్లిని మునిస్వామినాయుడు (ఆయన చౌదరి) మద్రాసు ప్రధానమంత్రి. రైతుబాంధవుడు. మునుస్వామి

తరువాత బొబ్బిలి రాజా ప్రధానమంత్రి. పంచాయతీ పరిపాలన కూడా తెలియని వాడీయన అన్నారు ఆదిలో. సంవత్సరం తిరిగేసరికి, ప్రభుత్వం బొబ్బిలి పరిపాలనాచాకచక్యం గమనించి కె. సి. ఐ. యి. బిరుదు ప్రసాదించినది. కాంగ్రెసు శాసనసభలకి వెళ్ళి అధికారం స్వీకరించడంలో ఆలస్యం చేసినప్పుడు రెడ్డినాయుడు ప్రధానమంత్రి. రాజగోపాలాచారిప్రభుత్వం రాజీనామాయిచ్చి, కాంగ్రెసునాయకులు జైళ్ళకివెళ్ళి, తిరిగి కాంగ్రెసు 1947 లో ప్రభుత్వస్వీకారం చేసినప్పుడు గాంధీ అభిప్రాయం ధిక్కరించిన ప్రకాశం ముఖ్యమంత్రి. ప్రకాశాన్ని మనవారే కుట్రలు పన్ని దింపినప్పుడు, ఒమ్మాండూరు రామస్వామిరెడ్డి ముఖ్యమంత్రి. ఆయన తర్వాత ముఖ్యమంత్రి పూసపాటి కుమారస్వామిరాజు. అంతఃకలహాలూ, అసూయలూ లేకపోతే ఆంధ్రనాయకులు ఇంతకంటె ఎక్కువ సేవచేసి, కీర్తిప్రతిష్ఠలు గడించివుండేవారు. మనకి ఈశ్వరుడుకూడా పట్టలేని ఇంటిదొంగలు ఎక్కువ.

1921 లో రామారాయణింగారు ముఖ్యమంత్రేకాక స్థానిక ప్రజాపరిపాలనా శాఖమంత్రికూడాను. ఆయన హయాంలో చీరాల—పేరాలగ్రామాలు మునిసిపాలిటిగా రూపొందినవి. ప్రజలు మునిసిపాలిటీ వద్దనీ, అందువల్ల వారికి లభించే సౌకర్యాలు అధిక పన్నులుతప్ప ఏమీలేవనీ మహజర్లు పంపుకున్నారు. అప్పుడు పి. సి. యన్. యెతిరాజులునాయుడు గుంటూరునించి శాసనసభలో సభ్యుడు. వర్జీనియా పొగాకు వ్యాపారంచేసినవారిలో ప్రథముడు. పొగాకునాయుడనేవారు. ఆ కాలంలో ఆయన గుంటూరు మునిసిపాలిటీ చైర్మన్ కూడాను. కొన్నాళ్ళు జిల్లాబోర్డు అధ్యక్షుడు. తెలుగుదేశంలో పేరుపొందిన జస్టిసునాయకుడు. ప్రజలు ఎంత తంటాలుపడినా చీరాల-పేరాల మునిసిపాలిటీ రద్దు కాలేదు. ఆరునెలలు బలవంతంగా ఒక స్పెషలు ఆఫీసర్ని వేసి రుద్దినారు. ప్రజలలో అసంతృప్తి హెచ్చినది. ఒక ఉద్యమానికిగాని, ఒక నాయకుడు పైకి రావడానికిగాని జనంలో ఇదివరకు వున్నటువంటిదిగాని, కొత్తగా సృష్టించినటువంటిదిగాని అసంతృప్తే పునాది. సహాయనిరాకరణ ఉద్యమం ఇక్కడ యెందుకు ప్రయోగం చెయ్యకూడదని దుగ్గిరాల గోపాలకృష్ణయ్యకి తోచినది. ఈ ప్రయత్నానికి గాంధీ అనుమతి వున్నట్టు తోచదు. అయినా అమలు జరిపినాడు. చీరాల—పేరాల ప్రజల్ని ప్రోత్సహించి మునిసిపలు పన్నులు ఎగవేయించినాడు. రామదండు ఏర్పాటుచేసి, పంచాయతీలు పెట్టి, ప్రజలు కోర్టులికి వెళ్ళకుండా చేసినాడు. గాంధీ కార్యక్రమం అక్షరాలా అమలు జరిపినాడు. ప్రభుత్వం లొంగలేదు. చాలామందిని, వొక వృద్ధురాలితోసహా, జైలులో పెట్టినారు. వెళ్ళినవారువెళ్ళగా తిరిగివచ్చినవారు వస్తున్నారు. ఇటువంటి తరుణంలో బెజవాడ సభలు జరిగినవి. గోపాలకృష్ణుడు గాంధీదృష్టేకాక, భారతీయ ప్రజ దృష్టికూడా ఆకర్షించినాడు. అన్నీ విని చిత్తరంజనదాసు చీరాల—పేరాలలో 'రామరాజ్యమే' గాని బ్రిటిషురాజ్యం లేదన్నాడు.

ఆంధ్రదేశసంచారంలో ఏప్రిల్ 6 వ తారీఖుని గాంధీ చీరాల దర్శించినాడు. సంతోషించినాడు. జైలుకి వెళ్ళివచ్చిన వృద్ధురాలు ఆయన్ని దర్శించినది. అప్పుడు గోపాలకృష్ణుడు అడిగినాడు, "ఈ గ్రామస్థుల్ని ఇక్కణ్ణించి లేవదీసి వేరేచోట మరో గ్రామం నిర్మిస్తాను మీ అభిప్రాయం ఏమిటీ" అని. "నువ్వు జయం సాధిస్తే కాంగ్రెసుకి గౌరవప్రతిష్ఠలు లభిస్తాయి. నువ్వు వోడిపోతే బాధ్యత అంతా నీదే" అని కోమటిసాక్ష్యం చెప్పినాడు. తనదారిని తాను వెళ్ళినాడు.

చీరాల రామదాసు అని పేరు పెట్టుకున్న గోపాలకృష్ణుడు, రామదండులు కొలువు చెయ్యగా, రామనగరం అనే వో గ్రామం నిర్మించి అక్కడికి ఇరవై వేల మంది ప్రజల్ని తట్టాబుట్టాతో, చీపురూ, అలుగుడ్డతోసహా తర్లించుకుపోయి బ్రిటిషు ప్రభుత్వం గాజులు తొడిగించుకున్నదని ప్రకటించినాడు. రామనగరంలో పన్నులు లేవు, కోర్టులు లేవు, మునిసిపాలిటీ లేదు, అది రామరాజ్యం. నేత చీరాల రామదాసు; భటులు రామదండు. హరికథలతో, భజనలతో, వినోదాలతో, తన అనర్గళ వాగ్ధారతో ప్రజల్ని ఉత్సాహపరిచి, దేశసంచారం చేసి ఉపన్యాసాలిచ్చి ధనం ఆర్జించి ఆ ప్రజల్ని పోషించినాడు.

ఇంతలో బరంపురంలో ఆంధ్రమహాసభలు జరిగినవి. వెంకటప్పయ్యస్థానే వరహగిరి జోగయ్య పంతులు మహాసభ సారధ్యం స్వీకరించినాడు. జోగయ్య రాష్ట్రపతి గిరి తండ్రి. ఆ సభకి రామదాసు వెళ్ళినాడు. గంజాంజిల్లా అప్పుడు మద్రాసురాష్ట్రంలో భాగం. ఒరిస్సా ఏర్పాటు కాలేదు. గోపాలకృష్ణుణ్ణి ఎల్లాగో పట్టాలన్న తెల్లవారి ఆశయం ఫలించినది. ఆయన ఉపన్యాసం చెయ్యగూడదన్నాడు కలెక్టరు. కట్టుబాటులో కవిత్వం, సంకెళ్ళలో సంగీతం ఆగవు. ఆంధ్రరత్నం అపారదేశభక్తి అటువంటిది. అతని ఉద్రేకం అంతటిది. కలెక్టరుగారి ఆజ్ఞ ధిక్కరించినాడు. అరెస్టుచేసి, శిక్షవిధించి తిరుచినాపల్లిజైలుకి పంపించినారు.

నాయకుడులేని ప్రజలు ఇడుమలు పడలేక పోయినారు, ప్రభుత్వం బాధలు ఎక్కువ చేసినది. కాంగ్రెసునాయకులు ఇంకొకరు పూనుకోలేదు. గెలిస్తే 'మమ' అనుకునేవారు. ప్రజలు చీరాల–పేరాల గ్రామాలలో పునః ప్రవేశంచెయ్యక తప్పినది కాదు. ఎవరినీ లక్ష్యంచెయ్యని ఆంధ్రరత్నం ఏకాకి అయినాడు. వర్ణవిభేదం లేకుండా అంతాకృషిచేసి బ్రహ్మత్వం పొందాలనేవాడు. కాశ్మీరదేశంలోలాగ హిందువులందరూ బ్రాహ్మణులుగానే వుండాలన్న పద్ధతి బోధించేవాడు. ఆంధ్ర రత్న సందేశదీపం పట్టుకుని ఇంకా తిరుగుతున్నాడు, శిష్యుడు, బ్రహ్మశ్రీ గుమ్మడిదల వెంకటసుబ్బారావు.

గోపాలకృష్ణయ్య అఖిలభారత కాంగ్రెసు కమిటీ కార్యదర్శిగా వున్నాడు. అప్పుడు తాత్కాలిక అధ్యక్షుడు కొండా వెంకటప్పయ్య. కాంగ్రెసు కార్యాలయం

అలహాబాదులో స్వరాజ్య భవనంలో వుండేది. ఆ కార్యాలయం తర్లించి తన హయాంలో బెజవాడ తీసుకు వచ్చినాడు గోపాలకృష్ణయ్య. మధ్యవయస్సులోనే బీదరికంతో, క్షయవ్యాధితో బాధపడి, గుంటూరులో మరణించినాడు. కవి, గాయకుడు, వక్త, చమత్కారి. ఆయన అనర్గళవాగ్ధారలో తడిసి తనియనివారు ఆ రోజుల్లో గుంటూరు సీమలో లేరు బ్రహ్మానందం చిన్నతనంలో. ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య వీరుడు, ధీరుడు, విక్రమార్కుడు. ఆయన ప్రభావం పడని చిన్నవారులేరు. ఆంధ్రరత్నం అస్తమయంతో :

వీరమణిహార మందున
రత్నమొక్కటి జారిపోయెను
నింగివెలిగెడు చుక్కలందున
కొత్తగా నొకతెనుగుచుక్కగ మెరసిపోయెనుగా !



# 'మించాలపాడు' హనుమంతు

గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా ప్రసిద్ధి గన్నది. నాగార్జునకొండ ఆ తాలూకాలో ప్రదేశమే. పల్నాటికి వీర పల్నాడని పేరు. పదకొండవ శతాబ్దంలో పల్నాటి వీరులయుద్ధం జరిగినది. ఆ యుద్ధంలో అలగామపాడు గ్రామస్థురాలు నాగమ్మ ఒకవేపు మంత్రీ సేనానిగానూ, శిరం బ్రహ్మనాయడు ఒకవేపు మంత్రి సేనానిగానూ కథ నడిపినారు. పల్నాడంతా ఈ వీరగాధల చిహ్నాలతో నిండినది. అది శైవవైష్ణవ మత సంగ్రామ మన్నారు కొందరు; కమ్మ వెలమ తగాదాలన్నారు మరికొందరు. ఏమైనా ఆ ప్రజానీకంలో వీరగాధలు ఇంకా నిలిచి వున్నవి. శ్రీనాథ మహాకవి రచించిన పల్నాటి కథ పల్లెపట్టులలో బుర్రకథలుగా విని ఉద్రేకం చెందని వారుండరు. ఆ వీరసంప్రదాయం నడుస్తూనే వున్నది. పల్నాటి పశువులూ, ప్రజలూకూడా దృఢకాయులు. స్త్రీలు కూడా ఆజానుబాహురాండ్రు. పురుషులతో సమంగా పొలంపని చేస్తారు.

ఈ తాలూకా చుట్టుపట్ల దట్టమైన అడవులూ, చిట్టడువులూ వుండేవి. ప్రఖ్యాతి గాంచిన పల్నాటి పశువులు ఆ అడవుల్లో మేసేవి. మేసినందుకు 'పుల్లరి' అని సుంకాలు చెల్లించేవారు ఆసాములు. సుంకాలు వున్నచోట అధికార్లు తప్పరు. అధికార్లు వున్నచోట సర్కారు పన్నులేగాక ఉద్యోగుల మామూళ్లుకూడా ఒక సంప్రదాయమే. ఈ మామూళ్లతో అధికార్లకీ ఆసాములికీ తగాదాలు వచ్చినవి. అది చిలికి చిలికి గాలివానగా మారి ఆసాములు అసలే పన్నులు చెల్లించమన్నారు. అప్పటికే గాంధీ సహాయనిరాకరణం, పన్నుల సత్యాగ్రహం గాలిలో వున్నవి. ఆసాములకది అనుకూలంగా తోచినది. పన్నులివ్వకుండా పశువుల్ని మేపడం ప్రారంభించినారు. అధికార్లు వీళ్లని హింసలు పెట్టి కసి తీర్చుకున్నారు. రంగా

చెంచయ్య అనే వైశ్య పుంగవుడు రైతుల్ని కూడదీసి, అధికార్లకి ఆ గ్రామాలలో అన్నహారాలు దొరక్కుండా అరి గట్టినాడు. మాచర్ల డిప్యూటీ తహశిల్దారు పొన్నాడ రామకోటి యింట పసిపాపలకి పాలుకూడా దొరకడం కష్టమైనది. సాయుధ పోలీసు దళాలు వెడితే వారికి తిండి తిప్పలు దొరకలేదు. ఈ పరిస్థితులలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘంవారు ఈ సమస్య చర్చించినారు. ఒకసారి అధ్యక్షుడైన వెంకటప్పయ్య మాచెర్ల వెళ్లి, పన్నుల నిరాకరణకి ఇంకా కాంగ్రెసువారు అనుమతి ఇవ్వలేదు గనుక పుల్లరి చెల్లించవలసినదిగా ప్రజల్ని మందలించి వచ్చినాడు. లాభం లేకపోయినది. అసలు వ్యవహారం ఏమిటో పరిశీలించి ఒక నివేదిక తయారు చెయ్యవలసినగా ఉన్నవ లక్ష్మీనారాయణనీ, మాడభూషి వేదాంత నరసింహాచార్యుల్నీ మాచర్ల పంపినది కాంగ్రెసు సంఘం. వీరిద్దరూ వెళ్లి ఆ గ్రామాలలో సంచారం చేస్తున్నారు. అదే సమయంలో జిల్లాకలెక్టరు షీల్డు మాచెర్లలో మకాంగా వుండి విచారణ చేస్తున్నాడు. కాంగ్రెసు నాయకులు సంచారం చేసి ప్రజల్ని రెచ్చగొడుతున్నారని కలెక్టరు అనుమానపడినాడు. వారిద్దర్నీతన యెదుటికివచ్చి, ఎందుకు అల్లా చేస్తున్నారో సంజాయషీ చెప్పుకోవలసినదిగా శ్రీముఖాలు పంపించినాడు. ఆ శ్రీముఖం ప్రజలందరికీ తెలియడానికి దండోరా వేయించాలని తోచినది ఆయనకి. దండోరా కోసం ఒక డప్పుకొట్టేవాణ్ణి పంపించమని గ్రామమునసబుతో చెప్పినాడు. ఆయన కాసేపు గ్రామంలో అటుఇటూ తిరిగి డప్పులు చిరిగిపోయాయనీ దండోరా వీలుపడదనీ దొరవారికి మనవి జేసుకున్నాడు. కాని ఆ తాఖీదు సమీప గ్రామంలో వున్న లక్ష్మీనారాయణకి అందినది. వెంటనే కలెక్టరుగారి సముఖానికి బయలుదేరినాడు. ప్రజలు లక్ష్మీనారాయణని ఒక గజ్జెలగుర్రం ఎక్కించి, వూరేగింపుతో డప్పులు వాయించుకుంటూ తీసుకువచ్చినారు. ఒక డప్పు లేదన్నవూళ్లో ఇన్నిడప్పులు ఎక్కడ్ణించి వొచ్చాయో కలెక్టరుకి తెలియలేదు. "స్వరాజ్యం ఎప్పుడో వస్తుందన్నారు. ఇక్కడ ఇప్పుడే స్వరాజ్యం ప్రత్యక్షమైంది" అన్నాడు. నాయకులిద్దరూ ప్రజలలో అలజడి కలగజేస్తున్నారు గనక, జామీను ఇస్తేనేగాని విడుదల చెయ్యనన్నాడు. వారిద్దరూ జామీను ఇవ్వమని చెప్పినారు. ఇద్దరికీ ఒకో సంవత్సరం విడిఖైదుశిక్ష విధించి రైలులో గుంటూరు పంపించినాడు. ఈ వార్త తెలిసి గుంటూరు జనమేకాక, పక్కవూళ్ల ప్రజలుకూడా రైలు వొచ్చే సమయానికి రైలుస్టేషనుదగ్గిర మూగిపోయినారు. కొండా వెంకటప్పయ్య, లక్ష్మీనారాయణ భార్య, లక్ష్మీబాయమ్మ, కోలవెన్ను రామకోటేశ్వరరావు మొదలైన నాయకులు వార్ని స్టేషను దగ్గిర కలిసినారు. ఖైదీగా దిగిన భర్తనుచూసి లక్ష్మీబాయమ్మ ధైర్యంగానే వున్నదిగాని, ఆవిణ్ణిచూచి వెంకటప్పయ్య కంట తడి బెట్టినాడు. రామకోటేశ్వరరావు ధైర్యము చెప్పినాడు. ఖైదీలిద్దర్నీ బ్రాడీపేట చివర వున్న సబుజైలుకి తీసుకు వెళ్లాలి. ఆ జనసమూహంలో పోలీసువారికి దమ్ములు

లేకపోయినవి. వెంకటప్పయ్య సహాయం కోరగా, ఆయన ముందునడిచి, పోలీసు వార్ని ఖైదీలతో సహా, ఏ అపాయం లేకుండా సబుజైలుకి తర్లించుకు వెళ్లినాడు. ఈ వూరేగింపు రింగురోడ్డు పొడుగునా ఆపిల్లబాలాదీ విడ్డూరంగా తిలకించినారు. మర్నాడు ఖైదీల్ని వేలూరు సెంట్రలు జైలుకి తీసుకుని పోయినారు.

ఆ సాయంకాలం పెద్ద బహిరంగ సభ జరిగినది. వెంకటప్పయ్య అధ్యక్షత వహించినాడు. బెజవాడనించి అయ్యదేవర కాళేశ్వరరావు వచ్చి సభలో ఉపన్యాస మిచ్చినాడు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య తనగంభీర ఉపన్యాసంతో సభికుల్ని దేశ భక్తి పూరితులుగా ఉద్రేక పరిచినాడు. ఆయన సలహామీద నాయకులందరూ ఆలోచించి వారము రోజులు హర్తాళము చెయ్యవలసినదిగా గుంటూరు పౌరుల్ని ఆదేశించినారు. ఈ సమ్మె సంగతి తెలిసి కలెక్టరు మాచెర్లమకాం వొదిలి, యెకా యెకీని గుంటూరు వచ్చినాడు. ఏదోవిధంగా సమ్మె ఆపుజెయ్యడానికి ప్రభుత్వో ద్యోగులు ప్రయత్నించినారు. విఫలులైనారు. వెంకటప్పయ్య నాయకత్వంలో, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి, మద్ది వెంకటసుబ్బయ్య, నడింపల్లి వెంకటలక్ష్మీ నరసింహారావు, బారిస్టరు హనుమయ్య గుప్త, చట్టి నరసింహారావు, చీమకుర్తి బసవయ్య మొదలైన నాయకులు నగర సంచారంచేసి, వర్తకులికి ధైర్యంచెప్పి హర్తాళము జయప్రదంగా చేసినారు. గోపాలకృష్ణయ్య తన శాంతి సైనికుల్ని వెంటబెట్టుకుని కళాశాలలకీ, కచ్చేరీలకీ వెళ్లి, ఉపన్యాసాలిచ్చి అవి మూసెయ్యమని చెప్పినాడు. అటువంటి సమ్మె ఇదివరకు జరగలేదు.

ఆరవరోజుని టవును హైస్కూలువద్ద విద్యార్థుల్ని బైటికి రావలసినదిగా ప్రోత్సహిస్తున్న భట్టిప్రోలు సూర్యప్రకాశరావుని పోలీసువారు పట్టుకుని టవును పోలీసుస్టేషనులో పెట్టినారు. దాంతో జనం అంతా ఆ స్టేషనుచుట్టూ మూగి అంటించడానికి సిద్ధమైనారు. భోజనం చేస్తున్న వెంకటప్పయ్య ఇదివిని వెంటనే ఎండలో నడిచి పోలీసుస్టేషనుకి వెళ్ళినాడు. దారిలో జనం తండోపతండాలుగా ఎదురొచ్చినారు. వారితో ఆయన మాట్లాడుతుండగా వోజట్కాబండి వచ్చినది. ఆ బండివాడి పక్కని వోబిళ్ళ బంట్రోతు కూర్చున్నాడు. ప్రజలు పసిగట్టినారు. సూర్యప్రకాశరావుని పట్టుకోమని ఆర్డరు వేసిన డిప్యూటీ కలెక్టరు గుండూరావు ఆ బండిలోవున్నాడని. పక్కనున్న గుట్టలోంచి రాళ్ళుతీసి బండిమీద రువ్వడం ప్రారంభించినారు. ఒకవేపు రాళ్లతో జనం, ఒకవేపు గుండూరావు బండి, మధ్యన వద్దని నివారిస్తూ, చేతులెత్తి వెంకటప్పయ్య. ఆయనమీదనించే రాళ్లవర్షం నడుస్తోంది. ఒకవేపు ప్రజల్ని వద్దనీ, మీరుపొండి నేనున్నానని గుండూరావునీ బతిమాలి చివరికి ప్రజల్ని ఆపి, గుండూరావుని సాగనంపినాడు దేశభక్తుడు.

ఈ గందరగోళంలోనే ఆవేళ ఆడిప్యూటీ కలెక్టరు ఆఫీసులోనే కల్లుసారా పాటలు. ఆ పాటల దగ్గిర పికెటింగుకి వెంకటప్పయ్య తన అనుచరులతో వెళ్ళినాడు. పాటలు పాడవద్దని ప్రబోధం చేసినాడు. అప్పటికే వేడెక్కిపోయిన గుండూరావుకి వొళ్ళు మండిపోయింది. ఇక్కణ్ణించి ఘొమ్మని పోలీసుజవాన్ని వెంకటప్పయ్య దగ్గిరికి పంపినాడు. ఆయన వినలేదు. తానే వచ్చినాడు. వెంకటప్పయ్య చెయ్యి పట్టుకున్నాడు. శరీరాలలో ఇద్దరూ హస్తిమశకాంతరం. వెంకటప్పయ్య ఆయన చెయ్యి విదలించుకున్నాడు. మేజస్ట్రీటు మళ్ళీపట్టుకోబోతోంటే ఆ దృఢకాయుణ్ణి ఈ పీలమనిషి ఒక్క తోపు తోసినాడు. ఈ సంఘటనతో పాటగాళ్ళు ఎక్కడివాళ్ళు అక్కడ సద్దుకున్నారు. పాటలుబందైనవి.

ఆ మర్నాడు వెంకటప్పయ్య, మద్ది వెంకటసుబ్బయ్య, చీమకుర్తి బసవయ్య, పోలిశెట్టి హనుమయ్యగుప్త, మొదలైనవార్ని అరెస్టుచేసి సబుజైలులో పెట్టినారు. ఆ వార్త వూళ్లోనేకాక పక్కవూళ్లకి కూడా పాకిపోయినది. జనం పోగైనారు. కాలేజీకి పక్కమైదానంలో జరిగిన బహిరంగసభకి హాజరై, గొల్లపూడి సీతారామశాస్త్రి ప్రభృతులు ప్రభుత్వచర్య ఖండిస్తూ చేసిన ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలు విని ఆమోదించినారు. ఆ వేళే కలెక్టరు ముద్దాయిల్ని విచారణ ప్రారంభించినాడు. అది 1921 జులై 30 వ తారీఖు. ప్రభుత్వ కార్యాలయాలలో పనిచేసే ఉద్యోగస్థులంతా రాజీనామాలివ్వాలని తీర్మానించుకున్నారు. ఒకటోతారీఖుని జీతాలు తీసుకుని మానేస్తారన్నవార్త కలెక్టరుకి తెలిసినది. న్యాయవాదులంతా ఆరు నెలలు వృత్తిమానాలని నిశ్చయించుకున్నారు. ఈ వార్తవిని తెనాలి, ఒంగోలు, నర్సారావుపేట నగరాలలోకూడా న్యాయవాదులు తమవృత్తి కొంతకాలం నిలుపుదల చేసినారు. ఇవన్నీ తెలిసి కలెక్టరు వీరందర్నీ నిర్దోషులని విడుదల చేసినాడు. కాని కోర్టులు మూయబడినవి. కాంగ్రెసు సంఘము గుంటూరులో ఒక న్యాయస్థానము స్థాపించి, సబుకోర్టు శిరస్థాదారుగా రాజీనామా ఇచ్చిన దిగుమర్తి వెంకటరామస్వామిని న్యాయాధిపతిగా నియమించి వ్యాజ్యములు తీరుమానం చేయించినది.

ఆరోజు మొదలు మైదానములో ప్రతిరోజూ బహిరంగసభలు బాహాటంగా జరిపి గాంధీ కార్యక్రమం ప్రజలలో ప్రచారం చెయ్యడం జరిగినది. వెంకటప్పయ్య అరెస్టు విషయం బొంబాయి కాంగ్రెసు వర్కింగు కమిటీలో వుండగా ప్రకాశం గాంధీకి చెప్పినాడు. ఆయన సంతోషించి, I wish he were shot down' (తుపాకితో చంపేసినామేలుగా వుండేది") అన్నాడు. ఆ సాయంకాలం సభలో మాట్లాడుతూ, 'The Andhra Lion is fighting alone" అన్నాడు. (ఆంధ్ర సింహం ఒక్కటే పోరు సలుపుతోంది.) సత్యాగ్రహం ఈ విధంగా గుంటూరులో

తప్ప భారతదేశంలో ఎక్కడా అంతవరకు జరగలేదు. గుంటూరు పేరు దేశదేశాలలో మోగినది.

ఉన్నవ లక్ష్మీనారాయణ, మాడభూషి నరసింహాచార్యుల ఖైదుశిక్షతో పల్నాటి అడవిసత్యాగ్రహం ఆగిపోలేదు. మించాలపాడు కాపురస్థుడైన, కన్నెగంటి హనుమంతు నాయకత్వం వహించి, ప్రభుత్వాన్ని ధిక్కరించి, రైతుల్ని పురికొల్పి, పన్నులు కట్టకుండానే పశువుల్ని అడవుల్లో మేపిస్తున్నాడు. సాయుధ పోలీసుదళాలు భయపెట్టినా దడిసిపోక పల్నాటి రైతులు అడివి సత్యాగ్రహం కొనసాగిస్తున్నారు. వున్నా ప్రభుత్వం లేనట్టే అయినది. అధికారులికి ఏమీతోచ లేదు. ఒక కుట్రపన్నుగడ చేసినారు. హనుమంతుని డిప్టీకలెక్టరుగారు మాట్లాడడానికి పిలుస్తున్నారని చెప్పి, రప్పించినారు. హనుమంతు నిజమేననుకుని మించాలపాడునించి డిప్టీకలెక్టరు మకాం కొల్లిగొట్లకి నడిచి వెడుతున్నాడు. దారిలో ముప్పైమంది పోలీసులు, వొంటరిగాణ్ణిచేసి అతనిమీద తుపాకులు కాల్చినారు. అభిమన్యుడివలె హనుమంతు కూలిపోయినాడు. నేలమీదపడి, గాయాలలోంచి రక్తం వరదలై పారుతూ, యమయాతన పడుతూ, "దాహం, దాహం" అని అరిచినాడు. ఒక హెడ్‌కనిస్టీబు తన మూత్రం ఆ మహావీరుడినోట్లో పోసినాడు. ఆ అమానుష కృత్యం అనుభవించి, హనుమంతు ప్రాణాలు అర్పించినాడు. ప్రజలు ఆ శవాన్ని వూరేగించి, రోడ్డుపక్కని సమాధిచేసి, దానిమీద ఒక రాతిపలకమీద అతని పేరు చెక్కినారు. ఇది ఆధునిక పల్నాటి వీరభారతం. ఆ పల్నాటిసీమ కాసువారి నియోజకవర్గం.



# 'పెదనందిపాడు' వీరయ్య

**1921** డిసెంబరునాటికి స్వరాజ్యం రాలేదు.

కారణం సహాయనిరాకరణం గాంధీ ఆదేశించినంత దేశవ్యాప్తం కాలేదు. ఇక లాభంలేదని, మహాత్ముడు చివరి అస్త్రం ప్రయోగించినాడు. ఆ అస్త్రమే పన్నుల నిరాకరణ. ఈ కార్యక్రమం డిసెంబరులో అహమ్మదాబాదులో జరిగిన కాంగ్రెసు మహాసభ ఆమోదించినది. దీనికి గాంధీ కొన్ని షరతులు నిర్ణయించినాడు. దేశ వ్యాప్తంగా ఇది జరగకూడదు. పదునైనప్రాంతంలో, ఖద్దరుకట్టినచోట, అంటరానితనం విడనాడినచోట, తాగుడుమానినచోట, అంతా శాంతిప్రియులైన చోట ప్రయోగ మాత్రంగా ప్రారంభించాలన్నాడు. ఏ రాష్ట్రంలో ఎక్కడ ప్రారంభించాలో ఆయా రాష్ట్ర కాంగ్రెసు కమిటీలు నిర్ణయించాలి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ గుంటూరు జిల్లా ప్రత్యేకించినది. గుంటూరుజిల్లాలో ఎక్కడ అమలు జరిపాలో జిల్లాకమిటీకి విడిచిపెట్టినారు. ఈ కమిటీ ఈ నిర్ణయం తీసుకునేందుకు పొన్నూరులో సమావేశం కావడానికి నిశ్చయించినది. ఆ సభ ప్రభుత్వం నిషేధించినది. అయినా సభ జరిగినది. సహాయనిరాకరణం బాగా జరిగినచోటు, గ్రామోద్యోగులు రాజీనామాలిచ్చిన చోటు, జనం తరిఫీదు అయిన చోటు, శాంతిసైన్యం పనిచేస్తున్నచోటు పెదనంది పాడు ఫిర్కాలో ప్రారంభించాలని తీర్మానం జరిగినది. సభకాగానే నాయకులు గొల్లపూడి సీతారామశాస్త్రి, మద్ది రాధాకృష్ణయ్యవంటివారిని బంధించి గుంటూరు తీసుకుపోయి, విచారించి, శిక్షించి, వేలూరుజైలుకి తీసుకుపోయినారు. రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు వెంకటప్పయ్య అప్పుడే అహమ్మదాబాదునించి జబ్బుపడివచ్చి లేవలేనిస్థితిలో వున్నాడు. దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అదివరకే శ్రీకృష్ణజన్మస్థానంలో వున్నాడు. ఉన్నవ లక్ష్మీనారాయణ, వేదాంత నరసింహాచార్యులూ పల్నాడు అడవి

సత్యాగ్రహంలో ఖైదులోకి పోయినారు. ముందుకువచ్చే పెద్ద నాయకులెవరూ లేరు. ఆ తరుణంలో పెదనందిపాడు ఫిర్కా నాయకుడు పర్వతనేని వీరయ్యచౌదరి ఈ ఉత్కృష్టకార్యక్రమం చేబట్టినాడు. వీరయ్య చదువరికాడు. ఏదో గ్రామీణవిద్య. ధైర్యము కలవాడు, ఆజానుబాహుడు, మంచి విగ్రహం కలవాడు. గంభీరమైన కంఠస్వరం కలవాడు. సంగీతంమీద ఆసక్తి, పాడగలవాడు. తరువాత దక్షిణాదికిపోయి, తంజావూరులో కర్ణాటసంగీత విద్య అభ్యసించి, త్యాగరాజబాణీలు నేర్చుకుని, క్షేత్రయ్య పదాలపాటలో ప్రత్యేకత గణించి, దేశమంతా పాటకచ్చేరీలు చేసి, మొన్నటిదాకా, వృద్ధాప్యంలోకూడా ఆకాశవాణిద్వారా తన సంగీతం వినిపించినవాడు.

అదివరకే మాచిరాజు రామమూర్తి, వీరయ్యా కలిసి తాలూకాలన్నీ తిరిగి కరణం, మునసబు, వెట్టి, మోతాదులతోసహా వందగ్రామాలలో గ్రామోద్యోగులు లేకుండా పరిపాలన బందు చేసినారు. శాంతిసైన్యం స్థాపించి, ప్రజలలో దౌర్జన్యం చెలరేగకుండా కాపాడినారు. పదునైనభూమి, పదునెక్కిన ఆసాములు. వీరయ్య చౌదరి గుర్రం ఎక్కి గ్రామాలన్నీ తణిఖీచేస్తూ, పెద్ద దళాధిపతిలాగ, చురుగ్గా తిరిగి, ప్రజల్ని ప్రబోధించి, ఎవరూ పన్నులు కట్టకుండా చేసినాడు. ప్రభుత్వోద్యోగులికి పట్టెడన్నం కాదుగదా పచ్చిమంచినీళ్ళు దొరకనివ్వలేదు. వారు వచ్చినప్పుడు శాంతిసైనికులు ఇరవై అడుగులికి ఒకరుచొప్పున నిలబడినారు. దీర్ఘకాయులైన ఈ గాంధీసైన్యం ముందు ఎర్రటోపీలతో వచ్చిన మలబారు పోలీసులు అంగుష్ఠులులా కనిపించినారు. ఈ దృఢకాయుల్ని చూసి వారు దడిసేవారు. అధికారు లేప్రశ్నవేసినా అర్థంలేని జవాబు. 'మునసబు ఇల్లెక్కడ' అంటే, 'ముందుకెళ్ళి కనుక్కోండి' అని జవాబు. అడగ్గా అడగ్గా, వెళ్ళగా వెళ్ళగా వూరి బయటికేదారి. రాజీనామాలిచ్చిన గ్రామోద్యోగులస్థానే ఇతరుల్ని నియమించి, కవిలె కాగితాలు పోలీసుసహాయంతో స్వాధీనము చేసుకున్నది ప్రభుత్వం. కాగితాలున్నవిగాని, ఎవరెవరో, ఏ భూములెక్కడో ఎవరికి తెలుసును? ఎవరు చెబుతారు? అక్కడ మారుటూరి సిచ్చయ్య అనే రెవెన్యూ ఇన్స్పెక్టరు వుండేవాడు. అతన్ని పిల్చి ప్రమోషను ఇస్తాం, ఎవరెవరో చెప్పమన్నారు. పిచ్చయ్య పొట్టివాడు, పీలమనిషి, సాధువు. మాటకూడా గట్టిగా మాట్లాడడు. వీళ్ళెన్ని ఆశలు పెట్టినా లాభంలేకపోయినది. ఆయన్ని గుమాస్తాగా గురజాల బదిలీ చేసినారు.

ఈ పరిస్థితులలో జస్టిసుపార్టీ ప్రభుత్వం పన్నుల రికవరీచట్టం పెట్టి ఆస్తుల జప్తులికి వెంటనే అవకాశం కల్పించినది. కలెక్టరు రూథరుఫర్డు పెదనందిపాడు బైట చింతలతోపులో మకాంవేసినాడు, సాయుధపోలీసులే కాక, సైనికుల్ని మరఫిరంగులతోసహాతెప్పించి, చింతలతోపు పెద్దశిబిరంగా మార్చినాడు. ఈ సైనికులు పూళ్ళమ్మట గస్తీలు తిరగడం. శాంతిసైనికుల్ని ఏ విధంగానైనా ఉద్రేక పరచా

లని శాయశక్తులా ప్రయత్నించినారు. వారు కదలలేదు మెదలలేదు. తిట్టినారు, చివరికి వారిమీద వుమ్మేసినారు. శాంతివీరుల శాంతి భంగం కాలేదు.

కాకుమానులో ఒక బండీ, జత ఎడ్లనీ ప్రభుత్వం జప్తుచేసి లాక్కు పోతుండగా జమ్మాజట్టీలవంటి ప్రజలు అడ్డుపడ్డారు. సైనికులు తుపాకులు కాల్చ డానికి సిద్ధంగా వున్నారు. ఎక్కణ్ణించో గుర్రంమీద వచ్చిన వీరయ్య చౌదరి దౌర్జన్యం జరగకుండా, శాంతిభంగం కాకుండా ఆపుచేసినాడు. "వీరయ్య దశాధి పతివలె అశ్వారూఢుడై గ్రామముల వెంటతిరుగుచు ప్రజలెక్కడను దౌర్జన్యము జరుపకుండ భద్రపరచుచుండెను. చౌదరి వాక్యము జవదాటక ప్రజలు అణకువతో నా ప్రచండవాతావరణమున జాగ్రతతో వర్తించుచుండిరి."

అదే సమయంలో గాంధీ స్వయంగా బార్డోలి పన్నుల నిరాకరణ ఉద్యమం నడిపినాడు. ఆ సంగతి వైస్రాయి రీడింగుకి లేఖ వ్రాసినాడు. ఆ లేఖలో పెదనంది పాడులోకూడా ఇటువంటి సత్యాగ్రహం జరుగుతున్నదనీ. అవసరమైతే తాను అక్కడికికూడా వెళ్ళవచ్చుననీ తెలియజేసినాడు. యావద్భారతదేశంలోనూ గాంధీ దృష్టిలో ఇవి రెండే పన్నుల నిరాకరణ ఉద్యమాలు. ఒకటి బార్డోలీలో తాను స్వయంగా నడిపినది. రెండు పెదనందిపాడులో పర్వతనేని వీరయ్యచౌదరి నడిపి నది. ఆ లేఖతో పెదనందిపాడు ప్రపంచఖ్యాతి గన్నది. పత్రికలు ఇక్కడి సంగ తులు ప్రకటించినవి. బైటివారు వచ్చి పరిశీలించి పోవడం ప్రారంభించినారు. ఆ వచ్చినవారిలో కృష్ణాపత్రిక సంపాదకుడు ముట్నూరి కృష్ణారావు ఒకరు.

తోటినాయకులికి కన్నుగుట్టినట్టున్నది. ఇక్కడి పరిస్థితులు సరిగాలేవని గాంధీ చెవులలో పట్టాభి వూదినాడు. ఆయన ఉద్యమం ఆపుజెయ్యవలసినదని పట్టాభికే ఉత్తరం ఇచ్చినాడు. ఆ వుత్తరం ఆయన మరెవరికో ఇచ్చినాడు. అది ప్రభుత్వానికందినది. అది నకళ్లు తీసి వారు పంచినారు. ప్రజలు అపోహపడినారు. గాంధీకి నిజం తెలియజేసినాడు వెంకటప్పయ్య. "మీ యిష్టం, మీ బాధ్యత" అని జవాబు. చివరికి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటీ సమావేశంలో పట్టాభీ, ప్రకాశంకూడా ఆపుజెయ్యమన్నారు. గాంధీ ఆపుజెయ్యమని వ్రాసిన ఒక కాగితంముక్క బైటపెట్టి నారు. వీరయ్యచౌదరి వద్దని వాదించినాడు. పక్కమీద రోగిగావున్న వెంక టప్పయ్య వాపోయినాడు. "బార్డోలీ అదీకూడా నేను చూడలేను. పెదనందిపాడు ఆపెయ్యాలి" అన్నది గాంధీ సందేశం. శాంతిసమరం విజయవంతంగా కొన సాగించినారన్న కీర్తి పెదనందిపాడువీరులదే, వీరయ్యచౌదరిదేకాని ఉద్యమం మధ్యలో నిష్కారణంగా ఆపివెయ్యబడినది.

బార్డోలీ ప్రారంభం అయినదోలేదో చౌరీచౌరాలో దౌర్జన్యం జరిగినది. ఇరవై ఇద్దరు పోలీసువార్ని ప్రజలు చిత్రవధ చేసినారు. గాంధీ పన్నుల నిరాకరణోద్యమం ఆపుజేసినారు.

పెదనందిపాడులో ఉద్యమం ఆపుజేసి పన్నులు చెల్లించబోతున్న రైతుల మీద విర్చుకుపడినది ప్రభుత్వం. జప్తులతో, వారంట్లతో, శిక్షలతో వారిని ఇబ్బందులలో ఇరికించినారు. వీరయ్యచౌదరిని బంధించినారు. రైతులికి సలహా లివ్వడానికి వెళ్ళిన వెంకటప్పయ్యమీద కేసు బనాయించి, అరెస్టుచేసి, శిక్షవేసి కడలూరు జైలుకి పంపినారు. అస్త్రసన్యాసంచేసిన గాంధీనికూడా అరెస్టు చేసినారు. తనని అరెస్టుచేస్తే అల్లరిచెయ్యవద్దనీ, దౌర్జన్యం జరిగితే అది తనకి మానభంగ మనీ వ్రాసినాడు. ఆ మాట విన్నారు ప్రజలు.

1922 మార్చి 18 వ తేదీని అహమ్మదాబాదులో గాంధీకేసు విచారణ ప్రారంభమైనది. న్యాయమూర్తి బ్రూంఫీల్డు: వయస్సెంత : 53. వృత్తి : రైతుని, నేతపనికూడా చేస్తాను. గాంధీ తన వాంగ్మూలంలో నేరం వొప్పుకున్నాడు. శిక్షాస్మృతిప్రకారం ఎంత తీవ్రశిక్ష విధించాలో అంతా తనకివ్వమన్నాడు. తాను ఆదిలో ప్రభుత్వభక్తి కలిగినవాణ్ణని నిరూపించినాడు. ప్రభుత్వంతో సహకరించి, యుద్ధంలో సహాయం చేశానన్నాడు. అటువంటి సేవలతో భారతదేశానికి బ్రిటిషు సామ్రాజ్యంలో సమాన ప్రతిపత్తి లభిస్తుందని నమ్మినాడు. ఆ నమ్మకం వమ్మైనది. 1919 లో విఘాతాలు కలిగినవి; రౌలట్టుచట్టం, జలియన్‌వాలాబాగ్ దురంతాలు, టర్కీసుల్తానుకి జరిగినఅన్యాయం. అయినా తాను మాంటేగూ-షెమ్సుఫర్డు సంస్కరణలు స్వీకరించాలని కాంగ్రెసుని బలవంతంచేసి వొప్పించినాడు. కాని బ్రిటిషు సంపర్కంతో ఇండియా రాజకీయంగానూ, ఆర్థికంగానూకూడా నిస్సహాయురాలై పోయినది. కరువులూ కాటకాలూ తట్టుకోలేని నీరసస్థితిలో పడిపోయినది. బ్రిటిషువారు రాకపూర్వం ప్రతిఇంట్లోనూ రాట్నంతో నూలువడికి, వస్త్రాలు నేయించుకునేవారు. వ్యవసాయంమీద వచ్చిన కొద్ది ఆదాయానికీ అది అదనంగా వుండేది. ఈ కుటీరపరిశ్రమలన్నీ బ్రిటిషు మరలముందు సర్వనాశనమైనవి. బ్రిటిషు ఉద్యోగులు ఇండియాకి సహాయం చేస్తున్నామనుకుంటున్నారు. శాంతి భద్రతల పేరుతో పోలీసు, సైనిక శక్తులతో అదిరించి, బెదిరించి అణగదొక్కడం వల్ల, ప్రతీకారం చేసే శక్తికూడా లేకుండా భారతీయులు మానసికంగా, శారీరకంగా క్షీణించి ఆత్మరక్షణోత్సాహంకూడా లేకపోయినారు. ఈ కారణాలవల్ల ప్రభుత్వాన్ని వ్యతిరేకించడం "నా కనీస పౌరకర్తవ్యం. అది, నాకు ఆత్మగౌరవకారణం" అన్నాడు. ఈ వాంగ్మూలం ఇచ్చి గాంధీ కూచున్నాడు. న్యాయమూర్తి బ్రూంఫీల్డు లేచినాడు. ఎదురుగానున్న ముద్దాయి మహాత్ముడికి వంగి శిరోవందనం

చేసినాడు. తీర్పు చెప్పినాడు : "చట్టానికి దయలేదు. తరతమాలు లేవు. అయినా మీరు మామూలు ముద్దాయి కాదన్న సంగతి విస్పష్టం. ఇదివరకు ఇటువంటివారి కేసు నేను విచారించలేదు. ఇకమీద విచారించబోను. కోటానుకోట్ల భారతీయ ప్రజల దృష్టిలో మీరు దేశభక్తులు, నాయకులు. రాజకీయాలలో మీతో ఏకీభవించనివారుకూడా మిమ్మల్ని ఆదర్శమూర్తిగా భావిస్తారు. పుణ్యపురుషులలో గణిస్తారు."

ఆరు సంవత్సరాల ఖైదు శిక్ష విధించినాడు జడ్జి. 1921 డిసెంబరు మొదలు 1922 జనవరిలోగా మహానాయకులందరితో కలిసి, గాంధీతోసహా పదివేలమంది భారతీయులు జైలుకి వెళ్ళినారు. 33 కోట్లలో అది ఎన్నోవంతు? అయినా అప్పటికే బ్రిటిషు ప్రభుత్వం భీతాహం జెందినది.

చీరాల పేరాల, పల్నాడు అడివి సత్యాగ్రహం, పెదనందిపాడు పన్నుల నిరాకరణ, అన్నీ గాంధీ ఉద్యమంలో ముఖ్యమైన సంఘటనలు. అన్నీ గుంటూరులోనే జరిగినవి. ఆ కాలంలో బ్రహ్మానందం గుంటూరులో విద్యార్థి.



# భాతృపర్వం

స్థానచలనం

చెన్నపట్టణం

రంగప్రవేశం

న్యాయవాదిగా

యోగం, వియోగం

కాసు వెంకటరెడ్డి

జిల్లా బోర్డు

ఇల్లు, ఇల్లాలు

కారాగారం, శాసనసభ

# స్థానచలనం

బ్రహ్మానందం గుంటూరు చదువు రెండేళ్లైనది. 1920 జూన్‌లో మూడో ఫారంలో చేరి 1922 ఏప్రిల్ ఆఖరికి నాలుగో ఫారం పూర్తి చేసినాడు. చిన్నన్నగారు వెంగళరెడ్డి, తానూ ఒకే క్లాసులో వున్నారు. చదువు కాక వీరు నేర్చినవి కొత్త ఆటలు. ఆ రోజుల్లో గుంటూరు కుర్రవాళ్లు ఎక్కువగా హాకీ ఆడేవారు. గుంటూరులో వూరంతా మైదానాలు వుండేవి. పిల్లల ఆటలకి ఎంతో అనుకూలంగా వుండేవి. ఏ పేటకి ఆ పేటలోనే జట్లు కట్టుకుని ఆడుకునేవారు. హాకీ కర్రలు కొనుక్కోలేనివారు, ఏచింతచెట్టు వేపచెట్టు వొంకరకొమ్మో నరికి, ఎండబెట్టి, నూనెపూసి ఆటకర్రగా వాడేవారు. హాకీ ఆట బ్రహ్మానందానికి చాలా బాగా వచ్చినది.

చదువూ, ఆటలూ అల్లా వుంచి రెండేళ్లూ రాజకీయ సందడితోనే సరిపోయినది. భారతదేశంలో వున్న అలజడి అంతకీ గుంటూరే కేంద్రమా అనిపించినది. వూళ్లోనే కాదు, జిల్లాలో ఎక్కడేం జరిగినా ఇక్కడ తెలిసేది. ప్రతినిత్యమూ జరిగినట్టుగా బహిరంగ సభలు; అడవి సత్యాగ్రహం తర్వాత బ్రహ్మాండమైన హర్తాళం, నాయకుల అరెస్టులు, గుంపులుగా జనం, ఉత్సాహవంతులైన యువకులూ. ఎక్కడ విన్నా. 'మా కొద్దు ఈ తెల్ల దొరతనమూ' అని పాట. జలియనువాలాబాగ్ సంగతులు తెలిసిన తర్వాత, ప్రతి బండివాడూ వో పాట పాడుతూ బండి తోలేవాడు; "డయ్యరూ వినారా, హిందుమా తానురా." బ్రహ్మానందానికి అది కొత్త వూహాలూ, కొత్త పోకడలూ మనసులో నాటుకుపోయే వయసు. జాతీయ భావాలూ, కాంగ్రెసు అభిమానమూ మనసులో నిలిచిపోయినవి. గుంటూరు నాగరకతా, మాటతీరూ, పొందికా అలవాటు పడినవి.

ఇంటర్మీడియేటు చదువుతున్న పెద్దన్నగారు, వెంకటరెడ్డికి ఆరోగ్యం సరిగా లేక సంవత్సరం విశ్రాంతి అవసరమైనది. ఆయన ఇంటి వద్దనే వుండిపోయినాడు. తమ్ముళ్లని ఇంటి దగ్గరగా నరసారావుపేటలో మునిసిపల్ హైస్కూలులో ఆయిదో ఫారంలో చేర్చినాడు.

వారి రివాజు ప్రకారమే నరసారావుపేటలోకూడా కాపురంపెట్టి, వండించుకుని తినేవారు. కుర్రవాళ్లకి ఇది చాలా అనుకూలంగా వున్నది. గుంటూరు కంటె నరసారావుపేట తూబాడుకి దగ్గిర. శని ఆది వారాలలో ఇంటి కెళ్లొచ్చు. పాత స్నేహితులతో ఆడుకోవచ్చు. వారిలో తూబాటి వెంకటేశ్వర్లు ఒకడు. బి. ఏ., బి.ల్ చేసి నరసారావుపేటలో ప్లీడరీ చేసినాడు. శెలవుల్లో ఇంటికి వెళ్ళినప్పుడు, ఎండలో కాకుల్లా తిరక్కుండా చదువుకోమనేవాడు అన్నగారు. వీళ్లు పారిపోకుండా వీధి వాకిట్లో మంచం వేసుకుని వేపచెట్టు నీడకింద పడుకునేవాడు. వారి పెద్దలు కట్టిన కాసువారి ఇంటిలోపలికి వెళ్లడానికి ఒకటే దారి. ఆ వీధి వీరి ఇంటి దగ్గిరే ఆగిపోతుంది. అటూఇటూ వాకిలికి కర్రలు పాతి వుండేవి. పశువులూ, బళ్లూ లోపలికి వెళ్లవచ్చు. ఇల్లుమిద్దె. ముందు విశాలంగా పొడుగ్గా వసారా. లోపల నడవ, నడవకవతల పడమటిల్లు, వంట ఇల్లు, పెరడు. పెరట్లోంచి దారిలేదు. వీధి వాకిలి దాటగానే కుడివేపు, తూర్పుముఖంగా వుంటుంది మిద్దె. ముందు విశాలమైన దొడ్డి; దూరంగా గొడ్లకొష్టం. వీధిలో ఒక వేపచెట్టు, దక్షిణపు గోడదగ్గిర మరో వేపచెట్టు. తల్లి ఏ ధాన్యమో ఎండబోసి తనపనిలో తాను వుండేది. చిన్న పిల్లలిద్దరూ ఎక్కడో ఆడుకుంటూ వుండేవారు. తమ్ముళ్ల నిద్దర్నీ నడవలో చదుకోమని వెంకటరెడ్డి ఎండబోసిన ధాన్యానికీ, ఎండలో తిరక్కుండా తమ్ముళ్ళకీ కాపలా వుండేవాడు. ఆయనకి కునుకుపట్టేదే ఏమో, ఇద్దరూ ఏగోడో దూకి బ్రాహ్మణ వీధికి పారిపోయేవారు. గుంటూరులో నేర్చుకొచ్చిన కొత్త ఆటలు, జట్టులు కట్టి వూరి వారికి నేర్పేవారు. నరసారావుపేట చదుపు పూర్తి అయినది. వెంకటరెడ్డి మళ్లీ కాలేజీలో చేరినాడు. తోడవేదాలు తమ్ములిద్దరూ గుంటూరు టవును హైస్కూలులో స్కూలు ఫైనలులో చేరినారు. ఆస్కూలే ఇప్పుడు హిందూకాలేజి.

ఆ హైస్కూలు హెడ్మాస్టారు, బుద్ధిరాజు రామచంద్రరావు. పాఠాలు చెప్పడంలో ఎంతటి సమర్థుడో క్రమశిక్షణ అమలుపర్చి పిల్లల్ని కట్టుదిట్టంలో వుంచడంలో అంత సమర్థుడు. చొక్కా, కోటు, తలగుడ్డ, పైన వుత్తరీయంలో ఆయన, పొట్టిగావున్నా చాలా గంభీరంగా వుండేవాడు. చదువులుకి టవును హైస్కూలు చాలా ప్రసిద్ధి పొందినది. కొందరు కుర్రవాళ్ళు పెద్ద పంతులు కంటె పొడుగ్గా వుండేవారు. ఎవరైనా సరే అల్లరి చేస్తే, రామచంద్రరావు పేకబెత్తెపు దెబ్బలు తప్పవు. ఆయనంటే పంతుళ్ళకీ బడి పిల్లలకీ కూడా హడలు. రాజకీయ ఆందోళ

నలు జరిగినప్పుడు పోలీసులు స్కూలు ఆవరణలోకి రాకుండా ఆయన గేటు దగ్గిర అడ్డం నుంచునేవాడు. తన పిల్లల సంగతి తాను చూసుకుంటాననే వాడు; చూసుకునేవాడు. హైస్కూలు కాలేజీ అయిన తర్వాత ఆయనే ప్రిన్సిపాలుగా నియమించబడినాడు. వూరి వారందరికీ అధికార్లతో సహా ఆయనంటే విపరీత గౌరవం. ఇటీవల ఆంధ్రప్రదేశ ఆస్థానకవి స్థానం అలంకరించిన కాశీ కృష్ణా చార్యులుకూడాసంస్కృతం, తెలుగూ చెబుతూవుండేవాడు. ఆయన మహా పండితుడు; పిల్లలికి చాలా గౌరవం.

బ్రహ్మానందం వొడుదుడుకులు లేకుండా వుండేవాడు. తల్లికి మలిచూలు ఆడపిల్ల పోయిన తర్వాత ఆడపిల్లమనసు తీరివుండదు. అందుచేత కాబోలు కాస్త ఎదుగుతున్నకొద్దీ కొంచెం వయ్యారంగా తయారైనాడు. వెంగళరెడ్డి అదే క్లాసులో చదివేవాడు. ఇద్దరూ చక్కగా గుడ్డలు వేసుకుని కలవారి ఇంటి బిడ్డలుగా తిరుగుతూ వుండేవారు. ఆటలలో పేరు సంపాదించినారు.

స్కూలులో లెఖ్ఖలపంతులు చాలా జాగ్రత్త మనిషి. పిల్లలు సరిగ్గా చేస్తున్నారా లేదా అని, ప్రతివాడి దగ్గిరికీ వెళ్ళి పుస్తకం చూసి కనుక్కునేవాడు. ఒక లెఖ్క ఇచ్చి చెయ్యమన్నాడు. అంతా చేస్తున్నారు. పంతులు తన మామూలు గస్తీ తిరుగు తున్నాడు. తిరుగుతూ వెంగళరెడ్డి దగ్గిరఆగినాడు. అతని లెఖ్ఖలో తప్పు కనిపించింది గావును. పంతులు ఆగగానే పిల్లవాడు లేచి నుంచున్నాడు. పంతులు వెంగళరెడ్డి కుడి చెవు తనకుడి చేత్తో పట్టుకున్నాడు. ఏం జరిగిందో చెప్పడం కష్టం. క్షణంలో వెంగళ రెడ్డి కుడిచెయ్యి పంతులుగారి ఎడమ చెంప తాకినది. లెఖ్ఖలు చేస్తూ ఫెడేల్ మనిధ్వని విన్న విద్యార్థులు తలయెత్తి చూసినారు. పక్కనే వున్న పిల్లలు ప్రత్యక్షంగా చూసినారు. ఆ క్లాసులోనే వాడపల్లి నరసింహారావు, పెనుమాక అమరేశ్వరరావు, కోటంరాజు వెంకటేశ్వరరావు వున్నారు. నరసింహారావు జిల్లా మునసబు. ప్రాసిక్యూటరు పనిచేసి రిటైరైనాడు. బ్రహ్మానందరెడ్డితో చాలా కేసులలో పని జేసినాడు. అమరేశ్వరరావు, ఉత్సాహవంతుడు, ప్రవేటు ఉద్యోగం పూర్తిచేసి, గుంటూరుజిల్లాలో, ముఖ్యంగా నాగార్జున సాగరం దగ్గిర పరిశ్రమల కేంద్రం పెడతానంటాడు. వెంకటేశ్వరరావు జిల్లా విద్యాధికారిగా రిటైరై, హైద్రాబాదులో ట్యూటోరియల్ కాలేజీ నడుపుతున్నాడు.

పంతుల్నికొట్టిన ఉదంతం చూసి, విని పిల్లలూ, పంతుళ్ళూ అంతా నిర్ఘాంత పోయినారు. పంతులు కోపం పట్టపగ్గాలులేక పోయినది. క్షమార్పణ కోరమన్నారు. వెంగళరెడ్డి భీష్మించినాడు. క్షమాపణ కోరడు. కాశీ కృష్ణాచార్యులు వచ్చి బతిమాలి నాడు. వినలేదు. రామచంద్రరావుకి వెంటనే తెలియనివ్వలేదు. తెలిసిన తర్వాత కాలేజీలో వెంకటరెడ్డికి కబురు పంపినారు. వెంగళరెడ్డి ఎవరి మాటా వినలేదు.

నన్ను కొట్టడానికి ఆయనకి ఏమి అధికారం వున్నదంటాడు. ఆ కోపతాపాలు కాలంలో కలిసినవి. పంతులే సరిపెట్టుకున్నాడు.

పరీక్షలు అయిన తర్వాత చిన్నవాళ్ళు ఇంటికి వెళ్ళినారు. అన్నగారి ఇంటర్మీడియేటు పరీక్ష పూర్తి అయినది. వెంకటరెడ్డి ఉత్తీర్ణుడైనాడు, తమ్ములిద్దరూ స్కూలు ఫైనలు పరీక్ష తప్పినారు. గుంటూరు మిషను కాలేజీలో అప్పుడు బి. ఏ. క్లాసు లేదు. వెంకటరెడ్డి బందరు వెళ్ళవలసి వచ్చినది. ఆయనతో తమ్ములుకూడా వెళ్ళినారు. అన్నగారు నోబుల్ కాలేజీలోనూ. తమ్ములిద్దరూ హిందూ హైస్కూలు లోనూ చేరినారు. హిందూహైస్కూలు హెడ్మాస్టారు వారణాసి శ్రీనివాసరావు. మహాప్రజ్ఞావంతుడు, మేధావి. ఇంగ్లీషు, హిస్టరీ చెప్పడంలో అందెవేసినచెయ్యి. ఆయన వేషం పంతులు పఠాణీగా వుండేది. గంభీరుడు. ఆయనకి నాటకాలు చాలా ఇష్టం. స్వయంగా షేక్స్పియరు నాటకాలలో వేసేవాడు. ఏకపాత్రాభినయం చేసే వాడు. పిల్లల క్రమశిక్షణలో ఆ కాలపు పెద్దపంతుళ్ళవలె శ్రీనివాసరావుకూడా దిట్టరి. బందరు హిందూహైస్కూలు పరగాణాలో పేరుమోసినది. కాలేజీ అయిన తర్వాత శ్రీనివాసరావే ప్రిన్సిపాలైనాడు. ఆయన ఇంగ్లీషు నవలలు వ్రాసినాడు. వక్త.

పూర్వం రవానాసౌకర్యాలు లేని రోజుల్లో పన్నెండు మైళ్ల ప్రాంతం దాటితే, ప్రజల తీరుతెన్నులు, మాటలబాణీ మారిపోతాయనేవారు, నిజం కావచ్చు. అరవైమైళ్ళ దూరంలోవున్న బందరు గుంటూరుల మధ్య చాలా వ్యత్యాసం కనబడేది. గుంటూరు కొండల మధ్యవున్న గట్టి ప్రదేశం. బందరు సముద్ర తీరానవున్న ఇసుక ప్రదేశం. గుంటూరు కొత్తగా ముఖ్య నగరమై పెరుగుతున్న వూరు. బందరు చాలా పెద్ద పట్టణంగా చిరకాలంగా వుండి, వైభవం అనుభవించి అప్పుడిక పెరుగుదలలేక నిలిచిపోయిన ప్రదేశం.

బందరు అనగా ఉర్దూలో రేవు పట్టణం. ఇది గోల్కొండనవాబుల కాలంలో నిర్మాణం అయినది. నిర్మించినవారు బ్రిటిషువారు. ఇండియాలో ఈస్టిండియా కంపెనీవారు ఆదిలో రెండేరెండు ఫ్యాక్టరీలు స్థాపించినారు. ఒకటి పశ్చిమతీరం, గుజరాతులో సూరతు పట్టణంలోనూ, రెండు తూర్పుతీరం ఆంధ్రలో మచిలీపట్టణం లోనూ. బందరు ఫ్యాక్టరీ స్థాపించినది 1611 లో. బందరు రేవు నించి ఎన్నో రకాల ఎగుమతులు విదేశాలకి వెళ్ళేవి. ముఖ్యంగా 'మస్లిన్' అనే సన్నని మల్లు గుడ్డ పేరు పొందినది. ఇది ఈజిప్టుదేశం వెళ్ళేదంటారు. ఇదికాక కలంకారీ అద్ద కాలు ఎగుమతీ అయేవి. 'మస్లిన్' మీదనించే మస్లీపట్టణం వచ్చిందంటారు. పట్టణం అంటే రేవు అని అర్థం. తూర్పుతీరంలో కళింగ పట్టణం, భీముని పట్టణం, విశాఖపట్టణం, కొత్త పట్టణం, క్రాల్ పట్టణం, చెన్నపట్టణం మొదలైనవి వున్నవి. 'మస్లిన్' మీదనించే ఈ ప్రాంతానికి మాసోలియా అనే పేరుకూడా వచ్చిందం

టారు. కోటద్వారంమీద చేపల చిహ్నం వుండడం మూలాన్ని 'మచిలీ' బందరు అయిందని కొందరంటారు. డచ్చివారు 1614 లోనూ, ఫ్రెంచివారు 1669 లోనూ బందరులో వ్యాపారం ప్రారంభించినారు. వలందపాలెం, ఫ్రెంచిపేట వారి స్మారకచిహ్నాలు.

1857 లోబందరులో సిపాయిలుకూడా తిరుగుబాటు చేసినారు. మద్రాసులో స్థిరపడేవరకూ బ్రిటిషువారికి తూర్పుతీరంలో బందరే ముఖ్య పట్టణం. 1829 లో బంగాళాఖాతంలో పెద్ద ఉప్పెన వచ్చి తూర్పుతీరపు రేవులు మేటలేసినవి. దాన్నే బందరు ఉప్పెన అంటారు.

1897 లో వీరేశలింగం రాజమండ్రీనించి మద్రాసు ప్రెసిడెన్సీకాలేజీలో అధ్యాపకుడుగా వెళ్ళినాడు. అంతవరకూ రాజమహేంద్రవరం విజ్ఞానకేంద్రంగా వుండేది. వీరేశలింగంద్వారా సంఘసంస్కారానికీ, న్యాపతి సుబ్బారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహంవంటి వారి కార్యక్రమాలతో రాజకీయాలకీ ముఖ్యనగరంగా వుండేది రాజమండ్రీ. ఆ స్థానం బందరు అందుకున్నది. అఖండ కృష్ణాజిల్లా ముఖ్యనగరం కావడమే కాకుండా, పూర్వంనించీ, బ్రిటిషువారికీ, ఫ్రెంచివారికి, డచ్చివారికి నిజాముకీ రేవుపట్టణంగా వున్నది. వారివారి కట్టడాలు, విశాలమైన సముద్రతీర ప్రాంతంలో విశాలమైన వీధులలో నిలిచివున్నవి. దేశాంతర్గతమైన నగరాలకీ, తీరపట్టణాలకీ తేడా వుంటుంది. ఆ మార్పే గుంటూరికీ బందరుకీ వున్న వ్యత్యాసం. నాగరకతలో బందరువారు కొంచెం మిన్న ఆ కాలంలో. కృష్ణాజిల్లాసంఘ నిర్మాణంలో, కొండా వెంకటప్పయ్య పెట్టిన కృష్ణాపత్రికతో, అప్పటికే వెలిసిన జాతీయ కళాశాలతో, అన్నివిధాలా బందరు ఒక కొత్త వాతావరణంతో వుండేది.

పట్టణానికి కేంద్రం రాబర్ట్సన్‌స్క్వేర్. కాఫీ హోటలు మొదలు కంచర దుకాణందాకా అక్కడే వుంటాయి. పట్టాభిని చూడాలన్నా పౌరోహితుడు కావాలన్నా అక్కడికే వెళ్ళాలి. పేరుగాంచిన బందరులడ్డూ, పకోడీ కావాలన్నా, పెరుగూ మజ్జిగా, ఆఖరికి పశువులికి గడ్డి కావలన్నా అక్కడికే వెళ్ళాలి.

బ్రహ్మానందం ఈ కొత్తదనం ఆకళింపు చేసుకుంటున్నాడు. నాగరీకం పెంచుకుంటున్నాడు. ఆటలకి గుంటూరుకంటె ఎక్కువస్థాయి, నేర్పరితనం కనిపించినవి. అవి తాను వశం చేసుకున్నాడు. జాగ్రత్తగా చదివి ఆ సంవత్సరం స్కూలు ఫైనలులో కృతార్థుడై, నోబుల్ కాలేజీలో ఇంటర్మీడియేటు జూనియర్లో హిస్టరీ ముఖ్యవిషయంగా ప్రవేశించినాడు. వెంగళరెడ్డి ఇంకో సంవత్సరం స్కూలు ఫైనలు చదవడానికి కృషిచేసినాడు.

కాలేజీకీ హైస్కూలుకీ చాలాతేడా వుంటుంది. అందులో పురాతన సంస్థల విషయంలో మరీను. చాలా హైస్కూల్లు కాలేజీలైనతర్వాత ఆ పెద్ద పంతుళ్ళనే ప్రిన్సిపాలు చేసేవారు. ఆయన పిల్లల్ని చిన్నక్లాసులలాగే 'ఏమిరా, వెధవాయా' అనడం కద్దు. మొదట్నించీ కళాశాలగానేవుండి ప్రిన్సిపాలు తిన్నగా కాలేజీకే వచ్చినవాడైతే ఆ పద్ధతివేరు. బందరు నోబుల్ కళాశాల 1885 లో చర్చి మిషను వారు స్థాపించినారు. పేరుగాంచిన అధ్యాపకులు, ఇంగ్లీషువారు పనిచేసినారు. పేరు గాంచిన విద్యార్థులు అక్కడ చదివినారు. రఘుపతి వెంకటరత్నం నాయుడు, వేమూరి రామకృష్ణరావు, పట్టాభిసీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వరావు, కళా వెంకట్రావు వంటివారు అక్కడి విద్యార్థులే. బ్రహ్మానందం జేరినప్పుడు ప్రిన్సిపాలు ఏ. బి. జాన్స్టన్. షేక్స్పియరు చెప్పడంలో ప్రఖ్యాతి పొందినవాడు. ఇంకా ఒకరిద్దరు ఇంగ్లీషువారుకూడా వుండేవారు. అధ్యాపకులలో ఎక్కువమంది తమిళులు. లెఖ్ఖలు, సైన్సు, తెలుగు, సంస్కృతం చెప్పేవారుమాత్రం తెలుగువారు. పింగళి లక్ష్మీకాంతం తెలుగువచనం చెప్పేవాడు. జార్జి థామస్ అనే గొప్పవక్త ఇంగ్లీషుచెప్పే అధ్యాపకులలో ఒకడు. ఈయన కేరళదేశీయుడు. కల్యాణరామయ్యర్ కూడా ఇంగ్లీషు చెప్పేవాడు. ఆయన క్రైస్తవుడు. ఆయన కుమారుడు విల్లీ బ్రహ్మానందం సహాధ్యాయి.

కాలేజీలో చేరిన మొదటిరోజుని ప్రార్థనహాలులో ప్రిన్సిపాలు పిల్లలందర్నీ సమావేశపర్చినాడు. ఆయన, 'జెంటిల్‌మన్'. అన్నాడు బ్రహ్మానందానికి ఆశ్చర్యం వేసినది. తాను పెద్దవాడనైనానని అనుకున్నాడు. ఆ మాటతో, ఆ అనుభవంతో స్కూలుచిన్నతనం పోయినది.

ఒక్క కల్యాణరామయ్యరు క్లాసుమాత్రం 12 గంటలకి ప్రారంభం అయేది. అప్పుడే 'గుండు' వేసేవారు. మిట్టమధ్యాహ్నం తెలియజెయ్యడానికి బందరులో పూర్వంనించీ వస్తున్న రివాజు. పిల్లలంతా 'గుండేశారు' అంటో కాళ్ళతో నేలమీద దబదబా బాదేవారు. ఇక్కడకూడా 'జెంటిల్‌మన్' అల్లరి చేస్తారుగావును అనుకున్నాడు. తానుకూడా దంచేవాడు.

బందరు కాలేజీలో మంచి ఆటగాండ్రు వుండేవారు. ఎడమచేతివాటపు ఎన్. నారాయణరావు టెన్నిసు, బాడ్‌మింటన్లలో ఛాంపియన్. వట్టూరి సోదరులు, హనుమంతరావు, శోభనాద్రి, సుబ్బారావు మంచి టెన్నిసు ఆటగాండ్రు. బ్రహ్మానందరెడ్డి టెన్నిసు, హాకీకూడా ఆడేవాడు. హాకీలో రైట్ఇన్‌గా అమోఘంగా ఆడేవాడు. ఇతనితోపాటు నరసారావుపేటవారు చాలామంది వుండేవారు. యనమండ్ర సాంబశివశాస్త్రి బి. ఏ. మొదటి సంవత్సరంలో వుండేవాడు. అతనుకూడా హాకీ టెన్నిసు ఆడేవాడు. ఇద్దరూకూడా కాలేజీటీములో ఆటగాండ్రు. కోరుకొండ,

ఏలూరు, గుంటూరు పోటీలకి వెళ్లేవారు. బి. ఏ. లో వుండేవాడు బెల్లంకొండ శివరామయ్య. సోమరాజు శ్రీనివాసరావు రెండో సంవత్సరం. చింతలచెరువు సుబ్బారాయుడు బ్రహ్మానందం సహాధ్యాయి. వీరందరూ నరసారావుపేటవారే. సాంబ శివశాస్త్రి పేటలో గవర్నమెంటు ప్లీడరుగా వున్నాడు. ఆంధ్రప్రదేశ శాసనసభ స్పీకరు బి. వి. సుబ్బారెడ్డి బి. ఏ. సీనియర్లో వెంకటరెడ్డి సహాధ్యాయి. కపిల చిన వెంకటరావు కూడా వారితో బి. ఏ. చదివినాడు. కాలేజీకి ఒక పత్రిక వుండేది. అందులో వెంకటరెడ్డి ఇంగ్లీషులో వ్యాసాలు వ్రాసేవాడు. వేంకటరావు చిన్నకథలు వ్రాసేవాడు. తరవాత ఎన్నాళ్ళకో స్పీకరు హోదాలో సుబ్బారెడ్డి, గుంటూరు బార్ అసోసియేషనులో కాసు వెంకటరెడ్డి చిత్రపటం ఆవిష్కరిస్తో అన్నాడు. "మా కాలేజీలో ముగ్గురు మేధావులూ, ప్రజ్ఞావంతులూ అయిన విద్యార్థులుండేవారు వరసగా కపిల చినవేంకటరావు కాసు వెంకటరెడ్డి, హెక్టర్ విలియమ్స్" అని. కవి కొడాలి సుబ్బారావు, సుప్రసిద్ధ నటకుడు బందా కనకలింగేశ్వరరావు కూడా కాలేజీలో సమకాలికులు. నోబుల్ కాలేజీలో వో పార్లమెంటు వుండేది. ఆ సంవత్సరం పి. డి. సుభామణి అనే బి. ఏ. సీనియరు విద్యార్థి ప్రధానమంత్రి. బ్రహ్మానందరెడ్డి సహాధ్యాయి. ఇంటర్ జూనియర్ విద్యార్థి. కపిల కాశీపతి ప్రతిపక్ష నాయకుడు.

1925 నాటికి జాతీయోద్యమంతోపాటు ఆంధ్రోద్యమంకూడా తీగెలు సాగినది. ఆంధ్రరాష్ట్రం, ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆ ఉద్యమానికి ముఖ్య ఆశయాలు. కాలేజీ పార్లమెంటులో కాశీపతి వ్యతిరేకపక్ష నాయకుడుగా ఆంధ్ర విశ్వవిద్యాలయం స్థాపించాలనే బిల్లు ప్రతిపాదించి ప్రభుత్వాన్ని వొప్పించి చట్టం చేయించినాడు. బహుశః ఈ సంగతివిని హడలిపోయి, జస్టిసుపార్టీ మంత్రివర్గం మరుసటి సంవత్సరమే ఆంధ్ర విశ్వకళాపరిషత్తు స్థాపించినారు. ఆనాటి మద్రాసు విద్యామంత్రి సర్ అన్నాం పరశురామపాత్రో. పార్టీకి జస్టిస్ అయినా ఆంధ్ర రాష్ట్ర విషయంలో అంతా ఒకటే.

కాలేజీకి పట్టాభి మొదలైన నాయకులు వచ్చి ఉపన్యాసాలు చేసేవారు. 'సర్వీసు' అనే అంశం మీద పట్టాభి ఒకసారి మూడు గంటలసేపు ఉపన్యాసం చేసినాడు. ఏకారణంచేతనో అప్పటికి నాయకులు కాలేజీకి రావడం గుంటూరులో పరిపాటికాలేదు. జాతీయ కళాశాలలో అధ్యాపకులుగావున్న కోలవెన్ను రామకోటేశ్వరరావు, విశ్వనాథ సత్యనారాయణ, అడివి బాపిరాజుకూడా కాలేజీకి వచ్చేవారు. వారి సాంగత్యంలో విద్యార్థుల మానసిక, సాంస్కృతికస్థాయి పాకానపడేది.

# చెన్నపట్టణం

మచిలీపట్టణంనించి చెన్నపట్టణం బదిలీ అయినది కాసుసోదరుల చదువు. చెన్నప్ప పట్టణం అంటే చెన్నప్ప అనే తెలుగురాజు పేరుమీద కట్టినది. అంక భూపాలుడి 'ఉషాపరిణయం'లో వర్ణించినట్టు :

"ప్రళయకావేరి మైలాపురంబు గల్మి
తీరమున పోరి నదిమట్టువెట్ట దండ్రి
పేర దన్మధ్యభూమిని పృధువిభూతి
నలవరిచె చెన్నపట్టణ మయ్యనృపతి".

ప్రళయకావేరి అంటే పట్టణానికి ఉత్తరంగా వున్న పులికాట్టు సరస్సు. అక్కడ ఈస్టిండియా కంపెనీకి ఒక గిడ్డంగి వుండేది. పులికాట్టునించి కడలూరు వరకూ గల మధ్యదేశంలో వెంకటప్పనాయుడు సామంతరాజుగా వుండేవాడు. ఈ వెంకటప్పనాయుడి తండ్రిపేరే చెన్నప్పనాయుడు. ఇతడు కర్నాటప్రభువైన వెంకటపతినాయుడికి సామంతుడు. వెంకటపతినాయుడు దామెర్ల చెన్నప్పనాయుడి సహాయంతో వేలూరు, జింజి మొదలైన రాజుల్ని వోడించి, శాంతి స్దాపించి వేలూరు నించి రాజ్యపాలన సాగించినాడు. అతని తమ్ముడు అయ్యప్పనాయుడు పూనమల్లిలో వుండి అన్నకి సహాయంచేస్తూ వుండేవాడు. ఉత్తరఆర్కాడులో వున్న చెన్న సాగరం, చెన్నపట్టణంకూడా తండ్రిపేర వెంకటప్పనాయుడు స్థాపించినాడు. పూన మల్లి పరిపాలకుడైన అయ్యప్పద్వారానే బ్రిటిషువారు చెన్నపట్నంలో ఆశ్రయం సాధించినారు. చంద్రగిరిరాజులు కూడా బ్రిటిషువారికి పట్టణంలో కొంత భూదానం చేసినారు. ఆ దానం చేసినవారిలో శ్రీరంగరాయలు ఒకడు. దానంతోపాటు తెలుగులో వ్రాసిన ఫర్మానాకూడా ఇచ్చినాడు. ఆ శాసనంలో పాతపేరు మార్చి,

తనమీదుగా శ్రీరంగరాయలపట్నంగా మార్చినాడు. శాసనభాగం: "ఇది తెలుగు సార్వభౌముడైన శ్రీరంగనాయలు దయచేయించిన రాజశాసనం; ఈ చెన్నపట్నం అనే నగరం.... ఇందలి దేవాదాయ బ్రహ్మాదాయములను అవిచ్ఛిన్నముగా అమలు జరపాలి; ఇదిగాక ఎల్లప్పుడూ దీనిని తెలుగుపట్నంగా గౌరవప్రతిపత్తులతో చూచుకుంటూ వుండవలె".

మద్రాసు అని ఈ నగరానికి పేరురావడానికి అనేక కథలు వున్నవి. మాద్రిపట్నం, మాదిరాజు పట్నం, మద్రనపట్నం, మద్రాసు అయినదంటారు. అసలు బ్రిటిషువారు ఇక్కడ 1643 లో గిడ్డంగి కట్టినతర్వాత ఈ ప్రాంతం గోల్కొండ నవాబు వశమైనది. అప్పుడు గోల్కొండలో మంత్రి సేనానులైన అక్కన్న మాదన్నలవద్ద మద్రాసు వర్తకనాయకుడైన కాశీవీరన్నద్వారా ఫర్మానా పొందినారనికూడా చరిత్ర వున్నది. తరవాత ఈ నగరం వృద్ధిలోకి రావడానికి తెలుగువారే కారకులు. తెలుగు జమీందార్లు విజయనగరం, పిఠాపురం, బొబ్బిలి, వెంకటగిరి, గద్వాల, వనపర్తి, జటప్రోలు మొదలైనవారంతా పెద్దపెద్ద భవనాలు కట్టి వూరు వృద్ధి చేసినారు. ఇక్కడ ఆది వర్తకులంతా ఆర్యవైశ్యులు. దేవాలయాలన్నీ తెలుగువారి పోషణలో పెరిగినవి. క్రమేణా ఉమ్మడిరాజధానికి అందరూ రావడం జరిగినది.

విశ్రాంతిగా, విశాలంగా నిద్రపోయే మచిలీపట్టణంనుంచి చురుగ్గా, ఇరుగ్గా వుండే చెన్నపట్టణం. పెద్దన్న వెంకటరెడ్డి బి. ఏ. పరీక్షలో కృతార్థుడైనాడు. తండ్రి కోరిక ప్రకారం, తల్లి కొడుకుని లాకాలేజీకి పంపినది. తమ్ములిద్దరూ కూడా అన్నతో పట్నం వెళ్ళినారు. బ్రహ్మానందం పచ్చయప్ప కళాశాలలో ఇంటర్మీడియేట్ రెండోసంవత్సరంలో చేరినాడు. వెంగళరెడ్డి జూనియర్లో చేరినాడు. సేతుపేటలో ఓ ఇల్లు తీసుకుని వండించుకు తినేవారు. బి. ఏ. పరీక్ష అయేవరకూ బహ్మానందం పచ్చయప్ప కళాశాలలోనే వున్నాడు. అప్పుడు ప్రిన్సిపాలు చిదంబరంపిళ్ళె. ఆయన తర్వాత ఎం. రత్నస్వామి. రత్నస్వామి చరిత్రలోనూ, రాజకీయ, న్యాయ శాస్త్రాలలోనూ గొప్ప పండితుడు. జస్టిస్‌పార్టీ సభ్యుడు. పేరుపొందిన ఉపాధ్యాయుడు. తరువాత లాకాలేజీ ప్రిన్సిపాలుగా పనిచేసి, కాన్‌స్టిట్యుయంట్ అసెంబ్లీ సభ్యుడై రాజ్యాంగనిర్మాణంలో చాలా శ్రద్ధతీసుకుని పనిచేసినాడు. పార్లమెంటు సభ్యుడుగావున్నాడు. మేధావి, గ్రంథకర్త.

అదేకాలంలో కొన్నాళ్ళపాటు గోగినేని రంగనాయకులుకూడా ఆర్థికశాస్త్ర ఉపన్యాసకుడుగా పచ్చయప్పలో పనిజేసినాడు. తరువాతనే, ఆ ఉద్యోగం పురస్కరించుకుని ఆచార్యారంగాగా మారినాడు. రంగా, ఆయనసతీమణికూడా ఇంగ్లండులో విద్య అభ్యసించినారు. రంగా ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయంలో బి. లిట్; పట్టం

పుచ్చుకున్నాడు. కొంతకాలం విఖ్యాత ఆర్థిక రాజకీయ శాస్త్రవేత్త, హెరల్డ్ జే. లాస్కీ దగ్గిర విద్యార్థి. రంగా గుంటూరుజిల్లా నిడుబ్రోలు వాసి, విదేశాలనించి రాగానే జిల్లావిద్యార్థులలో కొత్త చైతన్యం కలిగించి చాలామందిని విదేశాలకి వెళ్ళమని ప్రోత్సహించినాడు. తన తాలూకాలో కొంత ఆర్థిక పరిశోధనచేసి రైతు సమస్యలు పరిశీలించినాడు. కమ్యూనిస్టు సిద్ధాంతాలకి పూర్వరంగం అయిన ఎంజెల్సు సూత్రం ఆంధ్రప్రదేశంలో ఎల్లావర్తిస్తుందో అన్న పరిశోధన ముఖ్యం. అమీరుకైనా ఫకీరుకైనా నిత్యావసరాలు ఒకటే, అన్నం, వస్త్రం, ఇల్లూ మొదలైన కనీస అవసరాల విలువలో తేడాలు లేవు. తక్కినవన్నీ భోగాలని ఎంజెల్సు సిద్ధాంతం. "లక్షాధికారైన లవణమన్నమెగాని మెరుగు బంగారంబు మింగబోడు" అన్న నృసింహశతకకర్త కరీంనగరంలో ఏనాడో ప్రకటించిన సిద్ధాంతమే.

రంగాకి ఆ రోజుల్లో కొంచెం జస్టిసువాసన వుండేది. గుంటూరులో ఏడవ అఖిలాంధ్ర విద్యార్థి మహాసభకి ఆహ్వాన సంఘాధ్యక్షుడైనాడు. ఆ సభాధ్యక్షుడు టి. ఎ. పురుషోత్తం. ఆయన పచ్చయప్ప కళాశాలలో తత్వశాస్త్ర ఉపన్యాసకుడు. దానాదీనా ఆ కళాశాలలో కొంతకాలం ఉపన్యాసకుడైనాడు, శాశ్వతంగా ఆచార్యుడైనాడు. ఇంతలో జస్టిసుపార్టీ మంత్రివర్గం రైతులికి సంబంధించిన కొన్ని సమస్యలు పరిశీలించడానికి వో కమిటీని నియమించినది. ఆ కమిటీకి రంగా కార్యదర్శిగా నియమించబడినాడు. ఆ నియామకానికి కాంగ్రెసు నాయకుల ఆశీర్వచనం ఉన్నది. తదాదిగా రంగా, భారతీదేవీకూడా రైతు ఉద్యమంలో మునిగిపోయినారు. ప్రకాశం ప్రభావంలోకి వచ్చి కాంగ్రెసువాదులైనారు. అఖిల భారత కిసాను ఉద్యమ సంస్థాపకులైనారు. వేసవి పాఠశాలలు నడిపి, స్వగ్రామమైన నిడుబ్రోలును విజ్ఞాన విప్లవ కేంద్రంగా మార్చినారు. ఉత్సాహవంతులు, సేవాసక్తులు, నిరాడంబరులు. రాజకీయ వొడుదుడుకులలో రంగా రంగుమార్చవలసి వచ్చినది. ఈ నాడు రంగా రాజగోపాలాచారి శిష్యుడై, అఖిలభారత స్వతంత్రపార్టీ అధ్యక్షుడైనాడు. రంగా దంపతులికి ఆధునికాంధ్రచరిత్రలోనేకాదు యావద్భారత చరిత్రలోనే విశిష్టస్థానం ఉన్నది.

బ్రహ్మానందానికి రంగా ప్రత్యక్షగురువు కాదు. అయినా ఏకజిల్లావాసులు. ఒకర్ని ఒకరు గమనించినారనడంలో వింతలేదు. ఈ నాడీ స్థానాలలో తాము వుండబోతున్నామని వారికి తెలియదుగదా! బ్రహ్మానందం ఇంకా అన్నలచాటు తమ్ముడు. పట్నంలోవుండే వింతలూ, విశేషాలూ, ఆటలికి కలిగిన కొత్త అవకాశాలూ ఆకర్షించే చిన్నతనంలోనే వున్నాడు. ఎంతసేపూ క్లాసులోపలికంటె వెలుపలే అతని దృష్టి. హాకీఆట బాగా సాగేది. బి. ఏ. చదివే రెండు సంవత్సరాలూకూడా కాలేజీ హాకీకెప్టెను బ్రహ్మానందరెడ్డే. టెన్నిసుకూడా ఆడేవాడు. బాగా ఆడేవాడు. తెనాలి·

వాస్తవ్యులు దుగ్గిరాల పూర్ణచంద్రరావు, ప్రభల సుబ్రహ్మణ్యశాస్త్రి, లక్కరాజు సుబ్బారావూకూడా టెన్నిసు ఆడేవారు. పూర్ణచంద్రరావు; డి. పి. అంటారు. అంతర్జాతీయకీర్తి సంపాదించిన టెన్నిసు ఆటగాడు. 'మెయిలు' పత్రిక మేనేజరుగా పనిచేసిన తర్వాత విజయవాడలో 'ఆంధ్రజ్యోతి' మేనేజరుగా వున్నాడు. తక్కిన ఇద్దరూ తెనాలిలో ప్లీడర్లు. ఇంటర్మీడియేటులో ఏ. సి. సుబ్బారెడ్డి బ్రహ్మానందం సహాధ్యాయి. ఏ. సి. అంతటితోనే చదువు ముగించి, తర్వాత తర్వాత బ్రహ్మానందం మంత్రివర్గంలో వుండి కీర్తిశేషుడైనాడు. ముఖ్యమంత్రిని వ్యతిరేకించిన వారిలో ఒకడు; వారికి నాయకుడేమో కూడా !

1927 డిసెంబరులో కాంగ్రెసుమహాసభ మద్రాసులో జరిగినది. డాక్టరు ఎం. ఏ. అన్సారీ అధ్యక్షత వహించినాడు. కాసుసోదరులు ఆ హడావిడిలో చెడ తిరిగినారు. గాంధీ వూళ్ళో వున్నాడుగాని సభకి రాలేదు. అప్పటికే ఆయన దూరాన వుండి నాగస్వరం వూదడం ప్రారంభించినాడు. అదేమిటో ఆతరంలో విద్యార్థులికి ఎక్కడికెళ్ళినా రాజకీయ వాతావరణం తప్పకుండా వెంటాడినది. ఎందరో మహా త్యాగాలు చేసిన మహానాయకులు. వారిని చూసి, వారి ఉపన్యాసాలు విని, వారి జీవితవిశేషాలు తెలుసుకుని, ఉత్సాహం, దేశభక్తి ప్రజ్వలించి యువజనంకూడా త్యాగం చేసేవారు. తక్కిన బ్రాహ్మణేతర యువకులు సాధారణంగా జస్టిసువాసన గలవారు. విద్యానంతరం ఉద్యోగాభిలాష కలవారు. కాసురెడ్డిసోదరులు కాంగ్రెసు అభిమానులు, ఉద్యోగాభిలాష లేనివారు. తండ్రి కోరిక ప్రకారం స్వతంత్రంగా న్యాయవాదవృత్తి చెయ్య దలుచుకున్నవారు. వారికి కాంగ్రెసు ఏడాదిపండుగ. నిజంగా పెద్దపండుగే అయిపోయినది.

1928 లో భారతీయ రాజకీయ సంస్కరణలు ఏ విధంగా వుండాలో పరిశీలించడానికి సర్ జాన్ సైమన్ అనే గొప్ప మేధావీ. న్యాయవాదీ అయిన రాజకీయవేత్త ఆధ్వర్యంలో ఒక సంఘం మనదేశం వచ్చినది. ఆ సైమన్ కమీషన్లో భారతీయ సభ్యులెవరూలేరు. "ఇదేమి కమీషను. భారతీయులులేని విచారణతో మాకు ఏమీ సంబంధంలేదు. బోయ్‌కాట్" అన్నాడు గాంధీ. కాంగ్రెసు ఒకటేకాదు. దేశంలో ప్రతి రాజకీయపార్టీ సైమను కమిషనుతో ఏవిధమైన సంబంధం పెట్టుకోలేదు. దేశంలో ఎక్కడికి వెళ్ళినా జనం తండోపతండాలుగా నల్ల జండాలతో 'సైమన్ వెనక్కిపో' అనే నినాదాలతో తిరస్కారభావం ప్రకటించినారు.

మద్రాసు రాష్ట్రంలో రాజకీయ పరిస్థితి ఒక వింతరూపంలో వున్నది. అంతకుముందు జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థుల్ని నిలబెట్టినది. ఎప్పుడైతే కాంగ్రెసు బరిమీదికి వచ్చినదో జస్టిసుపార్టీ ప్రభావం తగ్గినది. ఎన్నికలలో

శాసనసభకి కాంగ్రెసువారు 42, జస్టిస్ 16, జాతీయపార్టీ 12 మంది సభ్యులూ విజయం పొందినారు. కొందరు స్వతంత్రులు కూడా వున్నారు. అప్పటి ద్వంద్వ ప్రభుత్వచట్టం ప్రకారం 32 మంది సభ్యుల్ని ప్రభుత్వం నియమించినది. ఆ చట్టప్రకారమే ప్రభుత్వంలో ముగ్గురు మంత్రులూ, ముగ్గురు ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్లూ వుండేవారు. ఈ కౌన్సిలర్లలో సర్. సి. పి. రామస్వామి అయ్యరు ముఖ్యుడు. అధిక సంఖ్యాకులుగా ఎన్నికైన కాంగ్రెసువారిని ప్రభుత్వం ఏర్పాటు చెయ్యవలసినదిగా గవర్నరు కోరినమీదట వారు నిరాకరించినారు. ఇక రెండో స్థానంలోవున్న జస్టిస్‌పార్టీని అడగాలి. రామస్వామి అయ్యరు వీరబ్రాహ్మణుడు. బ్రాహ్మణవ్యతిరేకి అయిన జస్టీసుపార్టీకి ప్రబలవిరోధి. గవర్నరుకి నచ్చజెప్పి నాడు. జాతీయపార్టీని ఆహ్వానించాలిగాని, జస్టిసుపార్టీని అధికారంలోకి రానివ్వ కూడదు అని. రామస్వామి అయ్యరు మహామేధావి, కేంద్రంలోనూ, ఇంగ్లాండు లోనూ కూడా పలుకుబడి కలిగినవాడు. గవర్నరు ఆయన సలహా అంగీక రించినాడు.

పర్యవసానం, డాక్టరు పి. సుబ్బరాయన్ నాయకత్వంకింద జాతీయ పార్టీ వారి ప్రభుత్వం ఏర్పాటైనది. ఈ సుబ్బరాయన్ ప్రభుత్వం పడిపోకుండా కాపాడే బాధ్యత కాంగ్రెసుపార్టీ అంగీకరించినది. కాంగ్రెసుపార్టీ ఇచ్చిన సలహాల ప్రకారం కొన్ని చట్టాలు చెయ్యడానికి జాతీయపార్టీ ప్రభుత్వం వొప్పుకున్నది. వీరిద్దరిమధ్యా సయోధ్య కల్పించి, ప్రభుత్వానికీ వీరికీ మధ్యవర్తిగా వుంటూ రామస్వామి అయ్యరు వ్యవహరించినాడు. రామస్వామి లిబరల్ అనగా మితవాది. సుబ్బరాయన్ జాతీయవాదికాని జస్టిసు పార్టీవేపు మొగ్గు. ఆయన సహమంత్రులు దివాన్ బహద్దూర్ రంగనాథ మొదలియార్, ఆరోగ్యస్వామి మొదలియార్. ద్వంద్వ ప్రభుత్వం వచ్చిన తర్వాత ముఖ్యమంత్రి అయిన ప్రథమ తమిళుడు డాక్టరు సుబ్బ రాయనే. తరువాత కాంగ్రెసుతో సహచర్యం మానేసి పూర్తిగా జస్టిసుపార్టీ మీద ఆధారపడినాడు. జాతీయవాదులైన రంగస్వామి మొదలియార్ని, ఆరోగ్యస్వామి మొదలియార్ని విడిచిపెట్టి, సేతురత్నం అయ్యర్ని, ముత్తురంగ మొదలియార్ని మంత్రులుగా వేసుకున్నాడు. స్వరాజ్యం వచ్చిన తర్వాత కాంగ్రెసులో జేరి, కేంద్రంలో మంత్రి అయినాడు. ఆయన కుమారుడే జనరల్ కుమార మంగళం, భారత దేశపు మాజీ సేనాని. ఇంకో కుమారుడూ, కొమార్తె కొంతకాలం కమ్యూనిస్టు నాయకులు.

జాతీయపక్షపువారు మంత్రులైతే, అధికసంఖ్యాకమైన కాంగ్రెసుపార్టీ శాసన సభ అధ్యక్ష ఉపాధ్యక్ష పదవులు రాబట్టుకున్నది. విశాఖపట్నం నాయకుడు చింతల పాటి వెంకటనరసింహరాజు అధ్యక్షుడు. ప్రఖ్యాత స్త్రీ ఉద్యమ నాయకురాలు డాక్టరు

ముత్తు లక్ష్మిరెడ్డి ఉపాధ్యక్షురాలు. అందువల్ల సభలో బలం కాంగ్రెసువారిది, ప్రభుత్వం జాతీయపార్టీవారిది; అసలు అధికారం లిబరలు నాయకుడు, రామస్వామి అయ్యరుది. సైమను కమిషను మద్రాసు వచ్చినప్పుడు ఈ మూడుకోళ్ళ మంచంతో ప్రభుత్వం నడుస్తున్నది.

కాంగ్రెసుకి మహానాయకుడు ఎస్. శ్రీనివాస అయ్యంగారు. ఆయన శిష్యుడు ఎస్. సత్యమూర్తి ముందుగా వుండేవాడు. రాజాజీ కాంగ్రెసు అధిష్ఠాన వర్గంలోనే గాని, ప్రజాస్థాయిలో ప్రాముఖ్యంగా వుండేవాడు కాడు. సైమను సంఘాన్ని అన్ని పార్టీలవారూ తిరస్కరించినారు. మద్రాసులో రాజా రామారాయణింగారి అధ్వర్యాన జస్టిసుపార్టీ మాత్రం ఆహ్వానించి, సాక్ష్యం ఇచ్చినది. లిబరలు పార్టీవారు దూరంగా వున్నారు. కాని రామస్వామి అయ్యరు ప్రోత్సాహంతో డాక్టరు సుబ్బరాయను జాతీయపక్షంకూడా సహకరించి సాక్ష్య మిచ్చినది. కాంగ్రెసు మాత్రం బహిరంగంగా తిరస్కార ప్రదర్శనలు జరిపినది. ఈ విజయం ముఖ్యంగా ఆంధ్ర ప్రయత్నం.

తమిళనాయకులు ఒక వూరేగింపుతో మౌంటురోడ్డుదాటి అయిలెండు గ్రౌండ్సులో ప్రవేశించినారు. ప్రస్తుతం కామరాజు విగ్రహం వుండేచోట, పంచమ జార్జి విగ్రహం వుండేది. అది దాటగానే ఆ వూరేగింపు పోలీసువారు ఆపుజేసినారు. ఊరేగింపు శాంతంగా తిరోగమించినది.

ఈ బహిష్కార కార్యక్రమం మద్రాసులో ఆంధ్రులు ఎక్కువగా నడిపిస్తున్నారని, సైమనుకమిషను దిగినరోజు ఉదయం ఆంధ్రకాంగ్రెసు నాయకుల్ని అరెస్టుచేసి తరువాత విడిచిపెట్టినారు. ఆంధ్రకాంగ్రెసు శాసన సభ్యులంతా మద్రాసు చేరి ఊరేగింపులు చేసినారు. నల్ల జండాలతో, 'సైమన్ గో బ్యాక్' అనే నినాదాలతో అయ్యదేవర కాళేశ్వరరావు వంటి నాయకులతో సహా ఒక వూరేగింపు సెంట్రల్‌స్టేషను మీదనించి నేపియర్ పార్కుదాకా వెళ్ళినది. పచ్చయప్పకళాశాల దగ్గిర తెల్ల సైనికులు వీర్ని అడ్డగించినారు. ఈ వూరేగింపు చూడడానికి వేనకి వేలు ప్రజలు సెంట్రల్ మొదలు హైకోర్టుదాకా మహాసముద్రం లాగ వ్యాపించి, క్రిక్కిరిసి పోయివారు. ఈ గందరగోళంలో సైనికులు తుపాకులు కాల్చినారు. మందిలో ఒకరు మరణించినారు; ఇద్దరికి గాయాలు తగిలినవి. ఈ దురంతం జరిగిన తక్షణమే ఎటువేపునించో ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం ఝుంఝూ మారుతం లాగ మరో పెద్ద వూరేగింపుతో వూడిపడ్డాడు. తుపాకి కాల్చినచప్పుడు ఆయన విన్నాడు. ప్రజల 'హాహా' రావాలు విన్నాడు. సైనికుల గద్దింపు విన్నాడు. మంది భీతాహం చూసినాడు. రేగిన క్రాఫింగు జుట్టుతో, చేతులో నల్ల జండాతో, పసుపు పచ్చని గండ భేరుండంచు ఖద్దరువుత్తరీయం గాలిలో ఎగురుతూ, భీకరమూర్తి

ప్రకాశం గర్జించినాడు. సైనికులు అడ్డుతగిలి ముందుకి పోరాదన్నారు. ఆ చచ్చి పోయిన వాణ్ణీ, గాయాలు తగిలినవాళ్ళనీ నేను చూడాలి, పోనియ్యండి అన్నాడు. పోనియ్యం అన్నారు సైనికులు. ఎల్లా పోనియ్యరో చూస్తానని ముందుకి వురికి నాడు. సైనికులు తుపాకులు అడ్డుపెట్టినారు. ప్రకాశం అవి భేదించి ముందుకు సాగినాడు. "కాలుస్తాం జాగ్రత్త" అన్నారు తెల్లసైనికులు. "కాల్చండి చూద్దాం" అని, చొక్కా విప్పి ఛాతీ చూపించినాడు ప్రకాశం. ఒక తెల్ల సైనికుడు తుపాకి ఆంధ్రకేసరి గుండెకి సరిగా గురిపెట్టినాడు. మరోక్షణానికి ప్రకాశం వుండేవాడు కాడు. ప్రకాశంపోతే ఆనాడు మద్రాసు నగరం వుండేదికాదు. ఎక్కణ్ణించో చూసి నాడు స్కామలర్ అనే పోలీసు సర్కిల్ అధికారి. వెంటనే పరుగెత్తుకొచ్చి సైనికుడికీ ప్రకాశానికీ మధ్యనుంచున్నాడు. "ఎవరకునున్నావ్! కేంద్ర శాసన సభలో కాంగ్రెసుపార్టీ ఉపనాయకుడుసుమా! కొంపముంచేద్దువు" అనిసైనికుణ్ణి వారించినాడు. ప్రాణత్యాగానికి తెగించిన ప్రకాశం ఆ జనం మధ్య, నల్ల జండా చేతులో పట్టుకుని, తన పరివారంతో హైకోర్టుదాకా అంగ లేసుకుంటూ పోయి తెల్ల వారి తుపాకీలకి గురిఅయినవార్ని చూసి, ఉపచారాలు చెయ్యడానికి ఏర్పాట్లు చేసి, ప్రళయకాలాగ్నిలాగ ముందుకు సాగిపోయినాడు. "నన్నెవ్వరావలేరీ వేళా" అన్నట్టు జేగీయమానంగా ప్రకాశించిన ఏకైక వీరుడు ప్రకాశం.

పచ్చయప్ప కళాశాల రోడ్డుమీదికి చాలా ఎత్తుగా వుంటుంది. ఎన్నో మెట్లెక్కితే మేడలా వుంటుంది. ముందు పెద్ద విశాలప్రదేశం. ఆ ఉన్నత ప్రదేశంలో క్రిక్కిరిసిపోయిన తోటి విద్యార్థులతో, జనంతో, ఈ భీకర ప్రకాశాన్ని చూసినాడు బ్రహ్మానందం. ఆ దృశ్యం తలుచుకుంటే ఇప్పటికీ అతని వొళ్ళు పులకరిస్తుంది. మానసికంగా ఆ క్షణంలోనే ప్రకాశం శిష్యవర్గంలో చేరినాడు.

# రంగప్రవేశం

**1929** వేసంగిలో వెంకటరెడ్డి పెళ్ళి అయినది. చిన్నవాడు బి. ఎల్. చదువు తున్నాడు, బుద్ధిమంతుడు, మంచికుటుంబం అని తెలియగానే నాలుగు వేపుల్నించీ సంబంధాలు రావడం ప్రారంభించినవి. తల్లి ఛాయమ్మకి పశ్చిమగోదావరి జిల్లా, కొవ్వూరు తాలూకా, గోపాలపురంనించి వచ్చిన వోమోతుబరిసంబంధం నచ్చినది. పిల్ల బాగున్నది, వియ్యంమంచిదని చేసుకున్నది. పిల్లపేరు గంగాయమ్మ. రెండు జిల్లాలుదాటి చేసుకున్న పరాయి సంబంధం కానువారి కుటుంబంలో అదే మొదటిది.

బి. ఎల్. అయిపోగానే వెంకటరెడ్డి మద్రాసులోనే బడుగు సోమయ్య ఆఫీసులో జూనియర్‌గాచేరి, మద్రాసులోనే న్యాయవాద వృత్తి ప్రారంభించాలని నిశ్చయించుకున్నాడు. కొన్ని రాజకీయ స్నేహాలు కూడా దీనికి దోహదం ఇచ్చినవి.

బి. ఏ., పరీక్షలో విజయం పొందిన బ్రహ్మానందం లా కాలేజీలో చేరినాడు. అన్నగారెక్కడో రాయపేటలో కాపరం. ఇతను కొన్నాళ్ళు పచ్చయప్ప హాస్టలులో వున్నాడు. తర్వాత లాకాలేజీకి ఎదురుగా వై. ఎమ్. సి. ఏ. లో బస. బ్రాడ్వే సందులోవున్న యూనివర్సిటీ క్లబ్బులో భోజనం. అదే మొదటిసారి విడిగా హాస్టలులో వుండడం, అన్నగారి అజమాయిషి లేకుండా వుండడం. లాకాలేజీలో టెన్నిసు ఆడేవాడు. మొదటికోర్టు ఆటకాడు. యనమండ్ర సాంబశివశాస్త్రి ఇతని తోటి ఆటకాడు. స్వతంత్ర జీవితం ప్రతిభ కనబడినది. ఎఫ్. ఎల్., పరీక్ష పోయినది. అప్పుడు ఆ పరీక్షపోయినా తిరువనంతపురం వెళ్ళి బి. ఎల్. లో చేరి, రెండుపరీక్షలకీ ఒక సంవత్సరంలోనే కూచోవచ్చు. ఆ అడ్డుదారి తొక్కినాడు బ్రహ్మానందం. ఆ కాలంలో అటువంటి ఆంధ్ర విద్యార్థులు చాలామంది వుండేవారు.

వీరంతా అప్పుడు తిరువాన్కూరు రాజ్యానికి ముఖ్యనగరమైన తిరువనంతపురం విజయంచేసినారు. ఆ వూళ్ళో వో ఆంధ్రా లాడ్జి, ఆటలు, నాటకాలు, ఒకటేమిటి జీవితం ఖులాసాగానే వున్నది. లాకాలేజీలో బ్రహ్మానందం హాకీకెప్టెను. అక్కడికి 'ఎప్పింగ్‌హాం' అని వో బ్రిటిషు యుద్ధనౌక వచ్చినది. అందులో నావికులికీ లాకాలేజీ టీముకీ వొక హాకీపోటీ ఆట ఏర్పాటు చేసినారు. మర్నాడు ఆటఅనగా తన జట్టుకి కెప్టెన్ బ్రహ్మానందరెడ్డి తయారు తినిపిస్తున్నాడు. ఆ ఆటలో కుడి మోకాలికీలు స్థానం తప్పినది. దానికి కట్టు కట్టించి, పోటీ క్రీడలో ఆడినాడు; మొదటిగోలు బ్రహ్మానందమే కొట్టినాడు.

కేరళదేశం చాలా సుందరమైనది. కొబ్బరి, పనస మొదలైన తోటలతో, గుబురుగా, పచ్చగా కన్నులపండువుగా వుంటుంది. తిరువనంతపురం చాలా పరిశుభ్రమైన నగరం. ఆ చుట్టుపట్ల ఏకాస్తదూరం వెళ్ళినా వినోద ప్రదేశాలే. అన్నిటినీ మించినది కన్యాకుమారీ అగ్రం. మూడు సముద్రాలు కలిసే భారతదేశపు పాదపీఠం. వివేకానందస్వామికి వెలుగు కనిపించిన పుణ్యశిలాప్రాంతం. అమ్మవార్లందరిలో అతిలోక సౌందర్యవతి అయిన కన్యకాదేవి ఆలయ ప్రదేశం. ఇవన్నీ సందర్శించినాడు బ్రహ్మానందం. తనకి దొరికినస్వేచ్ఛ, స్వేచ్ఛగా అనుభవించినాడు. కాని రెండు పరీక్షలలోనూ కృతార్థుడైనాడు.

ఆ మరుసటి సంవత్సరం పట్నంలో చింతగుంట రాఘవరావు ఆఫీసులో అప్రెంటిస్‌గా చేరినాడు. రాఘవరావు పేరుమోసిన వకీలు. తర్వాత హైకోర్టు జడ్జీగా పనిచేసినాడు. ఈ కాలంలో అన్నదమ్ములు ముగ్గురూ ఇంటికివస్తూ పోతూ వుండేవారు. తూబాడులో తల్లి ఒక్కర్తే వుండేది. పెద్దకొడుకులు ముగ్గురూ మద్రాసులో వుంటే ఆవిడదగ్గర వుంటూ వచ్చినది కూతురు మాణిక్యమ్మ, ఆఖరి కొడుకు పాపిరెడ్డి. 1928 లో మాణిక్యమ్మని, తన పుట్టింటివారి జ్ఞాతీ, చిరుమామిళ్ళవాసీ అయిన గాదె కోటిరెడ్డికిచ్చి పెళ్ళిచేసినది. ఆవిడ దరిమిలాని అత్తింటికి వెళ్ళిన తర్వాత మిగిలింది పాపిరెడ్డి ఒకడే. ఆ కుర్రవాడు పదేళ్ళు దాటగానే వ్యాధిగ్రస్థుడైనాడు. చిన్నపిల్ల నొప్పిలా వొచ్చి, కాళ్ళూచేతులూ కొట్టుకుని బిగుసుకుపోయేవాడు. 1925 లో లేకలేక చిన్నన్న చిన వెంకయ్యకి ఒకకూతురు పుట్టినది. ఆ పిల్లపేరు రాఘవమ్మ; పచ్చగా పండులావుండేది. తనకూతుర్ని చిరుమామిళ్ళ అత్తింటికి పంపించిన ఛాయమ్మ, ఆడపిల్ల మనసు తీరిక చిరుమామిళ్ల నించి మేనగోడల్ని తెచ్చి తన దగ్గిరవుంచుకునేది. రాఘవమ్మకి వో బంగారు పండంటి తమ్ముడుకూడా వుండేవాడు. వాడిపేరు వెంగళరెడ్డి; పితామహుడిపేరు. చిన్నతనంలోనే పోయినాడు. జబ్బు పిల్లవాడితో, ఇంటి, పొలం వ్యవహారాలతో ఒక్కర్తే సతమవుతూ వుంటుందని, వీలైనంతవరకు మధ్యమధ్య కొడుకులు తల్లి దగ్గర వుంటూ వచ్చేవారు.

మద్రాసులో కోర్టులోనూ, క్లబ్బులోనూ, బీచిలోనూ వెంకటరెడ్డికి రాజకీయ నేస్తాలు ఎక్కువైనారు. కాంగ్రెసువారూ, జస్టిసువారూకూడా ఇతనిమీద మోజుగా వుండేవారు. వీరిలో డాక్టరు ఏనుగు సుందరరామిరెడ్డి ఒకడు. ఆయన గుంటూరు జిల్లాబోర్డు హెల్తుఆఫీసరు. ఈ స్నేహాలమూలంగానూ, చిన్నతనంనించీ గుంటూరు రాజకీయ వాతావరణంవల్లనూ వెంకటరెడ్డి మనసు రాజకీయాలమీద లగ్నమైనది. ఆలోచన్లు ఆదారినే నడిచేవి.

వోరోజుని తూబాడులో అన్నదమ్ములు ముగ్గురూ భోజనం చేస్తున్నారు. తల్లి వడ్డిస్తున్నది. పెద్దవాడు ఏవోఏవో సంగతులు తమ్ముళ్ళకి చెబుతోంటే తల్లి పొంగిపోయినది. ఇద్దరు కొడుకులు ప్లీడర్లు అయినారు. భర్తకి తనుచేసినవాగ్దానం నిలబెట్టుకున్నది. వెంగళరెడ్డి కొంచెం ఆలస్యం. బి. ఏ., అయినాడు, ఇంక రెండు మూడేళ్ళలో ప్లీడరుపట్టా పుచ్చుకుంటాడు. ఆఖరివాడు బతికి బట్టకడిదే వారసత్వపు గ్రామమునసబీ, పిత్రార్జితం వాడికివ్వవచ్చు; తక్కినవాళ్లు వాళ్ళరెక్కలమీద వాళ్ళు బతుకుతా రనుకున్నది.

మాటలసందర్భంలో రాబోయే తాలూకా జిల్లాబోర్డుల ఎన్నికల విషయం వచ్చినది పిల్లల సంభాషణలో. అప్రెంటిసు అయిన తర్వాత బ్రహ్మానందం నరసారావుపేటలో ప్రాక్టీసు చేయ్యాలని అప్పటికే నిర్ణయం అయినది. అన్నగారన్నాడు తమ్ముడితో "ఈ లోకల్‌బోర్డు ఎన్నికలలో నువ్వెందుకు నుంచోకూడదురా బ్రహ్మానందం?" అని. బ్రహ్మానందుడు దేనికీ వెంటనే జవాబుచెప్పే తత్వంవాడు కాడు. వెంటనే వెంగళరెడ్డి అన్నాడు; ఎందుకునుంచోకూడదులే. "నుంచోవాలి" అన్నాడు పెద్దన్న. ఇదంతా వింటున్న తల్లి ఛాయమ్మ, జలాలపురపు నందయ్య జోస్యం జ్ఞాపకంవచ్చి లోలోపల మురిసి పోయినది. తన కడసారికొడుకు రాజ్యం ఏల్తాడుగావుననుకున్నది. ఆ రోజుల్లో తాలూకా, జిల్లాబోర్డులే రాజ్యాలుకదా !

పిల్లలు ముగ్గురూ చెన్నపట్నం వెళ్ళిపోయినారు. ఎవరి పనుల్లో వారు ఈ ఎన్నికలసంగతే మర్చిపోయినారు. తల్లి, కూతురు మాణిక్యమ్మతో ముచ్చటగా అని వుండవచ్చు, ఆవిడ భర్తతో చెప్పివుండవచ్చు. బావగారు గాదె కోటిరెడ్డి తన మరిది బ్రహ్మానందం తాలూకా జిల్లాబోర్డుల ఎన్నికలకి నిలుస్తాడని నిశ్చయంగా నమ్మినాడు. ఆయన చెప్పడంవల్లనో మరి ఏ విధంగానో తూబాడులోనూ, చిరుమామిళ్ళలోనేకాక తాలూకా అంతా కాసు బ్రహ్మానందరెడ్డి ఎన్నికలకి నిలుస్తాడని పుకారు పుట్టినది. గుంటూరునగరంలోకూడా ఈ మాట పొక్కినది. తీరా పేర్లు దాఖలుచెయ్యవలసిన కాలం దగ్గిరకొచ్చినా బ్రహ్మానందం అయిపూ, ఆనవాలూలేదు. కోటిరెడ్డికి కోపంవచ్చినంత పనిఅయినది. వెంటనే వెంకటరెడ్డికి ఉత్తరం వ్రాసినాడు. వేళమించి పోతుంది నామినేషన్ పడేయించమని. వెంకటరెడ్డి తెల్లబోయి

నాడు. బ్రహ్మానందంకూడా ఇదేమిటీ అనుకున్నాడు. "నామినేషన్ లేదు గీమినేషన్ లేదు వూరికే మాటల్లో అనుకున్నాంగాని అది నిజం అనుకున్నారా బావగారూ" అని జవాబు వ్రాసినాడు. కోటిరెడ్డికి నిజంగా కోపం వచ్చినది. ఇంతవరకూ వచ్చిన తర్వాత ఇప్పుడు పారిపోతారా, వీల్లేదు, బ్రహ్మానందం నుంచునితీరవలసిందే. బంధువర్గంలోనూ, మిత్ర బృందంలోనూ నగుబాటు, ఇంత అయినతర్వాత మానేస్తే. మేమంతాలేమా, పనిచెయ్యడానికి. పైగా బుల్లిబావ అదృష్టజాతకుడు, వెంటనే వచ్చి నామినేషను ఫైలు చెయ్యాలి" అని తీవ్రంగా వ్రాసినాడు. బ్రహ్మానందం చెన్నపట్నంనించి వచ్చి నరసారావుపేట తాలూకా బోర్డుకీ, గుంటూరు జిల్లా బోర్డుకీకూడా నామినేషన్లు ఫైలుచేసినాడు.

వోట్లు వేసేవారు ఏ నాలుగు వేలమందో. పార్టీ చిహ్నాలూ, బ్రహ్మాండమైన సభలూ లేవు. వ్యక్తిగతంగా వోటర్లని చూడ్డం మాత్రం. వారు స్నేహంకొద్దీ, కులాభిమానంకొద్దీ, గౌరవ సంప్రదాయల్నిబట్టీ వోట్లు నమోదు చెయ్యడం. బ్రహ్మానందరెడ్డి నాదెండ్ల నియోజకవర్గంనించి నిలబడినాడు. నాదెండ్ల అనాదినించీ, తూబాడు, చిరుమామిళ్ళ, గ్రామాలకి సముతుకేంద్రం. చుట్టుపట్లవారంతా కాసు వారికీ, గాదెవారికీ పరిచయులు. తాలూకాబోర్డుకి బ్రహ్మానందానికి ఎదురుగా రామస్వామిచౌదరి నుంచున్నాడు. పదహారువందల వోట్లు బ్రహ్మానందానికి వొస్తే 1500 రామస్వామికి వచ్చినవి. రెడ్డి గెల్చినాడు; చౌదరి వోడిపోయినాడు. జిల్లా బోర్డుకికూడా అదే నియోజకవర్గం. ఇద్దరు ప్రత్యర్థులు నిలిచినారు; జగ్గాపురం రంగయ్యచౌదరి, నడింపల్లి హనుమంతరావు పంతులు. ఇద్దరు ప్రత్యర్థులికీ కలిసి వచ్చిన వోట్లకంటె బ్రహ్మానందానికి కొన్ని ఎక్కువ పడినవి. జిల్లాబోర్డుకికూడా పంతులుమీదా, చౌదరిమీదా రెడ్డి గెల్చినాడు. బ్రహ్మానందానికి అప్పుడు 23 ఏళ్లు. లా అప్రెంటిస్‌కూడా పూర్తికాలేదు. 37 సంవత్సరాలక్రితం రాజకీయాలలో ప్రవేశించి, క్రమేణా యాత్ర సాగించినాడు. అతని గెలుపుకి ఎక్కువగా సంతోషించినవారు తల్లి ఛాయమ్మ, బావ కోటిరెడ్డి.

నరసారావుపేట తాలూకా బోర్డుకి ఆదినించీ చింతల చెరువు కోటేశ్వరరావు పంతులు అధ్యక్షుడు. గుంటూరుజిల్లాలో, తక్కిన తాలూకా బోర్డులలో చాలావరకు జస్టిసుపార్టీవారూ, ముఖ్యంగా చౌదర్లూ బ్రాహ్మణుల అధ్యక్షస్థానాలు ఆక్రమించినారు. జిల్లాబోర్డుకి కలెక్టరు అధ్యక్షత తర్వాత జస్టిసు పార్టీవారే వుంటూవచ్చినారు. పి. సి. యన్. యతిరాజులునాయుడు, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి. ఎన్నికలికి పూర్వం 1928 నించీ కుప్పుస్వామి అధ్యక్షుడు. జిల్లా అంతా కాంగ్రెసు సహాయనిరాకరణంతో, జస్టిసుపార్టీ ప్రాబల్యంతో బ్రాహ్మణ బ్రాహ్మణేతర తగాదాలలో వుంటే, నరసారావుపేట మాత్రం బ్రాహ్మణులమధ్య తగాదాలతోనే

సతమతం అవుతూవుండేది. బ్రాహ్మణులలో వైష్ణవులున్నారు, శైవులున్నారు, మధ్వులున్నారు, స్మార్తులున్నారు. ఈ తగాదా స్మార్తులికి సంబంధించినది. వైదీకి నియోగి తగాదా. శ్రోత్రియ బ్రాహ్మణులు వైదికులే; నియోగులు లౌకికులు. వారికి యజ్ఞయాగాది కర్మలు చేసే అధికారం లేదని ఛాందసులైన వైదికులు వాదించినారు. నియోగుల యజ్ఞయాగాదులికి పౌరోహిత్యము చెయ్యమని నిరాకరించి నారు. అప్పుడు నియోగులు ఎదురుతిరిగి తామే పౌరోహిత్యకార్యాలు నిర్వహించ డానికి పూనుకున్నారు. దీన్నే పద్ధతి నియోగం అనేవారు. ఇది ప్రారంభించినవారు నందివాడ లక్ష్మీనారాయణ దీక్షితులు. బాగా ప్రచారం చేసినవారు కామరాజుగడ్డ కోటేశ్వరశర్మ. ఈ ఉద్యమం గుంటూరుజిల్లాలో ఎక్కువగా వుండేది. గుంటూరు, తెనాలి, బాపట్ల నగరాలలో కొన్నాళ్లు వుండిపోయినది. అప్పుడే వైదికులైన తిరుపతి వేంకటేశ్వర కవులికీ, నియోగులైన కొప్పరపు కవులికీ కవితావాదం జరుగుతూ వుండేది. ఇందులో పాటిబండ సూర్యనారాయణ అనే వకీలు శ్రద్ధతీసుకునేవాడు. అప్పుడే తిరుపతి కవులు అన్నారు. "తిరుపతికన్న కొప్పుర మెక్కుడనెడు పాటి బండలగోడ దాటుటెట్లు" అని. తక్కినవారు విడిచిపెట్టినా నరసారావుపేట మాత్రం ఈ తగాదా విడిచిపెట్టలేదు. మునిసిపాలిటీకీ, తాలూకా బోర్డుకీ నియోగి వైదీకి పార్టీటిక్కట్లమీదే పోటీలు జరిగేవి. తక్కిన కులాలవారుకూడా నియోగిపార్టీ వైదీకిపార్టీ. నియోగిసాయెబు. వైదీకిసాయెబు, నియోగిమంగలి, వైదీకి మంగలి, నియోగిచాకలి, వైదీకిచాకలి. ఉద్యోగస్థులుకూడా ఇందులో పట్టుదలగా వుండేవారు. చివరికి గవర్నమెంటు విసుగెత్తి 1903 మొదలు 1928 వరకూ వీలైనంతవరకు నియోగుల్నిగాని. వైదీకుల్ని గాని నరసారావుపేటలో వెయ్యకూడదని నిశ్చయించి నది. అటువంటి నరసారావుపేటలో 1932 లో తాలూకా బోర్డు ఎన్నికలతో శకం మారినది. చింతలచెరువు కోటేశ్వరరావు పంతులికి వ్యతిరేకంగా అధ్యక్ష పదవికి నల్లపాటి వెంకట్రామయ్యచౌదరి నిలిచినాడు. వెంకట్రామయ్య జస్టిసుపార్టీ మనిషి. పోటీ తీవ్రంగావుండేటట్టు కనబడినది. కోటేశ్వరరావు బ్రహ్మనందాన్ని పిలిచి అధ్యక్షుడిపోటీకి వెంకట్రామయ్య చౌదరికి ఎదురుగా నిలబడమన్నాడు. జస్టిసుకి కాంగ్రెసు, చౌదరికిరెడ్డి విరుగుడని పంతులు పన్నాగం. బ్రహ్మనందరెడ్డి స్నేహితు లంతా ఈ ఆఖరిక్షణంలో నుంచోడం బాగుండదు వద్దన్నారు. అతను నుంచోలేదు. నల్లపాటి వెంకట్రామయ్య చౌదరి ఏకగ్రీవంగా అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు. ఆయనగుంటూరులో న్యాయవాదిగా ప్రారంభించి, రెండు మూడు సంవత్సరాల క్రితమే నరసారావుపేట వచ్చినాడు. 1953 లో ఆంధ్రరాష్ట్రం వచ్చినప్పుడు ఆయన శాసనభాధ్యక్షుడైనాడు.

గుంటూరుజిల్లాబోర్డుకి అప్పటికే ఒక టరమునించి జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి అధ్యక్షుడు. కలెక్టరు అధ్యక్షతలో వున్నపుడే ఆయన సభ్యుడు. ఈ ఎన్నికల

తర్వాత మళ్లీ అధ్యక్ష పదవికి నిలిచినాడు, ఆయన జస్టిసుపార్టీ నాయకుడు. గుంటూరుజిల్లాలో పార్టీకి పట్టుగొమ్మ. ఈయనకి వ్యతిరేకంగా కాంగ్రెసుఅభిమానులు కొల్లి సత్యనారాయణ చౌదర్ని నిలబెట్టినారు. కుప్పుస్వామిచౌదరి గెలిచినాడు.

కుప్పుస్వామి కారెంచేడు గ్రామస్థుడు. మంచి సంప్రదాయం కలిగిన సంపన్న కుటుంబంలో జన్మించినవాడు. పార్టీకి జస్టిసుగాని స్నేహానికి, అభిమానానికీ, అప్యాయతకీ ఆయనికి పార్టీలులేవు. బ్రాహ్మణభక్తుడు. కాంగ్రెసువారికికూడా స్నేహితుడు. సాహిత్యపోషకుడు, కవులబంధువు. ఆ రోజుల్లో జిల్లాలో ఆయన పలుకుబడికి అడ్డులేదు. గుంటూరుజిల్లాలో జస్టిసుపార్టీ నిలవడానికి ఆయనే కారణం. కుప్పుసామి అజాతశత్రువు, దానశీలుడు.



# న్యాయవాదిగా

**1932** నవంబరులో బ్రహ్మానందరెడ్డి రాజకీయరంగప్రవేశంతో అతని జీవితం లోనేకాక గుంటూరుజిల్లా రాజకీయాలలోనే కొత్తఘట్టం ప్రారంభించినది. కొంతవరకు ఈ ప్రభావం రాష్ట్ర రాజకీయాలమీదకూడా పడినది. ఆ ప్రభావమే అతని 'జీవనదేవత'గా నిలిచినది. న్యాయవాదిగా నరసారావుపేటలో స్థిరపడదా మనుకున్న ఒక యువకుడు, తన ఇచ్ఛవల్లకాక, పరిస్థితుల ప్రభావంవల్ల, ఒకేసారి తన తాలూకా, జిల్లాబోర్డులలో సభ్యుడైనాడు. సరేననుకున్నాడుగాని ఆ రాజకీయాలే 'స్థిరోభవా వరదోభవా' అన్నట్లు వెంటాడతాయని ఊహించలేదు.

1933 ప్రారంభంలో బ్రహ్మానందం నరసారావుపేటలో న్యాయవాదిగా జీవనోపాధికోసం యాత్ర పారంభించినాడు. ఆ వృత్తి అంతరాయాలతో అంతాకలిపి 12 సంవత్సరాలకంటె ఎక్కువ సాగలేదు. కాని ప్రారంభించిన కొద్దివారాలకే అందుకున్నది. ఎన్నికల విజయభేరీలతో కోర్టులికి రావడంచేత నరసారావుపేట తాలూకా ఒకటేకాక చుట్టుపట్ల మూడునాలుగు తాలూకాలలోకూడా పేరు తెలిసినది.

నరసారావుపేట జమీందారీనగరం. వయసులో చాలాచిన్నది. నూటడెబ్బై సంవత్సరాలక్రితం నరసారావుపేట లేదు. అప్పుడీ ప్రదేశంలోవున్న కుగ్రామం పేరు అట్లూరు. నరసారావుపేట జమీందార్లు మల్రాజువారు; వెలమవంశీయులు. మల్రాజు వెంకటనరసింహారావు బసాలత్‌జంగ్ కాలంలో వినుకొండ మొఖాసాదారు. వినుకొండ, బెల్లంకొండ పరగాణాలు ఆయనకింద వుండేవి. ఆయన కుమారులలో ఒకరు ఇక్కడి కోట, పేట కట్టించి తండ్రిపేర నరసారావుపేట అన్నాడు. ఈ కోట మహమ్మదీయ వాస్తు ప్రకారం కట్టినట్టు స్పష్టంగా కనిపిస్తుంది. ఇప్పుడు చాలావరకు శిధిలమైనది. అయినా పూర్వవైభవం తెలుస్తూనే వుంటుంది. మల్రాజు

జమీందారులు ఏనుగులతో, పొంటెలతో, గుర్రాలతో, ధనకనక వస్తువాహనాలతో మహదైశ్వర్యంలో వుండేవారు. వూళ్లో తోటలూ, వనాలూ, దేవాలయాలూ నిత్యకల్యాణం పచ్చతోరణంగా వుండేది. ఆ వైభవం చాలావరకు ఈ శతాబ్దం ప్రారంభానికే పోయినది. చెట్లూచేమలూకూడా నీటియెద్దడికి చచ్చిపోయినవి. పోయిన అరశతాబ్దిలోనూ వేపచెట్లుమాత్రం పెరిగి ఆరోగ్యకరమైన గాలివేస్తూ వుంటుంది. పాతచెట్లుపోయి కొత్తచెట్లు రాకపూర్వం చూసివుండాలి, కొంటెవాడు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య: "గగనమొక్కటి కలదందు కరవుదీర నరసన్న రాయని వికటపేట" అన్నాడు. నిజానికి కావలసినంత ఆకాశం, అఖ్ఖర్లేనంత వెల్తురూనూ నరసారావుపేటలో. తురకల జనాభా చాలాఎక్కువ. తరువాత సంపన్నులైన వైశ్యులున్నారు. ఆదిలో మిరపకాయ ఎగుమతి ఇక్కడి వ్యాపారం.

పేటలోవున్నవి మునసబుకోర్టు, మేజస్ట్రీటుకోర్టు. న్యాయవాదిగా ఆర్జించాలనే వారికి అదనైన ప్రదేశంకాదు. కాని ఇక్కడ తమ్ముణ్ణి పెట్టడంలో అన్నగారి ఉద్దేశ్యంవేరు. అది రాజకీయం. ఆ వ్యూహం క్రమేణా పరిస్ఫుటం అవుతుంది. నరసారావుపేట జమీందారు కొండలరావు కానువారి స్నేహితుడు; బ్రహ్మానంద రెడ్డికి ఆప్తుడు. వీరి పరస్పర స్నేహభావం, సహాయసంపత్తి బ్రహ్మానందం జీవితారంభంలోనేకాక తరువాతకూడా చాలా ప్రయోజనకరాలుగా పరిణమించినవి.

దైవదత్తమైన రాజకీయ విజయంతో జీవితం ప్రారంభించడంకంటే యువకుడికి వేరే అదృష్టంలేదు. దాంతో ఒక ఆత్మవిశ్వాసం, ఆత్మాభిమానం, హుందా, పెద్దమనిషితనం, నెమ్మది, యుక్తాయుక్త విచక్షణజ్ఞానం కలగడం సహజం. ఈ విధమైన మనోగాంభీర్యంతో మనిషి ప్రవర్తనలోనే మార్పువస్తుంది. అటువంటి మానసిక సంపత్తితో వృత్తి ప్రారంభించినాడు బ్రహ్మానందం. ఒక గుమాస్తాని ఏర్పాటుచేసుకుని, ఆఫీసు వగైరా కావలసిన హంగామాఅంతా లోటులేకుండా సిద్ధం చేసుకున్నాడు. తల్లిగాని, పెద్దన్నగాని ఆలోట్లు రానియ్యరు.

కొత్త ప్లీడరుగారికి ఓంప్రథమంలో దొరికినది మునసబుకోర్టులో వో సివిలు పిటిషన్. అనుభవంలేని వకీలుకి అనుభవంవున్న గుమాస్తా గురుత్వమేగదా ? ఈ పిటిషన్‌లోవున్న పాయింటుకి ఆ మునసబు వ్యతిరేకి. ఇదివరకు ఒకటి రెండు సందర్భాలలో తిరస్కరించినాడు. ఆ సంగతి గుమాస్తాకి తెలుసునుగాని ప్లీడరుకి తెలియదు. గుమాస్తా ఉద్దేశ్యం బహుశః, చిన్నవాడు, కొత్తగావచ్చినాడు, చూడ సొంపైనవాడు, తాలూకా జిల్లాబోర్డుల మెంబరు, మంచిటెన్నిసు ఆటగాడు, క్లబ్బులో బ్రిడ్జికూడా చాలాపట్టుదలతో ఆడతాడు, మీదుమిక్కిలి నెమ్మదస్థుడు, ఇటువంటి సుగుణాలువున్న తనప్లీడరుగారికి మునసబు కొంచెమైనా అనుకూలం

చెయ్యడా అని. గుమాస్తాలికి సాధారణంగా లాపాయింట్లకంటె ఇటువంటి పాయింట్లే తోస్తూవుంటాయి. పార్టీలకిటువంటి మాటలే చెబుతారుకూడాను కొందరు.

కొత్తబిచ్చగాడు పొద్దెరగడని, కొత్తప్లీడరు ఆ పిటిషను జాగ్రత్తగా వ్రాసిలా అంతా క్షుణ్ణంగా చదివి, కోర్టువారిముందు వాదించినాడు. డాక్టరికి రోగిబాధ తెలియదుగదా ! మునసబుకి కొత్తప్లీడరు తొలికేసైతేనేం, మలికేసైతేనేం ఆయనకి తోచిన న్యాయం చేస్తాడు. ఆ న్యాయం కొత్తప్లీడరుకి అన్యాయంగా పరిణమించినది. అడుగులోనే హంసపాదు. ఎన్ని హంసపాదులు పడితేనేం 'జీవన దేవత' వెనకాల వుండి నడిపితే ఏమీ అడ్డురావు. రెండుమూడునెలలకే ప్రాక్టీసు అందుకున్నది. సివిలూ, క్రిమినలూకూడా చేతుల్నిండా పని తగిలినది.

నరసారావుపేట వినుకొండ, పల్నాడు, సత్తెనపల్లి తాలూకాలికి ముఖద్వారం వంటిది. ఈ సీమఅంతా క్రిమినలు లాయర్లకి పంటసీమ. ఈ సీమవాసులు పౌరుష వంతులు. ప్రాణానికి తెగించే ధైర్యం కలవారు. ఖూనీలు ఎక్కువ. అందులో ఓ ఖూనీ మరోఖూనీకి కారణం అవుతుంది. వీటిని గొలుసుఖూనీలంటారు. ఇటువంటివి ఈ ప్రాంతంలో ఎక్కువగా వుండేవి. బ్రహ్మానందరెడ్డి మధ్యమధ్య మానేస్తూ, చేస్తూ వచ్చిన పన్నెండుసంవత్సరాల న్యాయవాదంలోనూ చాలా ఖూనీ కేసుల్లో విజయవంతంగా, కమిటల్ కోర్టులోనూ, సెషన్సు కోర్టులోనూ కూడా పని చేసినాడు. జిల్లాలో ఖాతరైన క్రిమినలు లాయర్లలో ఒకడుగా పరిగణించబడినాడు. ధర్మవరం, దొండపాడు, అంబాపురం, కరాలపాడు కేసులు వీటిలో కొన్ని. తాలూకా అంతా వూపేసిన తగాదాలు. అంబాపురం, కరాలపాడూ గొలుసుఖూనీలు. ఆ రోజుల్లో పల్నాడులో ఇవి తరుచుగా సంభవించేవి. వూళ్ళో కక్షలే వీటికి కారణం. ఈ కక్షలలో కొన్నికులకక్షలు, కొన్ని ఒక కులనాయకులమధ్య స్పర్థలు, కొంతవరకు స్త్రీవిషయమైనవి. అంబాపురం ఖూనీకేసు ఇద్దరు రెడ్లమధ్య తగాదావల్ల జరిగినది. అంబాపురంలో వెంకటరెడ్డి, కోటిరెడ్డి అని ఇద్దరు నాయకులు. ఇద్దరూ చెరోపార్టీకి నాయకులు. వెంకటరెడ్డిని సినీమావెంకటరెడ్డి అనేవారు. అతనికి గురజాలలో వో సినీమాహాలు వుండేది. కోటిరెడ్డిని ఖూనీచేసినారు. సినీమావెంకటరెడ్డినీ మరికొందర్నీ అరెస్టుచేసి, ఛార్జిషీటు దాఖలుచేసి ఖూనీకేసుపెట్టినారు పోలీసువారు. బ్రహ్మానందరెడ్డి ముద్దాయి వెంకటరెడ్డి తరఫున కేసుపట్టినాడు. కిందకోర్టులోనూ, పై కోర్టులోనూకూడా బ్రహ్మానందరెడ్డి గెల్చినాడు. వెంకటరెడ్డితోసహా ముద్దాయిలందర్నీ విడుదలచేసినారు.

చచ్చిపోయిన కోటిరెడ్డికూతురు నాగమ్మవంటి నాయకురాలు; నిజమైన పల్నాటిపడుచు. మేజస్ట్రేటు కోర్టులోనూ, సెషన్సు కోర్టులోనూకూడా బహిరంగంగా బైటా, లోపలాకూడా చెప్పినది. "వెంకటరెడ్డికి ఈ దెబ్బలో శిక్షపడుతుందా, సరే. లేకపోతే వాణ్ణిచంపి, వాడితల వాడి సినీమాముందే గురజాల్లో వేళ్ళాడగడతాను."

వద్దూ, పొడుగూ, జాణగా, అందంగా వున్న ఈ పడుచు ప్రమాణాలు విని అంతా నివ్వెరపోయినారు. వెంకటరెడ్డిని విడుదల చేశారనగానే తనప్రతిజ్ఞ మళ్ళీ ప్రకటించినది. దరిమిలాని వెంకటరెడ్డిని ఖూనీ చేసినారు. తల కోస్తూండగా జనం పోగైనారు. కోటిరెడ్డి కూతురు ప్రతిజ్ఞ నెరవేరలేదు. కాని ఆవిణ్ణీ మరికొందర్నీ పట్టుకుని ఖూనీకేసు పెట్టినారు. బ్రహ్మానందం ప్రాసిక్యూషను వారికి సహాయం చేసినాడు. చివరికి ఈ కేసుకూడా నిలవలేదు. ఎందుకో జడ్జీలు గ్రామాలలో కక్షకేసులు అంత పట్టుదలగా చూసేవారు కారనుకునేవారు. అసలు ప్రత్యక్షసాక్ష్యం లేక కేసు పోయి వుండవచ్చు. ఒక ఖూనీలోంచి మరోఖూనీ తయారయేది. చివరికి జడ్జీలు తీవ్రంగా శిక్షలు విధించేసరికి ఈ గొలుసుకట్టు ఆగిపోయినది.

ఇటువంటివి ఎన్నోకేసులలో బ్రహ్మానందరెడ్డి విజయవంతంగా పనిచేసినాడు. అతను కక్కుర్తి ప్లీడరుకాడు. ఒకేసారి మొదట్లోనే ఇంతఫీజు అని నిర్ణయం చేసుకునేవాడు. తరవాత దమ్మిడీ పైన ముట్టుకునేవాడుకాడు. వూళ్ళవెడితే డాక్ బంగాళాలో వుండేవాడు. తనఖర్చు తను పెట్టుకునేవాడు. బస్సుకనీ, భోజనానికనీ, సిగరెట్లకనీ పార్టీల్ని పీడించుకుతినేవాడు కాడు. వినుకొండ, గురజాల, సత్తెనపల్లి వెద్దక్రిమినలు కేసులు ఇతను ప్రాక్టీసుచేసినన్నాళ్ళూ ఇతనికే వచ్చేవి. ఆయా కోర్టులలోనూ, పైకోర్టులలోనూ కూడా వాదించేవాడు. ఫీజు ఎక్కువగానే పుచ్చుకునేవాడు. చిన్నలాయర్లలో పెద్ద ఫీజు పుచ్చుకోడంలో ఇతనే ప్రథముడు. అంబాపురంకేసులో ఆరువేలు తీసుకున్నాడు. ఆ స్థాయిలోనే ఫీజులుండేవి. క్రిమినలు వర్కు ఎక్కువైనకొద్దీ సివిలువర్కు స్నేహితులికి పంపించేవాడు. ఆదిలో సివిలు కేసులలో నాయకర్ అనే మునసబు ఇతనికి చాలాసహాయం చేసినాడు. నాయకరు జిల్లా జడ్జీచేసి రిటైరైనాడు.

కోర్టులో వాదించేటప్పుడు బ్రహ్మానందరెడ్డి ప్రసన్నంగా వుండేవాడు. చీకాకులు పడకుండా, చిడిముడిపాట్లు లేకుండా, హుందాగా, ధీమాగా వుండేవాడు. పార్టీలతో క్రాసుపరీక్షలో చాలామర్యాదగా ప్రవర్తించేవాడు. ఒకవిధమైన నాగరకత సభ్యత, కనుపించేవి. తన పక్షపుకేసు అతిశయోక్తులతో, బల్లగుద్దులతో చెప్పడం అతని పద్ధతికాదు. ముక్తసరిగా ఎంతవరకు, ఎటువంటి భాషలో చెప్పాలో అంతవరకే. నివేదన స్పష్టంగా, అరటిపండు వొలిచినట్టు, నీటుగా, సూటిగా వుండేది. జడ్జీలమీద నోరుచేసుకునేవాడుకాడు. కాదని వారికి అతివినయమూ చూబించేవాడు కాదు. జడ్జీకి తైరుబొయ్యడం చేతకాదు. ప్రత్యర్థిప్లీడర్ని పల్లెత్తుమాట అనేవాడు కాదు. తాను పడేవాడుకాదు. అతను అన్యుల్ని నొప్పించడు, తానొవ్వడు.

అతని యావత్తు ప్రాక్టీసులోనూ ఒకే ఒకసారి కోపంతెచ్చునున్నాడని తోటి లాయర్లంటారు. ప్రత్యర్థి, సాక్షికేదో చట్టవిరుద్ధమైన ప్రాంప్టింగు చెయ్యాలని

ప్రయత్నించినాడు. కోర్టులో నెమ్మదిగా ఆ ప్రయత్నానికి అభ్యంతరను చెప్పినాడు. అతను చేసిన అన్యాయంవల్ల కలిగిన కోపం అణుచుకున్నాడు. కాని కోర్టుబైటికి వచ్చిన తర్వాత ప్రత్యర్థిని మందలించినాడు. మాటామాటా అనుకున్నారు. తీవ్రం గానే అనుకున్నారు. ఆంధ్రరాష్ట్రంవచ్చి, హైకోర్టు గుంటూరు వచ్చినతర్వాత, ప్రాక్టీసు నరసారావుపేటనించి గుంటూరు మార్చినాడు. అది ఎన్నాళ్ళోలేదు. ఇంతలో ఆంధ్రప్రదేశావతరణమైనది. బ్రహ్మానందరెడ్డి మంత్రిగా హైద్రాబాదు విజయంచేసి స్థిరపడినాడు.

ఒకసారిమాత్రం గుంటూరు పబ్లిక్ ప్రాసిక్యూటరు పదవికి ప్రయత్నించినాడు. ఆ ప్రయత్నం రాజకీయ పలుకుబడిమీదకాక పేరుపొందిన క్రిమినలు లాయరుగానే చేసినాడు. ఎంత పేరుపొందినా అతను ప్రాక్టీసుచేసినది ముఫసిల్‌కోర్టు, తాలూకా సెంటరు. జిల్లాకోర్టులో, సెషన్సులో అంతకి పూర్వంనించీ వున్న లాయర్ల ప్రతిభ ప్రభుత్వం రికార్డులలో వుంటుందిగదా ? గుంటూరు అడ్వొకేటు గోపాలుని వీర రాఘవయ్యకి ఆ పదవి ప్రాప్తించినది. బ్రహ్మానందరెడ్డి అదృష్టం. అదీ 'జీవన దేవత' ప్రభావమే.

# యోగం, వియోగం

**1933** లో కాపురానికివచ్చిన వెంకటరెడ్డి భార్య, గంగాయమ్మ, అకస్మాత్తుగా మరణించినది. చెన్నపట్టణంలోవున్న భర్తదగ్గిరికివెళ్లడానికి గోపాలపురం నించి కొవ్వూరు రైలుస్టేషనుకి వచ్చి, రైలు ఎక్కేముందు విపరీతమైన కడుపు నెప్పితో ప్రయాణం చెయ్యలేకపోయినది. ఇంటికి తీసుకు వెళ్ళినతర్వాత వెళ్ళిపోయి నది. తర్వాత వైద్యులు క్షయ అన్నారు.

బ్రహ్మానందరెడ్డి వొదినగారి దినానికి గోపాలపురం వెళ్ళినాడు. అక్కడ కర్మకాండ పూర్తిఆయినతర్వాత అన్నదమ్ములు తూబాడు వచ్చినారు. వస్తూండగా వూరి పొలిమేరలోనే తమ్ముడు పాపిరెడ్డికి ఎక్కువగా వున్నదన్నవార్త తెలిసినది. ఆ కుర్రవాడా సాయంకాలమే బాధావిముక్తుడైనాడు. పట్టుమని పదిహేనురోజులు తిరక్కుండా పెద్దకోడలూ, చిన్నకొడుకూ పోగానే ఛాయమ్మ కుప్పకూలినట్టు కూలి పోయినది. అందమైన కోడల్నిచూసుకుని మురిసిపోయినది. ఆ మురుపు మూడు నాళ్ళుండలేదు. కడసారి కొడుకుమీద, ఇంటి పట్టునవుండి తనకు ఆసరాగా వుంటాడని ఆశపడినది. ఆ ఆశలు అడియాసలైనవి.

భార్యమీద విపరీతమైన ఆపేక్షతో మంచి రోజులకోసం ఎదురుచూస్తున్న వెంకటరెడ్డి బాధకి అంతులేక పోయినది. మద్రాసు వెళ్ళిపోయి దుఃఖం దిగమింగ డానికి ప్రయత్నించినాడు. అతను ఎదురుచూసిన సంసారసుఖం దూరమైపోయినా, నిరీక్షిస్తున్న రాజకీయ అవకాశం కాళ్ళకి అడ్డం పడినది.

1929 డిసెంబరు ఆఖరిరోజున జవహరిలాల్ నెహ్రూ అధ్యక్షతకింద కాంగ్రెసు మహాసభ లాహోరులో సమావేశమైనది. ఆ సభలో భారతదేశపు గమ్య స్థానం సంపూర్ణస్వాతంత్ర్యమేకాని డొమినియను స్టేటసుకాదని తీర్మానం నెగ్గినది.

శాసనసభలలోవున్న కాంగ్రెసువాదులంతా రాజీనామాలివ్వాలని తీర్మానం జరిగినది. కాంగ్రెసు వాదులు శాసనసభల్లోంచి బైటికివచ్చి, ఉప్పు సత్యాగ్రహంలో ఖైదులోకి వెళ్ళినారు. మద్రాసులో సుబ్బరాయన్ ప్రభుత్వం పోయినది. ఎన్నికలు జరిగినవి. తిరిగీ జస్టిసుపార్టీ అధికారంలోకి వచ్చినది. చిత్తూరు జిల్లాన్యాయవాది, దివాన్ బహద్దూర్ బొల్లిని మునుస్వామి నాయుడు ముఖ్యమంత్రిగా వున్నాడు. బొబ్బిలి రాజు రంగారావు జస్టిసుపార్టీ నాయకుడు. కొత్త ఎన్నికలలో గుంటూరుజిల్లానించి శాసనసభలో మూడుస్థానాలాకి జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి, చెల్లసాని సత్య నారాయణచౌదరి, గాదె సింహాచలం పంతులూ ఎన్నికైనారు. జస్టిసుపార్టీలో చేరిన ఏకైక బ్రాహ్మణుడు, గాదె సింహాచలం.

1932 లో గావును జస్టిసుపార్టీమహాసభ తంజావూరులో జరిగినది. అప్పటికి పార్టీలో అంతః కలహాలు చెలరేగుతున్నవి. ముఖ్యంగా వ్యక్తి గత కులకక్షలు. చౌదదర్లకీ అందులో గుంటూరు జిల్లా చౌదర్లకీ పార్టీనాయకుడికీమధ్య కలిగిన అభిప్రాయ భేదాలు. మునుస్వామి పేరుకి నాయుడేగాని అసలు చౌదరి. బొబ్బిలిరాజాకీ ఆయనకీకూడా సరిపడలేదు. తంజావూరు సభకి కృష్ణా గుంటూరు జిల్లాల్నించి తండోపతండాలుగా రైతులైన చౌదర్లు వెళ్ళినారు. వారిలో చాలా మందికి మద్రాసుదాటి దక్షిణాదికి పోవడం మొదటిసారి. కిర్రుచెప్పులతో, నోటి చుట్టలతో వీరంతా తంజావూరు మహాసభ అలంకరించినారు. సభలో కలకలం ప్రారం భించినది. మాటమీదమాట వచ్చినది. కుర్చీలూ,చెప్పులూ ఎగిరినవి. వేదికమీద కొన్ని పాదరక్షలు పడిన వంటారు. నాయకుడికి ఒకటి తగిలిందనికూడా అంటారు. ఇదంతా తెలుగుచౌదర్లు తనకు అమర్యాదకోసం చేసినతంతు అని నాయకుడు అభిప్రాయ పడడంలో వింత ఏమీలేదు. పర్యవసానం మునిస్వామి నాయుడి పదవీ విరమణ. బొబ్బిలిరాజా తానే ప్రధాన మంత్రిగా ఎన్నుకోబడినాడు.

గుంటూరునించి ఎన్నికైన శాసనసభ సభ్యులలో చెల్లసానిచౌదరి అడ్వకేటు. ఆయనకి శాసనసభ అంతగా గిట్టలేదు. నాయుడు వుండగానే గుంటూరు పబ్లిక్ ప్రాసిక్యూటరు పదవి వేయింపుకుని శాసనసభ స్థానానికి రాజీనామా ఇచ్చినాడు. ఆ స్థానానికి మధ్యంతరంగా ఎన్నిక జరగాలి. ఈ అదనులో రాజకీయాలలో తిరిగే డాక్టరు ఏనుగు సుందరరామిరెడ్డి బొబ్బిలికి సలహా చెప్పినాడు. గుంటూరులో జస్టిసు పార్టీ బలంగావున్నా, అది చౌదరీబలంమాత్రంగానే వున్నది. ఈ ప్రాబల్యం తగ్గించ డానికి ఒక రెడ్డిని ఈ ఖాళీకి నిలబెట్టి నెగ్గిస్తే బాగుంటుందని. బొబ్బిలికి ఇది సమంజసంగానే తోచివుండివచ్చు. ఏ రెడ్డిని పెట్టాలా అనే సమస్య వచ్చినది. అప్పటికి చదువుకున్నరెడ్లు ఎక్కువగా నెల్లూర్లోనేగాని, గుంటూరులో తక్కువ. చివరికి నెల్లూరురెడ్డిని పెడితే ఇక్కడేం పలుకుబడి వుంటుంది, గుంటూరురెడ్డినే

పెట్టాలన్నారు. ఈ ఆలోచనలో ఉత్సాహవంతులైన కాంగ్రెసు యువకులుకూడా వున్నారు. వారికెదురుగా జిల్లాలో ఒక రెడ్డివిజయం కనిపిస్తున్నది. అది బ్రహ్మానంద రెడ్డి విజయం. సరే, మద్రాసులో అన్నగారు కాసు వెంకటరెడ్డి వున్నాడుగదా అతన్ని దున్నపెడదామనా. కొందరు బొబ్బిల్నీ వెంకటరెడ్డినీకూడా కలిసినారు. వెంకటరెడ్డి "నేను కాంగ్రెసువారిని, జస్టిసుటిక్కెట్టుమీద నిలవను" అన్నాడు. స్వతంత్రుడుగా నిలవడానికి అంగీకరించినాడు. అనుకూలంగదా అని ప్రాక్టీసు మద్రాసునించి గుంటూరుకి మార్చుకున్నాడు. బొబ్బలిరాజా అండతో స్వతంత్రంగా శాసనసభకి అభ్యర్థిగా నిలిచినాడు. వెంకటరెడ్డికి ప్రత్యర్థిగా జస్టిసుపార్టీ తరఫున పాములపాటి వెంకటకృష్ణయ్యచౌదరి నిలిచినాడు. ఎన్నికలో చౌదరి గెలిచినాడు. రెడ్డివోడిపోయినాడు, కాని గుంటూరులోనే వుండిపోయినాడు.

1934 ఏప్రిల్‌లో బొబ్బిలిరాజా రాష్ట్రంలో తాలూకాబోర్డులన్నీ రద్దు చేసినాడు. 1935 లో గుంటూరు జిల్లాబోర్డుగడువు అవుతుందనగా, కొత్త ఎన్నికల ముందు బోర్డు రెండుగా చీల్చినాడు. గుంటూరు, తెనాలి, సత్తెనపల్లి, రేపల్లె తాలూకాలు కలిపి గుంటూరు జిల్లాబోర్డుగానూ, ఒంగోలు, బాపట్ల, వినుకొండ, నరసారావుపేట పల్నాడుతాలుకాలు కలిపి ఒంగోలు జిల్లా బోర్డుగానూ ఏర్పాటు చేసినాడు. ఈ రెండు బోర్డులకీ ఎన్నికలు జరగవలసివున్నది. 1935 ఇండియా చట్టం అమలులోకి వచ్చినది. రాబోయే శాసనసభల ఎన్నికలకి కాంగ్రెసు అభ్యర్థుల్ని నిలబెట్టాలని నిశ్చయించినది.

అప్పుడు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు ప్రకాశం. కార్యదర్శి బులుసు సాంబమూర్తి. జిల్లా బోర్డు ఎన్నికలలోకూడా వోపూపుపూపి చూతామన్నారు. కాంగ్రెసు జస్టిసుపార్టీల అభిమానులు బరిమీదికి వచ్చినారు. గుంటూరు జిల్లాలో రెండు జిల్లా బోర్డులకీ అభ్యర్థులు నిల్చినారు. నరసారావుపేట ఒంగోలు జిల్లా బోర్డులోకి వచ్చినది. అయిదు తాలూకాల్నించీ అభ్యర్థులు ఇరుపక్షాల్నించీ నిలిచినారు. బహిరంగంగా, స్థూలంగా కాంగ్రెసు, జస్టిసుపార్టీలనిపేరు. లోలోపల సూక్ష్మంగా కులతత్వం లేకపోలేదు. దరహంమీద చౌదరీ రెడ్డి బలపరీక్షకింద తయారైనది.

ఒంగోలు జిల్లా బోర్డుకి అయిదు తాలూకాల్నించీ కలిపి 32 స్థానాలు వున్నవి. అందులో 7 నరసారావుపేట తాలూకాకే వున్నవి. కాసు సోదరులు ఎల్లాగైనా ఒంగోలు బోర్డు కొట్టాలని నిశ్చయించుకున్నారు. వీరి వెనక దామాషాగా కాంగ్రెసుబలం వున్నది. నేతి చలపతివంటి కాంగ్రెసు నాయకులు ఆలోచన్లు చెబుతున్నారు. ప్రకాశం ఆశీర్వచనం ఉన్నది. ప్రకాశం ఒంగోలువాడు. పోనియ్యా

కూడదని పట్టుదల. జస్టిసువేపునించి జాగర్లమూడి కుప్పుస్వామి తమ్ముడు చౌదరమ్మ నాయకత్వం. ఆయన తెలివిగా కొందరు రెడ్లకుకూడా మద్దత్తు ఇచ్చి నిలబెట్టినాడు.

నరసారావుపేటకొచ్చిన 7 స్థానాలలోనూ ఒకటి ముస్లిం ప్రత్యేకస్థానం. బ్రహ్మానందరెడ్డి నిలబడినాడు. నియోజకవర్గం పాతదే, నాదెండ్ల. రెడ్డికి వ్యతిరేకంగా మరో తూబాడు రెడ్డి, రాయపరెడ్డిని నిలబెట్టినారు. ఇంక నరసారావుపేట నియోజకవర్గం గడ్డుసమస్యగా తయారైనది. పోయిన తాలూకాబోర్డు అధ్యక్షుడు, నల్లపాటి వెంకట్రామయ్యచౌదరి జస్టిసుపార్టీ తరఫున నుంచుంటున్నాడు. దీపైన ఉజ్జీని నిలబెట్టాలి. బ్రహ్మానందరెడ్డికి వో ఆలోచన తోచినది. జమిందార్ని నిలబెడితే? కొండలరావు తనకి స్నేహితుడు. నచ్చజెప్పినాడు. అదివరకుగాని తరవాతగాని రాజకీయాలలోకి పోని నరసారావుపేట జమిందారు కొండలరావు వెంకట్రామయ్యకి వ్యతిరేకంగా నిలిచినాడు. ఇదేవిధంగా తక్కినఏర్పాట్లుచేసి పోటీలు సాగిస్తున్నారు.

రేపు ఎన్నికలకివోట్లు వేస్తారనగా జాయింటు కుటుంబంచేసిన అప్పులకి బ్రహ్మానందరెడ్డిమీద డిక్రీపొంది వారంటుతీసుకోడానికి విశ్వప్రయత్నం జరిగినది. అంతా సిద్ధమైనది. తోటిబ్రాహ్మణ లాయరు ఒకాయన, మునసబు దగ్గిరికివెళ్ళి ఇదంతా ఎన్నికలలో అభ్యంతరంకోసం పెట్టినపేచీతప్ప వేరేఏమీలేదు. అయిపోగానే ఆరిపోతుందనిచెప్పి కథఅడ్డం కొట్టినాడు.

ఇటువంటి ప్రయత్నం మొదటి ఎన్నికలలోనే జరిగినది. ఎవరైతే అప్పిచ్చారో వారిదగ్గిరికి వ్యతిరేకపక్షపు పోటీదార్లువెళ్ళి, ఆ డబ్బు మేం ఇచ్చేస్తాం, దస్తావేజులు మాపేర వెయ్యండి అని అడిగినారు. అప్పిచ్చినవారు కొంచెం నీతిపరులు. తిట్టి తిరగ్గొట్టినారు. ఇంతాచేసి ఆ అప్పు తండ్రినాటిది, ఆరువేలు మాత్రం. వెంకటకృష్ణారెడ్డి పోయేనాటికి గోడవునులో 200 పుట్ల మిరపకాయ వున్నది. అది అమ్మేసి, అప్పుతీర్చేసి సుఖంగావుండమని చెప్పినాడు భార్యతో. ఆ దుఃఖసమయంలో దానాదీనా ఆమెకొంచెం తటపటాయించినది. ఇంతలో మిర్చి ధర విపరీతంగా పడిపోయినది. లాభం బదులు నష్టం వచ్చినది. ఛాయమ్మ అప్పులవాళ్ళని పిలిపించి భూమికట్టుకోమన్నది. వారు ఎంతమాత్రం దానికి వొప్పుకోలేదు. "కొడుకులు చదువుకున్నవాళ్ళు, సంపాదించి తీర్చేస్తారు. నీకేంభయం అమ్మా, భూమి తెగనమ్ముకోవద్దు" అన్నారు. ఆవిడమీదా, కాసువారి కుటుంబంమీదా వారికంత గౌరవం, నమ్మకం. వారి ఆశీర్వాద ఫలితంగా, చివరికొడుకు అనలీఫాయిదాలతో అప్పులన్నీ తీర్చినమాట నిజమే.

ఎన్నికలఫలితాలు తెలిసినవి. నరసారావుపేట తాలూకాలో 7 స్థానాలలోనూ 5 బ్రహ్మానందరెడ్డి పట్టుకున్నాడు. వాళ్ళ వూళ్ళోనే, ప్రత్యర్థి రాయపరెడ్డికి వోట్లు

పడలేదు. బ్రహ్మానందం గెల్చినాడు. కొండలరావు గెల్చినాడు; వెంకట్రామయ్య వోడిపోయినాడు. మొత్తం అయిదు తాలూకాలూకలిపి కాంగ్రెసుకి 14. ఒకరు చనిపోవడంతో 13 మిగిలినవి. జస్టిసుకి 18 స్థానాలు లభించినవి. కాంగ్రెసు స్థానాలు గెలిచినవారిలో భారతీదేవిరంగా వున్నది. ఆచార్య రంగా పొన్నూరులో నిలబడి వోడిపోయినాడు.

జస్టిసుకు పైకి సంఖ్యాబలం వున్నదేగాని అది నిజమైన బలంకాదు. పద్దెన మండుగురులో ఆరుగురు రెడ్లున్నారు. ఫలితాలు తెలిసినతర్వాత ప్రకాశం అన్నాడు. "ఎవడు కాంగ్రెసుకి మెజారిటీ తీసుకొస్తే వాడికే ప్రెసిడెంటుపని". కాసుసోదరులు పూనుకున్నారు. కొంతమందిని ఆ పార్టీలోంచి తిరగదోడుకున్నారు. ఎప్పుడైతే కాంగ్రెసుకి మెజారిటీ వచ్చినదో, భారతీదేవిని అధ్యక్షురాలుగా చెయ్యాలనే ప్రతిపాదన బయలుదేరినది. అది ప్రకాశం ప్రకటించిన సూత్రానికి విరుద్ధం. బ్రహ్మానందరెడ్డే అధ్యక్షస్థానానికి నిలబడినాడు. ప్రత్యర్థిగా చౌదరమ్మ నిలిచినాడు. ఎన్నికలలో తెలిసేదాకా ఏదీ నిశ్చయంలేదు. ఎవరో వెనక్కితీశారు. ఒక్క వోటు మెజారిటీతో బ్రహ్మానందం గెలిచినాడు. అతనికి 27 సంవత్సరాలు.

ఇక వైసుప్రెసిడెంటు పదవికి కాంగ్రెసు తరఫుని పోతిని బుచ్చెప్పనాయుణ్ణి నిలబెట్టినారు. జస్టిసుపక్షం పాములపాటి వెంకటకృష్ణయ్యచౌదరి. కృష్ణయ్యచౌదరి గెలిచినాడు. వింతపరిణామం! నిజానికి ఏ పార్టీకి మెజారిటీ లేదన్నమాట. వ్యక్తి ప్రాధాన్యమే పనిచేసినది.

అధ్యక్షుడికి పెద్దచిక్కే ఎదురైనది. కృష్ణయ్యచౌదరి అనుభవశాలి. ఆయనది రంగాగారి వూరే, నిడుబ్రోలు. ఆ వూరు గ్రామమునసబు. చదువు అట్టే లేదుగాని, కార్యసాధకుడు. ఏనకేనవ్యుపాయేనా తనపని పూర్తిచేసుకోగలిగిన చతురుడు. ఇతరులతోకలిసి ఈ ఎన్నికల పోటీలోకూడా అన్ని అస్త్రాలూ ప్రయోగించినాడు. బహ్మానందం తర్వాత ఎన్నికల ప్రచారంకంటె ఎక్కువ ప్రచారంచేసి, వూరూరూవెళ్ళి, సభ్యుల్ని ఆకట్టుకున్నాడు. స్టేట్యూటరీ కమిటీల ఎన్నికలు వచ్చేసరికి అంతా తన మనుషులే గెల్చుకున్నారు. పై జాగ్రత్తకోసం ఎప్పుడైనా పని కలిగితే తన అధికారాలు పోతిని బుచ్చప్పనాయుడికి డెలిగేటు చేసినాడు. అయినా ప్రతి బోర్డుసమావేశం వో అగ్నిపర్వత ప్రకోపం అంత హడావిడిగావుండేది. చిన్నవాడైనా నిభాయించుకున్నాడు. అధ్యక్షపదవిలోవున్న మూడేళ్ళూ లాప్రాక్టీసు, ఏ పెద్దకేసుకోతప్ప, మానివేసినాడు.

మూడేళ్ళకింద కోడలుపోయి, నెలతిరక్కముందు చిన్నకొడుకుపోయి, ఛాయమ్మ చితికిపోయినది. బ్రహ్మానందరెడ్డి అధ్యక్షుడైనాడన్న సంతోషంతప్ప

ఆవిడికి అంతాదుఃఖమే. పెద్దకొడుకు మళ్ళీ పెళ్ళిచేసుకోరా అంటే, పోయినభార్య బాధేగాని, మారుపలకడు. రెండోవాడు పిల్లజమీందారులా జీవితం గడుపుతున్నాడు. మిగిలిన మూడోవాడు కాస్త పైకి వస్తున్నాడు. కాని ముగ్గురూ బ్రహ్మచార్లుగానే వుండిపోయినారు. మనోరోగానికి మందులేదంటారు. ఆవిడ రోజూ రోజూ కృశించి పోతున్నది. అయినా తాను వచ్చినపని అయిపోయినది. పోయినవాళ్ళుపోగా వున్న వాళ్ళంతా పెద్దవాళ్ళైనారు. తన అవసరం ఎవరికీలేదు. ఆడపిల్ల మాణిక్యమ్మ ఒక్కర్తీ సుఖంగా వున్నది. సిరీసంపదా వున్నాయి.

కొడుకులు ఆవిడసంగతి జాగ్రత్తగానే చూస్తున్నారు. మరణంతో మనసు రాజీపడ్డతర్వాత మనుగడ కష్టం. జబ్బు ఎక్కువైనది. గుంటూరు కుగ్లరు ఆసుపత్రిలో చూపించినారు. కొన్నాళ్ళు గుంటూరులోనే పెద్దకొడుకు దగ్గిరపెట్టుకుని చికిత్స చేయించినాడు. ఆవిడ ఇంటికి వెళ్ళిపోతానన్నది. తూబాడు తీసుకువచ్చినారు. కొడుకులూ, కూతురూ, చిరుమామిళ్ళ బంధువులూ అంతా దగ్గిరవున్నారు. పిల్లల్ని పిలిచినది. వారసత్వపు గ్రామమునసబీ విడిచిపెట్టవద్దు, కుటుంబంలోనే వుండా లన్నది. అప్పుడది బ్రహ్మానందరెడ్డిపేరులో వున్నది. తన మేనగోడలూ, అన్న చినవెంకయ్య ఏకైకకుమార్తె, రాఘవమ్మని బ్రహ్మానందరెడ్డి పెళ్ళిచేసుకోవాలి అన్నది. తప్పకుండా చేస్తామన్నారంతాను. ఆవిడ కన్నుమూసినది. విద్యాగంధం లేదు. పూర్వజన్మవాసన వున్నది. పుట్టినింటిదీ మెట్టినింటిదీ సంస్కృతి వున్నది. పోగా మిగిలిన తన సంతానానికి ఏవిధమైనలోటూ లేకుండా తండ్రీ తల్లీ తానేఅయి, పెంచి పెద్దవాళ్ళనిచేసి, వాళ్ళపిత్రార్జితం, జీర్ణించిపోకుండా, వాళ్ళకి అప్పజెప్పినది. తన చేతనైనంతవరకు లేదనకుండా బీదకీబిక్కికీ సహాయం చేసినది. చుట్టుపట్ల ఛాయమ్మతల్లి చల్లనితల్లి అనిపించుకున్నది. ప్రపంచంలో ప్రతితల్లీ కోరుకునే వరం ఆవిడికి సిద్ధించినది. “ఏతల్లి కన్నబిడ్డలమ్మా, ఆయమ్మచలవ, పైకొచ్చారు” అన్న లోకవాక్యం గడించినది.

భర్తపక్కనే, పాతక్రైస్తవ దేవాలయంలో, పుణ్యవేదిక సమీపంలో ఛాయమ్మ పాంచభౌతిక శరీరం సమాధిచేసి, ముగ్గురు కొడుకులూ, యథావిధిగా అంత్యకర్మలు చేసినారు.

1968 లో తూబాడు కేథలిక్కు క్రైస్తవమిషనరీలు ఛాయమ్మ స్మారక చిహ్నంగా ఒకశిశుస్త్రీ ఆసుపత్రి స్థాపించినారు. ఆ వూళ్ళో ప్రజోపయోగకరమైన స్మారకచిహ్నాలు రెండే రెండు. ఒకటి పార్కు, కాసువెంకటకృష్ణారెడ్డి మెమోరియల్ పార్కు. రెండు, కాసుఛాయమ్మ మెమోరియల్ హాస్పిటల్.

# కాసు వెంకటరెడ్డి

కాంగ్రెసు ఎప్పుడైతే శాసనసభా పునఃప్రవేశానికి సుముఖంగా మారినదో, కాసు వెంకటరెడ్డికి మద్రాసు శాసనసభకి కాంగ్రెసుటిక్కెట్టు తథ్యం అనుకున్నారు. ఉప ఎన్నికలో కృష్ణయ్యచౌదరితో పోటీ చెయ్యకముందే మద్రాసునించి గుంటూరు చేరి, అక్కడే ప్రాక్టీసు చేస్తున్నాడు. భార్యా వియోగం, భ్రాత్రు వియోగం, అన్నిటినీ మించి మాతృవియోగం అతన్నేకాక, తక్కిన ఇద్దరు సోదరుల్ని కూడా బాధిస్తున్నవి. బ్రహ్మానందం ఏదో స్థిరపడి పైకివస్తున్నాడు; వెంగళరెడ్డి ఇంకా స్థిరపడలేదు. వెంకటరెడ్డి ఆలోచన, అ తమ్ముడుకూడా తండ్రికోరిక ప్రకారం బి. ఎల్. చదివి లాయరీచేస్తే అందరూ వో దారికి వొచ్చినట్టవుతుందని. తను గుంటూరులోనూ, బ్రహ్మానందం నరసారావుపేటలోనూ, వెంగళరెడ్డి గురజాల లోనూ స్థిరపడితే, ముగ్గురిమధ్యా గుంటూరుజిల్లా పశ్చిమభాగం యావత్తూ, ఒంగోలు జిల్లా బోర్డుకి సంబంధించిన తాలూకాలు చేతులో వుంచుకోవచ్చునని అభిప్రాయం. వెంగళరెడ్డిని పిల్చి, నచ్చజెప్పి ఎల్. ఎల్. బి. చదవడానికి లక్నో పంపించినాడు.

కుటుంబపరిస్థితులలో వెంగళరెడ్డి లా చదువు పూర్తికాలేదు. ఇంటిపట్టునే వుండవలసిన అవసరం కలిగినది.

ఎన్నికలలో అభ్యర్థుల్ని నిర్ణయించినారు. గుంటూరుజిల్లానించి ఒక శాసన సభాస్థానానికి వెంకటరెడ్డికి టిక్కెట్టు ఇచ్చినారు. కాని, అతనికి లభించినది అన్నిటి కంటే కష్టమైన నియోజకవర్గం. అతని ప్రత్యర్థి మేరువువంటి జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి. 1920 లో ప్రారంభించి, 1937 వరకూ 17 సంవత్సరాలు ఆ జిల్లానించి కుప్పుస్వామి శాసనసభా సభ్యుడుగావున్నాడు. ఆయనకి ఎదిరి ఇంత వరకెవరూలేరు. మీదు మిక్కిలి ప్రజాకంటకుడుకాడు. పేరుకి జస్టిసుగాని అందరికీ

హితుడే, చాలామంచిపేరున్నవాడు. అటువంటి ఆరితేరిన ఆసామీ కుప్పుస్వామి చౌదరికి పోటీ చిన్నవాడూ, అప్పుడే రాజకీయాలలోదిగిన వెంకటరెడ్డి.

వెంకటరెడ్డి ఆలోచనాపరుడేగాని కార్యకర్తకాడు. పథకంవెయ్యగలడుగాని అమలుజరపలేడు. రాజకీయ అభిలాషేగాని రాచకీయాలు తెలియవు, తమ్ములు అనేవారు, "అన్నయ్యా, ఆ వూరువెళ్ళి వాళ్ళని చూతామా" అని. "ఒరే, నా మాట వినండి, మనకి వేసేవాడు అభిమానంకొద్దీ వేసితీర్తాడు. వెయ్యనివాడు మనం అడిగితేమాత్రం వేస్తాడా" అనేవాడు. ఒక పనిమాత్రం చేసినాడు. అతను వ్రాయ గలడు. జస్టిసుపార్టీని విమర్శిస్తూ పత్రికలలో వ్యాసాలు వ్రాసినాడు. వారి పత్రి కలు మురికికాలువ పత్రికలన్నాడు, వారి ప్రజాప్రేమ కిరాయి ప్రణయం అన్నాడు. కట్టమంచి రామలింగారెడ్డి అంతటివాడు ఆ వ్యాసాలు చదివి మెచ్చుకున్నాడు. "ఈ వెంకటరెడ్డి ఎవడ్రా, చురుకైనవాడే, వోమాటు చూస్తే బాగుండును" అన్నాడు.

వ్రాతకోతలు అన్న చేస్తే, బయటి తతంగం తమ్ములు నడిపించినారు. బ్రహ్మానందరెడ్డి కారువేసుకుని, గ్రామగ్రామం, వాడవాడ, గడపగడపా తిరిగినాడు. పైగా అతను జిల్లాబోర్డు అధ్యక్షుడు. ఇంతమితభాషి, ఇంతచాటు మాటుగా వుంటూ వుండేవాడు, ఇంతచైతన్యంతో, ఇంతచాకచక్యంతో ఎన్నికల ప్రచారం నడుపుతు న్నాడే అని, సానలుతీరిన ఎన్నికల యోధులు ఆశ్చర్యపోయినారు. జయం జయించినంత ఏదీ జయించదని ఇంగ్లీషుసామెత. వెంకటరెడ్డి గెల్చినాడు. 5500 వోట్ల మెజారిటీతో గెల్చినాడు. కుప్పుస్వామిచౌదరి వోడిపోయినాడు. ఒక మహా శైలం కూలినది. ఆ తర్వాత చౌదరి రాజకీయాలకి స్వస్తిచెప్పి స్వగ్రామం చేరు కున్నాడు. కాలం మారినది, కాంగ్రెసు ఉప్పెన వచ్చినది.

1937 ప్రారంభంలో ఎన్నికలు జరిగినవి. 1935 ఇండియాచట్టం ప్రకారం రాష్ట్రీయ స్వాతంత్ర్యం 1937 ఏప్రిల్ 1వ తారీఖున అమలులోకి వచ్చి నది. పదకొండింటిలో ఆరు రాష్ట్రాలలో కాంగ్రెసు మెజారిటీతో వచ్చినది. మద్రాసు రాష్ట్రంలో నూటికి 76 మంది కాంగ్రెసు పక్షం వోటుచేసినారు. కాంగ్రెసు బలంవున్న ఆరు రాష్ట్రాలలోనూ మంత్రివర్గం ఏర్పాటుచెయ్యడానికి అవకాశం వున్నది, కాని కాంగ్రెసు తొందరపడలేదు. చట్టంలో ఫెడరలు సంబంధాల విష యంలోనూ, గవర్నర్లకిచ్చిన ప్రత్యేక అధికారాల్లోనూ కొంచెం ఇబ్బందులున్నవి. గవర్నర్లు ఆ అధికారాలు ఉపయోగించరని హామీ కావాలని కాంగ్రెసు కోరినది. చట్టం అల్లావుండగా హామీ ఇవ్వడానికి తమకి అధికారం లేదని గవర్నర్లు అన్నారు.

మద్రాసులో కాంగ్రెసు శాసనసభా నాయకత్వపు ఎన్నికలలో ఆంధ్రుల అనైకమత్యంవల్ల ప్రకాశం నాయకుడు కావలసిన అవకాశం పోయినది. కొండా

వెంకటప్పయ్య ప్రకాశానికి వ్యతిరేకుడని అంటారు. తగాదాలు మంచివికావని ప్రకాశమే రాజగోపాలాచారి పేరు ప్రతిపాదించగా, ఆయన ఏకగ్రీవంగా ఎన్నుకోబడినాడు. ఆహ్వానంమీద గవర్నర్ని చూసినాడు. ఈ చర్చలు జరుగుతూవుండగా, గాంధీ మద్రాసు వచ్చినాడు. అప్పట్లో కాంగ్రెసుకీ ప్రభుత్వానికీ కుదరలేదు. శ్రీనివాసశాస్త్రి, కూర్మా వెంకటరెడ్డి నాయుడు, కట్టమంచి రామలింగారెడ్డి ప్రభుత్వం చేత నామినేటుచెయ్యబడి కౌన్సిలు సభ్యులుగా వున్నారు. కూర్మా నాయుడు అప్పట్లో లా మెంబరుకూడాను. గవర్నరు గత్యంతరంలేక శ్రీనివాసశాస్త్రిని మంత్రివర్గం ఏర్పాటు చెయ్యమన్నాడు. ఆయన నావల్లకాదన్నాడు. అప్పుడు రెడ్డినాయుణ్ణి ఆహ్వానించినాడు. ఆయన అంగీకరించి తాత్కాలిక మంత్రివర్గం ఏర్పాటు చేసినాడు.

సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడు, జస్టిసుపార్టీ నాయకులలో అగ్రగణ్యుడు. పశ్చిమ గోదావరిజిల్లా న్యాయవాది. అక్కడ తాలూకా జిల్లా బోర్డుల అధ్యక్ష పదవులుచేసి, జస్టిసు మంత్రిగావుండి, దక్షిణాఫ్రికాలో బ్రిటిష ప్రతినిధిగావుండి, మద్రాసు లా మెంబరు, గవర్నరూకూడా చేసిన ప్రతిభాశాలి.

తన మంత్రివర్గంలో తెలుగువార్ని ఎవర్నీ వేసుకోలేదు. జస్టీసు పార్టీ సభ్యులు కొందరు, నాయకుడైన బొబ్బిలి రాజా అనుమతిపొంది మంత్రివర్గంలో చేరినట్టు ప్రకటించినారు. పార్టీకి మంత్రివర్గంతో సంబంధలేదు. 1937 మార్చి 30 వ తారీఖున అధికారంలోకి వచ్చిన కూర్మా మంత్రివర్గం జులై 14 వ తారీఖున రాజీనామా ఇచ్చినది. ఈలోగా వైస్రాయి చేసిన ఒక ప్రకటన కాంగ్రెసుకి నచ్చి ఆరు రాష్ట్రాలలోనూ మంత్రివర్గాలు ఏర్పాటు చేసినది.

మద్రాసులో రాజాజీ ముఖ్యమంత్రిగా ప్రభుత్వం ఏర్పాటైనది. ప్రకాశం రివెన్యూమంత్రి. వి. వి. గిరి, బెజవాడ గోపాలరెడ్డికూడా మంత్రులే. కాశేశ్వరరావు. తెన్నేటి విశ్వనాథం, మాగంటి బాపినీడు, క్రొవ్విడి లింగరాజు, వెన్నెలగంటి రాఘవయ్య, బి. ఎస్. మూర్తి మొదలైన వారు పార్లమెంటరీ సెక్రటరీలు. బులుసు సాంబమూర్తి శాసనసభాధ్యక్షుడు. ఇది ప్రభుత్వంలో ఆంధ్రుల కోటా. శాసనసభ ఛీపాక్‌లో సముద్రతీరాన సెనెట్‌హౌస్‌లో జరిగేది, సభాకార్యక్రమాలు బైట బీచిలో ప్రజలంతా వినడానికి స్పీకర్లు పెట్టించినాడు స్పీకరు సాంబమూర్తి.

1937లోనే ఆంధ్రసభలు పెనుమాకలో జరిగినవి. రాజకీయ సభకి వెంకటరెడ్డి అధ్యక్షత వహించినాడు. ఆ కాలంలో కట్టమంచి రామలింగారెడ్డి గుంటూరు వచ్చినాడు. అప్పుడు జరిగిన సభలో కాసు వెంకటరెడ్డికూడా మాట్లాడినాడు. తొలిసారి ఇద్దరూ సమావేశమైనారు.

కాం(గెసు ప్రభుత్వం అధికారంలోకి రాగానే చేసిన పనులలో ఒకటి విభజించిన గుంటూరు జిల్లా బోర్డుని ఒకటిగా తిరిగీ రూపొందించటం. ఈ సందర్భంలో నియోజకవర్గాలు తిరిగీ ఏర్పాటు చెయ్యాలన్నారు. ఆ పనిలో కాసు వెంకటరెడ్డిని కూడా నియోగించినారు.

అయిదు సంవత్సరాలు భార్యా వియోగం వల్ల కలిగిన బాధ అనుభవించి, వెంకటరెడ్డి మళ్లీ పెళ్లి చేసుకోవాలని సంకల్పించినాడు. ఈ సంకల్పానికికూడా ఆ భార్యమీద ఆపేక్షే కారణం. పెళ్లికూతురు ప్రథమభార్య చెల్లెలే. అందగత్తె, కాని మూగ పిల్ల. ఎవరు చెప్పినా వినక ఆ పిల్లని వివాహం చేసుకున్నాడు. ఈ వివాహం 1938 లో జరిగినది. ఆ సంవత్సరం చాలావరకు మద్రాసులో శాసనసభా కార్యక్రమంతోనూ చివరిభాగం కొత్తజిల్లాబోర్డు నియోజకవర్గాల నిర్ణయంతోనూ సరిపోయినది. తీరిక లేకుండా తిరిగినాడు. వోరోజుని మద్రాస్నునించి ఇంటికి వచ్చి రక్తం కక్కుకున్నాడు. డాక్టర్లు పరీక్ష చేసి క్షయవ్యాధి అనీ, ఒక ఊపిరితిత్తి పూర్తిగా దెబ్బ తిన్నది, ఇంకోటి సగం పోయినదనీ చెప్పినారు. తమ్ములిద్దరూ అన్నగార్ని తిన్నగా మద్రాసు తీసుకెళ్ళి డాక్టరు వాసుదేవరావుకి చూపించినారు. పల్లవరంలో వో ఇల్లు తీసుకుని చికిత్స చేయించినారు. ఆ రోజుల్లో క్షయకి సరియైన మందులు లేవు. విశ్రాంతి, పుష్టిగల ఆహారం చికిత్స. వైద్యులు మటన్, సూప్ వగైరా పుచ్చుకోమంటే శాఖాహారి అయిన రెడ్డి పచ్చికూరలు పెట్టమనేవాడు. 1939 ఏప్రిల్‌లో డాక్టర్లు ఇక లాభం లేదని తేల్చుకున్నారు. ఇంటికి తీసుకు వెళ్ళండి, తరవాత మళ్ళీ రావచ్చును అన్నారు. తిన్నగా తూబాడు తీసుకు వచ్చినారు. మే 31 వ తారీఖున మరణించినాడు. ఆ కుటుంబాన్నే క్షయ వ్యాధి క్షయం చేసినది. భార్యా భర్తలిద్దరూ ఒకే వ్యాధితో పోయినారు. విచ్చల విడిగా తిరిగిన వెంగళరెడ్డి కుటుంబానికి పెద్దగా బాధ్యత వహించవలసి వచ్చినది.

వెంగళరెడ్డి 1945లో, జైలులో వున్న తమ్ముడి బలవంతంతో వివాహం చేసుకున్నాడు. అతని వధువు శేషాయమ్మ, తూర్పు గోదావరిజిల్లా బిక్కవోలు గ్రామస్థురాలు. పెళ్ళి కాగానే మనిషి మారిపోయినాడు. ఇంటి వ్యవహారాలు జాగ్రత్తగా చూసుకోడమేకాక, వూళ్లో నలుగురికీ సహాయం చేస్తూ వుండడంతో తాలుకాలోనే కాక జిల్లాలోకూడా పలుకుబడి సంపాదించినాడు. పంచాయతీ రాజ్య ప్రవేశంతో నాందెడ్ల సమితికి అధ్యక్షుడై గ్రామ ప్రజాసేవ చేసినాడు. పంచాయతీతో రాజకీయ రంగం ప్రవేశించిన వెంగళరెడ్డి పార్లమెంటు ప్రవేశించి సానలు తీరినాడు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ శాసనమండలి సభ్యుడు. ఆంధ్రప్రదేశ భూమి తనఖా బ్యాంకు అధ్యక్షుడు. గుంటూరు జిల్లా పరిషత్తు అధ్యక్షుడుగా పని చేసినాడు.

ఆరుగురు సంతానంతో, నరసారావుపేటలో స్వగృహంలో వుండి, ఇతోధిక ప్రజాసేవచేస్తూ వుంటాడు. అన్నదమ్ములలో వెంగళరెడ్డి ఒక్కడికే సంతానప్రాప్తి. మొదటివాడికి తండ్రి పేరు, వెంకట కృష్ణారెడ్డి. రెండవవాడు ప్రసాదరెడ్డి. మూడు ఆడపిల్లలు; తల్లి పేరు, ఛాయమ్మ. తరవాత సత్య, అంజలి, రాజగోపాలరెడ్డి. వీరే, కాసువారి వారసులు.

# జిల్లా బోర్డు

ఒంగోలు జిల్లాబోర్డు మూడేళ్ళముచ్చట. అంత సాఫీగానూలేదు, అంత వొడుదుడుకుగానూలేదు. ప్రత్యర్థులపని ప్రతీదీ వ్యతిరేకించడమేనని మనదేశంలో నమ్మకం. ప్రతిపనికీ అడ్డంపెట్టడమే వారి కార్యక్రమం. ఎన్ని అడ్డాలు పెట్టినా ఏదోకొంత పనిచేసినాడు బ్రహ్మానందరెడ్డి. 1926 లో నాగార్జునకొండ బౌద్ధశిధిలాలు బైటపడినవి. నాగార్జునకొండ మాచెర్లకి 16 మైళ్ళు వుంటుంది. ఇది పర్వతారణ్యసీమలో దారీతెన్నూ లేకుండా వుండేది. డొంకలలో రాతిభూమిమీద రెండెడ్ల బళ్ళమీద తప్ప ప్రయాణం వీలుండేదికాదు. ఈ శిధిలాలు ముందుముందు చాలా ప్రాముఖ్యంలోకి వస్తాయని తెలిసి, మాచెర్లనించి ఒక రహదారి వేయించినాడు బ్రహ్మానందరెడ్డి. అంతేకాక, చాలా గ్రామాలలో హైస్కూళ్ళు పెట్టించినాడు. పన్నుల నిరాకరణంలో పేరుపొందిన పెదనందిపాడులో పాఠశాల ఇతని హయాంలోనే వచ్చినది. గురజాలలో హైస్కూలు కూడా ఆకాలంలో పెట్టినదే.

హోరాహోరీ పోటీలో నెగ్గిన అధ్యక్షుణ్ణి ఏవిధంగానన్నా తిప్పలుపెట్టాలి, అపకీర్తిపాలుచెయ్యాలి అని ప్రత్యర్థులు ప్రయత్నించినారు. ప్రభుత్వానికి ఎన్నో అకాశరామన్న అర్జీలు పంపించినారు. కొందరు పేరుపెట్టే బహిరంగంగా పిటిషన్లు పెట్టినారు. అటువంటి అర్జీలు పంపించినవారిలో గాదె సింహాచలం ఒకరు. ఈయన ఆకాలంలో జిల్లాలో చాలా పలుకుబడికలిగిన పంతులు. పరీక్షలు ఇవ్వకుండానే, ప్రభుత్వం అనుమతిమీద ప్రైవేటు వకీలుపని చేస్తూవుండేవాడు. చక్కని విగ్రహం పచ్చటిమనిషి, పంతులాంగం వుట్టిపడుతూ, నల్లకోటూ, తెల్లపాగా, కండువా, మీసాలూ వుండేవాడు. చమత్కారి. బ్రహ్మానందరెడ్డితో స్నేహంగానే వుండేవాడు. బ్రహ్మానందం గాదెవారి దౌహిత్రుడు, అల్లుడు. సింహాచలం ఇంటిపేరు గాదెవారు,

అందుకని రెడ్డిని 'ఏం, అల్లుడూ' అని పిలిచేవాడు. అంత అన్యోన్యంలోనూ రాచకార్యాలలో అర్జీలు మానలేదు. వోరోజుని ఎక్కడో కనబడి, "అల్లుడూ, నీమీద వో పిటీషన్ పెట్టానోయ్"! అని చెప్పినాడు. ఆయన పెట్టినది, ఇతరులు పెట్టినవీ అర్జీల సారాంశం ఒకటే. బ్రహ్మానందరెడ్డి అవివాహితుడు, పైలా పచ్చీసులో వున్నాడు, అందగాడు, ఆడవాళ్ళని ఆకర్షిస్తున్నాడని. ఒంగోలు జిల్లా బోర్డు అధ్యక్షుడైన రెడ్డి అభినవ వసంతరాయుడు, చెళ్ళపిళ్ళరాయుడు. ఇది వో గోకులం. ఇందులో గోపికలు చాలామంది వున్నారని తత్కారణంగా బోర్డు వ్యవహారాలలో లోటుపాట్లు వొస్తున్నవనీ.

ఇవన్నీపోగా, ప్రభుత్వందృష్టి ఆకర్షించేటప్పటికి రెడ్డినాయుడు తాత్కాలిక మంత్రివర్గం అధికారంలోవున్నది. చెన్నపట్నంనించి స్థానిక పరిపాలన డిప్యూటీ ఇన్స్పెక్టరు జనరలు వో నాయుడు దర్యాప్తు చెయ్యడానికి ఒంగోలు వచ్చినాడు. అప్పుడు అధ్యక్షుడు నరసారావుపేటలో వున్నాడు. జిల్లాబోర్డు మేనేజరు అధ్యక్షుడి అనుమతిలేనిదే ఆఫీసులోకి ఎవర్నీ రానియ్యడానికి వీలులేదన్నాడు. హాయిరామా, అని ఆనాయుడు నరసారావుపేటవచ్చి బ్రహ్మానందరెడ్డిని కలిసినాడు. "నాకు తెలియకుండా ఆఫీసు తనిఖీ చెయ్యడానికి నువ్వెవరివి" అన్నాడు రెడ్డి. నాయుడు క్షమార్పణ కోరినాడని వినికిడి.

ఈ దర్యాప్తులేవీ జరగీ జరక్కుండానే, కాంగ్రెసు ప్రభుత్వం గుంటూరు ఒంగోలు బోర్డులు మళ్లీ కలిపేసినది. రెండు బోర్డుల సభ్యుల్నీ కలిపి ఒక సమావేశం చేసినారు. ఏ బోర్డు అధ్యక్షుడు సభ నడపాలన్న తికమక లేకుండా, కలెక్టరు ఎస్. కే. చెట్టూరు అధ్యక్షత వహించినాడు. చెట్టూరు తర్వాత మద్రాసు ఛీఫ్ సెక్రటరీ చేసి రిటైరైనాడు. ఆయన భార్య రావువారి ఆడపడుచు.

బోర్డు రద్దు అవుతుందని తెలిసిన తర్వాత బ్రహ్మానందరెడ్డి కొన్ని చర్యలు తీసుకున్నాడు. వెళ్ళిపోయే అధ్యక్షుడు అల్లా చేయవలసింది కాదని కలెక్టరు మందలించబోయినాడు. బ్రహ్మానందరెడ్డి తన పని సమర్థించడమే కాకుండా, అది ప్రజా ప్రభుత్వ భాగమనీ, తాను 11 లక్షల మంది ప్రజల ప్రతినిధిననీ, కలెక్టరు ఒక అధికార మాత్రుడనీ. ఏం తంటాలు పడ్డా ఎవరూ తాను వేసిన ఆర్డరులో అక్షరం మార్చలేరనీ, గద్దించినాడు.

జిల్లా బోర్డు రద్దు కాగానే మళ్ళీ తీవ్రంగా న్యాయవాదవృత్తి సాగించినాడు. ఆ రోజుల్లో అన్న వెంకటరెడ్డి చికిత్సకి ఖర్చులూ వగైరా తానే ఆదుకోగలిగినాడు. వెంకటరెడ్డి పోయిన తర్వాత శాసనసభలో ఖాళీ ఎల్లా భర్తీ చేయ్యాలి. ఎవర్ని నిలబెట్టాలన్న విషయం ఆలోచనకి వచ్చినది. గుంటూరు జిల్లాలో కాంగ్రెసు సంస్థ

లన్నీ బ్రహ్మానందరెడ్డిని పెట్టాలని ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘానికి సిఫారసు చేసినవి. అప్పుడు ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షుడు డాక్టరు పట్టాభి. గొట్టిపాటి బ్రహ్మయ్య అధ్వర్యాన ఒక ఉప సంఘాన్ని నియమించినారు. వారి ముందు కొందరు కాంగ్రెసువారే బ్రహ్మానందరెడ్డి బోర్డు అధ్యక్షుడుగా వుండగా వెళ్ళిన అర్జీల విషయం నివేదించినారు. పట్టాభి మనస్సులో కోలవెన్ను రామకోటీశ్వరరావు పేరు వున్నది. రామకోటీశ్వరరావుకిదేమీ తెలియదు. ఆయన అసలు దరఖాస్తే పెట్ట లేదు. రావు నరసారావుపేటలో ఒక పెద్దింటి బిడ్డ. గాంధీమార్గంలో న్యాయవాద వృత్తి మానేసినాడు. ఆంధ్ర జాతీయ కళాశాల ప్రిన్సిపాలుగా పనిచేసినాడు. ఆదిలో ప్రకాశం 'స్వరాజ్య పత్రిక'లో సహాయ సంపాదకుడుగా వున్నాడు. సంస్కారి. 'త్రివేణి' అనే ఇంగ్లీషు పత్రిక, విజ్ఞాన ప్రచారం కోసం నడుపుతూ, తన సర్వస్వం దానికే ధారబోసినవాడు. పట్టాభి ఆయన్ని పిలిపించి దరఖాస్తు పెట్టమన్నాడు. రామకోటేశ్వరరావునే అభ్యర్థిగా నిలబెట్టినారు.

గుంటూరుజిల్లా కాంగ్రెసు యువకులలో కొంత అలజడి కలిగినది. వారంతా స్థానిక సంస్థల సిఫారసు తిరస్కరించి పట్టాభి ఇల్లా చేస్తాడా అని కష్టపడినారు. మేమందరం నీకు పనిజేస్తాం, నువ్వు స్వతంత్రుడివిగా నిలబడమన్నారు బ్రహ్మానంద రెడ్డిని. అతని జవాబు : "నేను కాంగ్రెసు సభ్యుణ్ణి. అధిష్ఠాన వర్గం ఆజ్ఞకి బద్ధుణ్ణి. ఎన్నడూ నేను కాంగ్రెసు తీర్మానం వ్యతిరేకించను. రామకోటేశ్వరరావు పండితుడు, త్యాగం చేసినవాడు. మేధావి, నాకు గురువు వంటివాడు, నా కంటె పెద్దవాడు. బాకీ వున్న గడువువరకే సభ్యుడుగా వుండగలడు. నేను చిన్నవాణ్ణి, ఆగగలను, మరో అవకాశం నాకు దొరుకుతుంది. రామకోటేశ్వరరావు తరఫుని నేను పని చేస్తాను." అల్లాగే చేసినాడు, రావు గెల్చినాడు. ఆయన సభ్యత్వం గడువు పూర్తి కాక మునుపే కాంగ్రెసు మళ్ళీ శాసనసభలు విడిచిపెట్టినది.



# ఇల్లు, ఇల్లాలు

కొన్నాళ్లగా నరసారావుపేట జమీందారు, కొండలరావు పోరుతున్నాడు:

"న్యాయవాదిగా స్థిరపడ్డావు, రెండు చేతులా సంపాదిస్తున్నావు, పేరు ప్రతిష్ఠలు ఆర్జించావు, వున్న వూళ్ళో వో ఇల్లు కట్టుకోరాదా" అని. కొండలరావూ, బ్రహ్మానందరెడ్డి స్నేహితులు. క్లబ్బులో కలవడమే కాకుండా, ప్లీడరు కోటకి వెళ్ళి జమీందారుకి సలహాలు చెప్పడం, లావా దేవీలు చూసి పెట్టడంకూడా వుండేది. అన్న వెంగళరెడ్డీ, తనూకూడా ఆయన వ్యవహారాలు చూడడం రివాజు. వారసత్వాలు కరిగిపోయి, వ్యయాలు ఎక్కువై, పురాతన కోటలాగే సంపదకూడా క్షీణించిన సమయంలో కాసు సోదరు లిద్దరూ ఒక మోటారు రవానా వ్యాపారం లాంటిది సృష్టించి, భాగస్థుల్ని కుదిర్చి, అది విజయవంతంగా నడిపించి, రాజాగారికి మేలు కూర్చినారు. ఈ పరస్పర స్నేహ భావంతో రాజా వూరుకోలేదు. ఇంటి విషయమై బ్రహ్మానంద రెడ్డిని పోరుతూనేవున్నాడు. చివరికి ఇచ్చి పుచ్చుకోవడాలలో, నరసారావుపేటలో కచేరీలకి పడమరగా, రైలు కట్టకి అవతల ఒక ఎకరమో ఎంతో నివేశన స్థలం బలవంతంగా అంటగట్టినాడు. అప్పటికి ఆ ప్రాంతంలో ఇళ్ళులేవు. విశాలమైన స్థలంలో 1938లో బ్రహ్మానందం స్వగృహానికి శంఖు స్థాపన జరిగినది. నెమ్మదిగా రెండు సంవత్సరాలకి చక్కని గృహం తయారైనది. గృహ నిర్మాణం పూర్తి అయేసరికి గృహస్థుకి ముప్పైయేళ్ళు దాటి ముప్పై ఒకటి ప్రవేశించినది.

ఇల్లు పూర్తిఅయి గృహ ప్రవేశం జరిగేసరికి చిరుమామిళ్ళలో మేనమామల ఇంట్లో తొందర ప్రారంభించినది. పెద్ద మేనమామ, పెద వెంకయ్య బతికివున్న రోజులవి. చెల్లెలు ఛాయమ్మ భర్త, కాసు వెంకట కృష్ణారెడ్డి పోయినప్పటినించీ, ఆ కుటుంబ వ్యవహారాలన్నీ వారే చూస్తూ వచ్చినారు. చెల్లెలి పిల్లలు ఇంతా అంతా

చిన్నవాళ్ళు. పక్కనే పొలిమేరలో వున్నారు గనక వెంటనే ఆదుకున్నారు. ఛాయమ్మ పోయి, పెద మేనల్లుడు వెంకటరెడ్డిపోయి, ఆవిడ సంతానం మిగిలిన వారు ముగ్గురే: వెంగళరెడ్డి, బ్రహ్మానందం, మాణిక్యమ్మ. మాణిక్యమ్మ అత్తారు కూడా చిరుమామిళ్ళే. ఆవిడ భర్త, గాదెకోటిరెడ్డికి బావమరుదులంటే విపరీతమైన అభిమానం. పైకి రాగలరనే నమ్మకం. ఆయిన ప్రోద్బలంతోనే వారు రాజకీయాలలో దిగినారు. జిల్లాలో రెడ్డికులానికి పేరుతేవాలని కోటిరెడ్డి ఆశయం. వీరంతా కూడ బలుక్కున్నారు. వెంగళరెడ్డి అప్పటికింకా స్థిరపడలేదు. స్థిరపడే సూచనలు లేవు. వివాహప్రసక్తి ఎత్తితే ససేమిరా అనేవాడు. ఇక మిగిలింది బ్రహ్మానందరెడ్డి. ఆయనకి పెళ్ళికూతురు పుట్టేవున్నది. ఆ పిల్లే చిన్నమేనమామ, చినవెంకయ్య కూతురు రాఘవమ్మ. పోయేముందు రాఘవమ్మని బ్రహ్మానందానికిచ్చి పెళ్ళిచెయ్యాలని చేతులోచెయ్యి వేయించుకునిమరీ ప్రాణాలు విడిచిపెట్టినది ఛాయమ్మ. బ్రహ్మానందం ఇల్లు కట్టుకున్నాడు, ఇల్లాలు వెడితేగాని ఒకయింటివాడుకాడు, ఈ యేడుపెళ్ళి చేసి తీరాలి అని పట్టుపట్టినాడు పెదవెంకయ్య. అవునన్నారంతాను.

తూబాడుకాపువారిలాగే, చిరుమామిళ్ళగాదెవారికికూడా, అన్నదమ్ములలో ఒకరికే సంతానం. పెదవెంకయ్యకి సంతతి లేదు. ఆఖరివాడు వీరారెడ్డి దేశాంతరం లోనే పోయినాడు. లేకలేక చినవెంకయ్యకి కలిగినది సంతానం; మిగిలినది ఒక ఆడపిల్ల. రాఘవమ్మ తర్వాత ఒక మగపిల్లవాడు కలిగినాడు. వెంగళరెడ్డి అని తాత పేరు పెట్టినారు. అక్కగారిలాగే పిల్లవాడు చాలా అందమైనవాడు. అటుతర్వాత ఒకపిల్ల. ఇద్దరూ దక్కలేదు. చినవెంకయ్య కూతుర్నే ఎక్కువ గారాబంగా చూసే వాడు. కూతురూ, కొడుకూ ఎదురొచ్చి కాళ్ళ కడ్డంబడితే ముందు కూతుర్నే చేతులోకి తీసుకునేవాడు, దక్కనివాడిమీద ప్రేమ పెంచుకోకుండాచేశాడేమో భగవంతుడని తర్వాత తలబోసుకొని కంటతడిబెట్టుకునేవాడు.

రాఘవమ్మ కాస్త తప్పడడుగులువేసి, మాటలు నేర్వడంతోటే మేనత్త ఛాయమ్మ మాలిమి చేసుకోడం ప్రారంభించినది. పొద్దున్నే పనివాణ్ణి పంపించేది. పాలుబట్టి పిల్లని తూబాడు పంపించేది తల్లి. రెండు వూళ్ళకీ పొలిమేరే అడ్డం. సాయంత్రం మళ్ళీ తల్లి దగ్గిరికొచ్చేది పిల్ల. ఈ లోపుగా ఏ పొలంనుంచో తండ్రి ఇంటికొచ్చేవాడు. పిల్లని చూడాలనిపిస్తే గుర్రంమీద చెల్లెలిగారింటికి రెండు నిమిషాలలో వెళ్ళేవాడు. పిల్లనిచూసేవాడు, కూడా తీసుకొచ్చేవాడు. చినవెంకయ్యకి రెండు గుర్రాలుండేవి. ఆయనా కూతురూ కూడా చిరుమామిళ్ళ తూబాడుగ్రామాల మధ్య సంచారంచేస్తూ వుండేవారు. తూబాడులో చెల్లెలి కుటుంబవ్యవహారాలుకూడా చూసేవాడు అన్నగారు.

మేనత్తా, కాబోయే అత్తగారూ, ఛాయమ్మ, తన కోడలి పెంపు జాగ్రత్తగా అజమాయిషీచేస్తూ వుండేది. ఇంటిదగ్గిర మగపిల్లలలాగే చదువుచెప్పించినది. అదుపు

ఆజ్ఞలలో పెంచినది. ఏడెనిమిదిసంవత్సరాలు రాగానే గుంటూరు శారదానికేతనంలో ప్రవేశపెట్టి విద్యాబుద్ధులు నేర్పించినది. శారదానికేతనం స్థాపించిన పుణ్యాత్ములు ఉన్నవ లక్ష్మినారాయణ దంపతులు. ఆ రోజుల్లో ఆంధ్రదేశంలో అటువంటి స్త్రీ విద్యాసంస్థ లేదు. సంగీతం, చిత్రకళ, ఇతర లలితకళలు నేర్పించేవారు. ఎందరో బాలికలు విద్యనేర్చుకొని పేరుప్రతిష్ఠలు సంపాదించినారు.

రాఘవమ్మ వయొలిన్‌మీద సంగీతం నేర్చుకునేది. విద్యాబోధన గాంధీ సిద్ధాంతంమీద వుండేది. విద్యార్థినులంతా తకిలీ వొడకడం క్రమశిక్షణలో ఒక భాగం. ఆ తకిలీలో తనతరం పిల్లలందరిలోనూ రాఘవమ్మకి అగ్రస్థానం.

కాసు వెంకటరెడ్డి ఆ రోజుల్లో గుంటూరులోనే లాయరుగా వుండేవాడు. అన్నదమ్ములంతా వొస్తోపోతో వుండేవారు. శలవుల్లోనూ, అనుమతి వున్నప్పుడూ రాఘవమ్మ కాసువారింటికి వెడుతూ వుండేది. అత్తమ్మకూడా అప్పుడప్పుడు గుంటూరులో వుండేది. మేనగోడలు వెళ్లిచూసేది. బుల్లిబావ బ్రహ్మానందం, శారదా నికేతనం వెళ్లి మరదల్ని చూసివచ్చేవాడు. ఇతను విజిటర్సుగదిలో కనబడగానే తోటిపిల్లలు వెళ్లి రాఘవమ్మతో అనేవారు. "ఏమోయ్, మీ ఆయిన వచ్చాడు" అని. చిన్నప్పట్నించీ అనుకున్నదే, అందరూ ఆశీర్వదించినదే. సంస్థాపకురాలు లక్ష్మీబాయమ్మగారుకూడా అనేది. బ్రహ్మానందం ఎప్పుడూ వట్టిచేతులతో వెళ్ళేవాడు కాదు. ఏ పళ్లో, ఫలాలో తీసుకెళ్లి మరదలు మాణిక్యానికి ఇచ్చేవాడు. అవిడ అవి తీసుకెళ్లి లక్ష్మీబాయమ్మకిచ్చేది. అవిడ కొద్దిగా వుంచుకొనితక్కినవి తిరిగి ఇచ్చేసేది. రాఘవమ్మ స్నేహితులికి పంచిపెట్టేది. అందుకని ఈ పెళ్లికొడుకు రాకకోసం హాస్టలు విద్యార్థినులు కనిపెట్టుకుని వుండేవారు.

ఇంతలో ఛాయమ్మకి జబ్బుచేసి గుంటూరు తీసుకువచ్చినారు. ఆవిడికి నెమ్మదించలేదు. రాఘవమ్మ అప్పుడు మేనత్త దగ్గిరే వున్నది. చివరికి తూబాడులో ఛాయమ్మపోయినది. అత్తగారు పోవడమేమిటి, రాఘవమ్మ చదువుకి స్వస్తిచెప్పడ మేమిటి, రెండూ ఒకేసారి జరిగినవి.

1938 మధ్యలో ప్రారంభించిన ఇల్లు 1940 ఫెబ్రువరిలో పూర్తి అయినది. 1940 మే 25 న చిరుమామిళ్లలో బ్రహ్మానందం రాఘవమ్మల వివాహం జరిగినది. పెళ్లి మూడురోజులు చేసినారు. చుట్టాలూ పక్కాలు, స్నేహితులూ. రెండువూళ్ల వారూ వచ్చినారు. అప్పుడు కరువులూ కంట్రోళ్ళూ లేవు. సమృద్ధిగా అన్నదానం జరిగినది. అంతా సంతోషించినారు.

ఆ శుభసమయంలో ఛాయమ్మ సంతానం పెళ్ళికొడుకుకాక ఇద్దరే వున్నారు. వెంగళరెడ్డి, మాణిక్యమ్మ. అందరికంటె ఈ సంబంధం అయినందుకు పరమా

నందం పొందినవాడు గాదె కోటిరెడ్డి. అన్నలిద్దరూ ఛాయమ్మని తల్చుకుని చాటుగా కంటతడిబెట్టినారు. ఆమాటకొస్తే ఆ సమయంలో ఛాయమ్మని తలుచుకోని వారు లేరు.

రాఘవమ్మకూడా అదృష్టజాతకురాలే.

జననం : శ్రీ చాంద్రమాన క్రోధననామ సంవత్సర మార్గశిర బహుళ త్రయోదశీ ఆదివారం విశాఖా నక్షత్ర ౨ చరణం. వృషభ లగ్నం.

ది : 13-12-1925.




జననకాల గురుమహాదశా శేషం

6 సంవత్సరాల, 9 మాసాల, 18 రోజులు.

# కారాగారం, శాసనసభ

ఈ లోకంలో ఒక వ్యక్తిగాని, వ్యక్తులుగాని సర్వస్వతంత్రులా అనే ప్రశ్న తోస్తుంది. ఆలోచించగా కారనిపిస్తుంది. తూబాడు, చిరుమామిళ్ల గ్రామ వాసులైన నూతన భార్యభర్తల జీవితానికి జర్మనీ, ఇటలీ, జపానుదేశాల దురహంకారానికి ఏమిటి సంబంధం? ఈ దేశాలకీ భారతదేశానికీ ఏమిటి సంబంధం? వారి దురాశాఫలితంగా చెలరేగిన రెండవ ప్రపంచ సంగ్రామానికీ భారత జాతీయ కాంగ్రెసుకీ ఏమిటి బంధుత్వం? ఈ అవినాభావ సంబంధంవల్ల పెళ్ళిఅయి ఎనిమిది నెలలు నిండకమునుపే, కొత్తపెళ్ళాంతో స్వగృహంలో కాపురం పెట్టక మునుపే బ్రహ్మానందం జైలుకి వెళ్ళినాడు. భగవంతుడిలాగే లోకంకూడా ఏకమేవా ద్వితీయం.

ఆనాటి ప్రపంచంలో అయిదు మహాశక్తులు పెరుగుతూ వొస్తున్నవి. ఆసియా యూరపు ఖండాల ఉత్తరభాగంలో వ్యాపించి, బాధితమానవజాతికి 'మరో ప్రపంచం' ప్రసాదించిన కమ్యూనిస్టు రష్యా; పసిఫిక్ మహాసముద్రంలో ఆసియా ఖండాన్ని ఆనుకుని బ్రిటనులాగే ద్వీపజీవితం గడుపుతూ, 1904 లో రష్యాని యుద్ధంలో వోడించి, ఆసియాఖండవాసుల కళ్ళుతెరిచిన జపాను సామ్రాజ్యం; పాత ప్రపంచానికి దూరంగా కొత్తప్రపంచంలో అట్లాంటిక్ పసిఫిక్ మహాసముద్రాల మధ్య వెలిసి నానాగోత్రైక్యమై పెట్టుబడి విధానానికి పట్టుగొమ్మై సిరిసంపదలతో తులతూగుతున్న ప్రజాప్రభుత్వం అమెరికా సంయుక్తరాష్ట్రాలు; యూరపులో, మొదటి ప్రపంచ సంగ్రామంలో పరాభవించబడి, ఆ అవమానం భరించలేక నియంతృత్వ సిద్ధాంతాలతో, తమ జాతీయ విజృంభణ సామ్రాజ్యవాదంగా చెలరేగిన జర్మనీ, ఇటలీ దేశాలు.

లోకంపోకడ త్వరగా మారిపోతున్న రోజులవి. సూర్యుడ స్తమించని బ్రిటిషుసామ్రాజ్యం, దానితోపాటు తులతూగిన ఫ్రెంచి సామ్రాజ్యం, వీరితో డీ అంటే డీ గా ప్రపంచవ్యాప్తమైన డచ్చిసామ్రాజ్యం, నూతన ప్రజాశక్తులతో, జాతీయ ఉద్యమంతో కడపటి పోరాటం సాగిస్తున్న రోజులవి. ప్రజాప్రభుత్వ సిద్ధాంతాలతో, తన ఆర్థిక విజృంభణకోసం అమెరికా, ఈ సామ్రాజ్యాలకి వ్యతిరేకంగా, తక్కిన జాతులతో సానుభూతి చూపించడం ప్రారంభించిన రోజులవి.

1933 లో హిట్లరు జర్మనీకి నియంతగా నిలిచి, ఆర్యజాతిని సంరక్షించాలని, యూదుల్ని చిత్రవధచేసి, నాజీతత్వాచార్యుడై లోకకంటకుడు కావడం ప్రారంభించినాడు. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం శాంతి సంస్థాపనకోసం రూపొందిన అంతర్జాతీయ సమితిలోంచి ఆ సంవత్సరమే జర్మనీ జపాను దేశాలు నిష్క్రమించినవి. ఆ మరుసటి సంవత్సరమే రష్యా సమితిలో సభ్యరాలుగా జేరినది. అప్పటికే రంగులుమారుతున్న సంగతి స్ఫురిస్తుంది. 1935 లో ముసోలినీ నాయకత్వంలో ఫాసిస్ట్ ఇటలీ ఆఫ్రికాలోవున్న అబిసీనియారాజ్యం కబళించగా అంతాచూసి వూరుకున్నారు. చివరికి చిలికి చిలికి గాలివాన అయినది. జర్మనీ యూరపుదేశాలమీద విరుచుకు పడినది. దేశం తర్వాత దేశం ఆక్రమించినది. ఆస్ట్రియా, పోలెండు, ఫ్రాన్సు ఒకటి తర్వాత ఒకటి హస్తగతం చేసుకున్నది. జర్మనీ ఇటలీ దేశాలు కలిసినవి. జపాను తూర్పున విజృంభించినది. అమెరికా, రష్యా, బ్రిటను ప్రభుత్వాలు ఏకమై యుద్ధం చేసినవి.

1939 సెప్టెంబరు 3 న బ్రిటను జర్మనీ మీద యుద్ధం ప్రకటించినది. బ్రిటిషు ప్రభుత్వం యుద్ధం ప్రకటించిదంటే, సామ్రాజ్యభాగమైన భారతదేశం కూడా యుద్ధంచేస్తున్నట్టే అన్నారు. ఇది కాంగ్రెసుకి అంగీకారంకాలేదు. గాంధీకి అంగీకారం కాలేదు. గాంధీకి బ్రిటనుమీద ద్వేషంలేదు. భారతదేశానికి స్వరాజ్య ప్రాప్తి కలిగితే స్వతంత్రభారతీయులు బ్రిటను తరఫున యుద్ధం చేస్తారన్నాడు. నాజీ, ఫాసిస్టు, జపాను అహంకారం తప్పన్నాడు. బ్రిటనుకి తన సానుభూతి వున్నదన్నాడు. బ్రిటిషుజాతి విజయం సాధించగలదన్నాడు. బ్రిటిషువారి కష్టం భారతీయుల అవకాశం కాదన్నాడు. శత్రువుల శత్రువులు తనకి మిత్రులనే వాదం గాంధీ ఎప్పుడూ సమర్థించలేదు. యుద్ధం జాతీయ ఉద్యమానికి వో సదవకాశంగా ఉపయోగించుకునే ప్రయత్నం గర్హించినాడు.

అప్పుడు బ్రిటిషు ప్రధాన మంత్రి పరమ సామ్రాజ్యతత్వాచార్యుడు, చర్చిల్. ఆయన పుట్టింది బెంగుళూరులో, కాని భారతజాతికి శత్రువు. సామ్రాజ్య విచ్ఛిన్న కార్యక్రమం ప్రారంభించడానికి తాను చక్రవర్తికి ప్రధానమంత్రి కాలేదన్నాడు. గాంధీతో వైస్రాయి కలవకూడదన్నాడు. అర్ధదిగంబరుడైన ఫకీరు గాంధీ,

వై స్రాయి భవనం మెట్లెక్కి సామ్రాజ్య చిహ్నమైన అధికార సింహద్వారం దాటుతున్న దృశ్యం తాను ఊహించలేనన్నాడు. భారత జాతీయోద్యమం అణగదొక్కాలన్నాడు.

దేశంలో కాంగ్రెసుకూడా అదోమాదిరిగా వున్నది. గాంధీ పటుత్వం తగ్గుతున్నదా అనిపిస్తున్నది. కాంగ్రెసు అధ్యక్షపదవికి అధికార అభ్యర్థి, డాక్టరు పట్టాభిని వ్యతిరేక అభ్యర్థి సుభాస్‌చంద్ర బోసు వోడించినాడు. రాష్ట్రాలలో పరిపాలన చేస్తున్న కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామా లిచ్చినవి. మద్రాసులో రాజాజీ మంత్రివర్గంకూడా తప్పుకున్నది. 1936 లోనే ముస్లింలీగు ఏకైక నాయకుడైన జిన్నా పాకిస్థాను ఇస్తే తప్ప వీలు లేదన్నాడు. దానికి వ్యతిరేకంగా కన్నయలాల్ మున్షీ అఖండ హిందూస్థాన్ ఉద్యమం లేవదీసినాడు.

ఈ పరిస్థితులలో గాంధీ సత్యాగ్రహానికి ఒక విశిష్ట స్వరూపం దర్శించినాడు. బ్రిటిషువారి యుద్ధప్రయత్నానికి భంగం కలగనియ్యడం నా అభిమతం కాదు. అస్వతంత్రులైన భారతీయుల ఇష్టంలేకుండా యుద్ధంలో వారిని ఇరికించడం న్యాయంకాదు. తత్కారణంగా ఈ యుద్ధంతో మాకేమీ ప్రమేయంలేదు. మా అభిప్రాయాలు ప్రకటించడానికి మేంప్రయత్నిస్తాం. ఆ ప్రయత్నమే వ్యక్తి సత్యాగ్రహం. ఒక వ్యక్తి, ఒకానొక చోటికి వెళ్ళి నలుగురూవున్నచోట ఈ అభిప్రాయాలు ప్రకటిస్తూ ఒక ఘోషణ చదువుతాడు. అంతే. వింటే వేళాకోళంగా వుంటుంది. ఆలోచిస్తే ఆంతర్యం బోధపడుతుంది. ఇందులో దౌర్జన్యంలేదు. మూకలు లేవు. లాఠీఛార్జీలూ, తుపాకికాల్పులూ వుండవు. కేవలం దౌర్జన్యంలేని శుద్ధ సత్యాగ్రహం. ఈ సత్యాగ్రహం ఎవరు చెయ్యాలి? మొదటి సత్యాగ్రహుల్ని గాంధీ స్వయంగా ఎన్నుకున్నాడు. 1940 అక్టోబరు 17వ తారీఖు, ప్రప్రథమ వ్యక్తి సత్యాగ్రహిపేరు గాంధీ ప్రకటించినాడు. ఆ పేరు ఇదివరలో చాలామంది వినలేదు. వినోబాభావే. క్రమేణా ఆయన గాంధీజీ ఆధ్యాత్మిక శిష్యుడై, సర్వోదయ నాయకుడై, భూదాన యజ్ఞాచార్యుడై, గ్రామదాన, శ్రమదాన, జీవనదాన ఉద్యమాలు స్థాపించి పరివ్రాజకుడై ప్రవచనాలు చేస్తున్నాడు. రెండవ సత్యాగ్రహి జవహరిలాల్ నెహ్రూ. ఎవరెవరో ఆనాటికే గాంధీకి తెలుసును. ఎవర్ని ఎత్తుకోవాలో, ఎవర్ని ఎత్తి కుదెయ్యాలో ఆయనకి తెలుసును. హంసలాగ పాలూనీళ్ళూ విడదియ్యగలడు. జవహరిలాల్, గాంధీ రాజకీయవారసుడైనాడు. గాంధీ ఆధ్యాత్మిక సాధనలో నెహ్రూకి నమ్మకంలేదు. సత్యాగ్రహం చెయ్యడానికిముందు బాపూదగ్గిర ఆశీర్వచనంపొంది శెలవు తీసుకునేందుకు సేవాగ్రామం వెళ్ళినాడు. అప్పుడు కస్తూర్బా అన్నది. "భగవంతుడు నిన్ను రక్షించుగాక"! నెహ్రూ అన్నాడు: "బా, భగవంతుడున్నాడా? వుంటే గాఢ నిద్రలో వుండివుండాలి". నెహ్రూ ఇంటికి

వెళ్ళకముందే అరెస్టు చేసినారు. దాంతో వ్యక్తి సత్యాగ్రహతోరణం ప్రారంభించినది. పుట్టలోంచి చీమలులాగ ఒకర్ని పట్టుకుంటే, వారివెనకాల మరొకరు గొలుసు కట్టులాగ, అంతులేని మనుషుల మందలాగ వ్యక్తి సత్యాగ్రహులు సిద్ధమైనారు. యావద్భారత దేశంలోనూ జాబితాలు తయారు చేసినారు. క్రమంగా వేనకువేలు సత్యాగ్రహులు జైళ్లు నింపినారు. గాంధీ మంత్ర ప్రభావం అప్పుడు గ్రహించినారు, ప్రజలూ, ప్రభుత్వమూకూడాను. ఆంధ్రదేశపు వ్యక్తి సత్యాగ్రహుల జాబితాలో కెక్కినది నరసారావుపేట న్యాయవాది, కాసు బ్రహ్మానందరెడ్డి పేరు. 1941 జనవరిలో ఇతనివంతు వచ్చినది.

అప్పటికి తూబాడు గ్రామమునసబీ అతనిపేరుమీదనే వున్నది. వేరే మనిషిని ఏర్పాటుచేసి చేయిస్తున్నారు. ఆదిలో పెద్దన్న మైనరుగా వుండగా అతని పేరుమీద పెట్టినారు. మైనారటీ వెళ్ళిన మూడు సంవత్సరాలలోగా ఆ ఉద్యోగంలో ప్రవేశించితీరాలి. చదువుకుంటున్న వెంకటరెడ్డి అల్లా ప్రవేశించలేదు. తత్కారణంగా అతని పేరు కొట్టివేసినారు. రెండోవాడు వెంగళరెడ్డికి అప్పటికే మైనారటీ వెళ్ళిపోయినది. అతనిపేరు రిజిస్టరు చెయ్యడానికి వీలులేదు. అందుకని మైనరుగావున్న బ్రహ్మానందం పేరు రిజిస్టరు చేసినారు. 1929 లో గ్రామమునసబు పరీక్షకి కూచుని, ప్యాసై, ఏడు రోజులు లాంఛనంగా ఆ ఉద్యోగం నిర్వహించినాడు బ్రహ్మానందం. అప్పట్నించీ తన పేరుమీదే ఆ ఉద్యోగం నడుస్తున్నది. జైలుకి వెడితే పోతుంది. ఈ వారసత్వపు నౌకరీ కుటుంబంలోంచి విడిచిపెట్ట కూడదని తల్లి పోయేముందు ఆనపెట్టినది. ఎందుకైనా మంచిదని రాజీనామా ఇచ్చినాడు. అది సర్కారు అనుమతించలేదు. బ్రహ్మానందరెడ్డిని బర్తరఫ్ చేసినారు. కుటుంబంలో ఈ వుద్యోగం వుండకూడదన్నారు. కాంగ్రెసు ప్రభుత్వం వచ్చినతర్వాత కాసువారికి మళ్ళీ ఆ వారసత్వం లభించినది. వెంగళరెడ్డి పెద్ద కుమారుడు, తాతపేరింటెగాడు, వెంకటకృష్ణారెడ్డి పేరుమీద వున్నది.

బ్రహ్మానందరెడ్డి సత్యాగ్రహం చెయ్యడానికి పక్కనేవున్నసామలూరుగ్రామం వెళ్ళి చెయ్యవలసిన ఘోషణ చేసినాడు. అరెస్టుచేసినారు. నాలుగునెలల కఠికశిక్ష, వందరూపాయలు జరిమానా విధించినారు. జరిమానాబదులు విధించిన నెలరోజుల ఖైదుకూడా అనుభవించినాడు. తిన్నగా రాజమంద్రీ సెంట్రలుజైలుకి తీసుకుపోయినారు. జైలునిండా సత్యాగ్రహులే. అంకినీడు, పోతిని గణపతిరావుపాత్రుడు, బుద్ధిరాజు రాజభూషణరావు వారిలో కొందరు.

అంతవరకు బ్రహ్మానందం హోటలులోకూడా భోజనం చెయ్యడానికి అలవాటు పడ్డవాడు కాడు. చదువుకునేరోజుల్లో వంటమనిషినిపెట్టి వండించుకుని సుష్టుగా భోజనం చేసినవాడు. నేతిపోపులికి అలవాటుపడ్డవాడు. గోదావరిజిల్లా మంచినూనెకి

ప్రసిద్ధి. ఆ ప్రాంతంలోవాడకం నూనెపోపులు. ఆనూనె రెడ్డికి పడలేదు. తలనొప్పి ప్రారంభించినది. ఒకనాడు భోజనానంతరం అకస్మాత్తుగా విపరీతమైన తలనొప్పి ప్రారంభించినది. జైలర్ని పిల్చి చెబితే ఇప్పుడు ఆసుపత్రి గంటలుకావు, మందు దొరకదు అన్నాడు. సత్యాగ్రహికి ఆగ్రహం వచ్చినది. అందులోనూ కొంచెం సత్యం లేకపోలేదు. ఆసుపత్రి గంటలు గమనించి తలనొప్పి వస్తుందా, రాగానే మందుకావాలిగాని అని ఘట్టిగా అన్నాడు. ఆ జైలరు మహమ్మదీయుడు, మంచి వాడు, సంతానవంతుడు సాధకబాధకాలు తెలిసినవాడు. ఏదోవిధంగా వైద్య సహాయం సమకూర్చినాడు. ఇద్దరికీ తలనొప్పి తగ్గినది. 1941 జులైలో విడుదల అయి ఇంటికి వచ్చినాడు. భార్య రాఘవమ్మ నరసారావుపేటలో గృహప్రవేశం చేసినది. బ్రహ్మానందరెడ్డి మళ్ళీ ప్లీడరీపనిలో తీరిక లేకుండా వున్నాడు. ఒక సంవత్సరం నడిచినది.

గాంధీ మిత్రమండలికి అనుకూలంగానేవుంది, స్వరాజ్యంకోసం దౌర్జన్యం లేకుండా శాంతిసమరం, సత్యాగ్రహం సాగిస్తున్న సమయంలో నేతాజీ సుభాస్చంద్రబోసు భారతదేశంలోంచి అంతర్ధానమై, జర్మనీవెళ్ళి అక్కడే అజాద్ హింద్ ఫౌజు ఏర్పాటు చేసినాడు. అప్పటికే జపాను యుద్ధంలో ప్రవేశించినది. 1942 వేసవికి జపాను సైన్యాలు తూర్పు ఆసియా ఆక్రమించుకుని ఇండియా పొలిమేర బర్మాలో ప్రవేశించినవి. బ్రిటిషు ప్రభుత్వం నీరసించి, భారతదేశాన్ని సంరక్షించుకునే స్థితిలో లేదు. జపాను ఇండియామీద పడవచ్చును. విశాఖపట్నం లోనూ, కాకినాడలోనూ మచ్చుకి రెండు బాంబులు విసిరినది. మద్రాసుకికూడా తాకిడీ వచ్చినది. జనం హడిలిపోయినారు; తీరంనించి పారిపోయినారు. గాంధీ దడిసి పోలేదు. చూదాం జపానుసేనలురానీ, ఎల్లా వస్తాయో! వాళ్ళతో ప్రజలు కలవొద్దు, వాళ్ళకి అన్నోదకాలు పుట్టకుండా పురుగుల్ని చూసినట్టు విడిచిపెట్టాలి అన్నాడు. అదేమిశోద్దెమో తపస్వి వాక్కు ఫలించినది. జపాను సేనలు ఇండియాలో అడుగు పెట్టలేదు. సరిహద్దులలోంచే తప్పుకున్నాయి.

1942 మధ్యంలో సర్ స్టాఫర్డ్క్రిప్సు బ్రిటిషు ప్రభుత్వం తరపుని రాయబారిగా వచ్చినాడు. చర్చిల్మూలంగా రాజీ కుదరలేదు. క్రిప్సు ప్రయత్నం, గాంధీ ప్రయత్నం విఫలమైపోయినవి. చివరికి విసిగి వేసారిపోయి, వేరే గత్యం తరం లేక గాంధీ 'క్విట్ ఇండియా' మంత్రం ప్రసాదించినాడు. బ్రిటను తక్షణమే ఇండియా విడిచిపెట్టి పోవాలనే మంత్రం అది. జులై 14 న కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గం గాంధీ నిర్ణయించిన కార్యక్రమం ఆమోదించినది. ఆగష్టు 8 న బొంబాయిలో సమావేశమైన ఆలిండియా కాంగ్రెసుకమిటీ "క్విట్ ఇండియా" మంత్ర సూత్రం అంగీకరించినది. ఆగష్టు 8 అర్ధరాత్రి గాంధీ కమిటీలో కార్యక్రమం మీద

మాట్లాడినాడు. తెల్లవారకముందు గాంధీతోసహా కాంగ్రెసు నాయకుల్ని ఎక్కడి వార్ని అక్కడే అరెస్టు చేసినారు. గాంధీపీఠం యావత్తూ పూనాలో ఆగాఖాన్ భవనంలో బంధించబడినది. వర్కింగు కమిటీ సభ్యులందర్నీ అహమ్మదు నగరం కోటలో బంధించినారు.

ఎప్పుడైతే నాయకులు కనబడకుండా పోయినారో ప్రజాదౌర్జన్యం కట్టలు తెంచుకున్నది. ప్రభుత్వ ఆఫీసు భవనాలు, పోలీసుస్టేషనులు పరశురామ ప్రీతి అయినవి. చెలరేగిన యువకులు టెలిగ్రాఫ్, టెలిఫోను తీగలు తెంచినారు. రైలు పట్టాలు పూడదీసినారు, రైళ్ళు ఆపినారు. బ్రిటిషు అధికార్లమీద చెయ్యి చేసుకున్నారు. కొన్నిచోట్ల స్వతంత్ర ప్రభుత్వాలు స్థాపించినారు. సోషలిస్టు నాయకులు జయప్రకాశనారాయణ, అచ్యుత్ పట్వర్ధన్ అరుణా అసఫ్అలీ వంటివారి నాయకత్వాన రహస్య విప్లవోద్యమం ప్రారంభం అయినది. బ్రిటిషు ప్రభుత్వం స్తంభించినట్టు తోచినది.

గుంటూరు జిల్లాలో ఈ ఉద్యమం ఆమంచర్ల గోపాలరావు చాలా ఉధృతంగా నడిపించినాడు. ఈ దౌర్జన్యకాండ ఆంధ్రదేశంలో మరీ మితిమీరిపోయినది. విశాఖ పట్టణం చెన్నపట్టణం మధ్య ఎన్నో రైలుస్టేషనులు దగ్ధమైనవి. దుండగీళ్ళు గూడ్సు రైళ్ళు పగలగొట్టి దోచుకున్నారు. దీనికి కొంచెం పూర్వరంగం వున్నది. అదే చరిత్ర ప్రసిద్ధి పొందిన 'ఆంధ్ర సర్క్యులర్'.

క్విట్ఇండియా ఉద్యమం ఏ కార్యక్రమం అనుసరించాలి అనే సమస్య జులై 14 న జరిగిన కాంగ్రెసు వర్కింగు కమిటీకి ముందే గాంధీ ఆలోచనలో వున్నది. పన్నులు కట్టకపోవడం, ప్రభుత్వంతో సహకరించక పోవడం మొదలైన పాత సహాయ నిరాకరణోద్యమ అంశాలు కాకుండా కొత్తవి ఏమైనా పెడదామా అని గాంధీ వర్ధాలో కొందరు నాయకులతో చర్చించినాడు. ప్రభుత్వాన్ని ఏవిధంగా స్థంభించేటట్టు చెయ్యాలీ అనే విషయం చర్చకి వచ్చినది. ఆధునికనాగరికత రవానాసౌకర్యాల మీద ఆధారపడి వున్నది. ఆ రవానా స్థంభిస్తే బ్రిటిషు ఇండియా ప్రభుత్వం స్థంభిస్తుంది అనే ఊహతోచినది. రవానాకి ముఖ్యం తంతివార్తలుకదా! టెలిగ్రాఫు. టెలిఫోనుతీగెలు తెంపితే, అవి ప్రాణం లేనివి కనక హింసకాదు అనే వాదన తోచినది. రైళ్లవిషయంకూడా చర్చ జరిగివుండవచ్చు. ఈ చర్చ అంతా రహస్యంగా జరిగినది. దీనికి ఎక్కడా రికార్డుగాని రుజువు గానిలేవు. ఇది దౌర్జన్య కాండకి గాంధీ అర్ధాంగీకారమని కొందరు అనుకునివుండవచ్చు.

అప్పుడు డాక్టరు పట్టాభి ఆంధ్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు. కళా వెంకట్రావు కార్యదర్శి. జులై 14 న వర్కింగు కమిటీ తర్వాత పట్టాభి తిన్నగా

స్వస్థలం బందరు వచ్చినాడు. జులై 28 న పన్నెండు ఆంధ్రజిల్లా కాంగ్రెసు అధ్యక్షుల్నీ, కార్యదర్శుల్నీ పిలిచి ఒక సభ చేసినాడు. ఆ సభలో ఉద్యమ కార్యక్రమంలో తంతులు తెంచడంకూడా ఒక అంశంగా పేర్కొన్నారు. ఈ కార్యక్రమం ఒక సర్క్యులర్‌గా తయారుచేసి రహస్యంగా కాంగ్రెసు సంఘాలకి పంపినారు. గాంధీకికూడా కాపీ పంపించినారు. ఓ కాపీ మద్రాసు ప్రభుత్వానికి దొరికినది. వారు అందులోవున్నవీ లేనివీ కలిపి ఆగస్టు 28 న ప్రకటించినారు. గాంధీ దౌర్జన్య కాండ అంగీకరించినాడని ఢిల్లీ శాసనసభలో సర్‌మహమ్మద్ ఉస్మాన్, బ్రిటిష్ పార్లమెంటులో ఇండియా కార్యదర్శి అమెరీ బదనామీ చేసినారు. గాంధీ తాను దౌర్జన్యం వొప్పుకోలేదని పదేపదే ప్రకటించినాడు.

ఆంధ్రదేశంలో నాయకులంతా ఏదో ఒక కార్యక్రమంలో జైలుకి వెళ్ళినారు. 1942 సెప్టెంబరు 12 న బ్రహ్మానందరెడ్డీ, బాపట్ల వకీలు, మల్లాది యజ్ఞనారాయణా కలిసి పల్నాడులో స్థానికంగా ఉద్యమం నడిపించాలనే ఉద్దేశ్యంతో నరసారావుపేటనించి మాచర్ల వెళ్ళినారు. పల్నాడులో కొల్లా సుబ్బారెడ్డి అనే కమ్యూనిస్టు నాయకుడితో ఏవో చర్చలు జరిపినారు. అప్పుడు కమ్యూనిస్టులు యుద్ధ ప్రయత్నంలో ప్రభుత్వంతో సహకరిస్తున్నారు. అడవి సత్యాగ్రహం విషయం చర్చలు జరిగినవి. కాని ఏమీ వొప్పందం సుబ్బారెడ్డితో కుదరలేదు. ఇతర నాయకుల్ని కలిసి, ఇద్దరూ రాత్రికి దాచేపల్లి వచ్చి అక్కడ కార్యకర్తలతో సంప్రదింపులు జరిపినారు. సెప్టెంబరు 13 ఉదయం నాయకులిద్దరూ నరసారావుపేట తిరిగి వస్తున్నారు. నెకరకల్లుదాటి ఒక మైలు ప్రయాణం జరిగినది. నరసారావుపేటకి 11 మైళ్ళ దూరంలో ఒక పోలీసు పార్టీ వీరిని ఆపి అరెస్టుచేసి తీసుకుపోయినది. పది పన్నెండు రోజులు నరసారావుపేట సబు జైలులోనే వుంచినారు. ఆ సాయంకాలమే కోలవెన్ను రామకోటేశ్వరరావుని కూడా అరెస్టుచేసి సబుజైలులో వీరితో పాటు వుంచినారు. తరవాత రాయవేలూరు జైలుకి తీసుకుపోయినారు.

వేలూరులో చాలామంది రాజకీయ ఖైదీలు, ఎక్కువగా ఆంధ్రులు వుండేవారు. ఉన్నవ లక్ష్మీనారాయణ, పప్పూరి రామాచారి, కాకాని వెంకటరత్నం, రామభద్రరాజు, ఒబేదుల్లా సాహెబ్, ఆర్ని శ్రీనివాసరావు. క్రొవ్విడి లింగరాజు, పిడతల రంగారెడ్డి వారిలో కొందరు. సంజీవరెడ్డికూడా కొన్నాళ్ళు వేలూరులో వున్నాడు. వీరంతాకలిసి వంటచేసుకునేవారు. కొన్నివందలమందికి టిఫిన్లతోసహా వంటలన్నీ చేయించి, వడ్డనవగైరా అన్నీ లింగరాజూ, శ్రీనివాసరావూ చూసేవారు. ఒక సంవత్సరం ఈ విధంగా వేలూరులో ప్రభుత్వ ఆతిధ్యం జరిగిన తర్వాత వీరిలో చాలామందిని స్పెషలు రైలులో తంజావూరు జైలుకి బదలాయించినారు. తంజావూరులో స్వామీసీతారాం, నేతి చలపతివంటి గుంటూరు నాయకులు

కూడా వుండేవారు. ఇక్కడ భోజనవసతి జిల్లాలవారీగా ఏర్పాటు చేసుకున్నారు. సీతారాం అపక్వాహారం పుచ్చుకునేవాడు. ఆయనతోపాటు తక్కినవారుకూడా అది సేవిస్తూవుండేవారు. ఖైదీలందరితరఫునా అధికార్లతో మాట్లాడడానికి దండు నారాయణరాజు నాయకుడు. ఆ నాయకుడి పేరు మేయర్ అంటారు. నారాయణ రాజు తర్వాత మేయరుగా బ్రహ్మానందరెడ్డిని ఎన్నుకున్నారు.

1944 డిసెంబరులో బ్రహ్మానందాన్ని పెరోలుమీద 15 రోజులు విడిచి పెట్టినారు. ఆపెరోలు మరో 15 రోజులు పొడిగించినారు. ఈ విడుపులో ఇంటికి వచ్చినాడు. బావగారు గాదెకోటిరెడ్డి అవసాన సమయంలో దగ్గిర వుండగలిగినాడు. కోటిరెడ్డి మరణంతో కాసువారికి ఒక పరమ ఆప్తబంధువూ, శ్రేయోభిలాషీ, సలహాదారూ వెళ్ళిపోయినాడు.

పెరోలుకాలం అయిపోయిన తర్వాత తిరిగి జైలుకి వెళ్ళడానికి బ్రహ్మానందం గుంటూరు వెళ్ళినాడు. అక్కడ రైలుస్టేషను దగ్గిర తెలిసినది, రాజకీయఖైదీలందర్నీ విడుదల చేసినారనీ, చేస్తున్నారనీ. అయినా మంచిదని వాకబుచేస్తే నిజమేనని తేలినది. తిరిగి జైలుకి వెళ్ళనక్ఖర్లేకపోయినది. వీరంతా జైలులోవున్న కాలంలో ప్రపంచపరిస్థితులూ, తత్కారణంగా ఇండియా పరిస్థితులూ మారిపోయినవి. చీకటిలో వెలుతురు గోచరించినది.

జర్మనీనించి నేతాజీ జపాను చేరుకున్నాడు. అజాద్‌హింద్ ప్రభుత్వం స్థాపించినాడు. ఈ ప్రభుత్వదళం అస్సాంలో మణిపూర్ ప్రవేశించి అక్కడ త్రివర్ణ జాతీయ పతాకం ఎగురవేసినారు. జర్మనీ, బర్మా, ఫిలిప్పీన్సు, కొరియా, ఇటలీ, చీనా, జపాను దేశాలు అజాద్ హింద్ ప్రభుత్వాన్ని గుర్తించినవి. ఈ ప్రభుత్వం ఒకరేడియోస్టేషనుకూడా నడిపినది.

అమెరికాలో రూజువెల్టు నాలుగోసారి అధ్యక్షపదవికి ఎన్నికైనాడు. ఆయనకి భారతజాతీయ ఆశయాలతో సానుభూతి. 1944 మే 6 న భార్యావియోగంలో వున్న గాంధీని విడుదల చేసినారు. జిన్నాతో సంప్రదింపులు, ఉత్తరప్రత్యుత్తరాలు ఫలించలేదు. కొత్తవైస్రాయి లార్డ్‌వేవెల్ అధికారంలోకి వచ్చినాడు. 1945 మే 7 న జర్మనీ పరాజయం పొందినది. ఈ పరిస్థితులలో జూన్–జులైలో వైస్రాయి సిమ్లాలో ఒక నాయకుల సమావేశం జరిపినాడు. కాంగ్రెసు లీగు నాయకుల్ని కలిపి ఒకజాతీయ ప్రభుత్వం ఏర్పాటు చెయ్యాలని ప్రయత్నం. జిన్నా తిక్క పట్టు మూలంగా సమావేశం భగ్నమైనది. 1945 ఆగస్టు 14 న జపానుకూడా మిత్ర మండలికి లొంగిపోయినది. ఆనెల 18 న సుభాస్‌చంద్రబోసు విమానప్రమాదంలో మరణించినాడు. అజాద్‌హింద్ ఫౌజు నాయకుల్ని ఢిల్లీ ఎఱ్ఱకోటలో విచారణకి పెట్టినారు.

ఈ లోపుగా జులైలో బ్రిటనులో పార్లమెంటుకి ఎన్నికలు జరిగినవి. మిత్ర మండలికి తన ధైర్యసాహసాలతో విజయంచేకూర్చిన చర్చిల్ పార్టీ వోడిపోయి నది. లేబరుపార్టీ అధికారంలోకి వచ్చినది. ఆట్లీ ప్రధానమంత్రి అయినాడు. లేబరు ప్రభుత్వం వెంటనే ఇండియాకి స్వరాజ్యం ఇస్తానని ప్రకటించినది. వేవెల్ని లండనుపిల్చినది. తిరిగిరాగానే వైస్రాయి ఒక ప్రకటనచేసినాడు. వెంటనే రాష్ట్రాలలో ప్రజాప్రభుత్వాలు కల్పిస్తాను; కేంద్రంలో కాంగ్రెసు-లీగు సభ్యులతో ఒక మంత్రివర్గం ఏర్పాటు చేస్తాను, ఫెడరలు విధానంలో రాజ్యాంగం తయారు చెయ్యడానికి పరిషత్తు ఎర్పాటు చేస్తాను అని. ముస్లింలీగు నాయకుడుగా జిన్నా పాకిస్థాన్ తప్ప ఏమీ అంగీకారం కాదన్నాడు. జాతీయ స్వాతంత్ర్యం సంగతి చర్చలలో వుండగా, కాంగ్రెసుకీ బ్రిటిషుప్రభుత్వానికీ రాజీకుదిరినది. రాష్ట్ర ప్రభుత్వాల సందర్భంలో అంగీకారం కుదిరి 1946 మార్చిలో రాష్ట్ర శాసనసభలకి ఎన్నికలు జరిగినవి. కాంగ్రెసు పోటీ చేసినది.

మద్రాసుశాసనసభకి నరసారావుపేట నియోజకవర్గం నించి కాంగ్రెసు అభ్యర్థిగా బ్రహ్మానందరెడ్డి ఎన్నికైనాడు. ప్రత్యర్థిగా కమ్యునిస్టుపార్టీ తరఫున పులుపుల శివయ్య నిలబడినాడు. అప్పటి కాంగ్రెసుకి ఎదురు లేదు. ఇతర ప్రాంతాలలో వలెనే గుంటూరు జిల్లాలోకూడా కాంగ్రెసుపార్టీ అఖండవిజయం సాధించినది. బ్రహ్మానందరెడ్డి గెలిచినాడు. తెనాలినించి కల్లూరి చంద్రమౌళి, గుంటూరునించి మేడూరి నాగేశ్వరరావు, ముస్లిం స్థానంలో సలాం, క్రైస్తవరిజర్వుడులో ఏరన్‌రావు, హరిజనుల తరఫున పుట్టా సుబ్బయ్య ఎన్నికైనారు. బాపట్లనించి మంతెన వెంకట్రాజు శాసనసభ్యుడైనాడు. ఆ ఎన్నికలలో రాయలసీమనించి వచ్చిన కొత్త సభ్యులలో నీలం సంజీవరెడ్డి ఒకడు.

మద్రాసురాష్ట్రంలో ఎవరు ముఖ్యమంత్రి కావాలి అనే సమస్య వచ్చినది. అధిష్ఠానవర్గం గాంధీతోసహా రాజాజీగాని పట్టాభిగాని ముఖ్యమంత్రి అయితే బాగుండునని ఆలోచించినది. శాసనసభ్యులలో ప్రకాశానికి బలం వున్నది. ఆ బలం చూసుకుని పైవారిని ధిక్కరించినాడు ప్రకాశం. ఆ ధిక్కార ప్రతిఫలం త్వరలోనే రుచిచూసినాడు. జరిగిన ఎన్నికలో ప్రకాశమే కాంగ్రెసుశాసనసభా నాయకుడుగా ఎన్నికైనాడు. ఒక సంవత్సరం పరిపాలన చేసినాడు. వి. వి. గిరి., కడప కోటిరెడ్డి, వేముల కూర్మయ్య తెలుగు మంత్రులు. తెన్నేటి విశ్వనాథం, వెన్నెలగంటి రాఘవయ్య, క్రొవ్విడి లింగరాజు పార్లమెంటరీ కార్యదర్శులుగా వుండేవారు. 1947 లో ప్రకాశం మంత్రివర్గం పడిపోయినది. ఒమ్మాందూరు రామస్వామిరెడ్డి ముఖ్యమంత్రి అయినాడు. ఆయన హయాంలో బెజవాడ గోపాలరెడ్డి, కళావెంకట్రావు, కల్లూరి చంద్రమౌళి, హలహర్వి సీతారామరెడ్డి మంత్రులుగా వుండేవారు. 1949 లో

పూసపాటి కుమారస్వామిరాజు మద్రాసు ముఖ్యమంత్రిగా ఎన్నికైనాడు. ఆయన కాలంలోనే నీలం సంజీవరెడ్డి మంత్రి అయినాడు. కుమారస్వామి మంత్రివర్గం 1952 ఎన్నికలదాకా నడిచినది.

మూడు మంత్రివర్గాలు మారినా శాసనసభ మాత్రం ఆరు సంవత్సరాలు నడిచినది. ఈ ఆరు సంవత్సరాలూ బ్రహ్మానందరెడ్డి శాసనసభ్యుడుగానే వున్నాడు. వుట్టి సభ్యుడుగా వుండడమేకాకుండా ప్రాముఖ్యంగా వుండేవాడు. కాంగ్రెసు శాసన సభాపార్టీ కార్యనిర్వాహక సభ్యుడైనాడు. శాసనసభనించి ఆంధ్ర విశ్వకళాపరిషత్తు సెనెటుకి సభ్యుడుగా ఎన్నుకోబడినాడు. ఎస్టిమేట్సు కమిటీ, పబ్లిక్ అకౌంట్సు కమిటీ, భూమి వ్యవహారాలకి సంబంధించిన కమిటీవంటిముఖ్య ఉపసంఘాలలో సభ్యుడుగా వున్నాడు. మంత్రివర్గంలో వున్నవారిపంక్తి తర్వాత శ్రేణిలో శాసన సభ్యుడిగా పరిగణించబడి రాష్ట్రవ్యవహర్తలలో ఒకడుగా రూపొందినాడు. అల్లూరి సత్యనారాయణరాజు, మంతెన వెంకట్రాజు, నివర్తి వెంకట సుబ్బయ్య మొదలైన వారితో సన్నిహితంగావుండి రాజకీయాలలో శ్రద్ధాసక్తులు ప్రదర్శించేవాడు. ఇన్నాళ్ళుగా ఒకజిల్లాలో నాయకుడుగావున్న బ్రహ్మానందం, శాసనసభ్యత్వంతో ఆంధ్ర రాష్ట్రనాయకులలో ఒకడుగా రూపొంది, ఈ వ్యక్తికి ఇంకా భవిష్యత్తువున్నదనే ఆశ కలిగించినాడు.

1948 నించీ రాజకీయాలలో శ్రద్ధ ఎక్కువై వకీలు ప్రాక్టీసు నిర్లక్ష్యం చేస్తూవచ్చినాడు. ఏవైనా పెద్దకేసులువస్తే పెద్దఫీజులు తీసుకుని అవిమాత్రం చేస్తూవుండేవాడు. ఇంతలో 1952 ఎన్నికలు వచ్చినవి. ఆ ఎన్నికలలో మొత్తం తెలుగుదేశంలో కాంగ్రెసు దెబ్బతిన్నది. కాంగ్రెసునాయకులు వ్యక్తి ద్వేషాలతో, దురభిమానాలతో చీలిపోయి కొత్తపార్టీలు స్థాపించినారు. ఈ వైవిధ్యంలో కమ్యూనిస్టులు కలిసివుండి చాలా స్థానాలు గెలుచుకున్నారు. వోడిపోయినవారిలో కాసు బ్రహ్మానందరెడ్డి, కాసు వెంగళరెడ్డి కూడా వున్నారు. బ్రహ్మానందం పల్నాడునించీ, వెంగళరెడ్డి నరసారావుపేటనించీ శాసనసభకి నిలిచినారు. బ్రహ్మానందరెడ్డికి ప్రత్యర్థిగా కమ్యూనిస్టు, కొల్లా సుబ్బారెడ్డి నిలిచినాడు. కమ్యూనిస్టే గెలిచినాడు. గుంటూరు జిల్లాలో తెనాలి తాలూకాలోతప్ప కాంగ్రెసు నాయకులు వోడిపోయినారు. రాయలసీమలో సంజీవరెడ్డి వోడి పోయినాడు. దీనికి కారణం కాంగ్రెసులో చీలికలే.

1946 మొదలు 51 వరకూ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడుగా ఆచార్య రంగా వున్నాడు. 1951 లో అధ్యక్షపదవికి మళ్ళీ ఎన్నికలు జరిగినవి. ఆ ఎన్నికలలో పాత నాయకత్వంమారి కొత్తనాయకత్వం సారధ్యం వహించినది. నీలం సంజీవరెడ్డి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడైనాడు. ఈ పదవికి పోటీ చెయ్య

దానికి సంజీవరెడ్డి మద్రాసు ప్రభుత్వంలో తన మంత్రిత్వానికి రాజీనామా ఇచ్చినాడు. గ్రూపులు అంత పట్టుదలగా తయారైనవి. ఆచార్యరంగా పరాజితుడైనాడు. ఈ పోటీకి వెనకాల వృద్ధనాయకులు ప్రకాశం పట్టాభి వైరుధ్యం వున్నది. ఈ ఎన్నికలతో ఆంధ్రలో నాయకత్వం మారినది. రాయలసీమ రాజకీయ పలుకుబడిలోకి వచ్చినది.

ఎప్పుడైతే ప్రకాశం పక్షం పరాజయం పొందినదో అప్పుడు వారంతా కాంగ్రెసులోంచి చీలిపోయి కిసాన్ మజ్దూరుపార్టీ (కె. ఎం. పి) స్థాపించినారు. రంగా మొదట్లో ఆ పార్టీలో సభ్యుడు. ప్రకాశం అండలో తనకి భవిష్యత్తులేదని వేరే ఇంకోపార్టీ తన నాయకత్వంకింద స్థాపించినాడు. దానిపేరు కృషికర్‌లోక్ పార్టీ. (కె. ఎల్. పి) ఆ విధంగా కాంగ్రెసు నాయకులు మూడు పార్టీలుగా చీలిపోయి ఛిన్నాభిన్నం అయిపోయినారు. ఈ ముప్పేటచీలికలతోటే 1952 ఎన్నికలికి ఎవరికివారుగా నిలిచినారు. ఐకమత్యంతోవున్న కమ్యూనిస్టులు విడిపోయిన పాత నాయకుల్ని పరాభవించగలిగినారు. ఈ నీరస పరిస్థితులలోనే ఆంధ్రరాష్ట్ర అవతరణ జరిగినది. ఆంధ్రరాష్ట్రం సంగీతానికి చింతకాయలా రాలలేదు. ఒక శతాబ్దం ఆంధ్ర సంస్కృతీ వికాసం, అభ్యుదయం కలిగిన తర్వాత, జాతీయ సమరంలో ఆంధ్ర వీరులు అసమాన త్యాగాలు చేసిన తర్వాత, అరశతాబ్దంపాటు జాతీయ ఉద్యమంతో సరిసమానంగా ఆంధ్రోద్యమం కూడా నడిపిన తర్వాత, అమరజీవి శ్రీరాములు ప్రాణత్యాగం తర్వాత లభించినది.



# ఆంధ్ర పర్వం

ఆంధ్రాభ్యుదయం

రాష్ట్రోద్యమ పూర్వరంగం

రాష్ట్రోద్యమం

ఆంధ్ర మహాసభలు

శ్రీబాగ్ ఒడంబడిక

పట్టాభి ప్రయత్నం

పొట్టి శ్రీరాములు

రాష్ట్రావతరణ

మంత్రివర్గ నిర్మాణం

# ఆంధ్రాభ్యుదయం

ఆంధ్రోద్యమం సంపూర్ణమైన దృక్పథం కలది.

ఆదినించీ సాహిత్య, కళా, సాంఘిక, ఆర్థిక, రాజకీయ వికాసంకోసం సమానప్రయత్నం అన్ని రంగాలలోనూ జరుగుతూనే వచ్చినది. భారతదేశంలో కలిగిన ప్రతి ప్రజాఉద్యమానికీ తెలుగుదేశంలో ప్రతిధ్వని వినిపిస్తూనే వున్నది. ప్రగతి కనిపిస్తూనే వున్నది. పంథొమ్మిదివందలముప్ఫైలలో మైసూరు విశ్వవిద్యాలయం స్నాతకోపన్యాసంలో సర్ సి. పి. రామిస్వామి అయ్యరు ఆంధ్రప్రాంతపు అగ్రగామితనం కొనియాడినాడు. భారతీయ అభ్యుదయ స్రవంతికి మూడు పాయలన్నాడు. ఒకటి వంగ, రెండు మహారాష్ట్ర, మూడు ఆంధ్ర అన్నాడు. అది త్రివేణి.

ఉత్తరాన వంగదేశంనించీ, పశ్చిమాన మహారాష్ట్రంనించీకూడా తెలుగుదేశం అభివృద్ధిమార్గాలు తెలుసుకున్నది. ఈ మార్గాలు తెలుసుకున్న విజ్ఞానులే నాయకులైనారు. ఆయా సందేశాలు ఆంధ్రులికి అన్వయించి అమలు జరిపినారు.

మొదట సాహిత్య సంగీతకళా వికాసం పూసపాటిగజపతుల పోషణలో విజయనగరంలో కలిగి విశాఖపట్టణందాకా విస్తరించినది. సంస్కృతాంధ్రభాషా పోషణ, సంగీతనాట్య కళాపోషణచేసి ఆంధ్రభోజుడనిపించుకున్నవాడు ఆనంద గజపతి. ఆ ప్రభావంలోంచి ప్రభవించినవారే గురజాడ వెంకట అప్పారావు, రావు సాహెబు, కళాప్రపూర్ణ గిడుగు వెంకటరామమూర్తిపంతులు. భాష ప్రజలికి అర్థమయేటట్టు మలిపించిన యోధులు వారిద్దరే. 1886 లో విశాఖపట్టణంలో సరస్వతీ గ్రంథాలయస్థాపన జరగడంకూడా విజయనగరప్రభావమే. ఆంధ్రలో అదే ఆది గ్రంథాలయం. ఈ ప్రగతికి గజపతుల కాశీనివాసం కారణం.

సాంఘికసంస్కారమూ, వాటితోపాటు నవ్యసాహిత్యమూ అవతరించినది కాకినాడ, రాజమహేంద్రవరాలలో. ఈ ఉద్యమం వెనకాలకూడా ఒక మహారాజు వున్నాడు; పిఠాపురంమహరాజు, రావుమహీపతిసూర్యారావు. తెలుగులలో తొలి పురుషుడు, ప్రవక్త, సంఘసంస్కారోద్యమనాయకుడు, ఆధునికసాహిత్యనిర్మాత రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగంపంతులు ఈ ఉద్యమనాయకుడు. సర్ రఘుపతి వెంకటరత్నంనాయుడు ఆచార్యుడు. కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీ నరసింహం పంతులు ప్రచారకవి. ఉద్యమానికి రాజకీయవాసన తగిలించినవాడు. ప్రజల్ని మేలుకొలిపినవాడు.

రాజకీయంగా గుంటూరు బందరు నగరాలు దారి చూపినవి. దేశభక్త కొండ వెంకటప్పయ్య, డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్య అవిభక్తకృష్ణాజిల్లావాసులే, కృష్ణాజిల్లాసభానాయకులే, కృష్ణాపత్రికస్థాపించివాడు వెంకటప్పయ్య. ఒకరు గుంటూరులోనూ, ఇంకొకరు బందరులోనూ స్థిరపడినారు. జాతీయోద్యమంతో సరి సమానంగా ఆంధ్రరాష్ట్రోద్యమంకూడా నడిపిన నవ్యసాచులు. ఆర్థికాభ్యుదయానికి ఇతోధింగా రెండు బ్యాంకులు, రెండు భీమాకంపెనీలూ స్థాపించినవాడు పట్టాభి.

ఉమ్మడిరాజధానిగావున్న మద్రాసు ప్రభావం తక్కువగాదు. 1908 లో బొంబాయిలో జన్మించి, 1914 లో మద్రాసు చేరిన ఆంధ్రపత్రికా, సంస్థాపకుడు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు సర్వతోముఖమైన ఆంధ్రోద్యమాన్నిపోషించి, ప్రచారంచేసి, రూపురేఖలు కల్పించడానికి కారణం. మనకి నాటకాలిచ్చి, మనతెలివితక్కువవల్ల మనకి కాకుండాపోయిన బళ్లారికూడా ఆంధ్రాభ్యుదయానికి మార్గంచూబించినది. ధర్మవరం కృష్ణమాచారి, కోలచెలమశ్రీనివాసరావు, తాడిపత్రి రాఘవాచారి బళ్లారిప్రముఖులే.

ఇన్నిచోట్ల ఇన్నిజరిగినా సంపూర్ణవిశాలాంధ్ర స్వరూపదర్శనం కలిగినదీ, అరశతాబ్దితర్వాత అవతరించినదీ భాగ్యనగరమైన హైద్రాబాదులోనే. ఆ మంగళ స్వరూపం దర్శించిన మహర్షి కొమర్రాజు వెంకటలక్ష్మణరావు పంతులు. ఆయన నాగపురంలో చదువుకుని మహారాష్ట్ర భాషాపాండిత్యమేకాక, వారికార్యదీక్షకూడా అలవర్చుకున్నాడు. కలకత్తాలో ఎం. ఏ. పరీక్షలో కృతార్థుడై, వంగదేశీయుల ఆర్ద్రకళా హృదయం, ఉద్రేకభావం గమనించినాడు. మద్రాసులో నివాసంచేసి తమిళుల మేధాశక్తి రంగరించి తనలో ఇముడ్చుకున్నాడు. ఈ త్రివేణీసంగమంతో అఖిలాంధ్రవిజ్ఞానవికాసానికి పునాదులు నిర్మించినాడు.

అజ్ఞానాంధకారంతో లక్ష్మణరావు చేసిన నిరంతర యుద్ధంలో ఆయుధాలు నాలుగు; గ్రంథం, గ్రంథాలయం, చరిత్రపరిశోధన, భాషా ప్రచారం. వీటి సమష్టి

సంపత్తి విజ్ఞానం. చీకటిగావున్నచోటే దీపం అవసరం. ఆ చీకటి దట్టంగావున్న ఆంధ్రదేశభాగం నిజాం పరిపాలనలోవున్న తెలంగాణా. అందుచేత లక్ష్మణరావు తన సాధనకి హైద్రాబాదు ప్రథమ కార్యస్థానంగా ఎన్నుకున్నాడు. ఈ కృషిలో ఆయనకి సహాయంచేసి, చేదోడువాదోడుగా వున్నవారు చాలామంది. ముఖ్యులు, మునగాలరాజా నాయని వెంకటరంగారావు; సంపన్నుడూ, సంస్కారీ రావిచెట్టు రంగారావు; ఆర్యసమాజ ఆచార్యుడు ఆదిపూడి సోమనాధరావు. వీరి సహాయంతో ఒక చిన్నగది నాలుగున్నర రూపాయలకు అద్దెకు తీసుకుని గ్రంథాలయం ఒక స్థాపించినాడు. దానిపేరు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయం. అది క్రీస్తుశకం 1900 సంవత్సరం.

పోతన్న దున్నిన భూమిలో, కాకతీయులు పరిపాలించిన సీమలో, కృష్ణ దాటి, తుంగభద్రదాటి, తుళువ వంశీయుడైన కృష్ణరాయల పేరు ఎందుకు అరువు తెచ్చుకున్నారనిపిస్తుంది. వారిఊహ అది కాదు; అది సంపూర్ణాంధ్రము. తెలుగు దేశం పరిపాలించి, తెలుగుభాష పోషించి, అష్టదిగ్గజాల్ని ఆరాధించి, తెలుగు కవితకి పెళ్ళిపందిళ్లు కప్పించి, తెలుగుకవిని తన పక్కని ఏనుగెక్కించుకుని, అతని వామనూపురానికి తనచేతులతో గండపెండేరం తొడిగి, తానుగా తెలుగు ప్రబంధరచనచేసి, "తెలుగదేలయటన్న, దేశంబుతెలుగు, ఏనుతెలుగువల్లభుండ, యెరుగవే బాసాడి, యెల్లనృపులుగొలువ దేశభాషలందు తెలుగులెస్స" అని ఉద్ఘాటించి తెలుగుసరస్వతినీ, తెలుగుజాతినీ దక్షిణాపథ సింహపీఠంమీద ఆసీనం చేసిన ఆ మహరాజు పేరు పెట్టడంలో దూరదృష్టి లేదనగలమా? అదే ఆలోచనతో వరంగల్లులో నాలుగు సంవత్సరాలతర్వాత స్థాపించిన గ్రంథాలయంపేరు రాజరాజ నరేంద్రగ్రంథాలయం. ఈ నామకరణాలలో తెలంగాణ మేధావుల హృదయ వైశాల్యం, నిఖిలాంధ్రదేశదర్శన ప్రభావం గోచరిస్తాయి.

ఈ విధంగా ప్రారంభించిన గ్రంథాలయోద్యమం పదకొండేళ్ళు నిండక పూర్వమే మేరువంత పెద్దదై దేశమంతా పాకినది. సర్కారు జిల్లాల్లో, రాయల సీమలో, తెలంగాణంలో గ్రామగ్రామానికీ పాకి వేలాది గ్రంథాలయాలుగా వృద్ధి పొందినది. 1911 లో ప్రథమ గ్రంథాలయ మహాసభ జరిగినది. అధ్యక్షుడు చిలకమర్తి లక్ష్మీనరసింహం. తెలుగుదేశం అన్నిమూలలనించీ, తెలంగాణాతో సహా, 200 మంది ప్రతినిధులు సభకి హాజరైనారు. అధ్యక్షపీఠంనించి చిలకమర్తి కవి విజ్ఞాన ఉపషనిత్తు సూత్రాలు ప్రవచనం చేసినాడు:

1) ప్రతి మానవుడికీ, గాలివలె, జ్ఞానం అందుబాటులో వుండాలి;
2) జ్ఞానం మంచినీటివలె నిష్కల్మషంగా వుండాలి;
3) సూర్యరశ్మివలె జ్ఞానం అందరికీ ఉత్తేజం కలిగించాలి.

ఈ కాంతులు దేశవ్యాప్తంచేసి, జ్ఞానబిక్ష అందరికీ పెట్టినవారు అయ్యంకి వెంకటరమణయ్య, సూరి వెంకటనరసింహశాస్త్రి, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, పాతూరి నాగభూషణం. ఆంధ్రదేశ గ్రంథాలయసంఘ ప్రథమ అధ్యక్షుడు దివాన్ బహద్దూర్ మోచర్ల రామచంద్రరావు.

ఈ గ్రంథాలయోద్యమం ఏడాది పండుగచేసుకుంటూ ఆంధ్ర వికాసానికి తోడ్పడినది. యావత్తు భారతదేశానికీ ఆదర్శప్రాయమై ముందంజవేసినది. ఈ ఉద్యమానికి రాజకీయ నాయకులూ, మేధావులూ, రచయితలూ అండదండలుగా నిలిచినారు. రాజారామారాయణం, పోలవరం రాజా కొచ్చెర్లకోట రామ వెంకట కృష్ణారావు, జయపురం రాజా విక్రమదేవవర్మ, భూపతిరాజు వెంకటపతిరాజు భూపతిరాజు సీతారామరాజు, సర్ అన్నెం పరశురామపాత్రో, సామీ వెంకటాచలం చెట్టి, గద్దె రంగయ్యనాయుడు, కాశీనాధుని నాగేశ్వరరావు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, వేమవరపు రామదాసు, సురవరం ప్రతాపరెడ్డి, చెన్నప్రగడ భానుమూర్తి, శివశంకర స్వామి, డాక్టరు బుర్రా శేషగిరిరావు, జనమంచి శేషాద్రిశర్మ, వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రి, బెల్లంకొండ రాఘవరావు, చట్టి నరసింహరావు, పురాణం సూరిశాస్త్రి, శరణు రామస్వామిచౌదరి వంటి విజ్ఞానులు ఈ విజ్ఞాన పల్యంకి తమ భుజాలమీద మోసి ఊరేగించినారు. ఈ ఉద్యమమే అన్నిరంగాలలోనూ ఆంధ్రాభ్యుదయానికి మార్గం చూపించినది.

ఆలయాలుకట్టి వూరుకోలేదు లక్ష్మణరావు. వీటికి ఆహారంకూడా సృష్టించినాడు. ఆ క్షేత్రమే విజ్ఞాన చంద్రికాగ్రంథమండలి. బరంపురం మొదలు బళ్లారి వరకూ, భాగ్యనగరం మొదలు బందరువరకూవున్న మేథావుల్ని కలుసుకుని వారిచేత అన్నిశాస్త్రాలలోనూ గ్రంథాలు వ్రాయించినాడు; తాను వ్రాసినాడు. నవలల పోటీలు పెట్టి ఉత్తమ నవలా రచనకి దోహదం చేసినాడు. ఈ గ్రంథరచనలో తోడ్పడినవారు వీరేశలింగం, హరి సర్వోత్తమరావు, రామలింగారెడ్డి, కాశేశ్వర రావు, చిలుకూరి వీరభద్రరావు, ఆచంట లక్ష్మీపతి. ఆదిరాజు వీరభద్రరావు, మంత్రి ప్రగడ సాంబశివరావు ఇంకా ఎందరో. ఈ విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి సంస్థాపనకూడా హైద్రాబాదులోనే 1905 లో జరిగినది. మునగాలరాజా, రావిచెట్టు రంగారావు, కాశేశ్వరరావు, హరి సర్వోత్తమరావు మండలి సంస్థాపకులలో కొందరు. కార్యకర్త ఆదిరాజు వీరభద్రరావు. మల్లంపల్లి సోమశేఖరశర్మ, రాయప్రోలు సుబ్బారావు లక్ష్మణరావు శిష్యులే.

చరిత్ర పరిశోధన ప్రారంభించి ఆంధ్రుల ఒకనాటి ఔన్నత్యం ప్రజానీకానికి ప్రకటించినాడు. తత్ఫలితమే చరిత్రచతురానన చిలుకూరి వీరభద్రరావుగారి 'ఆంధ్రులచరిత్ర'. హనుమంతుడికి తన ప్రభావం తెలిసేది కాదుట. ఎవరో చెప్పాలి. అల్లాగే ఆంధ్రులూనూ. ఆంధ్రులశక్తి, చరిత్ర ప్రజలకు బోధించినది 'ఆంధ్రుల

చరిత్ర'. ఇంతవారమూ అనుకున్నారు. ప్రతిష్ఠానంనించి పాటలీపుత్రం ఏలిన సంగతి తెలుసుకున్నారు. అజంతా, సాంచీ, అమరావతి, లేపాక్షి శిల్పచిత్రకళా సంపత్తి తమదని తెలుసుకున్నారు. స్వస్వరూపజ్ఞానం పొంది, ఆత్మసాక్షాత్కారం సాధించినారు.

ఇంతేకాక భాషాప్రచారంకోసం పరీక్షలు పెట్టించి విజ్ఞానపరిషత్తు నడిపినాడు లక్ష్మణరావు. ఆ పరిషదధ్యక్షుడు వీరేశలింగం. ఉపాధ్యక్షుడు వావిలికొలను సుబ్బారావు. ఆంధ్రదేశం మూడు చెరగుల్నించీ మనుష్యుల్ని పోగుజేసి, హైద్రాబాదు కేంద్రంగా ప్రారంభించిన ఈ విజ్ఞాన ఉద్యమం ఆంధ్రులకళ్ళు తెరిచినది. ఒకనాడు కలిసివుండి, చరిత్ర వొడుదుడుకులలో విడిపోయినారనీ, తిరిగి కలిసిపోవాలనీ ఒక భావతీవ్రత తెలుగువారిలో కల్పించినది. సర్కారు, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలకు విజ్ఞాన స్థంభాలతో సేతువు నిర్మించినది ఈ ఉద్యమం. ఈ విజ్ఞాన చంద్రికలు హైద్రాబాదునించే యావదాంధ్రంలోనూ ప్రసరించినవి. ఆంధ్రాభ్యుదయానికి దారి చూపినవి. 1908 లో బందరులో జరిగిన రాజకీయేతర ఆంధ్ర మహాసభకి దోహదం చేసినవి. ఆ సంవత్సరంలోనే బొంబాయిలో ఆంధ్రపత్రిక ప్రారంభంఅయినది. గుంటూరులో జొన్నవిత్తుల గురునాథం అదే పేరుతో ఒక పత్రిక ప్రారంభించినాడు. 'ఆంధ్ర'శబ్దం చలామణీలోకి వచ్చినది. ఆంధ్రత్వం వెలిసినది; వెల్లివిరిసినది. నెల్లూరులో ఆంధ్రమహాసభ సమావేశం అయేసరికి రాష్ట్ర కవితాలక్ష్మి సాక్షాత్కరించినది. ఆంధ్రజాతీయ కవిత్వాచార్యుడు రాయప్రోలు సుబ్బారావు. ఆ కవిభూషణుడి గీతి ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నెల్లూరిసభలో అనన్య మాధురీరీతిలో, సభవారి హృదయాలు ఉప్పొంగి ఆనంద బాష్పాలుగా స్రవించేటట్టు పదేపదే పఠనం చేసినాడు :

అమరావతీపట్టణమున బౌద్ధులు విశ్వ
  విద్యాలయములు స్థాపించునాడు.
ఓరుగల్లున రాజవీరలాంఛనముగా
  బలు శస్త్రశాలలు నిలుపునాడు.
విద్యానగర రాజవీథులఁ గవితకు
  పెండ్లిపందిళ్లు కప్పించునాడు.
పొట్నూరికి సమీపమున నాంధ్రసామ్రాజ్య
  దిగ్జయస్థంభ మెత్తించునాడు.
ఆంధ్రసంతతి కే మహితాభిమాన
దివ్యదీక్షాస్ఫూర్తి తీవరించె
నామహావేశ మర్థించి యాంధ్రులార
చల్లు డాంధ్రలోకమున నక్షతలు నేడు,

కృష్ణాతరంగపంక్తిన్ ద్రొక్కి తుళ్లింత
నాంధ్రనౌకలు నాట్యమాడునాడు.
ఇంటింట దేశసాహిత్యదీపములతో
నాంధ్రతేజస్సు రాపాడునాడు,
సుకుమార శిల్పవస్తు ప్రపంచమునందు
నాంధ్రనైపుణి పంతమాడునాడు.
సమరసేనావ్యూహ జయపతాకలక్రింద
నాంధ్రపౌరుషము చెండాడునాడు,

చూచి సంతోషమున తలలూచి గర్వ
మూచి ఆంధ్రపుత్రీ పుత్రులందగలరు
శాంతి, నందాకలేదు విశ్రాంతి మనకు
కంకణవిసర్జనలకిది కాలమగునె !!

అది చతుష్షష్టికళలతో విరాజిల్లిన తెలుగుతల్లి సమగ్రస్వరూప దర్శనం చేసిన ఋషివాక్కు. ఆధునికాంధ్రజాతి కాదికవితాప్రబోధం.



# రాష్ట్రోద్యమ పూర్వరంగం

రాజకీయాలలో ఎప్పుడూ గుంటూరుదే ముందంజ. జాతీయోద్యమంలో అగ్ర తాంబూలం అందుకున్నది. ఆంధ్రరాష్ట్రఉద్యమానికి పుట్టినిల్లుగానిలిచినది. రెండు ఉద్యమాలకీకూడా తొలినాయకుడు దేశభక్త కొండ వెంకటప్పయ్య, గుంటూరువాసి.

బ్రిటిషుఅధికార్ల ప్రోత్సాహంతో, ప్రోద్బలంతో మొదటికాంగ్రెసుమహాసభ 1885, డిసెంబరు 28 వ తారీఖున, బొంబాయిలో, అపరాహ్ణవేళ, గోకుల్దాసు తేజపాలు సంస్కృతకళాశాలాభవనంలో సమావేశమైనది. భారతదేశం నలుమూలల నించీ డెబ్బైఇద్దరు ప్రతినిధులు హాజరైనారు. వారిలో ఆంధ్రుడైన పి. రంగయ్య నాయుడు వున్నాడు. రెండవసమావేశానికి వెళ్ళినవారిలో గుంటూరువాసి శెనగపల్లి రామస్వామిగుప్త వున్నాడు. ఆయనే ఆంధ్రజాతీయోద్యమానికి మూలపురుషుడు. 1894 లో ప్రథమకృష్ణాజిల్లారాజకీయమహాసభ గుంటూరులో ఏర్పాటుచేసినవాడు గుప్త. అప్పటికి భారతదేశంలో ఎక్కడా జిల్లారాజకీయసభలులేవు. ఆంధ్రదేశంలో రాజకీయచైతన్యానికి జిల్లాసభలే ఆధారం. 1917 వరకూ ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కమిటీఅనేది లేదు. అంతాఉమ్మడిమద్రాసురాష్ట్రకాంగ్రెసు కమిటీలో భాగమే. ప్రత్యేక రాష్ట్రకాంగ్రెసుకమిటీ ఏర్పాటు కావడానికి కూడా గుంటూరుప్రయత్నమే కారణం.

జాతీయకాంగ్రెసులో ఆరోజుల్లో ఎవరన్నా చేరవచ్చు. ప్రభుత్వోద్యోగులు కూడా చేరవచ్చు. మద్రాసులో వుండే తెలుగులాయర్లూ, ముఫసిల్ ప్లీడర్లూకూడా కాంగ్రెసు సభ్యులుగా చేరేవారు. ఏడోకాంగ్రెసుమహాసభకి అధ్యక్షతవహించినవాడు, మద్రాసు న్యాయవాది, పనప్పాకం ఆనందాచార్యులు. రాజమహేంద్రవరం వకీలు

న్యాపతి సుబ్బారావు మొదటినుంచీరాజకీయాల్లోవున్నవాడు, ఆంధ్రభీష్ముడన్న పేరు తెచ్చుకున్నవాడు. హిందూ పత్రిక స్థాపించిన నలుగురుమూలపురుషులలో ఒకడు. ఆయన కలకత్తా కేంద్రశాసనసభలోనూ, మద్రాసుశాసనసభలోనూకూడా సభ్యుడు. ఆరు సంవత్సరాలు ఆసభ్యత్వంలో అపారదేశసేవ చేసినవాడు. 1898 లో మద్రాసులో జరిగిన కాంగ్రెసు మహాసభకి ఆహ్వానసంఘాధ్యక్షుడు. 1914 లో కాంగ్రెసు జనరలుసెక్రటరీగా ఎన్నుకోబడి 1917 కలకత్తాకాంగ్రెసువరకూ ఆ పని శక్తి సామర్థ్యాలతో నిర్వహించినవాడు. సుబ్బారావు సహచరుడూ, కాంగ్రెసు సంయుక్త కార్యదర్శి అయినవాడు, గుత్తినివాసి, దివాన్ బహద్దూర్ కేశవపిళ్ల. ఈయనకూడా సుబ్బారావుతోపాటు తనకార్యదర్శిపదవి కలకత్తా కాంగ్రెసు సమయాన విడిచి పెట్టినాడు.

ఆ రోజుల్లో అఖిలభారతకాంగ్రెసుకమిటీ సభ్యులుగా వుంటూవచ్చిన ఆంధ్రులలో ముఖ్యులు సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, బయ్యా నరసింహేశ్వరశర్మ. బందరువాసి లింగరాజు సుబ్బారాయుడుకూడా కాంగ్రెసు నాయకులలో పేరెన్నిక గన్నవాడు.

సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడు, సర్ అన్నెం పరశురామపాత్రో మొదట కాంగ్రెసువాదులు. తరవాత జస్టిసుపార్టీలో చేరినారు. మోచర్ల లిబరుపార్టీ నాయకుడై నాడు. ఇదంతా గాంధీయుగానికి పూర్వం. 1895 లో గంజాం వెంకటరత్నం ప్రయత్నంవల్ల కాకినాడలో గోదావరిజిల్లా రాజకీయమహాసభ జరిగినది. ఈ జిల్లా సభల ఆశయం. దేశపరిస్థితులూ ఆ సభలో చక్కగా, చాకచక్యంగా వర్ణించినాడు చిలకమర్తి లక్ష్మీనరసింహం :

దీప్తిమంతంబైన దీపంబుతోడ గ్రీ
　　నీడ యొక్కింత గన్పించునట్లు
కమ్మకమ్మనితావి గుమ్మున వెదజల్లు
　　నల గులాబికి ముండు లలమినట్లు
సర్వజనానంద సంధానకరుడైన
　　చందమామకు గందు జెందునట్లు
జీవనాధారమై చెలగు చల్లనివాన
　　బెడిదంపు పిడుగుల నలరినట్లు

ఉత్తమంబగునట్టి యీ హూణరాజ్య
మందు గనిపించు లోపంబు లరసిజూడ
తన్నివారణార్థముగాదె ధన్యులార
గౌతమీమండలసభ సంకల్పమయ్యె.

పాలింపబడువారి బాలించువారల
        నూటిగల్పెడు సంధిసూత్రమనగ
ప్రభువులపాల గన్పడు లోపముల జూ
        పదగిన నిలువుటద్దంబనంగ
మాయశాసనముల న్మతస్వంబులను బొంచి
        యెలయించిపెట్టెడు వలయనంగ
బ్రాభవమ్మునుదాల్చి ప్రార్థించుటకు మూర్తి
        వంతమౌ వర రాజభక్తియనగ

బ్రజలకెల్లను కన్నులపండువగుచు
జగతి దేశీయసభ కొక్కశాఖయగుచు
బ్రబలురగువారల ప్రయత్నఫలమునగుచు
వరలు నిమ్మహాసభ ఖ్యాతిమీర.

పన్నుగట్టుటయందు బ్రభువులౌ హూణుల
        కేనాటికైనను దృప్తిలేదు.
ఉద్యోగములుచేయు నున్మత్తులకు గార్య
        నిర్వహణమందు నియతిలేదు.
బహుపరీక్షలదేలి ప్రజ్ఞాఢ్యులగు మీకు
        రవ్వంతయేని ధైర్యంబులేదు.
తెలుగు తెలియంగ దొరలకు దెలివిలేదు
దీనదశబాపగలయట్టి దిక్కులేదు
కటకటా ! ఎట్టులున్నదో కాపులదశ
సుగుణధనులార జనులార చూడరయ్య.

అధికారభూతంబు లడుగు లంచములిచ్చి
        పరిపరివిధములౌ పన్నులిచ్చి
మునసబు కరణాల ముడుపులన్నియు నిచ్చి
        కోసి నూర్చినవారి కూలినిచ్చి
కచ్చేరిబంట్రోతుగముల కీనామిచ్చి
        పాలేళ్ళకును గొంతపంటనిచ్చి
యజమానునకు బంట నర్ధభాగంబిచ్చి
        పైకమిచ్చినవాని వడ్డినిచ్చి

గడ్డిమాత్రమె మిగిలించు కాపువాడు
సేద్యమున దాను పశులు బక్షించుకొరకు
కటాకటా యెట్టులున్నదో కాపులదశ
సుగుణధనులార జనులార చూడరయ్య !

ఇటువంటివి పధ్నాలుగు పద్యాలు చదివినాడు మహాకవి. అవి అందరూ పాడడం నేర్చుకున్నారు. ప్రతి హరిదాసుడూ కథచెబుతూ, దేశపరిస్థితి ప్రజానీకానికి తెలియజెప్పడానికి, ఈ పద్యాలన్నీ ఏకరువుపెట్టేవాడు. నిరక్షరకుక్షి గాళ్ళకికూడా తెలిసేది. ఇప్పుడుకూడా అవి పనికొస్తాయేమో !

1904 లో బెంగాలు విభజన జరిగినది. వందేమాతరం ఉద్యమం చెలరేగినది. జాతీయనాయకుడుగా, బ్రహ్మసమాజ ఆచార్యుడుగా ఆంధ్రదేశంలో ప్రచారానికి వచ్చినాడు బాబూ బీపిన్‌చంద్రపాలు. ఆయన ఆనాటి ముగ్గురు జాతీయ నాయకులలో ఒకడు. బాల్, పాల్, లాల్ అనేవారు. బాల్ అనగా బాలగంగాధర తిలక్; పాల్ బీపిన్ చంద్రపాల్; లాల్ లాలా లజపతిరాయ్. పాల్ రాజమహేంద్ర వరంలో ఒక మహాసభలో ఉపన్యాసం చేసినాడు. ఆ సభలో చిలకమర్తి పద్య రత్నాలు పఠించినాడు. అందులో ఒకటి దేశవ్యాప్తంగా ప్రతినోటా పలికినది :

భరతఖండబు చక్కనిపాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి.

ఆ కాలంలో గోడలమీద నినాదాలు వ్రాయడంలేదు. అయినా విజయవాడ వద్ద కృష్ణానది బ్రిడ్జీమీద తారుతో ఈ పద్యం వ్రాయబడివుండడం చాలామంది చూస్తూ వుండేవారు. ఈ పద్యంకూడా హరిదాసులు మూలమూలల్లో మారుమోగించేవారు.

ఈ దీనస్థితికి ఉపాయంచెప్పినాడు చెన్నాప్రగడ భానుమూర్తి. భానుమూర్తి బందరులో ఉపాధ్యాయవృత్తిచేసి, మద్రాసుప్రభుత్వంలో ద్విభాషిగా పనిచేసినాడు. అఖండగోదావరిలో జలసమాధి పొందినాడు. ఆయన చెప్పిన ఉపాయం :

దురుసుదనమున తీరదీ గడుసుదనము
గాన తాపులు పోటులు కార్యమనక
లేగలన్నిటి నేకమౌలా గొనర్చి
నేర్పుతో తల్లి యెగజేప నేరవలయు

మహాత్ముడు రంగంలో ప్రత్యక్షం కాకముందే సహాయనిరాకరణ ఉద్యమం ఊహించిన ఆంధ్రదేశం ప్రజాఉద్యమానికి పదునై సిద్ధంగా వున్నది. అది అరవై య్యేళ్ళనాటి కీలక సంవత్సరం. క్రీస్తుశకం 1908. తెలుగువారి చరిత్రలో ఈ సంవత్సరం ప్రాముఖ్యం ఇదివరకే తెలుసుకున్నాం. ఇప్పుడు మళ్ళీ తెలుసుకుంటున్నాం.

# రాష్ట్రోద్యమం

న్యాపతి నారాయణరావు గుంటూరులో ప్లీడరు. ఆయిన ఉత్సాహవంతుడు. ఊహాలపుట్ట. ఆంధ్రులికివుండే ఉద్రేకం సహజం. 1911 ఆఖరి రోజులలో. సాయంకాలం సబుకోర్టులో పనిచూసుకుని, చీకాకుగా, చరచరా నడుస్తున్నాడు. తిన్నగా పాత రహధారీబంగాళా పక్కనివున్న యువజన సాహితీసంఘం భవనం వేపు వెడుతున్నాడు. హైద్రాబాదులో లక్ష్మణరావు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం స్థాపించిన సంవత్సరంలోనే ఈ గుంటూరు సంఘంకూడా వెలిసినది. అది యువకులూ, మేధావులూ, తమ వినోదంకోసమేకాక విజ్ఞానంకోసంకూడా ఏర్పాటు చేసుకున్న సంఘం. అప్పటికే వేపచెట్టుకింద అరుగుమీద గాలికోసం కూచుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటుంన్నారు కొందరు సభ్యులు. వారిలో విష్ణుభొట్ల సూర్య నారాయణ ఒకడు.

నారాయణరావు వారిని సమీపించి, కూచోకుండానే, "ప్రత్యేకాంధ్ర రాష్ట్రం అవసరం" అన్నాడు. స్నేహితులంతా నవ్వుకున్నారు. వీడికి ఇదేమిట్రా అకస్మాత్తుగా పిచ్చెక్కింది అనుకున్నారు. 'కూచో ముందు' అన్నారు. నారాయణరావు కూచున్నాడు. "రాష్ట్రంకావలిసిందే, మనం ఏదన్నా చేసితీరాలి" అన్నాడు. అంతా తెల్లబోయినారు. ఇంకా తెల్లబోయేవారేగాని వారికి కొంత నేపథ్యం తెలుసు, కొంత తెలియకపోయినా. ఆ విషయాలు సంఘంలో చర్చకి వస్తూనే వున్నవి.

1911 సంవత్సరంలో వంగదేశంలో పుట్టిన భారత జాతీయోద్యమం ఒక విధంగా ప్రథమ విజయం సాధించినది. 1904 లో వంగరాష్ట్రం విభజించినాడు కర్జన్. వందేమాతరం ఉద్యమం చెలరేగినది; 'స్వదేశీ', 'స్వరాజ్యం' నినాదాలు దేశమంతా పాకినవి. ససేమిరా, విభజన విభజనే నన్నారు బ్రిటిషువారు. విభజనకి

వ్యతిరేకంగా వంగదేశంలో బయలుదేరిన భాషా జాతీయ అభిమానం భారత జాతీయ ఉద్యమరూపం దాల్చినది. ఆంధ్రదేశం 'వందేమాతరం' అన్నది. కర్జన్ పోయి నాడు, హార్డింజ్ వైస్రాయిగా వచ్చినాడు. దేశపరిస్థితి పరిశీలించినాడు. బ్రిటిషు ఇండియాలో పరిపాలనా విభాగాలు అవకతవకగా వుండడం గమనించినాడు. ఈస్టిండియా కంపెనీవారికి ఎక్కడదొరికిన భూభాగం, అక్కడ దగ్గిరగావున్న కోట పరిపాలనలో చేర్చినారు. ఈ విధంగా ఇండియా పటం రూపురేఖలులేని, తీరు తెన్నులులేని అతుకులమారి బొంతలాగ, వియ్యపరాలి రవికెలాగ తయారైనది. బెంగాలు, బీహారు, అస్సాం కలిపి ఒకపెద్ద రాష్ట్రం. దీని పరిపాలన అంతా కలకత్తానించి. కొంత తెలుగుదేశం, తమిళదేశం, కాస్త కర్నాటకం, కించిత్తు కేరళ కలిపి మద్రాసురాష్ట్రం. మహారాష్ట్ర, గుజరాతు, కన్నడ భాగాలు కలిపి బొంబాయి రాష్ట్రం. ఇదంతా కప్పలతక్కెడగా వున్నదనుకున్నాడు. లండనులో బ్రిటిషు ప్రభుత్వానికి తన అభిప్రాయాలు తెలియజేసినాడు. ఈ అభిప్రాయాలు లేఖల రూపంలో పంపించినాడు. అవి పత్రికలలో ప్రకటించినారు. అందరికీ తెలిసినది. హార్డింజ్ కొన్ని సిద్ధాంతాలు చేసినాడు :

1. రాష్ట్రాలు పరిపాలనాసౌలభ్యం కలిగి వుండాలి;
2. ఆర్థికసౌష్ఠవంవుండి స్వయంపోషకంగా వుండాలి;
3. పై రెండూ అనుకూలంగా వున్నప్పుడు ఒకే భాష, ఒకే సంస్కృతి వున్న ప్రజల్నందర్నీ ఒక రాష్ట్రంలో వుండేటట్టు ఏర్పాటు చెయ్యడం న్యాయం, ధర్మం.

ఇదే సందర్భంలో ఒకపెద్ద రాష్ట్రంలో అస్సాం, బీహారు ప్రజల్ని తమ కంటె ఎక్కువ సాంస్కృతిక స్థాయి కలిగిన బెంగాలీలతో కలియగట్టి పడెయ్యడం వల్ల వీరికి ఉద్యోగాలలో, ఆర్థికాభివృద్ధిలో చాలా నష్టాలు కలుగుతున్నవి; ఈ అసంతృప్తి మంచిదికాదనికూడా హార్డింజ్ బ్రిటిషు ప్రభుత్వానికి తెలియ జేసినాడు.

ఈ సూత్రాల్ని అనుసరించి, జార్జిచక్రవర్తి ఢిల్లీ దర్బారులో వంగదేశ విభజన రద్దుచేసినాడు. అస్సాం, బీహారు ప్రాంతాలు వేరేరాష్ట్రాలుగా ప్రకటించి నాడు. ఈ నిర్ణయం భారతజాతీయతకి గొప్పవిజయం.

అదే పరిస్థితులలో వున్నది తెలుగుదేశం అప్పుడు. పదకొండు జిల్లాలికిపైన మద్రాసు రాష్ట్రంలోనూ, తొమ్మిది జిల్లాలు నిజాం రాజ్యంలోనూ, ఒక జిల్లా మైసూరు రాజ్యంలోనూ, బస్తర్ అనే సంస్థానభాగం విడిగానూ, సిరివంచ తాలూకా మధ్యప్రదేశంలోనూ మూడుముక్కలూ, ఆరుచెక్కలుగా చెల్లాచెదరై వున్నది. ఇవన్నీ ఏకీకరణం చెయ్యాలనే రాజకీయభావం అప్పుడు కలలోకూడాలేదు. కాని ఇవన్నీ ఒక భాషా ప్రాంతం అనే ఆపేక్ష, అభిమానం మాత్రం వుండేవి.

మద్రాసురాష్ట్రంలో తమిళులు అధికసంఖ్యాకులు. తరవాత తెలుగులు, మలయాళీవారు, కర్నాటకులు. విద్యాసౌకర్యాలు తమిళప్రాంతంలో ఎక్కువ. వాటిని వారు సద్వినియోగం చేసుకున్నారు. అన్ని ప్రభుత్వరంగాలలోనూ ఉద్యోగాలు సాధించినారు. ఒక్క స్వరాష్ట్రంలోనేకాక, యావద్భారతదేశంలోనూ ముందు ప్రవేశించిన బంగాలీలతర్వాత వీరే స్థానాలు సాధించినారు. ఆంధ్రప్రాంతంలో ఇంజనీర్లు, డాక్టర్లు, ఉపాధ్యాయులు, ఆఫీసర్లు, గుమాస్తాలు అంతా అరవవారే. పైగా ఆర్థికవనరులన్నీ తమిళప్రాంతంలో వృద్ధిలోకి వస్తూవుండేవి. దృష్టాంతానికి కావేరిమీద తొమ్మిదిరోడ్డువంతెనలు వుంటే కృష్ణాగోదావరినదులమీద మొన్న మొన్నటిదాకా ఒక్కరోడ్డువంతెనకూడాలేదు. కావేరిలోంచి ఒక్కనీటిచుక్క సముద్రుడికి దక్కడంలేదు. గోదావరినీరు ఆరుశాతంకూడా ఉపయోగంలోవుండేది కాదు.

ఈ పరిస్థితులలో హార్డింజిసిద్ధాంతాలూ, వంగదేశం పునర్వ్యవస్థీకరణ, బీహారు, అస్సాం, రాష్ట్రనిర్మాణం, ఆలోచనగల తెలుగువారికి ఆశాజనకంగా గోచరించినవి. మేధావులు చేరినచోట వాదోపవాదాలు జరుగుతూవుండేవి. అటువంటి ఆలోచనాపరులూ, మేధావులూవున్న సంఘం గుంటూరు యువజనసాహితీసంఘం. భాషారాష్ట్రసిద్ధాంతం వారికి నచ్చినది.

1911 లోనే బ్రిటిషువారు ఈ సిద్ధాంతం మరోరూపంలోకూడా అమలులో పెట్టినారు. అది తెలుగుభాషకి సంబంధించినది. రాష్ట్రమేకాదు జిల్లాలుకూడా భాషాబాహుళ్యసిద్ధాంతంమీద ఏర్పడాలి అన్నట్టు కొత్తగా చిత్తూరుజిల్లా నిర్మాణం చేసినారు. మైసూరులో కొంతభాగం, చెంగల్పట్టుజిల్లాలో కొంతభాగం, కడపజిల్లాలో కొంతభాగం కలిపి చిత్తూరుజిల్లా ఏర్పాటు చేసినారు. ఇది నాటినించినేటివరకూ తెలుగుజిల్లాగానే వుండిపోయినది. ఇవన్నీకలిసి సాహితీసంఘంవార్ని ఉత్తేజపరిచినవి.

న్యాపతినారాయణరావు ఆవేళే అంతతీవ్రంగా ఆంధ్రరాష్ట్రంకావాలీ అని అరవడానికి కారణం ఏమిటి? చాలాచిన్నది. గుంటూరులో కుంభకోణంనించి వచ్చిన ఒక అయ్యరు సబుజడ్జీగా వున్నాడు. ఆయన ఆఫీసులో చిన్న అటెండర్ పని ఖాళీ వచ్చినది. అర్హులైన ఆంధ్రులుకూడా దరఖాస్తులు పెట్టుకున్నారు. అయినా ఆసబుజడ్జి కుంభకోణంనించి తనబంధువైన ఒక కుర్రవాణ్ణి పిలిపించి ఆ ఉద్యోగం ఇప్పించినాడు. నారాయణరావుకి వొళ్లుమండినది. ప్రత్యేకాంధ్రరాష్ట్రోద్యమానికి అంకురార్పణ చేసినాడు. మొదటి కేకవేసినాడు, నినాదం ఘోషణ చేసినాడు, పత్రికలలో వ్రాసినాడు.

స్నేహితులు ఆలోచించినారు. బేరీజువేసినారు. మొత్తం గుంటూరుజిల్లాలో గెజెటెడు ఆఫీసర్లంతా అరవవారే. పాఠశాలల్లో ఉపాధ్యాయులు వారే. వెనక్కి

వెళ్ళిచూస్తే గుంటూరులో మొదటి మునిసిపల్ ఛైర్మన్ సింగారివేలుమొదలియార్. ఇది ఆంధ్రుల అశక్తికీ, అజ్ఞానానికీ, తమిళుల శక్తిసామర్థ్యాలకీ, చాతుర్యానికీ దృష్టాంతం కావచ్చును. అయినా ముందుగా గుంటూరు మేలుకున్నది. తెలుగు దేశానికి మేలుకొలుపులు పాడినది.

1912 మే నెలలో కృష్ణా-గుంటూరు జిల్లాల రాజకీయ మహాసభ నిడదవోలులో జరిగినది. అప్పటికి పశ్చిమగోదావరిజిల్లా లేదు. కొవ్వూరునించి బెజవాడ వరకూ కృష్ణాజిల్లాయే. ఆ సభ అక్కడికి ఆహ్వానించినవాడు, కొవ్వూరు చంద్రారెడ్డి ఈయన సంపన్నుడు, భాషాపోషకుడు, దేశభక్తుడు. ఈ రెండు జిల్లాలవార్నేకాక గోదావరిజిల్లా నాయకుల్నికూడా ఆహ్వానించినాడు. ఆ మహాసభలో ఉన్నవ లక్ష్మీనారాయణ మొదలైన గుంటూరు యువకులు 'ప్రత్యేకాంధ్ర రాష్ట్రము-అనగా ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోవున్న పదకొండు తెలుగుజిల్లాలూకలిపి—ఏర్పాటు చెయ్యాలని ఒకతీర్మానం ప్రతిపాదించినారు. హేమాహేమీలందరూ విస్తుపోయినారు. న్యాపతి సుబ్బారావు, కూర్మా వెంకటరెడ్డి నాయుడు, వల్లూరి సూర్యనారాయణ రావు వంటి నాయకులు ఇదేమి విడ్డూరం అన్నారు. చిలకమర్తి లక్ష్మీనరసింహం కావలిసిందేనన్నాడు "ఇదిజిల్లాసభ, రాష్ట్రసభకాదు" అన్నారు పెద్దలు. రాష్ట్ర తీర్మానం అప్రస్తుతం అన్నారు. పైగా తీర్మానం సకాలంలో ప్రతిపాదించలేదు, వొప్పుకోడానికి వీలులేదు అన్నారు. చిన్నవాళ్ళనోళ్లు తాత్కాలికంగా మూయించినారు.

పెద్దలంతా భోజనాలకిముందు నిడదవోలు మడుగు, అంటే గోదావరికాలవలో, స్నానాలు చేస్తున్నారు. జలాభావంకలిగిన గుంటూరు ప్రతినిధులికి ఆ స్నానసుఖం స్వర్గతుల్యంగా వున్నది. కొండ వెంకటప్పయ్య స్నానం చేస్తూవుంటే గుంటూరు యువకులు చుట్టూచేరి కష్టంసుఖం మాట్లాడుతున్నారు. చట్టి నరసింహారావు అన్నాడు. "జిల్లాసభలు ఎల్లాగూ చేస్తున్నాం, అన్నిజిల్లాలూకలిపి, ఒక ఆంధ్ర మహాసభ ఎందుకుచెయ్యకూడదు" అన్నాడు. 1908 లో బందరులో జరిగిన రాజకీయేతర ఆంధ్ర మహాజనసభతప్ప పెద్దసభలు జరగలేదు. నిడదవోలు సభలు పూర్తికాగానే ఎవరిఇళ్ళకివాళ్ళు వెళ్ళిపోయినారు. గుంటూరు యువకులుమాత్రం రాష్ట్రసమస్య మర్చిపోలేదు. రాష్ట్రం ఎల్లావున్నా, ముందుగా కాకలుతీరిన పెద్దవారికి నచ్చచెప్పవలసిన అవసరం గోచరించినది. ముందు గుమ్మందాటాలిగదా వీధులోపడ్డానికి. గుంటూరులో వింజమూరి భావనాచార్యులు విజ్ఞాని, ఉత్సాహవంతుడు. కొన్నాళ్ళు మునిసిపల్ చైర్మన్ కూడా చేసినాడు. ప్రతి ప్రగతి ఉద్యమానికీ ఆయన ముందువుండేవాడు. భావనాచార్లు ఇంట్లో సమావేశమైనారు యువకులు. ఉన్నవ లక్ష్మీనారాయణ, చల్లా శేషగిరిరావు, జొన్నవిత్తుల గురునాథం మొదలైనవారు అక్కడ సమావేశమైనారు. తమ ఉద్యమం నడపడానికి పెద్దలు

కావాలిగదా అని, కూడబలుకుక్కొని, కొండ వెంకటప్పయ్యకి కబురు పెట్టినారు. ఆయన వెళ్ళినాడు. జరిగినవిషయం, వెంకటప్పయ్య స్వీయచరిత్రలో ఈ విధంగా చెప్పినాడు.

"ఆనాడు జరిగిన సంభాషణలో ఆంధ్ర జిల్లాలను చెన్నపురిరాష్ట్రంనుండి విడదీసి, ప్రత్యేకరాష్ట్రముగా నిర్మాణము చేయవలసినదనియు, రాష్ట్రాంగములైన హైకోర్టు, రెవెన్యూబోర్డు మొదలగునవన్నియు ప్రత్యేకముగ నేర్పడవలెననియు, అందుకు తగిన ఆందోళన సాగించవలెననియు ప్రస్తావించి నన్ను ఆ విషయమైన భారమును వహించవలసినదని కోరిరి. కాని నాకు వారి సంభాషణ ఆవేశపూరితమై, అత్యాశలతో గూడినదిగా గన్పట్టెను. అంతటి మహత్కార్యము దుస్సాధ్యముగ గాన్పించెను. అందని మ్రానిపండ్ల కర్రలు సాచినట్లేయని తలచితిని. కాని వారితో బొత్తుగ నేకీభవించనని మాత్రము చెప్పజాలకపోతిని. అంతటి యుత్సాహముతో నున్న వారి మనస్సులను మరల్చుట సాధ్యముకాదని తోచెను. ఈ యుద్యమము పలువురకు వెర్రి ప్రయత్నముగ తోచును. ఇప్పటికది ఎట్లున్నను ఏనాటికైన సాధించ దగినదని నాకు స్పష్టముగనేయుండెను. కావున వారితో నేనిట్లు పల్కితిని. "ఈ యుద్యమము భగీరథ ప్రయత్నమువంటిది. వినినవారికి వెర్రిగా కన్పించక మానదు. మనలో ప్రముఖులైన వారికి మిక్కిలి అయిష్టము కల్పించవచ్చును. అందరిని కూడదీసికొనినగాని ఉద్యమము బలముగసాగి ఫలింపజాలదు. ముందుగనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకై ప్రయత్నించి పలువురను బెదరగొట్టక ఆంధ్రులు, దేహబుద్ధి, విద్యాపాటవమును, ఆర్థికబలమును, నైతికబలమును పెంపుచేసుకొని, సర్వతోముఖమగు అభివృద్ధి పొందుటకు వలయు మార్గములను నిర్ణయించుట అవసరముగాన ఆంధ్రమహాసభను స్థాపించి, ఏటేట మహాసభలు ముఖ్యస్థానములలో జరుపుట యుక్తమని అందులకు వలయు ప్రచారము సాగించవలయుననియు నా అభిప్రాయము."

"వారిలో తీవ్రవాదులు కొందరు కొంతవడి భిన్నాభిప్రాయములు వెలిబుచ్చి వ్యతిరేకవాదన సాగించిరి. కాని, తుదకు నేను సూచించిన మార్గమే యుక్తమని నిర్ణయించుకొంటిమి. అంతట 'ఆంధ్రోద్యమము' అను పేరుతో చిన్న పొత్తమును తెలుగునను, ఇంగ్లీషునను గూడ నేను వ్రాసి సిద్ధము చేసితిని. ఈ ప్రయత్నమున జొన్నవిత్తుల గురునాథముగారు తోడయ్యేను".

ఉన్నవ లక్ష్మీనారాయణ బారిష్టరు, సంఘ సంస్కారి. 'మాలపల్లి' అనే విప్లవాత్మకమైన సాంఘిక నవల రచయిత. చల్లా శేషగిరిరావు, వకీలు. తర్వాత ఆంధ్రపత్రిక సహాయ సంపాదకుడు. జొన్నవిత్తుల గురునాథం ప్రజాసేవకుడు. వీరంతా ఆంధ్రోద్యమ మూలపురుషులు. వీరికి తోడుగా దేవగుప్తాపు శేషాచలపతి రావు 'దేశాభిమాని' అనే తన పత్రికలో ప్రచారం ప్రారంభించినాడు.

ఆంధ్రోద్యమ ఆశయాలేమిటి ? 1. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం, 2. ప్రత్యేక ఆంధ్ర విశ్వవిద్యాలయం. 3 ఆంధ్రోద్యమ ప్రచారానికి ఒక ఇంగ్లీషు దినపత్రిక.

బొంబాయినించి, 'ఆంధ్ర' పత్రిక, బందరునించి కృష్ణాపత్రిక ఈఉద్యమాన్ని బలపర్చినవి. పాట్నానించి, సచ్చిదానందసిన్హా సంపాదకత్వం కింద వున్న 'హిందూస్థాన్ రివ్యూ', కలకత్తానించి వెలువడే 'మాడరన్ రివ్యూ', మద్రాసునించి వెలువడే 'ఇండియన్ పేట్రియట్', లండనునించి వచ్చే 'రివ్యూఆఫ్‌రివ్యూస్' మొదలైన పత్రికలు వెంటనే ఈ ఉద్యమాన్ని బలపర్చి ప్రోత్సహించినవి. "హిందూ" పత్రిక వ్యతిరేకించినది. న్యాపతి సుబ్బారావు వ్యతిరేకమైనాడు కాని, డాక్టరు పట్టాభి ఆయన వ్రాసిన సంగతులు సహేతుకంగా ఖండించి సుబ్బారావుని రాష్ట్రానికి సుముఖుడుగా మార్చినాడు. విరివిగా ప్రచారం సాగినది. ఆంధ్రోద్యమానికి అంకురార్పణ జరిగినది.



# ఆంధ్ర మహాసభలు

భారతజాతీయస్వాతంత్ర్యానికి జాతీయకాంగ్రెసు లాగ, భారతదేశాంగంలోనే, తన యింటివిషయాలు తాను చూసుకునేందుకు ఆంధ్రరాష్ట్రకోసం ఆంధ్ర మహాసభ మనుగడలోకి వచ్చినది. 1913లో గుంటూరుజిల్లా రాజకీయ మహాసభ బాపట్లలో జరుగనున్నది. ఆసమయంలోనే, అదే ప్రదేశంలో ప్రథమ ఆంధ్రమహాసభ జరపడానికి నిర్ణయం జరిగినది కొండ వెంకటప్పయ్య ఆహ్వాన సంఘాధ్యక్షుడుగా ఎన్నికైనాడు.

మహాసభ ఏర్పాట్లన్నీ శ్రద్ధగా చూసినవారు బాపట్లనాయ్యవాదులు. గొల్లపూడి సీతారామశాస్త్రి, దోరగుడి దాశరథి, వెలగపూడి సుబ్బారావు. సభాధ్యక్షులుగా మద్రాసు న్యాయవాది, బయ్యా నరసింహేశ్వరశర్మని ఎన్నుకున్నారు. శర్మ, కాంగ్రెసునాయకులలో అగ్రగణ్యుడు మహాసభ మే నెలలో జరిగినది. ఎంతో ఉత్సాహంతో జరిగినది. న్యాపతి సుబ్బారావు. మోచెర్ల రామచంద్రరావు, గుత్తి కేశవపిళ్ల, ముట్నూరి ఆదినారాయణయ్య. వేమవరపు రామదాసు. భోగరాజు పట్టాభి సీతారామయ్య, చిలకమర్తి లక్ష్మీనరసింహం. ముట్నూరి కృష్ణారావు. ఉన్నవ లక్ష్మీనారాయణ. అయ్యదేవర కాళేశ్వరరావు వంటివారు సభకి హాజరైనారు. మొత్తం 800 మంది ప్రతినిధులు.

యావజ్జీవమూ మహాసభలలో శాసనసభలలో ఆంధ్ర రాష్ట్ర తీర్మానాలు ప్రతిపాదించే కర్తవ్యం పూనిన వేమవరపు రామదాసు ముఖ్యమైన తీర్మానం ప్రతిపాదించినాడు. రామదాసు మద్రాసున్యాయవాది. అవిభక్త మద్రాసులో కోఆపరేటివ్ ఉద్యమం నిర్మించి. జీవితాంతం తన చేతుల్లో ఆ వుద్యమం నిలబెట్టుకుని నడిపిన వ్యక్తి. ఆయన ప్రతిపాదించిన తీర్మానం కొంచెం జోస్యంలాగ వున్నది :

1) పరిపాలనా పాటవంకోసం. భారతీయుల అభివృద్ధికోసం, ఎప్పుడో అప్పుడు, ప్రాంతీయ పరిపాలన భాషారాష్ట్రపద్ధతిలో నెలకొల్పవలసి వుంటుంది;

2) జాతీయకాంగ్రెసు ప్రాంతీయస్వాతంత్ర్యం కోరుతున్నది. ఆ సిద్ధాంతం ఇండియాగవర్న మెంటు సూత్రప్రాయంగా అంగీకరించినది. పరిపాలన ప్రజా హితంగా జరగాలంటే భాషారాష్ట్ర నిర్మాణం అవసరం;

3) ఈకారణాలవల్ల, ఆంధ్రప్రజానీకం ఈ సమస్యమీద తమదృష్టి కేంద్రీ కరించి తెలుగు జిల్లాలన్నీ కలిపి ఒకరాష్ట్రంగా ఏర్పాటు చెయ్యమని ప్రభుత్వాన్ని అర్థించాలి.

వల్లూరి సూర్యనారాయణరావు తీర్మానం బలపర్చినాడు. ముట్నూరి ఆది నారాయణయ్య వొచ్చే సభదాకా, ఈ తీర్మానం వాయిదావేస్తే, ప్రజలకి సాధక బాధకాలు నచ్చజెప్పవచ్చునన్నాడు. గంటి వెంకట్రామయ్య పంతులు బలపర్చినాడు. విశాఖపట్నం, గంజాంజిల్లాలవారు ఏమంటారో, అవి వెనకబడిన ప్రాంతాలుకదా అన్నారు. పైగా దత్తమండలాలు వున్నవి, వారందరికీ నచ్చజెప్పి, కూడగట్టుకుని మరుసటి సంవత్సరం మహాసభలో తీర్మానం పెడదామన్నారు. ఆ విధంగానే వెంకటప్పయ్య అసలుతీర్మానం సవరించగా, సభవారు కరతాళధ్వనులతో ఆమోదించినారు.

1914 మహాసభ పెద్దిభొట్ల వీరయ్య. అయ్యదేవర కాళేశ్వరరావు బెజవాడకు ఆహ్వానించినారు. కొండ వెంకటప్పయ్య ఉత్తరజిల్లాలు తిరిగినాడు. పదిహేనురోజుల తర్వాత విశాఖజిల్లా మహాసభ రాష్ట్ర నిర్మాణానికి అనుకూలంగా తీర్మానం ఆమోదించినది. అధ్యక్షత వహించిన మంతా సూర్యనారాయణ ఆంధ్ర రాష్ట్రం వెంటనే నిర్మాణం చెయ్యవలెనన్నాడు. ఇంకమిగిలినది దత్తమండలాలు. ఆంధ్రమహాసభ రాయబారవర్గం ఒకటి ఆ జిల్లాలు తిరిగి ప్రచారం చేసినది. వెంకటప్పయ్య, పట్టాభి, ముట్నూరి. వల్లూరి ఆ వర్గంలో సభ్యులు.

రాష్ట్రనిర్మాణానికి కేశవపిళ్ల వ్యతిరేకుడు. వుట్టివ్యతిరేకతేకాదు, ఓం ప్రథమంగా బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్య లేవనెత్తినాడు. ఈ సందర్భంలో అనుకూలవ్యతిరేక పక్షాలలో ప్రముఖులెవరు ? అనుకూలురు: దేశపాండ్యా సుబ్బా రావు. మహానందయ్య, నరసింగరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ఎస్. వి. నరసింహారావు. విదూరి పిచ్చయ్య, కే గుండురావు, హట్టి శివరావు, హట్టి శంకరరావు కొలచెలను శ్రీనివాసరావు, నెమలి పట్టాభిరామరావు, ఆర్. బి. రామకృష్ణరాజు, బెజవాడ పట్టాభిరామరెడ్డి, ఓ. యానాదిరెడ్డి, ఒంగోలు వెంకటరంగయ్య. వ్యతిరేకులు: ఆమంచర్ల సుబ్బుకృష్ణరావు, మైదవోలు చంగయ్య, గోపాలస్వామిమొదలియారు,

దొరస్వామిఅయ్యంగారు, కేశవపిళ్ల. వీరంతా నెల్లూరుజిల్లాకీ, దత్తమండలాలకీ సంబంధించిన నాయకులు. దత్తమండలం ఆదిలోనే హంసపాదైనది. ఆంధ్రమహాసభ నాయకులికి సమస్యగా పరిణమించినది.

రెండో ఆంధ్రమహాసభ బెజవాడలో జరిగినది. నేషనల్‌కాంగ్రెసు జనరలు సెక్రటరీగావున్న న్యాపతి సుబ్బారావు అధ్యక్షుడు ఆదిలో ఈయన వ్యతిరేకుడు. కాని పట్టాభి ప్రోద్బలంవల్ల అనుకూలుడైనాడు. మొదటి మహాసభలో రామదాసు ప్రతిపాదించిన తీర్మానంవంటిదే స్పష్టంగా ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణం 'వాంఛనీయం' అని ఏకగ్రీవంగా సభ ఆమోదించినది. 1915 లో మూడవమహాసభ విశాఖలో జరిగినది. పానుగల్లురాజా అధ్యక్షత. ఆంధ్రరాష్ట్రం 'వాంఛనీయం' అనే దశనించి 'అత్యవసరం' అనే దశలోకి పోయినది. ఈ విధంగా ఆంధ్ర మహాసభలు జరుగుతూనే వున్నవి. అరశతాబ్దం జరిగినవి. ఆందోళన ఎక్కువగా సర్కారుజిల్లాలలోనే వుంటూవుండేది. రాయలసీమవారు కొందరు అనుకూలంగానూ, కొందరు తటస్థంగానూ, ఆప్రాంతంలో నివాసం ఏర్పరుచుకున్న తమిళులు చాలా మంది వ్యతిరేకంగానూ వుంటూవచ్చినారు. తత్కారణంగా రాయబారవర్గాలు తిరుగుతూనేవుండేవి. రాయలసీమవార్ని అధ్యక్షులుగానూ, రాయలసీమనగరాలు సభా రంగాలుగానూ ఏర్పాటు చేసుకుంటూవచ్చినారు. 1941 వరకూ జరిగిన 26 సభలికి అధ్యక్షులు పదముగ్గురు రాయలసీమనాయకులు. ఆరుసభారంగాలు రాయలసీమలోవి.

1800 సంవత్సరంలో నిజాము నాలుగుజిల్లాలు తనరాజ్యంలోవి ఈస్టిండియా కంపెనీకి దత్తంచేసినాడు. అవి బళ్ళారి, అనంతపురం, కడప, కర్నూలు. వీటిని దత్తమండలాలు అన్నారు. 1911 లో చిత్తూరుజిల్లా ఏర్పాటైన తర్వాత అయిదు జిల్లాల్నీ దత్తమండలాలని వ్యవహరిస్తున్నారు. ఈ పేరు బాగుండలేదని డాక్టరు చిలుకూరినారాయణరావు 'రాయలసీమ' అని నామకరణం చేసినాడు. అదే పరిపాటి అయినది. న్యాయానికి ఒకప్పుడు సర్కార్లుకూడా రాయలరాజ్యంలోనూ నిజాంలోనూ భాగమే. నెల్లూరుజిల్లా ఆర్కాడునవాబుదగ్గిర్నించి ఈస్టిండియాకంపెనీవారు 1801 లో తీసుకున్నారు. అందుచేత ఆజిల్లా సర్కార్లలోగాని, దత్తమండలంలోగాని కలవలేదు. సమిష్టినామధేయం సర్కార్లతోకలసి కోస్తాజిల్లాలన్నారు. సాగరజిల్లాలనికూడా ఒకమాటు అన్నారు. కాని రాజకీయాలలో నెల్లూరు రాయలసీమ పక్షం, అవసరంపట్ల తనకితాను.

రాయలసీమలో నీటివనరులు తక్కువ. భూభాగం చాలావరకు రాతిమయం. ఉన్న నదులు పెన్న, తుంగభద్ర. సర్కారులకో కృష్ణాగోదావరులు జీవనదులు. 1851 లో గోదావరికీ, 1855 లో కృష్ణానదికీ ఆనకట్టలు కట్టబడినవి. 1860 లో పెన్నా నీటితీరువ ఏర్పడినది. అంతవరకూ రాయలసీమ పెద్దచెరువులకిందనే

ఎక్కువ పల్లపువ్యవసాయం వుండేది. కాని, ఈ ఆనకట్టలతో సాగర జిల్లాలలో కాలువలకింద వరిసాగుజరిగి సర్కారు నెల్లూరుజిల్లాలు సంపన్నములైనవి. రాయల సీమ చెరువులు బాగుచెయ్యబడలేదు. 1870లో వచ్చిన కడప-కర్నూలు కాలువ తప్ప పెద్దనీటివసరులు లేవు. తుంగభద్రగాని, నాగార్జునసాగరు ప్రాజెక్టుగాని వెనకలేవు. రాయలసీమలో కరువుకాటకాలు సాధారణమైనవి.

ఇంతేకాక, రైలు, రోడ్డుమార్గాలు దత్తమండలాన్ని మద్రాసుతో కలిపేవిగా వున్నవి. అందుచేత రాయలసీమవాసుల రాకపోకలూ, వ్యవహారవ్యాపారాలూ చెన్నపట్నంతో ఎక్కువ సంబంధం కలిగి వుండేవి. పైగా తమిళులు ఈజిల్లాలలో స్థిరపడి, నాయకులైనారు. ఈ కారణాలవల్ల రాయలసీమవారు సర్కారు జిల్లాలవారి విషయమైకొంచెం దురభిప్రాయమే కలిగి వుండడం సహజం. భయమూ, అను మానమూ వుండేవి. ఇప్పుడూ వున్నవి. ఈ అభిప్రాయం తొలిగించడం సర్కారు వారి ప్రధాన కర్తవ్యం అయినది. అంతవరకూ ఆంధ్రరాష్ట్రం దుస్సాధ్యం.

ఆంధ్రోద్యమానికి ఇదిపెద్ద ఆటంకం. ఇంతేకాదు. ఉద్యమం జాతీయో ద్యమంలో భాగంగా నడిచినది. కాంగ్రెసునాయకులే ఈ ఉద్యమానికి కూడా నాయ కులు. కాంగ్రెసు ద్వారానే స్వరాజ్యం రావాలి, కాంగ్రెసుద్వారానే ఆంధ్రరాష్ట్రం కూడా రావాలి. అందుచేత ముందుగా కాంగ్రెసు అగ్రనాయకుల్ని వొప్పించాలి. అక్కడ తమిళుల వ్యతిరేకత లేకుండా చూసుకోవాలి. ఇవన్నీ జరిగిన తర్వాత ప్రభుత్వంతో ఈ విషయం నచ్చజెప్పుకోవాలి. బ్రిటిషు ప్రభుత్వం ప్రథమ ప్రపంచ సంగ్రామంలోమునిగి వున్నది. ఈ సమస్యలతో సతమతమవుతూ ఉద్యమం నడుపుతూ వచ్చినారు నాయకులు.

1915 లో గుంటూరులో ఒకజిల్లా కాంగ్రెసు సంఘం ఏర్పాటు చేసినారు. దానికి పత్రి శ్రీనివాసరావు, తర్వాత కొంపల్లి కోటిలింగం అధ్యక్షులు. విష్ణుభొట్ల సూర్యనారాయణ కార్యదర్శి. ఈ సంఘం ప్రోద్బలంతో ఒక ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం వుండాలని చిన్న ప్రతిపాదన బయలుదేరినది. యావత్తు మద్రాసు రాష్ట్రానికి కలిపి ఒకే రాష్ట్ర కాంగ్రెసు వుండేది. దాని ఆఫీసు మద్రాసులో వుండేది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏర్పాటుకి వొప్పుకుంటే కాంగ్రెసు భాషా రాష్ట్ర విభజనకి వొప్పుకున్నట్టేగదా! నలభై ఆరుగురు కాంగ్రెసువాదుల సంత కాలతో వో అర్జీ తీసుకువెళ్ళి 1915 లోనే బొంబాయి కాంగ్రెసులో సమర్పించినాడు వెంకటప్పయ్య. అది పైకీ, కిందికీ వెళ్ళి, అందరి ఆమోదంపొంది, 1917 లో కలకత్తా కాంగ్రెసు ముందుకు వచ్చినది. తీర్మానం ప్రతిపాదించినవాడు పట్టాభి. అధ్యక్షురాలు అనీబిసెంటు. బాలగంగాధరతిలక్ సహాయంతో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం తీర్మానం నెగ్గినది. బెజవాడలో మహాసభచేసి, అప్పుడే

కాంగ్రెసు జనరల్ సెక్రటరీపనికి రాజీనామా ఇచ్చిన న్యాపతి సుబ్బారావు అధ్యక్షుడు గానూ, కొండ వెంకటప్పయ్య కార్యదర్శిగాను 1918 లో కొత్తసంఘం స్థాపించినారు.

ఇది పురస్కరించుకునే మనవారు ఆంధ్రులే ప్రథమ భాషారాష్ట్ర సిద్ధాంతం ప్రతిపాదించారని చెప్పుకుంటారు. నిజానికి మొదట ప్రతిపాదించినది హార్డింజ్. అమలుజరిపినదీ ఆయనే. ఆంధ్రరాష్ట్రం కాంగ్రెసుకమిటీతోపాటే సింధురాష్ట్ర కమిటీ కూడా వచ్చినది. కాని సింధురాష్ట్రం ప్రత్యేకంగా 1937 లోనే ఒరిస్సా, సరిహద్దు రాష్ట్రాలతోపాటు అవతరించినది. అప్పటికి ఆంధ్రులికి ఏమీలేదు. వారు అడగలేదు. వీరు అడుగుతూనేవున్నారు. భాషారాష్ట్ర సిద్ధాంతం బ్రిటిషువారే అమలు జరిపినారు. ఆంధ్రులముఖాన్నే పొద్దుపొడిచినదనడం పొరబాటు.

1917 కే బ్రాహ్మణేతరమహాసభ అవతరించినది. కాంగ్రెసువారు గాంధీ నాయకత్వంలోకి వస్తున్నారు; ప్రభుత్వంతో ఏకీభవించడంలేదు. జస్టిసుపార్టీవారు ప్రభుత్వంతో సహకరిస్తున్నారు. జాతీయ రంగంలో ఈ రెండుపార్టీలకీ సయ్యోధ్య లేదు. కాని ఆంధ్రరాష్ట్ర సందర్భంలో ఆంధ్రనాయకులందరూ ఒకటే. కాంగ్రెసు సభా, ఆంధ్రసభా పక్కపక్కనే జరుగుతూ వుండేవి. అదో రామిగాడి పెళ్ళిలో సోమిగాడిపోరు.

అదేకాలంలో కొత్త రాజ్యాంగ సంస్కరణలు తయారు చేస్తామంటూ ఇండియా కార్యదర్శి మాంటెగూ, వైస్రాయి ఛెమ్సుఫర్డు, దేశసంచారం చేసినారు. వారికి ఆంధ్రమహాసభ రాయబారం పంపించినది. వెళ్ళినవారు న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, కొండ వెంకటప్పయ్య. ప్రత్యేక సభలు జరిపినారు. ఆంధ్రపత్రిక బలమే కాకుండా, గుంటూరుసభకి అధ్యక్షత వహించిన కాశీనాథుని నాగేశ్వరరావు సొంతబలంకూడా మహాసభకి లభించినది. సభలకి డబ్బు ఎల్లాగో వసూలు చేసుకున్న ఆంధ్రులికి ఇంగ్లండు రాయబారం వెళ్ళడానికి డబ్బు లేకపోయినది. ఆనాటి స్థితి ఆంధ్రపత్రిక వర్ణించినది :

"వివిధ ప్రాంతములందు కూడిన సభా వ్యవహారములు ఆంధ్రుల యుత్సాహ శీలమునకు నిదర్శనములు. కాని యాంధ్రులకు తమ యుత్సాహమునకు తగిన కార్యశూరత్వము లేదని వారి చరిత్రయే చాటుచున్నది. ఆంధ్రోద్యమాదర్శములను వ్యాపింపజేయుటకై ధనములేదు; సైనికులులేరు; నాయకులులేరు; ప్రయత్నములు లేవు. సంస్కరణ పోషణకునైన, ఇంగ్లాడునకు రాయబారములను బంపుటకైనను ఆంధ్రులకు శక్తిలేకున్నది."

ఆంధ్రరాష్ట్ర అవసరము, వీలుచాళ్లు, రాజకీయసర్దుబాట్లు ఆనే విషయం మీద ఒకనివేదికమాత్రం తయారుచేసి, లిబరలుపార్టీతరఫునవెళ్ళి మోచర్ల రామ చంద్రరావుకీ, బ్రాహ్మణేతరసభతరఫునవెళ్లి కూర్మా వెంకటరెడ్డినాయుడికీ ఇచ్చినారు. ఈ నివేదిక సమర్పించినారుగాని, ఎవరితోనూ ప్రస్తావించడానికి వారికి వ్యవధిలేక పోయినది. ఎవరిపార్టీ వ్యవహారాలలో వారు వుండిపోయినారు. ఆంధ్రరాష్ట్రం దేవుడిపెళ్లి; అంతాపెద్దలే, కాని ఎవరూకారు. ఒక మంచివిషయం. ఈ నివేదిక తోసిపారేసేదికాదు, చాలాహేతుబద్ధంగానూ, సమంజసంగానూ, సబబుగానూ, యుక్తియుక్తంగానూ వున్నదనీ, బ్రిటిషప్రభుత్వం దీనివిలువ దీనికి ఇవ్వాలనీ ఒక రాజకీయశాస్త్రజ్ఞుడు వ్రాసినాడు. ఆయనపేరు లయనల్ కర్టిన్. ఫలం సంస్కరణల రిపోర్టులో భాషారాష్ట్రాలు అని అనకుండా, ప్రజలకోరికమీద గవర్నరుజనరలు కొత్తరాష్ట్రాలు నిర్మాణంచెయ్యవచ్చు అని సూత్రం ఇరికించినారు. ఆ సూత్ర ప్రభావంవల్ల ఆంధ్రులకి ఏమీ మేలుకలగలేదు.

సంస్కరణలమూలంగా ద్వంద్వప్రభుత్వం అమలులోకి వచ్చినది. కాంగ్రెసు నిరాకరించి సహాయనిరాకరణంలోకి దిగినది. జస్టిసుపార్టీ సహకరించి మద్రాసులో అధికారంలోకి వచ్చినది. రాజారామారాయణం ప్రధానమంత్రి, సర్ అన్నెం పరశు రామపాత్రో విద్యామంత్రి. ఆంధ్రరాష్ట్రంవిషయంలో ఏమీ చెయ్యలేకపోయినా ఆంధ్రుల మూడు అభిలాషలలో ఒకటి మనసు తీర్చినారు, అది ఆంధ్ర విశ్వవిద్యాలయం. ఒకచట్టంచెయ్యడం అమలులోపెట్టడం కాలవ్యవధితోకూడుకున్న విషయాలు. జస్టిసుమంత్రివర్గం ఒకవేపు కాంగ్రెసుధిక్కారం, జైళ్ల ఉద్యమం తట్టు కోవలసివచ్చినది. ఒకవేపు పరిపాలన చూసుకోవలసివచ్చినది. ఆ పార్టీ జాతీయ శత్రువుమాత్రంకాదు.

ఆంధ్రవిశ్వవిద్యాలయంబిల్లు శాసనసభ ఆమోదించినది. అనంతపురం. రాజమండ్రీ, విశాఖపట్టణాలలో ఉన్నత విద్యాకేంద్రాలు నెలకొల్పాలని చట్టంలో వున్నది. ఇంతలో బెజవాడవారు వెళ్ళి మాసంగతి ఏమిటన్నారు. ఇందులో వోచిన్న కిటుకుకూడా వున్నది. విశ్వవిద్యాలయం రాష్ట్రోద్యమంలో ఒక ముఖ్యవిషయం. ఒక వేళ ప్రత్యేకరాష్ట్రం వచ్చినట్లైతే ముఖ్యనగరం ఎక్కడ అనే సమస్య వున్నది. బెజవాడ రవాణా కేంద్రం, ఒక విధంగా అనుకూలం అనే అభిప్రాయం సర్కారు నాయకులికి వున్నది. నిజంకూడాను. రామారాయణంగారు ఆంధ్ర రాష్ట్రానికి మద్రాసే కేంద్రంగా వుండాలనే అభిప్రాయంలో వుండేవాడు. కూంబునదికి ఉత్తరాన ఆంధ్రులు, దక్షిణాన తమిళులు వుండి, చెరిసగం చేసుకుని మద్రాసులోనే కాపురం చెయ్యాలని ఆయన అభిప్రాయం. ఆ అభిలాష నెరవేరక పోవచ్చుననే భయం లేకపోలేదు. అందుచేత బెజవాడలో విశ్వవిద్యాలయం కార్యస్థానం వుంటే బాగుంటు దనితోచి ఆప్రకారం చట్టం సవరణ చేయించినాడు.

1926లో విశ్వవిద్యాలయ కార్యస్థానానికి బెజవాడలో ప్రారంభోత్సవం జరిగినది. బెజవాడలో రెండు ఉన్నత పాఠశాలలుతప్ప కళాశాలలు లేవు. కార్యాలయాలకి భవనాలులేవు. ప్రథమ ఉపాధ్యక్షుడు రామలింగారెడ్డి. కొన్నాళ్లు, గాంధీకొండమీద బంగాళాలో కాపరం వున్నాడు. ప్రారంభోత్సవంలోనే కొన్ని అమంగళకరమైన సంగతులు జరిగినవన్నారు పెద్దలు. వేదధ్వానాలతో, సుమంగలీ మంగళహారతులతో శుద్ధ వైదికంగా, సంప్రదాయసిద్ధంగా ప్రారంభించిన ఆ మహోత్సవంలో హారతి పళ్ళెం పట్టుకుని పాటపాడిన యువతులలో బొట్టు పెట్టు కున్న వొక వితంతు ఉపాధ్యాయిని వున్నది. మరి దేని ప్రభావమో విద్యాలయం బెజవాడలో ఆట్టేకాలం వుండలేదు. పైగా ఆంధ్రులలో ఐకమత్యత చేకూర్చకపోగా విచ్ఛిన్నకారణంగా పరిణమించినది.

1926 నవంబరులో శాసనసభకి కొత్త ఎన్నికలు జరిగినవి. కాంగ్రెసువారు పోటీచేసి అధికసంఖ్యాకులుగా ఎన్నికైనారు. కాని ప్రభుత్వాధికారం అంగీకరించం అని భీష్మించినారు. జస్టిసుపార్టీవారు తక్కువమంది ఎన్నికైనారు. మూడోపార్టీ జాతీయపార్టీ. ఈ పార్టీని కాంగ్రెసు కొన్నిషరతులమీద బలపర్చడానికి సిద్ధపడి నది. జాతీయపార్టీనాయకుడు డాక్టరు పి. సుబ్బరాయన్. ఈయన ముఖ్యమంత్రిగా ప్రభుత్వం ఏర్పడినది. విద్యామంత్రికూడా ఆయనే. మద్రాసులో ప్రథమ తమిళ ముఖ్యమంత్రి సుబ్బరాయన్.

కళాశాలలులేని బెజవాడలో విశ్వవిద్యాలయం వుండడంరామలింగారెడ్డికి ఇష్టం లేదు. ఒకే కేంద్రంలో వుంటే, తాను విద్యావేత్తగనుక, విద్యావిధానం పర్యవేక్షణ చేసి, విశ్వకళాపరిషత్తు ఆధునిక పద్ధతులలో నడపాలని ఆయన ఉద్దేశం. పైగా బెజవాడ యెండలకి ఆయన తట్టుకోలేక పోయినాడు. మనసు చల్లటి సముద్రతీరం విశాఖపట్టణంమీద వున్నది. ఆ సాగరతీరంలో ఒక అపూర్వ విద్యాకేంద్రం, ఉన్నతి భవనాలతో ఆయన మనోనేత్రంముందు నాట్యమాడినది. రెండు స్నాత కోత్సవాల తర్వాత యావత్తు విశ్వవిద్యాలయం విశాఖపట్టణం చేరేటట్టు ఏర్పాటు చేసినాడు. రాయలసీమవాడుగదా, ఆయనలో ప్రాంతీయదురభిమానంలేదు. కాని ఈయన ప్రయత్న సాఫల్యం రాయలసీమవారికి నచ్చలేదు. ఎక్కడో విసిరేసినట్టు విశాఖపట్టణంలో విశ్వవిద్యాలయం ఏమిటి అన్నారు. సర్కారు వారిమీద అను మానానికి మరింత కారణమైనది. బొల్లిని మునిస్వామి నాయుడు, రంగనాథ ముదలియారూ, ఈ విశ్వవిద్యాలయం మాకు అక్ఖర్లేదన్నారు. మద్రాసులోనే వుండి పోతామన్నారు. సుబ్బరాయన్ ప్రభుత్వం వారికోరిక ఆమోదించినది. రాయలసీమ మద్రాసు విశ్వవిద్యాలయంలోనే వుండిపోయినది. 1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడి. తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం అవతరించేవరకూ రాయలసీమ మద్రాసు విశ్వవిద్యాలయంలోనే వుండిపోయినది.

తెలుగువారి మూడుకోరికలలోనూ విశ్వవిద్యాలయం ఈ రూపందాలిస్తే, ఆంగ్ల దిన పత్రికావాంఛ. ఒక వ్యక్తి ప్రయత్నంగా కొంతకాలం తీరినది. ఆ పత్రిక 'స్వరాజ్య'; ఆ వ్యక్తి ప్రకాశం. ఈ పత్రిక ఆంధ్రరాష్ట్రోద్యమం కోసం ప్రారంభించినది కాదు. గాంధీ ఉద్యమ ప్రచారంకోసం ప్రారంభించినది. 1922లో స్థాపించబడి, వాయిదాలుగా అస్తమించినది. కాని ఎంతమందినో యువకుల్ని ప్రతికారచయితలు చెయ్యడానికి సహాయపడినది. నాటికీ నేటికీ ఆంధ్రుల చేతుల్లో సొంతమైన ఆంగ్ల దినపత్రిక లేదు. తమ వ్యక్తిగత ప్రచారానికి లోటులేదు గదా అని నాయకులు వూరుకున్నారు. ఆంధ్రదేశానికి కలిగే లోటు చూసుకోరు. అదే గదా మనలోటు !

1936 లో పిఠాపురం మహారాజా పెట్టిన ఆంగ్ల, ఆంధ్ర, అరవ దిన పత్రికలు పీపుల్స్ పార్టీకోసం పెట్టినవి. ఆంధ్రోద్యమంతో వాటికి సంబంధంలేదు. అవి అప్పుడే పోయినవి.

1947లో 'ఇండియన్ రిపబ్లిక్' అనే ఆంగ్ల దినపత్రిక పట్టాభిసీతారామయ్య పెట్టినాడు. ఆంధ్రోద్యమ ముఖ్యనాయకుడైన పట్టాభి మనసులో ఆంధ్రరాష్ట్ర అవసరాలు వుండడంలో ఆశ్చర్యంలేదు. ఆ పత్రిక చిరకాలం వుండలేదు.

మరో ప్రయత్నం మొసలికంటి తిరుమలరావు అదేసమయంలో చేసినాడు. కాని అరవలతో చేరి యాజమాన్యం సమకూర్చుకోవలసివచ్చినది. ఆ పత్రిక పేరు 'న్యూస్ టైమ్స్'. ఇదికూడా అట్టేకాలం మనలేదు.

ఆంధ్రమహాసభ మాత్రం మనుగడ సాగిస్తూనేవున్నది. బాపట్లలో బయ్యా నరసింహేశ్వరశర్మ అధ్యక్షత కింద ప్రారంభించి, మూడుసార్లు కడపకోటిరెడ్డి, రెండుసార్లు సర్వేపల్లి రాధాకృష్ణ అధ్యక్షతన సమావేశమై 1937 లో బెజవాడలో రజతోత్సవం చేసుకున్నది. ఆంధ్రరాష్ట్రం కోరుతూనేవున్నది. విజయానంద గజపతి (విజ్జీ) ఆధ్వర్యంలో విజృంభించినది. సభాస్థానాల, అధ్యక్షుల పట్టిక చూస్తే పార్టీ విభేదం లేకుండా బ్రిటిషు ఆంధ్రులు యావన్మందీ రాష్ట్రోద్యమంలో పనిచేసినట్టు తెలుస్తుంది. ఎవరూ ఇది నాపనీ అని కంకణం కట్టుకోలేదు; ఎవరూ నాదికాదూ అని దూరంగా వుండనూలేదు.

## ఆంధ్ర మహాసభలు

| సంవత్సరము | ప్రదేశం | అధ్యక్షులు |
|---|---|---|
| 1913 | బాపట్ల | బి. యన్. శర్మ |
| 1914 | బెజవాడ | న్యాపతి సుబ్బారావు |
| 1915 | విశాఖపట్నం | పానుగల్లురాజా |

| సంవత్సరము | ప్రవేశం | అధ్యక్షులు |
|---|---|---|
| 1916 | కాకినాడ | మోచర్ల రామచంద్రరావు |
| 1917 | నెల్లూరు | కొండ వెంకటప్పయ్య |
| 1918 | గుంటూరు | కాశీనాథుని నాగేశ్వరరావు |
| 1918 | కడప | నెమిలి పట్టాభిరామారావు |
| 1919 | అనంతపురం | గాడిచర్ల హరిసర్వోత్తమరావు |
| 1920 | మహానంది | ఏ. రంగనాథ ముదలియార్ |
| 1921 | బరంపురం | గంపలగూడెం జమిందారు |
| 1922 | చిత్తూరు | వేదం వేంకటరాయశాస్త్రి |
| 1924 | మద్రాసు | కట్టమంచి రామలింగారెడ్డి |
| 1925 | మచిలీపట్నం | స్వామీ వెంకటాచలంచెట్టి |
| 1926 | ఏలూరు | ఉయ్యూరు జమీందారు |
| 1927 | అనంతపురం | ఒ. లక్ష్మణస్వామిరావు |
| 1928 | నంద్యాల | సర్వేపల్లి రాధాకృష్ణ |
| 1929 | బెజవాడ | కడపకోటిరెడ్డి |
| 1931 | గుంటూరు | వరహగిరి వెంకటజోగయ్య |
| 1931 | మద్రాసు | కడపకోటిరెడ్డి |
| 1932 | బెజవాడ | కూర్మా వెంకటరెడ్డి నాయుడు |
| 1934 | విశాఖపట్నం | దేశపాండ్యా సుబ్బారావు |
| 1936 | కాకినాడ | వేమవరపు రామదాసు |
| 1937 | బెజవాడ | కడపకోటిరెడ్డి |
| 1938 | మద్రాసు | సర్వేపల్లి రాధాకృష్ణ |
| 1939 | గుంటూరు | మాడభూషి అనంతశయనం |
| 1941 | విశాఖపట్నం | విజయానంద గజపతి |

విజ్జీ మూడేళ్ళు అధ్యక్షుడుగావున్నాడు. తరవాత వుయ్యూరు కుమారరాజా, నడింపల్లి లక్ష్మీనరసింహరావు అధ్యక్షులైనారు. అంతః కలహాలు బైలుదేరి రెండుగా చీలినది. మళ్ళీ అతుక్కొని రాష్ట్రావతరణవరకూ ఇతోధికసేవ చేసినది. హరిసర్వోత్తమరావు చివరి అధ్యక్షుడు.

# శ్రీబాగ్ ఒడంబడిక

ఆంధ్రమహాసభ ఎంత ఆందోళనచేసినా కాంగ్రెసు కార్యక్రమంలో ఇది అంగీకారమై తేతప్ప శంఖున పోసిన తీర్థంకాదని అందరికీ తెలుసును. ఆ వేదిక మీదకూడా ప్రయత్నం జరుగుతూనేవున్నది. 1920 లో నాగపూరు కాంగ్రెసు భాషారాష్ట్రనిర్మాణం అంగీకరించినది. 1928 లో లక్నోలోజరిగిన అఖిలపక్ష సమావేశంలో ఆంధ్రరాష్ట్రం వెంటనే ఏర్పడాలని తీర్మానం జరిగినది. తర్వాత వచ్చిన మోతీలాల్ నెహ్రూ రిపోర్టులో ఈ సూత్రం ఉల్లేఖించబడినది. 1929 లో కలకత్తాలోజరిగిన కాంగ్రెసు కన్వెన్షన్‌కూడా అంగీకరించినది.

1928 లో సైమను కమిషను వచ్చినది. అందరూ అందులో ముఖ్యంగా ఆంధ్రులు ఆ కమిషన్ని తిరస్కరించడంచేత ఈ సమస్య వారినివేదికలో ఎటూ తేల్చకుండా విడిచిపెట్టినారు. ఇంతలో 1930 లో మద్రాసు ప్రభుత్వం ఆంధ్ర రాష్ట్రానికి వ్యతిరేకంగా వో రిపోర్టు లండను పంపించినది. లండనులో 1930, 31 సంవత్సరాలలో జరిగిన రౌండుటేబుల్ సమావేశాలు విఫలమైనాయి కాని, సింధు, ఒరిస్సారాష్ట్రాలు ఏర్పాటుచెయ్యాలని తీర్మానం జరిగినది. 1935 ఇండియా చట్టం ప్రకారం ఈ రెండురాష్ట్రాలూ ఏకభాషా రాష్ట్రాలుగా రూపొందినవి. ఆంధ్రరాష్ట్రం దూరమైనది. గంజాంజిల్లా ఇతర తెలుగు ప్రాంతాలూ ఒరిస్సాలో కలిసినవి.

అప్పటికి మహారాష్ట్రులూ, కన్నడిగలూకూడా తమతమ ప్రత్యేకరాష్ట్రాల కోసం అలజడి ప్రారంభించినారు. 1936 ఎన్నికల ప్రణాళికలో కాంగ్రెసు తాను అధికారంలోకి వస్తే భాషారాష్ట్రనిర్మాణం చేస్తానని వాగ్దానం చేసినది. 1937 లో తొమ్మిది రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వంలోకి వచ్చినది. అందులో మద్రాసు ఒకటి. రాజగోపాలాచారి ముఖ్యమంత్రి.

1937 అక్టోబరులో ఆలిండియా కాంగ్రెసుకమిటీ కలకత్తాలో సమావేశ మైనది. అధ్యక్షుడు జవహరిలాల్ నెహ్రూ. ఆంధ్రరాష్ట్రం నిర్మాణంచెయ్యాలన్న తీర్మానం ఆ సభలో ఏకగ్రీవంగా అంగీకరించబడినది. అంతేకాదు, రాష్ట్ర ప్రభుత్వాలు ఈ విషయంలో తగిన చర్యలు తీసుకుని, భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణానికి దోహదం చెయ్యాలని తీర్మానంలో వున్నది. ఈ తీర్మానానికి పట్టాభి చాలా వరకు కారకుడు.

కలకత్తానించి ఇంటికిరాగానే అనుకున్నాడు: "ఇంటగెల్చి రచ్చగెలవ మన్నారు. మనం రచ్చలోగెల్చివచ్చాము; ఇంక ఇంట గెలవాలి" అని. ఈ సమయంలో రాయలసీమవారి భయసందేహాలు తీర్చడం అవసరం అనుకున్నాడు. వర్తమానచరిత్ర కొంత జ్ఞాపకానికి వస్తుంది. చదువు సంధ్యలలోనూ, ప్రజాబాహుళ్యపు సంస్కారంలోనూ, ప్రభుత్వ ఉద్యోగాలలోనూ, చాలావరకు ఆర్థికంగానూ రాయలసీమ సర్కార్లకంటె వెనుకబాటుగా వున్నది. దీనికి సర్కారు ప్రజలు కారణం అన్నట్టుగా అనుమానాలూ, అపోహలూ కలిగించినారు కొందరు. దీనికి సర్కారాంధ్రనాయకుల ప్రవర్తన కొంతకారణం కాకపోలేదు. సర్కార్లనించి అక్కడికి వెళ్ళిన ఉద్యోగస్థులు కొందరు కారణభూతులు కారనలేము. విశ్వవిద్యాలయం అల్లా అయినది. ఆంధ్రరాష్ట్రం ఏమవుతుందోననే భయం వారికి సహజంగా కలిగినది. ఒకవేళ రాష్ట్రంవస్తే అంతా సర్కారువారే బావుకుంటారనే అనుమానం పీడించినది. ఈ అనుమానాలు వృద్ధిచెయ్యడంలో తమిళ నాయకులు కొందరిచెయ్యి లేకపోలేదు.

1932 లో మద్రాసులో కోటిరెడ్డి అధ్యక్షతకింద జరిగిన ప్రత్యేకాంధ్ర మహాసభలో కాశీనాథుని నాగేశ్వరరావు రాయలసీమ—సర్కారు సయోధ్యకోసం కృషిచేసినాడు. ఆ ప్రయత్నఫలితంగా ఒక ఉపసంఘం ఏర్పాటైనది. అందులో నాగేశ్వరరావు, కోటిరెడ్డి, పిల్లలమర్రి ఆంజనేయులు, డాక్టరు చిలుకూరి నారాయణరావు, వింజమూరి గోవిందరాజాచారి, జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రి, వి. రామచంద్రరావు, చేకూరి సుబ్రహ్మణ్యం సభ్యులు. సివిలు డిజొబీడియన్సు ఉద్యమంలో ఆ కమిటీ అంతర్ధానమైనది.

ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు అధ్యక్షుడుగా, పట్టాభి 1937 నవంబరు 14 న మద్రాసులో సర్కారు రాయలసీమనాయకుల సమావేశం ఒకటి ఏర్పాటుచేసినాడు. ఆ సమావేశం నాగేశ్వరరావు నివాసం 'శ్రీబాగ్' లో జరిగినది. సర్కార్లతరఫున సభకి పట్టాభి, కొండ వెంకటప్పయ్య, నాగేశ్వరరావు, మహబూబ్ఆలీబేగ్, దేశరాజు హనుమంతరావు, ముళ్లపూడి పళ్లంరాజు హాజరైనారు. రాయలసీమతరఫుని

పప్పూరి రామాచారి, టి. ఎన్. రామకృష్ణారెడ్డి, కల్లూరి సుబ్బారావు, దేశపాండ్యా సుబ్బరామిరెడ్డి, హాలహర్వి సీతారామిరెడ్డి, కడప కోటిరెడ్డి, వరదాచారి వున్నారు.

కోటిరెడ్డి ఆ సంవత్సరం ఆంధ్రమహాసభ అధ్యక్షుడు. ఆయేడే మహాసభ రజతోత్సవంచేసుకున్నది. శ్రీబాగ్ సమావేశంలో ఆంధ్రరాష్ట్రం విషయమై ఉభయ ప్రాంతాల నాయకులూ ఒక ఒడంబడికకి వచ్చినారు. దాని పేరే శ్రీ బాగ్ ఒడంబడిక. ఒడంబడిక షరతులు :

1. ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుచేస్తే అనంతపురంలోకూడా ఒక విశ్వవిద్యాలయం నెలకొల్పాలి;
2. పది సంవత్సరాలదాకా రాయలసీమలో మేజరుప్రాజెక్టులికి ప్రాధాన్యత ఇవ్వాలి;
3. రాజధానిగాని, హైకోర్టువుండే స్థానంగాని రాయలసీమవారి ఇష్టానుసారం నిర్ణయించాలి;
4. శాసనసభ్యుల సంఖ్య జనాభా ప్రాతిపదికమీదకాక, జిల్లాలన్నిటికీ సరిసమానంగా వుండాలి.

శ్రీబాగ్ ఒడంబడిక ఆంధ్రమహాసభ స్థాయీసంఘంలోనూ, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీలోనూ ఆమోదించినారు.

1938 జనవరిలో ఒక సౌహార్ద్రసంఘం దేశమంతా సంచారంచేసి, ప్రజలకి ఒడంబడిక షరతులు నచ్చజెప్పి, రాష్ట్రావతరణకి వార్ని సుముఖుల్ని చేసినది.

ఇక జరగవలసినది మద్రాసు శాసనసభలలో తీర్మానాలు. కలకత్తా కాంగ్రెసు నిర్ణయం ప్రకారం కాంగ్రెసు మంత్రివర్గమే ఈచర్య తీసుకోవలసి వున్నది. కాని ముఖ్యమంత్రి రాజగోపాలాచారి వొప్పుకోలేదు. అప్పుడు కళా వెంకట్రావు చాలా మంది కాంగ్రెసు శాసనసభ్యులచేత సంతకాలు చేయించి, ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చెయ్యాలన్న వో ముషాయిదా తీర్మానం ఛీఫ్‌విప్ అయిన అయ్యదేవర కాళేశ్వర రావుకి అందజేసినాడు. కాళేశ్వరరావు ముఖ్యమంత్రిని కలిస్తే ఆయన కొత్తసలహా చెప్పినాడు. ఒక్క ఆంధ్రరాష్ట్రమే ఏమిటి, మద్రాసులోవున్న ఆంధ్ర, తమిళ, కన్నడ, కేరళ బాగాలు విభజించి ప్రత్యేక భాషా రాష్ట్రాలుగా ఏర్పాటు చెయ్యాలని తీర్మానం సవరించమన్నాడు. పట్టాభి, వెంకటప్పయ్యకూడా ఈ సవరణ అంగీకరించినారు. ఇందులో కిటుకు తెలుగువారు గ్రహించినట్టు తోచదు. ఆంధ్ర తమిళ రాష్ట్రాలు పెద్దవేగాని, మద్రాసులోవున్న కన్నడ, కేరళ భాగాలు చాలా చిన్నవి. ఒకోజిల్లామట్టుకు వుండేవి. తక్కిన కన్నడ, కేరళభాగాలు స్వదేశసంస్థానభాగాలుగా వుండేవి. కొంత కర్నాటకం బొంబాయిలో వుండేది. ఈ జిల్లాలు తీసుకెళ్ళి ఆయా

సంస్థానాలకి ఇవ్వడమనే ప్రతిపాదన లేనేలేదు. ఒకోజిల్లాకి ఒకోరాష్ట్రం ఏర్పాటు చెయ్యడం నగుబాటు పని. ఇటువంటి తీర్మానం అమలుచెయ్యడం అసాధ్యం.

ఈ తీర్మానం రాష్ట్ర కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీముందు పెట్టినప్పుడు హాలహర్వి సీతారామిరెడ్డి, డాక్టరు లక్ష్మీదేవి, భీమారావు ఆక్షేపణ తెలియజేసినారు. రాజాజీ కోరికమీద ఉపసంహరించుకున్నారు.

అసెంబ్లీలో ఈ తీర్మానం ప్రతిపాదించినవారు ఆంధ్రోద్యమ సంస్థాపకుడు కొండ వెంకటప్పయ్య. బలపర్చినవాడు, ఆంధ్రమహాసభ అధ్యక్షుడు, రాయలసీమ నాయకుడు, కడపకోటిరెడ్డి.

తీర్మానం బలపరుస్తూ ముఖ్యమంత్రి రాజగోపాలాచారి గంభీరమైన ఉపన్యాసం చేసినాడు. 1938 మార్చి 30న అసెంబ్లీలో తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడినది, మర్నాడు కౌన్సిలుతో ఏకగ్రీవామోదం పొందినది. అక్కడ కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు ప్రతిపాదించగా, వి. వి. జోగయ్య పంతులు బలపర్చినాడు.

ఈ తీర్మానానికి అప్పటి మద్రాసుగవర్నరు సుముఖుడు. ఆంధ్ర తమిళ రాష్ట్రాలకి మద్రాసే ఉమ్మడి రాజధానిగావుంటే, గవర్నరుకూడా ఉమ్మడిగావుండ వచ్చునని సూచించినాడు. ఆ సూచన రాజాజీకి ఇష్టంలేదు. దీనికి నేపథ్యం ఉన్నది. 1938 లో ఆంధ్రమహాసభ మద్రాసులో జరిగినది. ఆ సభకి సర్వేపల్లి రాధాకృష్ణ అధ్యక్షత వహించినాడు. అప్పుడు ఆంధ్రరాష్ట్రానికి మద్రాసే రాజధానిగా వుండాలని తీర్మానం చేసినారు. ఆహ్వాన సంఘాధ్యక్షుడు, వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి, చరిత్ర విషయాలు పేర్కొని, మద్రాసునగరం ఆంధ్రులదేనని నిరూపించినాడు. ఆ సభలోవున్న రాజగోపాలాచారి ఆంధ్రనాయకుల్ని మందలించినాడు. వివాదవిషయాలలోకి వెళ్లవద్దన్నాడు. మద్రాసు విడిచిపెడితే ఆంధ్రరాష్ట్రం వెంటనే తెప్పిస్తానని ఆంధ్ర మంత్రులతో చెప్పినాడు.

ఆంధ్రోద్యమం ప్రారంభించినప్పటినించీ కోరే ఆంధ్రరాష్ట్రానికి మద్రాసు రాజధానిగా వుండాలన్న ఆలోచనగాని, సంకల్పంగాని నాయకులికి వున్నట్టు స్పష్టం కాలేదు. రాజధాని విషయం గాలిలోవదిలేసినట్టే తోస్తుంది. సర్కారువారు అనుకోడం బెజవాడ–గుంటూరు మధ్యనున్న ప్రాంతం అనుకూలంగా వుంటుందని. నిర్దిష్టమైన రాజధానిస్వరూపం ఎవరిదృష్టిలోనూలేదు. కాని మద్రాసు ప్రస్తావన అడపాతడపా వస్తూనేవున్నది. మొదట 1917 లో నెల్లూరు ఆంధ్రమహాసభలో ఈ విషయం చర్చకి వచ్చినది. ఆ సభాధ్యక్షుడు కొండ వెంకటప్పయ్య. ఆహ్వాన సంఘాధ్యక్షుడు ఒంగోలు వెంకటరంగయ్య, ఆహ్వాన ఉపన్యాసంలో మద్రాసునగరం ఆంధ్రరాష్ట్రానికి రాజధానిగా వుండాలని చెప్పినాడు. అప్పుడు మద్రాసులో భారి

స్టరుగావున్న ఉన్నవ లక్ష్మీనారాయణ ఆ వాదం బలపర్చినాడు. సభలోవున్న జస్టిసుపార్టీ నాయకులు ఏకీభవించలేదు.

తరువాత 1922 లో ఆంధ్రమహాసభ చిత్తూరులో జరిగినది. ఆ మహాసభకి ఆహ్వాన సంఘాధ్యక్షుడు బొల్లిని మునిస్వామి నాయుడు తన ఉపన్యాసంలో మద్రాసే రాజధానిగా వుండాలని వాదించినాడు.

1927 లో రాజ్యసభలో వేమవరపు రామదాసు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరగాలని చేసిన తీర్మానంలో మద్రాసు ఉత్తరభాగం ఆంధ్రులది అన్నాడు.

అదే సంవత్సరంలో మద్రాసు శాసనసభలో పిల్లలమర్రి ఆంజనేయులు ఆంధ్రరాష్ట్ర తీర్మానం ప్రతిపాదించినాడు. ఆనాటి ఉపన్యాసంలో: "నేను ఏ స్థానంనించి మాట్లాడుతున్నానో, ఆ ప్రదేశం ఒకనాడు ఒక తెలుగు ప్రభువు ఈస్టిండియా కంపెనీకి దానంచేసిన భూభాగం" అన్నాడు.

1932 లో మద్రాసులో జరిగిన ప్రత్యేక ఆంధ్రమహాసభాధ్యక్ష పీఠంనించి కడప కోటిరెడ్డి మద్రాసే రాజధానిగా వుండాలన్నాడు. ఆహ్వానసంఘాధ్యక్షుడు వేమవరపు రామదాసు కూడా అదే వాదన చేసినాడు. ప్రభల లక్ష్మీనరసింహం మద్రాసు ఆంధ్రతమిళ ఉమ్మడి రాజధానిగా వుండాలని సూచించినాడు.

1936 కాకినాడ ఆంధ్రమహాసభకి అధ్యక్షత వహించి వేమవరపు రామదాసు తన మద్రాసువాదన పునశ్చరణం చేసినాడు.

1937 శ్రీబాగ్ వొడంబడికలో మద్రాసు ప్రస్తావన వున్నది.

అంతకుమినహా మద్రాసు విషయమై చరిత్రమీద ఆధారమేగాని వాస్తవిక విషయాలమీద కాదు. గణాంక విషయాలు వీరు సేకరించలేదు.

1926 లో శంకరన్ నాయరు అన్నాడు. మద్రాసు అరవలికీ తెలుగులికీ కూడా అనుకూలంకాదని. రెండు ప్రాంతాలకీ చివరనే వున్నదన్నాడు. తమిళ రాష్ట్రానికి దక్షిణనగరం ఒకటి, ఆంధ్రరాష్ట్రానికి ఆంధ్ర భూభాగంలో నగరం ఒకటీ కేంద్రాలుగా వుండాలన్నాడు.

తమిళనాయకుడైన సత్యమూర్తి ఆంధ్రమహాసభ తీర్మానం సవాల్ చేసినాడు. మద్రాసు కార్పొరేషను సరిహద్దులు దక్షిణానికి పెంచినారు. కార్పొరేషను పాఠశాలలో తెలుగు పాఠాలు చెప్పడానికి ఇబ్బందులు పెట్టినారు. తిరుపతిదాకా తమిళనాడేనన్నారు. నెల్లూరు తమిళులదన్నారు. "నెల్లు" అనగా అరవంలో వరి. నెల్లు + వూరు = నెల్లూరు; అందుచేత ఆవూరు మాదేనన్నారు.

తమిళులు తెలివైనవారు. బ్రిటిషువార్ని పోలినవారు. అనవసరంగా తొందర పడరు. తమకు హాని జరగదు అన్నంతకాలం మాట్లాడరు. అందులో రాజాజీ తమిళ మేధస్సు పరిపక్వమైన వ్యక్తి. ఎంతటి వాక్శూరుడో అంతటి కార్యశూరుడు. ఎటువచ్చి ఎటుపోయినా ఆంధ్రరాష్ట్రంగానివస్తే ఆంధ్రులు మద్రాసుమీద పడతారు. ఇది వదలకూడదనుకున్నాడు. అని అరుపులూ కేకలూ వెయ్యలేదు. గవర్నరుకి సలహా ఇచ్చినాడు. మద్రాసు తగాదాలో వుండగా రాష్ట్రవిభజన అపాయకరం; నగరవీథులలో నెత్తురు వరదలు కట్టొచ్చు అన్నాడు. ఆవిధంగానే గవర్నరు ఇండియా కార్యదర్శికి వ్రాసినాడు.

ఈ సంగతి పరమరహస్యం అనుకున్నారు. ఆ సమయంలో లండనులో ఇండియా కార్యదర్శి సలహాదారు ఈడ్పుగంటి రాఘవేంద్రరావు అన్నసంగతి మర్చి పోయినారు. ఆయన స్వయంగా గవర్నరు వ్రాసిన లేఖ చూసినాడు. రాఘవేంద్ర రావు మధ్య రాష్ట్రాలలో నివాసం ఏర్పర్చుకున్న కృష్ణాజిల్లా చౌదరి. అక్కడ న్యాయవాదిగా, కాంగ్రెసు నాయకుడుగా పేరుమోసి, రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఎన్ను కోబడి, ధర్మవిరుద్ధంగా ప్రవర్తించవలసిన అవసరం కలిగినప్పుడు రాజీనామాఇచ్చి తరువాత ఆ రాష్ట్రానికే గవర్నరై, ఇండియా కార్యదర్శికి సలహాదారుగా పని చేసినాడు. రెండవ ప్రపంచ సంగ్రామకాలంలో గవర్నరు జనరలు కౌన్సిలులో సభ్యుడుగా ఢిల్లీలో వున్నాడు. ఈ చిదంబర రహస్యం అ సమయంలో ఆయన ప్రకాశానికి అందజేసినాడు. విశాఖపట్నం ఆంధ్ర మహాసభలో ప్రకాశం చిందులు తొక్కినాడు. రాజాజీ ముఖ్యమంత్రిగా గవర్నరుకి సలహా ఇచ్చినప్పుడు ప్రకాశం రెవెన్యూమంత్రి. గోపాలరెడ్డి స్థానిక పరిపాలనామంత్రి. కాని అప్పట్లో వారికా విషయం తెలియదు. ఇదో పెద్ద రభసఅయి గాంధీదాకావెళ్ళి, ఆయన రాధాకృష్ణకి వుత్తరం వ్రాసి అన్నీ జరిగినవి. కాని అప్పట్లో రహస్యం ఎవరు బయటపెట్టినదీ అందరికీ తెలియదు. అటుతరువాత ఏదో విషవ్యాధివల్ల రాఘవేంద్రరావు మరణించి నాడు.

గవర్నరు వుత్తరం లండను వెళ్ళిన కొద్దిరోజులికే సెప్టెంబరు 3, 1939 బ్రిటను జర్మనీమీద యుద్ధం ప్రకటించినది. మాతో చెప్పకుండా ఇండియాని యుద్ధంలో దింపినారని గాంధీ సలహామీద కాంగ్రెసు అధికారంలోంచి తప్పుకుని క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభించినది. యుద్ధసమయంలో ఆంధ్రరాష్ట్రం ఏమిటన్నాడు ఇండియా కార్యదర్శి. తాత్కాలికంగా రాష్ట్రకథ కంచికి వెళ్ళినది.

ఇది జరిగినతర్వాతో, మరి ఎప్పుడో ఆంధ్రరాష్ట్ర విషయంలో కాంగ్రెసు కొంతకాలం పని చెయ్యకూడదని ఒక ఆంక్ష వచ్చినది. 1941, డిసెంబరు 21 తారీఖున సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ ఈ ఆంక్ష తొలిగించవలసిన దని ఒక తీర్మానం చేసినది.

ఆ సంవత్సరాంతంలోనే సర్ విజయానంద గజపతి ఆంధ్రమహాసభ అధ్యక్షు డైనాడు. విజయా విజయనగరం మహారాజకుమారుడు. వారణాసిలోవున్న వారి

సంస్థానం చూస్తూ వుండేవాడు. గొప్ప క్రికెటు ఆటగాడు, పోషకుడు. ఢిల్లీలో విల్లింగ్డను క్రికెట్టుక్లబ్బు, అక్కడి క్రికెట్టు మైదానం. ఆయన దానమే. ఉత్తర దేశంలో వుంటూవచ్చినా, ఆంధ్ర దేశభక్తుడు. ఉత్తరప్రదేశంలో శాసనసభ్యుడు.

1941 డిసెంబరులోనే విజ్జీ మద్రాసు గవర్నర్ని సందర్శించి ఆంధ్ర జిల్లాలు ఆదాయ వ్యయాలు విభజించి పరిపాలనచేస్తే బాగుంటుందని సలహా ఇచ్చినాడు. ఏదిచెయ్యడానికీ రాయలసీమవారి అభ్యంతరంవున్నదన్నాడు గవర్నరు. 1942 లో ఆంధ్రమహాసభ నాయకులు రాయలసీమలో సంచారం చేసినారు. తుంగభద్ర ప్రాజెక్టు వచ్చేటట్టయితే రాయలసీమకి రాష్ట్రం విషయంలో తగాదా లేదని నాయకులు చెప్పినారు.

అది యుద్ధసమయం. ప్రభుత్వం చాలా కఠినంగా వున్నది. ఆంధ్రమహాసభ రాజమండ్రీలో జరగవలసివున్నది. అనుమానాలు పోవడానికి చట్టబద్ధమైన మార్గాలలోనే వ్యవహరిస్తామని మహాసభ కార్యనిర్వాహకవర్గం హామీ ఇచ్చినది. అయినా ఆ సభ జరగరాదని ఉత్తరువు జారీ అయినది. కార్యనిర్వాహకం చేస్తున్న గుమ్మడిదల వెంకటసుబ్బారావు రాజీనామా ఇచ్చినాడు. ఆంధ్రమహాసభ చీలినది. రెండు కార్యనిర్వాహక సంఘాలు తయారైనవి. ఇంతలో రాయలసీమలో మళ్ళీ కరువు వచ్చినది. సహాయంకోసం నిధి వసూలు చేసినారు. అన్ని నిధులకీ పట్టే అగచాట్లే ఈ నిధికికూడా పట్టినవి.

సర్ విజయా అందర్నీ కూడ గట్టుకొచ్చినాడు. 1943 అక్టోబరులో మహాసభ బళ్లారిలో విజయా అధ్యక్షతకింద సమావేశమై, ఆంధ్ర రాష్ట్రానికి మద్రాసు రాజధానిగావుండాలని తీర్మానం చేసినది.

విజయా అధ్యక్షుడుగావుండి, చేతిడబ్బు ఎంతో ఖర్చుచేసి రాష్ట్ర ఆందోళన, దానికి ప్రచారం సాగించినాడు. 1945లో ఇంగ్లండునించి పార్లమెంటరీ డెలిగేషను వచ్చినప్పుడూ, బ్రిటిష్ కేబినెట్ మిషను వచ్చినప్పుడూ ఆంధ్రరాష్ట్రం విషయమై నివేదికలు సమర్పించినాడు. అప్పుడు గుళ్లపల్లి పున్నయ్యశాస్త్రి కార్యదర్శి. కారణాంతరాలవల్ల విజయా రాజీనామా ఇవ్వగా నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహరావు అధ్యక్షుడై పని జరిపినాడు. ఆయనా చిరకాలం వుండ లేదు.

1946లో దేశమంతా ఎన్నికలు జరిగినవి. మద్రాసులో కాంగ్రెసు మళ్లీ ప్రభుత్వంలోకి వచ్చినది. ప్రకాశం ముఖ్యమంత్రి. డాక్టరు సుబ్బరాయన్ న్యాయ శాఖామంత్రి. సుబ్బరాయన్ ప్రతిపాదనమీద 1947 ఏప్రిల్ 18న భాషా ప్రయుక్త రాష్ట్రానికి సంబంధించిన తీర్మానం ఒకటి రెండు శాసనసభలూ ఏకగ్రీవంగా ఆమోదించినవి. స్వరాజ్యం వచ్చిన తర్వాత భారతరాజ్యాంగం తయారుచేసే సమయంలో దేశాన్ని భాషారాష్ట్రాలుగా విభజించి పరిపాలించాలనీ, ముఖ్యంగా ఆంధ్ర, తమిళ, కర్నాటక, కేరళరాష్ట్రాలు ఏర్పాటు చెయ్యాలనీ కేంద్రప్రభుత్వాన్ని కోరడమైనది. ఆ తీర్మానం మంత్రివర్గం ఆమోదించి రాజ్యాంగ నిర్ణయసభకి పంపినది. రాజ్యాంగ నిర్ణయసభ డిసెంబరు 9 వ తేదీని ఢిల్లీలో సమావేశం కానున్నది.

# పట్టాభి ప్రయత్నం

**1946** సెప్టెంబరులో ఢిల్లీలో కాంగ్రెసు తరఫున జవహరిలాల్ నెహ్రూ జాతీయ ప్రభుత్వం ఏర్పాటు చేసినాడు. అప్పటికి కాంగ్రెసు అధిష్టానవర్గం వైఖరి మారినది. అదివరదాకా ఆంధ్రరాష్ట్రానికి అనుకూలంగావున్నవారు వ్యతిరేకులైనారు. భాషారాష్ట్రసిద్ధాంతమైతే అంగీకరించినారుగాని రాష్ట్రాల నిర్మాణానికి ప్రతికూలురైనారు. ఈ పరిస్థితితులలో పట్టాభి ఒక ఎత్తుఎత్తినాడు. ఒక్క ఆంధ్రరాష్ట్రం అంటోకూచుంటే లాభంలేదు ఇది జాతీయ సమస్యగా అలజడి చెయ్యాలని సంల్పించినాడు. స్వదేశసంస్థానాల కాంగ్రెసుకి అధ్యక్షుడైన ఆయనకి సంస్థానాలలో వున్న భాషారాష్ట్రవాదులు కూడా తెలుసును. మొత్తం దేశంమీద భాషారాష్ట్రవాదు లందర్నీ ఏకంజేసి అఖిల భారత భాషారాష్ట్ర ప్రతినిధుల మహాసభ ఒకటి ఏర్పాటుచేసి, ఈ సంస్థకి ప్రాంతీయ సంఘాలుకూడా నిర్మాణంచేసినాడు. ఈ జాతీయ మహాసభ ఢిల్లీలో, రేపటి రోజున రాజ్యాంగ నిర్ణయ మహాసభ సమావేశం అవుతుందనగా 1946 డిసెంబరు 8 వ తారీఖున జరిగినది. పట్టాభి అధ్యక్షత వహించినాడు. కొత్తరాజ్యాంగంలో భాషా ప్రయుక్తరాష్ట్ర నిర్మాణం అవసరం అని తీర్మానించినారు..

ఆంధ్రమహాసభ ప్రాంతీయప్రయత్నం జాతీయమై, ఈ సభజరిగి, భాషారాష్ట్ర నిర్మాణసిద్ధాంత ఆచార్యుడుగా పట్టాభిని రాజ్యాంగ నిర్మాణసభలో నిలబెట్టినది.

రాజ్యాంగ పరిషత్తుకి ఒక కాంగ్రెసు సలహా సంఘం ఉన్నది. ఆ సంఘంలో భాషారాష్ట్రాల విషయమై పటేలుకీ పట్టాభికీ తీవ్రమైన సంఘర్షణ జరిగినది. చివరికి పటేలు నెహ్రూప్రభృతులు సభలోంచి వెళ్లి పోవలసి వచ్చినది. పట్టాభిమాత్రం సహేతుకంగా వాదించి, పూర్వవాగ్దానాలు జ్ఞాపకంచేసి రాజ్యాంగంలో ఈ రాష్ట్రాలు

పేర్కొనమని, వెంటనే నిర్మాణం చెయ్యమని తాను అడగడంలేదని, మూడు మూడు సంవత్సరాలనించి ఆంధ్రమహాసభ ఆంధ్రరాష్ట్రంకోసం అలజడి చేస్తోంటే, అన్నీ సిద్ధంగావున్నా, పెద్దలంతా మాటతప్పిపోతున్నారనీ ఘట్టిగా పట్టుపట్టినాడు. ఈ విషయం బ్రిటిషువారు చేసిన 1935 ఇండియాచట్టంలో వున్నదే, కొత్త దేమీ కాదన్నాడు.

1947 జనవరి 23 న రాజ్యాంగ పరిషత్తులో భాషారాష్ట్రతీర్మానం ప్రవేశ పెట్టినారు. సారధ్యసంఘానికి పంపవలసినదని వాయిదా వేసినారు. అక్కడ అనంతశయనం, దుర్గాబాయి ప్రయత్నించగా పటేల్ వార్ని లెఖ్ఖచెయ్యలేదు. ఆరోజు మొదలు పట్టాభి కంకణం కట్టుకుని పటేల్నీ అతని వాదన సమర్థించే వార్నీ ఎదుర్కొని రాజ్యాంగ పరిషత్తులో పదేపదే ఈ సమస్య లేవనెత్తినాడు. చివరికి వాళ్లమండి ఒక ఉప సంఘం ఏర్పాటుచేసి, అందులో సభ్యులు ఎవరు వుండాలో నువ్వే నిర్ణయించుకోమన్నారు. వాళ్లకి ఈయన ఇంట్లో పోరు తప్పినది. ఈయనకి ఒక అవకాశం లభించినది. పన్నెండుగురు సభ్యులతో అనుకూలురూ, వ్యతిరేకులూ కలిపి ఉపసంఘం నిర్మాణంచేసి పని ప్రారంభించినాడు. డాక్టరు అంబేద్కర్, మున్షీ, ఖరే, గోపాలస్వామి అయ్యంగారు ఈ సంఘంలో సభ్యులు. చివరికి పట్టాభి సిద్ధాంతం అంగీకరించి భాషాప్రయుక్త రాష్ట్రాలకి అనుకూలంగా ఉపసంఘం తీర్మానం చేసినది.

1947 ఏప్రిల్‌లో ఆంధ్ర మహాసభ గుంటూరులో సమావేశమైనది. వుయ్యూరు కుమారరాజా అధ్యక్షత వహించినాడు. ఆంధ్రరాష్ట్రం వెంటనే రాక పోతే రాజ్యాంగ పరిషత్తులో ఆంధ్రసభ్యులు రాజీనామా ఇవ్వాలనీ, ఆందోళన చెయ్యాలనీ తీర్మానించినది.

1947 ఆగస్టు 15 వ తేదీని స్వరాజ్య ప్రదానం జరిగినది. రాజ్యాంగ పరిషత్తు పార్లమెంటుగా కూడా పని చెయ్యగలదని ప్రకటన జరిగినది. ఆగస్టు 19 నించి పార్లమెంటు సమావేశం ప్రారంభమైనది. సెప్టెంబరులో కాంగ్రెసుపార్టీలో పట్టాభి ఉపసంఘం తీర్మానం చర్చకి వచ్చినదిగాని, ఆ తీర్మానికి గందరగోళంగా 28 సవరణలు వచ్చినవి. అప్పుడు నెహ్రూ ఇవన్నీ ప్రస్తుతం కష్టం, స్వదేశ సంస్థానాలూ, పాతరాష్ట్రాలూ వెంటనే ఏకంచెయ్యడం దుర్లభం, మద్రాసురాష్ట్రంలో వున్న 11 తెలుగుజిల్లాలుమాత్రం ప్రత్యేకాంధ్ర రాష్ట్రంగా విభజించవచ్చునని ప్రకటించి నాడు. ఈ ప్రకటనతో కన్నడిగులు ఉగ్రులై ఆంధ్రరాష్ట్రంముందు వస్తే రక్త పాతం తప్పదని ఆందోళన చేసినారు. ఇతర భాషాప్రాంతాలవారు కూడా ఇదే ధోరణి అవలంబించినారు. ఈగొడవ తట్టుకోడానికి కేంద్రప్రభుత్వం థార్ కమిషన్ నియమించినది. ముఖ్యంగా ఆంధ్రరాష్ట్ర విషయం విచారించి నివేదిక సమర్పించ వలసినదిగా ఈ కమీషన్ని ఆదేశించినారు.

థార్‌కమీషను మద్రాసు వచ్చినప్పుడు ఆంధ్రమహాసభ అధ్యక్షుడు ఉయ్యూరు కుమారరాజా. కాశేశ్వరరావు సహాయంతో ఆంధ్రరాష్ట్రం విషయం ఒక మెమొరాండం తయారుచేయించినాడు. కుమారరాజా, కాశేశ్వరరావు, హరిసర్వోత్తమరావు, పున్నయ్యశాస్త్రి కలిసి ఈ మెమొరాండం థార్‌కమిషనుకి అందజేసినారు. కమీషనుకి ప్రకాశంకూడా ఒక మెమొరాండం అందించినాడు. అందులో మద్రాసునగరం పుట్టుపూర్వోత్తరాలు ఉటంకించి ఆ నగరం ఆంధ్రులిదేననే అంశం నిరూపించినాడు.

అప్పటికే రాయలసీమ వ్యవహారాలు చూడడానికీ, ఆ జిల్లాల అభివృద్ధి కోసం ప్రయత్నించడానికీ రాయలసీమ మహాసభ ఏర్పడి వున్నది. అప్పుడా సభకి అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డి. తన సభ తరఫుని సంజీవరెడ్డికూడా ఒక నివేదిక థార్‌కమీషనుకి సమర్పించినాడు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడితే రాయలసీమకి పరిరక్షణలు కావాలని కోరినాడు.

థార్‌కమీషను ఆంధ్రరాష్ట్రానికి వ్యతిరేకంగానూ, - ఇతరభాషా రాష్ట్రాలకి అననుకూలంగానూ రిపోర్టుచేసినది. భాషారాష్ట్ర సిద్ధాంతమే పనికిరాదన్నది. ఈ రిపోర్టు రావడం ఏమిటి, జయపూర్లో కాంగ్రెసు మహాసభ జరగడం ఏమిటి? కాంగ్రెసు అధ్యక్షుడు పట్టాభి. తన అధ్యక్ష ఉపన్యాసంలో థార్‌కమిషను రిపోర్టును చీల్చి చెండాడినాడు. కాంగ్రెసు సిద్ధాంతాలకి, వాగ్దానాలకి ఇది వ్యతిరేకం అన్నాడు. కాంగ్రెసు సంస్థలోనే అలజడి ప్రారంభం అయినది. అప్పుడు కాంగ్రెసు తరఫునే ఒక ఉపసంఘం నియమించినారు. అందులో జవహరిలాల్, వల్లభాయ్, పట్టాభి సభ్యులు. దీన్నే జే. వి. పి. కమిటీ అన్నారు. 1949 ఏప్రిలులో ఈ కమిటీ రిపోర్టు ప్రకటించినారు. "కొన్ని సంవత్సరాలవరకూ భాషారాష్ట్ర నిర్మాణం వాయిదా వెయ్యాలి. కాని ఆంధ్రరాష్ట్ర నిర్మాణం అవసరం. అయితే ఆంధ్రులు మద్రాసునగరం వొదులుకోవాలి" అని జే. వి. పి. రిపోర్టు సారాంశం.

తరవాత నవంబరు నెలలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ విజయవాడలో సమావేశమై ఈ సిఫారసు ఆమోదించినది. తాత్కాలికంగానైనా ఆంధ్రులకి మద్రాసు రాజధానిగా వుండనివ్వాలనీ, మద్రాసు ఛీఫ్‌కమీషనరు పరిపాలనలో వుండాలనీ కోరినది.

కాంగ్రెసుకార్యవర్గం జే. వి. పి. రిపోర్టు ఆంధ్రరాష్ట్రం సిఫారసువరకు అంగీకరించినది. కేంద్ర ప్రభుత్వం ఈ తీర్మానం అంగీకరించి 1950 జనవరి 26 కి ఆంధ్రరాష్ట్రనిర్మాణం సాధ్యమవుతుందేమో తగినచర్యలు తీసుకోమని మద్రాసు ప్రభుత్వాన్ని కోరినది. ఆ ప్రభుత్వం ఒక ఉపసంఘం ఏర్పాటు చేసినది. అందులో

భక్తవత్సలం, కుమారస్వామిరాజా, టి. టి. కృష్ణమాచారి, మాధవమీనన్, ప్రకాశం, కళా వెంకట్రావు, బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డి సభ్యులు.

లెఖ్ఖలన్నీ తయారు చేసినారు. రాష్ట్ర నిర్మాణం జరగడానికి అన్నీ అనుకూలంగానే వున్నాయి. కాని ప్రకాశం రాజధాని మద్రాసులోనే వుండాలన్నాడు. కోటిరూపాయల ముజరా చాలదన్నాడు. విద్యుచ్ఛక్తి అభివృద్ధికి 20 కోట్లు కావాలన్నాడు. 1950 జనవరి 4 న మద్రాసులో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ సమావేశమై శాశ్వతరాజధాని రాయలసీమలో వుండాలని తీర్మానించినది. తాత్కాలిక రాజధాని మద్రాసులో వుండడానికి తమిళులు ఎంతమాత్రమూ వొప్పుకోలేదు.

1951 జనవరి రాష్ట్ర సమస్యకి స్వస్తి చెబుతూ కేంద్రం ఒక ప్రకటన జారీ చేసినది. ఆంధ్రరాష్ట్రం మళ్ళీ వెనక్కిపోయినది.

ఆంధ్రరాష్ట్రం వెనక్కివెళ్ళినా, ప్రజాహృదయాలలో ఆంధ్రదేశం వైశాల్యం పెరిగినది. ఇంతవరకూ మద్రాసులోవున్న తెలుగుజిల్లాలు మాత్రం విడదియ్య వలెననీ, అవే ఆంధ్రరాష్ట్రంగా వుండాలనీ కోరుతూ వచ్చినారు. ఈ కోరిక తీరడంకోసం చర్యలు తీసుకోడానికే ఆంధ్రమహాసభ అవతరించినది. ప్రజల మనసులలో ఆ పరిధి దాటిపోయినది. ఈ కొత్తకోరిక సాధించడంకోసం విశాలాంధ్ర మహాసభ ఏర్పడినది. ఈ సభ స్థాపించినవాడు అయ్యదేవర కాళేశ్వర రావు. 48, 50, 52 సంవత్సారాలలో సమావేశాలు జరిపినది.

ఈ సంస్థ అవతరించడానికి ముఖ్యకారణం హైద్రాబాదు పోలీసుచర్య. ఎప్పుడైతే నిజాం ప్రభుత్వం పోయినదో ఆంధ్రదేశ ఏకీకరణకి పెద్ద ఆటంకం పోయినది. కొమర్రాజు లక్ష్మణరావుకాలంనించీ ఆంధ్ర తెలంగాణాలమధ్య సేతువుగా వుంటూవచ్చిన కాళేశ్వరరావు కొందరు మిత్రులతో కలిసి ఈ సంస్థ 1949 నవంబరు 26న స్థాపించినాడు. అంతకుముందే కమ్యూనిస్టుపార్టీ విశాలాంధ్ర నినాదం లేవదీసినది. నిజాం రాజ్యం విభజించి ఏభాషాభాగాలు ఆయావాటితోకలిపి విశాలాంధ్ర, సంయుక్త మహారాష్ట్ర, సంయుక్త కర్నాటక ఐక్య కేరళ ఏర్పాటు చెయ్యవలెనన్న ప్రథమ ప్రతిపాదన కమ్యూనిస్టుపార్టీవారు చేసినదే. 1946 లోనే పుచ్చలపల్లి సుందరయ్య విశాలాంధ్ర ప్రజారాజ్యం అనే పథకం ప్రచురించినాడు.

ఈ కారణాలచేత, విశాలాంధ్రరావడం తథ్యమనీ, ఆంధ్రులరాజధాని తప్పకుండా హైద్రాబాదు అవుతుందనే నమ్మకం అందరికీ కలిగినది. అదే నాయకులంతా తాత్కాలిక రాజధాని మద్రాసు అనడంలో వున్నరహస్యం. హైద్రాబాదు శాశ్వత రాజధానిగా వుండాలని ప్రతిపాదనచేసినవాడు కూడా కాళేశ్వరరావే. 1950 ఆరంభంలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు మహాసభ మద్రాసులో కలిసినది. ఆచార్య

రంగా అధ్యక్షుడు. అప్పుడు కాశేశ్వరరావు ప్రతిపాదనమీద తాత్కాలిక రాజధాని మద్రాసులోనూ, శాశ్వత రాజధాని హైద్రాబాదులోనూ వుండాలని తీర్మానం ఆమోదించబడినది.

తనకిదూరసందులేదు, మెడకో డోలన్నట్టు ఆంధ్రరాష్ట్రమే అంతంతగావుంటే ఈ విశాలాంధ్ర ఏమిటీ అనిపిస్తుంది. నిర్వివాదప్రాంతాలకే వొప్పుకుని, మద్రాసు విడిచిపెడితే ఆంధ్రరాష్ట్రం అప్పుడే వచ్చేది. ఆలస్యంచేసి వీరు సాధించినదిలేదు. నాయకులలో ఐకమత్యంలేదు. 1951 లోనే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షుడుగా నీలం సంజీవరెడ్డి ఎన్నికైనాడు. వెంటనే ప్రకాశం, రంగా కాంగ్రెసులోంచి బైటికిపోయి చెరోకొత్తపార్టీ స్థాపించినారు. ప్రకాశం పెట్టినది కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీ, రంగా పెట్టినది కృషికర్‌లోకపార్టీ. ఈ విభేదాలతోనే 1952 ఎన్నికల పోటీలలో దిగినారు. కాంగ్రెసు తీవ్రపరాజయం పొందినది. హేమాహేమీలు పోయినారు. కమ్యూనిస్టుపార్టీ అఖండవిజయం సాధించినది. ఈ విధంగా మద్రాసు శాసనసభలో ఆంధ్రులు అనేకపార్టీలుగా చీలివున్నారు.

కాంగ్రెసు ఈ ఛిన్నాభిన్నం పరిస్థితులలో వుండగా ఆంధ్రమహాసభ 1952 జులై 27న ఒక అఖిలపక్ష ఆంధ్రశాసన సభ్యుల సమావేశం జరిపినది. ఈ సభకి కాంగ్రెసువారు హాజరు కాకూడదని, రాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షుడు, నీలం సంజీవరెడ్డి ఫర్మానా జారీ చేసినాడు. ప్రకాశంపార్టీ కూడా ఈ సభకి రాలేదు. కమ్యూనిస్టుపార్టీ సభ్యులందరూ మాత్రం వచ్చినారు. కాంగ్రెసువారు కొందరు మద్రాసులేని రాష్ట్రం వొద్దని వూరేగింపులు జరిపినారు. రాయలసీమ శాసనసభ్యులు కొందరు రాష్ట్రం వాయిదా వెయ్యమని ప్రధానమంత్రికి ఉత్తరాలు వ్రాసినారు. వీరికి సంజీవరెడ్డి ప్రోద్బలం వున్నదని అనుకునేవారు.

ఈ కప్పలతక్కెడతో ఆంధ్రరాష్ట్రసాధన ఆరోజుకారోజు దూరమైపోతున్నది. ఆంధ్రులు నగుబాటుపాలు అవుతున్నారు. 1952 ఆగష్టు 15న స్వామి సీతారాం (గొల్లపూడి సీతారామశాస్త్రి) నిరశనవ్రతం ప్రారంభించినాడు. ఐకమత్యం సాధించి, ఆంధ్రరాష్ట్రం సిద్ధించేటట్టు చెయ్యాలని ఆయన ఉద్దేశం. గుంటూరులో టవునుహాలులో జరిగిన ఈ ఉపవాసదీక్షలో నేతి చలపతి, మద్దులేటి బసవయ్య దంపతులు కూడా పాల్గొన్నారు. 36 రోజులు జరిగిన ఈ దీక్షవల్ల ఏమీ ప్రయోజనం లేకపోయినది. కొంత అలజడి మాత్రం జరిగినది. విద్యార్థులు అల్లరి చేసినారు. సత్యాగ్రహం అనే పేరుతో రైళ్ళలో టిక్కెట్టులేకుండా ప్రయాణాలు చెయ్యడం, మద్రాసు ప్రభుత్వ కార్యాలయం ముందు నిరశనవ్రతం చెయ్యడం, ఆఫీసులముందు పికెటింగు చెయ్యడం మొదలైనవి. ఒక్కవిషయం ఏమంటే అంతా తెలుగులోనే మాట్లాడుకోవాలి, శాసనసభల్లో తెలుగులోమాట్లాడాలి అనే

ఉద్యమం బయలుదేరినది. ఈ ఉద్యమానికి కమ్యూనిస్టుపార్టీ చాలా ప్రోత్సాహం ఇచ్చినది.

ఇంతలో ఒక అనందర్భపు ప్రోజెక్టు రచ్చకెక్కినది. మద్రాసులో ఎప్పుడూ నీటి కొరత. అది శాశ్వతసమస్య. చిరకాలంనించి తమిళులదృష్టి పుష్కలంగా వుండే కృష్ణాగోదావరీ నదులమీద వున్నది. అప్పుడు కృష్ణనీరు పెన్నలోకలిపి, ఆ నీరు నగరానికి తీసుకెళ్ళాలని వో పథకం తయారు చేసినారు. దాన్నే కృష్ణా–పెన్నారు ప్రాజెక్టు అన్నారు. ఈ పథకం ప్రథమ పంచవర్ష ప్రణాళికలో చేర్చడానికి రాజాజీ ప్రయత్నించినాడు. యావదాంధ్రదేశంలోనూ ఆందోళన బయలుదేరినది. కృష్ణాజలాలు ఒకవేపు తెలంగాణాకి, మరోవేపు రాయలసీమకి అత్యవసరం. దీనికి మార్గం నాగార్జునసాగరం. అప్పటికి నందికొండ ప్రాజెక్టు అనేవారు. వెనక రామస్వామి అయ్యరు పులిచింతల ప్రాజెక్టు సున్నాచుట్టి మెట్టూరు డాం కట్టించు కున్నాడు. ఇప్పుడీయన నందికొండ తప్పించాలని చూస్తున్నాడని ఆందోళన చెలరేగినది. తెలుగునదులనీళ్ళు, తెలుగువారి అవసరాలు తీరకుండా ఒక్క బొట్టు కూడా బైటికి వెళ్ళడానికి వీలులేదని ఏకకంఠంగా నినాదం బయలుదేరినది. ఏదో ఒక జాతీయ అపాయం వస్తేగాని జాతి ఏకంకాదు. ఈ అపాయంతో ఆంధ్రజాతి కలిసినది. రాష్ట్రంవుంటే ఈ అపాయంవుండేది కాదుకదా అనిపించినది. ఈ ప్రయత్నం ఎక్కువగా కమ్యూనిస్టుపార్టీది. ప్రజలు కలిసినారుగాని నాయకులు ఆంధ్రరాష్ట్ర విషయంలో కలవలేదు.



# పొట్టి శ్రీరాములు

ఆంధ్రుల దురవస్థ చూసి తీవ్రంగా ఒక అపూర్వవ్యక్తి విచారిస్తున్నాడు. ఆయనపేరు పొట్టి శ్రీరాములు. ఆర్యవైశ్యుడు, పరమదేశభక్తుడు మహాత్ముడి ప్రత్యక్ష శిష్యుడు.

శ్రీరాములు పూర్వులు నెల్లూరుజిల్లా జువ్వలదిన్నె కాపురస్థులు. తల్లిదండ్రులు మద్రాసువచ్చి జీవితం గడుపుతున్నారు. శ్రీరాములు 1901 మార్చి 16న మద్రాసులోనే అన్నపిళ్లవీధిలో జన్మించినాడు. గాంధీఉద్యమం బయలుదేరినప్పుడు కళాశాలలో వున్నాడు. తల్లితండ్రులు బ్రతిమాలగా విద్యకొనసాగించినాడు. బొంబాయివెళ్ళి చదువు పూర్తి చేసినాడు. జి. ఐ. పి. రైల్వేలో ఉద్యోగం దొరికినది; నాలుగు సంవత్సరాలు చేసినాడు ఇంతలో భార్య పోయినది; వైరాగ్యం ప్రవేశించినది.

శ్రీరాములికి పురాణాలూ, తాగ్యరాజకీర్తనలూ వేమనపద్యాలు, పోతులూరి వీరబ్రహ్మం, సిద్దయ్యగార్ల తత్వాలూ అంటే చాలాఇష్టం. ఆంధ్రదేశచరిత్ర అభిమానవిషయం. ప్రపంచ చరిత్రకూడా చదవినాడు. అమెరికానాయకుడు అబ్రహాం లింకన్ అభిమానపురుషుడు. విజ్ఞానశాస్త్రజ్ఞులలో ఐసెక్ న్యూటన్, ఇంగ్లీషు రచయితలలో బర్నార్డుషా అంటే చెవికోసుకునేవాడు.

భార్యావియోగానంతరం వైరాగ్యంలో గాంధీజీ సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళి అక్కడ నివసించినాడు. మహాత్ముడి ప్రియశిష్యులలో ఒకడు. హరిజన సమస్య సందర్భంలో సబర్మతిలో ఉపవాసము చేసినాడు. ఆరోజుల్లో గాంధీజీ శ్రీరాములు విషయం ప్రకాశానికి వ్రాసినాడు. శ్రద్ధానక్తులున్న స్వచ్ఛంద సేవకుడు, తీవ్రమైన దేశభక్తుడు, కొంచెం వాదస్తుడు అని.

శ్రీరాములు జాతీయోద్యమంలో మూడుసార్లు జైలుకి వెళ్ళినాడు. విడుదల అయిన తర్వాత నగరపారిశుద్ధ్యంలో శ్రద్ధ తీసుకునేవాడు. వీధులు శుభ్రం చెయ్యడం, మురుగుకాలువలు బాగుచెయ్యడం, మురికివాడల పారిశుద్ధ్యం అతని కార్యక్రమం. ఖాదీ పరిశ్రమ, మద్యపాననిషేధం, హరిజనాలయ ప్రవేశాల విషయాలలో దీక్ష. పశుసంక్షేమంలో శ్రద్ధ తీసుకునేవాడు. ఒకసారి నెల్లూరులో హరిజనాలయ ప్రవేశసందర్భంలో 29 రోజులు ఉపవాసదీక్ష చేసినాడు. అతడు లోకసేవకుడు. మద్రాసుకాంగ్రెసు నాయకులందరికీ తెలుసు, వైశ్యసంఘం వారికి చేదోడువాదోడుగా వుండేవాడు.

అటువంటి శ్రీరాములు ఆంధ్రరాష్ట్ర సమస్య విషయం ఆలోచించినాడు. ఏమిటీ నాయకులమధ్య విభిన్నాభిప్రాయాలు? ఏమిటీ మద్రాసు ఆంధ్రులికి రాకపోవడం? ఏమిటీ ఆలస్యం? ఈ సమస్యలమీద ప్రజాభిప్రాయం కేంద్రీకరింపచెయ్యడం ఎల్లాగ?

1952 సెప్టెంబరు 15న ఒక స్నేహితుడికి లేఖ వ్రాసినాడు. "ఆంధ్ర రాష్ట్ర సాధనకోసం నేను బలిదానం చెయ్యడానికి నిశ్చయించుకున్నాను. ఎవరికివారే యమునాతీరే అన్నట్టుగా వున్నది. ఎవరి ఆలోచనవారిదే, సరియైన నిష్కామ మార్గంలో ఆలోచిస్తేతప్ప ఒకరి దృక్పథం ఒకరికి అర్థమై ఐకమత్యం చేకూరదు. అధికారంలోవున్నవాళ్ల ఆలోచనలు మార్చడం కష్టం. అది చెయ్యడానికి నాకు ఒకటే మార్గం గోచరిస్తున్నది. నాప్రాణాలు ధారబొయ్యడం. ఈ విషమ పరీక్షలో నేను కృతార్థుణ్ణి అవుతావని నాకు నమ్మకం వున్నది".

ఇదేకాక ఇంకో కాగితంకూడా వ్రాసినాడు. "ఈవేళ, ఆర్థికమంత్రి, సి. సుబ్రహ్మణ్యం భారతిజయంతి ఉత్సవంలో మాట్లాడుతూ మద్రాసునగరం తమిళులదే నన్నాడు. ముఖ్యమంత్రి రాజగోపాలాచారికూడా ఈమాటే అన్నాడు. కేంద్రంలోగాని, రాష్ట్రంలోగాని ఒక్కమంత్రికీ ఈ ప్రవచనాలు ఖండించడానికి ధైర్యంలేదు. ఈ సమస్య నిష్పాక్షికంగా పరిష్కారం చేసేటట్టు నెహ్రూ దృష్టి మళ్ళించాలి. ఈ ప్రయత్నంలో ఎటువంటి మహాత్యాగమైనా చెయ్యవలసివుంటుంది. అధికారంలో వున్నవారు తమ దృక్పథం మార్చుకుంటేతప్ప ఈ తమిళాంధ్ర సమస్య పరిష్కారంకాదు. ఈ సమస్యమీద అందరిదృష్టి కేంద్రీకరించడానికి నేను ఆమరణ ఉపవాసదీక్ష ప్రారంభిస్తున్నాను."

సెప్టెంబరు 30న శ్రీరాములూ, స్వామీసీతారాం కలిసినారు. అప్పుడు శ్రీరాములు సీతారాంతో అన్నాడు. "నా ఉపవాసదీక్ష మద్రాసునగర భవిష్యత్తు నిర్ణయించడానికేను."

శ్రీరాములు ఆత్మార్పణ అక్టోబరు 19వ తారీఖున ప్రారంభమైనది. దీక్ష పాతవూళ్లోనే అయన పుట్టిన వీధిలో ఒకసత్రంలో ప్రారంభం కావలసినది. సత్రం

యజమానులు అంగీకరించలేదు. బులుసు సాంబమూర్తి వచ్చి, మైలాపూరులో తన నివాసానికి తీసుకెళ్లి దానికి 'యజ్ఞశాల' అని నామకరణంచేసి అక్కడ పడుకో బెట్టినాడు.

మొదటివారంరోజులూ ఎవరూ పట్టించుకోలేదు. కాంగ్రెసువారు ఈ దీక్షతో ప్రమేయం పెట్టుకోలేదు. పైగా ఆక్షేపణలు తెలియజేసినది ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కమిటీ. నవంబరుదాటి డిసెంబరు ప్రవేశించినది. ఆంధ్రదేశంలో ప్రజానీకం ఆదుర్దా పడసాగినది. శ్రీరాములు బాధ ప్రతి హృదయంలోనూ బాధగా పరిణమించినది. హర్తాళాలు ప్రారంభించినవి. కేంద్రప్రభుత్వానికి వేనకివేల టెలిగ్రాంలు వెళ్ళినవి. "ఆంధ్రరాష్ట్రం ఇవ్వండి. శ్రీరాములు ప్రాణాలు కాపాడండి" అని. విద్యార్థులు ఒక పట్టుగా పాఠశాలలూ కళాశాలలూ మానేశారు. లక్షమంది విద్యార్థులు ఒక వినతి పత్రం సంతకంచేసి కేంద్రప్రభుత్వానికి పంపించినారు. ఆరోజుకారోజు వేడి ఎక్కువైపోయినది.

డిసెంబరు 7 న అఖిలాంధ్రపరిషత్తు సమావేశం ఏర్పాటైనది. ప్రకాశం అధ్యక్షత వహించినాడు. అధ్యక్షుడే "మద్రాసుతోసహా ఆంధ్రరాష్ట్రం వెంటనే ఇవ్వాలి" అనే తీర్మానం ప్రతిపాదించినాడు. కమ్యునిస్టుపార్టీ వివాదగ్రస్థమైన ప్రాంతాలు ప్రజాభిప్రాయలద్వారాగాని మధ్యవర్తి ద్వారాగాని తేల్చుకోవాలని ఒక తీర్మానం ప్రతిపాదించినది. ఈ సభకికూడా కాంగ్రెసువారు రాలేదు. ప్రకాశం తాను పెట్టిన తీర్మానం నెగ్గిందని ఒకకేకవేసి, తనవారితో కలిసి సభలోంచి వెళ్ళిపోయి నాడు. తక్కినవారు రెండో తీర్మానం ఆమోదించి, ఊరేగింపుతో 'యజ్ఞశాల'కి వెళ్ళి శ్రీరాముల్ని దర్శించి నిరాహారదీక్ష విరమించమని కోరినారు. ఆయన వీరితోమాట్లాడ లేదు. చేత్తో వెళ్ళిపొండి అన్నట్టు సైగచేసినాడు.

రాయలసీమ అధ్యక్షపీఠం నించికూడా సానుభూతి ఏమీరాకపోగా, మాకు ఆంధ్రరాష్ట్రం అవసరంలేదు, మాకు ప్రత్యేకరాష్ట్రం కోరవలసివుంటుంది, అనే కేక వినబడినది. ఆంధ్రప్రదేశకాంగ్రెసు అధ్యక్షుడి హోదాలో "నామటుకు నాకు ఇప్పుడురాష్ట్రం రావాలనిలేదు" అన్నాడు సంజీవరెడ్డి. హైద్రాబాదు శాసనసభ సానుభూతి తీర్మానం ఆమోదించినది. సభ వాయిదాపడినది. ఆంధ్రరాష్ట్రం వెంటనే ఏర్పాటు చెయ్యమని కేంద్రప్రభుత్వాన్ని కోరినది. శ్రీరాముల్ని దీక్ష విరమించమని ప్రార్థించినది.

శ్రీరాములు దీక్ష విరమించలేదు. గాడిచర్ల హరి సర్వోత్తమరావు దగ్గిరజేరి ప్రార్థించినాడు. శ్రీరాములు వినలేదు. దేశంలో అలజడి ఎక్కువ అవుతున్నది. మద్రాసు శాసనసభలోనూ, కేంద్రంలో పార్లమెంటులోనూ, ఉద్రిక్తులైన సభ్యులు ప్రశ్నలపరంపర కురిపిస్తున్నారు.

డిసెంబరు 9న పార్లమెంటులో ప్రధాని ఒక ప్రకటన చేసినాడు. మద్రాసు విడిచిపెట్టి ఆంధ్రరాష్ట్రం కోరితే ఆలోచిస్తామని. అప్పటికి శ్రీరాములు కఠోర దీక్ష ప్రారంభించి 52 రోజులైనది. భీమవరం ప్రకృతి చికిత్సాలయం సంస్థాపకుడు డాక్టరు కృష్ణంరాజు శ్రీరాములు పక్కనే వున్నాడు. దీక్ష విరమించమని కోరినాడు. శ్రీరాములు మాట్లాడలేదు. ముక్కుని వేలు వేసుకున్నాడు. ఇష్టంలేదని సూచించినాడు. తప్పు అని సైగ చేసినాడు.

తర్వాత ఎందరో పత్రికా విలేఖర్లు వచ్చినారు. ప్రధాని ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేస్తానన్నాడు. మీరు ప్రాయోపవేశం విరమించండి అని ప్రాధేయ పడినారు. "మద్రాసునగరంలేని రాష్ట్రం! నేను జీవించడం ఎందుకు? పోవడమే మంచిది" అన్నాడు శ్రీరాములు.

డిసెంబరు 15 సాయంకాలం 3 గంటలకి శ్రీరాములు డాక్టరు కృష్ణంరాజుతో ఏదో మాట్లాడినాడు. కార్యాలయాలనించి ఇళ్లుచేరుకునే వారంతా 'యజ్ఞశాల' దగ్గిర కొచ్చి చూసిపోతున్నారు, డాక్టర్లెంతమందో చుట్టూ మూగినారు. క్షణక్షణం చెయ్యి చూస్తున్నారు. మద్రాసునగరంలో సూర్యుడు అస్తమించినాడు. చీకట్లు కమ్మినవి. రాత్రి 11 గంటల 39నిమిషాలకి పొట్టి శ్రీరాములు అమరత్వం పొందినాడు.

58 రోజుల దీక్ష!

మద్రాసు నగరంతోకూడిన ఆంధ్రరాష్ట్రంకోసం ఆమరణదీక్షపూని, విఫల మనోరథుడై వెళ్ళిపోయినాడు.

శ్రీరాములు ఆత్మబలిలో మహాంధ్రోదయం దర్శించినాడు దాశరథి. తెలంగాణంనించి ఎలుగెత్తి ప్రశ్నించినాడు.

చిమ్మచీకటిలో తూర్పు నెమ్మెమీద
దివ్వెయొక్కటి వెలిగించి, రువ్వినావు
వెలుతురులబాకు నాకాశవీధిలోన
ఎవరవయ్యా ప్రగాఢసాహిత్యమూర్తి?

స్వర్గసీమనించి శ్రీరాములు జవాబు :

నీవెరుగవె శ్రీరాముడ
నేను మానవుడనె లెమ్మ
నిద్రాణాంధ్ర ధరాస్థలి
నేను మేలుకొల్పగలను.

మహాకవికి :

మూడుచెరగులనేలల మూడుకోట్లు
ముడివడినయట్లు కన్నులముందుతోచె;
అందలమునెక్కి యావజ్జనాళిమెచ్చ
సుందరోషస్సువచ్చె వసుంధరకును.

పొట్టిశ్రీరాములన్ని అమరజీవి అన్నారు ఆంధ్రులందరూను. గ్రామగ్రామం లోనూ కాంగ్రెసువారే శ్రీరాములికి శిలావిగ్రహాలు ప్రతిష్ఠించినారు.

శ్రీరాములు ఆత్మార్పణంతో ఆంధ్ర ప్రపంచం అంటుకున్నది. క్రోధాగ్ని ప్రజ్వరిల్లినది. కోస్తా, రాయలసీమ, తెలంగాణా, యావదాంధ్రభూమి, వూరువూరూ, వాడవాడా ఆ పిల్లబాలాదీ ప్రజానీకం అట్టుడికినట్టు వుడికిపోయినది. హర్తాళ్ళు వూరేగింపులు, బహిరంగసభలు. విద్యార్థిలోకంలో ఆగ్రహం, రోషం, ఆవేశం ప్రజ్వరిల్లిపోయినవి. ఎక్కడరైళ్ళు అక్కడ ఆపివేసినారు. వాల్తేరు, నెల్లూరు రైలుస్టేషనులలో పోలీసులు తుపాకులు కాల్చగా కొందరు మరణించినారు. ప్రజానీకంలో ఆ కదలిక నభూతో నభవిష్యతి. ఆంధ్ర దేశానికి సంబంధించినంతవరకు ప్రభుత్వం స్థంభించిపోయినది.



# రాష్ట్రావతరణ

డిసెంబరు 19 న ప్రధాని నెహ్రూ పార్లమెంటు ఉభయ సభలలోనూ శ్రీరాములు నిర్యాణం విషయమై మాట్లాడినాడు. అంతకంటె మహాత్యాగం వుండబోదన్నాడు. 1953 అక్టోబరు 1 నాటికి నిర్వివాద ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్రం నిర్మాణం చేస్తామని ప్రకటించినాడు. 1953 ప్రారంభంలోనే రాజస్థాన్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిసు వాంఛూను ప్రత్యేకరాష్ట్ర నిర్మాణవిషయాలు పరిశీలించమని విచారణకర్తగా నియమించినాడు. ఆయన ఫిబ్రవరిలో మద్రాసు చేరుకున్నాడు. అన్ని పార్టీలవారూ ఆయనకు తమతమ అభిప్రాయాలూ తెలియజేస్తూ సాక్ష్యం ఇచ్చినారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు సంజీవరెడ్డి, వాంఛూ కమిషనుముందు సాక్ష్యం తయారుచెయ్యడానికి ఒక ఉపసంఘం నియమించినాడు. రాష్ట్రకమిటీకి ఇద్దరు ఉపాధ్యక్షుల్ని నియమించినాడు. ఒక ఉపాధ్యక్షుడు కాళేశ్వరరావు, రెండవ వాడు ముళ్ళపూడి పళ్ళంరాజు, ప్రధాన కార్యదర్శి అల్లూరి సత్యనారాయణరాజు. ఉప సంఘంలో సభ్యులు సంజీవరెడ్డి, కాళేశ్వరరావు, బెజవాడ గోపాలరెడ్డి, కళా వెంకట్రావు, టి. ఎన్. వెంకటసుబ్బారెడ్డి, కొత్త రఘురామయ్య.

కాంగ్రెసువారి సాక్ష్యంలో మద్రాసు తాత్కాలిక రాజధానిగా వుండవలెననీ, హైద్రాబాదు కాకపోతే ఏదో ఒకచోట రాజధాని పెట్టుకుంటామనీ నివేదించినారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోంచి 50 కోట్ల రూపాయలు ఆంధ్రకు రావాలి. బళ్ళారి పట్టణం, బళ్ళారి, రూపనగుడి, మోకాఫిర్కాలున్నూ, చెంగల్పట్టు, సేలం, ఉత్తర ఆర్కాడు జిల్లాలలో తెలుగుభాగాలున్నూ ఆంధ్రకు రావాలని కోరినారు. ఒరిస్సా మైసూరు ఆంధ్రభాగాల సంగతి ఎత్తగా. మద్రాసు రాష్ట్రం మినహాయించి ఇతర

ప్రాంతాల సంగతి ఎత్తుకోడానికి తనకి అధికారంలేదనిచెప్పి, ప్రస్తుతం నిర్వివాద ప్రాంతాలు తీసుకుని, తర్వాత సరిహద్దు సంఘం వేసుకుంటే కాలయాపనజరక్కుండా రాష్ట్రం వస్తుందని వాంఛూ సలహాఇచ్చినాడు.

ప్రకాశం పార్టీ సాక్ష్యంలో మద్రాసు తాత్కాలిక రాజధానిగా వుండాలనీ, ఆ నగరం ఎవరికీ చెందకుండా ఛీఫ్ కమీషనరు రాష్ట్రంగా వుండాలనీ చెప్పినది.

రంగాపార్టీ శాశ్వత రాజధాని తిరుపతిలో వుండాలన్నది. మద్రాసు తాత్కాలిక రాజధానిగా వుండాలన్నది.

కమ్యూనిస్టుపార్టీ శాశ్వతరాజధాని విజయవాడ గుంటూరు నగరాలమధ్య వుండాలన్నది.

వాంఛూ తననివేదికలో మద్రాసు తాత్కాలిక రాజధానిగా వుండడం మంచిదే నన్నాడు. మద్రాసు ప్రభుత్వం ఆంధ్రరాష్ట్రానికి రెండుకోట్ల రూపాయలు మాత్రమే ఇవ్వాలని తేల్చినాడు.

ఈ పరిస్థితులలో కాంగ్రెసు నాయకులు చచ్చినవాడి పెళ్ళికి వొచ్చిందేకూడని వచ్చినమట్టుకు రాబట్టుకోడానికి నిశ్చయించుకుని, రాజధాని విషయమై మళ్ళీ రగడ ప్రారంభించినారు.

1953 మార్చి 25 న ప్రధాని ఒకప్రకటన చేసినాడు. "అక్టోబరు 1న ఆంధ్ర రాష్ట్రం ఏర్పడుతుంది. రాజధాని ఆంధ్ర ప్రాంతంలో ఎక్కడ వుండాలా అన్న విషయం ఆంధ్ర శాసనసభ్యులే నిర్ణయించుకోవాలి. మద్రాసు ప్రసక్తిలేదు."

1953 జూన్ 5 న శాసనసభ్యుల ప్రత్యేక సమావేశం జరిగినది. శ్రీబాగ్ ఒడంబడిక ప్రకారం రాయలసీమవారు రాజధాని వారి ప్రాంతంలోనే వుండాలన్నారు. బళ్ళారి పోనేపోయినది. చిత్తూరు ప్రసక్తిలేదు. ఇంక మిగిలినవి అనంతపురం, కడప, కర్నూలు. ఆంధ్రుల ఇలవేల్పు శ్రీ వేంకటేశ్వరస్వామి తిరుమల, తిరుపతులతోసహా తెలుగువారికే దక్కినాడు. కడపలో మంచినీళ్ళుకూడా దొరకవన్నారు కొందరు. మిగిలినవి అనంతపురం, కర్నూలు, తిరుపతి. ఈ మూడు ఆంధ్రమహా నగరాలలోనూ ఏది కురువృద్ధుడు ప్రకాశానికి నచ్చితే ఆ వూరు రాజధాని చేసుకుందా మనుకున్నారు. ఆయన కర్నూలు పసందుచేసినాడు. అదే ఆంధ్ర రాష్ట్రానికి తాత్కాలిక రాజధాని.

తెలుగుదేశం పటంచూస్తే కేంద్రంగా శ్రీశైలం గోచరిస్తుంది. స్మార్తుల సంకల్పంలో కోస్తాజిల్లాలవారు "శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే" అని చెప్పుకుంటారు. తాను వున్నస్థలం శ్రీశైలపరంగా నిర్ణయించుకోవలసిన అవసరం ఆంధ్రచరిత్రలో ఏ మత, రాజకీయ విప్లవ కాలంలో కలిగినదో చెప్పడానికి ఆధారాలులేవు. శ్రీశైలం

ఒకనాడు ఆంధ్ర సంస్కృతికీ, మత ప్రభావానికీ, సంక్షేమానికీ నిలబడిన ఒకసహజ దుర్గం. ఆ దృక్పథంతో చూస్తే కర్నూలు రాజధాని కావడంలో వింతలేదు. యావదాంధ్ర ప్రదేశానికీ ఒక విధంగా కేంద్రం కర్నూలే. ఆనాటి నాయకుల దృష్టి విశాలాంధ్ర అవతరణమీదనే లగ్నమైనది. కర్నూలు ఒకమజిలీ మాత్రం. ఆ పేరులోనే వున్నది ఆ ధ్వని.

పదిపన్నెండు వందల సంవత్సరాలక్రితం కర్నూలు ఆముదానికి ప్రసిద్ధి. అక్కడ విరివిగా ఆముదాలు పండేవి, ఆముదం ఆడే గానుగలు వుండేవి. తుంగభద్రదాటే బళ్ళన్నీ, ఇక్కడఆగి చక్రాల ఇరుసులికి కందెన వేసుకునేవి. అనగా ఆధునిక పరిభాషలో ఆయిలింగ్. కర్నూలు ఆనాడు ఎద్దుబళ్ళకి ఆయిలింగ్ స్టేషను. తెలుగులో కందెనవోలు. అది కందనూలు అయినది. నవాబులకాలం లోనే కందనూలు కర్నూలుగా మారి నిలిచిపోయినది.

తెనుగుగడ్డమీద ప్రతిమానవ పదార్పితక్షోణికీ ఒకో చరిత్ర వున్నది. కర్నూలుకి కూడా వున్నది. హంద్రీ తుంగభద్రా నదులమధ్యవున్న ఈ నగరం క్రీస్తుశకం నాలుగోశతాబ్దిలో తెలుగు చోడులు పరిపాలించినారు. తరువాత పశ్చిమ చాళుక్యులు పాలించినారు. పన్నెండవ శతాబ్దంలో కాకతీయుల వశమైనది. ఆ కాలంలో పల్నాటి వెలమవీరుడు, బ్రహ్మనాయుడు ఈ ప్రాంతంలో, నాయకురాలి కుట్రకిలోనై, అరణ్యవాసం చేసి, మార్కాపురంలో చెన్నకేశవాలయం నిర్మించినాడు; వీరమేడపినగరం స్థాపించినాడు. అడవులు నరికించి, ఆ ప్రదేశంలో మొదట నగర నిర్మాణం చేసినవాడు కాకతి ప్రతాపరుద్రు డంటారు. కాకతీయుల తర్వాత కర్నూలు విజయనగర రాయళ్ళ పరిపాలనలోకి వచ్చినది. 1530-40 ప్రాంతంలో అచ్యుతదేవరాయలు కందనూలుకోట నిర్మాణం చేసినాడు. ఆ కోట బాపతు మిగిలినది కొండారెడ్డి బురుజు మాత్రం. కోటవున్నప్రాంతం ఇంకా కోటఅనే అంటున్నారు. నవ్యాంధ్ర ప్రజారాజ్యరథం కందెనవోలులో కందెనకోసం మకాం చేసినది.

తాత్కాలిక రాజధాని కర్నూలుకాగా, హైకోర్టు గుంటూరులో వుంచడానికి నిర్ణయం జరిగినది. కొన్నాళ్ళు మద్రాసులోనేవుండి, హైకోర్టు 1954, జులై 4 గుంటూరు చేరినది. 1953, అక్టోబరు, ఆంధ్రరాష్ట్రం అవతరించినది. ప్రధాన మంత్రి నెహ్రూ స్వయంగా వచ్చి ప్రారంభోత్సవం జరిపించినాడు.

ఆంధ్రరాష్ట్రంలో 11 జిల్లాలూ, బళ్ళారినించి వచ్చిన 3 తాలూకాలూ వున్నవి. రెండు తాలూకాలు కర్నూలులోనూ, ఒకతాలూకా అనంతపురంలోనూ కలిపి మొత్తం 11 జిల్లాలు చేసినారు. ఆంధ్రరాష్ట్ర వైశాల్యం 63,417 చదరపుమైళ్ళు. జనాభా రెండుకోట్ల ఆయిదు లక్షలు.

ఆనాటికి నలభై సంవత్సరాలక్రితం ప్రారంభమై, ఆంధ్రమహానాయకుల ప్రయత్న ఫలితంగా, చివరిరోజుల్లో జాతీయ సదస్సులలో పట్టాభిపట్టుదలవల్ల, ప్రజానీకం ఆందోళన ఫలితంగా లభ్యమైన ప్రసాదం నాటికి నాయకులైన పెద్దలు స్వీకరించినారు; శ్రీరాములు దయచేతను....నోరూరగ చవులువుట్ట!



# మంత్రివర్గ నిర్మాణం

విధివిలాసం విడ్డూరంగా వుంటుంది. నవ్యాంధ్రరాష్ట్ర ప్రభుత్వనిర్మాణ బాధ్యత సర్దార్ సంజీవరెడ్డి భుజస్కంధాలమీద పడినది. రాయలసీమ మహాసభాధ్యక్షుడుగా ప్రాంతీయ పరిరక్షణలు కోరినవాడు సంజీవరెడ్డి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడుగా ప్రస్తుతం రాష్ట్రం అవసరం లేదన్నవాడు సంజీవరెడ్డి. అటువంటిరాష్ట్రం, దాని బాధ్యతా అతనిమీదే పడినది.

అదేమి చిత్రమో ఆంధ్రరాష్ట్ర సమస్యపైకి వచ్చిన ముహూర్తాలలో అననుకూలుడు రాజగోపాలాచారి అధికారంలో వుంటాడు. 1938 లో ఆయన మద్రాసు ప్రధాని. ఆటంకాలు కలుగజేసినాడు. 1952 లో ఆయన మద్రాసు ముఖ్యమంత్రి. ఈ మధ్యకాలంలో స్వరాజ్యం వచ్చినది. రాజాజీ ఆఖరి గవర్నరు జనరల్‌గా పని చేసి పింఛను పుచ్చుకున్నాడు. ఆంధ్రరాష్ట్ర అవతరణ సమయంలో మళ్ళీ మద్రాసు ప్రభుత్వసారథ్యం వహించినాడు.

1952 ఎన్నికలలో ఆంధ్రలో కాంగ్రెసు దెబ్బతిన్నది. ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం ఆంధ్రబలం లేనిదే నిలవదు. కాంగ్రెసుకా బలంలేదు. అందుకని రాజాజీ ఆంధ్రనించి రంగాగారి కృషికర్‌లోకపార్టీ సభ్యుల్ని కాంగ్రెసు శాసనసభాపార్టీలో సహాయ సభ్యులుగా చేర్చుకున్నాడు. ఆంధ్రకోటా మంత్రిపదవులు ఇవ్వడం అవసరంగదా. ఏరికోరి వెతుక్కున్నాడు. 1936 లో చిన్నవాడైన గోపాలరెడ్డిని పైకి తెచ్చినట్టు, 1952 లో చిన్నవాడైన రాయలసీమ హరిజనుడు, దామోదరం సంజీవయ్యని మంత్రిగా వేసుకున్నాడు. యువకుడైన సంజీవయ్య బి.ఏ.,బి.ఎల్. పట్టభద్రుడైన బుద్ధిమంతుడు. తెలుగుభాషా పాండిత్యం కలవాడు; వక్త. గాంధీజీని సంజీవయ్య చూడకుండానే గోడ్సే కడుపున పెట్టుకున్నాడు. రాజాజీ హస్తవాసి

మంచిది. ఆయన ఆశీర్వచనానికి విపరీతబలం వున్నది. పదేళ్ళుదాటకుండా ఆంధ్ర ప్రదేశ ముఖ్యమంత్రిగా రూపొంది, కాంగ్రెసు అధ్యక్షుడై, కేంద్రమంత్రిగా వ్యవహరించి ఖ్యాతిసాధించినాడు సంజీవయ్య. రాజాజీ ఇతర ఆంధ్రమంత్రులు : పట్టాభి రామారావు, ఎం. వి. కృష్ణారావు, ఎన్. రంగారెడ్డి, ఎన్. శంకరరెడ్డి.

ఈ వుమ్మడి మద్రాసు మంత్రివర్గం పరిపాలించే కాలంలోనే ఆంధ్రరాష్ట్రం అవతరించినది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడైన సంజీవరెడ్డి, ఆనాడు శాసన సభా సభ్యుడుకాడు. ఎన్నికలలో వోడిపోయినతర్వాత, ఢిల్లీ రాజ్యసభలో స్థానం సాధించినాడు. ఆంధ్రలో కౌన్సిలులేదు. అసెంబ్లీసభ్యుడైతేగాని మంత్రాంగం ఏర్పాటు చెయ్యడానికి వీలులేదు. అప్పుడు ఆర్. బలరామరెడ్డి రాజీనామా ఇవ్వగా, కాళహస్తి నియోజకవర్గంనించి శాసనసభకి ఎన్నికైనాడు. శాసనసభా కాంగ్రెసు పార్టీ నాయకుడుగా నిలిచి గెలిచినాడు. అప్పుడే నలభై సంవత్సరాలు నిండీనిండని సంజీవరెడ్డి, యువనాయకుడుకిందేలెఖ్ఖ. కురువృద్ధులు జీవించి వున్నారు. ప్రకాశం బతికివున్నాడు. రంగా వున్నాడు. కాని వీరిద్దరూ భీష్మించి కాంగ్రెసులోంచి వెళ్ళిపోయి తమతమ అనుచరులతో కొత్తపార్టీలు స్థాపించుకున్నారు. ఆంధ్ర అసెంబ్లీలో కాంగ్రెసుకి పూర్తిబలంలేదు. పైగా నెహ్రూతోసహా కాంగ్రెసు అధిష్ఠానవర్గం ప్రకాశంలేని ఆంధ్రమంత్రివర్గం తలలేని మొండెం అన్నారు. పరిస్థితులు యథాతథంగా పరిశీలించినాడు సంజీవరెడ్డి. నాయకుడికి వుండవలిసిన లక్షణాలన్నీ వున్నవాడు. తన విషయం అదుపులో పెట్టుకోగలవాడు. దేశసౌభాగ్యం గమనించగలవాడు. ఎల్లాగైనా ప్రకాశాన్ని తిరిగీ కాంగ్రెసులోకి లాక్కురావాలని శపథం పట్టినాడు. కృతకృత్యుడైనాడు. ప్రకాశం కాంగ్రెసులో పునఃప్రవేశం చేసినాడు. కొత్తగావచ్చిన బాలరాష్ట్రం ధన్యురాలు, సంజీవరెడ్డి ధన్యుడు. ప్రకాశం ముఖ్యమంత్రిగా కాంగ్రెసు ప్రాధాన్యంతో, ఇతర పార్టీల సహాయంతో మంత్రివర్గం ఏర్పాటు చేయించినాడు సంజీవరెడ్డి. తాను డెప్యూటీ ముఖ్యమంత్రిగా వున్నాడు.

ప్రకాశం స్థాపించిన కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ ఆలిండియా సోషలిస్టు పార్టీతో కలిసి ప్రజా సోషలిస్టుపార్టీగా మారినది. ప్రకాశం కాంగ్రెసులో చేరగానే తెన్నేటి విశ్వనాథం ఆ పార్టీ నాయకుడైననాడు. ఆలిండియా సోషలిస్టు పార్టీ అధిష్ఠానవర్గం తమ సభ్యులు కాంగ్రెసుతో మంత్రివర్గంలో చేరకూడదన్నారు. అప్పుడు విశ్వనాథం ప్రభృతులు పి. ఎస్. పి. లో మధ్య ఎస్ తీసేసి, పి. పి (ప్రజాపార్టీ)గా మారి సంజీవరెడ్డితో సహకరించినారు. విశ్వనాథం ఫైనాన్సు మినిస్టరుగా అధికారం స్వీకరించినాడు.

కృషికర్ లోకపార్టీ ఆదిలో కాంగ్రెసుతో సహకరించినది. ఆపార్టీనాయకుడు రంగా అఖిలభారత రంగనాయకుడు. రాష్ట్రనాయకుడు గౌతు లచ్చన్న. లచ్చన్నకి

కూడా మంత్రివర్గంలో స్థానం లభించినది. తర్వాత శాశ్వత రాజధాని సందర్భంలో ఏదో అభిప్రాయ భేదంవచ్చి రాజీనామా ఇచ్చినాడు. కమ్యూనిస్టు, పి. ఎస్. పి. లతోపాటు ప్రతిపక్షంలో చేరినది కె. ఎల్. పి. పార్టీ.

ఆవిధంగా ఆంధ్రలోనే ప్రప్రథమంగా కాంగ్రెసు ప్రజాపార్టీతో కలిసి కోయలీషను మంత్రివర్గం ఏర్పాటు చేసినది. ఆ మంత్రివర్గంలో ఇతర సభ్యులు : కడప కోటిరెడ్డి, పి. తిమ్మారెడ్డి, దామోదరం సంజీవయ్య, పట్టాభిరామారావు.

అదేమిటో ప్రకాశంపంతులు మంత్రివర్గాలు రెండూ రెండే. చిరకాలం నిలవ లేదు. మద్రాసులో 1946 లో ముఖ్యమంత్రిగా వుండి 47 లోనే పదవీచ్యుతు డైనాడు. కర్నూలులో ప్రథమాంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రిగా పదమూడు నెలలు నిలవలేదు. శాసనసభలో బడ్జెటు వోటింగులో, మధ్య నిషేధం పద్దుమీద ప్రభుత్వం వోడిపోయినది. రాజీనామా ఇచ్చినది. వెంటనే ప్రెసిడెంటు పరిపాలన అమలులోకి వచ్చి 1955 లో మధ్యంతర ఎన్నికలు జరిగినవి.

1952 ఎన్నికలలో జరిగిన పరాభవం గుర్తుంచుకుని కాంగ్రెసువారూ, కాంగ్రెసులోంచి విడిపోయినవారూ ముందుగానే జాగ్రత్త పడినారు. కమ్యునిస్టుల్ని ఎదిరించడంకోసం కాంగ్రెసు, పి. పి., కె. ఎం. పి. పార్టీలు కలిసి యునైటెడ్ ఫ్రంట్ ఏర్పాటు చేసినారు. ఐకమత్యంతో ఎన్నికలు నడిపేసరికి యునైటెడ్ ఫ్రంట్‌కే మెజారిటీ లభించినది. శాసనసభ 196 స్థానాలలోనూ కమ్యూనిస్టులికి 15 మాత్రమే దక్కినవి.

సంజీవరెడ్డి డిప్యూటీ ముఖ్యమంత్రి కాగానే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడుగా బెజవాడ గోపాలరెడ్డి ఎన్నికైనాడు. మధ్యంతర ఎన్నికలు ఆయన ఆధ్వర్యం లోనే జరిగినవి. ఎప్పుడైతే యునైటెడ్ ఫ్రంట్ గెలిచిందో అప్పుడే మళ్ళీ ముఖ్య మంత్రి ఎవరు అనే ప్రశ్న పైకి వచ్చినది. గోపాలరెడ్డి సీనియర్లలో లెఖ్ఖ. ఆయన నిలిచినాడు. రాష్ట్ర నిర్మాణ బాధ్యత వహించి, ప్రకాశానికి పట్టంగట్టిన సంజీవరెడ్డి అర్హతలుకూడా గమనించతగ్గవే. ఇద్దరు రెడ్లకి పోటీ వచ్చినది. ఢిల్లీనించి ఈ తగాదా తునితగువు చెయ్యడానికి అధిష్ఠానవర్గం ప్రతినిధుల్ని పంపించినది. దేబేర్, లాల్‌బహదూర్‌శాస్త్రి, దేవకాంత బారువా, కొత్త రఘురామయ్యని వెంటబెట్టుకుని, గన్నవరంలో విమానందిగి, విజయవాడ చేరుకున్నారు. రాష్ట్ర శాసనసభ కాంగ్రెసు పార్టీ, రాష్ట్ర కాంగ్రెసు సంఘం సభ్యుల్ని కలిపి ఒకసమావేశం జరిపి గోపాలరెడ్డి నాయకుడుగా నిర్ణయించినారు. సంజీవరెడ్డి డిప్యూటీ ముఖ్యమంత్రిగా వుండడానికి అంగీకరించినాడు. అప్పుడు ఏర్పడిన మంత్రివర్గం యునైటెడ్ ఫ్రంటు మంత్రి వర్గం : బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డి, కల్లూరి చంద్రమౌళి, తెన్నేటి విశ్వనాథం, కళా వెంకట్రావు, గౌతులచ్చన్న, ఏ. బి. నాగేశ్వరరావు, కె. ఓబుల్ రెడ్డి.

దరిమిలాని కె. ఎల్. పి. నిరభ్యంతరంగా కాంగ్రెసులో చేరిపోయినది.

మధ్యంతర ఎన్నికలలో ఆంధ్రశాసనసభకి పోటీచేసిన బ్రహ్మానందరెడ్డి గెలిచినాడు. ఫిరంగిపురం నియోజక వర్గంలో నిలవగా కమ్యూనిస్టు అభ్యర్థి ఎర్రెడ్డి రామిరెడ్డి ప్రత్యర్థిగా వున్నాడు. మద్రాసు శాసనసభలో పైస్థాయికి వచ్చిన ఇతని శక్తి సామర్థ్యాలు అంతా గమనించినారు. అయినా మంత్రిత్వంలో స్థానం ఇవ్వాలన్న ఆలోచన కలగలేదు. కానైతే శాసనసభాధ్యక్ష పదవికి బ్రహ్మానందం పేరు కొందరు స్నేహితులు సూచించినారు. మరోఇద్దరు కూడా ఆ పదవిమీద ఆశపెట్టు కున్నారు. రొక్కం లక్ష్మీనరసింహందొర, ఎం. ఆర్. అప్పారావుకూడా పార్టీ తరఫున నిలిచినారు. చివరికి పార్టీలోనే వోట్లు వేసుకోగా దొరకి ఎక్కువ బలం చేకూరినది. ఆయనే శాసనసభలో అధ్యక్షుడుగా ఎన్నికైనాడు.

గోపాలరెడ్డి ముఖ్యమంత్రికాగానే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవి ఖాళీ అయినది. ఆ పదవికి ఎన్నిక జరగవలసివున్నది. ఈ ఎన్నిక 1944 జూన్‌లో జరిగినది. అప్పటికి కె. ఎల్. పి. పార్టీ కాంగ్రెసులో లీనమైనది. నాయకుడు రంగా కాంగ్రెసు సభ్యుడు. గోపాలరెడ్డి మద్దత్తుతో లచ్చన్నవంటి అను యాయులు రంగాని అభ్యర్థిగా నిలబెట్టినారు. రంగా అప్పుడు విదేశాలలో వున్నాడు. సంజీవరెడ్డి ప్రోద్బలంతో అల్లూరి సత్యనారాయణరాజు నిలబడినాడు. తీవ్రంగా పోటీ జరిగినది. విశాఖ తూర్పుగోదావర్లు విడదీస్తే పోటీ సమబలంగా వున్నది. అక్కడి రాజుల వోట్లు అయిదారు రాజుకే పడినవి. సత్యనారాయణరాజు గెలిచి నాడు. అనగా, గోపాల సంజీవరెడ్లు చాటున వుండి పోటీచేయించగా, సంజీవరెడ్డి పక్షం గెలిచినది. రెడ్లిద్దరూ ఎన్నిక సమయానికి రాలేదు. దూరంగానే వున్నారు. కళా వెంకట్రావుని ఎన్నికలు జరపడానికి నియోగించినారు. వెంకట్రావు వేళా కోళంలో ఆయన ఏ పక్షమో ఎవరికీ తెలియదు. తటస్థంగానే వ్యవహరించినాడు. ఆ ఎన్నికలోనూ. 1951లో జరిగిన ఎన్నికలోనూ కూడా బ్రహ్మానందరెడ్డి సంజీవరెడ్డి పక్షమే.

సత్యనారాయణరాజు తన ప్రధాన కార్యదర్శిని నియమించవలసి వచ్చినది. ఆదిలో పిడతల రంగారెడ్డిని నియమించే సూచనలు గోచరించినవి. చివరికి బ్రహ్మానందరెడ్డిని ప్రధాన కార్యదర్శిగానూ, రంగారెడ్డినీ, పెమ్మరాజు వెంకట్రావునీ సంయుక్త కార్యదర్శులుగానూ నియమించినాడు.

సంజీవరెడ్డి రాష్ట్రశాసనసభకి ఎన్నికైనప్పుడు రాజ్యసభలో ఖాళీ వచ్చినది. ఆ స్థానంలో సత్యనారాయణరాజు రాజ్యసభకి ఎన్నికైనాడు. తత్కారణంగా ఎక్కువగా ఢిల్లీలోనేవుండేవాడు. బెజవాడ ఆంధ్రరత్న భవనం కాంగ్రెసు

ఆఫీసులోనే వుండి పని చెయ్యవలసినవాడు బ్రహ్మానందరెడ్డి ఒకడే అయినాడు. సంయుక్త కార్యదర్శులలో వెంకట్రావు ఆఫీసులో వుండేవాడు.

1955-56 తెలుగుల చరిత్రలో ముఖ్యమైనకాలం. అది విశాలాంధ్రావతరణ పుణ్యకాలం. 1955 డిసెంబరు 10 న ప్రధాని నెహ్రూ నాగార్జునసాగర్ శంఖు స్థాపన చేసినాడు. ఆ సాయంకాలం గుంటూరులో ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభ జరిగినది. ఆ మహాసభ ప్రారంభకుడు ప్రధాని, అధ్యక్షుడు సంజీవరెడ్డి. మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షుడూ, ఏర్పాట్లన్నీ స్వయంగా చేసినవాడూ బ్రహ్మానందరెడ్డి. సభ బ్రహ్మాండంగా కొనసాగినది. అందరూ మెచ్చుకున్నారు.

రాష్ట్రస్థాయిలో బాధ్యతాయుతమైన పదవి నిర్వహించడం అదే ప్రారంభం. జిల్లాస్థాయినించి బ్రహ్మానందరెడ్డి రాష్ట్రస్థాయికి పెరిగినాడు. న్యాయవాదవృత్తికి స్వస్తిచెప్పి పూర్తిగా రాజకీయాలలో మునిగిపోయినాడు. విశాలాంధ్రావతరణ సమయంలో రాష్ట్రకాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా కార్యదక్షత చూపినాడు.



# మేలుకొలుపులు

నిజాముల చరిత్రతో ఆంధ్రులచరిత్ర పెనవేసుకుపోయినది. మొదటి నిజామూ, తొలి బ్రిటిషు వర్తకమూతా కొంచెం ఇంచుమించు, ఒకేసారి దక్షిణాపథం చేరుకున్నారు. ఒకర్ని ఒకరు ఆశ్రయించి వృద్ధిలోకి వచ్చినారు. అదివరకు కొన్ని దశాబ్దాలనించి, వేరువేరు చిన్నరాజ్యాలలో విడిపోయిన ఆంధ్రదేశం అంతా తన పరిపాలనలోకి తెచ్చుకున్నాడు నిజాం. కాకతీయులతర్వాత ఆంధ్రులంతా ఒక రాజ్యంలోకి వచ్చినారు. బ్రిటిషువార్ని ఆశ్రయించి నిల్చినాడు నిజాం. బ్రిటిషు వారు పోగానే పోయినాడు. ఈలోపుగా వారి అవసరాలకోసం, పెట్టిన అప్పుల కోసం, చేసిన యుద్ధాలకోసం, నిజాం దగ్గిర, తఫాలవారీగా, పెద్దపెద్ద రాజ్య భాగాలు తస్కరించినారు బ్రిటిషువారు. చిట్టచివరికి, నెత్తికెక్కి, భారతదేశపు పరిపాలకులైనారు. ఈవిధంగా దత్తమై బ్రిటిషు పరిపాలనలో చేరినవే సర్కార్లు అనే కోస్తాజిల్లాలూ, రాయలసీమ అనే దత్తమండలాలునూ. నిజాం నిష్క్రమించగానే తెలుగువారంతా మళ్ళీ ఒక రాజ్యంలోకి వచ్చినారు. ఆదిలో, అనగా 170 సంవత్సరాలక్రితం అంతా నిజామాంధ్రులే; వేరే ఆంధ్రులులేరు. అప్పుడిది తెలుగుదేశము; తెలుంగుదేశం. తెలుంగు + ఆణెము = తెలంగాణము. ఆణెము అనగా దేశం. అదే ఉర్దూ వుచ్చారణలో తెలంగాణా అయినది. నిజాం రాజ్యంలో తెలుగు, మహారాష్ట్రభాగాలు ఎక్కువగా వుండేవి. అందుచేత పరిపాలనాసౌలభ్యం కోసం రాజ్యం రెండు భాగాలుచేసి, తెలుగుభాగాన్ని తెలంగాణా అనీ, మహారాష్ట్ర భాగాన్ని మరాట్వాడీ అనీ పిలిచేవారు. మరాట్వాడీలో బిరారు, కొంత కర్నాటక రాజ్యభాగంకూడా వుండేది. బిరార్లు పోయినతర్వాత 5 మహారాష్ట్ర జిల్లాలూ, 3 కన్నడ జిల్లాలూ మరాట్వాడీలో మిగిలిపోయినవి. తెలంగాణాలాగే ఆపేరుకూడా మిగిలిపోయినది. నిజాంరాజ్యం ఆంధ్రప్రాంతంలో హైద్రాబాదు జిల్లాతోసహా

తొమ్మిది జిల్లాలు మిగిలిపోయినవి. ఇవి ఆదిలాబాదు, కరీంనగరం, మెదకు, ఖమ్మం, అత్రాఫ్‌బాల్దా (హైద్రాబాదు) నల్లగొండ, మహబూబ్‌నగరం, వరంగల్లు. ఇవే తెలంగాణం అంటూవచ్చినారు; అంటున్నారు. నిజాం పరిపాలనలో ఎల్లా వ్యవహరించినా బ్రిటిషు ఆంధ్రులుమాత్రం ఈ ప్రాంతపు తెలుగువార్ని నిజాం ఆంధ్రులన్నారు, అనేవారు. ఆయన పతనంతో అంతా ఒకే ఆంధ్రులైనారు. నూటఏభై సంవత్సరాల తర్వాత మళ్ళీ ఆంధ్రప్రదేశ అవతరణతో ఆంధ్ర ఏకీకరణం జరిగినది.

ఇన్నాళ్లూ విడివిడిగావున్న ఆంధ్రులికి ఇతర భాషాభాగాలతో ఉమ్మడికాపురం తప్పలేదు. మద్రాసురాష్ట్రంలో వుంటూవచ్చిన ఆంధ్రులికి అరవల ప్రాబల్యం. హైద్రాబాదు సంస్థానంలో వుంటూవచ్చిన ఆంధ్రులకి మహారాష్ట్రుల ప్రాబల్యం, ఆర్థిక, నైతిక, విజ్ఞాన వికాసానికి ఆటంకాలుగా పరిణమించినవి. నిజాంపరిపాలనలో మహారాష్ట్రులకుండే గౌరవం, పలుకుబడీ ఆంధ్రులికి వుండేవికావు. దీనికి కొన్ని చారిత్రాత్మకమైన కారణాలు వున్నవి. మహామ్మదీయుల్నీ, బ్రిటిషువార్నికూడా ఒకేసారి ధిక్కరించి, హిందూ స్వాతంత్ర్యం నిలబెట్టాలి అనే ఆఖరిప్రయత్నం చేసినవారు మహారాష్ట్రులు. ఈ ప్రయత్నానికి ఆదిలో శివాజీ, తర్వాత ఝాన్సీ లక్ష్మీబాయి నాయక నాయకురాండ్రు. ఆంధ్రులు చెయ్యలేదనికాదు. వారిది అంతకు పూర్వప్రయత్నం. ఢిల్లీని ఒక్కుమ్మడిగా ఎదిరించి, కాకతీయ సామ్రాజ్యానంతరం దక్షిణా పథంలో స్వతంత్ర పరిపాలన సంరక్షించినవారు ఆంధ్రులు. విజయనగర సామ్రాజ్యసంస్థాపన ఆంధ్రప్రయత్నం. ఆప్రయత్నాలు వెనకటివి. నిజాముకి అన్వయించవు. మొదటి నిజాం, తాను స్వతంత్రుణ్ణి అని ప్రకటించుకున్నప్పుడు ఢిల్లీ అంగీకరించలేదు. ఆ ప్రతిపత్తి అతనికి శాస్త్రీయంగా, లాంఛనంగా ప్రసాదించలేదు. నీరసంగా వూరుకున్నది. నిజాంపాలన మహారాష్ట్రులుకూడా అంగీకరించలేదు. అటువంటి అపాయపరిస్థితులలో నారాజ్యంలో కొన్నిభాగాలు శాశ్వతంగా మహారాష్ట్రులవే, నేను పాలిస్తున్నాను అనే మూజువాణీ సంప్రదాయం ఒకటి స్థాపించినాడు నిజాం. వారూ వూరుకున్నారు. తత్కారణంగా, నిజాంరాజ్యభాగం మాదేను, ఇతను కౌలుదారు అనే కట్టుకథ నమ్మి, మహారాష్ట్రులుకూడా గర్వంగా వుండేవారు. ఈమానసికస్థితిలో వారిప్రవర్తన ఒక విధమైన ఆత్మాభిమాన పూర్వక మైనది. తెలుగులికి ఆ ఆత్మగౌరవం పోయినట్టు గోచరిస్తుంది. యథారాజా, తథా ప్రజా అన్నట్టు ప్రభువుల్ని తెలుగువారు అనుసరించినంత మహారాష్ట్రులు అనుకరించలేదు. వారి మహారాష్ట్రవేషం, భాషా, సంప్రదాయం, పూనాలో ఎల్లా వుండేవో. అవురంగబాదు. హైద్రాబాదులలోకూడా అల్లాగే వుండేవి. తెలుగులుమాత్రం సంస్థానాధీశ్వరులతోసహా రూమీటోపీలు, షేర్వాణీలు ధరించి ఉర్దూ మాట్లాడే వారు. ఇక మధ్య తరగతివారి సంగతి చెప్పనక్కర్లేదు. ఉన్న తరగతి తక్కువ.

ఆకొద్దిమందీ తమ వేష. భాషలు మార్చుకున్నారు. మార్చుకోక తప్పినదికాదు. ఇక జనసామాన్యం ఉర్దూ భాషమాత్రం వ్యవహారభాషగా స్వీకరించలేదు. అధికార ప్రభావంవల్ల ఉర్దూమాటలూ, యాసా వారి భాషలోకి ప్రవేశించినవి. ఆమాటకి తెలుగు వ్యవసాయ, వ్యాపార, అధికార పరిభాషలోకే ప్రవేశించినవి. ప్రజాస్వత్వాలు లేక, విద్యా సౌకర్యాలులేక, ఆర్థిక వనరులులేక, వెట్టిచాకిరీతో, అధికారుల, ఖామందుల దౌర్జన్యంతో, ఆత్మగౌరవం, అభిమానం కోల్పోయి, అజ్ఞాన అంధకారంలో పడిపోయిన అలగాజనం, 'నీబాంచను' (బానిస), 'నీకాలుమొక్కుత, దొరా', అనే దీనస్థితిలోపడినారు. ఇంకా నీచాతినీచమైన కూతలు కూసేవారు.

ఇంతేకాదు. యావదాంధ్ర ప్రజకి పట్టిన దౌర్భాగ్యమే వీరికీ పట్టినది. మహారాష్ట్రులికి పూనా విజ్ఞానకేంద్రం. గోఖ్లే, తిలక్, రానడే, కార్వే అంతా పూనావారు. మహారాష్ట్రనాగరికతకీ, సారస్వతానికీ, కళలికీ పూనా పాలవెల్లి. అది మహానగరం. ఆ స్థాయి అందుకోవాలని ప్రతిమహారాష్ట్రుడి ప్రయత్నంగా వుండేది. కర్నాటకులికి మైసూరు ముఖ్యనగరం. మహారాజు పోషణలో కర్నాటనాగరికతా, ఆత్మగౌరవం పెరిగినవి, పెంపొందినవి. కేరళదేశీయులికి తిరువాన్కూరు, కొచ్చిను సంస్థానాలు వుండేవి. తిరువనంతపురం, కొచ్చిన్, త్రిచూరు వారి విజ్ఞానకేంద్రాలు. ఆ మహారాజులు కేరళనాగరికత పోషించినారు. ఆంధ్రులికి అటువంటి మహానగరంలేదు. జమీందారులు తగుమాత్రంగావున్నా, కళాసాహిత్యాలు పోషించినా, ఆ మహారాజులు లేరు. మద్రాసు ఉమ్మడినగరం. అరవలప్రాబల్యం. ఆ నగరాభివృద్ధికి తెలుగులు ఇటుకా సున్నంతో కాయకష్టంచేసినా, తెలుగు సంస్కృతి అక్కడలేదు. త్యాగరాజ కీర్తనలు మినహా తెలుగుమృగ్యం. తెలుగువారికంటె తమిళులే త్యాగయ్యని గౌరవిస్తారు. తమవాడిగా చేసుకున్నారు. హైద్రాబాదులో ముస్లింల ప్రభావం, వారి తర్వాత వారికి సన్నిహితులైన కాయస్థుల ప్రభావం. హిందువులలో మహారాష్ట్రుల ప్రభావం. స్థాపించిన కొద్ది విద్యావిజ్ఞాన సంస్థలూ మహారాష్ట్రులివే. నాయకత్వం వారిదే. ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలో ఉన్నతోద్యోగంలో ఒక్క ఆంధ్రుడు లేడు. నిజానికి అన్ని ఉద్యోగాలూ అంతే. వారసత్వంగా వచ్చిన గ్రామఉద్యోగాలైన పటేలుపట్వారీ నౌఖరీలుతప్ప, చెప్పతగిన ప్రభుత్వోద్యోగాలు లేవు. మరీ పెద్ద ఉద్యోగాలు ముస్లింలవి. రెండవ వరస కాయస్థులవి. మూడోస్థాయి మహారాష్ట్రులవి. నాయకత్వంకూడా అల్లాగే వుండేది. నవాబులు, రాయ్‌లు, మహారాష్ట్ర రావులు, నాయక్‌లు.

బ్రిటిషువారికింద నిజాం, నిజాంకింద జాగీరుదార్లు, వాళ్ళకింద భూఖామందులు లనేక రకాలు. ఎవరి పరిపాలన, ఎవరిహక్కులు వారివే రాజ్యంలో పదోవంతు నిజాం స్వంతభూమి. హైద్రాబాదుజల్లా అందులోదే. మూడింటఒకవంతు జాగీర్లు,

మిగిలింది దివానీ. ఈ మూడురకాల పరిపాలనలూ, ముప్పైమూడు విధాలుగా ప్రజల్ని పీడించుకుతింటూ, వారి తిండితిప్పల సంగతి చూడని నిజాం పరిపాలనలో దేశస్థులుకాక, పరదేశీయులు పరిపాలన సాగించేవారు, ఉద్యోగాలు అనుభవించేవారు. ఆదౌర్భాగ్యస్థితిలో హిందూ ప్రజానీకం తరఫున ఇద్దరు మహారాష్ట్రులు కండ్లు తెరిచినారు. వారు కేశవరావు కోరాట్కర్, వామననాయక్. ఇట్టిస్థితిలోనే కొమర్రాజు లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావూ కలిసి, ఆంధ్రుల కళ్లు తెరవడానికి శ్రీకృష్ణ దేవరాయాంధ్రభాషానిలయం, విజ్ఞాన చంద్రికాగ్రంథమండలీ స్థాపించినారు. ఆ చీకటి అంధకారంలో, ఈ చిన్నదీపం పెట్టిన వారిద్దరూ వైతాళికులు. స్వతంత్ర వాయువులులేనిచోట ప్రాణవాయు ప్రయోగం ప్రారంభించినారు.

హైద్రాబాదు ఆదినించి అంతంవరకూ బ్రిటిషువారి శిబిరం. రాజులెవరైనా మంత్రులు బ్రిటిషువారి ఏజెంట్లు. అటువంటి వారిలో అగ్రగణ్యుడు సర్ అక్బర్ హైదరీ. ముప్పైరెండు సంవత్సరాలు ఆయన ఇక్కడ తిష్ఠవేసి బ్రిటిషువారి క్షేమం, తనక్షేమం చూసుకున్నాడు. ఆయనే ప్రజలభాష అనే పేరుతో ఉస్మానియా యునివర్సిటీలో ఉర్దూ శిక్షణభాషగా చేసినాడు. ఏనాడూ పదకొండు శాతం దాటని ఉర్దూభాష మాట్లాడేవారి స్వభాష ప్రజాభాష ఎల్లా అయినదో? రవీంద్రుడి వంటి మహానుభావులుకూడా ఈ బురిడీలోపడి బిరుదులిచ్చినారు.

హైదరీ మంత్రాంగ శాఖలుమాత్రం ఇంగ్లీషు వాడేవి. ఆయనకి ఉర్దూరాదు. జిన్నాలాగే గుజరాతీ మాతృభాష. బ్రిటిషురాజ్యల శాశ్వాతంగా వుండిపోవాలనే నినాదం హైద్రాబాదులోనే మొదట వినబడినది. అలిఘర్ నినాదంతో ఏకకంఠంగా అరిచినది. పాకిస్థాన్‌కి దారి తీసినది. 1906 లో అలిఘర్లో ఈ సిద్ధాంతం ప్రవచించినవాడు పాయగాదారూ, నిజాముల బంధువూ అయిన సర్ వికార్-ఉల్-ఉమ్రా.

1919 లో సుప్రసిద్ధ బీహారు న్యాయవాది సర్ ఆలీ ఇమాంను బ్రిటిషువారు నిజాంకి ప్రధానమంత్రిగా నియమించినారు. ఆ రోజుల్లో బ్రిటిష్ ఇండియాలో మాంటేగూ-షెమ్సుఫర్డు రాజకీయ సంస్కరణలు అమలులోకి వచ్చినవి. అదే పద్ధతిలో ఇక్కడకూడా కాస్తంత ప్రజాహక్కులికి గణన ఇద్దామని ఇమాం, రాయ్ బాలముకుంద్ కమిషను నియమించినాడు. ఈ ఘనకార్యం చేసినందుకు ప్రభుత్వానికి ధన్యవాదాలు అర్పించడానికి ఒక బహిరంగసభ జరిగినది. అదే హైద్రాబాదులో జరిగిన ప్రథమ రాజకీయ మహాసభ. కేశవరావు, వామన్ నాయక్, అఘర్ యార్జంగు కలిసి ఒక ప్రజాసంఘం స్థాపించి సంస్కరణల సంఘంముందు సాక్ష్యం ఇవ్వడానికి సిద్ధపడినారు. చివరికి ఈ ప్రయత్నం నిజాముకి నచ్చలేదు. చెప్పకుండా ఆలీ ఇమాం ఇంటిముందు స్పెషలురైలు నిలబెట్టి, వున్నవాణ్ణి వున్నట్టు వెంటనే హైద్రాబాదు విడిచిపెట్టమన్నారు. విధిలేక ఆయన వెళ్ళిపోయినాడు.

ఈలోపుగా జాతీయ కాంగ్రెసు ప్రభావం హైద్రాబాదుమీదకూడా పడినది. గాంధీ సిద్ధాంతాల వాసన వీరికి సంక్రమించినది. ప్రజలలో అంత అలజడిలేదు. అది ప్రజకాదు. ఏకొద్దిమందో మేధావులు కాస్త మేలుకున్నారు. వారిని ఆకర్షించినది ఖిలాఫత్ ఉద్యమం. టర్కీసుల్తాను మహమ్మదీయులికి గురువుకూడాను. నిజాం మహమ్మదీయులందరిలో ధనికుడు. ఆ సంబంధంగా ఖిలాఫత్ ఉద్యమానికి ఆసరా ఇవ్వడంలో ఆశ్చర్యంలేదు. కాని, నిజాం ఇందులో ప్రత్యక్షంగా ప్రమేయం పెట్టుకోలేదు. అది బ్రిటిషువారికి వ్యతిరేకచర్య అవుతుంది. నిజాం "బ్రిటిషువారికి మిక్కిలి నమ్మిన మిత్రుడు". అక్బర్ యార్జంగు మాత్రం, హిందువుల మద్దత్తు కోసం కేశవరావుని కలుపుకుని కొంత హడావిడి చేసినాడు.

హైద్రాబాదులో డబ్బున్న విద్యార్థులు ఉన్నతవిద్యకోసం అలీఘర్ వెళ్ళేవారు. అప్పటికి ఉస్మానియా విశ్వవిద్యాలయంలేదు. నగరంలో వున్న నిజాం కళాశాల ఒకటే రాజ్యమంతటికీ ఉన్నత విద్యాలయం. అది మద్రాసు విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో వుండేది. ఆరోజుల్లో అలీఘర్ జాతీయ భావాలకి నిలయమై, కాంగ్రెసు–ఖిలాఫత్ ఉద్యమాలికి కేంద్రమైనది. ఆ ప్రభావంలో చాలామంది ముస్లిం విద్యార్థులు జాతీయోద్యమంలో ప్రవేశించడానికి విద్యకి స్వస్తిచెప్పినారు. వారిలో ముఖ్యులు మక్బూల్ ఆలీ, మహమ్మదు హుస్సేన్, యూసఫుద్దీన్, మీర్ అక్బరలీఖాన్, హమీదుద్దీన్ మహమూదు, ఫక్రుద్దీన్ మసూద్, సయద్ మహమ్మద్ అన్సారీ. వీరిలో చాలామంది తరువాత నిజాం ప్రభుత్వంలో పెద్ద ఉద్యోగాలు చేసి రిటైరైనారు. మీర్ అక్బరలీఖాన్ పార్లమెంటు సభ్యుడు. అన్సారీ అడ్వకేటు.

బ్రిటిషువారు పన్నిన పన్నాగాలలో ఒకటి హైద్రాబాదు నిజాం టర్కీ సుల్తానుల వియ్యం. ఒకవేపు సుల్తాన్ని పదభ్రష్టుణ్ణిచేసి, దరిద్రుణ్ణిచేసి, బెంగుళూరులో ఆశ్రయం ఇప్పించినారు. ఈ పరిస్థితులలో షౌకతాలీ, హైదరీకలిసి ఒక ఆలోచన చేసినారు. దానికి నిజాంని వొప్పించినారు. నిజాం పెద్దకొడుకు, బీరారు యువరాజుకి, సుల్తాన్‌కుమార్తె, దుర్రూషవర్ని ఇచ్చి వివాహంచేయించినారు. సుల్తాను సోదరుడి కుమార్తె నిలోఫర్ని, నిజాం రెండో కుమారుడికిప్పించినారు. సుల్తాన్ ముస్లింలకి పూజ్యుడు. నిజాం ప్రపంచంలోకల్లా ధనాధికుడైన ముస్లిం సామంత పరిపాలకుడు. అటుపోయిన హోదా, ఇటు వుండుకున్న ధనరాసులూ కలిపి ముడేసి ఏదో బావుకుందామని ఆలోచన. అంతకుమినహా ఖిలాఫత్ ఉద్యమం ప్రభావం హైద్రాబాదులో ఏమీలేదు.

సరోజినీదేవి హైద్రాబాదు నివాసిని. ఆమె తండ్రి అఘోరనాథ ఛట్టోపాధ్యాయులు వంగదేశీయుడు. సరోజిని డాక్టరు ముత్యాల గోవిందరాజులు

నాయుణ్ణి వివాహం చేసుకున్నది. మద్రాసులో జరిగిన ఆ కల్యాణానికి వీరేశలింగం ఆచార్యుడు. ఆమె కాంగ్రెసు అగ్రాసనాధిపత్యం వహించినది. అధిష్టాన వర్గంలో ముఖ్యురాలు. గాంధీకి ఆప్తురాలు. తాను జైలుకి వెళ్ళినది; లాఠీదెబ్బలు తిన్నది. ఉప్పుతెచ్చినది. కాని, హైద్రాబాదులో ఆవిడ ప్రభావం ఎక్కడా వుండేదికాదు. కాంగ్రెసుగాని, సంస్థాన కాంగ్రెసుగాని చాలా రోజులు ఇక్కడ కనబడేవికావు, వినబడేవికావు. నిజాం ప్రభుత్వపు కక్కుల కళ్ళలలో అటువంటివేకాదు, ఏ ప్రజా ఉద్యమానికీ తావులేదు. నగరంలో సరోజిని ఒక కవయిత్రి, విజ్ఞానవంతురాలు, సంపన్నురాలు, అందగత్తె. భార్యాభర్తలిద్దరూ నిజాం స్నేహితులు. ఆశ్రితులు. నాయుడు నిజాం ప్రత్యేకవైద్యుడు. ఉదారస్వభావం కలవాడు అంతే.

1930 లో సరోజిని కుమార్తె, పద్మజ, స్వదేశీలీగులో పనిచేసినది. ఆలీగు పలుకుబడి రాజ్యంలో బహుతక్కువ. అసలేదీ నగరం విడిచి వ్యాపించడం అరుదు.

1918 లో హైద్రాబాదు జిల్లా కాంగ్రెసు సంఘం ఏర్పాటైనది. దీనికి అధ్యక్షుడు వామన్ నాయక్ అనే మహారాష్ట్ర సంపన్నుడు. ఈ సంఘం ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘానికి అనుబంధంగా వుంటూ 15 సంవత్సరాలు కొంతపని చేసినది. ఈ సంఘం తరఫున హైద్రాబాదునించి కాంగ్రెసు మహాసభకి కొందరు ప్రతినిధులు పోవచ్చును. మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణరావు, కొండా వెంకట రంగారెడ్డి ఈ విధంగా కాంగ్రెసు చూసినవారిలో కొందరు.



# నిజాం ఆంధ్రోద్యమం

గాంధీ ఉద్యమంవల్ల హైద్రాబాదు మేధావులలో జాగృతి కలుగుతూనేవున్నది. ప్రభుత్వ ఆంక్షలలో సభలు చెయ్యలేదు. చివరికి 1931 లో ప్రథమ హైద్రాబాదు రాజకీయ మహాసభ జరిగినది. రాజ్యంలో కాదు. బేరారుప్రాంతంలో వున్న అకోలా నగరంలో. బెరారు పేరుకు నిజాంరాజ్యం. ఆయన కుమారుడు బెరారు యువరాజు. అకోలా, రాజ్యం కానిరాజ్యం. అకోలాసభకి అధ్యక్షుడు రామచంద్రనాయక్. సభ ఏర్పాటుచేసినవారు, అఘర్ యార్జంగు, కేశవరావు, రాఘవేంద్రరావుశర్మ. ఆమాత్రానికే నిజాం ప్రభుత్వానికి భయం వేసినది. రాఘవేంద్రరావు శర్మని రాజ్యంలోంచి వెళ్ళగొట్టినది. తక్కిన ముగ్గుర్నీ హైకోర్టు న్యాయమూర్తుల్ని చేసినది.

1932 లో ఒక హిందూ సమాజస్థాయి సంఘం పైకి వచ్చినది. దానికి ప్రాపకుడు కాశీనాథ్‌రావు వైద్యా. ఈ సంఘం వైద్యా రాజకీయ ఉన్నతికి సహాయ పడినది.

సర్ నిజామత్ జంగ్ అనే నవాబుండేవాడు. ఆయన మాజీ ప్రధానన్యాయ మూర్తి. బహదూర్ యార్జంగ్ అనే ముస్లిం నాయకుణ్ణీ, కొందరు హిందువుల్ని కూడదీసి నిజాంపేర సంఘం స్థాపించినాడు. ఒక రాజ్యాంగం నమూనా తయారు చేసినాడు. ఈ ప్రయత్నం ప్రభుత్వానికి అంత ఇష్టం కాలేదు. రాజకీయమైన వాసన వారికి గిట్టదు. తత్కారణంగా గ్రంథాలయాలనీ, సంఘ సంస్కారమనీ దేవుళ్ళాడేవారు నాయకులు.

ఆ సంఘ సంస్కారం పేరుతో వచ్చినది ఆర్య సమాజం. ముఖ్యంగా మహారాష్ట్ర, కర్నాట ప్రాంతాలలో ప్రకోపించినది. శికింద్రాబాదులో బాజీకృష్ణరావు,

ఆదిపూడి సోమనాథరావు దీనికి ప్రచారకులు. కృష్ణరావు మహారాష్ట్రుడు. తెలుగు స్త్రీని వివాహం చేసుకున్నాడు. ఈ ఆర్యసమాజం ధైర్యంగా అనేకవిధాల ప్రభుత్వాన్ని ధిక్కరించినది. ప్రజాసేవ చేసినది. ప్రజానీకంలో మెలకువకి కారణమైనది. ఈ ఉద్యమం తెలుగు ప్రాంతాలలోకి పాకలేదు. తెలుగువారు లేవలేదు. ఈ నిద్రావస్థలో, ఒకానొక పరాభవాగ్నిలోంచి జన్మించినది నిజాం ఆంధ్రోద్యమం.

1921, నవంబరు 12, అర్ధరాత్రి. వివేకవర్ధనీ ఉన్నత పాఠశాలలో హైద్రాబాదు హిందూ సంఘసంస్కార మహాసభ జరుగుతున్నది. పూనా మహిళా విశ్వవిద్యాలయ సంస్థాపకుడు, దొంఢోపంత్ కార్వేమహాశయుడు అధ్యక్షత వహించినాడు. ఆంధ్ర, మహారాష్ట్ర, కర్నాట ప్రముఖుల్ని సభకి ఆహ్వానించినారు. ఎవరి భాషలలో వారు మాట్లాడవచ్చునన్నారు. ఎవరికి తోచినట్టువారు, ఉర్దూలోనూ, మహారాష్ట్రంలోనూ, కన్నడంలోనూ మాట్లాడుతున్నారు. ఆంధ్రుల ప్రతినిధులు మాడపాటి హనుమంతరావు, ఆలంపల్లి వెంకటరామారావు. ఇద్దరూ ప్రసిద్ధులే; ఇద్దరూ హైకోర్టు న్యాయవాదులే. హనుమంతరావు తెలుగులో మాట్లాడినాడు. మహారాష్ట్ర బాహుళ్యమైన సభవారు విసుక్కున్నారు, కాని విన్నారు. ఆలంపల్లి వెంకటరామారావు లేచి తెలుగులో మాట్లాడడం ప్రారంభించినాడు. సభవారు చప్పట్లు కొట్టినారు. ఆయన లక్ష్యం చెయ్యకమాట్లాడుతూనే వున్నాడు. సభవారు అల్లరి చేసినారు. వినలేదు. వక్త మాట్లాడుతూనేవున్నాడు. సభవారు తమ వీపులు సభావేదికవేపుతిప్పి కూచుని, వీపా వినమన్నారు. ఈ దుశ్చర్య, ఈ అవమానం ఆంధ్రులు భరించలేకపోయినారు. సభవిడిచి వెళ్ళిపోయినారు. ఆ రాత్రికి రాత్రి టేకుమాల రంగారావు వకీలు ఇంట్లో సమావేశమై కర్తవ్యం ఆలోచించినారు. ఆంధ్రుల ఆత్మాభిమాన సంరక్షణకోసం, ఆంధ్రుల వ్యక్తిత్వ నిరూపణకోసం, ఆంధ్రుల అభివృద్ధికోసం ఒక సంఘం స్థాపించాలని నిశ్చయించినారు. ఆ సంఘం పేరు నిజాం రాష్ట్ర ఆంధ్రజన కేంద్రసంఘం. అధ్యక్షులు రావుబహద్దుర్ శ్యామల వెంకటరెడ్డి. హనుమంతరావు కార్యదర్శి.

ఈ కేంద్రసంఘం సంస్థాపకులు: టేకుమాల రంగారావు, మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణరావు, కొండా వెంకటరంగారెడ్డి, మందుముల నరసింగరావు, మందుముల రామచంద్రరావు, ఆదిరాజు వీరభద్రరావు, పందిటి రామస్వామినాయుడు, ఆర్. రాజగోపాలరెడ్డి, మిట్టా లక్ష్మీనరసయ్య. ఆ బీజావాపనతో ఆంధ్రోద్యమం రాజ్యమంతా వ్యాపించినది. ప్రజలకి వెలుగుచూపినది. తరువాత మహారాష్ట్ర, కన్నడపరిషత్తులకి దారి జూపినది. ఇంతవరకు మహారాష్ట్ర ఉద్యమం నగరంలోనే వుండేది. ఆంధ్రులు గ్రామసీమకు పోయినారు. ఆంధ్రులలో ఐకమత్యం, చైతన్యం. విద్య, స్త్రీలవికాసం మొదలైనవాటికి కారకులై, తాము మేలుకొని ఇతరుల్ని మేలుకొలిపినారు.

ఇదివరదాకా ప్రభువులూ, వారి ఆశ్రితులూ ప్రచారంచేస్తూ వచ్చిన దక్కను భావం, దక్కను చరిత్ర, దక్కను రాజ్యము, దక్కను సంస్కృతీ అనే ముక్కాలి పీఠంవిరిగి పోయినది. ఆంధ్ర సంస్కృతీవాహిని వెల్లివిరిసి మూసీనదిలో మూర్తీభవించినది. యువకుల ఆవేశఅభిమానాలతో, ఈ ఆంధ్రసంఘం పెద్ద ఆశయాలతో బయలుదేరినది. ఒకపక్కన గ్రామీణుల విజ్ఞానం వృద్ధిచేసి వాళ్ళకళ్ళు తెరవడానికి గ్రంథాలయాలు; రైతుల ఇక్కట్లు పోగొట్టడానికి రైతుసంఘాలు; వ్యాపార పరిస్థితులు బాగుచెయ్యడానికి వర్తక సంఘాలు ఇటువంటిసంస్థలు, వున్నవాటికి చెయ్యూత ఇచ్చి, కొత్తవి స్థాపించి జెంయ్యుమని కార్యక్రమం ప్రారంభించినారు. ఆకాలంలో గ్రామస్థులమీద పటేలు, పట్వారీ, పోలీసుల జులుం నిరంకుశంగా సాగేది. రైతుల్ని అన్యాయంగా వసూళ్ళతో యమబాధలు పెట్టేవారు, వెట్టిచాకిరీ చేయించుకునేవారు, వర్తకులదగ్గిర అధికార్లు సరుకులు తీసుకుని డబ్బిచ్చేవారు కారు. తాము మకాంచేసినచోటికి అన్నీ సరఫరా చెయ్యాలని నిర్బంధించేవారు. తిట్టేవారు, కొట్టేవారు. దిక్కూదివాణం వుండేదికాదు. అటువంటి నిర్భాగ్య ప్రజల శ్రేయస్సుకోసం పనిచేసినది ఆంధ్రజనసంఘం. నాయకులు జిల్లాలు తిరిగి ప్రబోధం చేసినారు.

1924 లో మధిరలో గ్రంథాలయ సమావేశం జరిగినది. దేశంలోవున్న గ్రంథాలయాలన్నీ ప్రతినిధుల్ని పంపించినవి. పింగళి వెంకటరామారెడ్డి ఈ సమావేశానికి అధ్యక్షుడు. ఈయన దేశముఖు. జీతబత్తెములు లేకుండా సెషన్సుజడ్జీ ఉద్యోగం చేసేవాడు. అప్పటికి తెలుగువారిలో అంతపెద్ద ఉద్యోగస్థుడు లేనేలేడు.

ఈ గ్రంథాలయసభే నిజాం రాజ్యంలో నిర్మాణకార్యక్రమానికి పునాది. ఈ సభ తర్వాత ఉన్నవ వెంకట్రామయ్యని దేశసేవకుడుగా నియోగించినారు. ఈయన సంచార ప్రచార ఫలితమే ఆంధ్రోద్యమ విజయం. ఈ ఉద్యమానికి పట్టుగొమ్మ మాడపాటి హనుమంతరావు. హనుమంతరావు నిజామాంధ్ర భీష్ముడు. ఆంధ్రప్రదేశావతరణానంతరం ఆంధ్రపితామహుడైనాడు. భారత ప్రభుత్వం ఈయన దేశసేవ గుర్తించిననాడు పద్మభూషణుడైనాడు. బ్రిటిషు ఆంధ్రులకి సన్నిహితుడై, సంబంధ బాంధవ్యాలు కలుపుకుని, తెలుగుదేశపు రెండు ప్రాంతాలకూ రాయబారిగా పెరిగి, న్యాయమైన న్యాయవాదవృత్తిలో జీవితంగడిపి, దేశసేవ వృత్తిగా స్వీకరించి, ప్రథమ హైద్రాబాదు మేయరుగా ఎన్నుకోబడి, ఆంధ్రప్రదేశ శాసన పరిషత్తు అధ్యక్షుడైనాడు. బ్రిటిషు నిజాం రాజ్యాల సరిహద్దులలోవున్న ఎర్రుబాలెం వాస్తవ్యుడు గనుక నిజాం ఆంధ్రులందరిలో ముందు మేలుకున్నాడు, తనదేశీయుల్ని మేల్కొలిపినాడు. తెలుగులో చిన్నకథ వ్రాసినవారిలో ప్రథముడు. వరంగల్లు గ్రంథాలయోద్యమంతో ప్రారంభించి, ఆంధ్రోద్యమ సంస్థాపకుడై, అదిపోషించి, పాలించి, ఆంధ్రాభ్యుదయానికి మార్గం వేసిన అయిదారుగురు మహానుభావులలో

ఒకడు. నిజాంరాజ్యంలో 'ఆంధ్ర' శబ్దమే సింహస్వప్నం అయినరోజులలో తన స్వగృహానికి 'ఆంధ్రకుటీరం' అని పేరు పెట్టుకున్న ఆంధ్రవీరుడు. వెంకట్రామయ్య ప్రచారంవల్ల, హనుమంతరావు దీక్షవల్ల ఆనాడు తెలంగాణాలో ఆంధ్రాభిమానం నాటుకున్నది.

రెండవ గ్రంథాలయసభ సూర్యాపేటలో జరిగినది. మొదటి వర్తక సంఘం కూడా సూర్యాపేటలోనే వెలిసినది. ఆ వూరివాడు కోదాటి రామకృష్ణరావు వకీలు గొప్ప ఆంధ్రాభిమాని. సూర్యాపేటసభతోపాటు ఎన్నో ఇతర సభలుకూడా జరిగినవి. కేంద్ర జనసంఘ సమావేశం సరేసరి. ఆంధ్రయువకులంతా ఏకమై ఒక సమావేశం జరిపినారు. ముందంజవేసినారు. ఈ యువజన సభాధ్యక్షుడు లోకదిండి నారాయణరావు. కార్యదర్శి మాడపాటి రామచంద్రరావు; హనుమంతరావు అన్న కొడుకు. విజ్ఞాని, విద్యావంతుడు. తరవాత స్టేటుకాంగ్రెసులో పనిజేసి, ఆ సంస్థ నిషేధించబడినప్పుడు, మద్రాసు ఢిల్లీ నగరాలమధ్య తిరిగి, ఆయా ప్రభుత్వాల సహకారం, సహాయం సాధించినవాడు. నెహ్రూతో పటేల్‌తో రాయబారాలు నడిపినవాడు. అతని ప్రచ్ఛన్నసేవ చాలామందికి తెలియదు. అకాలమరణం వాతపడకపోతే ఆంధ్రరాజకీయాలలోనేకాక, భారతీయ రాజకీయాలలో చాలా ప్రాముఖ్యంగా వుండేవాడు.

ఆ యువజన సమావేశంతో పెద్దలు దడిసి వీర్నికూడా పెద్దసభలో చేర్చుకున్నారు. తర్వాత యువజన సమావేశాలు అవసరం లేకపోయినవి.

సూర్యాపేటలో ఇంకో సమావేశంకూడా జరిగినది. అది సంఘసంస్కారసభ. దాని కధ్యక్షుడు గాడేపల్లి సూర్యప్రకాశరావు. ఆయన విద్యాశాఖలో అధికారి. అభ్యుదయమార్గాసక్తుడు, మేధావి. కాకినాడలో రఘుపతి వెంకటరత్నం నాయుడి శిష్యుడు. సూర్యప్రకాశరావు తమ్ముడు జగన్నాథం ఆనాటి యువజనులలో ఉత్సాహవంతుడు, నాయకుడు. ఈ సోదరులిద్దరూ నిజాం ఆంధ్ర సంఘానికి చేసిన సేవ అపారం. సూర్యాపేట తర్వాత సంఘసంస్కారసభకూడా జరగలేదు. ఈ సమస్యలన్నీ తర్వాతవచ్చిన ఆంధ్రమహాసభ కార్యక్రమంలో చేర్చినారు.

సూర్యాపేట సభలతో ఆంధ్రులలో ఒక ఉత్తేజం కలిగినది. ప్రత్యేకంగా ఒకో శాఖకి వేరే ఒకో సమావేశం ఏర్పాటుచెయ్యడానికి బదులు, ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికిగాను ఒకే ఒక సంస్థ స్థాపించాలనే అభిలాష కలిగినది. ఉత్సాహం వున్నది. వెంటనే మరుసటి సంవత్సరం మెదకుజిల్లా జోగిపేటలో ప్రథమ ఆంధ్ర మహాసభ జరిగినది. 1930. అదేసమయంలో ప్రత్యేకంగా ఆంధ్రమహిళా సభ కూడా జరిగినది. అప్పుడు నిజాంరాజ్యంలో హిందూస్త్రీలకికూడా ఘోషా వుండేది. స్త్రీలు బైటికిరావడం, సభలలో మాట్లాడ్డం చాలా విడ్డూరంగా వుండేది. అయినా

కొందరు సంస్కారులైన ఆంధ్రస్త్రీలు ముందుకువచ్చి స్త్రీల అభ్యుదయానికి చాలా దోహదం చేసినారు. వీరిలో యల్లాప్రగడ సీతాకుమారి ఎన్నతగ్గది. ఈమె రచయిత్రి, కథలూ, కవితా వ్రాసేది. ఈమె స్వరాజ్యం వచ్చినతర్వాత శాసనసభ్యురాలైనది. క్రమేణా ఆంధ్ర మహిళా ఉద్యమంకూడా ముందుకు నడిచినది. నాయకులు కూడా తమ భార్యల్ని ప్రోత్సహించి సభలకి తీసుకువచ్చేవారు. హనుమంతరావు భార్య మాణిక్యమ్మ, రామకృష్ణరావు భార్య అనంతలక్ష్మమ్మ ఆ విధంగా వచ్చిన వారే. ఇంకో రచయిత్రి నందగిరి ఇందిరాదేవి. ఇల్లిందల సరస్వతీదేవి సుప్రసిద్ధ రచయిత్రి. ఈమెకూడా శాసనసభ్యురాలైనది. రంగమ్మ ఓబుల్‌రెడ్డి యువతీ మండలి స్థాపనకి సహాయం చేసినది. ఈమెకు దుర్గాబాయి స్నేహసంపద కలిగినది. ఆ ఉత్సాహం సంక్రమించినది. దుర్గాబాయి ప్రోత్సాహం, ప్రోద్బలం, తర్వాత సహాయంవల్లనే హైద్రాబాదు ఆంధ్ర యువతీ మండలి పైకివచ్చినది. ప్రస్తుతం శాసన పరిషత్తు సభ్యురాలైన శ్యామలాదేవి యువతీ మండలి కార్యకర్తలలో ముఖ్యురాలు.

ఈ విధంగా పదమూడు ఆంధ్ర మహాసభలూ, పది ఆంధ్ర మహిళా సభలూ జరిగినవి.

## నిజాం ఆంధ్ర మహాసభలు

| *సంవత్సరం* | *ప్రదేశం* | *అధ్యక్షులు* |
|---|---|---|
| 1930 | జోగిపేట | సురవరం ప్రతాపరెడ్డి |
| 1931 | దేవరకొండ | బూర్గుల రామకృష్ణరావు |
| 1934 | ఖమ్మం | పులిజాల రంగారావు |
| 1935 | సిరిసిళ్ళ | మాడపాటి హనుమంతరావు |
| 1936 | షాద్‌నగరం | కొండా వెంకట రంగారెడ్డి |
| 1937 | నిజామాబాదు | మందుముల నరసింగరావు |
| 1940 | మల్కాపురం | మందుముల రామచంద్రరావు |
| 1941 | చిలుక్కూరు | రావి నారాయణరెడ్డి |
| 1942 | ధర్మవరం | మాదిరాజు రామకోటేశ్వరరావు |
| 1943 | హైద్రాబాదు | కొండా వెంకట రంగారెడ్డి |
| 1944 | భువనగిరి | రావి నారాయణరెడ్డి |
| 1945 | మడికొండ | మందుముల నరసింగరావు |
| 1946 | కంది | జమలాపురపు కేశవరావు |

మహిళాసభలకి అధ్యక్షురాండ్రు: జోగిపేట: నడింపల్లి సుందరమ్మ: దేవరకొండ: టి. వరలక్ష్మమ్మ; ఖమ్మం: ఎల్లాప్రగడ సీతాకుమారి; సిరిసిల్ల: మాడపాటి మాణిక్యమ్మ; షాద్‌నగరం: బూర్గుల అనంతలక్ష్మమ్మ; నిజామాబాదు: నందగిరి ఇందిరాదేవి; మల్కాపురం: యోగ్యశీలాదేవి; చిలుకూరు: రంగమ్మ ఓబుల్‌రెడ్డి; ధర్మవరం: రంగమ్మ ఓబుల్‌రెడ్డి; హైద్రాబాదు: ఎల్లాప్రగడ సీతాకుమారి.

అప్పటికింకా మహారాష్ట్ర కన్నడ పరిషత్తులులేవు. అందుకనే కాబోలు ఆంధ్ర మహాసభలకి ఆంధ్రులొక్కరే రావాలనే నియమంలేదు. కార్యక్రమం, కవిలెలు, ఉపన్యాసాలూ తెలుగులోనే వుండాలనే నియామకం కూడా లేదు. ఆదిలో ఆంధ్ర మహాసభలకి రాజకీయాలతో సంబంధంలేదు. సభ చెయ్యడానికే ప్రభుత్వం అనుమతి కావలసినప్పుడు రాజకీయాలెక్కడ ? ఏదో సంఘ సంస్కారం, స్త్రీజన విద్య, వితంతు వివాహం ఇటువంటివాటితో తృప్తిపడవలసి వచ్చేది. రానురాను రాజకీయాలు తప్పలేదు. ఏది మాట్లాడినా రాజకీయమే. ప్రభుత్వం పేరెత్తితే రాజకీయం. ఆ అంటే అపరాధం ఊ అంటే ఉపరాధం. రాజకీయేతరసభ అని పేరు. లక్ష్యం రాజకీయమని నాయకులికి తెలుసును. ప్రభుత్వానికీ తెలుసును. సూదిమొనంత చోటుకోసం నాయకులు చూసేవారు. అదికూడా నిషేధించడం ఎల్లాగని ప్రభుత్వం ఆలోచించేది. ఆంక్షలు పెట్టేవారు. నాయకులు ఇదికూడా వుండదని తల వొగ్గేవారు. వొగ్గకపోతే సభేలేదు. ఒక మహాసభలో 'వితంతు వివాహం' మీద తీర్మానం పనికిరాదన్నాడు కలెక్టరు. అధ్యక్షుడితోసహా అందరి ఉపన్యాసాలూ చూబించమనేవాడు. కొన్నిభాగాలు తీసేసేవాడు. సభ జరుగుతోండగా కబురుపంపి ఏదోవిధంగా సభాభంగం చెయ్యడానికి ప్రయత్నించేవాడు. ఈ ఆటంకాలన్నీ దాటి, ఏయెండకి ఆ గొడుగుపట్టి, ఎల్లాగో ప్రజల్ని ఉత్తేజపరిచి, విజ్ఞానవంతుల్ని చేస్తే తమ కర్తవ్యం నెరవేర్తుందని నాయకుల ఆశ. కృతార్థులైనారు. ఆంధ్రోద్యమం ఒక జ్యోతిలాగ తెలంగాణా చిమ్మచీకట్లు చెదరగొట్టినది. నెమ్మదిగా రాజకీయాలలో దిగి, చివరికి 1946 లో స్టేటు కాంగ్రెసులో కలిసిపోయి స్వాతంత్ర్యరథం లాగే వరకూ ఆ దీపం ఆరిపోకుండా కాపాడినది. ఈ పద్ధతి అనుసరించిన పెద్దల్ని మితవాదులన్నారు యువకులు. ఆ మితవాదులు లేకపోతే అతివాదులు ఆవిర్భవించేవారుకారు. చివరిచివరికి ఆంధ్రమహాసభావేదిక ఈ మితవాదులికీ, జాతీయవాదులికీ, ప్రచ్ఛన్నంగా పనిచేసే కమ్యూనిస్టులికీ ఏకవేదికగా పరిణమించి, చీలి రెండై స్టేటు కాంగ్రెసులో లీనమైనది. అంతవరకూ 'ప్రార్థనాపూర్వక' తీర్మానాలేగాని, త్యాగం ధైర్యంలేవని యువకుల ఫిర్యాదు.

ప్రథమాంధ్ర మహాసభాధ్యక్షుడు ప్రతాపరెడ్డి, ప్రతిభాశాలి. మద్రాసులో బి. ఎల్. పరీక్షలో కృతార్థుడై రాగానే ప్రజాసేవాభాగ్యం కలిగినది. అప్పట్లో రెడ్డి

ఉద్యమనాయకుడు రాజాబహదర్ కొత్వాలు వెంకటరామారెడ్డి. ఆయన రెడ్డివిద్యార్థుల వసతిగృహం, పాఠశాలా మొదలైనవి ప్రారంభించినాడు. బ్రిటిషు ఆంధ్రలోకూడా అదేసమయంలో రెడ్డి జనసంఘం అవతరించినది. దాని ప్రతిబింబమే హైద్రాబాదు ప్రయత్నం. ఈ పని తుంకూరు రామారావు చూస్తూ వుండేవాడు. ప్రతాపరెడ్డి రాగానే రెడ్డి ఉద్యమం పని అతనికి అప్పగించినాడు. వెంకటరామారెడ్డి. స్వయంగా విద్యాగంధం అట్టే లేకపోయినా, వెంకటరామారెడ్డి గొప్ప సంస్కారి. రెడ్డిసంస్థానాధీశ్వరుల సహాయంతో 1925 లో 'గోల్కొండ పత్రిక' స్థాపించినాడు. పేరిచ్చిన సంపాదకుడు బాలకృష్ణారెడ్డి. పనిచేసేవాడు ప్రతాపరెడ్డి. ఈ పత్రిక నిజామురాష్ట్ర విషమపరిస్థితులలో, ప్రభుత్వానికి భయపడక, అధికార్ల దుండగీడుతనం, లంచగొండితనం, పోలీసు శాఖవారి దౌర్జన్యం, ప్రజల కష్టనష్టాలు, తురక ప్రచారకుల దుష్ప్రవర్తనం, అన్నీ స్పష్టంగా, ధైర్యంగా లోకానికి చాటించేది. ఆ పత్రిక నడిపేవాడు ప్రతాపరెడ్డి. ఏ పత్రిక ద్వారాగాని దేశానికంతకంటె సేవ చెయ్యడం దుర్లభం. 30 సంవత్సరాలు ఆ సేవచేసి ఈ మధ్యనే మూగవోయినది.

గోలకొండ పత్రిక రాకపూర్వం హైద్రాబాదు రాజ్యంలో చిన్నచిన్న పత్రికలు వుండేవి. ఇవన్నీ ఆంధ్రోద్యమవ్యాప్తికి తోడైనవి. 1913 లో శ్రీనివాసశర్మ మహబూబునగరంనించి 'హితబోధిని'అనే పత్రిక ప్రారంభించినాడు. తెలంగాణంలో ఇదే మొదటి తెలుగు పత్రిక. 1920 లో మానుకోట తాలూకా ఇనుగుర్తినించి ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవ రంగారావు సోదరులు 'తెనుగు పత్రిక' ప్రారంభించినారు. అదే సమయంలో నల్లగొండనించి సబ్నవీసు నరసింగరావు 'నీలగిరి' పత్రిక ప్రకటించినాడు. ఈ రెండు పత్రికలూ ఆంధ్రోద్యమానికి ఎంతో ప్రచారం కల్పించినవి. 1925 లో 'గొల్కొండ' ప్రారంభించేవరకూ నిజాం రాజ్యంలో తెలుగువార్తా పత్రిక లేదు. ఆ పత్రిక ప్రాముఖ్యంలోకి రావడానికి, ప్రతాపరెడ్డి ప్రతిభావ్యుత్పత్తులే కారణం.

ప్రతాపరెడ్డి పండితుడు, రచయిత. ఎన్నో ఉత్తమ గ్రంథాలు రచించినాడు. ఆర్షశాస్త్రం మొదలు ఆయుర్వేదందాకా ప్రతాపరెడ్డికి అన్ని విద్యలూ కరతలామలకమే. బతికుంటే ఇంకా ఎంతటివాడయే వాడో! రెండో ఆంధ్రమహాసభాధ్యక్షపదవి అలంకరించిన బూర్గులరామకృష్ణరావు గురుభావంతో "ప్రతాపరెడ్డి అన్నగారు" అని సంభోధించేవాడు.

రామకృష్ణారావు అసలు ఇంటిపేరు పుల్లంరాజువారు. వీరిది షాద్‌నగరం తాలూకా బూర్గుల గ్రామం. మొఖాసాదారు కుటుంబంలో జన్మించినాడు. పూనాలో న్యాయవాదవృత్తికి చదువుతునే రోజుల్లో రామకిషెన్‌రావు బూర్గుల్ అయినాడు. అది మహారాష్ట్ర సంప్రదాయం. అల్లాగే చివరికి బూర్గుల రామకృష్ణరావుగా పరిణ

మించినాడు. అక్కన్న మాదన్నల తర్వాత హైద్రాబాదులో ప్రథమాంధ్ర ప్రధాన మంత్రిగా వచ్చినాడు. ఆంధ్రప్రదేశ అవతరణానంతరం కేరళ గవర్నరై ఉత్తర ప్రదేశ గవర్నరుగా పదవీ విరమణం చేసి ఈ మధ్యనే దివంగతుడైనాడు. మేధావి, బహుభాషాకోవిదుడు, కవి, గ్రంథకర్త. చాతుర్యం, చాకచక్యం. నెమ్మదీగల రాజకీయవేత్త. విశాలాంధ్ర ఏకీకరణ అవసరమని రామకృష్ణరావు ఉద్ఘాటించిన తర్వాతనే ఆంధ్రప్రదేశ అవతరణ సాధ్యమైనది.

దేవరకొండ మహాసభలో రాజకీయాలు త్యాజ్యాలు కావన్నాడు రామకృష్ణ రావు. ప్రజాహక్కులు లభిస్తేనేగాని అభివృద్ధి వుండదన్నాడు. ఒకవిధంగా శంఖం పూరించినాడు. ప్రథమాంధ్ర మహాసభకి వామన్‌నాయక్ హాజరైనాడు. ఆయన ఆంధ్రులికి ఎంతో సహాయం చేస్తూ, చేదోడు వాదోడుగా వుండేవాడు. గుంటూరులో శారదా నికేతనానికి ధనసహాయం చేసినాడు. ఈయన మత సాంఘిక విషయాలలో కొంచెం సనాతనుడు. తత్కారణంగా జోగిపేట ఆంధ్ర మహాసభలో చర్చించిన సాంఘిక తీర్మానాల మీద ఈయన సనాతన ప్రభావం పడినది. అందు చేత దేవరకొండలో జరిగిన రెండో ఆంధ్ర మహాసభకి ఆర్యసమాజ అధ్యక్షుడైన కేశవరావు కూడా తయారై ఆంధ్రుల్ని సాంఘికంగా ముందుకి లాగడానికి ప్రయత్నించినాడు. కేశవరావు ప్రతిపాదనలే నెగ్గినవి.

అంతేకాదు, అధ్యక్షుడైన రామకృష్ణరావు చల్లగా రాజకీయాల అవసరం విషయమై మాట్లాడగా సభకు వచ్చినమహారాష్ట్రులు తీవ్రమైన ఉపన్యాసాలు చేసి నారు. మూడోమహాసభ కొల్లాపురంలో జరగవలసినది. ప్రభుత్వం అనుమతి ఇవ్వలేదు.

బ్రహ్మాండం తలకిందులుచేసి, ప్రభుత్వంవారి షరతులన్నిటికీ అంగీకరించి, హనుమంతరావు అనుమతి సంపాదించినాడు. మూడోసభ ఖమ్మంమెట్టులో, నల్లగొండ వకీలు పులిజాల రంగారావు అధ్యక్షతన జరిగినది. ఈ సభలో ఒక్క రాజకీయ విషయాలేకాక సాంఘిక విషయాలుకూడా నిషేధించినది ప్రభుత్వం. అర్ధరాత్రివేళ విషయనిర్ణయసభ జరుగుతుండగా కలెక్టరు అధ్యక్షుల్ని పదేపదే కబురు పంపించి చాలా తిప్పలు పెట్టినాడు. రాజకీయాలూ సాంఘికాలూ చర్చించ నికాడికి సభఎందుకు సమకూడినట్టు? ఒక ఉపాయం ఆలోచించినారు నాయకులు. రైతు సమస్యలమీద తీర్మానాలు ఆమోదించినారు. తృతీయ ఆంధ్రమహాసభలో ...ప్రాముఖ్యంలోకి వచ్చినాడు. అందరితోపాటు రైతుకూడా మేలుకున్నాడు.

...గవ మహాసభ సిరిసిళ్ళలో మాడపాటి హనుమంతరావు అధ్యక్షతన ఎక్కించడమేగాని తాను ఎక్కే స్వభావం హనుమంతరావుకి లేదు. ...రు. తప్పలేదు. ఆయన సతీమణి మహిళాసభకి అధ్యక్షు

రాలు. సిరిసిళ్ళసభలో ఉపన్యాసకులందరూ తెలుగులోనే మాట్లాడటానికి ప్రయత్నించ మని ప్రోత్సహించి కృతార్థుడైనాడు అధ్యక్షుడు. ఆంధ్రాభిమానంతోపాటు ఆంధ్ర భాషా పరిచయంకూడా ఇనుమడించినది. అంతేకాదు. మహాసభకి ఒక నియమావళి ఈ సభలోనే రూపొందినది. యువకుల ఆశయాలతోసహా అన్నిలక్ష్యాలూ సమీక రించి తయారు చేసినారు.

షాదునగరంలో జరిగిన అయిదవసభకి అధ్యక్షులయిన కొండా వెంకట రంగారెడ్డి, కొత్వాలు వెంకటరామారెడ్డి తర్వాత రెడ్డి నాయకత్వం వహించడానికి తయారవుతున్న వకీలు. హనుమంతరావు ప్రోద్బలంతో ఆంధ్రజనసంఘంలో చేరి ప్రజాహితకార్యాలలో పనిచేస్తున్నాడు. అప్పటికే ఈయనకి ఒక హైద్రాబాదు నాయకుడుగా గణనవున్నది. శాసనసభకి సభ్యుడుగా ఎన్నికైనాడు. అదివరకు హైద్రాబాదు శాసనసభలో ఆంధ్రుడనేవాడులేడు. ప్రజల, ప్రభుత్వపు మన్ననలు పొందిన రంగారెడ్డి నిజాయితీపరుడనీ, నిష్కల్మషుడనీ పేరు. మనసులోమాటపైకి అనేసే స్వభావం కలవాడు. ఈయనకి విపరీతమైన ఆంధ్రప్రాంతీయ అభిమానం. తెలంగాణభక్తుడు. ఉర్దూ వకీలు. తర్వాత ఆంధ్రనాయకులలో ముఖ్యాతిముఖ్యుడై స్వరాజ్యానంతరం మంత్రిపదవీ, ఆంధ్రప్రదేశంలో ఉపముఖ్యమంత్రి పదవీ అలంకరించినాడు.

షాద్ నగరం సభలకి ప్రభుత్వవైఖరి కొంతమారినది, తానుకూడా ఆధునిక ప్రభుత్వం అనే పేరు తెచ్చుకోవాలని, ఆంధ్రసభలతోపాటు ప్రభుత్వ ప్రదర్శనలు కూడా జరిపి సభావిజయానికి సహాయం చేసినారు. రంగారెడ్డి తన అధ్యక్షోపన్యా సంలో ప్రభుత్వవైఖరులుకొన్ని ధైర్యంగా విమర్శించినాడు.

క్రమేణా వాతావరణం మారుతున్నది, బ్రిటిషు ఇండియాలో 1935 చట్టం అమలులోకి వచ్చినది. తొమ్మిదిరాష్ట్రాలలో కాంగ్రెసు అధికారంలోకి వచ్చినది. ఇందువల్ల హైద్రాబాదు మేధావులలో కొంత ఆందోళన ప్రారంభం అయినది. ముస్లింలుకూడా తహతహలాడుతున్నారు. ఇది చూసితానుకూడా ఈ సంగతే ఆలో చిస్తున్నా నన్నట్లు, ప్రభుత్వం దివాన్‌బహదూర్ ఎస్. ఆరవాముదు అయ్యంగారు ఆధ్వర్యాన ఒక సంస్కరణల సంఘం నియమించినది. 1937 లో ఆరవ ఆంధ్ర మహాసభ ఈ కొత్తవాతావరణంలో, నిజామాబాదులో సమావేశమైనది. అధ్యక్షుడు మందుముల నరసింగరావు. ఆయన సోదరుడు రామచంద్రరావు. ఇద్దరూ ఆంధ్ర జనసంఘ సంస్థాపకులలో ముఖ్యులు. ఆ తరుణంలో పత్రికలలో వ్యాసపరం పరలతో ఆంధ్రోద్యమానికి బలం చేకూర్చినారు.

నరసింగరావు 'రయ్యత్' అనే ఉర్దూ పత్రిక సంపాదకుడు. రాజ్యంలో వ్యవసాయసమస్యలన్నీ కూలంకషంగా తెలిసినవాడు. అందుచేత రైతుసమస్యల పరిష్కారానికి కొన్ని శాసనాలు చెయ్యవలసిన అవసరం వచ్చినప్పుడు నరసింగ

రావుని శాసనసభలో వేసుకున్నది ప్రభుత్వం. ఈయన ఉర్దూ పండితుడు; ముసల్మానుల స్నేహం ఎక్కువ. ప్రభుత్వానికికూడా అనుకూలుడు. ముల్కీతత్వవేత్తల నాయకుడు. స్వరాజ్యం వచ్చినతర్వాత బావగారు, రామకృష్ణరావు మంత్రివర్గంలో సభ్యుడుగా వున్నాడు.

నిజామాబాదు సభలో సహజంగా అధ్యక్షుడూ, సభికులూకూడా బాధ్యతాయుత పరిపాలన కావాలన్నారు. రాబోయే సంస్కరణలు బ్రిటిషు ఇండియా పద్ధతిలో వుండాలన్నారు. ఆ విధంగా తీర్మానాలు చేసినారు. దాంతో ఆంధ్రమహాసభ నిజస్వరూపదర్శనం అయినది. ఆంధ్రప్రజల ఆశలూ, ఆశయాలూ బహిర్గతమైనవి. ఈ విధంగా రాజకీయంగా తొలికోడి కూసినది ఆంధ్రమహాసభావేదిక మీదనే.

అప్పటికి కాశ్మీరులోనూ, మైసూరు సంస్థానంలోనూకూడా ప్రజాఉద్యమాలు బాధ్యతాయుత ప్రభుత్వాలు కోరుతున్నవి. హైద్రాబాదులో ఎన్నాళ్ళనుంచో ప్రభుత్వాధ్యక్షుడుగావున్న మహారాజా కిషెన్ ప్రసాద్ బహదూర్ని తప్పించి తానే అధ్యక్షపదవి ఆక్రమించినాడు సర్ అక్బర్ హైదరీ. కొత్తచీపురు బాగా వూడుస్తుంది అన్నట్టు, తన ఆధ్వర్యాన ఏదో చెయ్యాలని ప్రారంభించినాడు. ఆ ప్రయత్న ఫలితమే ఆరావముదు అయ్యంగార్ సంస్కరణల కమిటీ. ప్రజలుకూడా మేలుకుని స్టేటు కాంగ్రెసు సంస్థ స్థాపిద్దామా అని ఆలోచిస్తున్నారు.

రాబోయే సంస్కరణలు ఏవిధంగా వుండాలి అనే సమస్య చర్చించడానికి పెద్దలంతా కలవడం ప్రారంభించినారు. దీని ఫలితంగా ప్రజాపరిషత్తు అనే పేరుతో ఒక సంస్థ ఆవిర్భవించినది. దీనికి అధ్యక్షుడు మాడపాటి హనుమంతరావు. ఎంత తంటాలుపడినా ఏకాభిప్రాయం కుదరలేదు. దీనికి కారణం ఇత్తేహాదుల్ ముస్లిమీన్ అనే సంస్థ. దాని నాయకుడు బహదూర్ యార్జంగు అనే జాగీర్దారు.

ఈ సంస్థ 1927 ప్రాంతంలో ముస్లిం సాంస్కృతిక సంస్థగా అవతరించినది. క్రమేణా సంస్కృతి విడిచిపెట్టి ప్రత్యక్ష రాజకీయాలలోకీ మతకీయాలలోకీ దిగినది. బహద్దూర్ యార్జంగ్ మహావక్త, పాకిస్థాన్ సంస్థాపకుడైన జిన్నా స్నేహితుడు. జిన్నా హైద్రాబాదు వచ్చినప్పుడు బహదూర్ యార్జంగు దేవిడీలోనే బసా, సభా కూడా చేసినాడు. ఈ సంపర్కంతో ముస్లిం ప్రజలలో లేని చైతన్యం సృష్టించినాడు బహదూర్ఖాన్. జిన్నా జిత్తులే అవలంబించినాడు. ఆటంక చాతుర్యం నేర్చుకున్నాడు. తాను ప్రజాభివృద్ధి నిరోధకుడై, తన సంస్థని కేవలం ముస్లిం మత సంస్థగా మార్చినాడు. నిజాంరాజ్యం ముస్లిం రాజ్యమన్నాడు. రాజ్యంలో ప్రతి ముసల్మానూ రాజబంధువు. అందుకని రాజుహోదా (అనల్‌మలిక్) వున్నదన్నాడు. ఇటువంటి ముస్లిం రాజ్యాన్ని సంరక్షించాలని నినాదాలు లేవదీసినాడు.

రాజ్యంలో ముస్లిం జనసంఖ్య ఎక్కువ చెయ్యాలని బహదూర్‌ఖాన్ ప్రయత్నం. అందుకని తబ్లీగ్ అనగా హిందువుల్ని ఇస్లాంలో చేర్పించే ఉద్యమం ప్రారంభించినాడు. అధోగతిలోవున్న సంస్థాన హరిజనుల్ని మభ్యపెట్టి, మీ బానిసత్వం పోగొట్టి, మీకు భూములిస్తాం, ఇళ్ళిస్తాం, చదువు చెప్పిస్తాం అని అబద్ధాలు చెప్పి ఇస్లాంలో కలపడం ప్రారంభించినాడు. ఈ ప్రయత్నం హిందువులంతా ఏకమై ప్రతిఘటించినారు. హిందూ ముసల్మాన్ సంఘర్షణలు, కొట్లాటలు, ప్రారంభించినవి. ఒక దసరారోజుని వేనకువేలు హిందువులు ఊరేగింపుతో తమ బలం ప్రదర్శించినారు. బహదూర్ యార్జంగ్ బంధువు, ఆయన దక్షిణహస్తం, ఈ అల్లర్లలో మరణించిన వారిలో ఒకడు. అంతటితో తబ్లీగ్ అణిగిపోయినది. నిజపరిస్థితులు తెలిసి బ్రిటిషువారు ప్రభువునీ, ప్రభుత్వాన్నీ మందలించినారు. హైదరీ అధ్యక్షతకింద ప్రజలికి దొరికిన ప్రథమ బహుమతీ ఈ సంఘర్షణ. అదివరకు లేనిది. ముస్లింలుగా బలవంత పరివర్తన పొందిన హరిజనులు శుద్ధి చేసుకుని తిరిగి హిందూమతంలో ప్రవేశించినారు.

ఆంధ్రమహాసభాధ్యక్షుడుగా మందుముల నరసింగరావు బహదూర్ యార్జంగ్‌తో రాయబారాలు జరిపినాడు. హిందూ ముస్లిం ప్రజల ఐకమత్యంలో కొత్త సంస్కరణలకి ఒక రూపం కల్పించాలని ఆశయం. సరిగ్గా జిన్నా చేసిన పనే ఆయన చేసినాడు. ప్రజాసంస్థలన్నీ హిందూసంస్థలు, ఇత్తేహాదుల్ ముస్లిమీన్ మహమ్మదీయసంస్థ. మహమ్మదీయుల తరఫుని ఇంకో సంస్థని గుర్తించరాదు. ముస్లిం జనసంఖ్య నూటికి పది పదకొండు దాటకపోయినా వారికి శాసనసభలో సగం స్థానాలు కావాలి. వీరికి ప్రభుత్వం మద్దతు వున్నదని అందరికీ తెలుసును. ఏమైనా సమాధానం కుదరలేదు. బహదూర్ యార్జంగ్ మరణంతో కొంత ఉధృతం తగ్గినది గాని, ఈ ఇత్తేహాదుల్ ముస్లిమీన్ తర్వాత ఖాసీం రజ్వీ నాయకత్వం కిందికివచ్చి రజకార్ దౌర్జన్యాలకి దారి తీసినది.

ప్రజాపరిషత్తు విఫలమైనది, కాని రాజ్యమంతటికీ ఏకైక సంస్థ ఒకటి వుండవలెననే అభిప్రాయం బలపడినది. పక్కనున్న మైసూరు సంస్థానంలో స్టేటు కాంగ్రెసు పని చెయ్యడం ప్రారంభించినది. 1938 జనవరి 29 న రాజకీయ నాయకులు కొందరు సమావేశమై తాత్కాలిక స్టేటు కాంగ్రెసు సమితి ఏర్పాటు చేసినారు. సెప్టెంబరు 9 న ఈ సంస్థకి ఒకరూపం ఏర్పర్చుకుందామని నిశ్చయించుకున్నారు. ఇంతలో హైదరీ నవాబు కౌన్సిలులో మాట్లాడుతూ మతపాక్షికవిధానాలు ఖండిస్తూ గంభీరోపన్యాసం చేసినాడు. ఇదేమిరా ప్రభుత్వం ఇంత విశాల దృక్పథంలోకి ఎప్పుడు వచ్చిందని ప్రజలంతా హర్షిస్తున్న సమయంలో, హైద్రాబాదు స్టేటు కాంగ్రెసు మతపాక్షిక సంస్థ అనే నెపంమీద నిషేధించినారు. నాయకులు ఎంత చెప్పినా ప్రభుత్వం వినిపించుకోలేదు. ఈ ఆజ్ఞ ఉల్లంఘించడం పినహా గత్యంత

రం కానరాలేదు. సత్యాగ్రహమే శరణ్యం. గోవిందరావునానల్, రామకృష్ణధూత్, జనార్దనరావు దేశాయి, రావి నారాయణరెడ్డి, శ్రీనివాసరావు బోరీకర్ సత్యాగ్రహంలో జైలుకు పోయినారు. బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల రామచంద్రారెడ్డికూడా జైలుకి వెళ్ళినారు. ఆంధ్రమహాసభా నాయకులలో, అందులో ముఖ్యంగా తర్వాత మంత్రి పదవులు స్వీకరించినవారిలో, ఎవరూ ముందుకి రాలేదు. మొత్తం సంస్థాన ప్రజలు నాలుగువందలమంది మాత్రం సత్యాగ్రహంచేసి జైలులోకి వెళ్ళినారు.

ఈ సత్యాగ్రహంతో ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థులలో దేశభక్తి భావం ప్రజ్వరిల్లినది. హాస్టలులో విద్యార్థులందరూ ఉదయమే ప్రార్థనలు ప్రారంభించినారు. ఈ ఉదయ సంకీర్తనకి వారు ఎన్నుకున్న గీతం 'వందేమాతరం'. ఈ సంకీర్తన నిషేధించినారు అధికారులు. విద్యార్థులు సమ్మె చేసినారు. విద్యాలయం మూసివేసినారు. హిందూ విద్యార్థులు చాలామంది నాగపురం వెళ్ళి అక్కడి విద్యాలయంలో చేరి చదువు పూర్తిచేసినారు. కొందరు రాజకీయ ఉద్యమంలో ప్రవేశించినారు. పి. వి. నరసింహారావు, నూకల రామచంద్రారెడ్డి వంటి యువ కార్యకర్తలెందరో తయారైనారు. వందేమాతరం ఉద్యమంతో విద్యార్థులలో చైతన్యం, జాగృతి కలిగినవి. విశ్వవిద్యాలయానికి హైద్రాబాదురాజ్యంలోపలుకుబడి ప్రారంభించినది. విద్యార్థుల అభిప్రాయాలు గమనించవలసిన అవసరం కలిగినది.

స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం ఒకవేపు, వందేమాతరం ఉద్యమం మరోవేపూ జరుగుతుండగా రాజ్యంలో ఆర్య సమాజం, హిందూ మహాసభాకూడా వేరే వేరే సత్యాగ్రహోద్యమాలు ప్రారంభించినవి. వేనకివేలు హైద్రాబాదు రాజ్యం బైట నుంచి సత్యాగ్రహులు వచ్చి జైలుకి పోయినారు. సంస్థానంవారు మాత్రం ఈ ఉద్యమంలో అట్టే పాల్గొనలేదు.

ఈ పరిస్థితులలో తమ సత్యాగ్రహం విరమించవలసినదని గాంధీ స్టేటు కాంగ్రెసుకి ఆదేశం పంపించినాడు. ఆర్యసమాజ, హిందూమహాసభ సత్యాగ్రహాలు మతానికి సంబంధించినవి. ఇందుతోబాటు కాంగ్రెసు సత్యాగ్రహం ఆగిపోయినది. నాలుగైదు నెలలు జైలులో వుంచి అందర్నీ విడుదల చేసినారు.

సత్యాగ్రహం విరమించినా స్టేటు కాంగ్రెసుమీద నిషేధం తొలగించలేదు. ఆంధ్రమహాసభమీద మాత్రం నిషేధం లేదు. దీనికి కారణం ఆంధ్రమహాసభ నాయకులు సత్యాగ్రహంలో పాల్గొనకపోడమే. ప్రభుత్వానుమతిపొంది ఏడవ ఆంధ్ర మహాసభ మల్కాపురంలో సమావేశమైనది. మందుముల రామచంద్రరావు అధ్యక్షుడు.

1939 ఆఖరులోనూ 1940 ఆరంభంలోనూ హైద్రాబాదు రాజ్యంలో ప్రచ్ఛన్నంగా కమ్యూనిస్టుపార్టీ అవతరించినది. భారతీయ పార్టీమీద నిషేధం

వుండడంచేత వీరు బహిరంగంగా పనిచెయ్యడం లేదు. బ్రిటిషాంధ్ర కమ్యూనిస్టు పార్టీ సహాయంతో నిజాం ఆంధ్రకమ్యూనిస్టు పార్టీ అవతరించినది. ఈ పార్టీ సభ్యులు మొదట సోషలిస్టు సిద్ధాంతాలవల్లా, నెహ్రూ రచనలవల్లా తత్వం మారి కమ్యూనిస్టులైనారు. వందేమాతరం ఉద్యమంలో విద్యార్థులుకూడా కమ్యూనిస్టు సిద్ధాంతాలవల్ల ఆకర్షింపబడి పార్టీలో చేరినారు. వీరికి నాయకుడు ప్రథమాంధ్ర సత్యాగ్రహి, రావి నారాయణరెడ్డి. బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల రామచంద్రారెడ్డి కూడా కమ్యునిస్టులే. వీరికి వేరే వేదిక లేక ఆంధ్ర మహాసభ వేదిక మీదనించే కార్యక్రమం ప్రారంభించినారు.

1940 లో మల్కాపురంసభ ప్రారంభించేసరికి పరిస్థితులివి. సభలో రాజకీయ సంస్కరణలమీద చర్చ వచ్చినది. తొలిసారి ఆంధ్రమహాసభలో మూడు పార్టీలు ప్రత్యక్షమైనవి. కమ్యునిస్టులు, జాతీయవాదులు, మితవాదులు. కమ్యూనిస్టులూ, జాతీయవాదులూ సంస్కరణలు నిరాకరించాలి అని వాదించినారు. మితవాదులు అనగా మాడపాటి, కొండా ప్రభృతులు నిరాకరణకి వ్యతిరేకులు. వాదోపవాదాల తర్వాత మితవాదులు వోడిపోయినారు. కార్యకర్తలు కమ్యూనిస్టులైనారు.

ఎనిమిదవ ఆంధ్రమహాసభ 1941లో చిలుకూరు గ్రామంలో జరిగినది. రావి నారాయణరెడ్డి అధ్యక్షుడు. ఈ సమావేశంలో నియమావళి మార్చి సభ్యత్వానికి రుసుం రూపాయనించి నాలుగు అణాలకి తగ్గించినారు. ఆంధ్రమహాసభ చురుగ్గా కమ్యూనిస్టు కార్యక్రమంలో శ్రద్ధ తీసుకున్నది.

తొమ్మిదవ ఆంధ్రమహాసభ వరంగల్ తాలూకా ధర్మవరంలో మాదిరాజు రామకోటేశ్వరరావు అధ్యక్షతన జరిగినది. ఈ సభలో కమ్యునిస్టులకీ తదితరులకీ రెండో ప్రపంచ యుద్ధం విషయమై తీవ్ర చర్చ జరిగినది. ఒక రాజీ తీర్మానం జరిగినది. అప్పుడు కమ్యూనిస్టులు యుద్ధానికి అనుకూలం, కాంగ్రెసు వ్యతిరేకం.

కమ్యూనిస్టులలో యుద్ధానికి అనుకూలంగా మార్పు రావడానికి కారణం రష్యా మీదికి జర్మనీ యుద్ధానికి వెళ్ళడం. ఎప్పుడైతే కమ్యూనిస్టుపార్టీవారు తమ యుద్ధ ప్రయత్నానికి సహాయం చేస్తామని వాగ్దానం చేశారో అప్పట్నించీ బ్రిటిషిండియా గవర్నమెంటు కమ్యూనిస్టులమీద ఆంక్ష తొలిగించినది. ఈ నిషేధం 1942లో తీసి వేసినారు. తెలంగాణాలోకూడా కమ్యూనిస్టులు బహిరంగంగా ఒక పార్టీగా వ్యవహరించడం ప్రారంభించినారు. అప్పటికే ఆంధ్రమహాసభ పేరుతో జరుగుతున్న కమ్యూనిస్టు కార్యక్రమం పెద్దలికి నచ్చలేదు.

ఇంతలో 10 వ ఆంధ్ర మహాసభకి తరుణం వచ్చినది. తొలిసారి అధ్యక్ష పదవికి పోటీవచ్చినది. ఈ సమావేశం హైదాబాదులో జరిగినది. పోటీ చేసినవారు కొండా వెంకటరంగారెడ్డి, బద్దం ఎల్లారెడ్డి. నిజానికి ఇది కమ్యూనిస్టులికీ

మితవాదులికీ జరిగిన పోటీ. చివరికి కొండా వెంకటరంగారెడ్డి గెల్చినాడు. ఈ సభలో చర్చకు వచ్చిన విషయం హైద్రాబాదులో ఒక విధమైన బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు చెయ్యాలని. కమ్యూనిస్టులు ఒక తప్పటడుగు వేసినారు. శాసనసభలో స్థానాలలో సగం ఇత్తెహాదుల్ ముస్లిమీన్‌కీ, తక్కిన సగం ఆంధ్ర, మహారాష్ట్ర, కన్నడ మహాసభలికీ వుండాలని ప్రతిపాదించినారు. తీర్మానం సభవారు నిరాకరించి నారు.

ఇంతవరకూ కమ్యూనిస్టులూ, మితవాదులూ కలిసి ఆంధ్రమహాసభలో పని చేస్తున్నారు. 11వ మహాసభకి పూర్వం మితవాదులు ఆంధ్రమహాసభలోంచి రాజీ నామా ఇచ్చినారు. సభ పూర్తిగా కమ్యూనిస్టుసభ అయినది. 1944లో 11వ మహాసభ రావి నారాయణరెడ్డి అధ్యక్షతన భువనగిరిలో జరిగినది. పదివేలమంది హాజరైనారు. సభ్యుల రుసుము నాలుగణాలనించి ఒక అణాకి తగ్గించి మళ్ళీ నియ మావళి సవరించినారు.

11వ మహాసభ తర్వాత రైతుల తిరుగుబాటు ప్రారంభం అయినది. జనగామతాలూకాలో విస్నూరు రామచంద్రారెడ్డి అనే జాగీర్దారు గ్రామాలలో ఈ తిరుగుబాటు వచ్చినది. ఇది ప్రత్యక్ష యుద్ధమై జనగామ, భువనగిరి సూర్యాపేట, హుజూరునగరం తాలూకాలకి వ్యాపించినది.

ఆంధ్రమహాసభ రెండుగా చీలినది. 11వ సభ నియమావళి ప్రకారం జరగలేదని మితవాదులు వేరే ఆంధ్రమహాసభ ఏర్పాటు చేసినారు. సభా కార్య క్రమాలు చురుగ్గా జరపడానికి యువకులైన జాతీయవాదుల్ని చేర్చుకున్నారు. భువనగిరి మహాసభకి ప్రత్యామ్నాయంగా మడికొండలో సభ చేసినారు. జాతీయ వాదులు తమ వాదన నెగ్గించుకుని మితవాదులమాట పడనీయలేదు. ఈ సభాధ్యక్షుడు మందుముల నరసింగరావు. ఆంధ్రమహాసభకి జాతీయ ఆంధ్రమహాసభ అనే పేరు వచ్చినది.

1946లో ఆంధ్రమహాసభ కంది గ్రామంలో జామలాపురం కేశవరావు అధ్యక్షతన జరిగినది. కేశవరావుకి తెలంగాణ ప్రకాశం అని పేరు. చాలా ఉద్రేకం, ఉత్సాహం కలిగినకార్యకర్త. ప్రజానాయకుడు. సత్యాగ్రహంలో పోరాడి జైలుకు పోయినాడు. అకాలంలో మరణించినాడు.

కమ్యూనిస్టులు వేరే ఆంధ్రమహాసభ ఖమ్మంలో చేసుకున్నారు. రావి నారాయణరెడ్డి అధ్యక్షత వహించినాడు. ముప్పై వేల మంది సభకి హాజరైనారు. 1946 అక్టోబరులో కమ్యూనిస్టులు తెలంగాణా ప్రజాపోరాటం అనే పేరుతో పెద్ద పెట్టున విప్లవం లేవనెత్తినారు. కమ్యూనిస్టు ఆంధ్రమహాసభని ప్రభుత్వం నిషేధించినది.

అయ్యంగార్ కమిటీ సూచనలు ఏదోవిధంగా ఆచరణలో పెట్టాలని సంక ల్పించగా జాతీయ ఆంధ్రమహాసభ ఈ సంస్కరణలు పూర్తిగా బహిష్కరించాలని తీర్మానించినది. అటుతర్వాత అఖిలభారత సంస్థాన ప్రజాసభ ఉదయపూరులో సమావేశమైనది. ఆ సభవారు ఏర్పాటు చేసిన స్థాయీ సంఘం హైదరాబాదు సంస్కరణలు పనికిరావని తీర్మానించినది. అఖిలభారత వేదికమీద హైదరాబాదు ప్రస్తావన రావడానికి అదే ప్రారంభం.

బ్రిటిషు ఇండియాలో వాతావరణం మారినది. జాతీయ కాంగ్రెసు రంగంలో ప్రవేశించి పని ప్రారంభించినది. బ్రిటిషువారు భారతదేశానికి స్వరాజ్యం ఇచ్చి వెళ్ళిపోయే సూచనలు కానవచ్చినవి. హైద్రాబాదు ప్రభుత్వంకూడా కాంగ్రెసుపట్ల తనవైఖరి మార్చుకోవలసి వచ్చినది. ఇంతలో కేంద్రంలో జాతీయ మంత్రివర్గం ఏర్పడినది. హైద్రాబాదు స్టేటు కాంగ్రెసుమీద నిషేధం తొలిగించక తప్పలేదు.

హైద్రాబాదు రాజ్యంలో ఆంధ్ర, మహారాష్ట్ర కర్నాటక మహాసభలు విడి విడిగా జరపడంకంటె స్టేటు కాంగ్రెసు సంస్థ ఒకటేవుంటే పటిష్ఠంగావుండి ప్రజోప కారిగా వుంటుందని తెలుసుకుని నాయకులందరూ సంప్రదించి పని ప్రారంభించి నారు. ఈ మూడు మహాసభలూ ఏకమై హైద్రాబాదు స్టేటు కాంగ్రెసుగా రూపొంది నవి. అప్పటినించీ ఆంధ్రమహాసభలు చాలించ బడినవి. పాతిక సంవత్సరాల తర్వాత నిజాం ఆంధ్రోద్యమం హైద్రాబాదు స్వాతంత్ర్యోద్యమంలో లీనమైనది.



# హైద్రాబాదు విముక్తి

ఆంధ్ర, మహారాష్ట్ర, కర్నాట మహాసభలు స్టేటు కాంగ్రెసులో లీనమైపోయే సరికి యావత్తు నిజాం రాజ్యానికీ ఏకైక రాజకీయసంస్థ ఏర్పడినది. నిషేధం పోగానే స్టేటు కాంగ్రెసు ఒక మహాసభ చేసినది. హైదార్రాబాదులో బాధ్యతాయుత ప్రభుత్వం కావాలి; హైదార్రాబాదు భారతీయ సమాఖ్యలో చేరాలి; రాజ్యాంగ పరిషత్తులో హైదార్రాబాదు ప్రతినిధులు వుండాలి, అని ఆ మహాసభలో తీర్మానించి నారు. ఈ ఆశయాల సాధనకోసం స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం ప్రారంభించినది.

ఈ ఉద్యమం ప్రారంభించేసరికి 1947 ఆగస్టు 15 న స్వరాజ్య ప్రదానం జరుగుతుందని తెలిసిపోయినది; భారతపాకిస్థానుల విభజన జరుగుతుందని తేలి పోయినది. కేంద్రంలో జాతీయ ప్రజాప్రభుత్వం అధికారంలో వున్నది. బ్రిటిషు ప్రభుత్వం తాను ఖాళీ చేస్తున్నాననీ, తనకీ సంస్థానాలకీ మధ్య అమలులోవున్న ఒడంబడికలు నాటితో సరి అనీ, సంస్థానాధిపతులు భారత పాకిస్థాను దేశాలలో దేనిలోనైనా చేరవచ్చుననీ, చేరడం ఇష్టంలేకపోతే సర్వస్వతంత్రులుగా వుండి పోవ చ్చుననీ ప్రకటన చేసినది. నిజాం తాను స్వతంత్రంగా వుండాలని నిశ్చయించు కున్నాడు.

ఇటువంటి పరిస్థితులలో స్టేటు కాంగ్రెసుసత్యాగ్రహం ప్రారంభించినది. అప్ప టికి ఇత్తేహాదుల్ ముస్లిమీన్, ఖాసింరజ్వీ అధ్యక్షతకింద హైద్రాబాదు ప్రభుత్వాన్ని వశం చేసుకున్నది. ఈ విషమసంధిలో కమ్యూనిస్టులు భూస్వాముల దౌర్జన్యంలోంచి రైతుల్నీ, పాటకజనాన్నీ విముక్తుల్ని చెయ్యడానికి సమరం ప్రారంభించినారు.

స్టేటు కాంగ్రెసు ఆశయం భారతయూనియన్‌లోనే వుండి హైద్రాబాదుకి ప్రజాప్రభుత్వం సాధించాలని. ఇత్తేహాదుల్‌ముస్లిమీన్ ఆశ నిజాం సర్వస్వతంత్రుడుగా వుండిపోవాలని. కమ్యూనిస్టుల ప్రయత్నం హైద్రాబాదురాజ్యంలో కమ్యూనిజం స్థాపించాలని. ఈ ముగ్గురి ప్రయత్నాలూ ప్రజలకి ఇక్కట్లనే కలిగించినవి. ఒకేసారి జరుగుతూవచ్చిన ఈ సంఘర్షణలో రాజ్యం అరాజకమైనది.

స్టేటు కాంగ్రెసుసత్యాగ్రహం మూడుదశలుగా సాగినది. 1. శాసనోల్లంఘనం; 2. ఉద్యమం అణచడానికి ప్రభుత్వచర్యకి ప్రతిచర్య; 3. ఆత్మసంరక్షణార్థం ప్రజలకోసం ఆయుధసమీకరణ. నిజాంరాజ్యంలో పరిస్థితులు విపరీతమైనవి. ప్రభుత్వమూ, దానికి వొత్తాసిగావున్న ఇత్తేహాదుల్‌ముస్లిమీనూ కఠోరమైనవి. భూతదయ, మానవత్వంతక్కువ. కమ్యూనిస్టులు దౌర్జన్యానికి విరోధులుకారు. ఈ పరిస్థితులలో గాంధీ పద్ధతిలో సత్యాగ్రహం చెయ్యడం దుర్లభం. పైగా అనుభవంవున్న నాయకులు లేరు. తరిఫీయదు పొందిన అనూయాయులు తక్కువ. అంతేకాక సత్యాగ్రహం చేతామని సంకల్పించిన ఆంధ్రనాయకులు మితవాదులు. ఇదివరకు సత్యాగ్రహసమరంలో పాల్గొననివారు. స్టేటు కాంగ్రెసులోవున్న మహారాష్ట్రులు మార్క్సిస్టు అభిమానులు. తత్కారణంగా సత్యాగ్రహం కొందరి విషయంలో లాంఛనప్రాయం అయినది. ప్రజలలో ప్రచారం సాగినా కొన్ని విషయాలలో శాస్త్రీయంగా లేదు. ప్రభుత్వదౌర్జన్యచర్యవల్ల, రజాకార్లదౌర్జన్యంవల్ల ప్రజలు ప్రతీకారం చెయ్యవలసి వచ్చినది. దీనికి ఆయుధసేకరణ అవసరమైనది. ఈ దౌర్జన్య ప్రతిదౌర్జన్యాలలో ఎవరు ఏమి చేశారో చెప్పడం కష్టం. మడికట్టుకున్నవారు మాత్రం తక్కువ అని తెలుస్తుంది. ఈ ఆయుధసేకరణలో స్టేటు కాంగ్రెసుకి అప్పటి మద్రాసురాష్ట్రం చాలా సహాయం చేసినది. బ్రిటిషు ఆంధ్రులు ఒక్కకంఠంతో. ఒక్కమనిషిగానిలబడి. సహాయం చేసినారు. ఆ సహాయం లేకపోతే కాంగ్రెసు సత్యాగ్రహం ఏ విధమైన పనీ చెయ్యగలిగేది కాదు. పైగా బొంబాయి ప్రభుత్వం స్టేటు కాంగ్రెసుకి అశ్రయం ఇవ్వనన్నది. భారం అంతా ఒక్క మద్రాసే భరించవలసి వచ్చినది. బెజవాడ. మద్రాసునగరాలలో హైద్రాబాదు కాంగ్రెసునాయకులు నివాసంచేసి ఉద్యమం నడిపినారు. స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం బహిరంగ ఉద్యమంమాత్రం కాదు. అది ప్రచ్ఛన్నసంగ్రామం. తత్కారణంగా ప్రభుత్వం ప్రజల్ని బాధించి, వూళ్లకివూళ్లు ధగ్ధం చేసినది.

ఇంతలో భారతదేశం స్వతంత్రమైనది. యూనియన్ ప్రభుత్వం నిజాంతో యథాతథం వొడంబడిక చేసుకున్నది. ఈ వొడంబడికప్రకారం నిజాం స్వతంత్రుడే కాని. దేశరక్షణ, విదేశవ్యవహారాలూ. రవానారహదార్లూ మాత్రం యూనియన్ ప్రభుత్వం స్వాధీనంలో వుండాలి. బ్రిటిషురాజ్యంలోకూడా అంతే. అందుకనే అది

యథాతథంగావున్న పరిస్థితుల్ని అంగీరించిందిగనక ఆ పేరు వచ్చినది. అయినా నిజాం సర్వస్వతంత్రుడుగా వ్యవహరించిడం ప్రారంభించినాడు,

ఢిల్లీలోవున్న కేంద్రప్రభుత్వం చేతులుకూడా ఖాళీగాలేవు. ఒకవేపు మత కలహాలు. కాశ్మీరు హడావిడితో తీరికలేదు. హైద్రాబాదులో అరెస్టయి విడుదలైన నాయకులద్వారా సంగతులు తెలుస్తున్నవి. ఎందుకైనా మంచిదని కె. ఎం. మున్షీని ఇండియా ప్రభుత్వప్రతినిధిగా హైదరాబాదులో నియమించినది. మున్షీ ఆంతరంగిక కార్యదర్శిగా ఎం. టి. రాజును నియమించినారు. స్టేటు కాంగ్రెసుకీ మున్షీకీ మధ్య ఎన్. కే. రావు సంధాన అధికారిగా వుండేవాడు.

ఎప్పుడైతే స్టేటు కాంగ్రెసు కార్యక్రమంతో, ఆశయాలతో ఏకీభవించి ప్రజాబాహుళ్యం ఆకర్షించబడుతోందో నిజాం ప్రభుత్వం ఏవో రాజకీయసంస్కరణలు అమలు పెడదామని ప్రయత్నం ప్రారంభించినది. జైలులోవున్న కాంగ్రెసు నాయకులతో సంప్రదింపులు చేసినది. ఈ ప్రతినిధులు అధికారంలోకివస్తే ఒక షరతు ఏమంటే, ఒకవేళ ఇండియా పాకిస్థానులమధ్య యుద్ధంవస్తే హైద్రాబాదు తటస్థంగా వుండాలని. ఇటువంటి షరతులు సహజంగా కాంగ్రెసు నిరాకరించినది. మనదేశ దౌర్భాగ్యం ఏమంటే ఎంత హీనపు పనైనా చెయ్యడానికి ఎవరో ఒకరు సిద్ధంగా వుంటారు. హిందువులలో కొందరు వకీళ్లనీ, ఇతరుల్ని మభ్యపెట్టి వారు ప్రతినిధులని పేరుపెట్టి ముస్లింమెజారిటీతో ఒక ప్రభుత్వం ఏర్పాటు చేసినారు. ఒక శాసనసభకూడా అదే పద్ధతిలో ఏర్పాటైనది. శ్రీపతిరావు పల్నిట్కర్ అనే న్యాయమూర్తిని శాసనసభకి స్పీకరుగా నియమించినారు. లాయకలీ అనే ఒక ఇంజనీరు మంత్రిమండలి అధ్యక్షుడు. ఈ ప్రభుత్వాన్నే రజాకారుల ప్రభుత్వం అనేవారు. రజాకారు అంటే వాలంటీరు. రాజ్యంలోవున్న ముస్లింల సంఖ్యవృద్ధి చెయ్యడానికి ఇతర రాష్ట్రాలనించి గూండాల్ని తీసుకువచ్చి. వారికి ఆయుధాలిచ్చి, మిలిటరీవేషం వేసి ఒక తరిఫీయదులేని సైన్యం తయారు చేసినది లాయకలీ ప్రభుత్వం. ఈ రజాకార్లు ఇత్తేహాదుల్ ముస్లిమీన్ ఆధ్వర్యంలో పనిచేసేవారు. ఆ సంస్థ నాయకుడు ఉత్తర ప్రదేశంనించి హైద్రాబాదు వచ్చిన ఒక అడ్వకేటు. ఖాసింరజ్వీ. రజ్వీ హైద్రాబాదులో సర్వాధికారి అయిపోయినాడు. అతని ఇష్టమే నిజాం ఇష్టం, ప్రభుత్వం ఇష్టం. ఈ రజ్వీ సలహాతో రజాకారు ప్రభుత్వం చేసిన దౌర్జన్యాలు మానవ చరిత్రకే కళంకంగా తయారైనవి. హిందువుల సంఖ్య తగ్గించ డానికి వారిహత్య, ముస్లింల సంఖ్య హెచ్చించడానికి వారి దిగుమతి. ఆ విధంగా కొన్నివేల కుటుంబాల్ని రాజ్యంలోకి రావించినారు. రాజ్యం పదహారు జిల్లాలలోనూ వీరిని విచ్చలవిడిగా విడిచిపెట్టి దుశ్చర్య సాగించినారు. ప్రతిచోటా ఒక శిబిరం. గృహదహనాలు, హత్యలు, దోపిడీలు, భూముల అన్యాక్రాంతం, స్త్రీల మానభంగం.

ఒకటేమిటి నిజాంరాజ్యం యమలోకంకంటె దుర్భరం అయినది. లక్షలాది ప్రజలు ఇళ్ళూ వాకిళ్ళూ వదిలిపెట్టి ఇతర ప్రాంతాలకి పారిపోయినారు. వీరికి ముఖ్యంగా కోస్తా జిల్లాలవారు ఆశ్రయం ఇచ్చినారు. వుండిపోవలసిన ప్రజలు పక్కరాష్ట్రాలవారి సహాయంతో ఆయుధాలు సేకరించి ఎదురు తిరిగినారు. ఈ యెదురు తిరగడంలో ప్రజానీకానికి ధైర్యోత్సాహాలు కలిగించినది కమ్యూనిస్టులు.

కమ్యునిస్టుల కార్యకలాపాల పుట్టుపూర్వోత్తరాలూ మొదలైనవి మున్షీ వ్రాసినాడు;

"1948 ఫిబ్రవరి ఆఖరులో కలకత్తాలో ఆగ్నేయ ఆశియా యువజన మహాసభ జరిగినది. రెండు ప్రపంచకమ్యూనిస్టు యువజనసంస్థల ఆధ్వర్యాన ఈసభ జరిగినది. పైకి నిరపాయంగా కనబడే ఈ మహాసభలో కొన్నిముఖ్యమైన తీర్మానాలు జరిగినవి. ఈ తీర్మానాల వెనకాల వివిధదేశాల కమ్యూనిస్టు బలం వున్నది. చీనా, బర్మా, మలయా, ఇండొనీసియా దేశాల కమ్యూనిస్టుపార్టీలు ఈ మహాసభలో ఒక ఉమ్మడికార్యక్రమం నిర్ణయించుకున్నవి. తత్కారణంగా ఇండియా కమ్యూనిస్టుపార్టీ పాలసీలో తీవ్రమైన మార్పువచ్చినది. కొత్తసిద్ధాంతం ప్రకారం ఇండియాలో సోషలిస్టులు ప్రజావిప్లవం భగ్నం చేసినారు; కేంద్రంలో నెహ్రూ ప్రభుత్వం ఇంగ్లాండు అమెరికా దేశాల చేతుల్లో కీలుబొమ్మ; ఈ ప్రభుత్వాన్ని కమ్యూనిస్టులు బలపర్చకూడదు. ఇండియా రాజ్యాంగం విప్లవ విరోధం, ప్రజావ్యతిరేకం.

"ఈ తీర్మానంవల్ల హైద్రాబాదు కమ్యునిస్టుపార్టీ విధానంలో కొత్తపంథా గోచరించినది. ఒక రహస్యకరపత్రం ప్రకారం ఆంధ్రలో కమ్యూనిస్టులికి మంచి బలం లభించినది. ఈ ప్రాంతం ముందుగా సోవియటు విధానంలోకి మార్పుచెయ్యాలి. ఇక్కణ్ణించి తక్కిన భారతదేశానికి 'విముక్తి' కలిగించాలి. ఈ లక్ష్యం సాధించ డానికి కొత్త విధానం అవలంబించవలసి వచ్చినది. హైద్రాబాదులో ప్రభుత్వం చేస్తున్న రజాకార్లు ఫాసిస్టులు. ప్రజాప్రభుత్వానికి వ్యతిరేకులు. వీళ్లని ఏదో విధంగా మట్టుపెట్టిమాయచెయ్యాలి. గ్రామాలలో సోవియట్లు స్థాపించాలి. విప్లవ చర్య ద్వారా, గేరిల్లా పోరాటంద్వారా తెలంగాణా ప్రాంతాలైన నల్లగొండ, వరంగల్లు జిల్లాలలోనూ, ఆంధ్రజిల్లాలైన కృష్ణా, గుంటూరు ఉభయగోదావర్లలోనూ కమ్యూనిస్టు అధికారం స్థాపించాలి. ఈ ఉద్దేశ్యాలతో స్టేటుకాంగ్రెసుకీ, నెహ్రూ ప్రభుత్వానికీ వ్యతిరేకంగా ప్రచారం ప్రారంభం అయినది. స్టేటుకాంగ్రెసు ప్రజా వ్యతిరేకం. యథాతథం ఒడంబడిక నిజామూ, పటేలూ కలిసి పన్నిన కుట్ర. ఈ సందర్భంలో కమ్యూనిస్టులికీ రజాకార్లకీ కలిసి ఒక ఉమ్మడి శత్రువు గోచరించినది. అది నెహ్రూ ప్రభుత్వం.

"అంతవరకూ హైద్రాబాదు ప్రభుత్వ దుశ్చర్యలు ఆపుచెయ్యడానికి కమ్యూనిస్టులు స్టేటుకాంగ్రెసుతో సహకరిస్తూవున్నట్టు వ్యవహరించినారు. 1948 ఫిబ్రవరి ఆఖరులో ఈ సహకారనటన ఆగిపోయినది. స్టేటుకాంగ్రెసు కార్యకర్తల్ని, సానుభూతి చూబించేవార్ని జిల్లాలలోంచి వెళ్లగొట్టడం ప్రారంభించినారు. వారిప్పుడు శత్రువులైనారు. వారిమీద చెయ్యిచేసుకోడం ప్రారంభించినారు. ఇదివరదాకా జిల్లాలలోనే పరిమితమైవున్న కమ్యూనిస్టు ప్రాబల్యం, హైద్రాబాదునగరంలోకూడా వ్యాపించి, ఆత్రాఫ్ బాల్దాజిల్లాలో దక్షిణ ప్రాంతంలో స్థిరపడినది. మార్చి మధ్యలో నేను, కమ్యూనిస్టులూ, రజాకార్లూ చేసే దౌర్జన్యాల, ఘోరకృత్యాల వివరాలు సేకరించినాను. పరిస్థితి అప్పటికే వికృతరూపం దాల్చినది. కమ్యూనిస్టులు జిల్లాలలో గ్రామగ్రామంమీదా పడ్డారు. రజాకార్ల దౌర్జన్యం ప్రతిఘటించే నెపంతో పల్లెలమీద పడినారు. ఒక అధికార ప్రకటనలో ఇల్లా వున్నది. 1946 ఆగష్టు 15 మొదలు 1948 సెప్టెంబరు 13 వరకూ కమ్యూనిస్టులు 2000 మందిని ఖూనీ చేసినారు, 22 పోలీసు కార్యాలయాలమీద దాడిచేసినారు; గ్రామకలివెలు తగుల బెట్టినారు; చాలామంది గ్రామోద్యోగుల్ని అష్టకష్టాలూ పెట్టినారు; కరోడ్గిరీ (రెవెన్యూ) కార్యాలయాలు తగుల బెట్టినారు; 230 తుపాకులు దొంగిలించినారు; ధాన్యం కొల్లగొట్టినారు; పదిలక్షలరూపాయిల జవహేరీ దోచుకున్నారు; రవానా సౌకర్యాలు విచ్ఛిన్నం చేసినారు; గేరిల్లా యుద్ధవిధానం అవలంబించినారు; 500 మంది సాయుధ కమ్యూనిస్టులు నల్లగొండజిల్లా, హూజూరునగరం తాలూకా పెద్దవీడు గ్రామంమీద దాడిచేసి దోచుకున్నారు; పదిమంది గ్రామస్థుల్ని స్త్రీలు పిల్లలతో సహా, ఖూనీ చేసినారు. పదిమందిని గాయపర్చినారు. డెబ్భైఇళ్లు పరశురామ ప్రీతి చేసినారు. చంటిపిల్లల్ని అగ్ని జ్వాలలకి ఆహుతి చేసినారు. ఈ దురంతానికి సాకు గ్రామస్థుడెవరో పోలీసుకి బాతినీ ఇచ్చినాడని. పెంగోటలో పదహారుగురు స్త్రీ పురుషుల్ని ఎత్తుకుపోయినారు. పురుషుల్ని చంపి దహనం చేసినారు. స్త్రీల ఆచోకీ తెలియలేదు. ధరణిపాడుగ్రామంలో రాత్రివేళ ఒక మహమ్మదీయ వృద్ధురాల్ని ఎత్తుకుపోయి అడవిలో బల్లెంతో పొడిచి చంపేసినారు.

"1948 మే 4 న నిజాం ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టీమీద నిషేధాన్ని తొలిగించినది. రావినారాయణరెడ్డి ప్రభృతులమీద వున్న అరెస్టువారంట్లు రద్దు చేసినది. అదే సమయంలో హైద్రాబాదు కమ్యూనిస్టుపార్టీ విధానం మారుస్తూ ఒక కరపత్రం ప్రచురించినది. హైద్రాబాదురాజ్యం భారతయూనియన్‌లో చేరడం తప్పని ప్రకటించినది. హైద్రాబాదులో స్థాపించిన లాయకలీ ప్రభుత్వాన్ని ఖండించినది. భారతీయప్రభుత్వం పెట్టుబడి దారీ విధానంలో వున్నదని ఆక్షేపించినది. ప్రజా స్వాతంత్ర్యం రావడానికిముందు భూఖామమందు విధానం రూపుమాపాలని ప్రచారం జరిగినది.

"రిపోర్టుల ప్రకారం నిజాం ప్రభుత్వానికీ కమ్యూనిస్టులికీమధ్య లాలోచీ వున్నట్టు తోస్తుంది. బెంగాలునించి వచ్చిన ఆయుధసామగ్రి కమ్యూనిస్టులు రజా కార్లకి అందజేసినట్టు సాక్ష్యం దొరికినది. తమ విధానం ప్రజావాణి అని ప్రచారం చేసినారు. తాముచేసినది. ప్రజలకోసమే నన్నారు. యూనియను ప్రభుత్వం రాజ్యంలోకి వస్తే ప్రజాఉద్యమం నాశనం అవుతుందని ప్రకటటించినారు. యూనియన్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా రజాకార్లతో కలయిక ఏర్పాటుచేసు కున్నారు. భారతదేశంలో ప్రచ్ఛన్నంగా వుంటూన్న కమ్యూనిస్టులు హైద్రాబాదు రాజ్యంలో ప్రవేశించి ఆశ్రయం ఏర్పాటు చేసుకున్నారు. వారిలో కొందరు నాయకులు ప్రత్యక్షంగా నగరంలో తిరిగి, మంత్రులతో, ఉన్నతోద్యోగులతో మంతనాలు జరిపినారు. కమ్యూనిష్టు ప్రతినిధి ఒకర్ని మంత్రివర్గంలో చేర్చ వచ్చునని ఆశించినారు. దాంతో చాపకింద నీళ్లలాగ వ్యాపించ వచ్చునని భ్రమ పడినారు.

"నిజాంప్రభుత్వంతో పెట్టుకున్న ఈ సంబంధం వల్ల, కమ్యూనిస్టులు, అది వరకే తాము ఆక్రమించిన గ్రామసీమలలో మరింత బలపడడానికి అవకాశం కలిగినది. ఆయాగ్రామాలలో, భూములు, పశువులు, ధాన్యం కమ్యూనిష్టు అభిమానులికి పంచడమైనది. గ్రామాలలో దోచుకున్న ధనధాన్యాలు వారి సంగ్రామ కార్య క్రమానికి ఉపయోగించినారు. ఒక్క జులైలోనే నలభైకి పైగా గ్రామాలమీద దాడులు చేసినారు. అప్పటికి 3000 గ్రామాలకి విముక్తి కలిగించినామని చెప్పు కున్నారు. నల్లగొండ, వరంగల్లుజిల్లాలలో కమ్యూనిష్టు ప్రభావం తుడిచివెయ్య డానికి ప్రత్యేక పోలీసు, సైనిక దళాలకి నాలుగు సంవత్సరాలు పట్టినది."

ఈ ప్రత్యేక దళాలు ఉపప్రధాని సర్దార్‌పటేల్ నియమించినాడు. ఇవి సివిల్ సర్వీసులో పనిచేసే కెప్టెన్ నంజప్ప ఆధ్వర్యంలో పనిజేసినవి. దౌర్జన్యా నికి ప్రతిదౌర్జన్యం ప్రారంభించి, వాళ్ళు దాక్కునే తావులలోనూ, రోడ్డుపక్కలలోనూ వున్న అడవులు కొట్టించి, ప్రచ్ఛన్నంగా వున్నవారినందర్నీ పట్టుకుని అల్లర్లు అదు పులోకి తెచ్చినాడు. ఎన్నో ఆయుధాలూ, అవితయారుచేసే విధానాలు తెలియజేసే కాగితాలూ దొకినవి. ఆయుధసామగ్రి ఆనాటికి ఆధునికమైనది. పట్టుబడిన మందు గుండుసామానూ, ఆయుధాలూ ఢిల్లీలో పార్లమెంటు భవనంలో ప్రదర్శించినారు. రెండు పెద్ద హాలుల్లోగాని ఈ సామగ్రి ఇమడలేదు.

హైద్రాబాదు విముక్తి చరిత్రలో పరిటాల ప్రజాఉద్యమం చాలాగొప్పది, దౌర్జన్యం, హింసాకాండా లేకుండా, ఏడు గ్రామాల ప్రజలు తమశక్తితో నిజాం బలాన్ని ధిక్కరించి ప్రజానిరంకుశ ప్రభుత్వం స్థాపించి, పరిపాలన సాగించి, ఇండియన్ యూనియన్‌లో చేరేదాకా దీక్షతో తమ స్వాతంత్ర్యం సంరక్షించు కున్నారు.

ఈస్టిండియా కంపెనీవారూ, నిజామూ రాజ్యభాగాలు ఇచ్చి పుచ్చుకోడంలో మధ్యమధ్య కొన్ని గ్రామాలూ, భూఖండాలూ, అటు వుండవలసినవి ఇటూ ఇటు వుండవలసినవి అటూ వుండిపోయినవి. వీటిని 'ఆన్‌క్లేవుస్' అనే వారు. ఇటువంటివి నిజాం రాజ్యం సరిహద్దులలో చాలా వుండేవి. బ్రిటిషు గ్రామాలు నిజాములోనూ, నిజాముప్రాంతాలు బ్రిటిష్ ఇండియాలోనూ వుండేవి. 1950 లో ఒక చట్టంచేసి ఈ ప్రాంతాలు ఏ రాష్ట్రంలో కలిపితే ప్రజలకి అనుకూలంగా వుంటుందో, ఏ రాష్ట్రానికి సమీపమో నిర్ణయించి, బొంబాయిలోకొన్నీ, మద్రాసులో కొన్నీ కలిపినారు. అటువేపు వున్నవి కొన్నిగ్రామాలు హైద్రాబాదు రాజ్యంలో కలిపి నారు. హైద్రాదాదు రాజ్యంలో కలిపిన యూనియన్ గ్రామాల సంపర్కంవల్ల ఈ రాజ్యంలో సంస్కారం కొంత ముందుకు వెళ్ళినదని చెప్పవచ్చు.

ఈ విధంగా జరిగిన విలీనీకరణానికి ముందు అటూ ఇటూ వుంటూవచ్చిన ఏడు గ్రామాలే ఈ పరిటాల ప్రజా ఉద్యమానికి కేంద్రాలు. నిజాం ఇలాకా వరంగల్‌జిల్లా మధిరతాలూకా. బ్రిటిష్ ఇలాకా కృష్ణాజిల్లా సరిహద్దులలో వుంటుంది. తత్కారణంగా కొన్ని నిజాం ఇలాకా గ్రామాలు కృష్ణాజిల్లాలోనే వుండేవి. ఇవి చుట్టూ బ్రిటిష్‌రాజ్యంవున్న నిజాం గ్రామ ద్వీపాలు. కానాత్‌తాలూకా అనే పేరుతో ఇటువంటివి ఏడు గ్రామాలు వుండేవి. అవి జాగీర్దారైన నవాబ్ కమాల్ యార్జంగ్ గ్రామాలు. ఏడు గ్రామాలమిదా ఆయనకి సాలీనా 90,000 కల్దారు రూపాయల ఆదాయం వచ్చేది. ఈ గ్రామాలలో జాగీర్దారు ప్రభుత్వమే వుండేది. ఈ గ్రామాల పేర్లు: పరిటాలు, బత్తినపాడు, గని ఆత్కూరు, మోగులూరు, కొడవటికల్లు ఉస్తేపల్లి, మల్లవెల్లి.

బ్రిటిష్ ఇండియా మధ్యలో వుండడంవల్ల సంస్కృతిలో, మానసిక పురో గమనంలో ఈ గ్రామస్థులు తక్కిన ఆంధ్రులతో సమానంగా వుండేవారు. గాంధీ ఉద్యమం వీరిని ఉత్తేజ పరిచినది. వీలైనంత వరకు జాగీర్దారు జులుంకిగాని, అతని గులాంల దౌర్జన్యానికిగాని వీరు లొంగలేదు. మితిమీరినప్పుడు తిరగబడ్డారుకూడాను. కమాల్‌యార్జంగు తండ్రి కాలంలో లంక సుబ్బయ్యశాస్త్రి అనే వ్యక్తి ముస్లిం జాగీర్దార్ దగ్గిర పెత్తనం సాధించి ప్రజల్ని బాధపెట్టేవాడు. ఈ గ్రామాలకి అతను నియంత. విసిగిపోయిన ప్రజలు సుబ్బయ్యశాస్త్రిని ఖూనీచేసి పీడ విరగడ చేసుకున్నారు.

1947 ఆగస్టు 15 భారత దేశంలో అన్ని గ్రామాలలోవలెనే ఈయేడు గ్రామాలుకూడా స్వాతంత్ర్య దినోత్సవంచేసి, జాతీయపతాకం ఎగురవేసి సభలు జరిపినవి. జాగీరు ఉద్యోగులు వీర్ని ఆపుజెయ్యలేక పోయినారు. చివరికి ఈ యేడు గ్రామాలు తాము స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన ప్రజా ప్రభుత్వం అని ప్రక టించి, కమిటీలు పెట్టి, సక్రమంగా పరిపాలన సాగించినారు. ఢిల్లీ వెళ్లి గాంధీ,

పటేల్ ప్రభృతుల్ని కలిసి ఇండియన్ యూనియన్‌లో కలుపుకోమని అడిగినారు. మద్రాసువెళ్లి తాము వసూలుచేసిన శిస్తు రాష్ట్రఖజానాలో జమకట్టుకోమని కోరినారు. అప్పటి యథాతథపు వొడంబడిక ప్రకారం వారి కోరిక నెరవేరలేదు. కేంద్ర కమిటీలూ, గ్రామకమిటీలు పెట్టి, అల్ప సంఖ్యాకులికి పరిరక్షణ కల్పించి, చక్కగా ఏ అల్లర్లు లేకుండా, నేరాలూ, సివిలు కేసులూ పంచాయతీల ద్వారా ఫైస్లా చేసు కుంటూ 12000 మంది ప్రజలు ఒక ఆదర్శ ఉద్యమం స్థాపించినారు. 1950 జనవరి 26న పరిటాల, గనిఆతుకూరు, మోగులూరు, కొడవటికల్లు, ఉస్తేపల్లి కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలోనూ, మల్లవెల్లి గన్నవరం తాలూకాలోనూ విలీనం చెయ్యబడినాయి.

ఆంధ్రప్రదేశ సంస్థాపనకి ఈ గ్రామాల విలీనీకరణ శంకుస్థాపన వంటిది. స్వాతంత్ర్యవాయువులు ముందుగా పీల్చిన ఈ గ్రామవాసులు ఉత్సాహంతో తమ సాటివారితో కలిసిపోయినారు.

పగలు రజాకార్లూ, రాత్రి కమ్యూనిస్టులూ దాడులు చేస్తుండగా ప్రజల బాధలు చూడలేని స్టేటు కాంగ్రెసు నాయకులు ఢిల్లీపోయి ప్రధానమంత్రి నెహ్రూ తోనూ, ఉపప్రధాని పటేల్‌తోనూ మొరపెట్టుకున్నారు. లోకం ఏమనుకుంటుందో, మహమ్మదీయులతో ఏం చిక్కు వస్తుందో అని నెహ్రూ తటపటాయించినాడు. పటేల్ మాత్రం నెలరోజులు ఆగండి తగినచర్య తీసుకుంటామన్నాడు. ఆ సమ యంలో ఎదురుతిరిగిన నిజాముకీ, భారత యూనియన్ ప్రభుత్వానికీ మధ్య ఏదో రాజీ కుదురుద్దామని మౌంటుబేటన్ ప్రయత్నం చేస్తున్నాడు. ఆ ప్రయత్నం విఫల మవుతుందని పటేలుకి తెలుసును.

1948 సెప్టెంబరు 13 న భారత యూనియన్ సైన్యాలు హైద్రాబాదు రాజ్యంలో ప్రవేశించినవి. ఒకవేపునించి మేజర్ జనరల్ జే. ఎన్. చౌదరి, మరో వేపునించి మేజర్ జనరల్ రాజేంద్రసింహా నాయకత్వాన తుదిచివేత ప్రారంభమైనది. ఇన్నాళ్ళు మేకపోతు గాంభీర్యంతో నిరాయుధులైన ప్రజల్ని నానాయాతనా పెట్టిన రజాకార్లు ఒకటే పలాయన మంత్ర పఠనం. పటాపంచలైపోయినారు. నిజాం శరణు వేడినాడు. అలని పరిపాలన అంతరించినది. హైద్రాబాదు ప్రవేశించడానికి మొదటివాడు చౌదరి గనుక, రాజ్యానికి చౌదరిని మిలిటరీ గవర్నరుగా నియమించి నారు. రజాకార్ నాయకుడు ఖాసింరజ్వీని, మంత్రి మండలి అధ్యక్షుడు లాయకలీని, అతని సహచరుల్ని నిర్బంధించినారు. తరువాత వారు పాకిస్థాన్ పారిపోయినారు. 224 సంవత్సరాలు ఏడుగురు నిజాముల దుష్పరిపాలన తర్వాత హైద్రాబాదు ప్రజానీకం స్వతంత్రవాయువులు పీల్చగలిగినది.

ప్రజలకి విముక్తి కలిగినది. నాయకులికింకా వెలుగు కనపడలేదు. కేంద్రంలో కాంగ్రెసు అధికారంలో వున్నది. హైద్రాబాదులో మిలిటరీ గవర్నరు పరిపాలన

శాశ్వతంకాదు. ప్రజాప్రభుత్వం వచ్చితీరాలి. ఆ ప్రభుత్వం కాంగ్రెసు ప్రభుత్వమే అవుతుంది. ఆ ప్రభుత్వంలో ఎవరా అనే ప్రశ్న నాయకుల్ని బాధించడం సహజం. నేను నేను అని సిద్ధం కావడం రివాజు. హైద్రాబాదు స్టేటు కాంగ్రెసు నాయకులలో భారతదేశంలో ఇతర ప్రాంతాలలో చెయ్యవలసిన త్యాగంగాని, పడవలసిన అగచాట్లుగాని అవసరం లేకపోయినవి. కనీసఅర్హత కొద్దినెలలు జైలు. ఆ అర్హత సంపాదించినారు. అంతా సులువుగా తేలిపోయినది. బాల్యంకూడా వెళ్ళని ఈ హైద్రాబాదు స్టేటు కాంగ్రెసులో గ్రూపులూ ముఠాలూ మొదటినించీ వున్నవి. భాషావైవిధ్యం వల్లనేకాక, సిద్ధాంత రీత్యాకూడా అభిప్రాయభేదాలు కలిగినవి. స్టేటు కాంగ్రెసు అధ్యక్షుడు స్వామీ రామానందతీర్థ, మహారాష్ట్రుడు; మార్క్సిస్టు ప్రభావంకింద వున్నవాడు. అతని అనుయాయులు కూడా అంతే. ఆంధ్రులైన కొండా వెంకటరంగారెడ్డి, బూర్గుల రామకృష్ణరావు గ్రూపువారూ మితవాదులు. ఈ రెండు గ్రూపులికీ తగాదాలు వచ్చినవి. రామానంద గ్రూపు రెడ్డి-రావు గ్రూపుమీద కొన్ని ఆరోపణలు చేసినది. పోయిన నిజాం కొన్ని రాజకీయ సంస్కరణలు ప్రతిపాదించి, వీరిద్దర్నీ మభ్యపెట్టినాడనీ. వీరిద్దరూ ఆ టోపీలోపడి, ఆశతో, అధ్యక్షుడి అనుమతి లేకుండా పటేలు దగ్గిరికి వెళ్ళినారనీ ఆరోపణలు చేసి రెడ్డి-రావు గ్రూపువార్నందర్నీ కాంగ్రెసు సభ్యత్వంలోంచి తొలిగించినారు. వీరిద్దరూ జనార్దనరావు దేశాయి అధ్యక్షతకింద వేరే కాంగ్రెసు స్థాపించినారు. నెహ్రూ పరిష్కారం చెయ్యలేని ఈ సమస్యకూడా పటేలే హైద్రాబాదువచ్చి సమాధానం కుదిర్చినాడు. సమాధానం అయితే కుదిరినదికాని భేదాభిప్రాయాలు సమసిపోలేదు. తరువాత హైద్రాబాదు స్టేటు కాంగ్రెసు జాతీయ కాంగ్రెసుకి అనుబంధమై ప్రాంతీయ కాంగ్రెసు కమిటీగా ఏర్పడినది.

'పోలీసుచర్య' అని వాడే హైద్రాబాదు దండయాత్ర ఫలితం చెప్పడం ఎంతో సులువు. సాధించిన పద్ధతి చాలా కష్టమైనది. రెండువందల సంవత్సరాలుగా చిట్లంకట్టిన నవాబీ పద్ధతులు, జాగీర్దారీ, నిరంకుశత్వం, బానిసత్వం, సోమరితనం, అజ్ఞానం, నిరుత్సాహం, భయం, అనుమానం, సందేహం, ఇటువంటివెన్నో ఎదుర్కోవలసి వచ్చినది. అకస్మాత్తుగా పాత అలవాట్లకి బానిసలైన ప్రజల్ని మార్చడం కష్టం.

చౌదరి మిలిటరీ గవర్నరుగా వున్నా పరిపాలన సివిలు పద్ధతిలోనే నడుస్తూ వచ్చినది. నిజాం ప్రభుత్వమే కాకుండా, అతని సర్ఫెఖాసు, జాగీర్దారీ అన్నీ ఒకే ప్రభుత్వ విధానంలోకి వచ్చినవి. ఈ మార్పులు వచ్చిన త్వరితగతిలో ప్రజల మనస్సు పరిగెత్తలేదు. అది వారి తప్పుకాదు.

1948 సెప్టెంబరు 18 న చౌదరి మిలిటరీ ప్రభుత్వం అమలులోకి వచ్చినది. గవర్నరికి పరిపాలనలో సహాయం చెయ్యడానికి ఒక అడ్మినిస్ట్రేటరుని

నియమించినారు. ప్రభుత్వంలో కొందరు సభ్యులు కూడా వున్నారు. పి. ఎస్. బాక్లే అడ్మినిస్ట్రేటరు. నవాబ్ జైన్‌యార్జంగ్, రాజా ధొండేరాజ్, సి. వి. యస్. రావు, పి. హెచ్. కృష్ణారావు సభ్యులు. ఒక సంవత్సరం పదినెలలు ఈ ప్రభుత్వం జరిగినది. తరువాత ఎం. కే. వెల్లోడీ ముఖ్యమంత్రిగా ఒక సివిలు మంత్రివర్గం ఏర్పాపైనది. ఈ మంత్రివర్గం 1950 జూన్ 12 న అధికారంలోకి వచ్చినది. ఇందులో సభ్యులు: నవాబ్ జైన్ యార్జంగ్; ఎం. శేషాద్రి; సి. వి. యస్. రావు; బి. రామకృష్ణరావు; వినాయకరావు విద్యాలంకార్; వి. బి. రాజు; ఫూల్ చంద్ గాంధీ.

ఇక లోకసభలో హైద్రాబాదుకి 25 స్థానాలు కేటాయించినారు. కొండా వెంకటరంగారెడ్డి, డాక్టరు ఎం. చెన్నారెడ్డి, అరిగె రామస్వామి మొదలైనారు లోక సభ సభ్యులుగా వుండిరి. వీరి సభ్యత్వం ఎన్నికలద్వారాకాక నియామకం ద్వారా లభించినది.

ఎప్పుడైతే ఎన్నికలు కావలసివచ్చినవో మళ్ళీ కొట్లాటలు ప్రారంభించినవి. మహారాష్ట్ర ఆంధ్ర ప్రాంతీయ అభిమానాలు పనిచెయ్య సాగినవి. మూడు ముఖ్య స్థానాలు ఆంధ్రులికి రావాలని వో బహిరంగసభలో కొండా వెంకటరంగారెడ్డి కుండ పగలగొట్టి చెప్పినాడు. "ఇంతవరకూ మహారాష్ట్రులు ముందుగా వుంటూ వచ్చినారు; స్వాతంత్ర్యం వచ్చినది గనుక వెనుకబాటుగా వున్న తెలంగాణా వారికి అవకాశం ఇవ్వాలి. ముఖ్యమంత్రి పదవి, రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవి, నగర మేయరు పదవి తెలంగాణా వారికి కేటాయించాలి" అని చెప్పినాడు. ఈయన శుద్ధ ప్రాంతీయవాది అని అంతా విమర్శించినారు గాని, చివరికి జోస్యం చెప్పినట్టు అల్లాగే జరిగినది. రామకృష్ణరావు ముఖ్యమంత్రి అయినాడు, రంగారెడ్డి రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడైనాడు; మాడపాటి హనుమంతరావు హైద్రాబాదు మేయరైనాడు.

ఇవన్నీ వూరికే వాదించగా వచ్చినవికావు. 1951-52 ఎన్నికలు జరిగే ముందే తగాదాలు ప్రారంభమైనవి. కాంగ్రెసులో రామానంద గ్రూపూ, రెడ్డి-రావు గ్రూపూ అల్లాగే వున్నవి. ఎన్నికలకి అభ్యర్థుల్ని నిర్ణయించడానికి ఉపసంఘం ఏర్పర్చవలసి వచ్చినది. రామకృష్ణరావు గడసరి. పైగా మహారాష్ట్ర, కన్నడ భాషలు వచ్చినవాడు; మహారాష్ట్రంలో చదువుకున్నవాడు. ఈ ముగ్గురిమధ్యా సామరస్యం కుదర్చడానికి ప్రయత్నించేవాడు. రాజకీయాలలో రాజీ అనేది అవసర మని, పురోభివృద్ధికి సోపానమనీ తెలిసినవాడు. తన కుందేటికి మూడేకాళ్ళనే స్వభావం కలవాడు కాడు. అంతేకాక తలలు లెఖ్ఖవేసే తరుణంలో హైద్రాబాదులో ఆంధ్రులే ఎక్కువ గనుక ఆంధ్రులికి ముఖ్యస్థానాలు రాక తప్పదని తెలిసినవాడు. మహారాష్ట్రులతో చెయ్యి కలిపినట్టు తోస్తుంది. చివరికి అభ్యర్థుల నిర్ణయ సంఘంలో

రామానంద గ్రూపుకి 6, రెడ్డి గ్రూపుకి 3 స్థానాలూ లభించినవి. పెద్ద రగడ జరిగి ఢిల్లీదాకా వెళ్ళి చెరిసగం చేయించుకు వచ్చినారు.

ఎన్నికల తర్వాత మళ్ళీ రభస ప్రారంభం అయినది. సభానాయకుడు మహారాష్ట్రుడా ఆంధ్రుడా అని. మళ్ళీ ఢిల్లీ వెళ్ళి పెద్దల సమక్షంలో రామకృష్ణరావు ముఖ్యమంత్రిగా వుండాలని తేల్చుకు వచ్చినారు. 1952 మార్చిలో అధికారంలోకి వచ్చిన రామకృష్ణరావు మంత్రివర్గ సభ్యులు: రామకృష్ణరావు, దిగంబరరావు బిందూ, కే. వి. రంగారెడ్డి, వినాయకరావు విద్యాలంకార్, జి. యస్. మేల్కోటే, మెహిదీ నవాజ్‌జంగ్, ఫూల్‌చంద్ గాంధీ, వి. బి. రాజు, డాక్టరు ఎం. చెన్నారెడ్డి, అన్నారావు గణముఖి, జగన్నాధరావు చంద్రగీ, శంకరదేవ్, దేవీసింగ్ చౌహాను.

తరువాత కొందరు డిప్యూటీ మంత్రుల్ని నియమించినారు. అరిగె రామస్వామి, సంగం లక్ష్మీబాయమ్మ, శ్రీనివాసరావు ఏక్లేకర్, భగవంతరావు ఘూటే, ఎం. ఎస్. రాజలింగం, పల్లెర్ల హనుమంతరావు, విరూపాక్షప్ప.

దరిమిలాని రామకృష్ణరావుకీ వి. బి. రాజుకీ అభిప్రాయభేదాలు కలిగినవి. తత్కారణంగా రాజు, గాంధీ, చంద్రగీ రాజీనామాలిచ్చినారు. చౌహాను మాత్రం తన రాజీనామా ఉపసంహరించుకున్నాడు. ఈ అభిప్రాయభేదాల పర్యవసానంగా రామకృష్ణరావు రాజీనామా ఇవ్వాలని నినాదం బయలుదేరినది. కాంగ్రెసు అధిష్ఠాన వర్గందాకా వెళ్ళినది. చివరికి ప్రధాని నెహ్రూ వచ్చి, శాసనసభ్యుల్ని కూచోబెట్టి కాగితాలిచ్చి ఎవరు కావాలో పేర్లువ్రాసి ఇమ్మన్నాడు. తత్ఫలితంగా రామకృష్ణరావుకే ఎక్కువ వోట్లు వచ్చినవి. రామకృష్ణరావు మంత్రివర్గమే 1956 అక్టోబరు 31 వరకూ, అనగా ఆంధ్రప్రదేశ అవతరణ వరకూ అధికారంలో వున్నది. రెడ్డి–రావు గ్రూపుకి ప్రత్యామ్నాయంగా రెడ్డిగ్రూపు ఒకటే మిగిలినది. అప్పుడూ ఇప్పుడూ కూడా ప్రత్యేక తెలంగాణావాదులు వీరే.

# విశాలాంధ్ర పర్వం

ఆంధ్రప్రదేశ అవతరణ
పెద్దమనుషుల ఒప్పందం
భాగ్యనగర ప్రవేశం
ఇద్దరు ముఖ్యమంత్రులు
మూడో ముఖ్యమంత్రి
మర్రిచెట్టు
ముల్కీ ఉద్యమం
ఉద్యోగులు
విద్యార్థులు
అఖిలపక్ష సమావేశం
అఖిలపక్ష ఒప్పందం
వడ్లగింజలో బియ్యపుగింజ
ప్రధాని ప్రణాళిక
అష్టసూత్ర పథకం
అష్టసూత్రాల అమలు
చెన్నారెడ్డి నాయకత్వం
పునర్జన్మ

# ఆంధ్రప్రదేశ అవతరణ

విశాలాంధ్ర అనే నామవాచకం ఎవరికూర్పో తెలియదు. 1935 ప్రాంతాలలోనే వినబడుతూవుండేది. అప్పుడు అది ఒక విశాలభావం మాత్రం. నిర్దిష్టమైన రూపం ఎవరి మనోనేత్రంముందూ వుండేది కాదేమో! ఎక్కడ తెలుగు తనం వుంటే అది అంతా కలిపి విశాలాంధ్ర. తెలుగు భూమికి ఆవలవున్న తెలుగువారు కూడా విశాలాంధ్రులే. నిజాం ఆంధ్రుల్ని కృష్ణాపత్రిక ఎన్నడో రాష్ట్రేతరాంధ్రులని వ్యవహరించినదని ఒక అపవాదు. ఆ ప్రయోగంతో హైద్రాబాదాంధ్ర ప్రముఖులికి చాలా మందికి కోపం వచ్చినది. ఆత్మ బంధువుని పరాయిగాచూస్తే కోపం రావడం సహజంకదా! అయినా అప్పటి రాష్ట్రం అంటే మద్రాసులోవుండే 11 జిల్లాలపాతికే మనసులో తిరిగేది. స్వదేశసంస్థానాలు రూపుమాసిపోతవి, నిజాం నిష్క్రమిస్తాడు అనే ఊహ లేనేలేదు. బ్రిటిషువారు పోవాలి, పోతారూ అన్న నినాదం, ఆశేగాని. నిజాంపోవాలీ అనే నినాదంగాని, పోతాడూ అనే ఆశగాని జాతీయోద్యమం ఆఖరి దశలోగాని రాలేదు. యావదాంధ్ర భూమీ. అనగా మద్రాసు నిజాం ఆంధ్రప్రాంతాలు కలిపి, నిజాము పరిపాలనలోనే బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పరిస్తే బాగుంటుందని వ్రాసినాడు డాక్టరు మామిడిపూడి వెంకట రంగయ్య ఒకనాడు. నిజాంవినా విశాలాంధ్ర కావాలి అనే నినాదం లేవదీసి. దాని సాధనకోసం ఉత్కృష్ట ప్రయత్నం చేసినది కమ్యూనిస్టుపార్టీ. 1946 లోనే విశాలాంధ్రవాదం పైకి తెచ్చినది ఆ పార్టీయే. ఈ పదానికి కమ్యూనిస్టువాసన వున్నదనే కారణంవల్లనేమో నిజంగా విశాల రాష్ట్ర అవతరణ జరిగినప్పుడు ఆ నామకరణం పెట్టలేదు.

అసలు ఆంధ్రశబ్దం దుష్టశబ్దం అనేవాడు భావరాజు వెంకటకృష్ణారావు. ఆంధ్రకాదు అంధ్ర అని వుండాలి అనేవాడు. 'ఆ' అని వుంటే మంత్రశాస్త్ర

ప్రకారం తప్పుట. వెనక మహాంధ్ర అనే రాజ్యం వుండేది. ఆ మహాంధ్రలో ప్రజలు తెలుగు మాట్లాడేవారో కారో తెలియదు. ఆదిలో ఆంధ్రసామ్రాజ్యమైన శాతవాహన పరిపాలనలో ప్రజాభాష ప్రాకృతం. వారికాలంలో తెలుగువున్నట్టు తార్కాణంలేదు. ద్రావిడాలూ, ప్రాకృతాలూ కలిసి ఏర్పడ్డ కన్నడ స్వరూపంలోంచి అసలు కన్నడ హాల గన్నడమై, తెలుగు తొలెగన్నడమై, ఒకప్పుడు ఏకమై తరవాత రెండైన లిపులు లాగే, మారుతూవచ్చి వుండవచ్చునని ఒక వాదన.

ఇంతకీ 'ఆంధ్ర', 'తెలుగు', 'తెనుగు' శబ్దాల ఉత్పత్తి సందర్భంలో ఊహాగానమేగాని ఇదమిద్ధమని పుట్టు పూర్వోత్తరాలు చెప్పినవారు లేరు. చెప్పినది అంగీకరించినవారు లేరు. ఆచర్చ ఊకదంపుడు కాక తప్పదు. ఒకటి మాత్రం సత్యం. ఆంధ్రులు, తెలుంగులు అని పిలవబడే ఈ జాతి ఆర్య-ద్రావిడ సంకర జాతి. ఉత్తర దక్షిణదేశాల మధ్యలో వుండి, జాతి, మత, సంస్కృతి, భాషా వ్యవహారాలలో రెండు వేపుల్నించీ అందిపుచ్చుకుని తనవి చేసుకున్న జనసమూహం. వీరికి ఒక సంస్కృతి వున్నది, ఒక పరిపాలనలో వున్నవారు, తిరిగీ వీరందరూ ఏకం కావాలీ అనే పూర్వభావం కొమర్రాజు లక్ష్మణరావుది; దానికి చేసిన దోహదం కమ్యూనిష్టుపార్టీది. ఫలితం ప్రస్తుతం కాంగ్రెసుపార్టీది.

ఎప్పుడైతే ఎదురు తిరిగిన నిజాం తిరోగమించి రాజీచేసుకుని రాజ ప్రముఖ మాత్రుడైనాడో, ఈ విజయానికి కారకుడైన సర్దార్ పటేల్ మనసులో హైద్రాబాదు రాజ్యం పగలగొట్టాలి అనే ఉద్దేశ్యం వున్నది. దానికి ప్రజాభిప్రాయం అనుకూలించినది. మూడుభాషా భాగాలతో నిండిన ఈ రాజ్యం ఏ భాగానికి ఆ భాగం ముక్కలుచేసి, ఆయా భాషా భాగాలతో కలిపెయ్యాలనే సూత్రం స్థిర పడినది. దాంతో భాషారాష్ట్రోద్యమానికి బలం కలిగినది. ఆంధ్రులు, మహారాష్ట్రులు, కన్నడిగలు, కేరళులు, వివిధ రాజ్యభాగాలలో విడివిడిగా వుంటూ వచ్చినారు. వారిలో ఐక్యతా భావం వర్ధిల్లినది. భాషారాష్ట్రాలికి ఆట్టే ఆందోళన పడనివారు తమిళులు, గుజరాతీలు. వారికి అప్పటి వ్యవస్థ అనుకూలంగానే వున్నది. భాషా రాష్ట్రాలు అవసరం లేకపోయినవి. వంగ, వోఢ్ర, అస్సాం, బీహారు రాష్ట్రాలు బ్రిటిషు హయాంలోనే వచ్చినవి. స్వరాజ్యం వచ్చినా మిగిలి పోయినవారు మహా రాష్ట్రులు ఐక్యమహారాష్ట్రం కోసం, కన్నడిగలు సంయుక్త కర్నాటక కోసం, కేరళులు ఐక్యకేరళ కోసం, ఆంధ్రులు విశాలాంధ్ర కోసం ఆందోళన ప్రారంభించినారు.

ఈ రామాయణంలో ఒక చిన్న పిడకల వేట్లాట జరిగినది. 'పోలీసుచర్య' తర్వాత పరిపాలన సక్రమంగా జరగడంకోసం మద్రాసు బొంబాయి మధ్యప్రదేశ రాష్ట్రాలనించి చిన్న వుద్యోగుల్ని పెద్దల్నిచేసి హైద్రాబాదులో నియమించినారు.

వీరిలో కొందరు సక్రమంగా ప్రవర్తించలేదనీ, లంచాలు తిన్నారనీ, నిరంకుశంగా వున్నారనీ, తమతమ బంధువుల్ని తీసుకొచ్చి వుద్యోగాలిచ్చినారనీ ఒక వాదు పుట్టినది. తత్కారణంగా వుండివుండీ వుడిగుంకే ఈ రాజ్యంలో లేచి పడుతూ వుండే 'ముల్కీ' వాదం బయలుదేరినది. ఉద్యోగానికి ఆశించే విద్యావంతులలోనూ, ఉద్యోగాలకోసం తయారయే విద్యార్థులలోనూ అలజడి ప్రారంభం అయినది. ఈ అలజడి పరిస్థితుల మార్పు ధిక్కరించే భూస్వాములు ఉపయోగించుకున్నారు. తత్కారణంగా రాబోయే కలగలుపుకి వ్యతిరేక భావాలుకూడా కలుగుతూ వచ్చినవి. వీరిలో కాంగ్రెసు వాదులుకూడా లేకపోలేదు. ఉద్యోగస్థులు వుండడం సహజం. వారిలో చాలామంది ముందొచ్చిన గైరుముల్కీలే. 1953 లో ఆంధ్రరాష్ట్రావతరణంతో ఈ భయసందేహాలు ఎక్కువైనవి. 1953 అక్టోబరు 1 వ తారీఖున ఆంధ్రరాష్ట్రం ఏర్పడినది. డిసెంబరు 29 న యూనియన్ ప్రభుత్వం రాష్ట్రాల పునర్నిర్మాణం చెయ్యడానికి సలహాలు ఇవ్వవలసినదిగా ఫజల్ ఆలీ కమీషను నియమించినది. ఎస్. ఫజల్అలీ అధ్యక్షుడు గనక దీనికీపేరు వచ్చినది. పండిత హృదయనాథ్ కంజ్రూ, సర్దార్ కే. ఎం. పణిక్కర్ ఇందులో సభ్యులు.

ఈ కమీషను వెయ్యడంతోనే భారతదేశం అంతా ఉత్సాహం రేకెత్తినది. కాని హైద్రాబాదు రాజ్యంలో, తెలంగాణాలో నిరుత్సాహం కలిగినది. పక్కనున్న ఆంధ్రభాగాలతో కలిస్తే తమకు నష్టం కలుగుతుందని కొందరు నాయకులు భయపడినారు. ప్రతి రాజకీయపార్టీ తనవైఖరి పునః పరిశీలన ప్రారంభించినది. అఖిల భారత పార్టీలకి సంబధం లేకుండా, ప్రాంతీయ దృక్పథంతో, వ్యక్తిప్రయోజన దృష్టితో, ముఠాతత్వంతో విశాలాంధ్రవస్తే మనకి అనుకూలమా ప్రతికూలమా అని తర్జన భర్జన ప్రారంభించినారు. ఒక కమ్యూనిస్టుపార్టీ మాత్రం అప్పుడూ ఇప్పుడూ విశాలాంధ్ర పక్షమే.

తెలంగాణా కాంగ్రెసునాయకుల వైఖరి కొండా వెంకటరంగారెడ్డి స్వీయ చరిత్రలో ఈ విధముగా వర్ణించినాడు :

"అన్నిరాష్ట్రములలో అందరుమంత్రులు క్రమశిక్షణకు కట్టుబడకుండ తమ తమ అభిప్రాయములను యథేచ్ఛగా నియ్య వచ్చుననిరి. ఈ కమిషన్‌వారు ఇతర రాష్ట్రములు తిరుగుతూ, హైదరాబాదు వచ్చిరి. అంతవరకు నేను, రామకృష్ణారావు మా అనుయాయులు, పోలీసుచర్యకు పూర్వమును, తరువాతను ఆంధ్ర ప్రాంతమువారి చెడుప్రవర్తనవల్ల మాకు కలిగిన అనుభవము దృష్ట్యా, తెలంగాణా ఆంధ్రములను కలుపకూడదని ప్రచారము చేయుచుంటిమి. ఇదే విధముగా కమిషన్ ముందు వాఙ్మూలము ఇస్తిమి."

స్టేటు కాంగ్రెసు అధ్యక్షుడు రామానందతీర్థ, ఆయన అనుయాయులూ విశాలాంధ్రకి అనుకూలంగా సాక్ష్యం ఇచ్చినారు. మరాట్వాడా విషయంలోగాని, కర్నాటక ప్రాంతం విషయంలోగాని, వారివారి తల్లి ప్రాంతాలతో కలవడానికి వారు ఏ విధమైన ఆటంకమూ చెప్పలేదు. ఒక్క తెలంగాణ కాంగ్రెసు నాయకులలో కొందరు మాత్రం విశాలాంధ్రకి వ్యతిరేకులైనారు. కారణం, నిజాము పరిపాలన తర్వాత వీరికి రాజ్యంలో కొన్ని ప్రత్యేక వసతులు ఏర్పడి, అధికారం చేజిక్కినది.

తెలంగాణాలో ప్రజాసోషలిస్టులు కూడా విశాలాంధ్రకి వ్యతిరేకప్రచారం ప్రారంభించినారు. స్వతంత్ర తెలంగాణా కావాలని ఆందోళన ప్రారంభించినారు. అఖిలభారత ప్రజాసోషలిస్టుపార్టీగాని, ఆంధ్రప్రాంతపు ప్రజాసోషలిస్టుపార్టీగాని ఈ వైఖరి అనుసరించలేదు. వారికి విశాలాంధ్ర కావాలనేవున్నది. ఈ విధంగా తెలంగాణావారికీ తక్కినవారికీ మధ్య అభిప్రాయబేధం రాగా 1954 మార్చి 22 న ప్రజాసోషలిస్టుపార్టీ సభ్యులు రెండు వేపుల్నించీ కలిసి ఒక సమావేశం జరిపినారు. ఈ సమావేశంలో విశాలాంధ్రరావడమే పార్టీ లక్ష్యమని నిర్ణయం జరిగినది. కాని, తెలంగాణా ఆంధ్రుల భయసందేహాలు హేతుబద్ధమైనవనీ, తత్కారణంగా విశాలాంధ్రలో వారికి కొన్ని పరిరక్షణలు కల్పించడానికి హామీలు ఇవ్వాలనీ నిశ్చయించినారు.

ఈ వ్యతిరేక ప్రచారమధ్యంలో విశాలాంధ్ర మహాసభ, విశాలాంధ్ర సదస్సు తెలుగుదేశం రెండు భాగాలూ కలపాలని ప్రచారం చేసినవి. 1954 లో విశాలాంధ్ర మహాసభ హైద్రాబాదులో సమావేశమైనది. సంస్థాపకుడైన అయ్యదేవర కాళేశ్వరరావు అధ్యక్షత వహించినాడు. ఈ మహాసభకి కర్నూలునించి ముగ్గురు ఆంధ్ర మంత్రులు హాజరైనారు. తెలంగాణా తెలుగుమంత్రులెవరూ సదస్సులో ముఖం చూపెట్టలేదు. ఈ మహాసభలో అనుమానంలోవున్న మైనారటీలకందరికీ హక్కుల రక్షణ వాగ్దానం చేస్తూ తీర్మానం ఆమోదించబడినది.

కమ్యూనిస్టుపార్టీ ఎడతెరిపిలేకుండా విశాలాంధ్ర ప్రచారం చేస్తూనేవున్నది. 1954 మార్చిలో విశాలాంధ్ర కమ్యూనిస్టు సమన్వయ కమిటీ సత్వర విశాలాంధ్ర నిర్మాణం వాంఛిస్తూ తీర్మానం చేసినది. ఏప్రిల్‌లో అఖిల హైద్రాబాదు ట్రేడు యూనియన్ కాంగ్రెసుకూడా ఇటువంటి తీర్మానమే ఆమోదించి కార్మికులంతా దీనికి కృషిచెయ్యాలని హెచ్చరించినది.

ఏప్రిల్ 18 న అఖిలభారత భాషారాష్ట్రాల మహాసభ కార్యవర్గం నిజాంని తొలిగించాలనీ, హైద్రాబాదు రాజ్యాం భాషా భాగాలుగా విడదీసి తల్లి ప్రాంతాలతో కలిపెయ్యాలనీ, దీనికోసం ఆందోళన ప్రారంభించాలనీ తీర్మానం చేసినది.

అదే నెలలో హైద్రాబాదు కార్పొరేషను, హైద్రాబాదు ముఖ్య పట్టణంగా విశాలాంధ్ర ఏర్పాటు చెయ్యాలని తీర్మానం ఆమోదించినది. ఈ విధంగా విశాలాంధ్రోద్యమం బలపడుతున్నది.

1955 అక్టోబరు 10 న ఫజలాలీ కమీషను రిపోర్టు ప్రకటించినారు. తెలుగుదేశానికి సంబంధించినంత వరకు నివేదికలో సూచనలు :

ఆంధ్రరాష్ట్రం తాత్కాలికంగా అల్లాగే వుండాలి. కాని, కృష్ణాజిల్లాలో వున్న మునగాలపరగాణా హైద్రాబాదు రాష్ట్రంలో కలపాలి. సిరిగుప్ప, బళ్లారి, హోసుపేట తాలూకాలు, మల్లాపురం సబ్‌తాలూకాలో కొంతభాగం ఆంధ్ర రాష్ట్రంలో చేర్చాలి. హైద్రాబాదు రాజ్యంలోవున్న కన్నడ, మరాఠీ భాగాలు మినహా, తొమ్మిది తెలుగుజిల్లాలూ హైద్రాబాదు రాష్ట్రంగా ఏర్పాటు చెయ్యాలి. ఈ విధంగా రూపొందిన హైద్రాబాదు రాష్ట్రం ఆంధ్రరాష్ట్రంతో కలపవచ్చు. కాని, ఈ కలపడం 1961 లో జరగబోయే జనరల్ ఎన్నికల తర్వాత జరగవలసి వుంటుంది. ఆ యెన్నికల తర్వాత ఏర్పడిన హైద్రాబాదు శాసనసభ మూడింట రెండు వంతుల మెజారిటీతో ఈ కలుపుదలకి అంగీకరిస్తేనే ఈ సంలీనం జరగాలి.

ఈ ముసుగుతో వచ్చిన విశాలాంధ్ర సిఫారసు ప్రాంతీయవాదాన్ని బలపర్చినది. కేంద్ర నాయకులు తెలంగాణావారి అనుమతిమీదనే విశాలాంధ్ర నిర్మాణం చేస్తామని అంటూవచ్చినారు. ఈ అనుమతి సాధించడానికి వారు శాయశక్తులా ప్రయత్నిస్తూనే వున్నారు. తాత్కాలికంగానైనా ప్రత్యేక తెలంగాణా వస్తుందనే ఆశతో రంగారెడ్డి గ్రూపు విజృంభించినది. అప్పటి హైద్రాబాదు ముఖ్యమంత్రి రామకృష్ణరావు. ప్రత్యేక తెలంగాణాలో ఆయనకి ఆస్థానం లభించే సూచనలులేవు. ఈ పరిస్థితులలో ముఖ్యమంత్రిగనుక కేంద్ర నాయకులు ఆయనద్వారా విశాలాంధ్రకి అనుకూలవాతావరణం కలగజెయ్యాలని ప్రయత్నించినారు. రామకృష్ణారావు భవిష్యత్తుకి ఫరవాలేదనీ, ఏదో ఒకస్థానం రాష్ట్రాంతరంలో ఆయనకి లభించగలదనీ సూచించినారు. ఈ సందర్భంలో, అప్పుడు మధ్యప్రదేశ గవర్నరుగావున్న డాక్టరు పట్టాభి హైద్రాబాదువచ్చి కొంత అనుకూల వాతావరణం కలుగజేసినాడు. ఇంతలో రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు హైద్రాబాదు వచ్చినాడు. కేంద్రప్రభుత్వపు అభిప్రాయములు రామకృష్ణరావుకి నచ్చజెప్పి వుండవచ్చు. షా మంజిల్‌లో ఒక పత్రికా విలేఖరులసభ ప్రత్యేకంగా ఆహ్వానించి, రామకృష్ణరావు దేశసౌభాగ్యదృష్ట్యా తాను విశాలాంధ్రకి అనుకూలంగా మారినట్టు ప్రకటించినాడు. ఈ అభిప్రాయం స్వామిరామానందతీర్థ బలపర్చి ప్రచారము ప్రారంభించినాడు. ప్రత్యేక తెలంగాణావాదులు వెంకటరంగారెడ్డి, చెన్నారెడ్డి మిగిలిపోయినారు. ఈ గ్రూపువారు తమ ప్రచారం ప్రారంభించినారు.

తెలంగాణా ప్రజాపరిషత్తు అవతరించినది. విద్యార్థుల్నీ, యువకుల్నీ రంగంలోకి దింపినారు. కొందరు ఉద్యోగస్థులుకూడా బలం చేకూర్చినారు. మంత్రి పదవులు రాగలవనే ఆశతో కొందరు మూగనోము పట్టినారు. ఊరేగింపులూ, ప్రదర్శనలూ జరిగినవి. డబ్బు మంచినీళ్ళప్రాయంగా ఖర్చైనది. విశాలాంధ్రవాదుల సభలు చెదరగొట్టినారు. తెన్నేటి విశ్వనాథం నగరం వస్తే ఆయనమీద చెయ్యి చేసుకునేందుకు సిద్ధమైనారు. అప్పుడు తాత్కాలికంగా ముఖ్యమంత్రిపనిచేస్తున్న దిగంబరరావు బిందూ ఈ దౌర్జన్యవాదులికి హెచ్చరిక చెయ్యవలసిన అవసరం కలిగినది.

అప్పటికి స్వతంత్రపార్టీ పుట్టలేదు. ఆచార్య రంగా అప్పుడే రెండు తెలుగు రాష్ట్రాలవాది. కొన్నాళ్ళు చెన్నారెడ్డి రంగా శిష్యుడు. నాటి రంగా అభిప్రాయమే ఈనాడు స్వతంత్రపార్టీ అభిప్రాయమైనది. రాజాజీ ఆశీర్వచనం అందుకున్నది.

1955 డిసెంబరులో ప్రధాని నెహ్రూ, నాగార్జునసాగరం శంఖుస్థాపన చెయ్యడానికి హైద్రాబాదు వచ్చినాడు. ఆనాడు బేగంపేట విమానాశ్రయంనించి షామంజిల్‌దాకా నల్లజండాలు, ప్రత్యేక తెలంగాణా బోర్డులు, నినాదాలు ప్రత్యక్షమైనవి. కృష్ణా ఉత్తరతీరంలో జరిగిన సభకికూడా ఈ నల్లజెండాలూ బోర్డులు వెళ్ళినవి. నినాదాలు చెలరేగినవి. ఆ సభలో మాట్లాడుతూ ప్రధాని ఇల్లా అన్నాడు. "నా ఎదురుగా ఒక మహానది కనబడుతున్నది. దానిపేరు కృష్ణ. ఈ నదికి అద్దర్ని ఆంధ్ర అంటున్నారు. ఇద్దర్ని తెలంగాణా అంటున్నారు. ఈ రెండు భాగాల ప్రజలూ ఒకేభాష మాట్లాడతారు, ఒకే సంస్కృతి కలవారు. ఈ నది ప్రజానీకాన్ని విడదియ్యలేదు." హిందీలో నెహ్రూ చెప్పిన మాటలు కారణాంతరాలవల్ల రామకృష్ణరావు తెలుగులోకి యథాతథంగా తర్జుమా చెయ్యలేదు.

అటుతర్వాత చెన్నారెడ్డి విశాలాంధ్రకు వ్యతిరేకంగా తీవ్రప్రచారం సాగించినాడు. పది సంవత్సరాలవరకూ విశాలాంధ్రవూసు ఎత్తకూడదన్నాడు. అయిదేళ్ళు ఉమ్మడిగా గవర్నరూ హైకోర్టూవున్నా శాసనసభలు రెండూ విడివిడిగా వుండాలన్నాడు. హైకోర్టుకూడా రెండుగా ఇంగ్లీషు, ఉర్దూ భాగాలు వుండాలని రంగారెడ్డి వాదన. రంగారెడ్డి ఉర్దూ వకీలు. ఆయనకి ఇంగ్లీషురాదు. ఉర్దూ వకీళ్ళ కష్టసుఖాలు ఆయన ఆలోచించినాడు. రంగారెడ్డిని పండిట్ పంత్, ధేబేర్ నాలుగుసార్లు ఢిల్లీ పిలిపించి నచ్చచెప్పాలని ప్రయత్నించినారు కాని లాభం లేకపోయినది.

విశాలాంధ్రకి అనుకూలంగాకూడా ప్రచారం సాగుతూనే వున్నది. బి. వి. గురుమూర్తి, కొండాలక్ష్మణ్, కొత్తూరి సీతయ్య గుప్త, దేవులపల్లి రామానుజరావు, పాగ పుల్లారెడ్డి మొదలైనవారంతా విశాలాంధ్రవాదులు. 1956 జనవరి 22 న ఆంధ్ర ప్రాంతంలో, విశాలాంధ్ర నిర్మాణంలో కేంద్రం చేసున్న జాప్యం నిరసిస్తూ

హర్తాళం జరిగినది. విజయవాడ, రాజమండ్రి, తెనాలి, నెల్లూరు, అనంతపురం, గుడివాడ, బందరు, ఏలూరువంటి పట్టణాలలో మహాసభలు జరిగినవి. వర్తకులు, విద్యార్థులు, కార్మికులు, కర్షకులు అంతా పాల్గొన్నారు.

తెలంగాణా కమ్యూనిస్టు పార్టీ కార్యవర్గం విశాలాంధ్ర తప్పితే తెలంగాణా ప్రజలకి వేరే ఏర్పాటు ఒప్పుదలకాదని తీర్మానించినది.

హైద్రాబాదు శాసనసభ 95 మందిలో 72 మంది విశాలాంధ్ర వెంటనే ఏర్పాటు చెయ్యాలని తీర్మానం చేసినారు.

అంజుమన్ తరక్కి ఉర్దూ, షియామహాసభ, జమియత్-ఉల్-ఉలేమా, నవజవాన్‌మిల్లత్ మొదలైన ముస్లిం సంస్థలు విశాలాంధ్ర సమర్థిస్తూ మవులానా అజాద్‌కి తంతివార్తలు పంపినవి.

తెలంగాణా ప్రాంతంలో 200 మహాసభలలో విశాలాంధ్ర కోరుతూ తీర్మానాలు జరిగినవి. వరంగల్లునించి 36,000 సంతకాలలో విశాలాంధ్ర కావాలని ఒక మహజరు కేంద్రానికి పంపబడినది. పాగ పుల్లారెడ్డి గ్రామగ్రామంలోనూ విశాలాంధ్ర అనుకూలసభలు చేయించినాడు.

1956 మార్చి 6 వ తేదీన నిజామాబాదులో భారతసేవక సమాజం వార్షిక సమావేశం జరిగినది. నెహ్రూ అధ్యక్షత వహించినాడు. శికింద్రాబాదులో స్పెషలు రైలు ఎక్కుతూ, రామకృష్ణరావుతో ప్రధాని అన్నాడు: "రాం కిషెన్‌రావ్ ఏ ఏలాన్ కర్నా హై". (రామకృష్ణారావు, ఇది ప్రకటించాలి) ఆవేళ సాయంత్రం నిజామాబాదులో జరిగిన బహిరంగ సభలో విశాలాంధ్ర నిర్మాణానికి అనుకూలంగా కేంద్రప్రభుత్వం నిర్ణయం తీసుకున్నదని ప్రకటించినాడు. ఈ నిర్ణయం అంతా ఆమోదించవలసిందని విజ్ఞప్తి చేసినారు.

తర్వాత కొన్నాళ్ళకి ప్రధాని తెలంగాణా నాయకుల్ని ఢిల్లీకి పిలిపించినాడు. ఆ సమావేశంలో రామకృష్ణారావు ఇల్లా అన్నాడు: "రంగారెడ్డి, చెన్నారెడ్డి వొప్పుకుంటే అంతా వొప్పుకున్నట్టే, వారిద్దరిదే అభ్యంతరం." రంగారెడ్డి మాత్రం ప్రజలు 95 శాతం వొప్పుకోడంలేదని చెప్పినాడు. నెహ్రూ, "తొంభై అయిదు శాతం, తొంభై అయిదు శాతం" అని రెట్టించి వూరుకున్నాడు.

నాయకులు హైద్రాబాదు తిరిగివచ్చిన తర్వాత కలిగిన మార్పులు రంగారెడ్డి స్వీయచరిత్రలో ఈ విధంగా చెప్పినాడు.

"కేంద్రమునకు ఒకస్టేటు చెయ్యవలెనని పట్టుదల వున్నట్టువున్నది. మన ముఖ్యమంత్రియగు శ్రీ బి. రామకృష్ణరావుగారుకూడా దానికి అనుకూలముగానే

వున్నారు. మనము చట్టబద్ధముగా రక్షణలను తీసుకొని ఒక స్టేటుకొరకు ఒప్పు కొనుటకు ఏమయినా అవకాశములున్నవా ? అని చట్టాలు, కేస్‌లా పరిశీలించితిమి. ఒక రీజనల్‌కమిటీ పెట్టి రక్షణలు తీసికొనగల ఆధారము దొరకెను. దీనిని, తెలంగాణములోని అప్పటి కార్యకర్తలనందరిని పిలిచి, మూడు దినములు వారితో చర్చించి వారి అనుమతిని పొందితిమి. అదే సమయములో నెహ్రూ ప్రభుత్వము పరిశీలనములోకూడ ఈ ఆధారము దొరికి ఈ విషయము కనిపెట్టిరి."

అటు పిమ్మటనే కర్నూలునించి ఆంధ్రనాయకుల్నీ హైద్రాబాదునించి తెలంగాణా నాయకుల్నీ పండితపంతు ఢిల్లీ పిలిపించినాడు. పంత్ ఇంట్లో ఒకసమావేశమైనది. మవులానా అజాద్, ధేబేర్, నెహ్రూకూడా ఆ సమావేశంలో పాల్గొన్నారు. తెలంగాణాకు రక్షణలతో విశాలాంధ్ర అంగీకరిస్తామని వెంకట రంగారెడ్డి ప్రభృతులు ప్రకటించినాడు. రెడ్డి హైద్రాబాదులో తెలంగాణా హైకోర్టు, గుంటూరులో ఆంధ్ర హైకోర్టు వుండాలని కోరినాడు. పంతు సలహామీద ఆంధ్ర తెలంగాణా నాయకులు 1956, ఫిబ్రవరి 20 న కలిసి ఒక పెద్దమనుషుల వొప్పందం తయారుచేసి పంత్‌కి అందించినారు. అప్పుడు గోవింద వల్లభ్‌పంత్ కేంద్ర హోంమంత్రి.



# పెద్దమనుషుల ఒప్పందం

1. రాష్ట్రానికి సంబంధించిన కేంద్ర, సాధారణ పరిపాలనావ్యయం ఆంధ్ర తెలంగాణా నిష్పత్తి ప్రకారం భరించాలి. తెలంగాణాలో మిగులు ఆ ప్రాంతపు అభివృద్ధికి కేటాయించాలి. అయిదేళ్ళదాకా ఈ ఏర్పాటు వుండాలి. అటుతర్వాత తెలంగాణా శాసనసభ్యులు కోరిన పక్షంలో మరో అయిదేళ్ళు పొడిగించవచ్చు.

2. శాసనసభలో తెలంగాణా సభ్యులు ఏవిధంగా నిర్ణయిస్తే ఆ విధంగా మద్య నిషేధం అమలుజరపాలి.

3. తెలంగాణాలోవున్న విద్యా సౌకర్యాలు తెలంగాణావారికే లభింపజేసి, ఇంకా అభివృద్ధిపరచాలి. లేకపోతే మొత్తం రాష్ట్రంలో, సాంకేతిక విద్యతోసహా, అన్ని విద్యాలయాలలోనూ మూడోవంతు తెలంగాణా విద్యార్థులికి కేటాయించాలి.

4. ఏకీకరణం కారణంగా కొన్ని ఉద్యోగాలు తగ్గించవలసివస్తే నిష్పత్తి ప్రకారం జరగాలి.

5. ముందురాబోయే ఉద్యోగాలు ఉభయ ప్రాంతాల జనాభా ప్రాతిపదిక మీద వుండాలి.

6. అయిదేళ్ళపాటు, తెలంగాణాలో వుంటున్న పరిపాలనా, న్యాయశాఖలలో ఉర్దూభాషకి కల స్థానం కొనసాగాలి. తర్వాత ప్రాంతీయ మండలి ఈ అంశం సమీక్షించి సవరించవచ్చు. ఉద్యోగాలలో చేర్చుకునేముందు తెలుగు వచ్చితీరాలి అనే నిబంధన వుండరాదు. చేరిన రెండేళ్ళలోగా తెలుగు నేర్చుకోవాలని నియమం వుండవచ్చు.

7. తెలంగాణాలో, నిష్పత్తి ప్రకారం నిర్ణయించిన ఉద్యోగాలలో ప్రవేశించ డానికి అభ్యర్థులికి ఆ ప్రాంతంలో 12 సంవత్సరాల నివాసం వుండాలి.

8. తెలంగాణా ప్రాంతంలో వ్యవసాయ భూముల అమ్మకం ప్రాంతీయ మండలి అధీనంలో వుండాలి.

9. తెలంగాణా సర్వతోముఖాభివృద్ధి సాధించడానికి ఒక ప్రాంతీయ మండలి వుండాలి.

10. ప్రాంతీయ మండలిలో 20 మంది సభ్యులు వుండాలి. తెలంగాణా తొమ్మిది జిల్లాలకీ ప్రతినిధులుగా తొమ్మండుగురు శాసనసభ్యుల్ని శాసనసభ ఎన్నుకోవాలి. శాసనసభలో తెలంగాణా సభ్యులు పార్లమెంటునించిగాని, శాసనసభనించి గాని ఆరుగుర్ని ఎన్నుకోవాలి. శాసనసభ సభ్యులుకాని అయిదుగుర్ని కూడా శాసనసభ తెలంగాణా సభ్యులు ఎన్నుకోవాలి. తెలంగాణా ప్రాంతపు మంత్రులందరూ ప్రాంతీయ మండలి సభ్యులుగా వుండాలి. ముఖ్యమంత్రిగాని, ఉపముఖ్యమంత్రిగాని, ఎవరు తెలంగాణా వారైతే వారు ప్రాంతీయ మండలి అధ్యక్షులుగా వుంటారు. ఇతర కేబినెట్ మంత్రుల్నికూడా ప్రాంతీయమండలి సమావేశానికి ఆహ్వానించవచ్చు.

11. ప్రాంతీయ మండలి చట్టబద్ధమైన సంస్థగా వుంటుంది. ప్రణాళికా రచన, అభివృద్ధి వ్యవహారాలు. నీటి పారుదల, ఇతర వ్యవసాయ పథకాలు, పారిశ్రామికాభివృద్ధి, తెలంగాణా ఉద్యోగాలు, ప్రాంతీయ మండలి పరిశీలించి నిర్ణయాలు తీసుకుంటుంది. రాష్ట్ర ప్రభుత్వానికీ మండలికీ మధ్య అభిప్రాయభేదం వచ్చిన పరిస్థితిలో, అంతిమ నిర్ణయంకోసం భారత ప్రభుత్వానికి నివేదించాలి.

ఈ ఏర్పాటు మధ్యలో మరో ఒప్పందం లేనిపక్షాన, పది సంవత్సరాల తర్వాత సమీక్ష చెయ్యబడుతుంది.

12. మంత్రివర్గంలో ఆంధ్ర ప్రాంతంనించి 60 శాతం, తెలంగాణా ప్రాంతం నించి 40 శాతం వుండాలి. తెలంగాణా భాగంలో ఒక ముస్లింకూడా వుండాలి.

13. ముఖ్యమంత్రి ఆంధ్రప్రాంతం వాడైతే ఉపముఖ్యమంత్రి తెలంగాణా వ్యక్తి అయివుండాలి. ముఖ్యమంత్రి తెలంగాణా మనిషి అయితే ఉపముఖ్యమంత్రి ఆంధ్ర ప్రాంతంవాడుగా వుండాలి. హోం, ఫైనాన్సు, రెవెన్యూ, ప్లానింగ్-డివెలప్‌మెంటు, వాణిజ్య పరిశ్రమల శాఖలలో కనీసం రెండైనా తెలంగాణా వారికివ్వాలి.

14. 1972 సంవత్సరాంతం వరకూ తెలంగాణాకి ప్రత్యేకంగా ప్రదేశ కాంగ్రెసుసంఘం వుండాలని హైదాబాదు ప్రదేశకాంగ్రెసు అధ్యక్షుడు కోరుతున్నాడు. దీనికి ఆంధ్రప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుడికి అభ్యంతరంలేదు.

పైన పేర్కొన్న అంశాలన్నీ 1956, ఫిబ్రవరి 20 న న్యూ ఢిల్లీ హైదరాబాదు గెస్టుహవుసులో జరిగిన సమావేశంలో అంగీకరించబడినవి.

ఈ పెద్దమనుషులు తిరిగి 1956 ఆగస్టు 14 న సమావేశమై మరికొన్ని సంగతులు చర్చించి ఒకనోటు కూడా తయారుచేసినారు.

1. కొత్త రాష్ట్రానికి పేరు : కొత్త రాష్ట్రంపేరు ఆంధ్ర–తెలంగాణమని వుండాలని తెలంగాణా ప్రతినిధులు కోరినారు. ఈ పేరు ముసాయిదా బిల్లులో వున్నది. కాని జాయింటు సెలెక్టుకమిటీ ఆంధ్రప్రదేశ్ అని సవరించినది. ఆంధ్ర ప్రదేశ్ అనే పేరు వుండాలని ఆంధ్ర ప్రతినిధులు కోరినారు. ఒప్పందం కుదరలేదు.

2. హైకోర్టు : హైకోర్టు ప్రధానమైన బెంచి హైద్రాబాదులో వుండి, ఒక బ్రాంచి గుంటూరులో వుండాలని తెలంగాణావారు కోరినారు. మొత్తం హైకోర్టు హైద్రాబాదులోనే వుండాలని ఆంధ్ర ప్రతినిధులు కోరినారు. ఒప్పందం కుదరలేదు.

## తెలంగాణావారు ప్రతిపాదించిన రక్షణల పత్రం వివరాలు

1. ప్రాంతీయ స్థాయి సంఘం : ఆంధ్రప్రదేశ రాష్ట్రమంతటికీ ఉమ్మడి శాసనసభలు వుంటాయి. యావత్తు రాష్ట్రానికీ ఈ సభలే శాసనాలు చేస్తాయి. ఒకే గవర్నరు వుంటాడు. మొత్తం పరిపాలనా రంగంలో రాష్ట్ర శాసనసభకి బాధ్యులైన మంత్రిమండలివారు సలహాలిస్తూ సహాయపడుతారు.

2. కొన్ని ప్రత్యేక విషయాలలో ప్రభుత్వ వ్యవహారం సుళువుగా జరగడానికిగాను తెలంగాణా ఒక ప్రాంతంగా పరిగణించబడుతుంది.

3. తెలంగాణా ప్రాంతానికి ఒక ప్రాంతీయస్థాయి సంఘం వుంటుంది. తెలంగాణా మంత్రులతోసహా తెలంగాణ శాసనసభ్యులు అందులో సభ్యులుగా వుంటారు. ముఖ్యమంత్రి ఇందులో సభ్యుడు కాడు.

4. ప్రత్యేక విషయాలకి సంబంధించిన శాసనవిషయాలు ప్రాంతీయ సంఘానికి నివేదించబడును. ఈ విషయాలకి సంబంధించిన శాసనచర్య ప్రాంతీయ సంఘం ప్రభుత్వానికి సూచించవచ్చు. ఆర్థిక బాధ్యతలకి సంబంధించిన సాధారణ ప్రభుత్వ విషయాల్లోకూడా ప్రాంతీయ సంఘం ప్రతిపాదనలు చెయ్యవచ్చు. ఇది రోజువారీగాని అవసరవ్యయానికిగాని సంబంధించినవి కాకూడదు.

5. ప్రాంతీయ సంఘం ఇచ్చిన సలహాల్ని సాధారణంగా ప్రభుత్వమూ; శాసనసభా ఆమోదించాలి. అభిప్రాయభేదం వస్తే గవర్నరుకి నివేదించాలి. గవర్నరు నిర్ణయం పాటించాలి. అదే తుది నిర్ణయం.

6. ప్రాంతీయ సంఘం పరిశీలించే అంశాలు :

ఏ) శాసనసభచేసిన పథకాల పరిధిలో అభివృద్ధి, ఆర్థిక ప్రణాళికలు;

బి) స్థానిక స్వపరిపాలనా వ్యవహారాలు, అనగా మ్యునిసిపల్ కార్పొరేషన్ల రాజ్యాంగ అధికారాలు, అభివృద్ధి, ట్రస్టులు, జిల్లాబోర్డులు, గ్రామ పరిపాలనకి సంబంధించిన ఇతర అధికారాలు.

సి) ప్రజారోగ్యం, పారిశుద్ధ్యం, స్థానిక ఆసుపత్రులు, చికిత్సశాలలు;

డి) ప్రాథమిక, మాధ్యమిక విద్య;

ఇ) తెలంగాణాలో విద్యాసంస్థలలో ప్రవేశాలు;

ఎఫ్) మద్య నిషేధం;

జి) వ్యవసాయ భూముల అమ్మకం;

హెచ్) కుటీర పరిశ్రమలు, లఘు పరిశ్రమలు,

ఐ) వ్యవసాయ సహకార సంఘాలు, అంగళ్ళు, సంతలు;

7. నివాసనిబంధనలు :

తాత్కాలికంగా అయిదేళ్ళు తెలంగాణా సబార్డినేటు ఉద్యోగాలికి రిక్రూట్ మెంట్ విషయంలో తెలంగాణా ఒక యూనిట్‌గా పరిగణించబడుతుంది. ఈ ఉద్యోగాలికి సంబంధించిన పదవులు ప్రస్తుత హైద్రాబాదు నిబంధనలతో నిర్ణయించిన నిష్పత్తిలో నివాసము షరతులికి అనుగుణంగా వున్నవారితో భర్తీ చెయ్యడానికి కేటాయించబడును.

8. ఉర్దూభాష :

రాష్ట్రంలో ప్రస్తుత పరిపాలనా న్యాయ వ్యవస్థలో ఉర్దూ భాషకి వున్న స్థానాన్ని అయిదేళ్ళపాటు కొనసాగించేందుకు తగిన చర్యలు తీసుకోడానికి భారత ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి సలహా ఇవ్వాలి.

9. కొత్త రాష్ట్రంలో ఉద్యోగుల రిట్రెంచ్‌మెంటు :

ఉద్యోగాలలో ఉన్నవారిని తొలగించవలసి వస్తుందని భారత ప్రభుత్వం భావించడంలేదు. ఎటువంటి వడపోత కార్యక్రమాలూ లేకుండానే హైద్రాబాదు రాష్ట్ర ఉద్యోగుల్ని ఆంధ్రప్రదేశ రాష్ట్ర సమగ్ర ఉద్యోగాలలోకి సాధ్యమైనంత వరకు చేర్చుకోవాలన్నదే ఉద్దేశం. ఒకవేళ రిట్రెంచ్‌మెంటు అవసరమైతే విశాల రాష్ట్ర ఉద్యోగులందరికీ ఒకేతీరుగా వర్తించేటట్టు చూడబడుతుంది.

10. ప్రాంతాలమధ్య ఖర్చు పంపిణీ :

రాష్ట్రంలో ఆర్థిక వనరుల్నిబట్టి ఖర్చు కేటాయించడం రాష్ట్ర ప్రభుత్వము, శాసనసభల అధికారంలో వ్యవహారం. అయితే కేంద్ర సాధారణ పరిపాలనా వ్యవహారాలకి సంబంధించి కొత్త రాష్ట్రం ఖర్చులు రెండు ప్రాంతాలమధ్యా నిష్పత్తి ప్రకారం భరించి, తెలంగాణా ఆదాయంలో మిగులు, ఆ ప్రాంతం అభివృద్ధికి కేటాయించి వుంచాలని ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల ప్రతినిధులు అంగీకరించి వున్నారు. కాబట్టి బడ్జెట్టు కేటాయింపుల విషయంలో ఈ వొప్పందం ప్రభుత్వం పాటించవచ్చు. ముఖ్యంగా ఈ వొప్పందం ఆంధ్ర ముఖ్యమంత్రి దృష్టికి తేవాలని భారత ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది. అది అమలు జరగాలని కూడా ఆశాభావం ప్రకటిస్తున్నది.

ఆంధ్ర ప్రతినిధులు : బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డి, గౌతు లచ్చన్న, అల్లూరి సత్యనారాయణరాజు.

తెలంగాణా ప్రతినిధులు బూర్గుల రామకృష్ణరావు, జె. వి. నర్సింగరావు, కొండా వెంకటరంగారెడ్డి, డాక్టరు మర్రి చెన్నారెడ్డి.

తెలంగాణా తరఫుని సంతకం చేసినవారిలో ముగ్గురు లాయర్లన్న సంగతి గమనించదగ్గ విషయం. ఆంధ్రపక్షంవారు ఉత్సాహవంతులైన నాయకులు మాత్రం.

పై ఒప్పందంలో 2, 3, 7, 8, 10, 11 అంశాలు ఆంధ్రప్రదేశ రీజియనల్ కమిటీ ఆర్డరులో చేర్చబడినవి.

4. స్టేట్ రీఆర్గనైజేషన్ ఆక్టు 1956 లో చేర్చబడినది.

9. ఇండియా రాజ్యాంగం, ఆర్టికల్ 371 లో చేర్చబడినది.

రక్షణలు 2 నించి 6 వరకూ ఆంధ్రప్రదేశ రీజియనల్ కమిటీ ఆర్డరు 1956 లో చేర్చబడినవి.

6. బి. డొమెస్టిక్ రూల్సు ఆఫ్ స్టేటు గవర్నమెంటు, రీజియనల్ కమిటీ ఆర్డరు 1957 లో చేర్చబడినది.

మిగిలిపోయిన అంశాలు పెద్దమనుష్యుల ఒప్పందంగా అంగీకరించబడినవి.

"ఈ అంశాలలో ఏది రాజ్యాంగబద్ధమో, ఏదికాదో నిర్ణయించాలి, మీకు ఒక న్యాయశాస్త్రవేత్తని సహాయం ఇస్తాను, అతని సలహాతో ఆ నిర్ణయంకూడా చేసి తీసుకురండి", అని పంత్ రెండు పక్షాల నాయకుల్ని ఆదేశించినాడు. ఈ పని తెలంగాణా నాయకులికి వదిలిపెట్టి, ఆంధ్రనాయకులు కర్నూలు వెళ్ళిపోయినారు.

ఇందులో అప్పటికి సవరింపబడినవి : అతుకు అతుకులాగే వున్న ఆంధ్ర-తెలంగాణా రాష్ట్ర నామకరణం ఒకటీ, హైకోర్టు ఏకంగా వుండాలనేది ఒకటి. జాయింటు పార్లమెంటరీ కమిటీలో ఒక సభ్యుడి సలహామీద పేరు 'ఆంధ్ర-తెలంగాణా' బదులు 'ఆంధ్రప్రదేశ్'గా మారినది. అప్పటి ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి కోకా సుబ్బారావు హైద్రాబాదు వెళ్ళి రంగారెడ్డిని ఒకే హైకోర్టుకి వొప్పించినాడు. ఉర్దూ తెలిసిన జడ్జీల బెంచి పెట్టుకుందామని సలహా ఇస్తే రంగారెడ్డి అంగీకరించినాడు. బిల్లులో ఒక హైకోర్టే చేర్చినారు.

1956 మార్చి 16 న పార్లమెంటు ఉభయసభలలోనూ రాష్ట్రాల పునర్నిర్మాణ బిల్లు ప్రతిపాదించబడినది. ఆంధ్ర, తెలంగాణా శాసనసభ్యులతో ప్రాంతీయ సలహా సంఘాలు రాష్ట్రపతి నియమించవచ్చుననీ, వాటి విధులు నిర్ణయించ వచ్చుననీ, బిల్లులో పేర్కొన్నారు. వివిధ రాష్ట్రాలమధ్య సరిహద్దులు సరిదిద్దడానికి భారత ప్రభుత్వం కమీషన్లు నియమించగలదు.

ఆంధ్రకి అప్పగించాలని ఫజలాలీ కమీషను సిఫారసు చేసిన బళ్ళారి జిల్లా ప్రాంతాలతోసహా అప్పటి బళ్ళారి జిల్లానంతటినీ మైసూరులోనే వుంచడానికి నిర్ణయించినారు. తుంగభద్రా ప్రాజెక్టు సక్రమ నిర్వహణకోసం బళ్ళారి జిల్లాలో కొన్ని ప్రాంతాలు ఆంధ్రకి మార్చడం అవసరం అని సిఫారసుచేసినా, ఈ మార్పు అవసరం లేదని నిర్ణయం జరిగినది.

రాబోయే 1957 శాసనసభ ఎన్నికలు ఒక్క తెలంగాణా ప్రాంతానికే వర్తిస్తాయనీ, ఆంధ్ర ప్రాంతంలో 1960 వరకూ జరగవనీ బిల్లులో స్పష్టపరిచినారు. పార్లమెంటుకి మాత్రం ఆంధ్రప్రదేశం అంతలోనూ ఎన్నికలు జరగాలి.

కొత్త రాష్ట్రం దక్షిణ మండలంలో వుంటుంది.

1956 ఏప్రిల్ 5 న ఈ బిల్లుమీద తీర్మానం కర్నూలు శాసనసభలో ప్రవేశపెట్టినారు. శాసనసభ కొన్ని సవరణలతో ఈ తీర్మానం ఆమోదించినది. కొత్తరాష్ట్రం పాతరాష్ట్రంగా పేర్కొనాలి. పేరు ఆంధ్రప్రదేశ్ అని వుండాలి; రాజధానీ, హైకోర్టూ హైదరాబాదులో వుండాలి; ఆంధ్రప్రదేశ్ అంతటికీ 1962లోనే సాధారణ ఎన్నికలు జరపాలి; 72 మంది సభ్యులతో ఎగువసభ వుండాలి. ఇవి కొన్ని సవరణలు.

1956 ఏప్రిల్ 13 న హైదరాబాదు శాసనసభ రాష్ట్రాల పునర్నిర్మాణం బిల్లుమీద తీర్మానం ఆమోదించినది.

1956 ఆగస్టు 25 న రాజ్యసభ ఈ బిల్లు ఆమోదించినది. అటుతర్వాత లోకసభ ఆమోదించినది. ఆగస్టు 31 న రాష్ట్రపతి ఆమోదం లభించినది.

1956 నవంబరు 1, నరక చతుర్దశినాడు అన్ని నూతనరాష్ట్రాలతోపాటు ఆంధ్రప్రదేశ్ అవతరించినది. పండిత నెహ్రూ స్వయంగా వచ్చి రాష్ట్ర ప్రారంభోత్సవం జరిపించినాడు. తెలుగులోకం సంతోషించినది. దీపావళి దివ్యదీపావళిగా ఆపిల్లబాలాదీ పండుగ చేసుకున్నారు. నూటఏభై ఆరు సంవత్సరాల తర్వాత విడిపోయిన తెలుగువారంతా మళ్ళీ హైద్రాబాదు ముఖ్యనగరంగా ఒక రాజ్యంలో కలుసుకున్నారు. ఇది ఆంధ్ర ప్రజారాజ్యం.



# భాగ్యనగర ప్రవేశం

నవ్యాంధ్రరాష్ట్రంలాగే విశాలాంధ్రరాష్ట్ర ప్రభుత్వ నిర్మాణ బాధ్యతకూడా సంజీవరెడ్డిమీదే పడినది. సంజీవరెడ్డిది అదృష్టజాతకం. ఆంధ్ర రాజకీయ నాయకులెవరికీ చరమదశలోగాని లభించని గౌరవపదవులు అతనికి నడివయస్సులోనే లభించినవి. లభ్యమైన హోదాలు శక్తిసామర్థ్యాలతో నిర్వహించి సార్థకం చేసుకున్నాడు. కాని, అన్నీ పోటీలేకుండా సంప్రాప్తమైనవి కాదు. ఆంధ్రప్రదేశ ప్రథమ ముఖ్యమంత్రి పదవికోసం బరిమీదవున్న ఇద్దరు రెడ్లకీ పోటీ వచ్చినది. ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిగా పనిచేసిన బెజవాడ గోపాలరెడ్డి, విశాలాంధ్ర ముఖ్యమంత్రి పదవి ఆశించడంలో ఆశ్చర్యంలేదు. తాను అభ్యర్థిగా నిలిచినాడు సమర్థుడైన సంజీవరెడ్డి అదివరకే ఒకసారి స్వయంగానూ, మరొకసారి కేంద్ర మధ్యవర్తుల సమక్షంలో బలాబలాలు తేల్చుకున్న తర్వాతనూ ఉపముఖ్యమంత్రిగా వుండిపోయినాడు. ఈసారి విడవదలుచుకోలేదు. కర్నూలు ప్రవేశించగానే బహిరంగంగా ప్రకటించడం ప్రారంభించినాడు. ఆంధ్రరాజ్యరథం కందెనవోలులో కందెనకోసమే ఆగినదనీ, అడంగు హైద్రాబాదు అనీను. విశాలాంధ్ర ఉషస్సుకిముందే మేలుకుని ఇల్లు చక్కబెట్టుకోడం ప్రారంభించినాడు. తన పలుకుబడి బలపర్చుకోడం తెలుసుకున్నాడు. ఈ ప్రయత్నంలో చేదోడువాదోడుగా వున్నవారిలో ముఖ్యులు అల్లూరి సత్యనారాయణరాజు, కాసు బ్రహ్మానందరెడ్డి. రాజు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు. ఢిల్లీ రాజ్యసభలో వుండి కేంద్రంలో పలుకుబడి సాధిస్తున్నవాడు. రెడ్డి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి; జిల్లా రాజకీయాలలో ఆరితేరి, రాష్ట్ర వ్యవహారాలలో రాటుతేలుతున్నవాడు. స్నేహితులు వేళాకోళంగా ముగ్గుర్నీ బుర్ర కథదళం అనేవారు. 1951 రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడి ఎన్నిక సమయానికే

బ్రహ్మానందం సంజీవరెడ్డి పక్షం. అప్పటి సంజీవరెడ్డి గెలుపే పాతనాయకులికి స్వస్తివాచకం. కోస్తా జిల్లాలనించి రాయలసీమకి రాజకీయ అధికారం ఫిరాయింపుకి ప్రారంభం. కరణాల చేతుల్లోంచి రాష్ట్రం రెడ్లచేతుల్లోకి వెళ్ళిన తరుణం. ఈ పరిణామ కారకుడైన సంజీవరెడ్డికి బ్రహ్మానందరెడ్డి బలమైన బంటుగా నిలిచినాడు.

ఒక్క ఆంధ్రరాష్ట్రమే అయితే పోటీ ఎల్లా వుండేదో తెలియదు. గోపాలరెడ్డి సంజీవరెడ్డి బలాబలాలు తులతూగేవేమో! ఆంధ్రప్రదేశ నిర్మాణంతో తొమ్మిది జిల్లాల తెలంగాణం ఒక కొత్త శక్తిగా రూపొందినది. అవిభక్త హైద్రాబాదు రాజ్యంలో మహారాష్ట్రులూ, కన్నడిగలూకూడా వుండేవారు గనుక బూర్గుల రామకృష్ణరావు నాయకుడైనాడు. ఎప్పుడైతే తెలంగాణం ఒకటిగా నిలిచినదో అప్పుడు నాయకత్వం రెడ్లదైనది. తెలంగాణా రెడ్లు ఎటువేపు మొగ్గితే అటువేపు గెలుపు తథ్యం. ఈ రెడ్లకి నాయకుడు కొండా వెంకటరంగారెడ్డి. ఈయన అనుయాయులు మర్రి చెన్నారెడ్డి, వెలమ వంశస్థుడైన జే. వి. నరసింగరావు. ఈ రెడ్డి గ్రూపు అప్పుడు విడిపోయినది. వెంకటరంగారెడ్డి దూరాలోచనాపరుడు. కుండ బద్దలగొట్టినట్టు మాట్లాడినా, కొంత నిజాయితీపరుడని ప్రతీతి. కోస్తా రాయలసీమ ఆంధ్రుల మీద అంత విశ్వాసం కలవాడుకాడు. తత్కారణంగా ప్రత్యేక తెలంగాణా స్థాపనకి శాయశక్తులా ప్రయత్నించినాడు. రామకృష్ణరావు లేకపోతే కృతార్థుడయేవాడేమో! రంగారెడ్డి అభిప్రాయం ఏమంటే, అద్ధరి రెడ్లు ఇద్దరు పోటీపడుతూ వుండగా ఇద్ధరివాళ్ళం తటస్థంగా వుందాం. ఎవరు గెలిస్తే వారు మనదగ్గరికే రాగలరు. అప్పుడు మనమాట వారు వినకతప్పదు అని. ఆ మాట చెన్నారెడ్డిగాని, నరసింగరావుగాని వినలేదు. ఆంధ్రనాయకుల తతంగమే అయివుండాలి. తత్ఫలితంగా చెన్నారెడ్డి గోపాలరెడ్డివేపూ, నరసింగరావు సంజీవరెడ్డివేపూ తిరిగిపోయినారు. ఈవిధంగా వెంకటరంగారెడ్డి గ్రూపు మూడు ముక్కలైనది.

ఇక మిగిలినది రామకృష్ణరావు గ్రూపు. ఇద్దరు అభ్యర్థులూకూడా తెలంగాణా నాయకులతో రాయబారాలు నడిపించినారు. వారి పోటీ సరిసమానంగా వుంటే రామకృష్ణరావు నాయకుడు కాగలిగిన అవకాశాలు వున్నవి. నిజాం పరిపాలన తర్వాత, హైద్రాబాదు రాజ్యం శక్తి సామర్థ్యాలతో పరిపాలించినవాడు. చివరి దశలో విశాలాంధ్రకేసి మొగ్గి ఆంధ్రప్రదేశ అవతరణకి కారకుడైనవాడు. ప్రత్యేక తెలంగాణా ఏర్పడితే, రామకృష్ణరావుకి అవకాశం వుంటుందనే ఆశకూడా వుండేది కాదు. తెలంగాణం ప్రత్యేకరాష్ట్రం అవుతుంది అనే ఆశవున్న సందిగ్ధకాలంలోనే, ముఖ్యమంత్రిగా వున్నాకూడా రావుని రెడ్లు తోసిరాజనడం ప్రారంభించినారు.

ఒక రాయబారం జరిగినదని రావుగ్రూపువారు అనుకునేవారు. ఒకవేళ రావు నాయకుడైతే, అతనికింద ఉపముఖ్యమంత్రిగా వుంటారా అని గోపాలరెడ్డినీ

సంజీవరెడ్డినీ అడిగినట్లూ, గోపాలరెడ్డి నిరాకరించగా సంజీవరెడ్డి అంగీకరించినాడనీ అనుకునేవారు. ఈ వూపుతో రావు గ్రూపు సంజీవరెడ్డివైపు మొగ్గినది.

ఇటువంటి పరిస్థితులలో ఆంధ్రతెలంగాణా కాంగ్రెసు శాసనసభ్యులంతా కర్నూలులో సమావేశమైనారు. సభాకార్యక్రమం పర్యవేక్షణకి కాంగ్రెసు కార్యదర్శి శ్రీమన్నారాయణ నియోగించబడినాడు. తెలంగాణానించి రంగారెడ్డి అస్వస్థతగా వుండి సభకి హాజరుకాలేదు. తనకున్న కొద్దిమందితో చెన్నారెడ్డి వెళ్ళినాడు. నర్సింగరావు రామకృష్ణరావు గ్రూపుతోసహా సంజీవరెడ్డికి వోటుచేసినాడు. త్యాగం చెయ్యడానికి సిద్ధపడ్డ సంజీవరెడ్డికి విజయం చేకూరినది.

1955 లో జరిగిన మధ్యంతర ఎన్నికలు కాంగ్రెసు, కె. ఎల్. పి., ప్రజా పార్టీల యునైటెడ్ ఫ్రంటుగా జరిగినవి. కర్నూలు మంత్రివర్గంలో మూడుపార్టీల ప్రతినిధులూ వున్నారు. ఏరుదాటిన సంజీవరెడ్డి యునైటెడ్ ఫ్రంటు అనే తెప్ప తగులబెట్టినాడు. ఆంధ్రప్రాంతంనించి కాంగ్రెసువారినే తన మంత్రివర్గంలో చేర్చుకున్నాడు.

పోటీచేసిన గోపాలరెడ్డి వెంటనే కాకపోయినా తర్వాత సంజీవరెడ్డి మంత్రివర్గంలో చేరినాడు. సహాయంచేసిన రామకృష్ణరావు కేరళ గవర్నరుగా పదవి స్వీకరించి, ఆంధ్రప్రదేశ రాజకీయాలతో సంబంధం వదులుకున్నాడు. వ్యతిరేకించిన చెన్నారెడ్డి మాత్రం పదవిలేకుండా మిగిలిపోయినాడు. పక్కగానిలిచిన బ్రహ్మానంద రెడ్డికి అనుకున్నట్టుగానే సంజీవరెడ్డి ఏర్పాటుచేసిన ప్రథమ ఆంధ్రప్రదేశ మంత్రివర్గంలో స్థానం లభించినది. ఆదిలో లభించిన శాఖ స్థానికపరిపాలన.

ఆ మంత్రివర్గంలో ముఖ్యమంత్రితోసహా మొత్తం పధ్నాలుగురు మంత్రులు వుండేవారు: కొండా వెంకటరంగారెడ్డి, కళావెంకటరావు, వి. బి రాజు; జె. వి. నరసింగరావు; డి. సంజీవయ్య; పి తిమ్మారెడ్డి; ఎస్. బి. పి. పట్టాభిరామారావు, జి. వెంకటరెడ్డి నాయుడు, నవాబ్ మెహిదీనవాజ్ జంగ్, మందుముల నరసింగరావు; ఏ. భగవంతరావు.

ఆంధ్ర ప్రజారాజ్యరథం విశాలాంధ్ర ప్రజారాజ్యరథమై భాగ్మతీ దివ్య సౌందర్య శ్రీలకంకితమైన భాగ్యనగరం అనే హైద్రాబాదు చేరినది. సరిపోలని రెండు చక్రాలతో యాత్ర సాగించినది. మద్రాసు మహానగరం, ఆ నగరవాసుల పొదుపుజీవితం మాత్రం ఎరిగిన ఆంధ్ర నాయకులూ, ఉద్యోగస్థులూ, కర్నూలులో వసతి గృహాలలోనూ, డేరాలలోనూ, కొంతకాలం గడిపి, హైదరాబాదుచేరి ఇక్కడి నాయకుల, ఉద్యోగుల నిత్యజీవిత క్రమం చూసి నివ్వెరపోయినారు. ఈ విలాసం వారిదివర కెరుగనిది. హైదరాబాదులో ఒక మజా, ఒక హుషార్, ఒక నిషా

వుండేవి. ఈ విశిష్ట విషయాలు ఆ నగరచరిత్రతో ఆవిర్భవించినవి. వర్షకాలంలో నీళ్ళు ప్రవహించినప్పుడు మూసీనది ఆ విలాస గీతమే వినిపిస్తుంది. భాగ్యనగర వాసనలలో భాగ్మతి అనురాగపరిమళంతోపాటు, పారశీక రోజాలూ, అరేబియా అత్తరువులూ గుబాళిస్తూ వుండేవి. పండుగరోజున ఉపవాసదీక్ష విరమిస్తూ వుండగా శత్రుసేనలు కోటగోడలు భేదించి, సింహద్వారం భేదించి, రాజ ప్రాసాదంలో ప్రవేశించి, లొంగిపొమ్మని ధిక్కరించగా, "ఎందుకీ తొందర, ముందు విందారగించండి, తరవాత సావకాశంగా షరతులు మాట్లాడుకుందాం" అన్నాడు ఆఖరి గోలకొండ నవాబు. ఆ గోలకొండ మహానగరం స్థాపించినవాడు కాకతీయ గణపతి దేవుడు. గుండ్రంగా (గోల్) వున్న కొండమీద మట్టికోట కట్టినాడు. ఆ నాడు కాకతీయులు యావదాంధ్రభూమినీ ఏకచ్ఛత్రంగా ఏలుబడి సాగించినారు. కాకతీయ సామ్రాజ్యం అంతరించిన తర్వాత దక్షిణదేశం, ముఖ్యంగా తెలంగాణా ప్రాంతం, మహమ్మదీయుల పరిపాలనలోకి వచ్చినది. రెండు వందల సంవత్సరాలు దక్కను రాజ్యం బహమనీ సుల్తానుల అధీనంలో వున్నది. రెండవ మహమ్మదు షా కాలంలో తెలంగాణం బందిపోటు జట్టుల పాలబడి బహమనీ పరిపాలనకి భంగం కలిగే పరిస్థితులు ఏర్పడ్డవి. సుల్తానుల స్థితికూడా నీరసంగా వున్నది. అప్పుడు ఒక తురక బానిసని ఈ బందిపోట్లని అరికట్టే పనికి నియోగించినారు. ఆ బానిస పేరు సుల్తాను కులీ. ఇతను టర్కీదేశంలో హమదాన్ అనే నగరంనించి వచ్చిన బహర్లు జాతివాడు. బహమనీ రాణివాసపు వారికి ఇతనిమీద నమ్మకం. కులీ యుద్ధంచెయ్యకుండా తెలంగాణాలో అమీర్లనీ, హిందూ ప్రజల్నీ సఖ్యం చేసుకుని బందిపోటు బెడద నివారించినాడు. ఈ ఘనకార్యానికి మెచ్చి రెండో మహమ్మదు షా కులీకి కుతుబ్-ఉల్-ముల్క్ అనే బిరుదిచ్చి గోల్కొండ అమీరుగా చేసినాడు. కుతుబ్-ఉల్-ముల్క్ 1512 లో స్వాతంత్ర్యం ప్రకటించి, సుల్తాన్ కులీ కుతుబ్ షా అనే పేరుతో గోలకొండ ముఖ్యనగరంగా పరిపాలన సాగించినాడు. ఈ కుతుబ్ షా వంశస్థులే గోలకొండ కోట రాతి కట్టడంగా చేసి, తమరాజ్యం దాదాపు ఆంధ్ర ప్రాంతం అంతా వ్యాపింపజేసినారు. వారికాలంలో గోలకొండ మహా పట్టణం. ప్రపంచంలో ప్రఖ్యాతిగాంచిన వజ్రాలసంత తెలుగుదేశంలో దొరికిన వజ్రాలన్నీ గొలకొండ బజారులో రాసులుపోసి వర్తకులు విక్రయంచేసే వారట. ఈనాటికీ లోకంలో ప్రసిద్ధిపొందిన వజ్రాలలో చాలావరకు ఆంధ్ర మణులే.

కుతుబ్‌షాహీ వంశంలో అయిదవవాడైన మహ్మమ్మద్ కులీ కుతుబ్ షా యువరాజుగా వుంటూ మూసీనది దాటి పచ్చని అడివిలో మృగయావినోదం చేసేవాడు. ఈ వినోదానికి మరోవినోదం తారసిల్లినది. ఆ ప్రాంతంలో నివసించే భాగ్మతి అనే హిందూ సుందరితో యువరాజుకి స్నేహం అయినది. ఈ రెండు

వినోదాలూ సంధించినస్థలంలో రాజైన తర్వాత కొత్త రాజధానీ నగరం నిర్మాణం చేసి, ప్రియురాలికి అంకితంగా భాగ్యనగరం అని నామకరణం చేసినాడు. భాగ్మతిని వివాహం చేసుకుని హైదర్‌మహల్ అని పేరు మార్చినాడు. ఆ మార్పుతో రాజ ధాని కూడా హైదరాబాదుగా మారినది. ఈ నిర్మాణం 1591 లో జరిగినది.

ఆఖరి గోలకొండ నవాబు తానాషా కాలంలో భారద్వాజస గోత్రోద్భవులైన పింగళి అక్కన్న, మాదన్న పంతుళ్ళు, ఇదం బ్రాహ్మ్యం, ఇదం క్షాత్రం, అని రాజ్యాంగం హిందూ ధర్మానుసారం నడిపించినారు. కంచర్ల గోపరాజు అనే రామదాసు, సర్కారు సొమ్ము శ్రీ సీతారామచంద్రులకి కైంకర్యంచేసి భద్రాచలంలో ఆలయం నిర్మించినాడు. శ్రీరామలక్ష్మణుల సహాయంతో ఆ సొమ్ము చెల్లించుకుని కారాగారంలోంచి విముక్తుడైనాడు.

1687 లో ఔరంగజేబు సేనలు గోల్కొండ నగరం పట్టినవి. అంతటితో కుతుబ్‌షాహీ వంశం అంతరించి, దక్షిణంలో మొగలు రాజ్యం ఏర్పడినది. 1713 లో మీర్ కమ్రుద్దీన్ ఛిన్ కిలిచ్‌ఖాన్ అనే సేనాపతిని దక్కనులో మొగలు రాజప్రతినిధిగా నియమించినారు. ఇతనికి నిజాం-ఉల్-ముల్క్ అనే బిరుదు ప్రదానం చేసినారు. ఢిల్లీ సుల్తానుకి సహాయం చేసినందుకు అసఫ్‌ఝా అని మరో బిరుదు ఇచ్చినారు. 1724 లో నీరసించిన మొగలు చక్రవర్తుల్ని ధిక్కరించి అసఫ్‌ఝా స్వతంత్రుడైనాడు, అప్పుడు తెలుగునాడు అసఫియా వంశ పరిపాలన లోకి వచ్చినది. బ్రిటిషు, ఫ్రెంచి కుట్రల ఫలితంగా కొంత ఆంధ్ర ప్రాంతం మద్రాసు రాష్ట్రంలోకి పోయినది. ప్రస్తుతం తెలంగాణం అనే ప్రాంతం, అయిదు మహారాష్ట్ర జిల్లాలతోనూ, రెండు కర్ణాటజిల్లాలతోనూ నిజాం రాజ్యంగా మిగిలిపోయి హైద్రాబాదు సంస్థానమైనది. కాలక్రమేణా బ్రిటిషు ఇండియా సామ్రాజ్యంలో స్వదేశసంస్థానమై 1948 సెప్టెంబరు వరకు ఏడుగురు అసఫ్‌ఝాల పరిపాలన భరించి, స్వతంత్ర భారతదేశంలో భాగమైనది. 1956 నవంబరు 1 వ తారీఖున మూడు భాగాలుగా విభజింపబడి, ఆంధ్రప్రదేశ, మహారాష్ట్ర, మైసూరు రాజ్యాలలో లీనమైనది.

1806 లో మూడవ నిజాం సికందర్‌జా పేరుమీద శికింద్రాబాదు నిర్మాణ మైనది. బ్రిటిష్‌వారు ఈ ప్రాంతంలో లష్కరీ అనగా సైనికశిబిరాలు ఏర్పాటు చేసినారు. శికింద్రాబాదు, తిరుమలగిరి, బోలారం ప్రాంతాలన్నీ బ్రిటిషు పరిపాలన కిందనే వుండేవి. ఈ రెండు నగరాలుకలిపి ఒక కార్పొరేషను చేసినప్పటినించీ, జంట నగరాలని వాడుతున్నారు.

మూడున్నరశతాబ్దాలు నిజాం పరిపాలనలోవున్న హైదరాబాదు నగరంలో ప్రజలు, యథారాజా తథాప్రజా అన్నట్టు వేషభాషలలో, సంస్కృతిలో, తురకల్ని

అనుసరించినారు. నిజాంపాలన అంతరించేవరకూ ఇక్కడ గౌరవోద్యోగాలు మహమ్మదీయులివి. వారి తర్వాత ఉర్దూ మాతృభాషగా కలిగి, ఉత్తరదేశంనించి దిగుమతి చెయ్యబడిన కాయస్థులవి. స్థానికులతో మహారాష్ట్రులూ, కన్నడిగలు. అన్ని విషయాలలోనూ తెలుగువారి కంటె ఎక్కువ స్థాయిలో వుండేవారు. తమిళులుకూడా గొప్పన్యాయవాదులుగావుండి నిజాంకి అండదండలుగా వుండేవారు. ఈ కారణాలవల్ల రాజధానీ నగరం కలగూరగంపగా వుండేది. తెలుగువారి ప్రాధాన్యత తక్కువ. ఆంధ్రేతరుల పలుకుబడి ఎక్కువ. రాజధానికున్న ఈ భాషాంతర ప్రభావం రాజ్యంలో ఇతర ప్రాంతాలకు లేదు. ఈ విధంగా ఆంధ్ర ప్రదేశ రాజ్యాంగరథానికి అమర్చిన రెండు చక్రాలలోనూ ఒకటి తమిళ–తెలుగు చక్రం, ఇంకొకటి తురక–తెలుగు చక్రం. మద్రాసుచక్రం ఇంగ్లీషులో కిరకిరమంటే, హైద్రాబాదుచక్రం ఉర్దూలో కిరకిరమనడం ప్రారంభించినది.

నవరాష్ట్ర అవతరణ ఉత్సవాలు కన్నులపండువుగా జరిగినా ఈ కొత్త కాపురం కోర్టువారు నిర్బంధంచేసిన భార్యాభర్తల దాంపత్యంలా తయారయే సూచనలు ఆదిలోనే కనుపించినవి. ఆసాయంకాలం ఫత్తేమైదానంలో ప్రధాని నెహ్రూ బ్రహ్మాండగా ఉపన్యసించినాడు. ఆయన భాష హిందూస్థానీ, కోస్తా రాయలసీమలనించి వచ్చిన వేలాది జనానికి అర్థం కాలేదు. రామకృష్ణరావు తెలుగు లోకి తర్జుమా చేసినాడు. సభలో అలజడి తగ్గినది. ఆయన రాష్ట్రం విడిచి పెట్టడంతో రెండుభాగాలమధ్యా ద్విభాషి పోయినాడు. ఉభయులూ ఒకర్ని ఒకరు అర్థం చేసుకోవడం కష్ట సాధ్యమైనది.

ఆరాత్రి ముఖ్యమంత్రి సంజీవరెడ్డి రేడియోలో ప్రజల్ని ఉద్దేశించి మాట్లాడి నాడు. ఎన్నో హామీలు ఇచ్చినాడు. ఈకలయిక ఒక కొత్తయుగం ప్రారంభించినా, చాలా సాధకబాధకాలు వున్నాయన్నాడు. అల్పసంఖ్యాకుల క్షేమం ప్రభుత్వం కాపాడుతుంది అన్నాడు. ఉద్యోగస్థుల కష్టసుఖాలు గమిస్తుందన్నాడు. అటువారూ ఇటువారూ కలియండంలో కొన్నితికమకలు ఏర్పడ్డం సహజం అన్నాడు. పూర్వ హైద్రాబాదు ప్రభుత్వోద్యోగులికి న్యాయం జరుగుతుంది అన్నాడు. పెద్ద మనుషుల వొప్పందం అక్షరాలా అమలు జరపడం తథ్యం అన్నాడు. కాని ఆ ఉదయమే ప్రమాణ స్వీకారం చేసిన మంత్రులలో డిప్యూటీ ముఖ్యమంత్రి లేడు. ఒప్పందంలో ముఖ్య రాజకీయ షరతులలో అది ఒకటి. ఆ షరతు బుట్ట దాఖలు చేసినాడు.

మర్నాడు ఒకకాయస్థ ఉన్నతాధికారి శికింద్రాబాదు క్లబ్బులో ఒకసవాల్ చేసినాడు. "ఇటువంటి నాయకుల్ని చాలామందిని చూశాం. చిటికలో వీళ్లని కైవశం చేసుకుంటాం, హైద్రాబాదు నిషాలో పడడం ఎంతసేపు?" అన్నాడు. ఆయన తనశాఖ పెద్దరికం నించి దిగి, కర్నూలునించి వచ్చిన ఒక ఆంధ్రేతర

ఉద్యోగి చేతికింద పనిచెయ్యవలసి వచ్చినది. ఒక రెవెన్యూబోర్డు సభ్యుడు కేంద్రంలో డిప్యూటీ సెక్రటరీగా వెళ్ళవలసి వచ్చినది అదే విధంగా ఎంతమందో ఉద్యోగులు తెలంగాణావారు పైస్థాయినించి కిందకి దిగవలసి వచ్చినది. గెజెటెడ్ నాన్ గెజెటెడ్ తరగతులలో ఈ దిగజారడం తప్పలేదు.

దీనికితోడు ఆంధ్రరాష్ట్రంలో అమలులోవున్న మద్రాసు వారసత్వం అయిన, టాటెన్‌హాం కోడ్డు ప్రకారం పరిపాలన జరగాలన్నారు. అదివరకు హైద్రాబాదులో బొంబాయి పద్ధతి అమలులో వుండేది. ఒకటి సవ్యం. ఇంకొకటి అపసవ్యం. ఈసవ్యాపసవ్యాల సామరస్యం కుదరలేదు. పైగా ఈటాటేన్‌హాం కోడ్డు కాపీలు అచ్చులో లేవు. అది ఎట్టిదో తెలంగాణా వారికి కలలో కూడా తెలియదు. వెంటనే ప్రారంభించినారు కర్నూలువారు. గవర్నరు మొదలు బంట్రోతు వరకూ, తెలంగాణా వారికి పనిరాదనీ. వీరుసోమరులనీను. ప్రభుత్వానికి కీలకమైన ఉద్యోగస్థుల మధ్య రాజీకుదరలేదు. ఇరుపక్షాల రాజకీయనాకుల మధ్యా అనుమానాలు సడలలేదు. మనం మనం అనే భావం ఆదిలోనే కలగలేదు. కర్నూలు వారి జులుం హైద్రాబాదువారికి నచ్చలేదు. హైద్రాబాదువారి బడాయి కర్నూలువారికి గిట్టలేదు. ఒకటి చిన్న చూపు. ఇంకొకటి పాత చూపు. ఇద్దరిమధ్యా ఉత్త చూపు.



# ఇద్దరు ముఖ్యమంత్రులు

ఆంధ్రప్రదేశం అవతరించిన నాలుగు నెలలకి యావద్భారతదేశంలోనూ సాధారణ ఎన్నికలు జరగవలసి వున్నది. సంజీవరెడ్డి నాయకత్వం చట్టరీత్యా ఈ నాలుగు నెలలకి మాత్రమే నన్నమాట.

పాత ఆంధ్రరాష్ట్రంలో మధ్యంతర ఎన్నికలు జరిగి ఆట్టేకాలం కాలేదు గనుక, రాష్ట్రపునర్నిర్మాణ చట్టంలో ఈ ఎన్నికలు 1962 దాకా వాయిదా వేసినారు. అందుచేత తెలంగాణాలో మాత్రం అసెంబ్లీకి ఎన్నికలు జరిగినవి. పార్లమెంటుకి మాత్రం ఆంధ్రప్రదేశం అంతటా ఎన్నికలు జరిగినవి. తెలంగాణా అసెంబ్లీ నియోజక వర్గాలలోనూ, రాష్ట్రమంతటా పార్లమెంటు నియోజక వర్గాలలోనూకూడా కాంగ్రెసు అభ్యర్థులు ఎక్కువ సంఖ్యలో గెలిచినారు. దాంతో రాష్ట్రంలో కాంగ్రెసు బలపడి స్థిరపడినది. పాత ఆంధ్రలో కాంగ్రెసు లాగ యునైటెడ్‌ఫ్రంటు అవసరం లేకపోయినది. ఈ బలం తెలంగాణావల్ల చేకూరినది. ఈ కాంగ్రెసు విజయం సంజీవరెడ్డి ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రిగా సాధించిన ప్రథమ ఘనకార్యం.

ఎప్పుడైతే వారికి మంత్రి వర్గంలో స్థానాలు లభించలేదో ప్రజాపార్టీవారు యునైటెడ్‌ఫ్రంటులోంచి తప్పుకుని ప్రతి పక్షంలో చేరినారు. 1958 లో మాజీ కృషికర్ లోకపార్టీ సభ్యులు కొందరు, అసంతృప్తి చెందిన కాంగ్రెసు నాయకులు కొందరూకలిసి కాంగ్రెసులోంచి తప్పుకున్నారు. ప్రతిపక్షంలో చేరి డిమోక్రాటిక్ ఫ్రంట్ స్థాపించినారు. ఈ పార్టీనాయకులు గౌతులచ్చన్న, మర్రిచెన్నారెడ్డి.

పెద్దమనుషుల వొప్పందం ప్రకారం ఆంధ్రకీ, తెలంగాణాకీ కాంగ్రెసు కమిటీలు మాత్రం విడివిడిగానే వుంటూ వచ్చినవి, ఆంధ్రకి అల్లూరి సత్యనారాయణ

రాజు, తెలంగాణాకి నూకల నరోత్తమరెడ్డి అధ్యక్షులు. ఈ ప్రత్యేకత 1957 చివరి దాకా వున్నది. అటుతర్వాత ఆంధ్రప్రదేశ కాంగ్రెసు కమిటీ ఏర్పాటైనది. అల్లూరి అధ్యక్షుడైనాడు.

1957 ఎన్నికల తర్వాతకూడా సంజీవరెడ్డినే ఏకగ్రీవంగా శాసనసభా నాయకుడుగా ఎన్నుకున్నారు, కొద్దిమార్పులతో అదే మంత్రివర్గం స్థిరపర్చినాడు.

1958 ఏప్రిల్‌లో ఆంధ్రప్రదేశ ఆర్థిక మంత్రిగా వుంటున్న బెజవాడ గోపాలరెడ్డిని కేంద్రంలో ఆర్థిక సహాయమంత్రిగా తీసుకున్నాడు ప్రధాని నెహ్రూ. ఆతరుణంలో బ్రహ్మానందరెడ్డిని ఆర్థిక మంత్రిగా నియమించినాడు సంజీవరెడ్డి. ఆర్థిక మంత్రిగా ఆరేళ్ళు పైగా పనిచెయ్యవలసి వచ్చిన బ్రహ్మానందం జీతాల కమిటీకీ రిట్రెంచి మెంటు కమిటీకీ అధ్యక్షుడుగా వుండి తన పరిపాలనాదక్షతా, అనుభవజ్ఞానం. ఉద్యోగుల యడల తన సానుభూతీ ప్రదర్శించినాడు. రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ చక్కబర్చి, ఆదాయం వృద్ధిచేసి మిగులు బడ్జెట్లు ప్రసాదించినాడు.

1959 మార్చిలో అపరచాణక్యుడని పేరు పొందిన కళావెంకట్రావు స్వర్గస్థుడైనాడు. సంజీవరెడ్డికి ఒకసన్నిహిత సలహాదారుడు, రాజకీయ నాయకులందరికీ ఒక ఆప్తుడూ, ఆంధ్రప్రదేశానికి ఒక రాజకీయవేత్త కరువైపోయినాడు. ప్లానింగు శాఖ వెంట్రావు చూవాసేడు. ఆయన తదనంతరం ఆ శాఖకూడా బ్రహ్మానందరెడ్డికి అప్పగించినాడు ముఖ్యమంత్రి. అప్పుడే నిర్మాణ కార్యక్రమంలో వికేంద్రీకరణం చట్టం చేయించినాడు.

1959 లో ఆంధ్రప్రదేశ రాజకీయపార్టీలలో మరికొన్ని మార్పులు వచ్చినవి. అఖిలభారత సోషలిస్టుపార్టీ సభ్యులైన విజయనగరం రాజా, పి. వి. జి. రాజు వర్గంవారికీ కెంద్రపార్టీకీ భేదాభిప్రాయాలు వచ్చినవి. కేంద్ర రాష్ట్రపార్టీలకి తెగతెంపులు జరిగినవి. అప్పుడు కృషికర్ లోక్‌పార్టీ ప్రాధాన్యమైన డెమోక్రాటిక్‌పార్టీ. రాజు ఆధ్వర్యాన సోషలిస్టులు. ప్రజాసోషలిస్టులూ కలిసి ప్రతిపక్షంలో చేరి సోషలిస్టు డిమోక్రాటిక్‌పార్టీ స్థాపించినారు. ఈ వుమ్మడికాపురం ఆట్టేకాలం సాగలేదు. ఇంతలో కాంగ్రెసుకి ఎదురుతిరిగిన కురువృద్ధుడు రాజాజీ స్వతంత్రపార్టీ స్థాపించినాడు. ఈ అఖిల భారతపార్టీ అధ్యక్షుడు ఆచార్యరంగా. సోషలిస్టు డిమోక్రాటిక్‌పార్టీలో భాగస్వాములైన డిమోక్రాట్లు, ఆంధ్రప్రదేశ రాష్ట్ర స్వతంత్రపార్టీగా పునర్జన్మించినారు. కేంద్రపార్టీతో విడిపోయి, రాష్ట్రంలో తావులేని సోషలిస్టులు కాంగ్రెసులో చేరినారు. గౌతులచ్చన రాష్ట్రస్వతంత్రపార్టీ అధ్యక్షుడైనాడు. దరిమిలాని పి. వి. జి. రాజు ఆంధ్రప్రదేశమంత్రి అయినాడు.

పాతకొత్తనీళ్ల కలయికలతో, ఆంధ్రప్రదేశంలో సంజీవరెడ్డి నాయకత్వాన కాంగ్రెసు సుస్థిరం అవుతున్న సమయంలో, అనగా 1959 నవంబరులో ప్రధాని

నెహ్రూ రాష్ట్రమంతా సంచారం చేసినాడు. ఆ విజయయాత్ర సంజీవరెడ్డి స్వయంగా నడిపించినాడు. అతనంటే ప్రధానికి అభిమానం, గౌరవం ఎక్కువైనవి. నెహ్రూ ఎప్పుడూ పైకివచ్చే యువక నాయకులమీద కన్నువేసి వుంచేవాడు. అభిమానులైనా, వ్యతిరేకులైనా సమర్థులైన యువతరంవారిమీద నెహ్రూకి గౌరవం. పాత నాయకులైన ప్రకాశం, పట్టాభివంటివారు పండిట్‌జీని సమకాలికుడుగా, సహచారిగా పరిగణించేవారు. అవసరంపట్ల వ్యతిరేకించేవారు. వారిమీద పండితుడికి ఆప్యాయతలేదు. సంజీవరెడ్డి యువతరంవాడు. నెహ్రూ అభిమాని. ఆంధ్రలో అతని సర్దార్. 1951 లో అలహాబాదు నివాసుడైన పురుషోత్తమదాసు టాండన్‌కీ, జవహరిలాల్ నెహ్రూకీ తగాదాలు వచ్చినవి. ఆ తగాదాలలో దేశంలో కాంగ్రెసు రెండు పార్టీలైనది. కాంగ్రెసు జనరల్ సెక్రటరీగా వుంటున్న కళా వెంకట్రావు టాండన్ పక్షం వహించినాడు. ఆంధ్ర తన చేతుల్లోవున్నదన్నాడు. అప్పుడు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డి. నెహ్రూ పక్షంగా నిలిచి పని జేసి విజయం చేకూర్చినాడు. నాటివయస్సు 38 సంవత్సరాలు మాత్రం. అప్పట్నించీ పండితుడికి సంజీవరెడ్డిమీద అభిమానం, నమ్మకం

1959 డిసెంబరులో బెంగుళూరులో కాంగ్రెసు మహాసభ జరగవలసి వున్నది. ఎవర్ని అధ్యక్షుడుగా పెట్టాలాఅని ఆలోచిస్తున్నాడు. ఎదురుగా ఉత్సాహవంతుడూ, సమర్థుడూ, తాను నమ్మదగినవాడు సంజీవరెడ్డి కనబడినాడు. అది ఒకటేకాదు. గౌహతీ కాంగ్రెసు తర్వాత అల్లూరి సత్యనారాయణరాజుని కాంగ్రెసు జనరల్ సెక్రటరీగా నియమించినారు నెహ్రూ, దేభేర్‌భాయీలు. సత్యనారాయణరాజు ఆకర్షణీయమైన వ్యక్తి. సమర్థుడు, ప్రచారదక్షుడు. ఒకనాడు కమ్యూనిస్టు. "వాల్గా నించి గంగవరకూ" అనే గ్రంథకర్త. హిందీ క్షుణ్ణంగా తెలిసినవాడు. మంతెన వెంకట్రాజుకి కూడా హిందీ బాగా వచ్చు. వీరిద్దరికీ భావిభారత రాజకీయాలలో చాలా ఉన్నతస్థానం లభించగలదని ఆశీర్వదించేవాడు పట్టాభి. 'సత్యం' అంత వరకూ సంజీవరెడ్డి ఆప్తమిత్రుడు. అధిష్ఠానవర్గంలో సంజీవరెడ్డి పేరు ప్రతిష్ఠలు ప్రచారం చేసినాడు. అప్పుడు కాంగ్రెసు అధ్యక్షురాలుగావున్న ఇందిరాజీకి నచ్చజెప్పినాడు. తండ్రీ కూతురూ ఆలోచించి కాంగ్రెసు అధ్యక్షపీఠం సంజీవరెడ్డికి ఇవ్వాలని నిశ్చయించినారు. ఆనాడానిర్ణయానికి తిరుగులేదు. సంజీవరెడ్డికి ఆహ్వానం అందినది.

స్వరాజ్యం రాకపూర్వం కాంగ్రెసు అధ్యక్షపదవి జాతీయగౌరవపదవి. అటు తర్వాత ఒకవిధమైన వెట్టిచాకిరీ. రాష్ట్ర ముఖ్యమంత్రి హోదాకీ కాంగ్రెసు అధ్యక్షపదవికీ ఎక్కడా సాపత్యంలేదు.

ఈ కారణాలవల్ల సంజీవరెడ్డి సందిగ్ధావస్థలో పడినాడు. ఆహ్వానం అంగీకరించడమా తిరస్కరించడమా ? ముఖ్య సలహాదారులైన బ్రహ్మానందరెడ్డి ప్రభృ

తులికి వెళ్ళడం ఇష్టంలేదు. ఇక్కడ రాష్ట్రంలో పరిస్థితులు పూర్తిగా స్థిరపడలేదు. సంజీవరెడ్డి ప్రారంభించిన పని పూర్తిగాలేదు. ఈ సలహాలతో అతని సందేహాలు బలపడినవి. ఒకవేపు పండితనెహ్రూ ఆహ్వానం, ఒకవేపు ముఖ్యమంత్రి అధికారం. లోలోపల తిరిగి రావచ్చులే అనుకున్నాడు. అయిష్టంగానే ఆహ్వానం అంగీకరించి నాడు. 1960, జనవరి 14న బెంగుళూరు కాంగ్రెసు మహాసభ ప్రారంభించినది.

ముఖ్యమంత్రి పదవి ఖాళీకాగానే 'వారసత్వపు తగాదాలు' ప్రారంభించినవి. వారసుణ్ణి నిర్ణయించే శక్తిసామర్థ్యాలూ, పలుకుబడీ సంజీవరెడ్డికి వున్నవి. తనని తోసిరాజు అనలేని వ్యక్తిని ముఖ్యమంత్రి చేతామని ఆలోచించినాడు. అధిష్ఠాన వర్గంతో ఆలోచించినాడు. పండితులు నెహ్రూ, పంత్‌జీ తెలంగాణా నాయకుడు కొండా వెంకటరంగారెడ్డిని చెయ్యమన్నారు. సంజీవరెడ్డి మనసులో నవాబ్ మెహిదీనవాజ్ జంగ్ పేరు కూడా వున్నది. బ్రహ్మానందరెడ్డిని, తనతర్వాత ముఖ్యమంత్రి చేదామని కుతూహలం వున్నదన్న బహుళప్రచారం కూడా జరిగినది. సంజీవరెడ్డి ఢిల్లీనించి వచ్చి ఏ సంగతీ ఎవరికీ చెప్పలేదు.

ఈలోపుగా అల్లూరి సత్యనారాయణరాజు తాను ముఖ్యమంత్రి కావాలని ఆశపడినాడు. ఆ ఆశ సంజీవరెడ్డితో చెప్పగా అతను వ్యతిరేకించినాడు. ఆప్త మిత్రులమధ్య వైరుధ్యం ప్రారంభం అయినది. దాంతో అల్లూరి ప్రచండప్రచారం కూడా ప్రారంభం అయినది. ఈ పదవి బ్రహ్మానందరెడ్డికి అంటగట్టాలని చూస్తు న్నాడు, నేనుకూడా బరిమీద వున్నానన్నాడు. సంజీవరెడ్డి ఏ ప్రయత్నం చేసినా భగ్నం చేతామని కంకణం కట్టుకున్నాడు. వీలైతే కేరళ గవర్నరుగావున్న బూర్గుల రామకృష్ణరావుని రంగంలోకి లాక్కురావాలని ప్రయత్నించినాడు. స్నేహితుల ద్వారా ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపించినాడు. రామకృష్ణరావుతో అప్పటికప్పుడే దేభేర్‌భాయి సంప్రదించినాడు. మొదట్లో సంజీవ గోపాలరెడ్లుగదా ఈ పదవికి పోటీ పడినారు; గోపాలరెడ్డిని పిలిపిస్తే మంచిది అని సలహా యిచ్చినాడు. తాను రాష్ట్ర రాజకీయాలలోకి రానని స్పష్టంగా తెలియజేసినాడు. అటు తర్వాత గోపాలరెడ్డి కూడా ఏమీ ఉత్సాహం ప్రకటించలేదు, ఈ పరిస్థితులలో తానే నిలబడతానన్నాడు రాజు. పరిపాలనానుభవంలేని 'సత్యం' మంత్రిగా వుండవచ్చుగాని, ముఖ్యమంత్రి పదవికి తగడని అందరి అభిప్రాయం అన్నట్టుగా తేలినది. తత్కారణంగా తన తాలూకు రెండు పుంజుల్ని బరిమీద నిలబెట్టి బ్రహ్మాండమైన ప్రచారయుద్ధం చేసినాడు. దామోదరం సంజీవయ్య, పట్టాభి రామారావు రాజు అభ్యర్థులు. సంజీవరెడ్డి ఏమీ అనలేదు.

కొండా వెంకట రంగారెడ్డి ప్రభృతులు అలజడిచెంది సంజీవరెడ్డిని కలిసి నారు. వారితో 'సత్యం' అదివరకే ఆలోచనలు చేసినాడు. వారు అనుకూలించ

లేదు. నిర్ణయం నాయకుడైన సంజీవరెడ్డిది అన్నారు. స్నేహితులద్వారా బ్రహ్మానందరెడ్డిని వూపిచూసినాడు. అతనూ అదే జవాబు చెప్పినాడు. "ఇందులో నా తీర్మానం ఏమీలేదు. నా నిర్ణయం నాయకుడైన సంజీవరెడ్డికే వొదిలివేశాను. 'సత్యం'గాని, సంజీవయ్యగాని, పట్టాభి రామారావుగాని అంతా సంజీవరెడ్డి అనూయాయులం. అంతా మనకి కావలసినవారే. ఆఖరి నిర్ణయం నాయకుడికే వొదిలెయ్యడం ధర్మం" అన్నాడు.

ఈ పరిణామాలన్నీ చూస్తున్న సంజీవరెడ్డి 'సత్యం' అభ్యర్థి సంజీవయ్యని అంగీకరించి, ముఖ్యమంత్రిగా చేసినాడు. నలభైయ్యేళ్ళు నిండని సంజీవయ్య దేశంలో ప్రథమ హరిజన ముఖ్యమంత్రి. ఆ గౌరవం ఆంధ్రప్రదేశానికికే దక్కినది. 1960 జనవరి 10న సంజీవయ్య మంత్రివర్గం ప్రమాణ స్వీకారం చేసినది. బ్రహ్మానందరెడ్డిని ఆర్థిక మంత్రిగానే తిరిగి నియమించినాడు. పెద్దమనుషుల వొప్పందం ప్రకారం డిప్యూటీ ముఖ్యమంత్రి పదవి సృష్టించి, కొండా వెంకటరంగారెడ్డికి ఆగౌరవం అందించినాడు. తనని నిలబెట్టిన అల్లూరికి మంత్రిపదవి ఇచ్చినాడు. తక్కిన మంత్రులు : పట్టాభి రామారావు, పిడతల రంగారెడ్డి, కల్లూరి చంద్రమౌళి, మందుముల నరసింగరావు, ముళ్ళపూడి పళ్ళంరాజు, ఏ. సి. సుబ్బారెడ్డి, పి. వి. జి. రాజు, శ్రీమతి మసూనాబీగం, నూకల రామచంద్రారెడ్డి. ఈ మంత్రివర్గంలో బ్రహ్మానందరెడ్డి ఆర్థికశాఖ ఒకటేకాక, న్యాయశాఖకూడా నిర్వహించినాడు.

సంజీవయ్య మంత్రివర్గం ఇరవయ్యేడు నెలలు అశాంతితో నడిచినది. డిప్యూటీ ముఖ్యమంత్రిగావున్న కొండా వెంకటరంగారెడ్డికి సంజీవయ్య పద్ధతులు నచ్చలేదు. రంగారెడ్డిమాట చెల్లుబడి కావడంలేదు. ఆ సందర్భంలో సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి విషయంలోనే ఆయన నమ్మకం ప్రకటించినాడు. ఏరికోరి తెచ్చుకున్న ఏ. సి. సుబ్బారెడ్డి అనుక్షణం బెదిరించడం ప్రారంభించినాడు. మందిబలం వున్న రెడ్లకి సంజీవయ్య పరిపాలన నచ్చలేదు. అలజడి ప్రారంభం అయినది. అల్లరిచేసే సుబ్బారెడ్డిని తప్పించుకున్నాడుగాని అతనితో విరోధం ఎక్కువ జేసుకున్నాడు. ఇంతలో రాష్ట్రాన్ని 1962 ఎన్నికలకి సిద్ధంచెయ్యవలసి వచ్చినది.

సంజీవయ్య డిప్యూటీ ముఖ్యమంత్రి పదవి సృష్టించి, తెలంగాణా నాయకుడికి ఆ పదవి దత్తంచెయ్యడమేకాక, రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షపదవి తెలంగాణా నాయకుడికి ఇచ్చినాడు. ఆ నాయకుడు రంగారెడ్డి గ్రూపువాడు నూకల నరోత్తమరెడ్డి. ఆంధ్రప్రదేశం ఏర్పడిన ఈ పదమూడు సంవత్సరాలలోనూ రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షపదవి అలంకరించిన తెలంగాణా నాయకుడు నరోత్తమరెడ్డి ఒకడే. అవతరణ సమయంలో తెలంగాణా కాంగ్రెసు అధ్యక్షుడు ఆయనే. రెండు కమిటీలూ కలిసిన తర్వాత అల్లూరి అధ్యక్షుడైనాడు. అల్లూరి జాతీయ కాంగ్రెసు జనరల్ సెక్రటరీ

అయిన తర్వాత పిడతల రంగారెడ్డి రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు. పిడతల రంగా రెడ్డి మంత్రికాగా రెండేళ్ళ నరోత్తమరెడ్డి అధ్యక్షుడు. సంజీవయ్య వ్యతిరేకులంతా కలిసి నరోత్తమరెడ్డిని దించివేసినారు. వారిలో ఏ. సి. తోసహా బ్రహ్మానందరెడ్డి కూడా వున్నాడు. ముళ్ళపూడి పళ్ళంరాజుని అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. తర్వాత గొట్టిపాటి బ్రహ్మయ్య, బ్రహ్మయ్య తర్వాత పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి. తిమ్మారెడ్డి మళ్ళీ మంత్రికాగా కాకాని వెంకటరత్నం. పదమూడేళ్ళలో ఏడుగురు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులలో ఒకడే తెలంగాణా నాయకుడు. తెలంగాణా పోరాటం తర్వాత వచ్చిన గురుమూర్తి రెండవవాడు. నరసారెడ్డి మూడవవాడు.

ఎన్నికలు దగ్గిరపడగానే కాంగ్రెసు అభ్యర్థుల్ని నిర్ణయించడానికి కమిటీ వెయ్యవలసి వచ్చినది. ఒక కమిటీ ఎన్నుకోగా అది సంజీవయ్య వ్యతిరేకులికి నచ్చలేదు. ఏ. సి. గ్రూపు ఎలక్షను పిటిషను పెట్టినది. దానిమీద తీర్పు చెప్ప వలసినవాడు కాంగ్రెసు అధ్యక్షుడైన సంజీవరెడ్డి. తన రాష్ట్రంలో, తనవారి మధ్య తగాదాలో తాను కలగజేసుకోడం ఇష్టంలేకనూ, సమంజసంకాదనే ఊహతోనూ, ఈ పిటిషను పండితపంతుకి తీర్పుకిగాను పంపించినాడు. పంత్ కిందపెట్టి మీదపెట్టి, జరిగిన ఎన్నిక రద్దు చేసినాడు. తిరిగి ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికలో బ్రహ్మానందరెడ్డికి అన్నివోట్లూ పడినవి. తన్మూలంగా, 1962 ఎన్నికలికి కాంగ్రెసు అభ్యర్థుల్ని ఎన్నుకునే కార్యక్రమంలో ముఖ్యాతిముఖ్యుడైన సభ్యుడైనాడు.

ఈ పిటిషను కార్యక్రమంలో బ్రహ్మానందరెడ్డి, ఏ. సి. సుబ్బారెడ్డి, పి. వి. జి. రాజు, కొండా లక్ష్మణ బాపుజీ మొదలైనవారు కలిసి పనిచేసినారు. రాష్ట్రంలో ఈ అలజడి జరుగుతుండగా సంజీవరెడ్డికి తిరిగి రావాలనే కుతూహలం పెరిగినది. ఎన్నికల తర్వాత అతనే ముఖ్యమంత్రి కావాలని సంజీవయ్య వ్యతిరేకులు లేవదీసిన నినాదం సంజీవరెడ్డి అభిలాషకి దోహదం చేసినది. తాను తిరిగి దేశం వెళ్ళిపోతానని ప్రధాని నెహ్రూకి లేఖ వ్రాసుకున్నాడు. ఆయన పరోక్షంగా మూతి విర్చినాడు.

ఆంధ్రప్రదేశ శాసనసభలో నామినేటు చెయ్యబడే ఆంగ్లోఇండియనుతో సహా 301 స్థానాలు వుండేవి. 1962 ఎన్నికలలో కాంగ్రెసు పార్టీకి 177 స్థానాలు లభించినవి. ఈ విజయం ప్రచారం సాగించిన నాయకుల, ముఖ్యంగా బ్రహ్మానందరెడ్డి కృషికి ఫలితం. కమ్యూనిస్టుపార్టీకి 51 స్థానాలూ, స్వతంత్రకి 19, లభించినవి. బ్రహ్మానందరెడ్డి తన పాత నియోజకవర్గం ఫిరంగిపురంలోనే నిలబడి నాడు. జాగర్లమూడి చంద్రమౌళి ఇతనికి వ్యతిరేకంగా నిలిచినాడు. గెలుపు రెడ్డిదే.

సంజీవరెడ్డి కాంగ్రెసు అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చి తిరిగి ఆంధ్రప్రదేశ కాంగ్రెసు శాసనసభా నాయకుడుగా ఎన్నుకోబడినాడు. కొత్త మంత్రివర్గం ఏర్పాటు

చేసినాడు. బ్రహ్మానందరెడ్డి ఆర్థికశాఖ ఒకటేకాక, సహకారోద్యమశాఖ కూడా నిర్వాహించినాడు.

సంజీవయ్య ఉద్ధరించిన ఉపముఖ్యమంత్రి పదవి ఒక సంప్రదాయంగా పరిగణించలేదు సంజీవరెడ్డి. పైగా ఆ ఉద్యోగంమీద మోజువున్న కొండా వెంట రంగారెడ్డి ఎన్నికలలో వోడిపోయినాడు. రంగారెడ్డిని వోడించినవ్యక్తి వందేమాతరం రామచంద్రరావు. ఉస్మానియా విశ్వవిద్యాలయం 'వందేమాతరం' ఉద్యమంలో పాల్గొని, ఆబిరుదు వహించిన రామచంద్రరావు ప్రతిసాధారణ ఎన్నికలలోనూ నిలుస్తూనేవున్నాడు. 1951 ఎన్నికలలో వి. బి. రాజుకి ఎదురుగా నిల్చి వోడిపోయినాడు. ఎలక్షన్ పిటిషన్ దాఖలు చేసినాడు. రాజు ఎన్నికల వ్యవహారంలో అక్రమచర్యలు వున్నాయని కోర్టు తీర్పు చెప్పగా ఆయన్ని కొన్ని సంవత్సరాలపాటు శాసనసభలికి నిలవకూడదని నిషేధ ఆజ్ఞజారీ అయినది. మళ్ళీ 1967 ఎన్నికల దాకా రాజు నిలవడానికి వీలులేక పోయినది.

1967 ఎన్నికలలో వందేమాతరం రామచంద్రరావు చెన్నారెడ్డికి వ్యతిరేకంగా నిలిచి వోడిపోయినాడు. ఎన్నికల పిటిషను దాఖలు చేసినాడు. చెన్నారెడ్డి ఎన్నికల సందర్భంలో అక్రమచర్యలు అవలబించినాడని హైకోర్టు తీర్పు చెప్పినది. దానిమీద చెన్నారెడ్డి సుప్రీంకోర్టుకి అప్పీలు పెట్టుకున్నాడు. అప్పటికే బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో ఆర్థిక మంత్రిగావున్న చెన్నారెడ్డి కేంద్రంలో స్టీలు మంత్రిగా వెళ్ళివున్నాడు. సుప్రీంకోర్టు అతని అప్పీలు కొట్టి వేసినది. చెన్నారెడ్డి మంత్రి పదవికి రాజీనామా ఇవ్వవలసి వచ్చినది. పైగా కొన్ని సంత్సరాలపాటు ఎన్నికలకి నిలవరాదని నిషేధం అమలులోకి వచ్చినది. ఈ విధంగా తెలంగాణా ఎన్నికలలో వందేమాతరం రామచంద్రరావు ముగ్గురు కాంగ్రెసు నాయకుల్ని తన పొట్టని పెట్టుకున్నాడు.

సంజీవరెడ్డి కొత్తమంత్రివర్గంలో, బ్రహ్మానందరెడ్డికాక, తిరిగీ కాంగ్రెసులో చేరిన మర్రిచెన్నారెడ్డి, నూకల రామచంద్రారెడ్డి. నవాబ్‌మీర్ అహమదల్లీఖాన్, ఎం. ఎన్. లక్ష్మీనరసయ్య. పి. వి. నరసింహారావు, బి. వి. గురుమూర్తి. శ్రీమతి టి. ఎన్. సదాలక్ష్మి (తెలంగాణా) ఏ. సి. సుబ్బారెడ్డి, పి. వి. జి. రాజు, యార్లగడ్డ శివరామప్రసాద్, ఎం. ఆర్. అప్పారావు. ఆలపాటి వెంకట్రామయ్య, ఎ. బలరామరెడ్డి (ఆంధ్ర) వున్నారు. సంజీవయ్యని మంత్రివర్గంలో చేరమని ముఖ్యమంత్రి ఆహ్వానించినాడు. అల్లూరికికూడా ఇస్తే వస్తానన్నాడు. సంజీవరెడ్డి ఇష్టపడలేదు.

ముఖ్యమంత్రి అయిన తర్వాతకూడా మూడు నాలుగునెలలు కాంగ్రెసు అధ్యక్షుడుగా వ్యవహరించినాడు సంజీవరెడ్డి. ఎవరు అధ్యక్షుడు కావాలీ అనే

సమస్య పరిష్కారం కాలేదు. చివరికి ఇందిరాజీ పట్టుపట్టి సంజీవయ్యని అధ్యక్ష పదవికి పిలిపించినది. ఆపీఠంమీద ఆయన భువనేశ్వరం కాంగ్రెసుదాకా వుండి, ఆసభలో కామరాజుకి ఛార్జీ అప్పగించినాడు. భువనేశ్వరంలోనే ప్రధాని నెహ్రూకి అకస్మాత్తుగా జబ్బుచేసి అవసానదశ సమీపించినాడు. అప్పుడే 'సిండికేటు' ఒకటి రూపొందిన సంగతి తెలిసినది.

సంజీవరెడ్డి, సంజీవయ్య లిద్దరూ వరుసగా కాంగ్రెసు అధ్యక్షులైనారు. ఆదిలో పనప్పాకం ఆనందాచార్లు, తాత్కాలికంగా కొండ వెంకటప్పయ్య, స్వరాజ్యం వచ్చిన తర్వాత పట్టాభిసీతారామయ్య మాత్రం ఈ పదవి అలంకరించిన ఆంధ్రులలో పూర్వులు. సంజీవయ్య ప్రథమ హరిజన ముఖ్యమంత్రి మాత్రమేకాక, ప్రథమ హరిజన కాంగ్రెసు అధ్యక్షుడు. కేంద్రంలో మంత్రిగా చేరినప్పుడు అందరిలో చిన్నవాడు.



# మూడో ముఖ్యమంత్రి

అఖిల భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్ష పదవి నిర్వహించి, యావద్భారత దేశం సంచరించి, కేంద్రంలోనూ, వివిధ రాష్ట్రాలలోనూ ప్రభుత్వాల, ప్రజానాయకుల పద్ధతులు పరిశీలించి, ఇంటికి వచ్చి మళ్లీ ముఖ్యమంత్రి పదవి చేపట్టిన సంజీవరెడ్డి దేశనాయకులలో ఒకడైనాడు. అదివరకే కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గంలోనూ, పార్లమెంటరీబోర్డులోనూ సభ్యుడై మహానాయకులతో భుజాలు కలిపి, పరిపక్వమైనాడు. స్వరాష్ట్రానికి, ముఖ్యంగా తెలంగాణాకీ, రాయల సీమకీ లాభించే పనులు చేయించాలని తలబెట్టినాడు. తత్ఫలితమే నిజామాబాదు జిల్లాలో గోదావరి జలాలతో పోచంపాడు ప్రాజెక్టు, కర్నూలుజిల్లాలో కృష్ణమీద శ్రీశైలం ప్రాజెక్టు. 1963 జులైలో ప్రధాని నెహ్రూ ఈ రెండు ప్రాజెక్టులకీ నిర్మాణ కార్యక్రమం ప్రారంభించినాడు.

ఆర్థిక మంత్రిగావుండి, తనకి మొదట్నించీ నమ్మకంగావున్న బ్రహ్మానంద రెడ్డీ తనూ అనుకునేవారు. ఈ రాజకీయాలకీ, పార్టీ వ్యవహారాలకీ ఇంతకాలం వృధా కాకపోతే, ఎంత ప్రజాసేవ చెయ్యవచ్చునో అని. రాజకీయపార్టీలలో మనుషుల కలయికలూ, కలతలూ, వీడుకోళ్లూ వానాకాలపు మబ్బుల లాటివి. స్థిరత్వంలేదు. తాను ముఖ్యమంత్రిచేసిన సంజీవయ్య ఇప్పుడు దూరమైనాడు. వెనకటి 'సత్యం' వెనకటి వాడుకాడు. ఇటువంటి ఆలోచనలతో బండి నడుపుతూ వుండగా కర్నూలుజిల్లాలో జాతీయంచేసిన రహదారీ బస్సు రవానాదార్లు ఆ చట్టం చెల్లనేరదని కోర్టు ఎక్కినారు. కేసు సుప్రీంకోర్టు దాకా వెళ్ళినది. ప్రభుత్వం చేసిన చట్టం ఆ జిల్లా ఆసాములమీద కక్షతో ఏర్పడినదనీ అందువల్ల చెల్లనేరదనీ తీర్పు వచ్చినది. ఈ చట్టంచేసిన బాధ్యత ముఖ్యమంత్రిది అని తప్పు తనమీద

వేసుకుని రాజీనామా దాఖలు చేసినాడు సంజీవరెడ్డి. పరిశుభ్రమైన ప్రజాపాలనా సంప్రదాయం సృష్టించినాడు. పరిపాలనాధికారం త్యజించి, శాసనసభానాయకత్వం వుంచుకున్నాడు. ముఖ్యమంత్రిపదవి వెంటనే తానునమ్మినబంటు, బ్రహ్మానందరెడ్డికి దత్తం చేసినాడు. బ్రహ్మానందం 1964 ఫిబ్రవరి 23 న అధికార స్వీకారంచేసి, అదే మంత్రివర్గంతో 29 న ప్రమాణస్వీకారం చేసినాడు. నాలుగు నెలల తర్వాత తోటరామస్వామినీ, తానేటి రాఘవుల్నీ చెంచు రామానాయుణ్ణీ కొత్తమంత్రులుగా వేసుకున్నాడు.

ఉగాదినాడు ప్రజలకి నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తూ రేడియో ప్రసంగంలో తన రాజకీయ జీవితం సింహావలోకనం చేసినాడు. ప్రకాశం పంతుల్ని తలుచుకున్నాడు. 28 సంవత్సరాల క్రితం ఒంగోలుజిల్లాబోర్డు అధ్యక్షుడుగా తనకి ప్రథమగౌరవపదవి లభించినదన్నాడు. తదాదిగా ఏదో విధంగా ప్రజాసేవచేసుకునే అవకాశం వస్తూనే వున్నదన్నాడు. ఈనాడు రాష్ట్రముఖ్యమంత్రి పదవి ఇతోధికప్రజాసేవ చెయ్యగలిగే వీలుకలుగుతుందనే ఆశతోనే స్వీకరించానన్నాడు. తానిప్పుడు రాష్ట్రప్రజల ప్రథమసేవకుణ్ణి అన్నాడు. అందరి ఆశీర్వాదం, సహకారం ఆశించినాడు.

సంజీవరెడ్డి సభానాయకుడుగా ఆట్టేకాలం వుండలేదు. 1964 మే నెలలో జవహరిలాల్ నెహ్రూ దివంగతుడైనాడు. భారతజాతి చరిత్రలో ఒకశకం అంతరించినది. నూతన శకం ప్రారంభించినది. కాంగ్రెసుపార్టీకి కూడా పెద్దదెబ్బ. కేంద్రంలో 'సిండికేట్' అనే నాయకులబృందం అధికారం చలాయించడం ప్రారంభించినది. వారంరోజులు తిరక్కముందు, తలవని తలంపుగా గుల్జారీలాల్ నందాని కాదని, మురార్జీదేశాయినివద్దని, లాల్‌బహదూర్‌శాస్త్రిని ప్రధాన మంత్రిగా ఎన్నుకున్నారు. సంజీవరెడ్డి సిండికేటులో ఒక ముఖ్యమైన సభ్యుడు. శాస్త్రి రెడ్డిని తన మంత్రివర్గంలో చేరమని ఆహ్వానించినాడు. శాసనసభా నాయకత్వానికి రాజీనామా ఇచ్చి ఢిల్లీ మంత్రివర్గంలో చేరినాడు. అతని జీవితమే పాతపదవులికి రాజీనామాలు, కొత్త పదవుల స్వీకారాలు; రాష్ట్రపతి ఎన్నికలలో వోడిపోయేవరకూ.

సంజీవరెడ్డిస్థానే బ్రహ్మానందరెడ్డిని ఏకగ్రీవంగా శాసనసభా నాయకుడుగా ఎన్నుకున్నారు. రెండు పదవులూ స్వీకరించిన బ్రహ్మానందం సర్వస్వతంత్రుడైనాడు. తొమ్మిదినెలలు నిండకపూర్వమే శాసనసభలో అవిశ్వాస తీర్మానం ఎదుర్కొన్నాడు.

ప్రభుత్వంలో ఒక మంత్రిగా వున్నప్పుడు ఏ సద్గుణాలతో ప్రవర్తించినాడో, ముఖ్యమంత్రిగా ఆ సుగుణాలు మరింత రాణించినవి. సాధువు, బిగ్గరగా మాటలాడడు. అసలు మితభాషి. అతనికున్నది బ్రహ్మాండమైన వోపిక, సహనం.

అమీరు మొదలు పకీరువరకూ సులభంగా లభ్యం అవుతాడు. వారుచెప్పింది సావకాశంగా, సానుభూతితో వింటాడు. తాను తొందరలో వున్నట్టు తెలియనియ్యడు. జ్ఞాపకార్థం వారు చెప్పిన సంగతులు వ్రాసుకుంటాడు. సహాయం చెయ్యకలిగిన ఒక అధికార వ్యక్తితో మనగోడు చెప్పుకున్నాం గదా అనే ఉరట కలుగుతుంది. వీలున్నంతవరకు సహాయం దొరుకుతుంది అనిపిస్తుంది. నిర్ణయం అనుకూలం కాకపోతే, దానికి సహేతుకమైన కారణాంతరాలు వుంటాయనే నమ్మకం పోదు. ఒకపూట వచ్చిన వ్యక్తులందర్నీ విడివిడిగా చూడడానికి వ్యవధిలేకపోతే, బైటికి వచ్చి అందర్నీ పలకరించి, వారిచ్చిన కాగితాలు పుచ్చుకుని, అవసరం అనుకున్న వాళ్ళని తరవాత ఎప్పుడో రమ్మని సమాధానపరుస్తాడు. ఈ ధర్మ దర్శనంతో కూడా చాలామంది పనులు నెరవేర్తాయి.

ఎంతటి రాజకీయ వ్యవహారాలలో మునిగివున్నా అవసరమైన కాగితాలతో ఉద్యోగులు వస్తే వార్ని వెంటనేచూసి, వ్యవహారం ఫైసలు చేసి పంపుతాడు. ఉద్యోగులికి మూలవిరాట్టులాంటి ముఖ్యమంత్రిని చూస్తున్న భావం వుండదు. ఉత్సవ విగ్రహంలాగ ఉత్సాహంతోనే వుంటాడు. అసామాన్యమైన జ్ఞాపకశక్తితో, ఒక విషయంలోంచి ఇంకో విషయంలోకి, కన్ఫ్యూషన్ లేకుండా వెళ్ళగలడు.

ఈవచ్చీపోయేవారి నిరంతర రామధాళిలో, తెల్లవారుఝామునే లేచి ఫైళ్ళు చూసుకుంటాడు. అవి నిదానంగా చదువుతాడు, అవగాహన చేసుకుంటాడు. అనవసరంగా ఫైలుకి అడ్డంగా వ్రాయడు. కార్యదర్శి ప్రతిపాదన సమంజసమని తోస్తే అంగీకార సంతకం చేస్తాడు. సందేహంవుంటే, క్లుప్తంగా అది తెలియజేస్తాడు. అవసరం అయితే కలిసి మాట్లాడవలసినదిగా కోర్తాడు. ఉద్యోగుల్ని తూలనాడడు, విసుక్కోడు. తన అధికారదర్పం ప్రకటించడు. అత్యవసర పరిస్థితులలో వారిని కాకిచేత కబురంపకుండా టెలిఫోనులో మాట్లాడి విషయం తేల్చుకుంటాడు.

బహిరంగ సభలలో అతిగా మాట్లాడడు. కొన్నిచోట్ల అసలు మాట్లాడడు. వాచాలత్వం అతని గుణంకాదు. తత్కారణంగా బ్రహ్మానందరెడ్డి మనసులో ఏమి వున్నదో తెలుసుకోవడం కష్టం. ఆవులిస్తే పేగులు లెఖ్ఖపెట్టేవారికికూడా అసాధ్యం. అతను 'మూడు' అని అనవలసివస్తే, తానామాట అనక మనచేతనే అనిపించి ఏకీభవిస్తాడు. ఈ స్వభావంవల్ల అతను లోపలి స్వయంపాకం మనిషి, గడసరి అనే అభిప్రాయం కలుగుతుంది. ప్రతినిత్యమూ కొన్ని వందలమందిని చూస్తూ సందర్భం వున్నవీ, లేనివీ కోరికలకి ఔగాములు వెంటనే చెప్పడం దేవుడికైనా కష్టమే. అందుచేత అధికారంలో వున్నవాడికి ఆ మూకీభావం అవసరం. ఆ కవచం లేకపోతే కష్టం. ఈ మర్మం శ్రద్ధగా పరిశీలించిన వారికి మాత్రం అవగాహన అవుతుంది.

తన వినయ సంపత్తితో, ఆదరభావంతో బ్రహ్మానందరెడ్డి అధికార, అనధికార వర్గాల ఆపేక్ష అనురాగాలు సాధించినాడు. ప్రజాబంధువు అనిపించు కున్నాడు.

1967 ఎన్నికల సమయానికి బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి పదవి 32 నెలలు నడిచినది. ఈ వ్యవధిలో రాష్ట్రానికి చాలా మేళ్ళు చేకూరినవి. ఆంధ్రప్రదేశం మీద కేంద్రం సీతకన్ను పోయినది. ఎక్కువగా కేంద్ర పారిశ్రామిక ప్రాజెక్టులు, ముఖ్యంగా తెలంగాణాకి లభించినవి. నాగార్జున సాగరానికీ, తుంగభద్ర ఎగువ కాలువకీ అదనపు గ్రాంటులు మంజూరైనవి. రాజమండ్రీవద్ద గోదావరిమీద రోడ్డు-రైలు వంతెన మంజూరై పని ప్రారంభమైనది. తన కంఠంలో ప్రాణం వుండగా రాదన్నాడు నాటి ఆర్థిక మంత్రి టి. టి. కృష్ణమాచారి. పూర్వం రాజకీయంగా తెలుగు దేశంలాగే, రైల్వే పరిపాలనకి కూడా మన ప్రాంతం ఉత్తర, మధ్య, దక్షిణ మండలాలలో విభజించి నడిపేవారు. మన ప్రభుత్వం ఒత్తిడివల్ల ఇప్పుడు శికింద్రాబాదు కేంద్రంగా దక్షిణ మధ్య మండలం సృష్టించారు. ఇంకా గుంతకల్లు భాగం ఇందులోకి రావలసి వున్నది.

మనదేశం, ముఖ్యంగా దక్షిణదేశం, అతివృష్టికీ అనావృష్టికీ పాలవుతూ వుంటుంది. కోస్తా జిల్లాలలో అతివృష్టి బాధిస్తే రాయలసీమ తెలంగాణాలకి అనావృష్టి ఈ అనావృష్టి సమస్య ఏ రాష్ట్రం ఆ రాష్ట్రంలో తనంతటతానే, తనకున్న వీలు చాళ్ళతో ఎదుర్కొడంకంటె, అన్నిరాష్ట్రాలూ కలిసి ఒక మండల ప్రణాళిక తయారు చేసి, కేంద్ర ప్రభుత్వ సహాయంతో పరిష్కారం చేసుకోవాలనే ఆలోచన బ్రహ్మానందరెడ్డికి తోచినది. దక్షిణదేశంలోవున్న నాలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రుల్ని పిలిచి, తిరుపతిలో ఒక సమావేశం చేసినాడు. ఆ సమావేశంలో అనావృష్టి సమస్య క్షుణ్ణంగా చర్చించి, కేంద్రానికి ఒక నివేదిక పంపినారు. ప్రణాళికా సంఘంవారు ఆ నివేదికలో సలహాలు సూత్రప్రాయంగా అంగీకరించినారు.

ఇటు పరిపాలనా విషయాలేకాక రాజకీయ విషయాలు కూడా అదే శ్రద్ధతో పరికించినాడు. జోడు గుర్రాలమీద స్వారిచేసే రౌతు అన్నారు. గుంటూరులో ఆలిండియా కాంగ్రెసు కమిటీ మీటింగుకి అతిశోభాయమానంగా, అన్ని వసతులతోనూ ఏర్పాటు చేసినాడు. గుంటూరు బ్రహ్మానందరెడ్డి స్వస్థానం. ఆజిల్లా పౌరుల సహకారం ఆయనకి అండదండలు. బ్రహ్మానందం ఆటగాడు. అందుకని ఆ వూళ్ళో అతని పేరుమీద ఒకపెద్ద స్టేడియం కట్టుకున్నారు.

ఆ విధంగా పెరిగే పేరు ప్రతిష్ఠలూ, అధికారమూ, పలుకుబడీ, జనాదరణా మనలో మనవాళ్ళకే గిట్టదు. మనదేశంలో ఎప్పుడూ బైటి శత్రువులకంటె ఇంట్లో శత్రువులే ఎక్కువ. భారతదేశం పోయిందీ పోయేదీ అంతః శత్రువుల వల్లనే.

ఆంధ్రులికి అసూయమెందు. మనవాడు పైకొస్తే మనం చూడలేం. పొరుగింటి పుల్లకూరరుచి. అవతలివాడు 'భళీ' అంటే మనం తాళం వేస్తాం. బ్రహ్మానందరెడ్డి జీవితంలో రాజకీయ ఆటంకాలు ప్రారంభం అయినవి. అంతః శత్రువులు తయారైనారు.

ఢిల్లీ వెళ్ళిపోయిన సంజీవరెడ్డి 'సారాశెంబుతాడు' తన చేతుల్లో వుంచుకుందామని ప్రయత్నం. ఆ ప్రయత్న ఫలితంగా రాష్ట్రంలో ఒక గ్రూపు ఆవిర్భవించినది. దానికి నాయకుడు ఏ. సి. సుబ్బారెడ్డి. స్నేహితులు అతన్ని ప్రోత్సహించినారు, నువ్వే ముఖ్యమంత్రి ఎందుకు కాకూడదని. ఆశ సహజం. ఏ. సి. ముఖ్యమంత్రి అయితే బ్రహ్మానందరెడ్డి అతనికింద మంత్రిగా వుండడు. అప్పుడు గుంటూరుజిల్లా అంతకీ తానే మంత్రిగా మిగుల్తాడు ఆలపాటి వెంకట్రామయ్య. ఆ ఆశతో ఏ.సి.కి తోడైనాడు ఆలపాటి. జలగం వెంగళరావు పి. వి. జి. రాజు, పిడతల రంగారెడ్డి కూడా నాడు ఈ గ్రూపువారే. రామ భూపాలరెడ్డి మరొకడు. ఈయన సంజీవరెడ్డి అల్లుడు.

ఢిల్లీలోకూడా ఒకలాబీ తయారైనది. కేంద్ర ఎన్నికల కమిటీకి సంజీవరెడ్డికి వ్యతిరేకంగా పోటీ చేయించి వోడిపోయిన సంజీవయ్య, రఘురామయ్యా కూడా సంజీవరెడ్డికి సన్నిహితులుగా మారినారు.

"బ్రహ్మానందరెడ్డి నీవాడుకాడు, నీకు వుండడు. అల్లా వొదిలేస్తే తొండ ముదిరి ఊసరవెల్లిగా తయారవుతాడు." ఈ ప్రచారంతో సంజీవరెడ్డి మనసు పాడు చేసినారు. నవ్యాంధ్ర భారత నరనారాయణులనుకున్న బ్రహ్మానందరెడ్డి, సంజీవరెడ్ల మధ్యకూడా గయోపాఖ్యానం తప్పలేదు.

ఈ పరిస్థితులలో ఆలపాటి వెంకటరామయ్య స్వర్గస్థుడైనాడు. అతని మరణంతో రాష్ట్ర కాంగ్రెసు ఎన్నికల కమిటీలో ఖాళీ వచ్చినది. కమిటీలో సభ్యులు 11 మంది. ఒకరుపోతే పదిమంది మిగిలినారు. వీరిలో అయిదేసిమంది ఒకో గ్రూపు. ఒకటి బ్రహ్మానందరెడ్డిది, మరొకటి ఏ. సీ. ది అనగా సంజీవరెడ్డిది. ముఖ్యమంత్రి ముఠా : బ్రహ్మానందరెడ్డి, తిమ్మారెడ్డి, తోట రామస్వామి, వి. బి. రాజు, చెన్నారెడ్డి. ఏ. సి. ముఠా : ఏ. సి. సుబ్బారెడ్డి, నూకల రామచంద్రారెడ్డి, మీర్ అహమదల్లీ ఖాన్, పి. వి. జి. రాజు, రుక్మిణమ్మ. ఆలపాటి బతికివుండగా ఏ. సీ. పార్టీకే ఎక్కువ బలం వుండేది. ఖాళీ భర్తీ చెయ్యడానికి ఎన్నిక అవసరమైనది. ఎవరి అభ్యర్థి గెలిస్తే వారికి బలం ఎక్కువ అవుతుంది. అందుచేత విపరీతమైన పట్టుదలతో ఇరుపక్షాలవారూ ఎన్నికల కురుక్షేత్రంలోకి లంఘించినారు. బ్రహ్మానందరెడ్డి అభ్యర్థి కాకాని వెంకటరత్నం. సుబ్బారెడ్డి అభ్యర్థి మూర్తిరాజు. చివరికి ముఖ్యమంత్రి గ్రూపు గెలిచినది. కాకాని వెంకటరత్నం పదకొండో సభ్యుడైనాడు.

ఈ రభసలిల్లా వుండగా అయిదో ఉక్కు కర్మాగారం విశాఖపట్టణానికి దక్కదేమోనని భయం కలిగినది. పెట్టుబడి పెట్టదలుచుకున్న ఆంగ్లో అమెరికన్ కన్సార్షియంవారు అన్ని ప్రదేశాలు పరిశీలించి, గోవాకంటె కూడా విశాఖపట్టణం ఉత్తమం అన్నారు. అప్పటి కేంద్ర స్టీలుమంత్రి అది అంగీకరించినాడు. తలబెట్టిన కర్మాగారం విశిష్ఠత ఏమిటంటే అది లోతు సముద్రతీరంలోనే వుండాలి. అందుకని గోవాగాని, విశాఖపట్టణంగాని అనుకూలం. ఈ రెంటిలో విశాఖపట్టణం మేలు అన్నారు కన్సార్షియంవారు. వారికి ప్రాంతీయ అభిమానాలు వుండవుగదా !

కావలసిన వసరులూ, వీలుచాళ్ళూ, ఉత్పత్తిలక్ష్యం, ఎగుమతి అవకాశాలూ, ఏమీ చూసుకోకుండా ప్రాంతీయ దురభిమానంతో మూడు రాష్ట్రాలు తమకి కావాలని అలజడి ప్రారంభించినవి. ఒరిస్సాలో బైలదిల్లా, మద్రాసులో సేలం, మైసూరులో హోసపేట అయిదో ఉక్కు కర్మాగారానికి అనువైన స్థానాలని ప్రచారం ప్రారంభం అయినది. చెప్పిన మూడు స్థలాలూకూడా సముద్రతీరాలు కావు. అనుకున్న కర్మాగారం లోతు సముద్రానికి సంబంధించినది. ప్రాంతీయ ప్రచారంలో అసలు విషయం మరుగు పడిపోయినది. పత్రికలకికూడా ఈ విషయం అర్థంకాలేదు. ఈ అలజడిలో సిద్ధాన్నం కాకి ఎత్తుకుపోతుంది అనే భయంతో ఆంధ్రప్రదేశంలోకూడా ప్రజాభిప్రాయం పైకి వచ్చినది. సభలు జరిగినవి; హర్తాళ్ళు జరిగినవి. అమృత రావు నిరాహారదీక్ష ప్రారంభించినాడు.

ఈ అలజడీ, ప్రచారం బ్రహ్మానందరెడ్డే దోహదంచేసి లేవనెత్తినాడని మన వారే కేంద్రంలో పితూరీలు చేసి, అయిదో ఉక్కు కర్మాగారం అయిపూ ఆనవాలూ లేకుండా చేసినారు అప్పటివరకు.

1966 లో రగులుకున్న మరో పితూరి ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సంబంధించినది. నిజానికి అది రాష్ట్రంలో అన్ని విశ్వవిద్యాలయాలకీ సంబంధించి నది. ఈ సంస్థల ఉపాధ్యక్ష పదవి నియామకం రెండువిధాలుగా వుండేది. ఒకటి సెనెటుద్వారా ఎన్నిక. రెండు ప్రభుత్వం మూడు పేర్లజాబితా సిఫారసు చెయ్యగా అందులో ఒకర్ని గవర్నరు ఎన్నుకోడం. సెనెటు ఎన్నికలతో విశ్వవిద్యాల యంలో రాజకీయాలు ప్రవేశించినవి. జాబితా పద్ధతిలో వో మంచిపేరూ, రెండు చెడ్డపేర్లూ ఇస్తే మంచివాణ్ణే గవర్నరు ఎన్నుకుంటాడు. అందుచేత నియామకాధి కారం పరోక్షంగా కమిటీ చేతుల్లోనే వుంటుంది. ఈ పద్ధతి మారిస్తే బాగుంటుందని ఆలోచన జరిగినది. ఈ ఆలోచన కలగడానికి కారణం ఆంధ్ర విశ్వవిద్యాలయం. అప్పుడు ఉపాధ్యక్షుడు డాక్టరు ఏ. ఎల్. నారాయణ. ఆయన పరిపాలనమీద కొన్ని ఫిర్యాదులు వచ్చినవి. ఆ సమయంలో విశ్వవిద్యాలయం రిజిస్ట్రారుగా ప్రభుత్వం ఎం. వి. రాజగోపాల్ అనే ఐ. ఏ. ఎస్. ఆఫీసర్ని నియమించినది.

ఉపాధ్యక్షుడిమీద ఫిర్యాదులు విచారించడానికి న్యాయమూర్తి నాయర్ని నియమించి నారు. ఆయన రిపోర్టులో ఉపాధ్యక్షుణ్ణి నిర్దోషిగా పరిగణించవచ్చునని వున్నా కొన్ని పరిపాలనా లోపాలు చూపించకపోలేదు. డాక్టరు నారాయణని 1961 లో నియమించినారు. పూర్తికాలం అయిదేళ్ళు పనిచేస్తే 1966 జూన్‌లో ఆయన పదవీ విరమణ చెయ్యవలసివున్నది.

ఈ లోపుగా రాజగోపాల్ హైద్రాబాదులో విద్యా శాఖలో అధికారిగా తిరిగి వచ్చినాడు. విశ్వవిద్యాలయాల చట్టం, ముఖ్యంగా ఉపాధ్యక్షుడి నియామకానికి సంబంధించిన నిబంధనలు, సవరణ చెయ్యాలని ప్రభుత్వానికి సంకల్పం కలిగినది. ఒకబిల్లు తయారవుతున్నది. ఉపాధ్యక్షుడి నియామకం ఛాన్సలరు చేతుల్లో పెట్టాలని నిర్ణయం జరిగినది. పదవీకాలం కూడా అయిదేళ్ళనించి మూడేళ్ళకి తగ్గించదలుచు కున్నారు. విశ్వవిద్యాలయాలలో బోధనాభాష మొదలైన విషయాలలోకూడా ప్రభుత్వానికి అధికారం వుండాలనికూడా బిల్లు ఉద్దేశ్యం.

1965 లో ఈబిల్లు తయారవుతుండగా విశ్వవిద్యాలయాల స్వేచ్ఛమీద ప్రభుత్వం దండయాత్ర చేస్తున్నదని ప్రచారం ప్రారంభం అయినది. ఆంధ్ర ప్రదేశంలోనేకాక, భారతదేశం అంతలోనూ మేధావుల, విద్యావేత్తల, పత్రికల అభిప్రాయం ప్రభుత్వ ప్రయత్నానికి వ్యతిరేకంగా వున్నది. ఇక్కడ ప్రభుత్వం అనగా ముఖ్యమంత్రి.

ఉస్మానియా ఉపాధ్యాయులంతా కలిసినారు. వివిధ అంగాలలో చర్చలు జరిపినారు. ఈ బిల్లు తమ ఉపాధ్యక్షుడి పదవీకాలంలో తగ్గించడానికే వచ్చినదని ప్రచారం చేసినారు. ఆ ఉపాధ్యక్షుడు డి. ఎస్. రెడ్డి.

డాక్టరు డి. సదాశివరెడ్డి మద్రాసులో విద్యాశాఖ డైరెక్టరుగా రిటైరైనాడు. ఆంధ్రరాష్ట్రం ఏర్పాటైన తర్వాత తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వెలిసినది. ప్రథమ ఉపాధ్యక్షుడు ఎస్. గోవిందరాజులు పదవి సమాప్తమవు తున్నది. ఆ ఉద్యోగం తనకి కావాలని సదాశివరెడ్డి ఆశించినాడు. అప్పటికి ఆంధ్ర ప్రదేశ అవతరణ కూడా జరిగినది. రాయలసీమవాసి, సదాశివరెడ్డిని రాయలసీమలో విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షుడుగా వెయ్యడం ముఖ్యమంత్రి సంజీవరెడ్డికి ఇష్టం లేదు. సదాశివరెడ్డి సంజీవరెడ్డికి దూరబంధువుకూడాను.

అదే సమయంలో, ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షపదవి కూడా ఖాళీ అవుతున్నది. ఉస్మానియాచట్టం వేరుగావుండేది. దానిప్రకారం ఉపాధ్యక్షుణ్ణి నియమించే అధికారం నేరుగా ప్రభుత్వానిదే. అప్పుడు, గోపాలరెడ్డి, బ్రహ్మానంద రెడ్డి కలిసి, సంజీవరెడ్డిని బలవంతంచేసి, సదాశివరెడ్డిని ఉస్మానియా ఉపాధ్యక్షుడుగా వేయించినారు. ఈ నియామకం 1957 లో జరిగినది. పరిమితి రెండు సంవత్స

రాలు. 1959 లో విశ్వవిద్యాలయాలచట్టం జరిగినది. ఆ చట్టప్రకారం సదాశివ రెడ్డికి మరో అయిదేళ్ళు ఆ పదవి లభించినది. 1964 లో ఉద్యోగం చాలించ వలసివున్నది. ఆ విధంగా చెయ్యమని ముఖ్యమంత్రి సంజీవరెడ్డి సలహా ఇచ్చినాడు. ఏడేళ్ళు విరామంలేకుండా ఉద్యోగం నెరవేర్చిన సదాశివరెడ్డికి విద్యాలయంలో బలం, ఢిల్లీలో పలుకుబడీకూడా కలిగినవి. తంటాలుపడి జాబితాలో తనపేరు వేయించు కుని మరోఅయిదేళ్ళపాటు ఉపాధ్యక్షపదవి సాధించినాడు. ఆ ప్రకారం 1969లో ఆయన పదవీవిరమణ చెయ్యవలసి వున్నది. ప్రభుత్వం తలబెట్టిన చట్టసవరణ ప్రకారం ఆయన 1967 లో రిటైరు కావలసి వుంటుందని అనుకున్నారు.

ఉస్మానియా అధ్యాపకులంతా కలిసి ఆలోచనలుచేసి, బిల్లుచట్టం అయితే సంభవించే సాధకబాధకాలన్నీ ఒకనివేదిక తయారుచేసి ముఖ్యమంత్రిని కలిసినారు. వారు ఎనిమిది అంశాలు నివేదించగా వాటిలో ఆరింటి ప్రకారం బిల్లు సవరింపజేసినాడు ముఖ్యమంత్రి. ఉపాధ్యక్షుడి పదవీకాలంలో మాత్రం మార్పుచెయ్యడానికి వీలులేదని స్పష్టం చేసినాడు. దాంతో పరోక్షంగా ఉపాధ్యాయులూ, ప్రత్యక్షంగా విద్యార్థులూ రంగంలోకి దిగినారు. సదాశివరెడ్డి పక్షంగా ప్రచారఉద్యమం లేవదీసినారు. అది ముఖ్యమంత్రికి వ్యతిరేక ఉద్యమం. విద్యార్థులు లారీలు ఎక్కి నినాదాలతో వూరేగి నారు. ఈ అలజడికి వెనకాలవుండి సంజీవరెడ్డి గ్రూపు కొందరు మంత్రులతోసహా చాలా సహాయం చేసినది. సదాశివరెడ్డి కొన్ని ఉద్రేకపూరితమైన ప్రకటనలు చేసి నాడు. ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి వాటికి అంత తీవ్రంగానూ జవాబు చెప్పవల సిన అగత్యం కలిగినది. పరిస్థితులు వేడెక్కినవి. సంజీవరెడ్డి బంధువైన సదాశివరెడ్డిమీద కక్షతో ముఖ్యమంత్రి ఈ మార్పులు చేస్తున్నాడనే అభిప్రాయం కలిగినది. ఈ గందరగోళంలో బిల్లు చట్టం అయినది.

సదాశివరెడ్డి హైకోర్టులో పిటిషను దాఖలు చేసినాడు. చేసిన చట్టం తనకి వర్తించదనీ. పాత నియామకం ప్రకారం అయిదేళ్ళపాటూ, అనగా 1969 వరకూ తనని పదవిలో వుండనివ్వాలనీ కోరినాడు. హైద్రాబాదు హైకోర్టు ఆ పిటిషను తోసివేసినది. సదాశివరెడ్డి సుప్రీంకోర్టుకి అప్పీలుచేసినాడు. ఈలోపుగా ఛాన్సలరు డాక్టరు పి. వి. నరసింహారావుని ఉపాధ్యక్షుడుగా నియమిస్తూ ఆర్డరు వేసినాడు. నరసింహారావు ఛార్జీ తీసుకునేందుకు హైద్రాబాదు వచ్చినాడు. ఉస్మానియా రిజిస్ట్రార్ని పిలిపించి ఛార్జీ తీసుకోవలసివున్నది. విద్యాలయ ఆవరణలోకి ఆయన వెళ్ళే అవకాశంలేదు. వసతిగృహంలోనే వున్నాడు. అప్పుడు విద్యార్థులు రిజిస్ట్రార్ని బలవంతంగా కారులో ఎక్కించుకుని ఎక్కడికో తీసుకుపోయి, మటుమాయం చేసినారు. నరసింహారావు రెండురోజులు నిరీక్షించినాడు. రిజిస్ట్రారు దొరకలేదు. ఛార్జీ తీసుకోలేకపోయినాడు, ఇంతలో సుప్రీంకోర్టు ఛాన్సలరు ఆర్డరు నిలుపు

చెయ్యమని ఉత్తరువు చేసినది. తరువాత తీర్పులో సదాశివరెడ్డికి కొత్త చట్టం వర్తించదనీ, పాత నియామకం ప్రకారం ఆయన అయిదేళ్ళపూర్తికాలం 1969 దాకా వుండవచ్చుననీ చెప్పినది. నరసింహారావు ఛార్జి తీసుకున్నట్టయితే న్యాయ పరిస్థితి వేరుగావుండేది. ఆయనే ఉపాధ్యక్షుడుగా వుండేవాడు. చట్టం ఎల్లా వున్నా విద్యార్థులు వుండనిచ్చేవారుకారు.

ఏది ఏమైనా, ఉస్మానియా ఉపాధ్యాయులూ, విద్యార్థులు రాజకీయరంగ ప్రవేశం చెయ్యడానికి అదే విఘ్నేశ్వరపూజ. ఈ ఉద్యమం ఒక సంవత్సరం నడిచినది. కాంగ్రెసు ఎలక్షను కమిటీ ఎన్నికలలో నెగ్గిన బ్రహ్మానందరెడ్డికి, ఇది సంజీవరెడ్డి గ్రూపు వారి జవాబుగా పరిణమించినది.

ఎన్నికల కమిటీలో మెజారిటీవున్న బ్రహ్మానందరెడ్డి, తన మనుషుల బాహుళ్యంతో 1967 ఎన్నికలకి కాంగ్రెసు అభ్యర్థుల జాబితా తయారు చేయించి నాడు. ఈ జాబితా ఖరారుచెయ్యవలసినవాడు కాంగ్రెసు అధ్యక్షుడు కామరాజు. బ్రహ్మానందరెడ్డి మనుషులు కొంతమంది అనర్హులని నిర్ణయించి, చివరికి సంజీవరెడ్డి వారికి సగం బ్రహ్మానందరెడ్డి మందికి సగం స్థానాలు ఇచ్చినాడు. ఇక్కడకూడా ఎన్నికల కమిటీలో లభించిన విజయంవల్ల ఫలితం దక్కలేదు. పైగా, సంజీవరెడ్డి మనుషులికి అనుకూలం బ్రహ్మానందరెడ్డి మనుషులికి కష్టం అయిన నియోజకవర్గాలు లభించినవి. అయినా బ్రహ్మానందరెడ్డి అభ్యర్థులు అందరూ నెగ్గినారు. ఎన్నికలు నడిపించినవాడు బ్రహ్మానందరెడ్డి. 287 స్థానాలువున్న శాసనసభకి 167 కాంగ్రెసు అభ్యర్థులు గెలిచినారు. పక్కరాష్ట్రం మద్రాసులో కాంగ్రెసు కుప్పకూలినట్టు కూలి పోయినది. కామరాజు, భక్తవత్సలం, సుబ్రహ్మణ్యంవంటి హేమాహేమీలుకూడా ఎగిరిపోయినారు. డి. యం. కే. నియోజకవర్గాలు తుడిచిపెట్టినది. ఒరిస్సాలో కాంగ్రెసు పోయినది. కేరళ చెప్పనక్ఖర్లేదు. ఈ పరిస్థితులలో ఆంధ్రప్రదేశంలో కాంగ్రెసుకి అఖండవిజయంచేకూర్చిన బ్రహ్మానందరెడ్డి పేరు మోగిపోయినది.

1967 ఎన్నికలతో ఆంధ్రప్రదేశంలో రాజకీయ ఇంద్ర ధనుస్సులో రంగులు తారుమారైనవి. 1962 లో ప్రధానప్రతిపక్షంగా వచ్చిన కమ్యూనిస్టుపార్టీ 1964 లో రెండుగా చీలినది. ఒకపార్టీ కమ్యునిస్టులు, రెండోపార్టీ మార్క్సిస్ట్ కమ్యూనిస్టులు. ఈ చీలిక 67 ఎన్నికలలో ప్రభావం చూబెట్టినది. చంద్ర రాజేశ్వరరావు నాయకత్వాన పోటీచేసిన సి. పి. ఐ. కి శాసనసభలో 10 స్థానాలు లభించినవి. సుందరయ్య నాయకత్వాన ఏర్పడ్డ సి.పి.ఐ.ఎం. కి 9 స్థానాలు దొరికి నవి. స్వతంత్రపార్టీ 28 స్థానాలు సాధించి ప్రధాన ప్రతిపక్షమైనది. స్థానాలు దొరకని కాంగ్రెసువాదులు కొందరు, ఇండిపెండెంటుగా పోటీచేసి గెల్చినారు. వీరు రెండు పార్టీలుగా తయారైనారు. ఒకటి పీపుల్స్‌డిమోక్రాటిక్ పార్టీ, ఇంకొకటి

జనకాంగ్రెసు. 1967 జూన్‌లో పి. డి. పి. సభ్యుల్ని కొందర్ని తిరిగి కాంగ్రెసులో చేర్చుకున్నారు. తన్మూలంగా కాంగ్రెసు బలం 184 అయినది. స్వతంత్ర, జన కాంగ్రెసు కలిసి డిమోక్రాటిక్ ఫ్రంటుగా 42 సభ్యులతో ప్రధాన ప్రతిపక్షమైనది. దీని నాయకుడు గౌతు లచ్చన్న. తొలిసారిగా జనసంఘానికి 3 స్థానాలు, రిపబ్లికన్ పార్టీ అఫ్ ఇండియాకి రెండు స్థానాలూ లభించినవి. వ్యతిరేకపక్ష సభ్యులంతా కలిసినా కాంగ్రెసుపార్టీ చెక్కుచెదరదు.

1967 మార్చి 3 న బ్రహ్మానందరెడ్డిని తిరిగీ ఏకగ్రీవంగా కాంగ్రెసు శాసనసభానాయకుడుగా ఎన్నుకున్నారు. ఆరోతారీకుని కొత్త మంత్రివర్గంతో ప్రమాణస్వీకారం చేసినాడు. మంత్రివర్గంలో ఎనమండుగురు కేబినెటు మంత్రులు, ఆరుగురు స్టేటుమంత్రులు. డాక్టరు చెన్నారెడ్డి ఆర్థిక మంత్రి. కొద్దికాలం తర్వాత ఆయన కేంద్రంలో స్టీలుమంత్రిగా ఢిల్లీ వెళ్ళిపోయినాడు. తక్కినవారు పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి వి. బి. రాజు, తోట రామస్వామి జే. వి. నరసింగరావు, తానేటి వీర రాఘవులు, కొండా లక్ష్మణ్. స్టేటుమంత్రులు: పి. వి. నరసింహారావు, బి. వి. గురు మూర్తి, ఎన్. చెంచు రామానాయుడు, కే. విజయభాస్కరరెడ్డి, రుద్రవరపు రామ లింగరాజు, శీలం సిద్దారెడ్డి.

నెలరోజులు తిరక్కముందు కొత్తమంత్రుల్ని చేర్చుకున్నాడు. అప్పటికే చెన్నారెడ్డి వెళ్ళిపోయినాడు. ఈపునర్నిర్మాణంలో మంత్రులందర్నీ కేబినెట్టుహోదాకి పెంచినాడు. తాను ఆర్థికశాఖ మళ్ళీ స్వీకరించినాడు. ఏప్రిల్‌లో కొత్తగా చేరిన మంత్రులు ఏ. సి. సుబ్బారెడ్డి, కే. వి. నారాయణరెడ్డి, మహమ్మద్ ఇబ్రాహిం ఆలీ అన్సారి. అరిగె రామస్వామి, వెనిగళ్ళ సత్యనారాయణరావు. మొత్తం 18 మంది మంత్రులు. ఆంధ్రకి తొమ్మిది. తెలంగాణాకి తొమ్మిది. తెలంగాణాకి ఇంత ప్రాముఖ్యం ఇవ్వడం మొదటిసారి. కొత్తమంత్రులంతా ఏప్రిల్ 4 ని ప్రమాణ స్వీకారం చేసినారు.

ఏప్రిల్ 6 ని కొత్తనిజాం సింహాసనం అధిష్టించినాడు. 'మహాఘనత వహించిన' నవాబ్ మీర్ బర్కత్‌అలీ ఖాన్ బహదూర్ నిజాంఉల్‌ముల్క్, ఎనిమిదవ అసిఫ్‌జాహీ ప్రభువు. ఈయన ఏడవనిజాం ఉస్మానల్లీఖాన్ మనుమడు. కొడుకుకొడుకు. మాజీటర్కీసుల్తాన్ మనుమడు. కూతురు కొడుకు.

ఎనభైమూడు సంవత్సరాలు జీవించిన ఉస్మానల్లీఖాన్ ఫిబవరి 24 న స్వర్గస్థుడైనాడు. 1911 లో రాజ్యానికి వచ్చినాడు. ముప్పైఏడ్యేడు సంవత్సరాలు, స్వదేశసంస్థానాధీశ్వరులలో మేటిగా హైద్రాబాదు రాజ్యం పాలించి, స్వరాజ్యం వచ్చిన తర్వాత రాజ ప్రముఖ్‌గా కొన్నాళ్ళు వుండి, ఆంధ్రప్రదేశ అవతరణ తర్వాత రాజ్యచిహ్నాలేగాని అధికారం లేకుండా జీవితం గడిపి, హతాశుడై

దివంగతుడైనాడు. ప్రధానమంత్రి ఇందిరాజీ సంతాపసందేశంలో "ఒక శకం అంతరించినది" అన్నది. తెలుగులచరిత్రలో అది నిజంగా ఒకశకమే !

హైదరాబాదులో ముఖ్యమంత్రిగా బ్రహ్మానందరెడ్డి, ఢిల్లీలో ప్రధానిగా ఇందిరాజీ సుస్థిరమైనారు. నెహ్రూ అనంతరం ప్రధానిగా వచ్చిన లాల్‌బహదూర్ శాస్త్రి పద్దెనిమిది నెలలు అసామాన్య ప్రతిభతో, పాకిస్థాన్ దండయాత్ర తట్టుకుని, శాంతిసంస్థాపనకోసం రష్యాప్రధాని ఆహ్వానంమీద టాష్కెంట్ నగరం వెళ్ళి, పాకిస్థాన్ అధ్యక్షుడు అయూబ్‌ఖాన్‌తో వొడంబడిక సంతకంచేసి, అక్కడే అర్థ రాత్రివేళ హఠాన్మరణ ప్రాప్తిపొందినాడు. 1966 జనవరి 19 పాకిస్థాన్‌తో యుద్ధంగెల్చిన భారతదేశం తన పూర్వ విజయగాథలు తల్చుకుంటూ గర్వంతో ఆనందించే శుభ సమయంలో అశనిపాతం! పాకిస్థాన్ యుద్ధంలో అనేకమంది ఆంధ్రవీరులు తమతమ శౌర్యప్రతాపాలు ప్రకటించి మహావీరచక్రధారులైనారు.

లాల్‌బహదూర్ తర్వాత అధికారంలోకి వచ్చిన ఇందిరాజీకూడా మూడో ప్రధాని. వెనకటికి మల్లేనే 'సిండికేటు'వారు తమపాచికలు పన్నినారు. మురార్జీ అగ్రతాంబూలానికి సిద్ధమైనాడు. పోటీ తథ్యం అనుకున్న తరుణంలో తునితగువు చేసి, ఇందిరాజీ ప్రధానిగానూ, మురార్జీ ఉపప్రధానిగానూ వుండే ఏర్పాటు చేసినారు. ప్రధాని పదవి అలంకరించిన ప్రపంచస్త్రీలలో ఇందిర రెండవది. ప్రథమతాంబూలం శ్రీలంకలో సిరిమావోబందార నాయకే పుచ్చుకున్నది. లంక చిన్నప్రజా ప్రభుత్వం, భారతదేశం ప్రపంచంలో కల్లా పెద్ద ప్రజాప్రభుత్వం.

లాల్‌బదూర్ ఆహ్వానంమీద ఢిల్లీ మంత్రివర్గంలో చేరిన సంజీవరెడ్డికూడా ప్రధాన మంత్రి పదవికి క్యూలో నిలబడ్డ సంగతివాస్తవం. ఆయనకి మంత్రి పదవికి బదులు లోకసభాపతి ఉద్యోగం లభించినది. తదాదిగా ఆయనకి ఏ రాజకీయ పార్టీతోనూ సంబంధం వుండకూడదు. కాంగ్రెసుసభ్యత్వానికి రాజీనామా ఇచ్చినాడు. లోకసభాపతిగా సమర్థుడని పేరుప్రతిష్ఠలు సాధించినాడు.

ఆంధ్రప్రదేశంలో ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి జీవితం శాంతంగా నడుస్తున్నది. 1967 మే లో మంచి ఎండాకాలంలో నరసారావుపేట జమీందారు కొండలరావు కూతురుపెళ్ళికి తన ఆప్తమిత్రుడు బ్రహ్మానందరెడ్డిని స్వయంగా పిలవడానికి కారులో హైద్రాబాదు వచ్చినాడు. ఇద్దరూ ఆనందనిలయంలో కలిసి కష్టంసుఖం వెళ్ళబోసుకున్నారు. కొండలరావు వసతికి వెళ్ళి అకస్మాత్తుగా మరణించినాడు. కొండలరావు పోవడం బ్రహ్మానందానికి కొండంత దెబ్బ.

వేసవికాలంలో బ్రహ్మానందం దంపతులిద్దరూ ఉదకమండలం వెళ్ళడం రివాజు. రెండోసారి ముఖ్యమంత్రి అయిన తర్వాత కొంతకాలమైనా రాజధాని విడిచిపెట్టే అవకాశం దొరకడంలేదు. నరసారావుపేటలో ప్లీడరీ చేసేటప్పుడు,

ప్రతిసాయంకాలం క్లబ్బులో టెన్నిసు ఆడేవాడు. టెన్నిసు తర్వాత కొంతసేపు స్నేహితులతో బ్రిడ్జి ఆడుకునేవాడు. మంత్రి పదవి చేపట్టిన తర్వాత ఈవ్యాయామానికిగాని, వినోదానికిగాని వ్యవధిలేదు. ఉదయం 'తేల్‌మాలీస్' ఒకటే అతనికి అందుబాటులోవున్న పరోక్ష వ్యాయామం. టెన్నిసు మానేశాడు. తన రాష్ట్రంలో పేక ఆడడు. ఎప్పుడన్నా మద్రాసు వెడితే, ఏ|ప్రెసిడెన్సీ క్లబ్బులోనో. ఏకాస్మాపాలిటన్ క్లబ్బులోనో. ఇప్పుడదీలేదు. మద్రాసులో చదువుకున్నాడు, శాసనసభా సభ్యుడుగా వున్నాడు. అక్కడ ఎందరో స్నేహితులు వున్నారు. అతని తరంవారికి చాలామందికి ఆ మద్రాసు అభిమానం పోదు. మద్రాసు రుచి అది ఒరుదినుసు.

1967 సెప్టెంబరు 15న డాక్టరు బూర్గుల రామకృష్ణరావు కన్నుమూసినాడు ఆంధ్రప్రదేశానికి తీరని నష్టం వాటిల్లినది. ఆంధ్రతెలంగాణా ప్రాంతాల్ని ఎన్నాళ్ల తర్వాతనో మళ్ళీ కలిపి, సమగ్రఆంధ్రదేశ స్వరూపం దర్శించి. దర్శింపజేసి, తాను రాష్ట్రేతరాంధ్రుడుగా వలసపోయి, కేరళగవర్నరుగా, ఉత్తరప్రదేశ గవర్నరుగా పనిజేసి, అటువారికీ ఇటువారికీకూడా దూరమై స్వప్నభంగంతో స్వర్గస్థుడైనాడు. భారతదేశానికీ తెలుగుసాహిత్యానికీ తీరనిలోటన్నది ప్రధాని ఇందిర. ఆంధ్రహృదయ పత్రాలలో రామకృష్ణరావు నామాక్షరాలు చెరిగిపోవు అన్నాడు బ్రహ్మానందరెడ్డి.

అయిదు రోజులు గడవలేదు. సెప్టెంబరు 20న మద్రాసులో ఏ. సి. సుబ్బారెడ్డి దివంగతుడైనాడు. రాజకీయాలలో భిన్నాభిప్రాయాలు కలగవచ్చుగాక! కలగకపోతే అవి రాజకీయాలు కాదు. ఏ. సి., బ్రహ్మానందరెడ్డీ మద్రాసులో సహాధ్యాయులు. ఆ సంగతి తలపోసుకున్నాడు ముఖ్యమంత్రి. ముప్పై సంవత్సరాలుగా రాజకీయ రంగంలో కలిసి పనిచేసినవాళ్లం అన్నాడు.

కొన్నాళ్ళుగా భార్య రాఘవమ్మ తలనొప్పితో బాధ పడుతున్నది. ఎన్ని చికిత్సలు చేసినా తగ్గు ముఖం పట్టలేదు. ఇక్కడ వైద్యులంతా పరీక్షించి, మెదడు భాగంలో ఏదైనా కురుపులాటిది వుండ వచ్చునన్నారు. ఏ లండనులోనో నిపుణులికి చూపిస్తే మంచిదని సలహా ఇచ్చినారు. 1967 నవంబరులో భార్యాభర్తలిద్దరూ లండను వెళ్ళినారు. అక్కడి నిపుణులు శ్రద్ధగా పరీక్షించి ప్రమాదం ఏమీలేదు, ఏదన్నావున్నా ఇంకా పక్వం కాలేదన్నారు. ఆవిడ తలనొప్పి మాత్రం తగ్గలేదు.

లండను వెళ్ళనుండగా నగరంలో ఆక్టింగు ముఖ్యమంత్రి ఎవరని తర్జన భర్జనలు జరిగినవి. ఇది మన దేశంలో రివాజైనది. నెహ్రూ అమెరికా వెళ్ళినప్పుడు, మొన్నమొన్న అన్నాదురై ఆపరేషనుకి వెళ్ళినప్పుడు. నిన్న నంబూద్రి

పాడు తూర్పు జర్మనీ వెళ్ళినప్పుడు ఇటువంటి ఆలోచనలే వచ్చినవి. ఎవరూ అఖ్ఖర్లేదన్నారు. బ్రహ్మానందరెడ్డికూడా అంతే అన్నాడు. మనదంతా ఏక్‌దిన్‌కా సుల్తాన్ వ్యవహారం.

బ్రహ్మానందరెడ్డి విదేశాలకి వెళ్ళడం ఇదేతొలిసారి. వినోదానికి వెళ్ళలేదు. అవసరం కనక తప్పలేదు. అతనికా వ్యామోహం వున్నట్టులేదు. వుంటే వెళ్ళి వుండేవాడే.

ఆ యేడాది కాంగ్రెసు మహాసభ మహారాష్ట్రంలో జరపాలనుకున్నారు. కాని కొయినా భూకంపం బెడద మూలంగా ఏర్పాట్లు చెయ్యడం కష్టమైనది. కాలాతీతం కాకుండా ఎక్కడైనా అనువైనచోట మహాసభ ఏర్పాటు చెయ్యాలని ఆలోచిస్తున్నారు. సభాధ్యక్షుడుగా మైసూరు ముఖ్యమంత్రి నిజలింగప్పని ఎన్నుకున్నారు. ఆయన ఎన్నికకి పూర్వం కొంత గ్రంథం జరిగినది. అధ్యక్షుణ్ణి ఎన్నుకోబోయే ముందు, అధిష్ఠాన వర్గంవారు కొన్ని పేరులతో వో జాబితా తయారు చేసినారు. ఈసారి పదిమంది కాంగ్రెసు నాయకులపేర్లు ఆ జాబితాలో వున్నవని వినికిడి. నిజలింగప్పతోబాటు ఆ పదిమంది పేర్లలో డాక్టరు చెన్నారెడ్డి పేరుకూడా వున్నది. చెన్నారెడ్డి కీర్తికాముడు, నిజానికి ఆ పదవికి సమర్థుడు. అఖిలభారత కాంగ్రెసు రాజకీయ రంగంలో అంత ప్రాముఖ్యం వహించినవాడు కాడు. అప్పుడే కేంద్ర మంత్రిగా వచ్చినాడు. సంజీవయ్య విషయం వేరు. ఆయన హరిజనుడు. చెన్నారెడ్డితో స్నేహితులు చెప్పినారు. బహ్మానందరెడ్డి పట్టుబడితే తప్పకుండా నీవే కాంగ్రెసు అధ్యక్షుడివి కాగలవు అని. ఆ విషయం ముఖ్యమంత్రితో ఆయన ప్రస్తావించినాడు. కాకలుతీరిన రాజకీయ అనుభవం కలవాడు బ్రహ్మానందరెడ్డి. జాబితా అయితే తయారు చేసినారుగాని, అందులో మనపేరుకే ప్రాముఖ్యం వున్నదనుకోడం మంచిదికాదు. మనం దిగితే గెలిచితీరాలి, ఆ నమ్మకం లేనప్పుడు విరమించుకోడం సబబు అని జవాబు చెప్పినాడు. బ్రహ్మానందరెడ్డి ప్రయత్నించలేదు. నిజలింగప్పనే చివరికి ఎన్నుకున్నారు.

అధ్యక్షుడి సంగతి అల్లా పరిణమించగా మహాసభ మాత్రం ఆంధ్రప్రదేశంలో చెయ్యవలసినదిగా కోరినారు పెద్దలు. ఇచ్చిన వ్యవధి పదిరోజులు. ఈ స్వల్ప కాలంలో హైద్రాబాదులో తప్ప ఇంక ఎక్కడా ఏర్పాటు చేసే అవకాశంలేదు. హైద్రాబాదే నిర్ణయించి మహాసభకి అన్ని వసతులూ సమకూర్చినాడు. అటువంటి అత్యవసర ఘనకార్యాలు చెయ్యడంలో హైద్రాబాదువారు పేరు మోసినారు. అనుభవం వున్నవాడు ముఖ్యమంత్రి. ఫత్తేమైదానంలో మహాసభ అతి వైభవంగా జరిగినది. సభికులికి వసతులు అపూర్వంగా ఏర్పాటు చెయ్యబడినవి. ఫత్తేమైదానం చరిత్రలో ప్రసిద్ధిగన్న స్థలం. గోల్కొండ సుల్తానుమీద దండెత్తి మొగలు

పాదుషా ఔరంగజేబు సేనలు ఇక్కడే విజయభేరి మోగించినవి. అందుకనే ఫత్తే మైదానం అనిపేరు. విజయం శత్రువుది. పేరుమాత్రం ఇక్కడ మిగిలిపోయినది. హైద్రాబాదు చరిత్రలో అదే విడ్డూరమైన విషయం.

కనివిని యెరుగనంత శోభాయమానంగా జరిగిన ఆ మహాసభ చూసి హేమా హేమీలు ఆశ్చర్యపోయినారు. కోటి రూపాయలదాకా విరాళాలు వచ్చి ఖర్చైనవి. ఆ సామర్థ్యం బ్రహ్మానందరెడ్డిది. ఫలితం కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంలో బ్రహ్మానందం సభ్యుడైనాడు. రాష్ట్ర నాయకులలో ఆరితేరి, ఆంధ్రప్రదేశంలో కాంగ్రెసు పేరు ప్రతిష్ఠలు నిలబెట్టిన బ్రహ్మానందరెడ్డి అఖిలభారత నాయకవర్గంలో స్థానం సాధించినాడు. అందరూ ఓహో అన్నారు. 1968 ప్రారంభంలో బ్రహ్మానందరెడ్డి బ్రహ్మాండ నాయకుడు.



# మఱ్ఱిచెట్టు

మొరార్జీదేశాయి అమెరికా వెళ్ళినప్పుడు ఒకసారి ఆయన్ని జవహరిలాల్ విషయం ప్రశ్నలు వేసినారు పత్రికా విలేఖర్లు. జవహర్‌లాల్ వూడలు వ్యాపించి విస్తరించిన పెద్ద మఱ్ఱిచెట్టు. ఆ ఛాయలో ఇంక ఏచెట్టూ పెరగడానికి అవకాశం లేదన్నాడు దేశాయి. అల్లాగే ఆంధ్రప్రదేశ రాజకీయాలలో బ్రహ్మానందరెడ్డి ఒక మఱ్ఱిచెట్టుగా పెరిగి రాష్ట్రం అంతా తన వూడలతో నింపేసినాడు. ఆ నీడలో ఎవరికీ అవకాశం వున్నట్టు కనిపించలేదు.

ఇరవైమూడు సంవత్సరాల వయస్సులో రాజకీయాలలో ప్రవేశించి, గ్రామ, తాలూకా, జిల్లా రాష్ట్ర వ్యవహారాలలో ఆరితేరినాడు. యోధాన యోధులైన సత్యాగ్రహ వీరులు కొండాజీ, ప్రకాశం, పట్టాభి, సాంబమూర్తి, వెంకట్రావువంటి నాయకుల నడవడికలు శ్రద్ధగా గమనించి గుణపాఠాలు నేర్చుకున్నవాడు. పరిగెత్తి పాలు తాగేకంటె నిలబడి నీళ్ళు తాగడం మంచిదనే స్వభావం కలవాడు. ప్రయాణంలో ఒకబస్సు తప్పిపోతే తరవాత బస్సు వొస్తుందనే నిబ్బరం కలవాడు. రాజకీయ కక్షలు శాశ్వతం కాదు. ఈవేళ వుండి రేపు పోయేవి అనే విశ్వాసం కలవాడు. కనబడని ఉత్సాహమేగాని, కనబడే ఉద్రేకం వున్నవాడు కాదు.

సంజీవరెడ్డికి మద్దత్తు సమకూర్చే తరుణంలో, కోస్తా రాయలసీమ జిల్లాలు 'సత్యం'తో కలిసి తిరిగి మూలమూలల వ్యక్తులందరితోనూ ప్రత్యక్ష పరిచయం చేసుకున్నాడు. ఆంధ్ర కాంగ్రెసు కార్యదర్శిగా ఆ పరిచయం బలపడినది. ఆంధ్ర ప్రదేశం ఏర్పడిన తర్వాత, పై తరహాలో సంజీవరెడ్డి వుండగా, 'సత్యం' రాజకీయాలూ, బ్రహ్మానందరెడ్డి పరిపాలనా విషయాలూ చూస్తూ వుండేవారు. మంత్రిగా, ముఖ్యమంత్రిగా ప్రభుత్వం మొత్తం అన్నిశాఖలూ నిర్వహించినాడు. అందుచేత

అన్నిరకాల ఉద్యోగుల్తోటీ, అందరితోటీ పరిచయం కలిగినది. వారివారి స్వభావాలు తెలుసును. పేర్లతోసహా వారి నెరుగును. స్థానిక పరిపాలనతో ప్రారంభించిన మంత్రిపదవిలో తెలంగాణాలో కూడా స్థానిక నాయకులతో ప్రత్యక్ష పరిచయం కలిగినది. ప్లానింగు మంత్రిగా వివిధ ప్రాంతాల అవసరాలు తెలుసుకున్నాడు; ఈ ప్రయత్నంలో ఆ ప్రాంతీయుల్ని ఎరిగినాడు. ఆర్థిక మంత్రిగా ఆ అవసరాలకి ఆదుకునే అవకాశం కలిగి వారి ఆదరణ పొందినాడు. వారి స్వభావాలు తెలిసిన వాడు.

రెండు ఎన్నికల కమిటీలలో వుండి కాంగ్రెసు అభ్యర్థుల్ని ఎన్నుకోడంతో వారి వారి గుణగణాలు నిర్ణయించవలసిన అవసరం కలిగినది. వారివారితో పరిచయం ఎక్కువైనది. రెండు ఎన్నికల ప్రచార సందర్భంలో రాష్ట్రం అంతా తిరిగి పంచాయతీ సభ్యులు మొదలు ప్రజా నాయకులవరకూ అందరి స్నేహమూ సమకూడినది. పైనించి అడుగుదాకా, అడుగునించి పైదాకా ముఖ్యమంత్రిని ఎరగని వారులేరు. ఈ విశాల ప్రత్యక్ష పరిచయబలంతో బ్రహ్మానందరెడ్డి నిజంగా వూడలు బారిన మర్రిచెట్టే. ఈ నీడలో ఎదగ గలిగిన చెట్లు వుండవు. ఈ చెట్లు పెంచే వుద్దేశంతో ఢిల్లీనించి బీజాలు నాటుతూనే వున్నారు పూర్వమిత్రులు. కనీసం కొమ్మలైనా ఒకటి తర్వాత ఒకటి కొట్టేస్తే నెమ్మదిగా నాటిన విత్తనాలు పెరిగి మొక్కలై వృక్షాలుగా పెరుగుతాయని ఆశ. ఈ చీకటి వ్యవసాయం సాగుతూనే వున్నది. ప్రధాన కర్షకుడు సంజీవరెడ్డి.

ప్రత్యక్షంగా, ధర్మంగా, చట్టబద్ధంగా బ్రహ్మానందరెడ్డిని దింపే మార్గాలు లేవు. అన్యమార్గాలే శరణ్యం.

1951 లో రంగామీద గెలిచిన తర్వాత ఆంధ్ర నాయకత్వం చేపట్టిన సంజీవరెడ్డి కేంద్రానికి వెళ్ళిపోయినప్పటినించీ ఆంధ్రప్రదేశంలో రాయలసీమ నాయకత్వం వెనకబడి బ్రహ్మానందరెడ్డి ద్వారా కోస్తాజిల్లాల నాయకత్వం ముందుకు వచ్చినది. అది వారికి గుమపుగానే వున్నది. ప్రత్యక్షంగా ఏమీ చెయ్యలేని స్థితిలో వున్నారు. అవకాశంకోసం కొందరు నిరీక్షిస్తున్న మాట వాస్తవం. ఇన్నాళ్ళుగా మర్చిపోయిన రాయలసీమ వెనకబాటుతనం అకస్మాత్తుగా జ్ఞాపకం చేసుకున్నారు.

ఏ. సి. సుబ్బారెడ్డి పోయినప్పటినించీ సంజీవరెడ్డి మనుషులికి మంత్రివర్గంలో ప్రాతినిథ్యం ఇవ్వాలనే నినాదం వినబడుతూనేవున్నది. బ్రహ్మానందరెడ్డికి ఇవ్వాలనే వున్నది. ప్రతి శాసనసభా సమావేశంముందూ, ఒక నెలరోజులు ఈ విషయం రాయబారాలు జరగడం, ఏమీ జరక్కపోవడం తటస్థిస్తూ వచ్చినది. ఎవర్నినా తీసుకోవాలంటే, ఆ జిల్లానించి వచ్చిన మంత్రి తన అధికారానికి భంగం కలుగుతుందని అభ్యంతరం చెప్పడం అంతటితో ఆగిపోవడం. పత్రికలవారు ఇదుగో

మంత్రివర్గ విస్తరణ. ఇరుగో క్రొత్త మంత్రులని వ్రాస్తూవుండడం. జాబితాలు తయారు చెయ్యడం, అందులో స్థానాలు మారుతూ వుండడం, ఇదో తమాషా, వేళాకోళం అయిపోయినది. లోపలి ఆటంకాలతో ముఖ్యమంత్రి ఆగిపోయేవాడు. ఇదంతా హుళక్కి అనే భావం నాయకులలోనూ ప్రజలలోనూ కూడా కలిగినది. అలస్యాదమృతం విషం.

ముఖ్యమంత్రి లండను వెళ్ళబోయేముందు రాష్ట్ర కాంగ్రెసు కమిటీకీ, ఆలిండియా కాంగ్రెసు కమిటీకీ ప్రాంతాలవారీగా సభ్యుల జాబితా తయారు చెయ్యవలసినదిగా కొందరు మిత్రుల్ని కోరి వెళ్ళినాడు. ఈ చర్చలలో డాక్టరు చెన్నారెడ్డి పాల్గొన్నాడు. ఎవరి మనుషుల్ని వారు ఇరికించుకుని తమ బలం వృద్ధి చేసుకోవాలని ప్రయత్నించడం సహజం. చెన్నారెడ్డి తరఫునా, వి. బి. రాజు తరఫునా ఆపని జరిగినది. లండనునించి తిరిగి వచ్చిన ముఖ్యమంత్రి ఆలిండియా కాంగ్రెసు కమిటీలో ఇమిడ్చిన రెండు పేర్లు తప్పించినాడు. ఆ స్థానాలు తనవారి కిచ్చుకున్నాడు.

ఇంతలో చెన్నారెడ్డి తన ఎన్నిక సందర్భరంలో చెయ్యరానిచర్యలు చేసినాడని సుప్రీంకోర్టు తీర్పు చెప్పినది. ఆయన తన కేంద్రమంత్రి పదవికే కాక, రాజ్యసభ సభ్యత్వానికికూడా రాజీనామా ఇవ్వవలసి వచ్చినది. ఈ సందర్భంలో, బ్రహ్మానందరెడ్డి సహాయంతో కొంత పోలీసుసాక్ష్యం లభిస్తే తనమీద కేసు నెగ్గేదికాదని ఆయన నమ్మకంగా స్నేహితు లంటారు. పత్రికలు వ్రాసినవి. ఆ సహాయం లభించలేదు. చెన్నారెడ్డి ఉద్దండపిండం. రాజకీయ అరణ్యవాసం భరించలేనివాడు. అటువంటి పరిస్థితులలో ఇదివరలో కాంగ్రెసులోంచి వెళ్ళిపోయినాడు. ఒకసారి డిమ్రెమొక్రెటిక్ ఫ్రంటు పెట్టినాడు. మరోసారి స్వతంత్రపార్టీతో సయ్యోధ్య సలిపినాడు. ఏనాటికైనా ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి కాగలిగిన తెలంగాణ నాయకుడతడు. తాను కోరినట్టు 1956లోనే ప్రత్యేక తెలంగాణా లంభించినట్టయితే హైద్రాబాదు ముఖ్యమంత్రి పదవి తప్పకుండా అతనికే లభించేది. వక్త. ప్రచార దక్షుడు. వున్నపార్టీని బలపర్చడంలోనూ, క్రొత్తది పుట్టించి పెంచడంలోనూ సమర్థుడు. కొన్ని సంవత్సరాలదాకా అతను ఏ ఎన్నికకీ నుంచోకూడదనే నిషేధానికి లోనైనాడు. ఇటువంటి పరిస్థితే వి. బి. రాజుకి సంభవించినప్పుడు ఆయనకి రోడ్డు రవానా సంస్థ అధ్యక్షుడుగా ఒక ఉన్నత పదవి ఇచ్చి కడుపులో పెట్టుకున్నారు. అటువంటి అవకాశమే చెన్నారెడ్డికి కల్పించవలసినది. ఆ పని జరగలేదు. ఆయన 1952 లోనే మంత్రి పదవికి అలవాటు పడ్డవాడు.

తెలంగాణాకి న్యాయం జరగాలి, కాని ఆంధ్రప్రదేశం రెండుముక్కలు కాకూడదు. దీనికి మార్గం బ్రహ్మానందరెడ్డి రాజీనామా, తెలంగాణానాయకుడు ముఖ్య

మంత్రి కావడం అంటున్నాడు కొంత కాలంనించి పరోక్షంగానూ. ప్రస్తుతం ప్రత్యక్షంగానూ వి. బి. రాజు. అందుకని ప్రజాసమితినాయకులు రాజు 'తెలంగాణా కవచం ధరించిన ఆంధ్రుడు.' అన్నారు. "ఈయన నక్కలా ఆలోచించి గుంట నక్కలా ప్రవర్తిస్తాడు" అని వ్రాశారు. రాజకీయాలలో ఈ విమర్శలూ, ఈ వ్యంగ్య చిత్రాలూ తప్పవుగదా! నిజమే వల్లూరి బసవరాజు ఆదిలో గుంటూరు జిల్లా బాపట్ల వాస్తవ్యుడు. 1934 లో హైద్రాబాదు వచ్చి, కష్టపడి, బాగుపడి, 1936లోనే ఆంధ్రమహాసభలో పనిజేసి, సత్యాగ్రహంలో ఎన్నోత్యాగాలుచేసి, ఆ ఉద్యమ విజయానికి తన సర్వస్వం ధారబోసిన దేశభక్తుడు. తానేగాదు. తాము ఆరుగురు అన్నదమ్ములూ, అక్కడ తెగతెంపులు చేసుకుని హైద్రాబాదులో స్థిర పడిపోయి. చట్టప్రకారమేకాక, మనసా వాచా ముల్కీలైనారు. రాజు 1952 లోనే రామకృష్ణరావుతోపాటు మంత్రి అయిన నలుగురు తెలుగువారిలో ఒకడు. అంతకు ముందునలహాదారు మంత్రివర్గంలోకూడా వున్నాడు. మధ్యవైష్ణవులికి నామాలు మెండు అన్నట్టు మధ్యముల్కీలకి తెలంగాణా అభిమానం ఎక్కువ. "తెలంగాణా సంరక్షించాలి" అనే నినాదం లేవదీసినవారు మధ్యముల్కీలే.

వి. బి. రాజు సమర్థుడు. కళావెంకట్రావు తర్వాత అంతటివా డనిపించు కున్నాడు. రాజకీయయాత్రలో మంచి సహపథికుడు. కాని కొంతదూరం ప్రయాణం చేసిన తర్వాత చీలిపోతాడు. వీలైతే సహయాత్రికుడికి పక్కదోవ చూబిస్తాడు. తాను మాత్రం అడంగు చేరకుండా ఆగిపోతాడు. ఒకానొక పరిస్థితిలో ఆంధ్రతెలంగాణా నాయకులికి శాసనసభా నాయకుడుగా తాను అంగీకారం కావచ్చుననే ఆశ ఆయనకి సహజం. బ్రాహ్మణయుగం అయిపోయిన సంగతి విస్మరించి వుండవచ్చు.

మన దేశంలో వోపుక్కిటి పురాణం ఉన్నది. కొన్ని శైవక్షేత్రాలలో లింగం ఆ రోజుకి ఆ రోజు ఎదిగి పెద్దదైపోతూవచ్చినదనీ. ఆకాశానికి పెరిగి పోయే ఈ లింగానికి భక్తుల సౌకర్యార్థం ఆలయనిర్మాణం దుస్సాధ్యమనీ, అందరూకలిసి లింగానికి శిరస్థానంలో శిలలు కొట్టినారనీ. దాంతో ఆ లింగాల విజృంభణ తగ్గినదనీను. ఎదిగిపోయే రాజకీయలింగాలకికూడా శిలలు కొట్టే భక్త కోటి మన దేశంలో వున్నది. వీరందరూ ఏకమైనారు. శివోహం.

ఒక నాయకుణ్ణి పడగొట్టడానికి రెండు మార్గాలు. ఒకటి ప్రత్యక్ష శత్రుత్వం. రెండు శకుని సలహా, శల్యసారథ్యం. వ్యూహరచన ప్రారంభమైనది. లోపలా వెలుపలా తంటాలు మొదలైనవి.



# ముల్కీ ఉద్యమం

అనాదినించీ పూర్వ హైద్రాబాదు రాజ్యంలో అలజడి చెయ్యడానికి సాకు ముల్కీ తత్వం. 'ముల్క్' అంటే నాడు, దేశం. ముల్కీ అంటే దేశీయుడు. ఆ ప్రకారం మొదట్లో రాజప్రతినిధిగావచ్చి స్వతంత్రుడైన అసఫ్‌ఝా దేశీయుడు కాడు. అతనితోపాటు వచ్చిన ఉత్తరదేశ కాయస్థులు దేశీయులు కారు. వీరిభాష స్థానికభాష కాదు. వీరి సంస్కృతి స్థానిక సంస్కృతికాదు.

ఉత్తరహిందూస్థానం నించి వచ్చిన నిజాములు తమ రాజ్యంలో మంత్రులుగానూ, ఉన్నతోద్యోగులుగానూ తమకులస్థులైన మహమ్మదీయుల్నీ, తమ భాష మాట్లాడే కాయస్థుల్నీ దిగుమతి చేసుకున్నారు. దిగుమతీ అయినవారు తమ బంధువుల్నీ స్నేహితుల్నీ దిగుమతి చేసి వారికి వసతులు కల్పించినారు. ఈ వసతులు విస్తారమైన జాగీర్లు మొదలు చిన్నచిన్న ఉద్యోగాలదాకా వుండేవి. ఉద్యోగాలన్నీ మహమ్మదీయులికీ, కాయస్థులికీ వుండేవి. గ్రామాధికారాలు మాత్రం స్థానికులికి వంశపారం పర్యంగా వుండేవి.

హైద్రాబాదు రాజ్యంలో మహమ్మదీయులు రాజవంశం వార మనుకునేవారు. వారిలో చదువుకున్నవారికి ప్రభుత్వోద్యోగాలు తప్ప వేరే ఉపాధి లేదు. పరిశ్రమలలోగాని, వ్యవసాయంలోగాని వారికి మనసుగాని చెయ్యిగాని తిరగలేదు. కాయస్థుల వ్యవహారంకూడా అంతే. వీరంతా నగరవాసులు. గ్రామాలు ఆస్తిగానే గాని నివాసానికి స్వీకరించినవారు కారు.

ఇటువంటి పరిస్థితులలో ఉత్తర హిందూస్థానంనించి దిగుమతీ జరుగుతూనే వున్నది. అది ఎప్పుడూ ఆగలేదు. అప్పుడు స్థానికులంతా కలిసి ఉత్తరాదివారి కన్ని ఉద్యోగాలూ పోతే మాగతి ఏమిటీ అని గోలపెట్టడం ప్రారంభించినారు. స్థానికులకే

కాక ముందుగావచ్చిన గైరుముల్కీలుకూడా తమ సంతానాలికి ఆసార్కం వుండ దని ముల్కీ ఉద్యమాన్ని ప్రోత్సహించినారు. నిజాం ప్రభుత్వం ఉద్యోగాలికి ముల్కీనిబంధనలు చేసినది. ముల్కీ కావడానికి నిజాం రాజ్యంలో పుట్టి అన్నా వుండాలి, లేదా ఇక్కడ మనిషిని వివాహం చేసుకుని వుండాలి, లేదా పదిహేను సంవత్సరాలు నిజాం రాజ్యంలో నివాసంగా అయినా వుండివుండాలని మొదట్లో నింబంధన.

గుడికి తాళం గుళ్లోనీళ్ళు అన్నట్టు, నిబంధన దారి దాన్దే. వచ్చిపడే గైరు ముల్కీలు వస్తూనే వున్నారు. ముల్కీసర్టిఫికెట్లు ఖరీదుకి అవలీలగా దొరికేవి, దొరుకుతున్నాయి. ఏ భాషవారైతేనేం ఉద్యోగాలలో వున్నవారిలో చాలామంది సర్టిఫికెట్టూ ముల్కీలే.

జస్టిసుపార్టీకాలంలోనూ, తర్వాతాకూడా చదువుకున్న బ్రాహ్మణ యువకులికి ప్రభుత్వోద్యోగాలు దొరకని కాలంలో, చాలామంది మద్రాసు రాష్ట్రీయులు హైద్రాబాదులో ఉద్యోగాలు సంపాదించి ఇక్కడ స్థిరపడినారు. వీరిలో తెలుగువారు చాలామంది వున్నారు.

1948 లో హైద్రాబాదు భారత యూనియన్‌లో చేరినప్పుడు స్థానిక హిందువులు అభినవ ముల్కీవాద నాయకులైనారు. రాజకీయ కారణాలవల్ల మహ్మమదీయులు తప్పుకున్నారు. పోలీసు చర్య తర్వాత మేజర్ జనరల్ చౌదర్ని మిలిటరీ గవర్నరుగా నియమించినారు. చిరకాలం మిలిటరీపాలన వుండదు కగక, సివిలు అధికారుల సహాయంతో గవర్నరు పరిపాలన నిర్వహించ దలుచుకున్నాడు. అందుకని 1949 లో భాక్లేని సివిల్ అడ్మినిస్ట్రేటరుగా నియమించినారు. ఆయన ఐ. సి. యస్ ఉద్యోగి. జెట్లీని పోలీసు ఇనిస్పెక్టరు జనరలుగా నియమించినారు. ఈయనకూడా బయటివాడే. ఉత్తరప్రదేశం నించీ, మధ్యప్రదేశంనించీ, బొంబాయి నించీ, మైసూరునించీ, మద్రాసునించీ ఉద్యోగుల్ని తీసుకువచ్చి, పరిపాలన సాగించడానికి పదహారుజిల్లాలలోనూ నియమించినారు.

స్థానిక హిందూనాయకులు ఈ నియామకం పనికిరాదని 'ముల్కీవాదం' లేవదీసి కొంత దౌర్జన్యంతోసహా చాలా అలజడి చేసినారు. ఇదంతా హైద్రాబాదు రాజ్యంలో ముల్లె ఎవరు పంచుకోవాలీ అనే సమస్యమీద ఆధారపడి వున్నది. ఈ రాజ్యం భారత యూనియన్‌తో కలవగానే 'ముల్కీ' పదం మూసీలో కలిసినది. ఆ సంగతి గమనించకుండా ఈ అభినవముల్కీలు, తాత్కాలికంగా నియమించిన బైటిఉద్యోగులు వుండకూడదనడమేకాక, ప్రభుత్వసలహాదారు ఎం. కే. వెల్లోడీని తీసేసి 'ప్రజాప్రభుత్వం' స్థాపించాలని ఉద్యమం లేవదీసినారు. వారి ప్రవర్తన బాగులేదనీ, వారు లంచగొండులనీ ప్రచారం చేసినారు. అందులో కొంత నిజం కూడా వున్నది.

ఈ ముల్కీ ఉద్యమమే ఫజల్ ఆలీ కమీషనుముందు ప్రత్యేక తెలంగాణా రూపం దాల్చినది. పూర్వపు హైద్రాబాదు రాజ్యంలో తొమ్మిదిజిల్లాలు తెలుగువారు, అయిదుజిల్లాలు మహారాష్ట్రులు, రెండుజిల్లాలు కర్ణాటకులు వుండేవారు. మహారాష్ట్రులుగాని, కన్నడిగలుగాని, తమతమ రాష్ట్రాలలో కలవడానికి అడ్డంకులు చెప్పలేదు. తాము వెనుకబడివున్నామని వాపోవలేదు. కలవడానికి షరతులు పెట్టలేదు. మేమే, ముల్కీలం, నిజాం వారసులం, అన్నవారు తెలంగాణా హిందూ నాయకులు మాత్రమే. మూడు ప్రాంతాలలో ఒక్క ప్రాంతమే లేవదీసిన ఈ ముల్కీవాదంలో న్యాయమూర్తి ఫజల్ ఆలీ ఒక్కడే కాక, మేధావి పణిక్కర్, రాజకీయవేత్త కుంజ్రూ ఎల్లా పడ్డారో విచిత్రంగావున్నది. తెలంగాణా భాగం హైద్రాబాదు అనే పేరుతో ప్రత్యేకంగా వుండాలని ఒకనివేదికకూడా కమిషనువారికి అందినది.

ఒకే రాష్ట్రం చేస్తామన్నప్పుడు ప్రజాపరిషత్తుపెట్టి ప్రత్యేక తెలంగాణా ఆందోళన జరిపించినారు.

ఈ ముల్కీ బ్రహ్మాస్త్రంతోనే అమాయకులైన ఆంధ్ర నాయకుల్ని పడవేసి షరతులతో, పరిరక్షణలతో ఆంధ్రప్రదేశంలో చేరడానికి వొప్పుకున్నారు. ఈ ముల్కీసూత్రం ప్రభుత్వోద్యోగాలకేకాక భూములికి, ఆదాయాలకి, రాజకీయాలకి, పార్టీలకి అన్నిటికీ ముడిపెట్టి ఈనాడు ముప్పుతిప్పలికీ దారితీసినారు. పదేళ్ల తర్వాత పరిరక్షణలు కాలదోషం పట్టేముందు, ఇంకాకొనసాగాలనీ, ఇంతవరకూ కొనసాగలేదనీ నినాదం లేవదీసి అది ఉద్యమం చేసినారు.

ఈ ఉద్యమం నగరంలోపుట్టి నగరంలో పెరిగినది. ఈనాడు కోస్తా. రాయలసీమజిల్లాలనించి వచ్చిన తెలుగువారుతప్ప తక్కినభాషలవారంతా ముల్కీలే. ఈ తెలుగువారు పోవాలని నినాదం. అప్పుడా ఇతర భాషలవారు సుస్థిరంగా వుండవచ్చు. అందుకనే వారికీ ఉద్యమంలో ఉత్సాహం. నాయకుల వెనకాల ఉపనాయకులుగా ప్రత్యక్షమైనారు.

# ఉద్యోగులు

ఆంధ్రప్రదేశం అవతరించిన పదేళ్ళదాకా తెలంగాణా రాజకీయవేత్తలు సద్దుకుపోయినా, ఉద్యోగస్థులలో ఆ సద్దుబాటు కనబడలేదు. రెండు వేపుల ఉద్యోగస్థుల్ని తరతమాలలో చేసిన సవరింపులో కొందరికి అన్యాయం జరిగినది. ఆ అన్యాయం ఎక్కువగా తెలంగాణావారికి జరిగిందనే నమ్మకం ప్రబలినది. అదివరకు హైద్రాబాదు రాజ్యంలో ఉన్నతోద్యోగాలలో వున్నవారు తక్కువస్థాయికి దిగవలసి వచ్చినది. ఆ తగ్గింపు వారికి కష్టం కలిగించినది. ఇటువంటి తగ్గింపే నాన్‌గెజెటెడ్ ఉద్యోగులలోకూడా కలిగినది. అసంతృప్తి అల్లాగే వుండిపోయినది.

ఒక ఏ తరగతి రాష్ట్రం ఒక బీ తరగతి రాష్ట్ర భాగంతో కలిపి ఏకరాష్ట్రం చెయ్యడంలో రెండు పరిపాలనా పద్ధతులూ సమైక్యపరచవలసి వచ్చినది. ఆంధ్ర పద్ధతి మద్రాసులో అమలులోవుండే టాటెన్‌హాంకోడ్డు ప్రకారం జరిగేది. హైద్రాబాదులో బొంబాయి పద్ధతి అమలులో వుండేది. 1956 నవంబరు 1 నించి అకస్మాత్తుగా ఆంధ్రప్రదేశంలో మద్రాసుపద్ధతి అమలులోకి వచ్చినది. తెలంగాణాలో మిగిలిపోయిన హైద్రాబాదు ఉద్యోగస్థులికి ఈ పద్ధతి తెలియదు. తెలుసుకోడానికి గ్రంథాలుకూడా లేవు. టాటెన్‌హాంకోడ్డు అచ్చులోలేదు. రెండూ కలిసేముందు ఈ కోడ్డు సవరణలతోసహా మళ్ళీ అచ్చువేసి, తెలంగాణా ఉద్యోగస్థులికి సరఫరా చేసి, ఆ కోడ్డు ప్రకారం వారికి కొంతకాలం తరిఫీయదు ఇవ్వాలని ఎవరికీ తోచలేదు. వారుబాధ్యులుకాని ఈ అజ్ఞానానికి తెలంగాణా ఉద్యోగులు అసమర్ధులనే నెపంతో ఆంధ్ర ఉద్యోగులు వీర్ని తిప్పలుపెట్టినారు.

1948లో భారత యూనియన్‌లో కలిసినప్పటినించీ హైద్రాబాదులో చాలామార్పులు వచ్చినవి. వెనకటిది ఫ్యూడల్‌వ్యవస్థ. ఒక పాతకాలపు స్వదేశ

సంస్థానం భారత రిపబ్లిక్‌లో భాగమైనది. పూర్వపు పరిపాలనాభాష ఉర్దూ. పోలీసు చర్య తర్వాత కొన్నాళ్ళు మిలిటరీ గవర్నరు పరిపాలన జరిగినది. ఆ పరిపాలనా భాష ఇంగ్లీషు. తరవాత సివిల్ అడ్మినిస్ట్రేటరు పరిపాలన, తర్వాత సలహాదారు పరిపాలన. సలహాదారుతో ప్రజా నాయకుల్ని మంత్రులుగా వేసుకున్నారు. అటు పిమ్మటనే 1952లో ప్రజాప్రభుత్వం అమలులోకి వచ్చినది. అందులో ఇంగ్లీషు ఉర్దూ భాషలతో వ్యవహారం జరిగినది. 1952 మొదలు 1956 చివరివరకూ ముఖ్యమంత్రిగావున్న రామకృష్ణరావు ఈ వ్యవస్థని ఆధునిక ప్రజాసంస్థగా రూపొందించడంలో చాలాశ్రమపడి కృతార్థుడైనాడు. అప్పటికీ కనీసం ఒక సీనియర్ మంత్రికి ఇంగ్లీషురాదు. ఆయన ఇంగ్లీషుఫైళ్ళు చదివించుకుని ఉర్దూలో తన అభిప్రాయాలు వ్రాసేవాడు. ఆంధ్రప్రదేశం వచ్చిన తార్వాత ఉర్దూకి సాంస్కృతికంగానూ. అల్పసంఖ్యాకుల విద్యాఅవసరాలకిగానూ రాష్ట్ర భాషలలో రెండోస్థానం ఇచ్చినా, ఆదిలో ఇంగ్లీషే ప్రధానభాష అయినది. తరవాత క్రమేణా తెలుగీకరణం జరగడానికి ప్రయత్నాలు ప్రారంభమైనవి. ఉర్దూ మాతృభాషగా కలవారికి కొన్ని వసతులు ఏర్పాటు చేసినారు. అయినా వారికి ఏకీకరణంలో కొన్ని కష్టాలు తప్పలేదు. ఈ ఇక్కట్లు రెండు ప్రాంతాల ఉద్యోగస్థులమధ్యా అభిప్రాయ భేదాలకీ, భయసందేహాలకీ కారణం అయినవి. అవి క్రమేణా పెరుగుతూ వచ్చినవి.

ముఖ్యోద్యోగులు ఆంధ్ర ప్రాంతంవారు కావడంవల్ల వారిప్రాబల్యమే చెల్లినది. ఈ ప్రాబల్యంలో తెలంగాణావారిని చిన్నచూపు చూసినారు. ఈ వైరుధ్యం వల్ల పైతరహా ఉద్యోగులమధ్య ఆంధ్ర తెలంగాణా దురభిమానాలు ఉద్భవించి రెండు తెగలుగా చీలినారు. ఆ చీలిక పెద్దదైనదేగాని తగ్గలేదు. వారిననుసరించి చిన్న ఉద్యోగులుకూడా రెండు తెగలైనారు.

మరొక విషయం. మద్రాసునించి కర్నూలు మారినప్పుడు, జూనియరు ఉద్యోగులికి ప్రమోషన్లు వచ్చినవి. కర్నూలునించి హైద్రాబాదు మారినప్పుడు మళ్ళీ ప్రమోషన్లు దొరికినవి. ఆంధ్ర ఉద్యోగులు, తత్కారణంగా, చాలామంది, యువకులు, తెలంగాణా ఉద్యోగులు పదిపదిహేనుఏళ్లుగా అదేస్థానంలోవున్న మధ్య వయస్కులు. వారిమీద ఆంధ్ర వారికి సీనియారిటీ లభించినది.

ఇల్లావుండగా ధరలుపెరిగిన కారణంగా కేంద్రప్రభుత్వం రెండుమూడు అంచీలలో తన ఉద్యోగుల జీతాలు పెంచుతూ వచ్చినది. రాష్ట్ర ఉద్యోగులలో అసంతృప్తి కలిగినది. ముఖ్యంగా ఆంధ్ర ప్రాంతపు నాన్‌గెజెటెడ్ ఉద్యోగుల సంఘం మహజర్లు పెట్టుకుని, అవి ఫలించని కారణంగా సమ్మెలు చేసినది. తెలంగాణా ఉద్యోగులికికూడా ఒక సంఘం ఉన్నది. అది అంత చైతన్యవంతంగా వుండేదికాదు. నిద్రావస్థలో వుండేది. వారు మేలుకోకమునుపే, ప్రభుత్వ పెద్దలు

వారిని లేవగొట్టినారు. 'విభజించి పాలించు' అనే దమననీతితో చేసిన ఈపని చేత కానివాడి చేతులో వుండీలు బద్దలాగ ఎదురుతన్నినది. తెలంగాణా ఉద్యోగులు ప్రభుత్వానికి హితులైనారు. వీరు విజృంభించినారు. ఆంధ్రతెలంగాణా ఉద్యోగుల వైరుధ్యం ఆరోజుకారోజు ఎక్కువై మితిమీరిపోయినది. తెలంగాణా అన్నిమూలలకీ పాకినది. పై ఉద్యోగులూ, కిందిఉద్యోగులూ కలిసి ప్రచారం ప్రారంభించినారు. శాఖాధిపతులంతా ఆంధ్రులేనన్నారు. అన్యాయం జరుగుతోందన్నారు. వీథివీథీ వాడ వాడాపాకినది. హైద్రాబాదురాజ్యంలోనే సుఖంగా వుండేదన్నారు. ప్రత్యేకతెలంగాణా చేస్తే మళ్ళీ సుఖపడవచ్చు, ప్రమోషన్లు పొందవచ్చు అనే ఆశా, కోరికా వారికి కలిగి నది. ఈ ఆంధ్ర తెలంగాణా వైరుధ్యం పైనించి కిందికి వ్యాపించి, పోలీసుశాఖతో సహా అన్ని ప్రభుత్వశాఖలూ రెండైనవి. ఈ ద్వేషభావం ప్రజలలోకూడా ప్రచార మైనది. ఇంజనీర్లంతా ఆంధ్రులే. అందువల్ల కంట్రాక్టర్లంతా ఆంధ్రులే అయినారని అనుకోడం ప్రారంభించినారు. కొందరు ఉద్యోగులికి, ముఖ్యంగా తెలంగాణా ఇంజనీర్లకి అన్యాయం జరిగినది. వారు కోర్టుకివెళ్లగా వారికి న్యాయం జరిగినది. ఇతర శాఖలలోకూడా ఇటువంటి అన్యాయాలు లేకపోలేదు. ఆంధ్రులకి కూడా అన్యాయం జరిగినది. అది చివరిదాకా పైకిరాలేదు, ప్రచారం కాలేదు.

ఈ కారణాలవల్ల పరిపాలన ముఖ్యాంగమైన ఉద్యోగులలో సమైక్య ఆంధ్ర ప్రదేశభావం ఆదినించీ కలగలేదు. ప్రతి ఆఫీసులోనూ వేరుకాపురాలు తయారైనవి. లోపలి విషయాలు తెలిసినవారికి ఇది ద్వంద్వ ప్రభుత్వమా అనిపించినది. ఈ ద్వైతం ఉద్యోగస్థులద్వారా ప్రజానీకానికి పాకినది, ద్వేషభావం పెరిగినది. కాబోయే ఉద్యోగస్థులు, భావిపౌరులూ అయిన విద్యార్థులలో వ్యాపించినది.

కాని, వారు చేసే ప్రచారం అంతా నిజంకాదు. ఉద్యోగాలలో ఆంధ్ర తెలంగాణానిష్పత్తి ఎప్పుడూ పాటించబడుతూనే వచ్చినది. తెలంగాణావారికి కేటా యించిన ఉద్యోగాలలో గైరుముల్కీలని నియమించిన నినాదాలేగాని వివరాలు అఖిలపక్ష సమావేశం అయిన కొంతకాలానికిగాని తెలియలేదు.

గెజెటెడ్ ఉద్యోగాలలోనూ, శాఖాధిపతులలోనూ, ఆలిండియా సర్వీసుల వారిలోనూ, హైకోర్టు న్యాయమూర్తులలోనూ, సర్వీసెసు కమీషనులోనూ చట్టబద్ధ మైన నిష్పత్తి నిర్దేశించలేదు. నిర్దేశించరాదు. అయినా ఈ ఉద్యోగాలలో తెలంగాణాకి ఎక్కువ ప్రాముఖ్యమే ఉన్నది గాని అన్యాయం జరగలేదు. 1969 ప్రారంభంలో : ఆంధ్రప్రాంతంవారు 61 మంది ఐ. ఏ. ఎస్. అధికారులు వుంటే తెలంగాణావారు 46 గురు వున్నారు. సెలెక్టులిస్టు అధికార్లు: ఆంధ్రనించి 12, తెలంగాణానించి 11. సెక్రటరీలు: ఆంధ్ర 6, తెలంగాణా 10. డిప్యూటీ సెక్రటరీలు: ఆంధ్ర 13, తెలంగాణా 14. ఇండియన్ పోలీసుసర్వీసు అధికారులు: రాష్ట్రే

తరులు 41, ఆంధ్ర 21, తెలంగాణా 17. శాఖాధిపతులు : ఆంధ్ర 28, తెలంగాణా 43. హైకోర్టు న్యాయమూర్తులు : ఆంధ్ర 13. తెలంగాణా 7. సర్వీసెస్ కమిషను సభ్యులు : ఆంధ్ర 1. తెలంగాణా 2. రెవెన్యూబోర్డు సభ్యులు: ఆంధ్ర 2, తెలంగాణా 3. వీరుకాక రాష్ట్రం అంతా పనిచేసే గెజెటెడ్ ఆఫీసర్ల సంఖ్య 11,466. వీరిలో ఆంధ్ర : 8,034, తెలంగాణా 3,432.

ఈ పరిస్థితులలో పరస్పర ద్వేషభావమే దుష్ప్రచారానికి దారితీసినది. అసలు పరిస్థితులు నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు ప్రత్యక్షంగానూ, కొందరు గెజెటెడు ఉద్యోగులు పరోక్షంగానూ రాజకీయాలలో దిగవలసిన అవసరాన్ని సూచించవు. దీనికికూడా రాజకీయవేత్తల ప్రోద్బలం, సహాయం లేకపోలేదు. ప్రత్యేక తెలంగాణా బంజర్లు సాగుచెయ్యడానికి పూనుకున్నవారు ఉద్యోగులు.



# విద్యార్థులు

ఈనాడు విద్యార్థుల అశాంతి ప్రపంచ వ్యాప్తమైన సాంఘికరుగ్మత. అది అంటువ్యాధి. ఇది ఉగ్రులైన యువకుల తరుణం. దీనికి పెద్దలుకూడా చాలా వరకు బాధ్యులంటారు విద్యావేత్తలూ, మానసికశాస్త్రవేత్తలూను. 1968 లో 50 దేశాలలో విద్యార్థి ప్రదర్శనలూ, దౌర్జన్యాలూ జరిగినవి. వీటి ప్రభావం జాతీయ ప్రభుత్వాల్ని, సంస్థల్నేకాక, అంతర్జాతీయ సంస్థల్నికూడా ఆందోళన పరిచినది. యునైటెడ్ నేషన్స్ శాఖ ఒకటి ఈ యువవిప్లవం లక్షణాలు నిపుణులచేత పరిశోధన చేయించినది. యువతరంవారి సంఘ విద్రోహకచర్యలు మానవజాతి పురోగమనంలోంచి ఉత్పన్నమైన అనివార్య విలక్షణం అన్నారా నిపుణులు. జాతి పురోభివృద్ధి అతిశయించినకొద్దీ యువజనులు జాతీయ వ్యవహారాలలో జోక్యం కలిగించుకుని, వాటి నిర్వహణలో ఎక్కువగా భాగస్వాములు కాగోరుతారు. ఈ వాంఛ అన్ని స్థాయిలలోనూ వ్యక్తమవుతున్నది. అధికారుల నిర్ణయాలు వారి కిష్టంగాని పక్షంలో విద్యార్థులు విశ్వవిద్యాలయ జీవితమే భగ్నం చెయ్యడానికి సంసిద్ధులవుతున్నారు. తమకి రుచించని నిర్ణయాలు ధిక్కరించి మార్చడానికి మూకఉమ్మడిగా ఊరేగింపులు జరిపి, దౌర్జన్యమార్గం అవలంబించి, పితూరీలు చెయ్యడానికి సంసిద్ధులు. ఈ ఉద్యమానికి విశ్వవిద్యాలయస్థాయి ఒక్కటే స్థానం కాదు, హైస్కూలు, ప్రైమరీ పిల్లలుకూడా తమ పెద్ద సోదరీసోదరుల్ని అనుసరిస్తున్నారు.

ఈ పరిస్థితి అభివృద్ధిపొందిన దేశాలలోనేకాక పొందుతున్న దేశాలలోకూడా ఇల్లాగే వున్నది.

ఈ విలక్షణానికి విద్యావేత్తలు ఎన్నోకారణాలు చెబుతున్నారు. తల్లితండ్రుల, ఉపాధ్యాయుల అజాగ్రత్తమొదలు ఎన్నో సాంఘిక ఉద్రేకాల ప్రభావం అంటారు.

దీని నివారణార్థం ప్రతిదేశంలోనూ సమగ్రమైన జాతీయ యువజనాభివృద్ధి కార్య క్రమాలు చేపట్టాలనిసలహా.

ఈ ప్రపంచవ్యాప్తమైనవ్యాధి మనదేశంలోకూడా ప్రవేశించినది. ఆంధ్ర ప్రదేశం, అందులో అంతర్భాగమైన తెలంగాణాకూడా దీనికి లోనైనవి.

పోయిన పదిపదిహేను సంవత్సరాలలో మన విద్యావిధానంతో ఆడుకున్నారు రాజకీయవేత్తలు. ఎన్నో మార్పులు చేసినారు. ఒకే ఇంట్లో మూడు ప్రధాన భాషల విద్యార్థులు, మూడు ప్రత్యేకపద్ధతులలో పరీక్షలకి చదివే సోదరీసోదరులు. భారత జాతి సమైక్యత కావాలంటూనే, ఒకరాష్ట్రంనించి ఇంకోరాష్ట్రానికి ఒక విద్యార్థి వెళ్లకుండా ఆటంకాలు సృష్టించినారు. ఒకేరాష్ట్రంలో వేరే విశ్వవిద్యాలయానికి వెళ్లడానికి వీలులేదు. ఇన్ని బాధలుపడి కృతార్థుడైతే ఉద్యోగాభావం.

ఈ లోటుపాట్లు తెలంగాణాలోనూ, ఉస్మానియా విశ్వవిద్యాలయంలోనూ కూడా వున్నవి. ఈ విశ్వవిద్యాలయంమీద పడిన రాజకీయవేత్తల వొత్తిడి రాష్ట్రంలో ఇతరచోట్ల లేదు. ఈ వొత్తిడికి మొదటలొంగిపోయినవారు ఉపాధ్యా యులు. ఒక ఉపాధ్యక్షుడి ఉద్యోగకాలపరిమితికి భంగం కలుగుతుందని భయం కలిగినప్పుడు వుపాధ్యాయులు పరోక్షంగానూ, విద్యార్థులు ప్రత్యక్షంగానూ పెద్ద ఉద్యమం నడిపినారు. అది రాజకీయరంగంలో వారికి తరిఫీయదుగా పరిణమించినది. రాజకీయాలు మధువు నిషావంటివి.

విద్యార్థిసంస్థలికి ఎన్నికలు మొన్నజరిగిన రాష్ట్రపతి ఎన్నికలకంటె తీవ్రంగా సాగుతవి. వీటిలో రాజకీయవేత్తలు పాల్గొన్నారు. కార్లు, ధనంకూడా సరఫరా చేసినారు. కాంగ్రెసువారు ప్రారంభించిన ఈ ఉద్యమంలోకి పరోక్షంగా మరోపార్టీదూరినది. సంఘర్షణ జరిగినది. ఫలితం ఒకే సంస్థలో అధ్యక్షుడొక పార్టీ కార్యదర్శి ఒక పార్టీ.

విద్యార్థి నాయకత్వం ఒకవృత్తిగా పరిణమించినది. చాలా విశ్వవిద్యాల యాలలో నాయకులు అదేక్లాసులో వుండిపోతున్నారు. సంఘధనబలంతో వారికి వాహనయోగం ఉపాధీకూడా లభిస్తున్నవి.

ఉద్యోగులు పదునుచేసి, సాగుచేస్తున్న ప్రత్యేక తెలంగాణాబంజర్లు తెలంగాణా విద్యార్థులు ఆక్రమించుకున్నారు. రాజకీయవేత్తలలో వున్న పార్టీలే వీరిలోనూ వున్నవి. ఈ గురువులు వార్ని విడిచిపెట్టి, వారి చదువులు వార్ని చదువుకోనివ్వరు.

ఒక విషయం విస్మరించకూడదు. తెలంగాణా మునుపటి తెలంగాణా కాదు. తెనుగు మీరినది. ఇది స్థానికులకే కొందరికి రుచికరంగాలేదు. ఆంధ్రప్రదేశం

ఏర్పడిన మొదటి పదిసంత్సరాలలోనూ తెలంగాణాలో, రాజధానీనగరంలోనేకాక, జిల్లాలలోకూడా విద్యార్థులసంఖ్య అపూర్వంగా పెరిగిపోయినది. దీనికి కారణం జిల్లాలలోకూడా అన్నిరకాల విద్యాసంస్థలూ వృద్ధికావడమే. ఇదివరలో రాజధానిలో మాత్రంవుండే విద్యాసౌకర్యాలు జిల్లాలలోకూడా ఏర్పడినవి. ముఖ్యంగా వరంగల్లు తెలంగాణాలో రెండవ విద్యాకేంద్రమైనది.

ఆంధ్రప్రదేశ అవతరణకి పూర్వం తెలంగాణాలో 7,684 ప్రాథమిక పాఠశాలలు వుండేవి. ఈ వ్యవధిలో 10,807 వరకూ పెరిగినవి. మాధ్యమిక పాఠశాలలు 169 నించి, 1,087 దాటినవి. సెకండరీ, హయ్యర్ సెకండరీ, మల్టీపర్పస్ పాఠశాలలు 105 నించి 1,055 వరకూ పెరిగినవి. కళాశాలలు వెనక 30 మాత్రం వుంటే ఇప్పుడు 80 వున్నవి. ఇంజనీరింగు కళాశాలలో 185 విద్యార్థులికి మాత్రం సీట్లు వుండేవి. ఇప్పుడు 677 సీట్లు వున్నవి. అల్లాగే పాలీటెక్నికుల్లో సీట్లు 370 నించి 1,370 కి పెరిగినవి. వైద్యకళాశాలలలో సీట్లు 158 నించి 420 దాకా వృద్ధిఅయినవి.

ఈ పెరుగుదలలో ఎక్కువమంది విద్యార్థులు ప్రాంతం అంతా సరి సమానంగా పెరుగుతున్నారు. ఆటలపోటీలలో, వక్తృత్వపోటీలలో, వినోదయాత్రలలో, ఇతరవ్యాసంగాలలో వీరికి భారతదేశంలో ఇతర విద్యార్థులతో పరిచయం కలుగుతున్నది. ఆ పరిచయంతో వారి ఆశయాలూ, అలవడులూ వీరికబ్బుతున్నవి. తత్కారణంగా విద్యార్థులంతా ఒకటే. మొదట తెలంగాణా విద్యార్థులు ఆందోళన ప్రారంభించినప్పుడు, ఆంధ్ర, శ్రీవేంకటేశ్వర విద్యార్థులు వీరికి సానుభూతిగా సమ్మెలు, హర్తాళ్ళు, నిరాహారదీక్షలూ సాగించినారు. ముఖ్యమంత్రిని నిలవదీసినారు. ప్రభుత్వాన్ని విమర్శించినారు. వారి సమైక్యభావం విభిన్న భావాలు కలిగిన రాజకీయవేత్తలు పడనివ్వరు.

1968 సంవత్సరంలో విద్యావిషయాలు పరిశోధనచేసే ఒక జాతీయసంస్థ మనదేశంలో ఎనిమిది రాష్ట్రాలలో విచారణ జరిపినది. విద్యార్థులలో 15 శాతం మాత్రం తమంతతాము రాజకీయాలలో పాలుతీసుకోవాలని ఉత్సాహపడతారు. తక్కినవారికి చదువుమీదే ధ్యాస. ఈ రిపోర్టు 1969 ఆగస్టు మధ్యలో ప్రకటించబడినది.



# అఖిలపక్ష సమావేశం

ఈ పరిస్థితులలో వాతావరణం తెలియకుండా మారుతూ వచ్చినది. బ్రహ్మానందరెడ్డి తెలంగాణాకి హితుడు. సంజీవరెడ్డికంటె, సంజీవయ్యకంటె ఇతనికే ఈ ప్రాంతంతో, నాయకులతో, శాసనసభ్యులతో ఎక్కువ పరిచయం వున్నది. స్నేహం అనవొచ్చు. రాజకీయాలలో అతనితో ఏకీభవించనివారుకూడా అతని దగ్గిరికి వస్తారు. సలహాలు పొందుతారు. దీనికి అతని నెమ్మదే కారణం. అతనిలో వైరం కనబడదు. సానుభూతి ప్రత్యక్షంగా వుంటుంది. ఈ తెలంగాణా స్నేహ బలమే అతని రాజకీయ బలానికీ, స్థిరత్వానికీ మూలకారణం, ఈ మూలస్థంభం కూలిపోతేనేగాని బ్రహ్మానందరెడ్డికి ముప్పంరాదు.

రహస్యంగా గుసగుసలు ప్రారంభించినవి. రాజకీయ నాయకుల కబుర్లలో ప్రవేశించినవి, సభలలో వేదికలెక్కి శాసనసభ ప్రవేశించినవి. తెలంగాణాకి అన్యాయం జరుగుతున్నది. రాజకీయంగా, ఆర్థికంగా, ఉద్యోగుల విషయంలో, ఇంకా ఎన్నో తాడూ బొంగరంలేని పుకార్లు. ఈ అన్యాయాలన్నీ తెలంగాణా పరిరక్షణలు నిర్లక్ష్యం చేసి అమలు జరపకపోవడంవల్ల సంభవించాయని తెలిసిన వారు కూడా అనడం, అనుకోడం సాగినది. ఆ విధంగా తెలంగాణాసొమ్ము ఆంధ్రులు తినేస్తున్నారు. వీళ్లు మోసగాళ్లు అనే నమ్మకం పెరిగేటంతవరకు సాగినది. అసలు ఈపరిరక్షణల విషయం ప్రారంభించవలసిన చోటులోనే బయలుదేరినది. ఆసంస్థ తెలంగాణాప్రాతీయసంఘం. ఈసంఘాన్ని జాహ్నుమహర్షి కమండలువు అన్నారొకరు. ఈక్షేత్రంలో జాహ్నవి అనగా గంగాప్రవాహంలాగ ఈపుకారుప్రవాహం ఉత్పత్తి అయినదన్నారు.

ఈపరిరక్షణలలో 'మిగులు' నిధుల విషయం సంజీవయ్యకాలంలోనూ, సంజీవరెడ్డి రెండోహయాంలోనూ పైకి వచ్చినది. అప్పుడేదో జవాబు చెప్పినారు. ఎవరూ అంత శ్రద్ధతీసుకోలేదు.

1968 హైద్రాబాదుకాంగ్రెసు అయినతర్వాత, బ్రహ్మానందరెడ్డి అఖిలభారత స్థాయిలోకి చేరిన తర్వాత, ప్రధాని ఇందిరాజీకి ముఖ్యులలో ఒకడనే మాట పొక్కిన తర్వాత, 'తెలంగాణా పరిరక్షణలు' నెమ్మదిగా, 'ఇంతింతై వటుడింతయై' అన్నట్టు విపరీత పరిమాణం అందుకున్నవి. మిగులునిధులు మిక్కిలిగా చర్చలోకివచ్చినవి. అదివరకు ఆరు సంవత్సరాలూ, ముఖ్యమంత్రిగా కొన్నాళ్లూ, ఆర్థికశాఖ నిర్వహించిన బ్రహ్మానందరెడ్డి దీనికి బాధ్యుడనే వాదన వినబడినది.

ముఖ్యమంత్రి ఈ విషయం జాగ్రత్తగా విచారణ చేయించినాడు. ఆంధ్ర తెలంగాణాలు కలిసి ఆంధ్ర ప్రదేశంగా ఏర్పడేసరికి మొదటి పంచవర్ష ప్రణాళిక అయిపోయినది. ప్రారంభించినది రెండవ పంచవర్ష ప్రణాళిక. ఆ ప్రణాళికాంతంలో 22 కోట్ల రూపాయిలు తెలంగాణా మిగుళ్లు వుండగా, అవి మూడో ప్రణాళికా కాలంలో తెలంగాణా ప్రాంతీయ సంఘంవారు సూచించిన పథకాలకోసం ఖర్చు చెయ్యబడినది. ఇక మూడో ప్రణాళిక కాలం పూర్తిఅయేసరికి తెలంగాణామిగుళ్ళ మొత్తం ఎంత ? పరిశీలించగా 30.54 కోట్లని తేలినది. ఈ విషయం శాసనసభ శీతాకాలపు సెషన్‌లో 1968 నవంబరు 23 న గవర్నరు ప్రసంగంద్వారా ప్రకటించినారు. నాలుగో ప్రణాళికా కాలంలో అది తెలంగాణా పథకాలకోసం ఖర్చు చేస్తామని ప్రభుత్వం వాగ్దానం చేసినది. నాలుగో ప్రణాళిక అమలు ఆలస్యమై అప్పటికి ప్రారంభంకాలేదు.

ఇక్కడే చిన్న అభిప్రాయభేదం కలిగినది. ఈ మిగుళ్లు ఏసూత్రం ప్రకారం లెఖ్ఖపెట్టాలీ అని. ఈ పదిపన్నెండేళ్ళుగా ఆ సూత్రాలు ప్రాంతీయ సంఘంవారు ప్రభుత్వంతో చర్చించినారు. రెండో ప్రణాళిక కాలంలో మిగుళ్ళు లెఖ్ఖ వేసినపద్ధతీ, మూడో ప్రణాళికా కాలంలో మిగుళ్ళు తేల్చిన పద్ధతీ ఒకేమాదిరిగాలేవు. ఇప్పుడు రెండో ప్రణాళికలో మిగిలిన నిధులుకూడా మూడో ప్రణాళిక సూత్రంమీదనే తిరిగి లెఖ్ఖవెయ్యాలని ప్రాంతీయసంఘం సూచించినది. ఇంతేకాక, 1966 మొదలు 1969 వరకూ మూడు సంవత్సరాలలోనూ ఏ ఏటి కాయేడు ప్రణాళికలలో మిగులు అదేసూత్రంమీద లెఖ్ఖపెట్టి, మొత్తంతేల్చి, నాలుగో ప్రణాళిక కాలంలో వ్యయం చెయ్యవలసినదిగా ప్రాంతీయ సంఘం కోరినది.

ఈ కారణాలవల్ల గవర్నరు ప్రకటించిన తెలంగాణా మిగులునిధుల మొత్తం ప్రాంతీయ సంఘంవారికి అంగీకారం కాలేదు.

1968 నవంబరులో ఈ విషయం ఈవిధంగా తేలక పూర్వమే వాతావరణం విషపూరితమైనది. ప్రభుత్వం తీసుకున్న ప్రతిచర్యా తెలంగాణా రాజకీయనాయకులలో కొందరూ, ఉద్యోగస్థులు చాలామందీ అపార్ధం చేసుకుని, అందరూ అన్నీ అనుకుంటున్నారు. ఒక తెలంగాణా ఉన్నతోద్యోగి రిటైరైతే, చూశావా ఇతనికి

మళ్ళీ ఇంకో ఉద్యోగం ఇవ్వకుండా ఇంటికి పంపించేశారు, ఆంధ్ర ఉద్యోగికి రిటైరైనాకూడా మూడుసార్లు వేరే ఉద్యోగాలు ఇచ్చారు అని. అనుమానం, సందేహం వున్నచోట అడుగడుగునా అపార్థంచేసుకునేందుకు అవకాశాలు ప్రత్యక్ష మవుతాయి. ఈ భయసందేహ మన స్తత్వం. రాజకీయరంగంలోంచి, ఉద్యోగుల ఆవరణలోంచి, వారివారిద్వారానే అతిత్వరగా ప్రజానీకంలో పడి, బజార్లలోపడి, ఇళ్లల్లో ఇరుక్కుని ఆంధ్ర-తెలంగాణా అతుకుబీటదీసినది. 'ఆంధ్రోళ్లు' అనే మాట నిందావాచకమైనది. తెలంగాణాలో, ముఖ్యంగా రాజధానీనగరంలో విషవాయువులు వ్యాపించినవి. ఆంధ్రప్రాంతం మనుషులు తెలంగాణ ప్రజలకి బద్ధవిరోధులనీ, వాళ్లు వీళ్లని దోచుకుంటున్నారనీ ఒకద్వేషభావం వ్యాపించినది. ఇది పైనించి కిందదాకా పాకినది. 'తెలంగాణా పరిరక్షణలు అమలు జరపడంలేదు, తెలంగాణాకి ముప్పొచ్చింది' అనే నినాదం వినబడినది.

ఈ భయసందేహవాతావరణంలో 1968 శీతాకాలపుశాసనసభ సమయంలోనే ముఖ్యమంత్రి తెలంగాణా నాయకులతో చర్చలు ప్రారంభించినాడు. ఈ రక్షణలు ఏమిటి, ఎందుకు అమలు జరగలేదు, జరిగితే ఎంతవరకు జరిగినవి, ఇంక చెయ్యవలసిన పని ఏమిటి, అనే తీవ్రాలోచన ప్రప్రథమంగా ప్రారంభం అయినది. నవంబరులో ప్రారంభించిన చర్చలు డిసెంబరుదాకా నడిచినవి. డిసెంబరు చర్చల ఫలితంగా తెలంగాణా ప్రాంతీయసంఘసభ్యులతోటీ, ఇతరనాయకులతోటీ ఒక సమాధానం కుదిరినది. వెంటనే ముఖ్యమంత్రి ఏకారణంవల్లనో ప్రకటించలేదు. చర్చలు కొనసాగుతూనే వున్నవి. 1969 జనవరి 1 న కూడా తెలంగాణా మంత్రుల్నీ, ప్రాంతీయసంఘ అధ్యక్షుడు జె. చొక్కారావునీ, ప్రధానకార్యదర్శి, ఆర్థిక కార్యదర్శి, ప్రణాళికా కార్యదర్శి మొదలైన అధికార్లనీ పిలిచి తెలంగాణా రక్షణలేకాక, తెలంగాణా అభివృద్ధి విషయంకూడా చర్చించినాడు.

అప్పటికే దేశంలో పెట్టుబడిదార్లతో సంప్రదించి, రాజధానీ నగరంలో మరికొన్ని పరిశ్రమలు స్థాపిద్దామని ప్రయత్నిస్తున్నాడు. ఏభై కోట్లరూపాయిల పెట్టుబడిదాకా వాగ్దానాలు వచ్చినవి. బేరగాళ్ళు హైద్రాబాదు వచ్చిపోతున్నారు. ఒక్క అధికారి వీరితో సంప్రదించడానికి చాలక, మరికొందరిని సహాయంగా నియమించినారు. ఈ సందర్భంలో ముఖ్యమంత్రి కలకత్తా వెళ్ళినాడు. ఆ నగరంలో వున్న వాణిజ్య, వ్యాపార, పారిశ్రామిక పెద్దల్ని కలిసినాడు. వారివారి ఉత్సాహం మనకి ఉపయోగపడినట్టయితే హైద్రాబాదులో, అనగా తెలంగాణా ప్రాంతంలో ఏభై కోట్లరూపాయిల కిమ్మతైన పెట్టుబడితో కొత్తపరిశ్రమలు రూపొందేవి. కొన్నివేలమందికి అదనంగా తిండీ తిప్పలు దొరికేవి.

కలకత్తాలో రెండు లక్షలమందికి పైగా ఆంధ్రులున్నారు. వ్యాపారస్థులు, ఉద్యోగస్థులు, పనిపాటలు చేసుకునేవారు. వారంతా విపరీత ప్రాంతీయ అభిమానం

కలిగిన బెంగాలీలతో కలిసి, తాముకూడా ఒక నాగరిక సంఘంగా తులతూగుతూ వుంటారు. కలకత్తా ఆంధ్ర సంఘంవారు బ్రహ్మానందరెడ్డిని పిల్చి పండుగ చేసు కున్నారు. వారి ఆదరాభిమానాలూ, ఉత్సాహాతిశయాలుచూసి, ఒక భాషా, ఒక సంస్కృతీ మానవుల్ని ఎంత సన్నిహితంచేస్తాయి అనుకున్నాడు బ్రహ్మానందరెడ్డి. అదే వూపులో బొంబాయికూడా వెళ్ళి మరికొంత పెట్టుబడికోసం ప్రయత్నిద్దామని ఉవ్విళ్ళూరుతున్నాడు. ఇంటికి వచ్చినాడు.

జనవరి 8 న ఖమ్మంలో తెలంగాణా విప్లవానికి నాందీప్రస్తావన ప్రారంభించినది. ఈ రూపకం ప్రదర్శించినవారు విద్యార్థులు. ఊరేగింపుతో, ఆంధ్రులికి వ్యతిరేక నినాదాలతో. తెలంగాణా పరిరక్షణలు అమలు జరపాలని సభలో తీర్మానించినారు. ప్రభుత్వం తెలంగాణా అభివృద్ధి నిర్లక్ష్యం చేస్తున్నదని, నిరసనగా కళాశాల విద్యార్థి రవీంద్రనాథ్ నిరహారదీక్ష ప్రారంభించినాడు. అతనికి తోడుగా మునిసిపల్ వైస్ ఛైర్మన్ కవిరాజ మూర్తికూడా ఉపవాసదీక్ష ప్రారంభించినాడు. నిజామాబాదులోకూడా విద్యార్థుల ఊరేగింపు జరిగినది. తెలంగాణా పరిరక్షణలు అమలు జరపాలని కలెక్టరుకీ, పోలీసు సూపరెంటెండెంటుకీ వినతి పత్రాలు సమర్పించినారు. "గైరుముల్కీల నియామకంలో విచారణ జరగాలి, గైరుముల్కీలు వెళ్ళిపోవాలి" అని నినాదాలు చేసినారు. జనవరి 10 న ఖమ్మంలోనూ వరంగల్లులోనూ పూర్తిహర్తాళ్ళు జరిగినవి. శాంతంగా ప్రారంభించిన సత్యాగ్రహం ఆగ్రహంగా మారి, దురాగ్రహంతో వ్యాపించినది. ఖమ్మంలో విద్యార్థులు గవర్నమెంటు బస్సుకి నిప్పంటించినారు. యల్లందులో వార్తాపత్రికలు ధగ్ధంచేసినారు. ఆంధ్ర ప్రాంతంనించి వచ్చే బస్సులూ, రైళ్ళు ఆపివేసినారు. పరిరక్షణల అమలు కావాలని కాంగ్రెసు శాసన సభ్యుడు సత్యనారాయణ నిరాహారదీక్ష వహించినాడు. హైద్రాబాదులో ఉస్మానియా విద్యార్థుల సర్వసభ్యమండలి సమావేశమై, తెలంగాణా రక్షణల ఉద్యమానికి చేయూతగా జనవరి 15 న సమ్మె చెయ్యాలనీ, వారాంతంలో రాజధానీనగరంలో బంద్ పిలుపు ఇవ్వాలనీ నిశ్చయించినది.

జనవరి 15 న ముఖ్యమంత్రి తెలంగాణాలో కొడంగల్ తాలూకాలో కాకరవాణి ప్రాజెక్టు శంకుస్థాపన చేసినాడు. స్వార్థపరులూ, అనామకులూ చెప్పే మాటలువిని చెడిపోవద్దని ప్రజల్ని హెచ్చరించినాడు. వినేవారులేరు. విద్యార్థులసమ్మె నిరవధికం అన్నారు. ఖమ్మంలో టెలిగ్రాఫ్, టెలిఫోను తీగలు తెంచినారు. కొత్తగూడెంలో మంచినీళ్ళగొట్టాలు ధ్వంసం చేసినారు. ఉస్మానియావిద్యార్థులలో చీలికలు వచ్చినవి. ఒకరు పరిరక్షణలు చాలని, ఇంకొకరు ప్రత్యేక తెలంగాణా కావాలనీను. వెంటనే పూర్వ హైద్రాబాదు సత్యాగ్రహ ఉద్యమ నాయకుడు స్వామీరామానంద తీర్థ, 'ప్రత్యేకతెలంగాణా నినాదం అర్థంలేని పాతకాలపుకేక' అని ఖండించినాడు.

పర్యటననించి వెంటనే ఇంటికి తిరిగివచ్చిన ముఖ్యమంత్రి అన్ని పార్టీల నాయకుల్నీ ఒక సమావేశానికి ఆహ్వానించినాడు. ఈ అఖిలపక్ష సమావేశం ఆనంద నిలయంలో జనవరి 18 న ప్రారంభించి 19 న ముగిసినది. ఈ సమావేశంలో విశేషం ఏమంటే 1956లో ఆంధ్ర–తెలంగాణా పెద్దమనుషులవొప్పందం సంతకం చేసిన వారిలో ఇద్దరున్నారు. ఆంధ్ర తరఫున గౌతులచ్చన్న, తెలంగాణా తరఫున జె. వి. నరసింగరావు.

1969 మార్చిలో ఆ వొప్పందానికి కాలదోషం పట్టగలదు. రెండు నెలల ముందు ఈ అఖిల పక్ష సమావేశం ఆ వొప్పందం ఎల్లా అమలు జరిగినదీ పరిశీలించి చర్యతీసుకునేందుకు కూడినది. మొత్తం 55 గురు నాయకులు సభకి హాజరైనారు. రెండురోజుల తర్జన భర్జనల తర్వాత ఏకగ్రీవంగా ఆమోదించిన ఒక వొప్పందం ప్రకటించినారు.



# అఖిలపక్ష ఒప్పందం

తెలంగాణా రక్షణలను అమలు పరచడానికై తీసుకోవలసిన చర్యలను గురించి చర్చించడానికి అన్ని రాజకీయపార్టీల నాయకులతో ముఖ్యమంత్రి 1969 జనవరి 19 వ తేదీన ఏర్పాటు చేసిన సమావేశంలో జరిగిన ఒప్పందం పూర్తిపాఠం :–

తెలుగుభాష మాట్లాడే ప్రజలందరికి స్వంతరాష్ట్రం ఉండాలనే చిరకాల అభిమతం, ఆంధ్రతెలంగాణా ప్రాంతాల నాయకుల సమైక్యయత్నాల ఫలితంగా 1956 నవంబరు 1 వ తేదీ ఆంధ్రప్రదేశ్ అవతరించడంతో సఫలమైనది.

తెలుగుప్రజలు సాంస్కృతికంగా, ఆర్థికంగా సంపూర్ణాభివృద్ధి సాధించడం మౌలికంగా వారి ఉభయుల ఆశయం. తెలంగాణాశ్రేయస్సును కాపాడడానికీ, అభివృద్ధికి హామీ ఏర్పరచడానికీ కొన్ని రక్షణలు కల్పించడం అవసరమని ఉభయప్రాంతాల నాయకులు భావించారు. తదనుగుణంగా పెద్దమనుషుల ఒప్పందం అనే పేరుతో కొన్ని నియమ నిబంధనలను ఏర్పాటు చేసుకున్నారు.

పెద్దమనుషుల ఒప్పందం షరతులను ఖచ్చితంగా అమలు జరపాలని ఆంధ్రప్రదేశ ప్రభుత్వ విధానంగా ఉంటూవచ్చినా ఆ విధానాన్ని అమలు జరపడంలో కొన్ని లోపాలు ఉత్పన్నమైనవి. ఆరక్షణలను సరిగ్గా అమలు జరిపేందుకు కట్టుదిట్టాలు శాసనసభలోని అన్ని రాజకీయపార్టీల నాయకులతో ముఖ్యమంత్రి ఏర్పాటు చేసిన సమావేశం ఈదిగువ నిర్ణయాలను గైకొన్నది :–

## ఉద్యోగాలు

ఆంధ్రప్రదేశ ప్రభుత్వోద్యోగుల నియామకం (ముల్కీనిబంధన) నిబంధనల (1959) క్రింద తెలంగాణాప్రాంతీయులకు రిజర్వు చేసిన ఉద్యోగాలలో నేరుగా,

లేక ప్రమోషన్‌ద్వారా, లేక బదిలీద్వారా నియమించబడిన అన్యప్రాంతవాసులైన వ్యక్తులందరినీ వెంటనే తొలగించడం జరుగుతుంది. ఆ విధంగా ఏర్పడిన ఖాళీ లన్నిటిని అర్హులైన తెలంగాణా ప్రాంతీయుల నియామకం ద్వారానే భర్తీచేయడం జరుగుతుంది. అట్టి అభ్యర్థులు లేని సందర్భాలలో అట్టివారు లభ్యమయే దాకా ఉద్యోగాలను ఖాళీగా ఉంచడం జరుగుతుంది. ఈపైన పేర్కొన్న తరహాలో తక్షణచర్యలు ప్రారంభమవుతాయి.

ఆ విధంగా ఉద్యోగాలనుండి తొలగించబడిన అన్యప్రాంతీయులకు సర్వీస్ విచ్ఛిత్తి లేకుండా ఆంధ్రప్రాంతంలో ఉద్యోగాలు చూపుతారు. అవసరమైతే తాత్కాలికంగా అదనపు కొత్త పదవులను కల్పిస్తారు.

ఈ నిర్ణయాలను వెంటనే ఖచ్చితంగా అమలు జరిపే బాధ్యత నిర్వహణకై ఇద్దరు సీనియర్ అధికారులను నియోగిస్తారు.

దొంగ ముల్కీసర్టిఫికేట్ల ఆధారంగా ఉద్యోగాలు సంపాదించారన్న ఫిర్యాదులు కొన్ని ఉన్నాయి. అట్టి ఫిర్యాదులపై దర్యాప్తుకు ప్రభుత్వం ఏర్పాటు చేస్తుంది.

## చట్టప్రాతిపదికపై ఏర్పడిన సంస్థలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగుల నియాకమపు (ముల్కీనిబంధన) చట్టం. నిబంధనలు ప్రభుత్వోద్యోగాలకు, స్థానిక పరిపాలన క్రిందగల ఉద్యోగాలకే వర్తిస్తున్నవి. ఈ చట్టం ఆంధ్రప్రదేశ విద్యుచ్ఛక్తిబోర్డుకు వర్తించదని హైకోర్టు ఇటీవల తీర్పు చెప్పింది. ఈ సంస్థలు రాష్ట్ర వ్యాప్తమైనవి అయినందున వాటిలోని ఉద్యోగాలలోకూడా ప్రభుత్వోద్యోగాల విషయంలోవలెనే తెలంగాణా ప్రాంతపు అభ్యర్థులకు రిజర్వేషను వుండాలని ప్రభుత్వం భావిస్తున్నది. ఈ నిబంధనలు రాష్ట్ర విద్యుచ్ఛక్తిబోర్డుకు వర్తింపజేసే విషయంలో హైకోర్టు తీర్పుపై రాష్ట్రప్రభుత్వం వెంటనే అపీలు దాఖలు చేస్తుంది.

## సీనియారిటీ జాబితాలు

ఆంధ్రతెలంగాణా ఉద్యోగులకు వారి హోదాలు నిర్ణయిస్తూ ఒక జాబితాను కేంద్రప్రభుత్వం ఆమోదించిన అన్ని సందర్భాలలోను, లేక అట్టి జాబితాల తయారీకి, లేక వాటి సవరణకై ఆదేశాలు జారీ చేసిన సందర్భాలలోనూ అట్టి ఆమోదం పొందిన జాబితాలనే, వారి ఉద్యోగనిబంధనలను క్రమబద్ధం చేసే విషయంలో అనుసరించడం జరుగుతుంది. కేంద్రప్రభుత్వం ఆమోదించిన ఆ తరహా జాబితాలు లేని సందర్భాలలోను, లేక అట్టి జాబితాల తయారీకి, సవరణకు

ఆదేశాలు జారీకాని సందర్భాలలోను. కేంద్ర ప్రభుత్వామోదం లభించేవరకు రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న తాత్కాలిక జాబితాలను అనుసరించడమే కొనసాగుతుంది. పదవులను సమస్థాయిలో ఉండేట్టు చేసే విషయంలో, లేక హోదాల నిర్ణయానికి ఉమ్మడి జాబితాలను తయారుచేసే విషయంలో కేంద్రప్రభుత్వం ఏదైనా ఆదేశం జారీచేసిన సందర్భంలో ఇక ఆవిషయంపై ఎట్టి ఉత్తరప్రత్యుత్తరాలు జరపకుండా అట్టి ఆదేశాన్ని రాష్ట్రప్రభుత్వం అనుసరిస్తుంది.

## తెలంగాణా మిగులునిధులు

తెలంగాణా మిగులునిధులను ఈదిగువ ప్రాతిపదికపై నిర్ధారిస్తారు :-

ఎ) ఉభయ ప్రాంతాలకు ఖర్చులను, రాబడిని కేటాయించడంలో ప్రస్తుతం అమలులోవున్న పద్ధతి కొనసాగుతుంది.

బి) ప్రతి సంవత్సరం తెలంగాణా మిగులునిధులను లెక్కవేయడానికి, ఆ సంవత్సరం తెలంగాణా నికర రెవెన్యూమిగులుకు, ఆ సంవత్సరం రాష్ట్రం మొత్తంలోని పెట్టుబడి వ్యయంలో మూడవభాగానికీ, ఆకాలంలో వాస్తవంగా తెలంగాణాలోని పెట్టుబడి ఖర్చుకూ మధ్యగల తేడా మొత్తాన్ని కలపడంద్వారా తేల్చవలసి వుంటుంది.

సి) చట్టప్రాతిపదికపై ఏర్పడిన తదితరమైన బోర్డులు, కార్పొరేషన్లు మొదలైన రాష్ట్రవ్యాప్త ప్రాతిపదికపై, రాష్ట్రప్రభుత్వనిధులతో నిర్వహింపబడుతున్న వాటిని తెలంగాణా మిగులునిధుల నిర్ధారణ విషయంలో వాటినికూడా రాష్ట్రవ్యాప్తమైన ప్రభుత్వశాఖలుగానే, వాటి జమాఖర్చులు ప్రభుత్వఖాతాలలో చేరి ఉన్నట్టుగానే పరిగణించడం జరుగుతుంది.

ఆంధ్రప్రదేశ్ విదుచ్ఛక్తిబోర్డు విషయంలో విద్యుచ్ఛక్తి ఉత్పాదన, హైటెన్షన్ ట్రాన్స్మిషన్‌లైన్స్ విషయంలో మాత్రమే ఖర్చును పైనపేర్కొన్న తరహాలో ఉభయప్రాంతాలకు కేటాయించడం జరుగుతుంది. విద్యుత్సరఫరాలైన్లు, గ్రామాలకు విదుచ్ఛక్తి సౌకర్య విస్తరణ విషయంలో రెండుప్రాంతాలకు వాస్తవంగా జరిగిన ఖర్చునే ఆయాప్రాంతాల లెక్కల్లోకి తీసుకుంటారు.

డి) ప్రత్యేకం తెలంగాణాకే పరిమితంగా వినియోగిస్తున్న పారిశ్రామిక ట్రస్టునిధిని ఆవిధంగా వినియోగించడమే కొనసాగుతుంది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటినుంచి జమకడుతూవచ్చిన తెలంగాణా మిగులు నిధులను పైనపేర్కొన్న సూత్రాల ప్రాతిపదికపై ఖచ్చితంగా లెక్కతేల్చడానికిగాను అకౌంటెంటు జనరలు హోదాకల సీనియర్ అధికారిని నియోగించ

వలసిందిగా కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్‌ను అభ్యర్థిస్తారు. 1969 ఫిబ్రవరి 28 వ తేదీలోగా తన నిర్ణయాన్ని తెలుపవలసిందిగా ఆ అధికారిని కోరుతారు.

## అ భి వృ ద్ధి

ఆవిధంగా నిర్ధారణ అయిన తెలంగాణా మిగులునిధులను రానున్న అయిదేండ్లలో తెలంగాణా ప్రాంతం అభివృద్ధికే పూర్తిగా వినియోగిస్తారు. భవిష్యత్తులో సమకూడే తెలంగాణా మిగులునిధులను ప్రతి ఆర్థిక సంవత్సరాంతంలో లెక్క-తేల్చి, వాటిని ఆమరుసటి సంవత్సరకాలంలో తెలంగాణా ప్రాంతంలోనే వినియోగించడానికి తగు ఏర్పాట్లు చేస్తారు. తెలంగాణా ప్రాంతంలో చేసే ఖర్చును ఆరు నెలల కొకపర్యాయం ప్రభుత్వం సింహావలోకనం జరుపుతుంది. ఆపరిశీలనా నివేదిక ప్రతిని ప్రాంతీయ సంఘానికి, శాసనసభసభ్యులకు ప్రభుత్వం అందజేస్తుంది.

ఆంధ్రప్రాంతంలోకూడా వెనుకబడిన మండలా లున్నాయని, వాటి విషయం కూడా తక్షణ పరిశీలనార్హమని మేము గమనించాము. ఆ ప్రాంతాల సత్వర ఆర్థికాభివృద్ధికి తక్షణప్రాధాన్యం ఇచ్చి కృషిచేయడం ద్వారా ప్రాంతీయ అసమానతలు తొలగించడానికీ, నిరుద్యోగానికి గురిఅయి కష్టపడుతున్నవారి పరిస్థితి మెరుగుదలకై ఉద్యోగావకాశాలు పెంపొందించడానికీ ప్రభుత్వం ప్రయత్నిస్తుంది.

## వి ద్యా సౌ క ర్యా లు

ప్రాంతీయప్రసక్తి లేకుండా రాజధానినగరమైన హైదరాబాద్‌లో విద్యార్థులకు విద్యాసౌకర్యాలను పెంపొందింప జేయడానికి, వచ్చే విద్యాసంవత్సరంనుండి చర్యలు గైకొనడం జరుగుతుంది.

పైన పేర్కొన్న తరహాలో దృఢమైన కార్యాచరణద్వారా తెలంగాణా ప్రాంతంలో ప్రజలు వ్యక్తపరుస్తున్న కష్టాలు నివారణ కాగలవని మేము విశ్వసిస్తున్నాము. తెలుగుప్రజల సాంస్కృతిక వికాసం, ఆర్థికాభివృద్ధి మన ప్రధానాశయంగా కొనసాగగలదు. రాష్ట్ర ఆర్థిక పురోగతికి, యువతరానికి ఇతోధికంగా ఉద్యోగావకాశాల కల్పనకు దారితీసేట్టుగా ఇతోధికమైన పెట్టుబడులను రాష్ట్రానికి ఆకర్షించడానికై తగిన వాతావరణాన్ని కల్పించడానికి రాష్ట్రంలో ఐక్యత, ప్రశాంతత అత్యంతావశ్యకం.

అందుచేత మన సమాజంలో విచ్ఛిన్నకర ధోరణులకు దారితీసే పనులేవీ చేయరాదు. రాష్ట్ర సంపూర్ణఐక్యతకు, సత్వర ఆర్థికాభివృద్ధి సాధనకు యావచ్ఛక్తితో కృషిచేస్తామని విభిన్నరాజకీయ దృక్పథాలుకల మేము దృఢంగా

సంకల్పిస్తున్నాము. భారతదేశంలో ఆంధ్రప్రదేశ్ ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తున్నది. జాతీయసమైక్యతా సాధనకు మనవంతుమేరకు తోడ్పడేందుకై. మనరాష్ట్రంలో మనం సంపూర్ణసమైక్యతను సాధించడం అత్యంత ప్రధానమైన విషయం.

అందుచేత ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం ఏర్పాటుకొరకు కొన్నిచోట్ల లేవ దీసిన నినాదాన్ని మేము అసందిగ్ధంగా, తీవ్రంగా ఖండిస్తున్నాము."

ప్రకటనపై సంతకంచేసినవారి పేర్లు: జె. చొక్కారావు, కె. అచ్యుత రెడ్డి, వి. బి. రాజు, పి. నరసింగరావు, సి. హెచ్. రాజేశ్వరరావు, బద్రీవిశాల్, వై. వి. కృష్ణారావు, పి. వి. నరసింహారావు, జూపూడి యజ్ఞనారాయణ, కుడిపూడి ప్రభాకరరావు, వి. రామారావు, రోడామిస్త్రీ, సి. జంగారెడ్డి, ఎ. వాసుదేవరావు, సుల్తాన్ సలాఉద్దీన్ ఒవైసి. పి. నరసారెడ్డి, జె. రంగారెడ్డి, పి. గోవర్ధన్‌రెడ్డి, జలగం వెంగళరావు, టి. పురుషోత్తమరావు, కె. రామచంద్రారెడ్డి, ఎం. కమాలుద్దీన్, ఎర్రం సత్యనారాయణ, సి. హెచ్. మూర్తిరాజు, కె. రాజమల్లు, కె. సుదర్శన్ రెడ్డి, కాకానివెంకటరత్నం, ఎం. ఎన్. లక్ష్మీనరస్సయ్య, కాజ రామనాథం, టి. రామ స్వామి, శీలం సిద్దారెడ్డి. ఎన్. రామచంద్రారెడ్డి, అరిగె రామస్వామి, ఎన్. ప్రసాద రావు, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, జె. వి. నరసింగరావు, కే. వి. నారాయణరెడ్డి, బి. వి. గురుమూర్తి, మహమ్మద్ ఇబ్రాహింఆలీ, గౌతులచ్చన్న, వావిలాల గోపాల కృష్ణయ్య. నరసింహారెడ్డి, చెంచు రామానాయుడు, కొండా లక్ష్మణ్, కాసుబ్రహ్మా నందరెడ్డి.

1956 లో జరిగిన పెద్దమనుషుల ఒప్పందం తరవాత తెలంగాణాకి ఇంత అనుకూలమైన ఏర్పాట్లు జరగలేదు. ఆ ఒప్పందం ఆదిలో అయిదేళ్ళకే. మరో అయిదేళ్ళు పొడిగించే అవకాశం వున్నది. ఆ అవకాశం ఉపయోగానికి వచ్చినది. కాలదోషం పట్టేకాలంలో ఆర్థిక అనుకూలాలు శాశ్వతంగానూ, ఉద్యోగాలకి ముల్కీనిబంధన మరో అయిదేళ్ళకీ అంగీకరించినారు అఖిలపక్ష సమావేశంవారు. ప్రభుత్వం ఆ నిర్ణయాలు తన నిర్ణయాలుగానే భావించి అమలు జరపడానికి సిద్ధపడి చర్య ప్రారంభించినది.

సంతకాలు చేసిన వారిలో కొందరు, అందులో ముఖ్యులు, నెమ్మదిగా జారుకున్నారు. ఒప్పందాలకి విలువవుంటే, సంతకాలుచేసిన వారంతా చిత్తశుద్ధితో

సంతకంచేస్తే ఆ ప్రకటన 'మేగ్నాకార్టా' వంటిది. ఆనుగుణాలు ఈ ఒప్పందానికి లేకపోయినవి.

పైగా, ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వపక్షాన 'లోపాలు' జరిగినవని వొప్పుకుని ఆమాట ప్రకటనలో ఉటంకించడానికి అంగీకరించినాడు. తరవాత చెప్పి నాడు గాంధీతత్వంలో మంచికోసం చేసినపని అని. ఆమాటతో, లొంగిపోయినాడు ముఖ్యమంత్రి అనుకున్నారు ఆందోళనకారులు. ప్రకటనలో అంశాలు వారికి అక్కర్లేక పోయినవి. ఆందోళన పెచ్చుపెరిగినది. ఇంకా నిర్విరామంగా జరుగుతూనే వున్నది. ఆగలేదు. ఆరిపోలేదు. ఉత్తర ధృవంలో ఆరునెలలు వుంటుంది ఒక రాత్రి. ఆంధ్రప్రదేశానికి ఒక దీర్ఘరాత్రి; భయంకరం భీభత్సభయానక కాళరాత్రి !



# వడ్లగింజలో బియ్యపుగింజ

అఖిలపక్ష సమావేశానంతరం చేసిన ప్రకటన ప్రకారం సభవారు చర్చించిన విషయాలు మూడు. 1. తెలంగాణాఉద్యోగులు, 2. తెలంగాణామిగులునిధులు, 3. ప్రాంతీయప్రసక్తిలేకుండా రాజధానీనగరంలో అదనపు విద్యాసౌకర్యాలు.

వీటిలో మొదటి రెండే తెలంగాణాపరిరక్షణలకి సంబంధించినవి. సమావేశం జరిగినప్పుడు తెలంగాణాకి రిజర్వు చేసిన ఉద్యోగాలలో ఎంతమంది గైరు ముల్కీల్ని వేశారో ఇదమిద్ధమని లెక్కలు తయారులోలేవు. వేసిన మాట వాస్తవం. అందుచేత అది ఒక లోపమేనని ముఖ్యమంత్రి అంగీకరించినట్టు ఊహించాలి. ఏ పరిస్థితులలో వారిని నియమించవలసి వచ్చినదో తరువాతగాని ప్రజలకి తెలియలేదు.

ఇక మిగులనిధుల విషయంలో, నిధులు మిగులున్న మాట వాస్తవం. ఆ మొత్తం విషయమై, దాన్ని లెక్కవేసే సూత్రం విషయమై ప్రాంతీయ సంఘానికీ ప్రభుత్వానికీ అభిప్రాయభేధం వున్నట్టు తేల్తుంది. పెద్దమనుషుల వొప్పందం ప్రకారం ఈ అంశం గవర్నరుకి నివేదించారో లేదో తెలియదు. నివేదించినట్టయితే గవర్నరు నిర్ణయం తుది నిర్ణయంగా పరిణమిస్తుంది.

సమావేశంలో తీర్మానాల్ని అనుసరించి, ప్రభుత్వం తెలంగాణా అధికారుల చేతనే ఈ ఉద్యోగాల నియామకం విచారణ చేయించినది.

భారత రాజ్యాంగం ప్రకారం మొత్తం దేశంలో ఎక్కడైనాసరే ప్రభుత్వోద్యోగ విషయాలలో ఎటువంటి కులమతవర్గ ప్రాంతీయ విచక్షణా వుండ కూడదు. అవసరమైచోట్ల కొన్ని పరిరక్షణలు కల్పించ వచ్చునని శాసనం.

ఆ అనుకులాన్ని పురస్కరించుకుని హిమాచల్‌ప్రదేశ్, మణిపూర్, త్రిపురా, ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణాప్రాంతానికి ఉద్యోగాలలో ప్రాంతీయులికి రిజర్వేషను చేస్తూ పార్లమెంటు శాసనం ఆమోదించినది. ఈ రిజర్వేషను 1956 లో ఆంధ్ర తెలంగాణా నాయకులమధ్య జరిగిన పెద్ద మనుషుల ఒప్పందం ప్రకారం జరిగినది. అనగా తెలంగాణాప్రాంతం ఆంధ్రప్రదేశంలో ఉన్నప్పుడే ఈరిజర్వేషను అమలులో వుంటుంది. తెలంగాణా ప్రత్యేక రాష్ట్రంగావుంటే ఈ పరిరక్షణ చెల్లదు.

తెలంగాణాకి సంబంధించిన ఈ నిబంధన 1957లో అమలులోకి వచ్చినది. దీని ప్రకారం తెలంగాణా ప్రాంతంలో మూడువందల రూపాయలకి మించని జీతం గల ఉద్యోగాలన్నీ ముల్కీలకోసమే ప్రత్యేకించబడినవి. మొదట ఇది అయిదు సంవత్సరాలకి మాత్రం ఏర్పడినది. ఈ నిబంధన మరో అయిదు సంవత్సరాల పాటు పొడిగించినారు. 1969 లో ఇది పూర్తి కావలసి వున్నది గాని, రాష్ట్ర ప్రభుత్వపు కోరికమీద దీన్ని మళ్ళీ పొడిగించినారు.

తెలంగాణా ప్రాంతంలో సుమారు 107,000 నాన్‌గెజెటెడ్ ఉద్యోగాలు వున్నవి. ఈ పన్నెండు సంవత్సరాలలోనూ 1600 ఉపాధ్యాయుల్నీ, 1800 నర్సుల్నీ, మంత్రసానుల్నీ, 400 స్టెనోగ్రాఫర్లనీ, 400 బంట్రోతుల్నీ 700 మంది డ్రైవర్లూ మొదలైన వార్ని ముల్కీలు కానివార్ని తెలంగాణాలో ముల్కీలకోసం ప్రత్యేకించిన ఉద్యోగాలలో నియమించవలసి వచ్చినది.

ఆంధ్రదేశం ఏర్పడిన కొత్తలో తెలంగాణా ప్రాంతంలో విద్యా సౌకర్యాలు ఇప్పుడున్నంత బాగాలేవు. ఉపాధ్యాయుల్ని తరిఫీదుచేసే సంస్థలుకూడా చాలా తక్కువ. ఒకవేపున పాఠశాలల సంఖ్య వృద్ధి అవుతోంటే ఉపాధ్యాయుల కొరత ఏర్పడినది. ముఖ్యంగా లెక్కలు, సైన్సు, ఇంగ్లీషు పాఠాలు చెప్పగలిగిన ముల్కీలు లేరు. ముల్కీలు తయారయేదాకా కూచుంటే పాఠశాలలు నడిచే మార్గం లేదు. అప్పుడు వివిధ తెలంగాణా జిల్లాపరిషత్తుల అధ్యక్షులు ప్రభుత్వం అనుమతి తీసుకుని ఉపాధ్యాయుల్ని ఇతర ప్రాంతాలనించి రప్పించి నియమించినారు. ఈ పన్నెండేళ్ళలో వారి సంఖ్య 1600 కి పెరిగినది. ఈ గైరు ముల్కీల్ని వెయ్యక పోతే తెలంగాణాలో ఇన్ని పాఠశాలలు వుండేవికావు, వున్నా పనిచేసేవికావు. ఇంత విద్యాభివృద్ధి కలిగేది కాదు.

ఇక వైద్యరంగంలోకూడా ఈ పది పన్నెండు సంవత్సరాలలోనూ ఆసుపత్రుల సంఖ్య పెరిగినది. 1956 లో తెలంగాణా ఆసుపత్రులలో పడకల సంఖ్య 5000. 1966 లో 10,000. పడకలు పెరిగినకొద్దీ నర్సుల, మంత్ర సానుల అవసరంకూడా కలుగుతుంది. తెలంగాణాలోనేకాదు, ఆంధ్రలోకూడా ట్రెయినింగు అయిన నర్సుల కొరత ఇప్పుడు కూడా వున్నది. అందుచేత కేరళ

నించి వీర్ని దిగుమతి చెయ్యవలసివచ్చినది. ఆ విధంగా 1800 మంది గైరు ముల్కీలు ప్రత్యేకించిన ఉద్యోగాలలో నియమితులైనారు. ప్రభుత్వాన్ని ఎదుర్కున్న సమస్య ఆసుపత్రులు తెరవకుండా వుండడమా. పడకలు వృద్ధి చెయ్యకుండా వుండడమా. గైరు ముల్కీల్ని నియమించి ప్రాంతపు ఆరోగ్యానికి రక్షణ కల్పించడమా ? పిచ్చి కుదిర్తేగాని పెళ్ళిగాదు, పెళ్ళి అయితేనేగాని పిచ్చి కుదర్దు అనే విషమ పరిస్థితి. ప్రాంతపు ఆరోగ్యం లక్షలకి సంబంధించినది. ఉద్యోగాలు 1800 మాత్రం.

ఈ 1600 ఉపాధ్యాయిలూ, 1800 నర్సులూ, మంత్రసానులూ తప్పనిసరి నియామకాలు. ఇక మిగిలినది 400 మంది చప్రాసీలు. వీరు అటునించి ఆఫీసర్లతో వచ్చినవారు. వీరికి మించుమలె కొందరు బంట్రోతులు తెలంగాణానించి ఆంధ్రకి వెళ్ళినారు. మిగిలినది 700 మంది డ్రైవరువంటి ఉద్యోగాలు చేసేవారు. మొత్తం 4500 మంది గైరు ముల్కీలలోనూ తెలంగాణాలో లభించని, తెలంగాణా అభివృద్ధికీ ఆరోగ్యానికీ అవసరమైన ఉపాధ్యాయుల్ని, నర్సుల్ని, మంత్రసానుల్ని తీసేస్తే మిగిలేవి 1100 మంది బంట్రోతు డ్రైవరు ఉద్యోగాలలో వున్నవారు. ఒకలక్ష ఏడువేల ఉద్యోగాలలో 1100, పోనీ 4500 ఎన్నోవంతు ? వీటికోసం రాష్ట్ర విచ్ఛిన్న కార్యక్రమం తలబెట్టినారంటే విన్నవారు నవ్వరా ? ఇంతాచేసి వడ్ల గింజలో బియ్యపుగింజ.

ఈ వాస్తవిక పరిస్థితి ప్రజలకీ, తెలియని నాయకులికీ కూడా చెప్పవలసిన బాధ్యత ప్రభుత్వానిది, మంత్రులది, ముఖ్యంగా తెలంగాణ మంత్రులది. అటువంటిది ఏమీ జరగలేదు. ఒక్క మంత్రి మాత్రం స్పృశించి వూరుకున్నాడు. ప్రభుత్వం చేసినది ఏమంటే, ఈ 4500 మందినీ 1969 ఫిబ్రవరి 28 లోగా ఆంధ్రకి తర్లించే ప్రయత్నం. ఖాళీలైన పాఠశాలలూ, ఆస్పత్రులూ తెలంగాణావారు లభించే దాకా అల్లాగే వుంచడం. ఆలోచిస్తే ఆశ్చర్యం వేస్తుంది. అత్తమీది కోపం కూతురికి మొప్పం.

నాలుగువేల అయిదువందల సంసారాల్ని, పది పన్నెండేళ్ళనించి తెలంగాణాలో స్థిరపడ్డవార్ని, మన అవసరం వున్నప్పుడు బతిమాలి తెచ్చుకుని, ఈనాడు మీరు గైరుముల్కీలు, మీకు మీ ప్రాంతంలో వేరే ఉద్యోగాలు ఇస్తాం 40 రోజుల్లో తర్లిపొండి అంటే, చూస్తూ లోకం వూరుకున్నా, ఆ బాధకి లోనైనవారు వూరుకోరు. హైకోర్టుకి వెళ్ళినారు. ఒకజడ్జి ముల్కీనిబంధన రాజ్యాంగానికి విరుద్ధం అని తీర్పుచెప్పి వారి బదలాయింపు ఆపుజేసినాడు. ప్రభుత్వం అప్పీలు చేసినది. పైబెంచి నిబంధనలో తప్పులేదుగాని, ఆంధ్రలో కల్పించే అదనపు ఉద్యోగాలు తెలంగాణాలోనేవుంచి, వారి ఇక్కట్లు తగ్గించరాదా అని తునితగువు చేసినది.

ఏ. వి. నరసింహారావు మరి ఎనమందుగురూ కలిసి సుప్రీంకోర్టుకి వెళ్ళినారు. సుప్రీంకోర్టు ముల్కీ నిబంధన రాజ్యాంగ విరుద్ధం అని తీర్పు చెప్పినది. అంటే 12 ఏళ్ళనించీ అంతేగదా !

అప్పుడు ప్రభుత్వం. ఈ రిజర్వేషను రాజ్యాంగ బద్ధంగా చేసే ఏర్పాటు చెయ్యవలసినదని కేంద్ర ప్రభుత్వాన్ని కోరినది. ముఖ్యమంత్రి తెలంగాణా ప్రజలకి శత్రువైతే పీడవిరగడైంది, నన్నేంచేయమంటారని వూరుకునేవాడు.

ఈ పరిస్థితి ఎదుర్కొనేందుకు ముఖ్యమంత్రి తెలంగాణాకి ప్రత్యేకంగా 2000 ఉద్యోగాలు కొత్తగా కల్పించి, వాటికి అభ్యర్థుల్ని ఎన్నుకునే అధికారం జిల్లా కలెక్టర్లకే ఇచ్చినాడు. ఈ ఉద్యోగాలన్నీ భర్తీ అయినవి.

సుప్రీంకోర్టు తీర్పు ప్రత్యేక తెలంగాణా ఏర్పాటుకి బలం చేకూర్చిందని అనుకోడం పొరబాటు. ఎందుకంటే ప్రత్యేక తెలంగాణా రాష్ట్రంలో ముల్కీ రక్షణలు వుండవు.

అఖిలపక్ష సమావేశంలో చర్చకి వచ్చిన రెండు అంశాలలోనూ మిగిలినది 'తెలంగాణా మిగులు నిధులు'. జనవరి 19 ఒప్పందం ప్రకారం అకౌంటెంటు జనరల్ హోదా కలిగిక ఒక ఉద్యోగిని ఢిల్లీని అడిగి పిలిపించినారు. ఆయన దాక్షిణాత్యుడు కాడు. పంజాబీ. పేరు కుమారలలిత్. ఆయన హైద్రాబాదువచ్చి ప్రాంతీయ సంఘ అధ్యక్షుడితోసహా అవసరమైనవార్ని కలిసి విషయాలు విచారించి తననివేదిక ఢిల్లీలోనే సమర్పించినాడు. ఆ నివేదిక ప్రకారం తేలిన తెలంగాణా మిగులు 34.10 కోట్ల రూపాయలు. కొన్ని పద్దుల విషయంలో ఇంకా నిర్ణయం జరగలేదు. ఆ నిర్ణయాలు జరిగిన తర్వాత నికరంగా తెలంగాణా మిగులు మొత్తం తేలుతుంది. 1968 నవంబరులో శాసనసభలో గవర్నరు ప్రకటించిన 30 కోట్ల చిల్లరకీ లలిత్ లెక్కకీ ఆట్టే వ్యత్యాసంలేదు. పూర్తి నిర్ణయాలు జరిగితే మరో అయిదారు కోట్లు వుంటుందనుకున్నా, 40 కోట్లు అవుతుంది. పోనీ 50 కోట్లు అనుకుందాం. ఈ సొమ్ము నాలుగో ప్రణాళికాకాలంలో ఖర్చుచేస్తాం అని ప్రభుత్వం పదేపదే ప్రకటించినది. రెండవ ప్రణాళిక కాలంలో కూడిన మిగులు మూడో ప్రణాళికా కాలంలో ఖర్చుచేసినారు. నాలుగో ప్రణాళిక ఈ ఆందోళన కాలానికి ఇంకా అమలులోకి రాలేదు. ఈ ధనం, ఆంధ్ర ప్రాబల్యం వున్నదని ప్రచారంచేసే, ప్రభుత్వం తర్లించుకుపోయి ఆంధ్ర ప్రాంతంలో ఖర్చుచేసినదనీ, ఆ విధంగా ఆంధ్రులు తెలంగాణా సొమ్ము అపహరించినారనీ అసత్య ప్రచారం చేసి తెలంగాణా ప్రజలలో మరింత ద్వేష రోషాలు రేకెత్తించినారు కొందరు రాజకీయవేత్తలు. ఏమీ జరగని పరిస్థితులలోనే ఇంత అల్లరి చేయించిన నాయకులు నిజంగా ఏమైనా జరిగితే వూరుకునేవారా ? ఇన్నాళ్ళెందుకు ? తీరాచూస్తే భార్గవా కమిటీవారు తేల్చిన మిగులు నిధులు 28.34 కోట్లు మాత్రం.

ఎతావతా తేలినదేమంటే అఖిలపక్ష సమావేశంలో చర్చించిన ఉద్యోగుల విషయంలోనూ, తెలంగాణా మిగులునిధుల విషయంలోనూ కూడా నిజమైన 'లోపం' ఏమీ జరగలేదనీ, అవి లోపాలని వొప్పుకోడంలో ముఖ్యమంత్రి తరువాత తాను రేడియోలో చెప్పినట్టు 'గాంధీ తత్వం'తోనే ప్రవర్తించినట్టూ తెలిసినది.

సమావేశంలో అందరూ దుయ్యబట్టుకుంటే భీతావహుడై, ఖంగారులో 'లోపాలు' అని అంగీకరించినాడనీ, దాంతో ఉద్యమం రెచ్చిపోయినదనీ ఒక ఉత్తరాది పత్రిక వ్రాసినది. విపరీతంగా ఆందోళన జరుగుతున్న విషమసమయంలో ఢిల్లీ చర్చలకి వెళ్ళిన బ్రహ్మానందరెడ్డిని చూసి, 'మనిషి నిశ్చలంగా, ప్రశాంతంగా' వున్నాడని వ్రాసినారు పత్రికావిలేఖర్లు. భయపడినమాట అబద్ధం. ఎప్పుడూ భయపడలేదు. అతిమంచికి పోయి ముప్పు తెచ్చుకున్నాడు. అసలు సంగతి సభవారికి చెప్పివున్నట్లైతే వొదిలిపోయేది. ఎవరో ప్రకటన వ్రాయగా 'లోపాలు' అన్నమాటకి అంగీకరించినాడు. రాజకీయంగా కొండంత తప్పుజేసినాడు.

ఇంత తబిశీళ్ళతో ఈ విషయాలు పరిశీలించడంవల్ల బోధపడేదేమంటే చర్చించిన రెండు అంశాలూ కించిద్విషయాలు. తక్కిన రక్షణల ప్రసక్తి రాలేదు. అనగా అవి అమలుజరిగిఉండాలి, లేదా వారు పట్టించుకోనవసరంలేనంత చిన్న సంగతులు అయివుండాలి. అసలు రాజకీయ విషయం ప్రకటనలోలేదు. అది ఉపముఖ్యమంత్రి నియామకానికి సంబంధించినది. 1960-62 సంజీవయ్యహయాంలో తప్ప, ఈ పన్నెండేళ్ళలో ఆదిలోగాని, అంతంలోగాని ఆ పదవిలేదు.

అయితే విద్యార్థులూ, నాయకులూ కూడా ఇన్నాళ్ళూ 1100 డ్రైవరు, బంట్రోతు ఉద్యోగాల విషయంలోనూ, ఖర్చుపెట్టవలసిన తరుణం రానటువంటి మిగులుకోసం ఆందోళన చేసినారా ? ఎప్పటికీకాదు. ఈ ఆందోళనకి తెలంగాణా పరిరక్షణల నిర్లక్ష్యం అనేది ఆధారంలేని సాకేగాని, అసలు కారణంకాదు. కాకాని వెంకటరత్నం ఢిల్లీనాయకులతో బహిరంగంగా చెప్పినట్టు తెలంగాణా ఆందోళనకి మూలశక్తి 'అదృశ్యహస్తాలు'. తెలుగుమాట్లాడే ప్రజలమధ్య వైషమ్యం కల్పించి ఆంధ్రప్రదేశ రాష్ట్ర విచ్ఛిత్తి సంకల్పించినవి ఆ పాడుచేతులు. డబ్బిచ్చిమద్దత్తు ఇచ్చినవి తెలుగుచేతులుకావు.

1969 జనవరి 26 రిపబ్లిక్‌డే సందేశంలో ఆ విషయం ప్రస్తావించినాడు బ్రహ్మానందరెడ్డి :

"భారతదేశం తన సుదీర్ఘ చరిత్రలో ఎన్నో విదేశీయ దండయాత్రలు ధైర్యంతో, స్థైర్యంతో ఎదుర్కొన్నది. కాని, జాతిజీవితమే ఛిన్నాభిన్నం చెయ్యగలిగిన అంతశ్శత్రువుల పీడ ఎదుర్కోవడం ఒకపెద్ద సమస్యగా పరిణమించి

నది. ఆందోళనా స్వభావం, దౌర్జన్యతత్వం, ప్రాంతీయ దురభిమానం దేశక్రమాభి వృద్ధికి ఆటంకాలైనవి.

"పన్నెండు సంవత్సరాలక్రితం అవతరించిన ఆంధ్రప్రదేశ రాష్ట్రం చరితార్థమైన సంస్కృతీ సమ్మేళనం. అభ్యుదయ శ్రేయస్కాములైన మనపెద్దల చిరకాల కృషి ఫలితం. విదేశీయుల కుతంత్రాలవల్ల, దేశీయులనీరసం, అవినీతివల్ల పంచ బంగాళమైన తెలుగుజాతి సంలీనం. ఈ పిత్రార్జితం సంరక్షించుకుని, మనం సుఖంగా అనుభవించాలంటే, మనవిధ్యుక్త ధర్మాలు మనం నెరవేర్చాలి. క్రమ శిక్షణతో ప్రవర్తించి మంచి అన్నది పెంచాలి. భావిభాగ్యోదయానికి దేశభక్తితో కృషిచెయ్యాలి. ఎవరికివారే యమునాతీరే అనే ప్రకృతితో ప్రవర్తిస్తే, మనకేకాదు యావద్భారతదేశ శ్రేయస్సుకే భంగం."



# ప్రథాని ప్రకాళిక

అఖిలపక్ష సమావేశం చేసిన ప్రకటనలో అంశాలు మాకు తృప్తికరంగా లేవని ఉస్మానియా విద్యార్థి సంఘం కార్యాచరణ సమితి తిరస్కరించినది. మధ్యే మార్గం అనుసరిస్తున్న తెలంగాణా ప్రాంతీయసంఘ అధ్యక్షుడు చొక్కారావు రక్షణలు సురక్షితంగా వున్నాయని ప్రజానీకానికి నచ్చచెప్పడానికిగాను ఒక కమిటీ ఏర్పాటు చేసినాడు. అందులో తానుగాక అచ్యుతరెడ్డి, హైగ్రీవాచారి సభ్యులు. వీరిద్దరూ తెలంగాణ ప్రాంతీయసంఘ మాజీ అధ్యక్షులు. చొక్కారావు మధ్యేమార్గ సందేశం వినేవారు కనబడలేదు. జనవరి 28న నల్లగొండలో సర్వేశాఖలో పనిచేసే ఉద్యోగి రంగాచారిమీద పెట్రోలుపోసి అంటించి సజీవదహనం చేసినారు. ఆంధ్రప్రదేశమేకాదు, ప్రపంచమే హడలిపోయినది. జనవరి ఆఖరి రెండు రోజులూ వరంగల్లునగరం యమలోకతుల్యమైనది. లూటీలు, గృహదహనాలు, స్త్రీలపట్ల అత్యాచారాలు. మిలిటరీ అదుపుతోగాని ఆగలేదు. కోస్తాజిల్లాలనించివచ్చి అక్కడ ఉద్యోగ, వృత్తిధర్మాలలో జీవితం గడుపుతున్న తెలుగువారు ఆ పిల్లబాలాదీ ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని పారిపోవలసి వచ్చినది.

ఫెబ్రువరి కార్మికుల ప్రవేశంతో ప్రారంభించినది. రామగుండంలోనూ, శ్రీశైలంలోనూ ఉభయప్రాంతాల కార్మికులమధ్యా దొమ్మీలు జరిగినవి. పోలీసు తుపాకులు పేలినవి. ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి కేంద్ర హోంమంత్రి చవన్‌తో పరిస్థితులు చర్చించినాడు. అప్పటికే ఆంధ్రప్రదేశ మంత్రివర్గంలో ఉభయప్రాంతాల వారిమధ్యా బీటలు గోచరించినవి. 6వ తారీఖున ముఖ్యమంత్రి సహమంత్రుల రాజీనామాలు ఇవ్వవలసినదిగా కోరినాడు కాని ఏమీ జరగలేదు. మధ్యలో లోక సభాపతి సంజీవరెడ్డి ఇంట్లో కల్యాణం వచ్చినది. ఆ శుభకార్యం తిరుపతి సమీ

పంలో తిరుచానూరులో జరిగినది. ఆ సందర్భంలో ప్రధాని ఇందిరతోసహా దేశ నాయకులంతా ఏదోపనిమీద తిరుపతి విజయంచేసి శ్రీవేంకటేశ్వరస్వామి దర్శనం చేసుకుని సంజీవరెడ్డి ఆతిథ్యం అందుకున్నారు. ఆ తరుణంలో బ్రహ్మానందరెడ్డి తిరుపతి వస్తాడు, తెలంగాణా పరిస్థితులు అంతాకలిసి అక్కడ ఆలోచిస్తామన్నాడు కాంగ్రెసు అధ్యక్షుడు నిజలింగప్ప. విందుభోజనాలలో ఆంధ్రప్రదేశ రుగ్మతకి మందులసంగతి ఎవరికీ పట్టినట్టులేదు. ఆందోళన అన్ని దౌర్జన్య కార్యక్రమాల తోనూ జరుగుతూనేవున్నది. కోస్తాజిల్లావారి పలాయనంకూడా జరుగుతూనేవున్నది. విజయవాడలో వందలాది జనానికి శరణార్థి నివాసాలు ఏర్పాటు చెయ్యవలసివచ్చి నది. సరిగ్గా ఇరవై సంవత్సరాలకి పూర్వం రజాకర్ల దౌర్జన్యానికి తాళలేక ఇళ్లూ వాకిళ్ళూ విడిచిపెట్టివచ్చిన సోదర తెలంగాణా ఆంధ్రులికి ఆ బెజవాడలోనే విడు దులు ఏర్పాటు చేసినారు. ఈ రెండు సంఘటనలూ తిలకించినవారు విధివిలాసం అనుకున్నారు.

ఫిబ్రవరి 17న ఆంధ్రప్రదేశ స్వాతంత్ర్యపార్టీ నాయకుడూ, శాసనసభలో ప్రతిపక్షనాయకుడూ అయిన గౌతు లచ్చన్న రాష్ట్రపతిపాలన పెడితేగాని పరిస్థితులు బాగుపడవన్నాడు. వెంటనే కాంగ్రెసు అధ్యక్షుడు నిజలింగప్ప ఎంతమాత్రం అవసరంలేదన్నాడు. చొక్కారావు ప్రత్యేక తెలంగాణావాదన ఖండిస్తూనే వున్నాడు.

ఈలోపుగా ముఖ్యమంత్రి తెలంగాణాజిల్లాలు తొమ్మిదింటికీ ఒకోకోటి రూపా యల చొప్పున అభివృద్ధి పథకాలకోసం మంజూరు చేసినాడు. ఈ సొమ్ము జిల్లా పరిషత్తులపరంగా ఇచ్చినాడు.

ఫిబ్రవరి 19న మాజీఉపముఖ్యమంత్రి కొండా వెంకటరంగారెడ్డి ఒక ప్రకటన చేసినాడు. ఆ ప్రకటనలో ఆయన ముఖ్యమంత్రి తెలంగాణా శ్రేయస్సు కోసం తీసుకుంటున్న చర్యలు మంచివన్నాడు. తెలంగాణా ప్రజలుగాని, నాయకులు గాని, తొందరపడి ఏంచెయ్యవద్దు, ఏమీ అనవద్దు అని సలహా ఇచ్చినాడు. ప్రస్తుత పరిస్థితికి బ్రహ్మానందరెడ్డి ఒకడే కారకుడుకాడు, ఆయనకి ముందు ఇద్దరు ముఖ్యమంత్రులు చేసిన నిర్లక్ష్యమే తెలంగాణావారి అసంతృప్తికి కారణం. సంజీవ రెడ్డి పెద్దమనుషుల ఒప్పందమే మర్చిపోయినాడు. తెలంగాణారక్షణలే ఆంధ్రప్రదేశ నిర్మాణానికి పునాదులు. అవి అమలు జరక్కపోతే సత్యాగ్రహమే శరణ్యం. ఈలోపుగా బ్రహ్మానందరెడ్డి తగుచర్యలు తీసుకుంటున్నాడు గనక ప్రజలు తమ కష్టనష్టాలు ఆయనకి తెలియజెయ్యాలి. అన్నాడు. తొందరపడి మాట్లాడిన ఒక మంత్రిని మందలించినాడు.

తరవాత తరవాత వెంకటరంగారెడ్డి ప్రత్యేక తెలంగాణా వాదనకే దిగినాడు. సత్యాగ్రహోద్యమం ప్రారంభంచేస్తూ ముఖ్యమంత్రి రాజీనామాతప్ప ఆందోళన

ఆగిపోడానికి మార్గంలేదన్నాడు. ఆయన రాజీనామా ఇచ్చినతర్వాత అలజడి తగ్గిపోకపోతే తన కంఠం ఇస్తానన్నాడు.

ఫెబ్రువరి నెలాఖరికి ఎన్. జి. వోలు, ఉపాధ్యాయులూ ఉద్యమంలో ప్రవేశించి ఉపన్యాసాలు ప్రారంభించినారు. డాక్టర్లు కొందరూ, వర్తకులు మరి కొందరూకూడా మద్దతు ఇవ్వడం మొదలైనది.

మార్చి మొదట్లో కేబినెట్టులో అభిప్రాయభేదాలు తీవ్రతరమైనవి. ముఖ్యమంత్రికి తెలంగాణా తలనొప్పి చాలనట్టు, రాయలసీమ కడుపునొప్పి బయలుదేరినది. మార్చి 4 న రాజధానీనగరంలో మంత్రి తిమ్మారెడ్డి అధ్యక్షతన రాయలసీమ సదస్సు సమావేశమైనది. ఇందులో నెల్లూరుజిల్లాకూడా చేరినది. నాలుగువందలకోట్ల రూపాయల ఖర్చుతో నెల్లూరు రాయలసీమ సర్వతోముఖాభివృద్ధికి బృహత్ ప్రణాళిక తయారు చెయ్యాలన్నారు. పంచవర్ష ప్రణాళిక కార్యక్రమంతో ప్రమేయంలేకుండా, 15 సంవత్సరాలలో ఈ పథకం అమలుజరపాలన్నారు. ఆంధ్రప్రదేశ మంత్రి వర్గంలో రాయలసీమకి మూడోవంతు ప్రాతినిథ్యం కావాలన్నారు. తమ ప్రాంతీయ అభివృద్ధి లక్ష్యాలు సాధించే నిమిత్తం నెల్లూరుతోసహా అయిదుజిల్లాల ప్రతినిధులతో ఒక ఉపసంఘం నియమించినారు. ఇద్దరు రాయలసీమ మంత్రులలోసహా, శాసన సభ్యులు, జిల్లా పరిషత్తుల, సమితుల అధ్యక్షులు, నెల్లూరుజిల్లాప్రతినిధులూ ఈ సభకి హాజరైనారు.

ఈ సదస్సు పర్యవసానమే తరువాత ప్రొద్దుటూరులో మాజీలోకసభాపతి అనంతశయనం అయ్యంగారి అధ్యక్షతన జరిగిన రాయలసీమ మహాసభ. ఈ సభ వారు తయారుచేసిన నివేదికలూ, తీర్మానాలూ, సభలో చేసిన ఉపన్యాసాలలో విషయాలూ తెలుసుకునేవరకూ రాయలసీమ తెలంగాణాకంటెకూడా వెనకబడిన ప్రాంతం అని చాలామందికి తెలియదు. ప్రకృతీ, ప్రభుత్వమూకూడా రాయలసీమకి అన్యాయం చేసినారు.

ఆంధ్రప్రదేశంలో మూడు భాగాలలోనూ తెలంగాణా విస్తీర్ణం ఎక్కువ, 39.4 శాతం. కోస్తా 33.2; రాయలసీమ 27.4 శాతం. ఇక్కడ ప్రకృతిసంపద తక్కువగనగ జనసాంద్రత తక్కువ. డెబ్బైలక్షలజనాభాతో ఈ సీమవారు మొత్తంరాష్ట్రజనాభాలో 20 శాతం మాత్రం. మూడు ప్రాంతాలలోనూ ఇక్కడ వర్షపాతం తక్కువ. శాశ్వతజలాధారాలు తక్కువ. నిస్సారమైనభూమి ఎక్కువ. ఈ కారణాలవల్ల రాయలసీమ శాశ్వతక్షామసీమగా వర్ధిల్లుతున్నది. రాళ్లసీమ అని దీనికి మారుపేరు. మద్రాసురాష్ట్రంలోవున్నప్పుడుకూడా ఈ సీమవారికి న్యాయం జరగలేదు. అందుకనే ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలంటే రాయలసీమకి రక్షణలు కావాలనేవాడు సంజీవరెడ్డి. ఆయన పూర్వనాయకులుకూడా అల్లాగే కోరినారు.

తత్ఫలితమే శ్రీబాగ్ ఒడంబడిక. కోస్తాజిల్లాలతోకలిపి రాయలసీమ ఆంధ్రరాష్ట్రంగా ఏర్పడడానికి శ్రీబాగ్ వొడంబడికే ప్రాతిపదిక. ఆంధ్రరాష్ట్రంలోగాని, ఆంధ్ర ప్రదేశం ఏర్పడిన తర్వాతగాని, 1964 వరకూ రాజకీయనాయకత్వమే లభించనది గాని, రాయలసీమలో అవసరమైన అభివృద్ధి జరగలేదు. ఈ విషయమై రెండు సభలలోనూ తీవ్రమైన ఉపన్యాసాలు నడిచినవి. వెనుకబడిన తనమే అసంతృప్తికి కారణమైతే, అది రాయలసీమవాసుల హక్కు. నిజానికి ఈ పదిపన్నెండు సంవత్సరాలలోనూ తెలంగాణాలో జరిగిన అభివృద్ధి రాయలసీమలో కనబడదు.

తెలంగాణా ఆందోళనతో, రాయలసీమసదస్సుతోపాటు అంత చురుగ్గానూ రాష్ట్ర శాసనసభకూడా నడుస్తున్నది. మార్చి 9 న ప్రతిపక్షనాయకుడైన గౌతు లచ్చన్న మరి పన్నెండుగురూకలిసి ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఒక తీర్మానం ప్రతి పాదించినారు. రాష్ట్రంలో భావసమైక్యత సమకూర్చలేకపోయినందుకు ప్రతి పాదకులు ప్రభుత్వంమీద తమ అభిశంసన తెలియజేసినారు. ఆ సందర్భంలో మాట్లాడుతూ లచ్చన ముఖ్యమంత్రిని రాజీనామా ఇమ్మన్నాడు. ఈ తీర్మానంమీద మూడు రోజులుచర్చ జరిగినది. ముఖ్యమంత్రి మాట్లాడుతూ అన్నాడు: నావిధులు నేను నెరవేర్చాలి. నాబాధ్యతలు నేను నిర్వహించాలి. ప్రజలందరిలోనూ, ఇటు తెలంగాణాకాని. అటు ఆంధ్ర ప్రాంతంగాని. విశ్వాసం కలిగించవలసిన అవసరం వున్నది. వారన్నారు, వీరన్నారని, నేను నాస్థానంవిడిచిపెట్టి పారిపోను. నేనటు వంటి రకంకాదు. అది నాస్వభావంకాదు.

ఈ చర్చలలోకూడా లేచినవి రెండే సమస్యలు. ఒకటి తెలంగాణా మిగులు నిధులు, రెండు. ఉద్యోగుల ఫిర్యాదులు.

కొన్నాళ్లుగా మంత్రి కొండాలక్ష్మణ్ తెలంగాణాకి ఆంధ్రప్రదేశంలో అంత ర్భాగంగానే స్వతంత్ర ప్రతిపత్తి కావాలంటున్నాడు. ఈ విషయమై కేంద్ర మంత్రులతోటీ, కేంద్ర నాయకులతోటీ చర్చించడానికి ఢిల్లీ వెళ్లినాడు. వారాయన మాట చెవిని బెట్టలేదు. ఢిల్లీలోనేవున్న ముఖ్యమంత్రికి తన రాజీనామా అందజేసి తిరిగి వచ్చినాడు. చెన్నారెడ్డితో సంప్రదింపులు ప్రారంభించినాడు.

బరిమీాదవున్న తెలంగాణా ఎన్. జి. వో సంఘ అధ్యక్షుడు 'మంత్రుల్ని బంధిస్తా' నన్నాడు. అతన్నే బంధించినారు. కొండాలక్ష్మణ్, ఉపాధ్యాయులూ అతని నిర్బంధం అన్యాయం, విడుదల చెయ్యమని ప్రకటన చేసినారు.

అదే సమయంలో సుప్రీంకోర్టు ముల్కీనిబంధన రాజ్యాంగ విరుద్ధమని తీర్పు చెప్పినది. ఉద్యోగుల ఆందోళన ఎక్కువవైనది. రాష్ట్రప్రభుత్వం కేంద్రాన్ని ఈ నిబంధనకి రాజ్యాంగబద్ధమైన ఏర్పాటు చెయ్యవలసినదిగా కోరినది.

ఏప్రిల్ మొదట్లోనే తెలంగాణా సమస్య కేంద్ర ప్రభుత్వసమస్యగా పరిణమించినది. కేబినెట్టులో తెలంగాణా నాయకుల కోరికలు చర్చించినారు. ప్రత్యేక తెలంగాణా ఏర్పాటుచేసే ప్రసక్తి లేదన్నారు. తెలంగాణావారి అసంతృప్తి నివారణ చెయ్యడానికి తక్కినచర్య అంతా తీసుకునేందుకు కేంద్రం సిద్ధం అని స్పష్టం చేసినారు.

మొదటివారంలో ఢిల్లీలో ముఖ్యమంత్రుల సమావేశం జరిగినది. బ్రహ్మానంద రెడ్డి ఢిల్లీలోనే వున్నాడు. అటోఇటో పార్లమెంటు ఆంధ్రసభ్యులు కొందరు లోక సభాపతి సంజీవరెడ్డిని కలిసినారు. ఒకపార్లమెంటు సభ్యుల ఉపసంఘాన్ని పరిస్థితులు పరిశీలించడానికి ఆంధ్రప్రదేశం పంపించాలనే సలహా వచ్చినది. కేంద్ర హోంమంత్రి చవన్ సభలో మాట్లాడుతూ అటువంటి సంఘం పంపించే ఉద్దేశం ప్రభుత్వానికి లేదన్నాడు. ఆ విషయం సభాధ్యక్షుడు ఆలోచిస్తే ఆలోచించవచ్చునన్నాడు. ప్రత్యేకతెలంగాణా ఏర్పాటు చెయ్యడంలేదు. ముఖ్యమంత్రి రాజీనామా ఇవ్వవలసిన అవసరంలేదు అని చెప్పినాడు.

పార్లమెంటరీ డెలిగేషన్ విషయమై మీ అభిప్రాయం ఏమిటని పత్రికా విలేఖర్లు బ్రహ్మానందరెడ్డిని అడిగినారు. "దానికి నేను వ్యతిరేకం. అది రాష్ట్ర వ్యవహారాలలో జోక్యం కలుగజేసుకోవడం అవుతుంది". అని జవాబిచ్చినాడు. మర్నాడు పార్లమెంటులో 'ప్రివిలేజెస్' తీర్మానం వచ్చినది. ముఖ్యమంత్రి అలా అనకూడదని కొందరు సభ్యులు రభసచేసినారు.

ముఖ్యమంత్రిని సందర్శించిన పత్రికా విలేఖరులు ఆయన నిశ్చలంగా కోప తాపాలు లేకుండా శాంతంగా వున్నాడని వ్రాసినారు. "నిన్ను రాళ్లతో కొట్టారుట గదా!" అని అడగినాడొక విలేఖరి. "చూస్తున్నారుగాదా, నేను రాళ్లదెబ్బలు తిన్నట్టువున్నానా?" అని అడిగినాడు బ్రహ్మానందరెడ్డి.

ముఖ్యమంత్రి తీసుకున్న చర్యలవల్ల రాష్ట్రంలో క్రమంగా శాంతి చేకూరగల దన్నాడు ప్రదేశకాంగ్రెసు అధ్యక్షుడు కాకాని వెంకటరత్నం. ఈ ఆందోళనకి వెనకాల అదృశ్యహస్తాలు వున్నాయి అన్నాడు.

ఏప్రిల్ మొదటి వారంలో, ముఖ్యమంత్రి కోరికమీద, కేంద్ర హోంశాఖ కార్యదర్శి. మరి నలుగురు ఉన్నతాధికారులూ హైద్రాబాదు వచ్చినారు. తెలంగాణా ఉన్నతోద్యోగుల సమస్యలు చర్చించినారు.

ప్రధానమంత్రి తెలంగాణా సమస్య చర్చించడానికి ఢిల్లీలో పెద్దల సమావేశం ఆహ్వానించినది. ఆహ్వానితులు: సంజీవరెడ్డి, కామరాజు, చవన్, బ్రహ్మానందరెడ్డి, కాకాని వెంకటరత్నం, చెన్నారెడ్డి, వి. బి. రాజు, చొక్కారావు, నూకల రామచంద్రా

రెడ్డి. ఈ సమావేశం ఏప్రిల్ 10 న జరగవలసివున్నది. తొమ్మిదో తారీఖుని ప్రధాని పార్లమెంటులో ప్రతిపక్ష నాయకులందర్నీ కలిసి తెలంగాణా సమస్య చర్చించినది. అందరూ ఆంధ్రప్రదేశ్ విభజించే పని లేదన్నారు. పరిరక్షణలు మాత్రం అమలుజరిపి తీరాలన్నారు.

పదో తారీఖు సమావేశానికి తాను లోకసభాపతి గనుక సంజీవరెడ్డి రాలేదు. తక్కినవారంతా హాజరైనారు. సమావేశం రెండు రోజులు జరిగినది. నిర్మొహమాటంగా చర్చలు జరిగినవి. ఆ సమావేశ ఫలితంగా ప్రధాని ఒక అష్టసూత్ర ప్రణాళిక ప్రకటించినది. సత్వర చర్యలు తీసుకోదానికి నిశ్చయం జరిగినది కనుక ఆందోళన ఆపుజెయ్యమని తెలంగాణా నాయకుల్ని కోరినది. ఈ ప్రకటన ప్రధాని పార్లమెంటులో 11 వ తారీఖు సాయంకాలం చేసినది. ప్రధాని ప్రణాళిక ప్రకారం తెలంగాణా సమస్య పరిష్కారానికి అయిదు ఉన్నతాధికార సంఘాలు నియమించాలని నిర్ణయం జరిగినది. 1. మిగులు నిధులు నిర్ణయించడానికి; 2. తెలంగాణా అభివృద్ధికి; 3. ప్రాంతంలో ప్రణాళికలు అమలు చెయ్యడానికి; 4. ఉద్యోగాల ముల్కీ నిబంధనకి రాజ్యాంగ హామీ కల్పించడానికి; 5. ప్రభుత్వోద్యోగుల వ్యవహారాలు పరిశీలించడానికి. ఢిల్లీ సమావేశ ఫలితంగా ముఖ్యమంత్రి డిప్యూటీ ఛీఫ్ మినిస్టరు ఉద్యోగం పునరుద్ధరించి తెలంగాణా నాయకుణ్ణి నియమించడానికి అంగీకరించినాడు.

అష్టసూత్ర ప్రణాళిక పార్లమెంటుకి సమర్పిస్తూ ప్రధాని ఆంధ్రప్రదేశ సమైక్య స్వరూపం సంరక్షించవలసిన అవసరం వక్కాణించినది. ప్రధాని ప్రకటన :

గత కొద్ది వారాలుగా నేను ప్రభుత్వంలోని, పార్టీలోని, పార్లమెంటులోని ప్రతిపక్ష నాయకులతోనూ, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రితోనూ, తెలంగాణాలోనూ, ఆంధ్రప్రదేశ్‌లోని మిగతా ప్రాంతాలలోని కొన్ని పార్టీల నాయకులతోనూ తదితరులతోనూ ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం నెలకొనివున్న పరిస్థితిపై చర్చలు జరిపాను.

తెలంగాణాలో నివసిస్తున్న ప్రజల న్యాయమైన సమస్యల పరిష్కారానికి నిర్మాణాత్మక చర్యలు రూపొందించడానికి ఈ చర్చలు అరమరికలు ఏమీలేని వాతావరణంలో కొనసాగింపబడినవి. ఆంధ్రప్రదేశ్ సమగ్రతను, ఐక్యతను కొనసాగిస్తూనూ, మరింత పరిపుష్టం చేస్తూనూ అదే సమయంలో తెలంగాణా ప్రాంతంలోని ప్రజల సత్వర అవసరాలనూ, దీర్ఘకాలిక అవసరాలనూ తీర్చడంకోసం త్వరితంగా నిర్మాణాత్మక చర్యలు తీసుకోవడంలో గల ప్రాముఖ్యాన్ని మనం దృష్టిలో పెట్టుకోవాలి. తెలంగాణా అభివృద్ధి గతినీ, ఉద్యోగావకాశాల విస్తృతీకరణనూ మరింత త్వరితం చేయడమూ, ఆంధ్రప్రదేశ్‌లో నివసిస్తున్న ప్రజల సహకారంతోనూ, ఉమ్మడి కృషితోనూ రాష్ట్రంలో అన్ని ప్రాంతాల సమగ్రాభివృద్ధి సాధించడానికి అవకాశాలు కల్పించడమూ— ఇదీ ప్రభుత్వధ్యేయం.

ఈ ధ్యేయ సాధనకు కొన్ని ప్రత్యేక చర్యలు నిర్ణయింపబడినవి.

# అష్టసూత్ర పథకం

1. రిటైరైన, లేక ఇప్పుడు పనిలోవున్న సుప్రీంకోర్టు న్యాయమూర్తి అధ్యక్షతన, రాష్ట్ర ఆర్థిక వ్యవహారాలు క్షుణ్ణంగా తెలిసిన ఒక ఆర్థిక నిపుణుడూ, కంప్ట్రోలరు అండ్ ఆడిటరు జనరలు కార్యాలయంనుండి ఒక సీనియర్ ప్రతినిధీ సభ్యులుగా ఒక ఉన్నతాధికార సంఘం నియమింపబడుతుంది. తెలంగాణా నిధులకు సంబంధించిన భిన్న భిన్నంగా వున్న అంచనాలను, అభ్యర్థనలను పరిశీలించి తెలంగాణ ప్రాంతపు అభివృద్ధిపై ఖర్చుచేయ వలసివుండిన మిగులు నిధులను ఈ సంఘం నిర్ధారిస్తుంది. వచ్చే నెలాఖరులోగా ఈ సంఘం తన నివేదికను కేంద్ర ప్రభుత్వానికి సమర్పిస్తుంది.

2. మిగులు నిధుల మొత్తం మేరకు ఎల్లా ధనాన్ని సేకరించాలన్న విషయం నిర్ణయించడానికై కేంద్ర ఆర్థిక, హోం మంత్రిత్వ శాఖల ప్రతినిధులు, ప్రణాళికా సంఘం ప్రతినిధులు, రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధులు వెంటనే చర్చలు ప్రారంభిస్తారు.

3. ముఖ్యమంత్రి సూచనపై తెలంగాణా అభివృద్ధికి ఒక ఉన్నతాధికార సంఘాన్ని వెంటనే ఏర్పర్చాలని అంగీకరించడం జరిగినది. ఈ సంఘానికి ముఖ్య మంత్రి అధ్యక్షులుగా వుంటారు. ప్రణాళికా సంఘ సభ్యులు ఒకరు, రాష్ట్ర మంత్రి వర్గంలోని తెలంగాణా మంత్రులూ, తెలంగాణా ప్రాంతీయ సంఘ అధ్యక్షుడూ ఇందులో సభ్యులుగా వ్యవహరిస్తారు.

పంచవర్ష ప్రణాళికల్లో తెలంగాణా ప్రాంతంలో అమలు జరుపవలసిన పథ కాలనూ, కార్యక్రమాలనూ, సాధించవలసిన భౌతిక ఆర్థిక లక్ష్యాలనూ నిర్దేశించడం ఈ సంఘం ప్రధాన విధుల్లో ఒకటి. ఈ పథకాలూ, కార్యక్రమాలూ సరిగా అమలు

జరుగుతున్నాయా లేదా అనే విషయాల్నికూడా ఈ సంఘం సమీక్ష చేస్తుంది. ఈ విషయంలో రాష్ట్ర ప్రభుత్వానికి అవసరమైన సలహాలను కూడా ఈ సంఘం అందజేస్తుంది.

4. ప్రణాళికా కార్యక్రమాలు, పథకాలు అమలు జరుగుతున్న తీరును విపులంగా సమీక్ష చేయడానికి ఒక ప్రణాళికల అమలు సంఘం కూడా నియమింప బడుతుంది. ఈ సంఘానికి ప్రణాళికా సంఘం ప్రతినిధి ఒకరు అధ్యక్షులుగా వుంటారు. కేంద్ర ఆర్థిక హోం శాఖల ప్రతినిధులు, రాష్ట ప్రభుత్వ ప్రతినిధులు కూడా ఈ సంఘంలో ఉంటారు.

ఈ సంఘం ప్రతి మూడు నెలలకు ఒకసారి సమావేశమై ప్రధానమంత్రికి, ముఖ్యమంత్రికి నివేదికలు సమర్పిస్తుంది.

5. ఈ నిర్ణయాలు సత్వరం శక్తివంతంగా అమలు జరపడానికీ, వాటి సమన్వయానికీ తెలంగాణ ప్రాంతం సమస్యల బాధ్యత కలిగిన ప్రత్యేక అధికారు లకు ఇంకా ఎక్కువ అధికారాలను ఇచ్చే విషయమై ముఖ్యమంత్రి పరిశీలిస్తారు.

6. తెలంగాణ ప్రాంతం ప్రజల ఉద్యోగాల విషయంలో రాజ్యాంగ బద్ధ మైన తగు హామీలు ఇచ్చే అవకాశాన్ని గురించి భారత ప్రభుత్వం, న్యాయశాస్త్ర వేత్తల బృందంతో కలిసి పరిశీలిస్తుంది.

7. తెలంగాణాలో ప్రభుత్వోద్యోగుల విషయంలో ఉన్న కష్ట నిష్టూరాల పరిశీలనకు 1956 రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చట్టంక్రింద కేంద్ర పబ్లిక్ సర్వీసెస్ కమీషన్ చైర్మను అధ్యక్షతన నిర్ణయించబడిన కేంద్ర సలహా సంఘం త్వరలో హైద్రాబాదు వెళ్ళి కేంద్ర మంత్రికి తగు సిఫార్సులు చేయగలదు. ఇందులో ఒక రిటైరైన హైకోర్టు న్యాయమూర్తి, కేంద్ర ప్రభుత్వంనుండి రిటైరైన ఒక న్యాయ శాఖా కార్యదర్శి సభ్యులుగా వుంటారు. ఈ సంఘం నియమించాలని ముఖ్యమంత్రి సూచించారు.

సర్వీసులకు సంబంధించి తేలకుండా మిగిలిపోయిన కేసుల పరిష్కారానికి నిర్ణీత వ్యవధిలోగా హోంశాఖ ఒక అత్యవసర కార్యక్రమాన్ని నిర్ణయిస్తుంది.

కేంద్ర సలహా సంఘం కాని, రాష్ట్ర సలహా సంఘం కాని ఇచ్చే సలహాల దృష్ట్యా కేంద్ర ప్రభుత్వం గైకొనే నిర్ణయాలను రాష్ట ప్రభుత్వం వెనువెంటనే అమలు జరుపుతుందని ముఖ్యమంత్రి కేంద్రానికి హామీ ఇచ్చారు.

8. తెలంగాణా సమస్యలపట్ల కేంద్ర ప్రభుత్వం ఇకముందుకూడా ఎప్పుడూ శ్రద్ధ వహించేందుకుగాను ఆరు నెలలకొకసారి ప్రధానమంత్రి ముఖ్యమంత్రితోనూ

తెలంగాణా అభివృద్ధి కేర్పడిన ఉన్నతాధికార సంఘంలోని తదితరులతోను సమావేశమై పరిస్థితిని సమీక్షిస్తారు. ఈ సూచననుకూడా ముఖ్యమంత్రి చేశారు. ఈ సమావేశాలకు ఉప ప్రధాని, కేంద్ర హోంమంత్రి, ఇందుకు సంబంధించిన ఇతర కేంద్ర మంత్రులు, ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షులూ కూడా హాజరవుతారు.

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలోని ప్రజల మధ్య పరస్పర అవగాహన, సహకార భావాలు ఉన్నప్పుడూ, రాష్ట్రంలో ప్రశాంత వాతావరణం నెలకొన్నప్పుడూ తెలంగాణా ప్రాంతం సత్వరాభివృద్ధి, మొత్తం రాష్ట్రం సమగ్ర ఆర్థికాభివృద్ధి సాధించాలనే లక్ష్యాలు నెరవేరగలవు.

ఈ లక్ష్యాలను సాధించడంలో తోడ్పడేటట్లు తగిన రాజకీయ ఏర్పాట్లు చేయగలనని, యిలా చేసేముందు నాతో చర్చిస్తానని ముఖ్యమంత్రి సంభాషణల సందర్భంగా నాతో చెప్పారు.

ఆంధ్రప్రదేశ్‌లో పరిపూర్ణ శాంతి సుహృద్భావ వాతావరణాన్ని తిరిగి నెలకొనేటట్లు చేయడానికి గల ప్రాధాన్యత ఈ అనేక చర్చల సందర్భంలో గుర్తించబడింది."



# అష్టసూత్రాల అమలు

అనుమానాలూ, భయ సందేహాలూ తెలంగాణా ప్రాంతము అభివృద్ధి విషయంలోనూ, తెలంగాణా ఉద్యోగుల యోగక్షేమాల విషయంలోనూ, తెలంగాణా మిగులు నిధుల నిర్ధారణ విషయంలోనూ, రాజకీయ అసంతృప్తి ఉప ముఖ్యమంత్రి పదవి రద్దు విషయంలోనూ మాత్రమే అయివున్నట్లైతే, ప్రధాని ప్రణాళికతో అవన్నీ రూపుమాసి పోవలసినదే. ఏ రాష్ట్రం విషయంలోనూ, ఏ సమస్య సందర్భంలోనూ ఇంత బలంగా కేంద్ర ప్రభుత్వం ఆదుకోలేదు. ప్రధానమంత్రికి, ఆర్థిక మంత్రికి, హోంమంత్రికి, ప్రణాళికా సంఘ ఉపాధ్యక్షుడికి వ్యక్తిపరంగా తెలంగాణా సంక్షేమంలో జోక్యం కల్పించి, తీసుకోబోయే, తీసుకున్న చర్యలు పదే పదే సమీక్షకి ఏర్పాటుచేసి, కేంద్ర ప్రభుత్వ హామీలు, సలహాలు, పర్యవేక్షణ, ఉద్యోగబలం అన్నీ తెలంగాణా సమస్యా పరిష్కారానికి అంకితం చేసినది ప్రధాని. ఈ ప్రణాళిక రూపొందించడంలో ముఖ్యమంత్రి చేసిన సలహాలు ఎటువంటివో, ఎంత ముఖ్యమైనవో ప్రధాని ప్రకటనలోనే చెప్పినది. ఏ పరిస్థితులలోనూ ఏ ప్రభుత్వంగాని ఇంతకంటె చెయ్యగలిగినది ఉండదు. ముఖ్యమంత్రి సలహామీద, తెలంగాణా భయ సందేహాలు నిజమైనవని అంగీకరించి, వాటి నివారణకి చక్కని పథకం అమలుపర్చే కార్యక్రమానికి తాను ధర్మకర్త్రిగా నిలిచి, కేంద్ర ప్రభుత్వ బలగం అంతా పనిచేసేటట్లు ఏర్పాట్లు చేసినది.

కాని ఢిల్లీ సమావేశంలో పాల్గొన్న ముగ్గురు తెలంగాణా నాయకులు చొక్కారావు, చెన్నారెడ్డి, నూకల రామచంద్రారెడ్డి వారి అసంతృప్తి తెలియ జేసినారు. ఢిల్లీలోనే చేసిన ప్రకటనలో ఇల్లా అన్నారు.

'నిన్న, నేడు ప్రధానితోనూ, ఇతర నాయకులతోనూ, మేము జరిపిన చర్చలలో తెలంగాణా పరిస్థితిపైనను ప్రత్యేక తెలంగాణా వాదానికి సంబంధించిన వివిధ అంశాలపైనను మా అభిప్రాయాలను, దృక్పథాన్ని విశదీకరించినాము. కేంద్రమంత్రివర్గ సంఘం ఒకటి హైద్రాబాదువచ్చి పరిస్థితిని స్వయంగాచూసి అవగాహన చేసుకొవాలని కోరినాము. కాని, మా ప్రతిపాదన ఆమోదించబడలేదని తెలియజెయ్యడానికి విచారిస్తున్నాము."

హైద్రాబాదు తిరిగివచ్చిన తర్వాత ఏప్రిల్ 13 న చొక్కారావు, రామచంద్రా రెడ్డి, కొండాలక్ష్మణ్, చెన్నారెడ్డి కలిసి మరొక ప్రకటన చేసినారు. "ప్రధాని ప్రకటన మాకు ఆశాభంగం కలిగించినది. ఆ ప్రకటనలో పేర్కొన్న కార్యక్రమం పరిస్థితులు చక్కపరచలేదు." విలేఖర్లసభలో ప్రశ్నలకి జవాబు చెబుతూ చెన్నారెడ్డి ఇల్లా అన్నాడు: ఉద్యోగాల విషయం, నిధుల విషయం వివరాలు చర్చించాము. ఢిల్లీచర్చలలో తెలంగాణా విషయమై ఒక దృక్పథం సందర్భం రాలేదు. ఈ విషయం అసలు చర్చకే రాలేదు. ప్రశ్న: తెలంగాణా విషయంగాని, ఆంధ్ర ప్రదేశ విషయంగాని మీకు ఏదైనా దృక్పథం వున్నదా? జవాబు: ఉన్నది. కాని ప్రస్తుతం ఆ ప్రసక్తి ఎత్తదలుచుకోలేదు.

అదే రోజుని హైద్రాబాదులో ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డికూడా పత్రికా విలేఖరులతో ప్రసంగించినాడు. వీలైనంత త్వరలో తన మంత్రివర్గం పెద్దది చేస్తాననీ, తెలంగాణానించి ఉప ముఖ్యమంత్రిని నియమిస్తాననీ ప్రకటించినాడు. "ప్రధాన మంత్రితోసహా కేంద్ర నాయకులు, తెలంగాణా కష్టనిష్టూరాలు నివారణ చెయ్యడానికి ఎంతో శ్రద్ధతో కార్యక్రమం రూపొందించినారు. ఈ పథకంవల్ల తెలంగాణా ఆర్థికాభివృద్ధి ఒకటేకాక, తెలంగాణా ప్రజల భయసందేహాలు తీరగలవు" అన్నాడు. తెలంగాణా అలజడి విషయం అతిశయోక్తులతో వార్తలు పంపవద్దని కోరినాడు.

ఆందోళన ఆగలేదు.

ఆగే చిహ్నాలు గోచరించలేదు. పైగా తెలంగాణా ఎన్. జి. వోల సంఘం, ఉపాధ్యాయుల సంఘం 15 వ తారీఖుని సమ్మెకి పిలుపు ఇచ్చినవి. సమ్మెజరిగితే సంఘాల గుర్తింపు రద్దుచేస్తామనీ, సమ్మెలో పాల్గొన్న ఉద్యోగులమీద క్రమశిక్షణ చర్య తీసుకుంటామనీ ప్రభుత్వం హెచ్చరించినది.

ఏప్రిల్ 14 మాజీముఖ్యమంత్రి సంజీవయ్య హైద్రాబాదువచ్చి ఒక ప్రకటన చేసినాడు. ప్రధాని పథకం అమలు జరిపించిచూస్తే మంచిదని విజ్ఞప్తి చేసినాడు. రాజకీయంగా తెలంగాణావారి సంతృప్తికోసం తనహాయాంలో ఉప ముఖ్యమంత్రి-

పదవి సృష్టించి కొండా వెంకటరంగారెడ్డికి ఇచ్చానన్నాడు. ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షపదవి తెలంగాణా నాయకుడైన నూకల నరోత్తమరెడ్డికి లభించేటట్టు చూశానన్నాడు. "నరోత్తమరెడ్డిని పదవీభ్రష్టుణ్ణి చేసేదాకా కొందరు కాంగ్రెసుమిత్రులు నిద్రపోలేదు. ఈనాడు ముఖ్యమంత్రి ఆంధ్రుడు. ఉపముఖ్యమంత్రిలేడు. ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుడు ఆంధ్రుడు. శాసనసభ అధ్యక్షుడు ఆంధ్రుడు, శాసనమండలి అధ్యక్షుడు ఆంధ్రుడు, ఈ పరిస్థితులలో తెలంగాణావారు ఎన్నాళ్ళు నోరు మూసుకుని వూరుకుంటారు."

ఇంకా కొందరు తెలంగాణా నాయకుల్ని ఢిల్లీ సమావేశానికి ఆహ్వానించలేదనే వెలితి చూపిస్తున్నారు తెలంగాణావారు. ఆ వెలితి పూడ్చడానికి ఆహ్వానాలు ప్రారంభమైనవి. ప్రధానిని కలిసి సమస్య చర్చించవలసినదిగా కొండా వెంకట రంగారెడ్డికీ, కొండా లక్ష్మణ్‌కీ (వీరిద్దరూ బంధువులుకారు) పిలుపు వచ్చినది. రంగారెడ్డి వెళ్లలేదు. లక్ష్మణ్ వెళ్లినాడు. వీరిద్దరికేకాక విద్యార్థి నాయకులతోసహా ఎందరికో ఆహ్వానాలు అందినవి. వీళ్లైనంతమంది వెళ్లినారు. ఫలితం శూన్యం.

హైద్రాబాదులోనూ, తెలంగాణాలో ఇతర నగరాలలోనూకూడా ప్రత్యేక సమైక్య రాష్ట్రవాదుల సభలు జరుగుతూనే వున్నవి. కమ్యూనిస్టు నాయకుడు రావి నారాయణరెడ్డి ప్రత్యేక రాష్ట్రం తెలంగాణాకి నష్టం కలగజేస్తుంది గాని, లాభం చేకూర్చదన్నాడు, విభజన తెలుగు సంస్కృతికి అశనిపాతం అన్నాడు. విడిపోయిన పక్షంలో ప్రస్తుతం తెలంగాణాలో మిగులుతూన్న నిధుల్ని ప్రభుత్వ ఖర్చులు మింగేస్తాయన్నాడు. రాజకీయ జ్ఞానంతో పరిశీలిస్తే పెద్దదైన ఆంధ్రప్రదేశ రాష్ట్రమే అందరికీ శ్రేయస్కరం. తెలంగాణా అభివృద్ధి, తెలంగాణా ఉద్యోగుల యోగక్షేమాలూ సరిచూసుకుని నాలుగుకోట్లమంది తెలుగుజాతి సమైక్యత కాపాడు కోవాలన్నాడు. తెలంగాణాకవి డాక్టరు నారాయణరెడ్డి ప్రబోధం జ్ఞప్తికి తెచ్చినాడు:

వీర తెలంగాణా మాది
వేరు తెలంగాణా కాదు.

రాజ బహదూర్‌గౌడ్ ఆంధ్రులచరిత్ర వివరించి సమైక్యతే తెలుగువారి లక్ష్యం, ధ్యేయం, అదే చరిత్ర చాటించే గుణపాఠం అన్నాడు.

అదే సభలో మాట్లాడుతూ ఆరుట్ల కమలాదేవి తెలుగుస్త్రీల హృదయాలలో బాధ వెళ్లబోసుకున్నది. గోడలమీద అసభ్య వ్రాతలు తప్పన్నది. దౌర్జన్యం కూడదన్నది. ఆస్తులికీ, ప్రాణాలకీ ముప్పుంకలిగేమార్గం వొద్దన్నది. తన విన్నపం నాయకులు గమనించాలని విజ్ఞప్తి చేసినది.

వారంరోజులు తిరక్కముందే కేంద్రప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వంకూడా ప్రధాని పథకం అమలు జరపడానికి చర్యలు తీసుకున్నవి.

తెలంగాణా మిగులునిధులు నిర్ధారణ చేయ్యడానికి తలపెట్టిన సంఘానికి సుప్రీంకోర్టు జడ్జి వసిష్టభార్గవని అధ్యక్షుడుగా నియమించినారు. ఆసియా ప్రణాళికా, విద్యా, పరిపాలనాసంస్థ డైరెక్టరు ఆచార్య ముకుద్ బిహారీ మాథూర్, డిప్యూటీ కంప్ట్రోలర్ అండ్ అడిటర్ జనరల్ హరి భూషణభార్, టి. ఎన్. కృష్ణస్వామి ఆ సంఘసభ్యులు. మే నెలాఖరికి ఈ సంఘనివేదిక తయారవుతుంది అన్నారు.

తెలంగాణాలో ముల్కీలకి ఉద్యోగ సంరక్షణ రాజ్యాంగబద్ధంగా వుండే టందుకు మార్గాలు అన్వేషించడానికి సుప్రీంకోర్టు మాజీ ఛీఫ్ జస్టిస్ కె. ఎన్. వాంఛూ అధ్యక్షతన సంఘం నియమించినారు. కేంద్రప్రభుత్వ అట్టార్నీ జనరల్ నిరేన్‌డే. మాజీ అట్టార్నీ జనరల్ ఎం. సి. సెతల్వాడ్ ఈ సంఘంలో సభ్యులు.

ఆంధ్ర తెలంగాణాలు కలిపినప్పుడు ఉద్యోగుల సంలీనంవల్ల ఉభయ ప్రాంతీయులికీ కలిగిన కష్టనిష్టూరాలు పరిశీలించి సమన్వయం కుదర్చడానికి కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాల పునర్నిర్మాణచట్టంకింద ఏర్పాటు చేసిన ఉన్నతాధికార సలహా సంఘం ఏప్రిల్ నెలాఖరుకి హైద్రాబాదు వస్తుందని ప్రకటించినారు. దీని అధ్యక్షుడు కేంద్ర సర్వీసెస్ కమిషను అధ్యక్షుడు దామ్లే. కేంద్రప్రభుత్వ మాజీ లాసెక్రటరీ భండార్కర్, మాజీ హైకోర్టు జడ్జి పి. యన్. సప్రూ ఈ సంఘంలో సభ్యులు.

కేంద్రప్రభుత్వం ఏర్పాటుచేసిన ఈ మూడు సంఘాలూకాక, అదే పథకం కింద రాష్ట్రప్రభుత్వం కూడా రెండు ఉన్నతాధికార సంఘాలు నియమించినది. ఇవి 1. తెలంగాణా అభివృద్ధి సంఘం, 2. తెలంగాణా ప్రణాళికా పర్యవేక్షణ సంఘం.

అభివృద్ధి సంఘానికి ముఖ్యమంత్రి అధ్యక్షుడు. కేంద్ర ప్రణాళికా సంఘ సభ్యుడు ఆర్. వెంకటరామన్. తెలంగాణా మంత్రులు వి. బి. రాజు, జె. వి. నరసింగరావు, పి. వి. నరసింహారావు, బి. వి. గురుమూర్తి, కే. వి. నారాయణరెడ్డి, మహ్మద్ ఇబ్రాహిం ఆలీ అన్సారి. అరిగె రామస్వామి, తెలంగాణా ప్రాంతీయ సంఘ అధ్యక్షుడు జె. చొక్కారావు సభ్యులు.

ప్రణాళికా పర్యవేక్షణ సంఘానికి కేంద్ర ప్రణాళికా సంఘసలహాదారు అధ్యక్షుడు. కేంద్ర ఆర్థిక, హోంశాఖల జాయింటు సెక్రటరీలు, తెలంగాణా వ్యవహారాలకోసం నియమించబడిన ఎడిషనల్ ఛీఫ్ సెక్రటరీ, ఆంధ్రప్రదేశ స్పెషల్ ఆర్థిక కార్యదర్శి, ప్రణాళికల, పంచాయతీరాజ్ శాఖ కార్యదర్శి సభ్యులు.

ల తెలంగాణా అసంతృప్తి నివారించడానికి నియమించిన ఈ సంఘాల పనికీ ఆందోళనకీ ఏమీ పొంతన కుదరలేదు. అలజడి జరుగుతూనే వున్నది. నాలుగు నెలల క్రితం ప్రారంభమైన ప్రత్యేక తెలంగాణా ఆందోళన కాలంలో శాసనమండలికి ఒక ఉపయెన్నిక తటస్థపడినది. ఈ ఎన్నిక సమైక్య ప్రత్యేకవాదుల బలాబలాలు తేల్చుకోడానికి అవకాశంగా మారినది. ఈ ఎన్నిక హైద్రాబాదు స్థానిక సంస్థల నియోజకవర్గాన్నించి జరగవలసి వున్నది. ఈ నియోజకవర్గంలో 600 మంది వోటర్లువున్నారు. ఇందులో 96 హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషను సభ్యులు, 13 శికింద్రాబాదు కెంటోన్‌మెంటు బోర్డు సభ్యులు. తక్కిన వారు హైద్రాబాదు జిల్లాలోవున్న 8 పంచాయితీ సమితుల సభ్యులు. ప్రత్యేక తెలంగాణా కోసం ఉద్యమం నడుపుతున్న ప్రజాసమితి ఎస్. వెంకటరామరెడ్డినీ, కాంగ్రెసుపార్టీ ప్రభాకర రెడ్డినీ నిలబెట్టినారు. ప్రజాసమితి అభ్యర్థి వెంకటరామరెడ్డి 53 వోట్ల మెజారిటీతో గెలిచినాడు. ప్రత్యేక తెలంగాణా వాదనకి విజయంగా పరిగణించ బడినది.

ఈ విజయం ప్రకటించిన రోజునే తెలంగాణా విద్యార్థులికీ, తెలంగాణా ప్రజలకీ సంతోషం కలిగించాలనే సదుద్దేశ్యంతో అన్నట్టు ప్రభుత్వం డాక్టరు రావాడ సత్యనారాయణని ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడుగా నియమించినది. ఈయన ఆదినించీ ముల్కీవాది, తొలి ప్రత్యేక తెలంగాణా సదస్సు ప్రారంభం చేసినవాడు. విద్యార్థులలో పలుకుబడి కలవాడు. ఎంతో కాలంతర్వాత ఈ ఉద్యోగానికి తెలంగాణా విద్యావేత్తని నియమించడం ఇదే ప్రథమం. ఉద్యోగం లభించినదిగదా అని ఆయన తన వాదన విరమించుకోలేదు.

అప్పటివరకూ తాత్కాలిక ఉపాధ్యక్షుడుగావున్న నూకల నరోత్తమరెడ్డి మాత్రం వెంటనే ప్రత్యేక తెలంగాణావేదిక అధిరోహించి, ఆంధ్రుల భాషా తెలంగాణావారి భాషా ఒకటి కాదన్నాడు.

ఏప్రిల్ నెలాఖరికి ముఖ్యమంత్రి తన మంత్రివర్గం పెద్దది చెయ్యడం విషయమై కాంగ్రెసు అధ్యక్షుడితోనూ, ప్రధానమంత్రితోనూ చర్చలు పూర్తిచేసి ఒక నిర్ణయానికి వచ్చినాడు. పదిపన్నెండుమంది కొత్తమంత్రుల్ని తీసుకో దలచినాడు.

పార్లమెంటులో పదేపదే తెలంగాణా సమస్య వస్తూనే వున్నది. కేంద్ర ప్రభుత్వం తీసుకున్న చర్యలన్నీ ఏకరువుపెట్టినాడు హోంమంత్రి చవన్. ప్రత్యేక తెలంగాణా ఏర్పాటు చేసే ప్రసక్తిలేదని పునరుద్ఘాటించినాడు.

ఏప్రిల్ 29న కాంగ్రెసు పార్లమెంటరీపార్టీ కార్యనిర్వాహక వర్గంవారు కూడా తెలంగాణా ఆందోళన చర్చించినారు. తమ సమావేశానికి ముఖ్యమంత్రిని

పిలిపించుకున్నారు. ఆ సభలో తెలంగాణా సమస్య పూర్వాపరాలు తెలియజేసినాడు బ్రహ్మానందరెడ్డి. తెలంగాణా ప్రజల భయసందేహాలు నివారించడం అనేది అత్యవసర కార్యక్రమం అని నొక్కి చెప్పినాడు. తెలంగాణాకి న్యాయం చెయ్యడం ముఖ్యం. తెలంగాణా ప్రాంతీయ సంఘం అధికారాలు చట్టబద్ధంచేసి, ఆ సంఘ తీర్మానాలు అవసరంగా అనుసరించాలని ఏర్పాటు చేస్తే రాష్ట్ర ప్రభుత్వానికి అభ్యంతరం లేదన్నాడు.

కొందరు వ్యాపారస్థులు తెలంగాణా ఆందోళన కారులికి ధనసహాయం చేస్తున్నారన్నాడు. "హైద్రాబాదులో పిల్లలికి రాళ్ళేసినందుకూ, బస్సులూ కార్లూ ఆపినందుకూ డబ్బిస్తున్నారు. ఆ ప్రకారంగా చేస్తే ఆందోళన సర్వజనవ్యాప్తం అనుకుంటారని వాళ్ళ అభిప్రాయం. ఈ ప్రత్యేక తెలంగాణా ఉద్యమంలో కొండా వెంకట రంగారెడ్డి, డాక్టరు చెన్నారెడ్డిచేరి దానికి బలం చేకూర్చినారు. వారిద్దరూ, ఆంధ్రప్రదేశం నిర్మాణం కాకమునుపే ప్రత్యేక తెలంగాణావాదులు. వారి ప్రస్తుత వైఖరిలో ఆశ్చర్యపడవలసినది ఏమీలేదు.

"మద్యపాననిషేధం అమలులోలేదు గనక తెలంగాణాలో మిగులు ఉంటుంది. ప్రస్తుతం మంత్రివర్గంలో సగానికిసగం తెలంగాణా మంత్రులున్నారు. ప్రధాని అష్టసూత్ర ప్రణాళిక ప్రకటించిన తర్వాత పరిస్థితులు మెరుగు చూపుతున్నాయి.

"ప్రత్యేక తెలంగాణా ఉద్యమం ప్రజాఉద్యమంకాదు. ఉస్మానియా విద్యార్థుల మధ్య వైరంలోంచి ఇది బయలుదేరినది. నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు అవకాశం తీసుకున్నారు. కొన్ని విజయవాడ పత్రికలుకూడా విపరీతమైన రిపోర్టులు ప్రకటించి పరిస్థితులు విషమించేటట్టు చేసినవి."

ప్రశ్న : పార్లమెంటరీ కమిటీ ఒకటి రాష్ట్రం వచ్చి పరిస్థితులు పరిశీలించడానికి మీ అభ్యంతరం ఏమిటి ?

జవాబు : అటువంటి ప్రయత్నం శాంతి నెలకొల్పడానికి బదులు అశాంతికి దోహదం చేస్తుంది.

# చెన్నారెడ్డి నాయకత్వం

మే 3 న రాష్ట్రపతి జాకిర్‌హుస్సేన్ అకస్మాత్తుగా స్వర్గస్థుడైనాడు. ఉపరాష్ట్రపతి వి. వి. గిరి తాత్కాలిక అధ్యక్షపదవికి ప్రమాణస్వీకారం చేసినాడు. రాధాకృష్ణన్ ఉపాధ్యాయుడు. జాకిర్‌హుస్సేన్ ఉపాధ్యాయుడు. వరుసగా ఇద్దరు ఉపాధ్యాయులు రాష్ట్రపతులైనారు. రాధాకృష్ణ ఆంధ్రుడు. జన్మస్థలంవల్ల, హైద్రాబాదులో పుట్టిన జాకిర్‌హుస్సేన్ ఆంధ్రుడు. వి. వి. గిరి ఆంధ్రుడు. వరసగా ముగ్గురు ఆంధ్రులు రాష్ట్రపతులైనారు.

జాకిర్‌హుస్సేన్ స్మారకార్థం 13 రోజులు విచార దినాలుగా ప్రకటించినారు. ఈ గడువు దాటగానే తన కొత్త మంత్రుల పేర్లు ప్రకటిస్తానన్నాడు బ్రహ్మానందరెడ్డి.

మే మధ్యలో తెలంగాణా మిగులు నిధులు నిర్ధారణ చెయ్యడానికి నియమించిన భార్గవా సంఘం హైద్రాబాదు వచ్చినది. ఆ సంఘాన్ని గుర్తించనన్నాడు చెన్నారెడ్డి. ప్రాంతీయ సంఘం వేసిన అంచనాతో వారితీర్పు ఏకీభవించకపోతే తాము అంగీకరించమన్నాడు. వారి అంచనా 117 కోట్లదాకా దేకినది.

మే మధ్యలోనే కోస్తా జిల్లాలలో కనివిని ఎరుగనంతటి ఉధృతంగా తుఫాను వచ్చి అపార, ఆస్తి, పశు, ప్రాణనష్టం కలిగించినది. ఎన్నాళ్లో ఉత్తరదక్షిణ భారతదేశాల మధ్య కోస్తాద్వారా రైళ్ళరాకపోకలు ఆగిపోయినవి. తెలంగాణాలో ఖమ్మంజిల్లా దెబ్బతిన్నది. ఈ ఈతిబాధ నివారణకి ప్రయత్నాలుచేస్తూ దెబ్బతిన్న జిల్లాలలో పర్యటనం చేసినాడు ముఖ్యమంత్రి. కేంద్రరాష్ట్ర అధికారులు విరామం లేకుండా తిరిగి ప్రజాసేవ చేసినారు. కేంద్రప్రభుత్వం ఈ కార్యక్రమానికి 20 కోట్ల రూపాయలు మంజూరు చేసినది.

ఈ జలప్రళయంలో మే 22న చెన్నారెడ్డి తెలంగాణా ప్రజాసమితి అధ్యక్షుడుగా, ఉద్యమసారథ్యం ప్రత్యక్షంగా చేబూనినాడు. ఉద్యమానికి విప్లవ స్థాయి కల్పించినాడు.

చెన్నారెడ్డిమీద ఎన్నికల ఫిర్యాదు చేసిన వందేమాతరం రామచంద్రరావు ఈ విధంగా ప్రకటించినాడు.

"ఢిల్లీలో కలిసి ప్రధాని ఇందిర, ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి, మాజీమంత్రి చెన్నారెడ్డి కుట్రచేసినారు. ఆ కుట్ర ఫలించినది. తెలంగాణా ప్రజాసమితిలో చెన్నారెడ్డి ప్రవేశమే ఆ ఫలితం. ప్రత్యేక తెలంగాణా ఉద్యమం లోపల్నించి భగ్నంచెయ్యడమే వీరి ఉద్దేశ్యం. తెలంగాణాకి కొన్ని రక్షణలు కల్పిస్తే విభజన అవసరంలేదని చెన్నారెడ్డి వ్రాతమూలంగా తన అంగీకారం తెలియజేసినాడు. ప్రస్తుతం ప్రత్యేక తెలంగాణా కావాలని ఆయన చేసే వినాదం ప్రజాసమితిలో ప్రవేశం సాధించడానికి మాత్రమే. ఆయన ప్రవేశించిన తక్షణమే సమితిలో చీలికలు ఏర్పడినవి. ఇది శుభసూచకంకాదు."

విద్యార్థినాయకుడు శ్రీధరరెడ్డి ఒక ప్రకటనలో తెలంగాణా విద్యార్థుల్ని హెచ్చరించినాడు. ఉద్యమంలో ప్రవేశించిన కొన్ని దుశ్శక్తుల విషయం బహు పరాక్ ఈ చెడ్డశక్తుల ప్రవేశంవల్ల తెలంగాణా ప్రజలముందున్న కార్యక్రమాలు క్లిష్టతరమైనవి. తెలంగాణా విద్యార్థులు ముఖ్యంగానూ, తెలంగాణా ప్రజలు దరహం మీద రెండు వేపుల సమరం సాగించవలసి వుంటుంది. ఒకవేపు ప్రత్యేక రాష్ట్రం సాధించాలి. మరోవేపు సరంక్షకులమనే నెపంమీద ఉద్యమంలో చేరిన అవినీతి పరులైన రాజకీయ నాయకుల్ని ఎదుర్కోవాలి. కొన్నాళ్ళక్రితం శికింద్రాబాదులో ఈ నాయకులు మాట్లాడిన సభలో కొందరు సబబైన ప్రశ్నలువేస్తే వాళ్ళని చిత గ్గొట్టడం జరిగినది. ప్రజాప్రభుత్వవిధాన శత్రువులైన ఈ నాయకుల పెత్తనంలోనా మనం తెలంగాణా రాష్ట్రం సాధించాలి? అవినీతి పరులైన ఈ రాజకీయ నాయ కుల్ని అనుసరించడమా, నిష్కల్మషంగా మన ఉద్యమం నడుపుకోడమా? ఈ ప్రశ్నకి జవాబు ఆలోచించాలి."

కొద్దిరోజుల తర్వాత శ్రీధరరెడ్డి ఆధ్వర్యాన వేరే ప్రజాసమితి ఏర్పాటైనది.

చెన్నారెడ్డి ప్రజాసమితి అధ్యక్షత స్వీకరించినరోజునే తెలంగాణా నాన్‌గెజె టెడ్ ఉద్యోగసంఘ అధ్యక్షుడు ప్రభుత్వాన్ని సవాల్ చేసినాడు. జూన్ 15 లోపల ప్రత్యేక తెలంగాణారాష్ట్రం రాకపోతే రక్తపాతం, విధ్వంసం తప్పవన్నాడు. ఆ ఉద్యోగిని గవర్నరు డిస్మిస్ చేసినాడు. ఎన్. జి. వోల, ఉపాధ్యాయుల సంఘాల గుర్తింపు తొలగించినారు.

మే 25 న మహబూబునగరం జిల్లా నాగరకర్నూలులో సమైక్య ఆంధ్ర ప్రదేశవాదుల మహాసభ జరిగినది. నాగరకర్నూలులో కొంతకాలంనించి, ఇన్నాళ్ళుగా భూఖామందులికి అణిగిమణిగివున్న నిమ్నజాతులవారు ఎదురు తిరుగుతున్నారు. ఇక్కడ దేశముఖులూ, దేశపాండ్యాలూ వీరిని యమయాతనలు పెడుతూ వుండేవారు. ఆంధ్రప్రదేశం ఏర్పడిన తర్వాత సామాన్యజనానికి కూలినాలి దొరికి ఈ భూస్వాముల మీద ఆధారం తప్పినది. వారిలో స్వేచ్ఛాభావాలు ప్రబలినవి. ఇదివరకులాగ వూరిపెద్దలనే వారికి వెట్టిచాకిరీ చెయ్యడం మానేసినారు. వీరికున్న కాస్తకొంద్రా ఖామందులు అప్పులికనీ, సొప్పులకనీ కాజేసినారు. కొన్ని ఖూనీలు జరిగినవి. ఖామందులతరం అంతరించినది. ఇది తెలంగాణా గ్రామసీమలో సంభవించిన, సంభవిస్తున్న సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక విప్లవం. ఈ మార్పు తిన మరిగినవారికీ, అనుభవించినవారికీ గిట్టదు. వారే భూఖామందులు. వారికి సమైక్య రాష్ట్రం పనికిరాదు. ప్రత్యేకరాష్ట్రం కావాలి. ఈ ఉద్యమానికి మద్దతు ఇచ్చిన వారిలో భూఖామందులున్నారు. ఈ మార్పు నాగరకర్నూలు ప్రాంతంలో తీవ్రంగా కలుగుతున్నది. కాకతాళ న్యాయంగానో, ఆలోచన ప్రకారమో ఈ సమైక్య మహాసభ నాగరకర్నూలులో జరిగినది. మొదటిసారి ముఖ్యమంత్రి కొంచెం కఠినంగానూ, నిష్కర్షగానూ మాట్లాడినాడు.

ఆంధ్రప్రదేశ సమైక్యత నిలిచే పరిస్థితులలో, నిజాయితీపరుడైన నాయకుడు సమకూరితే తాను ముఖ్యమంత్రి పదవినించి వైదొలగడానికి సిద్ధమేనన్నాడు. "కాని ఈ 'రాబందులికి' ప్రభుత్వం అప్పజెప్పను. స్వార్థపరులూ అవినీతిపరులూ అయిన వీరికి అధికారం కైవసం చెయ్యను. నా శరీరంలో రక్తం ప్రవహిస్తున్నంతకాలం ప్రజల్ని మళ్ళీ నిజాయితీలేని, అవినీతిపరులైన నాయకులికి అప్పజెప్పను. ఆంధ్రప్రదేశం నా తాతగారి సొమ్ముకాదు. ఇది ప్రజల ప్రభుత్వానిది. నన్ను తొలిగించాలంటే ప్రజలకే హక్కు ఉన్నది.

"ప్రత్యేక తెలంగాణా ఎండమావుల వంటిది. ఈ ప్రత్యేకరాష్ట్రం అసాధ్యం అని ప్రధానితోసహా మహానాయకులంతా లెఖ్ఖలేనన్నిసార్లు ప్రకటించారు. రక్తపాతం జరుగుతుందని కొందరు నాయకులు బెదిరిస్తున్నారు. ఎవరి రక్తం?

"తెలంగాణా ప్రజల హక్కులకోసం చిటికినవేలుకూడా కదపని మహానాయకులంతా ఈనాడు నినాదాలు ఘోషిస్తున్నారు. తెలుగు ప్రజలంతా కలిసే వుండగలరు. నీతిలేని నాయకుల దండయాత్రలు తట్టుకునే బలం ప్రజాప్రభుత్వానికి లేకపోలేదు.

"ప్రభుత్వోద్యోగులు రాజకీయాలలో చేరరాదు. చివరికి ఈ ఆందోళన వారినే బెడిసికొడుతుంది. రాజకీయాలలో ఇరుక్కుంటే ఏ రాజకీయనాయకుడూ మీ యోగక్షేమాలు సంరక్షించలేడు.

"స్వార్థపరులైన నాయకులు చూపిన తప్పుదారులలో పడకుండా విద్యార్థులు చదువుకోవాలి."

మే 27 న మూసివేసిన కళాశాలలు తెరవాలని ఉస్మానియా విద్యార్థులు పెద్దఊరేగింపు జరిపినారు. వెంటనే పరీక్షలు జరపాలని నినాదాలు చేసినారు.

మే 31 న ప్రత్యేక తెలంగాణా కాంగ్రెసు కమిటీ ఏర్పాటైనది. ప్రారంభోత్సవం చేసినవాడు కొండా. వెంకటరంగారెడ్డి. కొండాలక్ష్మణ్ అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. ఈ సంఘాన్ని కాంగ్రెసు అధిష్ఠానవర్గం గుర్తించాలని విజ్ఞప్తి చేసినారు.

ఇదొక కొత్త పరిణామం అని జూన్ ప్రారంభంలో ముఖ్యమంత్రిని ఢిల్లీ పిలిపించినారు. చొక్కారావుకూడా వెళ్ళినాడు. ఢిల్లీలో చర్చల ఫలితంగా హోం మంత్రి చవన్ హైద్రాబాదు వస్తాడనుకున్నారు. తలవనితలంపుగా ప్రధాని ఇందిరాజీ నాలుగో తారీఖు రాత్రికి రాత్రి విమానంలో హైద్రాబాదు వచ్చినది. ఆమర్నాడు ఆవిడ ఆఫ్గనిస్థానం వెళ్ళవలసి వున్నది. తెల్లవార్లూ నాయకులందరితోనూ స్వయంగా చర్చలు జరిపి పరిస్థితులు తెలుసుకున్నది. జూన్ 7 న హోం మంత్రి చవన్ వచ్చి రెండు రోజులు నాయకుల్ని కలిసినాడు. అన్నిజిల్లాలనించీ ప్రజాప్రతినిధులు ఆయన్ని కలిసినారు. అన్నిపక్షాలవారూ తమ తమ దృక్పథాలు తెలియజేసినారు. ఆదిలాబాదు ప్రతినిధులు తాము ఆంధ్రప్రదేశంలోనే వుంటామనీ, ప్రత్యేక తెలంగాణా వస్తే తాము 'నాగవిదర్భ'లో చేర్తామని చెప్పినారు. అల్లాగే నిజామాబాదువారు మహారాష్ట్రలో చేర్తామన్నారు. ఖమ్మంజిల్లావారు ఆంధ్రలో కలుస్తామన్నారు. జంటనగరాల ప్రతినిధులు కొందరు తమ నగరాలు కేంద్ర పరిపాలనలో వుండాలన్నారు.

అందరి విజ్ఞప్తులూ విని, హోంమంత్రి ఆందోళన ఆపుజెయ్యమని కోరినాడు. ప్రధానమంత్రికీ, కేంద్ర మంత్రివర్గానికీ తాను సేకరించిన విషయాలు నివేదిస్తానన్నాడు.

హోంమంత్రితోపాటు ఢిల్లీనించి చాలామంది విలేఖర్లు వచ్చినారు. వారు ముఖ్యమంత్రిని కలిసినారు.

ఆంధ్రప్రదేశ సమైక్యత చెక్కుచెదరకుండా వుండేపక్షంలో బ్రహ్మానందరెడ్డి తాను ముఖ్యమంత్రిపదవినించి తప్పుకోడానికి అభ్యంతరం లేదన్నాడు. తెలంగాణా సమస్య పరిష్కారానికి తన ఉనికి ఆటంకం అయితే తాను రాజీనామా ఇస్తానన్నాడు. తన సంగతి చాలా చిన్నవిషయం అన్నాడు.

కేంద్ర నాయకులు ఢిల్లీనించి మళ్ళీ ప్రకటించినారు. ఆంధ్రప్రదేశంలో రాజ్యాంగపరమైన విపరీతం ఏమీలేదు. అందువల్ల ముఖ్యమంత్రిని బర్తరఫ్ చెయ్యడంగాని, రాష్ట్రపతి పరిపాలన అమలు జరపడంగాని అవసరం లేదు అని.

చెన్నారెడ్డి శంఖం పూరించినాడు. ఆందోళన పదిరెట్లు పెరిగినది. దౌర్జన్యం ఎక్కువైనది. పోలీసుల చర్య కఠినమైనది. వేలాది స్త్రీ పురుష బాలజనం అరెస్టులు జరిగినవి. కోస్తా జిల్లాలవారిమీద ద్వేషం ఇనుమడించినది. నగరంలో స్థిరపడ్డ వారిని భయపెట్టడం, ఇళ్ళు ఖాళీచేయించడం, టెలిఫోనులమీద, ఉత్తరాలతో బెదిరించడం. తెలంగాణా అన్నివర్గాలవారినీ ఉద్యమానికి సహాయం చెయ్యమనీ, అందులో చేరమనీ వొత్తిడి, కొన్నిచోట్ల కాయశుద్ధి. మూకలికి వాగ్దానాలు, పోలీసుల్ని బెదిరింపులు, తెలంగాణా వొస్తున్నది, తప్పుదారిలో వున్న అధికారుల పని పడతాం. జాగ్రత ! ఆంధ్రులు వెళ్ళిపోతే ఆ భూములూ, ఇళ్ళూ అందరికీ పంచుతాం అని ఆశపెట్టడం, ఒకటేమిటి ఎన్నివిధాల మభ్యపెట్టి, మాయమాటలు చెప్పాలో అన్నీ జరిగినవి. ఇదుగో తెలంగాణా, అదుగో తెలంగాణా. సిద్ధంగా వుండండి. ఇప్పుడు తెలంగాణా రాకపోతే భవిష్యత్తు భీకరంగా వుంటుంది. ముఖ్యమంత్రి పోతే చాలదు, ప్రాంతీయ సంఘానికి ఎక్కువ అధికారాలిస్తే చాలదు. సమైక్యత అనే వారి గూండా విధానాలు రూపుమాపాలి. కాంగ్రెసు సభ్యులంతా కలిసి ప్రభుత్వాన్ని పగలగొట్టాలి. అదే వరస.

కొత్తగా స్థాపించిన ప్రత్యేక తెలంగాణా కాంగ్రెసు అధ్యక్షుడు కొండాలక్ష్మణ్ చెన్నారెడ్డికి చేదోడు వాదోడు. కాంగ్రెసు పార్టీ తప్ప తెలంగాణాలో ఇంక ఏ పార్టీ ప్రభుత్వం ఏర్పాటు చెయ్యలేదన్నాడు.

జూన్ 12న ముఖ్యమంత్రి ఆంధ్రప్రదేశ ప్రభుత్వోద్యోగులికి జీతబత్తాలు పెంచుతూ ఒక ప్రకటనచేసినాడు. ఆంధ్రప్రదేశావతరణానంతరం ఇది మూడో పెంపుదల. 2లక్షల 50వేల మందికి లాభం. 5కోట్ల 50 లక్షలు సాలీనాఅదనపు ఖర్చు. జీతాలు తరహాలలోకూడా పెద్ద సంస్కారం చేసినాడు. ఇదివరదాకా రాష్ట్రంలో 142 రకాల జీతబత్తాలు వుండేవి. అవిఅన్నీ సరిదిద్ది 26గా తగ్గించినాడు.

కాంగ్రెసు వర్కింగు కమిటీలో తెలంగాణా సమస్య మళ్ళీ చర్చకి వచ్చినది. వర్కింగు కమిటీ కలుసుకునే ముందు కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు కార్యనిర్వాహక వర్గంలో ఈచర్చ వచ్చినది. చవన్ తన అభిప్రాయాలు తెలియ జేసినాడు. 1955-56లో ఏజనం, ఏనాయకులు ప్రతేక తెలంగాణా ఉద్యమం నడిపినారో వారే ప్రస్తుత ఆందోళన కూడా నడుపుతున్నారన్నాడు.

కార్యనిర్వాహక వర్గం ముఖ్యమంత్రిని వుంచడమా తీసెయ్యడమా అనే సమస్య చర్చించాలనుకున్నారు. ఈ సమావేశానికి పార్లమెంటు సభ్యురాండ్రు యశోదారెడ్డి, లక్ష్మీకాంతమ్మ, కూడా ఆహ్వానించబడినారు. "రాష్ట్రశాసన సభలో అధిక బలంవున్న ముఖ్యమంత్రిని తీసెయ్యడానికి మీరెవరు'? అనిసవాల్‌చేసినది

యశోదాదేవి. తెలంగాణానించి పార్లమెంటుకి ఎన్నికైన లక్ష్మీకాంతమ్మ తెలంగాణా ప్రజలలో 90శాతం ఆంధ్రప్రదేశంలో వుండదలుచుకున్నవారే, వారంతా ప్రత్యేక తెలంగాణాకి వ్యతిరేకం అనిచెప్పినది.

చర్చానంతరం కార్యనిర్వాహకవర్గం బ్రహ్మానందరెడ్డి పోనక్ఖర్లేదు, రాష్ట్రపతి పాలన పెట్టనక్ఖర్లేదు అని నిర్ణయించినది.

కాంగ్రెసు వర్కింగు కమిటీముందు కొత్తగా స్థాపించిన తెలంగాణా కాంగ్రెసు కమిటీని గుర్తించాలా లేదా అనే సమస్యవున్నది. అటువంటి ఆశలేమీ పెట్టుకోవద్దన్నాడు అధ్యక్షుడు నిజలింగప్ప. వర్కింగు కమిటీవారు తెలంగాణా ప్రజాసమితి నాయకుల్ని ఢిల్లీ ఆహ్వానించినారు. ''ఏంలాభం! మేంరాం'' అన్నారు వీరు. అప్పుడు సంజీవయ్య శ్రద్ధతీసుకుని, సమితి నాయకులూ మరికొందరూ ఢిల్లీ వెళ్లేటట్టు చేసినాడు. చెన్నారెడ్డి, కొండాలక్ష్మణ్, చొక్కారావు, నూకల రామ చంద్రారెడ్డీ ఢిల్లీ వెళ్లినారు. వీరితో చర్చలు కొనసాగించి ఏదో తీరుమానం చెయ్యాలని పెద్దలు సంకల్పించినారు. మురార్జీదేశాయితో కలిసి బ్రహ్మానందరెడ్డి సమక్షంలో అన్ని విషయాలూ చర్చిస్తే తదుపరి దేశాయి హైద్రాబాదు రావచ్చుననే ఆశ కలిగినది. దేశాయితో చర్చలు విఫలమైనవి. ఆయనకి విసుగు పుట్టి నేను ఎక్కడకీ రావడం లేదన్నాడు.

చొక్కారావు, రామచంద్రారెడ్డి మాత్రం ఒక సమాధానానికి వచ్చినారు. బ్రహ్మానందరెడ్డి రాజీనామా ఇచ్చి తెలంగాణా నాయకుణ్ణి ముఖ్యమంత్రి చేస్తే పరిస్థితి బాగుపడుతుందని వారుఆశపడ్డారు.

ఢిల్లీ వెళ్లిన నాయకులు తిరిగి రాగానే ఆందోళన పెచ్చుపెరిగినది. నగరంలో దౌర్జన్యం మితిమీరినది, రెండురోజులలో రాష్ట్రపతిపాలన అన్నారు. పరిస్థితి అల్లకల్లోలంగా వున్నది. సరిగ్గా నెలరోజులు ప్రత్యక్ష ఆందోళన నాయకత్వం తర్వాత చెన్నారెడ్డిని అరెస్టుచేసి రాజమండ్రి సెంట్రల్‌జైలుకి తీసుకుపోయినారు. కొండాలక్ష్మణ్ కూడా నిర్బంధితుడై చెన్నారెడ్డితో వెళ్లినాడు. అది మొదలు చాలామంది నాయకుల్ని పట్టుకున్నారు. పోలీసు బందోబస్తుతో రాష్ట్రంలో శాంతిభద్రతలు క్రమేణా సమకూర్చినారు.

# పునర్జన్మ

ఆరు నెలలనించి విధీవిరామంలేకుండా జరుగుతున్న ప్రత్యేక తెలంగాణా ఆందోళనలో ఎంత మందివో ప్రాణాలు పోవడం, అంగవైకల్యం కలగడమే కాకుండా, కొన్నివేలమంది జాతకాలు తారుమారైనవి. ఈ జాతరలో అధికారులు, అనధికారులు, రాజకీయాల వారూకూడా వున్నారు. ముఖ్యంగా వ్యక్తులమీద, సంస్థల మీద వొత్తిడిలు ఎక్కువైనవి. ఈ రాపిడిలోపడ్డవారు ముఖ్యంగా తెలంగాణా మంత్రులు. రాజీనామా ఇచ్చిన కొండాలక్ష్మణ్ తప్ప తక్కినవారంతా సమైక్యత కోరేవారే. కాని వారిమీద ఆందోళనకారుల బలవంతం ఆరోజుకారోజు ఎక్కువ అవుతున్నది. ప్రజాసమితివారూ, వార్ని అనుసరించే ప్రజానీకం తెలంగాణా మంత్రుల్ని దుమ్మెత్తి పోస్తున్నారు. ఈ విషమపరిస్థితులలో వారి కర్తవ్యం ఏమిటి ? ఆంధ్రప్రదేశ సమైక్యత కాపాడాలి; శాంతి భద్రతలు సమకూర్చాలి; అదే కృషిలో ప్రజల్ని ఆకర్షించే త్యాగం ఏదన్నాచేసి, సమితి నాయకులికి ప్రాంతీయ భక్తిలో ఎంతమాత్రం తీసిపోవడంలేదని నిరూపించాలి. ఉద్యోగాలే తమకు శరణ్యం కాదని తెలియజెయ్యాలి.

తరువాత రాష్ట్ర నాయకత్వంలో మార్పువస్తేనేకాని పరిస్థితులు శాంతించేటట్టు కనబడదు. ఇన్నాళ్లు, ఇంతమంది త్యాగాలుచేసి ఆందోళన కొనసాగిస్తే ఫలితం ఏమీ కనబడడంలేదు. తప్పుకాని, వొప్పుకాని, వారికి నాయకులు నిర్ధారించిన లక్ష్యాలలో ఏదీ సమకూడలేదు. అలజడి ఆపి, శాంతి చేకూర్చాలంటే ప్రజలికి ఏదో చూపించాలి. న్యాయసమ్మతంకానీ, కాకపోనీ, శాసనసభలో బలం వుండనీ వుండకపోనీ, ప్రజాసమితి వారేకాక, ప్రతిపక్షాలన్నీ బ్రహ్మానందరెడ్డి రాజీనామా కోరుతున్నవి. పార్లమెంటులోకూడా ఈ నినాదం వినబడినది.

ఇందుకుగాను ముఖ్యమంత్రి బలి కావాలి. అంతవరకు ఆంధ్రప్రాంత రాజకీయ వేత్తలు తమ అభిప్రాయాలు సవరించుకుని త్యాగం చెయ్యాలి. ఆంధ్ర ప్రదేశసమైక్యత సంరక్షించడంకోసం, తెలంగాణా ప్రజకి సంతృప్తి కలగజెయ్యడం కోసం, ఈ త్యాగం, ఈమార్పు అవసరం. తెలంగాణావార్ని ముఖ్యమంత్రిగా నిలబెట్టడం ఉత్తమం.

ఈ మార్గాలలో ఆలోచిస్తున్నవాడు వి. బి. రాజు. ఆ విషయం అతను రహస్యంగా వుంచలేదు. కేబినెట్టులోకూడా ప్రకటించి వుండవచ్చు. ఈవాదనే, రాజు అభిప్రాయమే, చొక్కారావు, రామచంద్రారెడ్డి కాంగ్రెసు అధిష్ఠానవర్గంముందు వుంచినారు.

ముఖ్యమంత్రికూడా ఈ విషయం ఆలోచిస్తూనే వున్నాడు. అధిష్ఠానవర్గంతో ముచ్చటించినాడు. వారు తొందరపడవద్దన్నారు. నిజానికి నిజలింగప్ప అన్నాడు, ప్రస్తుతపరిస్థితులలో అన్ని ప్రాంతాల్నీ, అందరి మనుషుల్నీ కలిపి వుంచగలిగిన శక్తి ఒక్క బ్రహ్మానందరెడ్డికి తప్ప ఎవరికీ లేదని.

కొన్నాళ్లుగా తన అభిప్రాయం నచ్చజెప్పడానికి వి. బి. రాజు తెలంగాణా మంత్రులందర్నీ సమకూర్చి సమాలోచనలు చేస్తున్నాడు. తమరంతా కలిసి మూకుమ్మడిగా రాజీనామాఇస్తే ప్రజల మనస్సు ఆకర్షించవచ్చు, ఆ పరిస్థితులలో ముఖ్యమంత్రి రాజీనామాతప్పదు. తరవాత సంగతి చూతాం అని.

జూన్ 26న తెలంగాణా అభివృద్ధి సంఘం సమావేశం జరిగినది. ఆ సమావేశానంతరం, రాజు, గురుమూర్తి, సిద్ధారెడ్డి, నారాయణరెడ్డి, ఇబ్రాహిం అలీ అన్వారి కలిసి ఉమ్మడిగా రాజీనామా ఇవ్వాలని నిర్ణయించినారు. తక్కినవార్ని కూడా కలుపుకుని 27 సాయంకాలం ముఖ్యమంత్రికి రాజీనామాలు సమర్పించాలని నిర్ణయించినారు.

ఈ నాటకంలో చిన్న అంతర్నాటకం జరిగినది. 27 ఉదయం గురుమూర్తి తన రాజీనామా ముఖ్యమంత్రికి అందజేసినాడు. తొమ్మిది పదకొండుగంటల మధ్య బ్రహ్మానందరెడ్డి కాంగ్రెసు అధ్యక్షుడితోనూ, ఉపప్రధాని మురార్జీదేశాయితోనూ సంప్రదించి, తాను ఇదివరకే నిర్ణయించుకున్న రాజీనామా సంగతి చెప్పి, బెంగుళూరులో వున్న నిజలింగప్పకి మనిషినిచ్చి ఉత్తరం పంపించినాడు. ప్రధాని ఇందిర జపాను పర్యటనలో వున్నది. రాజీనామా ఇవ్వడమేకాకుండా కొత్త నాయకుణ్ణి ఎన్నుకోడానికి జులై 6 న కాంగ్రెసు శాసనసభ పార్టీ సమావేశం ఏర్పాటు చేసినాడు.

జూన్ 28న మిగిలిన తెలంగాణా మంత్రులు తమ రాజీనామాలు ముఖ్యమంత్రికి అందజేసినారు. తాము సమైక్యవాదులమనీ, ప్రజలలోకి వెళ్ళి శాంతి

ప్రచారం చెయ్యడమే తమ ఉద్దేశమనీ ప్రకటించినారు. ముఖ్యమంత్రి రాజీనామా ఇచ్చినతర్వాత వీరి రాజీనామాలలో అర్థంలేదన్నారు చొక్కారావు, నూకల రామ చంద్రారెడ్డి. ముఖ్యమంత్రిని అభినందించినాడు స్వామీరామానందతీర్థ. తెలంగాణా నాయకుణ్ణి ముఖ్యమంత్రి చెయ్యాలన్నాడు.

ఇదంతా 'నాటకం' అన్నారు ప్రతిపక్ష నాయకులు. బ్రహ్మానందరెడ్డి రాజీనామా ఇచ్చిన మర్నాడు ఆనందనిలయం జాగ్రత్తగా తిలకించినవారికి తెలిసినది. అలమారులన్నీ ఖాళీగా వున్నవి. సామాను సర్దడంకూడా జరిగిపోయినది. బ్రహ్మానందరెడ్డి నిజంగా ఖాళీ చెయ్యడానికి సిద్ధంగా వున్నాడు.

బ్రహ్మానందరెడ్డి రాజీనామా అంగీకరించడమా అనే సమస్య చర్చించడానికి జూలై 1న కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు ఢిల్లీలో సమావేశం కానున్నది.

ఈలోపుగా వి.బి. రాజు అధ్వర్యాన ఏకగ్రీవంగా ఒక తెలంగాణా నాయకుణ్ణి ఎన్నుకోవాలని తీవ్రంగా ప్రయత్నాలు జరిగినవి. ముఖ్యమంత్రి కావడానికి ఎవరు అర్హులని చర్చించినారు. బయట వున్నవారు ముగ్గురు. నూకల రామచంద్రారెడ్డి, జె. చొక్కారావు, వి.బి. రాజు. వీరిలో ఎవరినో ఒకర్ని నిర్ణయించుకుంటే, తెలంగాణా శాసనసభ్యులు వార్ని ఏకగ్రీవంగా ఎన్నుకోవచ్చు. అప్పుడు బ్రహ్మానందరెడ్డి ఆశీర్వచనంతో, ఆంధ్ర నాయకుల సానుభూతితో కాంగ్రెసు శాసన సభా సభ్యులంతా ఆయన్నే ఏకగ్రీవంగా ఎన్నుకోవచ్చు.

ఆంధ్రప్రదేశ శాసనసభలో తెలంగాణానించి ఎన్నికైన కాంగ్రెసు సభ్యులు 74. వారిలో 24 మంది చెన్నారెడ్డి నాయకత్వంకింద ప్రత్యేక తెలంగాణా వాదులైనారు. ఈ 24 మంది సభ్యులికీ రాజు గ్రూపు ముగ్గుర్లోనూ ఎవరూ అంగీకారం కారు. ఏకగ్రీవంగా ఎన్నిక జరిగితేనేగాని లాభంలేదు. చెన్నారెడ్డి ఆరేళ్లదాకా ఏ ఎన్నికకీ నిలవరాదని నిషేధం వున్నది. ఇంక మిగిలినది కొండాలక్ష్మణ్. ఇతన్ని ఆంధ్ర శాసనసభ్యులు ముఖ్యమంత్రిగా అంగీకరిస్తారా ?

చర్చలు ప్రశ్నలుగానే మిగిలిపోయినవి. ఇంతలో ఆంధ్రప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుడు, కాకాని వెంకటరత్నం, మరికొందరు నాయకులూ అధిక సంఖ్యాకుల బలంవున్న బ్రహ్మానందరెడ్డి రాజీనామా అంగీకరించకూడదని అధిష్ఠాన వర్గానికి తంతివార్తలు పంపించినారు.

ఢిల్లీలో సంజీవయ్య, రఘురామయ్య, వెంకటసుబ్బయ్య, ఉపప్రధానినీ, హోంమంత్రినీ కలిసి రాజీనామా అంగీకరించి, రాష్ట్రపతి పాలన పెట్టాలని వాదించినారు. బ్రహ్మానందరెడ్డి తెలంగాణా వారికి అక్కర్లేదు, తెలంగాణా నాయకుడు ఈ తరుణంలో ఆంధ్రులికి ఇష్టంకాడు, అందుకని రాష్ట్రపతి పాలనతప్ప గత్యంతరం లేదన్నారు. ఎవరికి అనుకూలమైన ప్రయత్నాలు వారు చేస్తున్నారు.

కాకాని వెంకటరత్నం, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డివంటి కాంగ్రెసు యోధులు ఢిల్లీ ప్రవేశించినారు. ముందు ముఖ్యమంత్రి విషయం ముఖ్యం కాదు. కేంద్ర ప్రభుత్వంగాని, కేంద్ర నాయకులుగాని ఆంధ్రప్రదేశం ఇప్పుడుగాని, తరువాతగాని విభజించడానికి సిద్ధంగా వున్నారా? ఆ సంగతి అటో ఇటో తేల్చేస్తే తక్కిన సమస్యలు వాటంతట అవే పరిష్కారం అవుతాయి. ఆ సంగతి ముందు తేల్చండి అని వాదించినారు.

కాంగ్రెసు పార్లమెంటరీబోర్డువారికి ఏదో ఒక నిర్ణయం చెయ్యక తప్పినది కాదు. ఆంధ్రప్రదేశం విభజించే ప్రసక్తిలేదు. ముఖ్యమంత్రి రాజీనామా చర్చించి నిర్ణయం తీసుకోవలసినది రాష్ట్ర శాసనసభలో కాంగ్రెసు సభ్యులు. వారు 6 తేదీన సమావేశం అవుతున్నారు. ఆ సమావేశానికి అధిష్ఠానవర్గం తరఫున కామరాజు, నిజలింగప్ప హాజరవుతారు అని ప్రకటించినారు.

ఆంధ్రప్రదేశ కాంగ్రెసు శాసనసభ్యుల సమావేశం 6 సాయంకాలం జరిగినది. కామరాజు, నిజలింగప్ప వచ్చినారు. పార్టీ సభ్యుల మొత్తం సంఖ్య 259. వీరిలో 194 శాసనసభా సభ్యులు, 65 శాసనమండలి సభ్యులు. వీరిలో 218 మంది సమావేశానికి వచ్చినారు. 166 శాసనసభవారు, 52 మండలివారు. ఉన్న 166 శాసనసభ్యులలో 123 ఆంధ్రనించి, 43 తెలంగాణానించి. 52 మండలి సభ్యులలో 39 ఆంధ్రనించి. అసెంబ్లీ బలం 280. కౌన్సిలు బలం 90. తెలంగాణా వాదులు 24 శాసనసభా సభ్యులూ హాజరుకాలేదు.

నిజలింగప్ప, కామరాజు, చాలామంది సభ్యులూ ప్రసంగించిన తర్వాత సభవారు ఏకగ్రీవంగా ముఖ్యమంత్రిమీద విశ్వాసం ప్రకటించినారు. తెలంగాణా మంత్రి పి. వి. నరసింహారావు తీర్మానం ప్రతిపాదించినాడు. అక్కినేని భాస్కరరావు బలపర్చినాడు. బ్రహ్మానందరెడ్డినే నాయకుడుగానూ, ముఖ్యమంత్రిగానూ వుండవలసినది గానూ, శాంతిభద్రతలు చేకూర్చి, వీలైనంతవరకు తెలంగాణా నాయకుడు ఒకరు ముఖ్యమంత్రి కాగలందులకు మార్గాన్వేషణం చెయ్యవలసినదిగాను తీర్మానం కోరినది. తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడినది.

తిరిగి ఎన్నికైన ముఖ్యమంత్రి వెంటనే తెలంగాణా వ్యవహారాలు చక్కజెయ్యడానికి ప్రభుత్వంలో వేరే ఒక శాఖ ఏర్పాటుచేసి, అది తెలంగాణావాడైన డిప్యూటీ ముఖ్యమంత్రికిందా, అడిషనల్ ఛీఫ్ సెక్రటరీ పర్యవేక్షణకిందా వుంచడానికి నిశ్చయించినాడు. రెండు రోజులకే బెంగుళూరులో జరగబోయే కాంగ్రెసు మహాసభకి వెళ్ళవలసివచ్చినది. తిరిగివచ్చి కొత్తమంత్రివర్గం ఏర్పాటు చేస్తానన్నాడు.

ఆంధ్రప్రదేశంలో ఒక తుఫాను దెబ్బ తగ్గిపోయిందనుకుంటే బెంగుళూరులో భారతదేశానికే గాలిదుమారం పట్టినది. కాంగ్రెసు ఆర్థిక విధానంలోనూ. ముఖ్యంగా రాష్ట్రపతి పదవికి కాంగ్రెసు అభ్యర్థి విషయంలోనూ ప్రధాని ఇందిరాజీకీ సిండికేటుకీ అభిప్రాయభేదాలు కలిగి రెండు చీలికలు ఏర్పడినవి. ప్రధానికి ఇష్టం లేకుండా సిండికేటు కాంగ్రెసు అభ్యర్థిగా సంజీవరెడ్డిని ఎన్నుకున్నది. ఈ తగాదాలో వోడిపోయిన ఇందిరాజీ ఢిల్లీవెళ్లి ఆర్థికశాఖ మురార్జీ చేతుల్లోంచి తాను తీసుకుని 14 బ్యాంకులు జాతీయం చేసినది. మురార్జీభాయి తన పదవికి రాజీనామా ఇచ్చినాడు. రెండు పక్షాలూ ప్రత్యక్ష యుద్ధంలోకి దిగినవి.

బెంగుళూరునించి తిరిగివచ్చిన బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గ నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నుడైనాడు. అనుకున్నవారిలో రామచంద్రారెడ్డి రానన్నాడు, పేరు ప్రకటించిన తర్వాత రామభూపాలరెడ్డి చేరనన్నాడు. జులై 18 న కొత్త మంత్రివర్గం పేర్లు ప్రకటించి, 19 న ప్రమాణస్వీకారంచేసి, చేయించినాడు బ్రహ్మానందరెడ్డి. 17 గురు కేబినెటు మంత్రులు, 11 మంది స్టేటు మంత్రులు.

కొత్త మంత్రివర్గంలో జే. వి. నరసింగరావు డిప్యూటీ ముఖ్యమంత్రి. తక్కినవారు : పి. తిమ్మారెడ్డి, తోట రామస్వామి, పి. వి. నరసింహారావు, కాకాని వెంకటరత్నం. ఎం. ఎన్. లక్ష్మినరసయ్య, ఎన్. చెంచు రామానాయుడు, కే. విజయభాస్కరరెడ్డి, ఆర్. రామలింగరాజు. శీలం సిద్ధారెడ్డి, ఇబ్రాహిం ఆలీ అన్సారీ. జలగం వెంగళరావు. ఏ. భగవంతరావు. వి. కృష్ణమూర్తినాయుడు. జి. సంజీవరెడ్డి. డి. పెరుమాళ్ళు.

## స్టేటు మంత్రులు

సాగి సూర్యనారాయణరాజు, ఏ. వాసుదేవరావు. ఏ. సంజీవరెడ్డి, రామచంద్రరావు కల్యాణి. ఆర్. నారపరెడ్డి, శ్రీమతి రోడామిస్త్రీ, జి. సి. వెంకన్న. వి. పురుషోత్తంరెడ్డి, డి. రాజనరసింహ, పి. అంకినీడు ప్రసాదరావు, ఎస్. ఆర్. ఏ. ఎస్. అప్పలనాయుడు.

17 గురు కేబినెట్టు మంత్రులలోనూ 7 గురు తెలంగాణావారు. 11 గురు స్టేటుమంత్రులలోనూ 5 గురు తెలంగాణావారు.

ముఖ్యమైన శాఖలలో ప్లానింగు. హోం, మేజర్ ఇరిగేషన్. కమ్యూనికేషన్స్. ట్రాన్సుపోర్టు, ఎడ్యుకేషన్. హెల్తు తెలంగాణా మంత్రుల అధీనంలో వుంచబడినవి.

ఈ పది పన్నెండేళ్ళలోనూ ఆంధ్రప్రదేశంలో ఇంత పెద్ద మంత్రివర్గం ఎప్పుడూ లేదు. తారట్లాడే నాయకులకోసం తలుపులు తెరిచే వున్నవి.

ఈ పని యేడాదిక్రితమే జరిగితే అనే ప్రశ్న తోస్తుంది. గతజలసేతు బంధనం గదా !

# అద్దంలో చందమామ

**1969,** జులై 21 అమెరికా అంతరిక్ష యాత్రికులు, ఆర్మ్‌స్ట్రాంగ్, ఆల్డ్రిన్, చంద్రమండల ప్రవేశం చేసినారు. మానవయాత్రలో మహాముహూర్తం!

అంతరిక్ష యుగారంభకులు రష్యావారు. 1957, అక్టోబరు 4, ప్రథమ స్పూట్నిక్ అంతరిక్షయానంలో అమర్చినారు. 1962, ఏప్రిల్ 12, రష్యాయాత్రికుడు, యూరీ గగారిన్ భూమండలంచుట్టూ ప్రదక్షిణం చేసినాడు. ఆ ఊర్ధ్వయాత్ర తర్వాత 8 సంవత్సరాల 3 నెలల 8 రోజులికి అమెరికా వీరుడు ఆర్మ్‌స్ట్రాంగ్ శశాంకుడిమీద తన పాదాంకాలు ప్రతిష్ఠించినాడు.

చందమామ కావాలని ఏడ్చినాడట బాల్యంలో అవతారమూర్తి శ్రీరామచంద్రమూర్తి. అద్దంలో బొమ్మ చూపించి, చందమామ చిన్నవాడి కందించినాడో ఉపాయం తెలిసిన మహామంత్రి.

దుర్లభ్యమైనదానికోసం తంటాలుపడితే, చందమామకోసం ఏడుస్తున్నాడంటారు. ఆ చందమామ పురాణయుగంలో వినాయకుడి ఉండ్రాళ్ళపొట్ట చూసి నవ్వినాడట. పొట్టదేవుడి పూజాక్షతలు శిరస్సున వేసుకోకుండా, చందమామని చూస్తే, నీలాపనిందల పాలవుతారన్న శాపానికి లోనైనాడు. ఈ వ్యోమగామియుగంలో మానవమాత్రుడు చంద్రుడనే ఖగోళంలో ప్రవేశించి నవ్వినాడు. లోకాన్ని నవ్వించినాడు.

ఆత్మ వికసించని మానవుడు, తోటివారితో సమానంగా, సహజీవనం చెయ్యలేని మానవుడు, ఎన్ని అంతరిక్షయాత్రలు చేసినా, ఆత్మశాంతిగాని, లోకకల్యాణంగాని సాధించలేడు. భౌతికవిజయంతో పైకివెడుతున్న మనిషి ఆధ్యాత్మికంగా దిగజారిపోతున్నాడు.

అంతరిక్ష రంగంలోలాగే, అంతర్జాతీయ రంగంలోకూడా అమెరికా రష్యా దేశాలు పోటీ పడుతున్నవి. లోకంలో జాతులన్నీ అటోఇటో వుండాలని వారి విపరీత అభిలాష. ఎటూచెందని, మధ్యేమార్గస్థులికి క్షేమస్థైర్యాలు లేకుండా పోతున్నవి. ఈ ఇరుపక్షాల కురుక్షేత్రంలోకి చీనా అనే మూడో శక్తి ప్రవేశించి నది. పరిస్థితులు తారుమారైనవి.

ఈ సంఘర్షణలలో, ఈ అణుశక్తి సేకరణ మధ్యంలో, తెల్లవారేసరికి ఏం జరుగుతుందో తెలియదు. ఎవరు వుంటారో, ఎవరు వుండరో తెలియదు.

మాది మధ్యస్థం, ఎవరివేపూ మొగ్గం అనే భారతదేశంలో, ఈ మూడు మహాదేశాల, వారి వారి మూడు తీవ్రతత్వాల ప్రభావం ప్రత్యక్షంగా కనబడు తున్నది. గాంధీ శతజయంతివర్షంలో గాంధేయమార్గం మాసిపోయినది.

ఈ భావసంఘర్షణలోంచి, ఈ భౌతిక నైతిక దారిద్ర్యంలోంచి, మనదేశం క్షేమంగా దరిజేరగలదా ! శ్రేయోరాజ్యగాములైన భారతీయులు ఎప్పుడు ఆ క్షేత్రం చేరుకోగలరు ? ఇన్నాళ్లుగా, ఆ చందమామని అద్దంలో చూపించినారు మన మహా మంత్రులు. మాటలు కోటలు దాటినవి. మూటలు కట్టుకున్నాం. ఈ క్రియా శూన్యతలో విజృంభించినదో వీరవనిత. ఆ రంగుల అద్దం బద్దలుగొట్టినది ఇందిరా ప్రియదర్శిని. ముతాల నిజస్వరూపం ప్రత్యక్షమైనది. ప్రజలకళ్ళ గంతలూడినవి.

ఈ కనువిప్పుకి ఒకవిధంగా ఆంధ్రులే కారణం. జాతీయస్థాయిలో, ఇద్దరు ఆంధ్ర మహానాయకులు, రాష్ట్రపతిపదవికి పోటీచెయ్యగా, వోడిపోయినవారి ఆశా భంగం, దేశభంగానికే మూలమైనది.

స్వతంత్ర భారత దేశాంతర్భాగమైన ఆంధ్రప్రదేశంలో గృహచ్ఛిద్రం నడు స్తూనే వున్నది. ఇద్దరు రాష్ట్రనాయకుల స్నేహభంగం అంతఃకలహంకాగా, ఆ నేపధ్యంలోంచి పెల్లుబికిన ఈ చీకాకు, ఎత్తువారి చేతిబిడ్డగా పెరిగి, భేతాళకథగా, వికృతరూపం దాల్చి, రాష్ట్ర విచ్ఛిన్నమార్గంలో రగులుకున్నది.

ఈ యింటిబెడదలో, ఇన్నాళ్ళుగా తినమరిగి, వొళ్ళుబలిసిన, ఆంధ్రేతర స్వార్ధపరులు, కలుగజేసుకుని, అగ్నిహోత్రంలో ఆజ్యంలాగ, ధనధారలు గుమ్మ రించి, సంఘవిద్రోహశక్తుల్ని ప్రేరేపించినారు. ఆదిలో ఉద్యోగులు రేకెత్తించిన విద్వేషభావాలు, విద్యార్థుల్ని ఉద్రేకపర్చగా, విఫలమనోరథులైన రాజకీయనాయ కులు వార్ని విచ్చలవిడిగా ఉపయోగించుకుంటున్న ఆందోళనలో, దుండగీళ్లు దూరి, దౌర్జన్యంగా, అమాయికప్రజల మానప్రాణధనాలు దోచుకున్నారు. రెండు ఆబోతుల పోట్లాటలో మధ్యగావున్న లేగలకాళ్ళు విరిగినవి.

ఈ మహాకల్లోలంలోంచి బయటపడి, విస్తృతమైన కొత్తమంత్రివర్గంతో, ముఖ్యమంత్రిగా మూడోసారి ప్రమాణస్వీకారం చేసిన బ్రహ్మానందరెడ్డి, భార్యా సమేతుడై, శ్రీశైల మల్లికార్జునస్వామిని దర్శించినాడు; తిరుమల వేంకటరమణ స్వామికి నమస్కరించినాడు. దంపతులిద్దరూ భక్తులు. భక్తివిశ్వాసాలతో, ఒకటి తర్వాత ఒకటి, చిక్కులు విప్పుకుని, వివిధ ప్రాంతాల, వర్గాల కష్టనిష్ఠూరాలు తొలిగించుకుంటూ వస్తున్నాడు. శాంతి భద్రతలు చేకూరినకొద్దీ, ఒకో నిర్మాణ కార్యక్రమం అమలులో పెడుతున్నాడు.

1969, ఆగస్టులో, ఇరవై రెండవ స్వాతంత్ర్య దినోత్సవ సమయంలో, ప్రారంభించిన, శాసనసభా సమావేశంలో, ప్రత్యక్షమైన ముఖ్యమంత్రి, చిరకాల కల్లోలబాధితుడుకాడు; కింకర్తవ్యతామౌఢ్యంలో మీనమేషాలు లెఖ్ఖవేసిన సుతి మెత్తని సున్నితుడుకాడు; ప్రళయకాల ఫెళఫెళార్భటులలో చెక్కుచెదరక నిలిచిన ధర్మక్షేత్ర విజయుడు; గంభీరంగా సభాస్థలినీ సభికుల్నీ పర్యవేక్షించి, ప్రస్ఫుటంగా పలికిన ప్రతిభాశాలి. ఒక కొత్త ఆత్మవిశ్వాసంతో, నిండుకుండతనం నిండిన విశిష్ఠ రాజకీయవేత్త. తాను పదవీత్యాగంచేసిన తరుణంలో, అధిష్ఠానవర్గ ప్రతి నిధుల సమక్షంలో, 'అన్యధా శరణం నాస్తి' అని, కాంగ్రెసు శాసనసభ్యులు, ఏక గ్రీవంగా కోరగా, రాష్ట్ర రథసారథ్యం తిరిగి చేపట్టిన ధర్మకర్త. ఏ క్షణంలో ఏకైక తెలంగాణా నాయకుడు ఆవిర్భవించగలడో, ఆ క్షణంలో, ఆ నాయకుడికి పట్టంగట్టి, ఆశీర్వదించడానికి సిద్ధంగావున్న రాజకీయ వానప్రస్థుడు.

సంప్రదాయ పంచాంగానుసారంగా, జన్మదినమైన సౌమ్యనామ సంవత్సర శ్రావణశుద్ధ ఏకాదశీ శనూ్యషస్సులో (23-8-69) సద్బ్రాహ్మణాశీర్వచనాలతో, షష్టిపూర్తిచేసుకుని, ఇంద్రప్రస్థంలో, ఇందిరాదేవికి ఇక్కట్లు కలిగిస్తున్న పెద్దలికి సమాధానం కుదర్చడానికి, విమానారూఢుడై, కొత్తయాత్ర ప్రారంభించినాడు. తన జీవితంలోనే కాదు, ఆంధ్రప్రదేశ చరిత్రలోనేకాదు, భారతదేశ చరిత్రలోనే అదో కొత్తయాత్రకి నాంది. నడుస్తున్నది కొత్త పంథా, కొత్త పర్వం; ఇందిరా పర్వం.

# సింహావలోకనం

సౌమ్యనామ సంవత్సరం ఆంధ్రప్రదేశంలో కలతలతో ప్రవేశించి, తుఫానుతో సాగి, తోకచుక్కతో నిష్క్రమించినది. సౌమ్యలోనే జాతీయకలతలు కలిగినవి; దౌర్జన్యం చెలరేగినది; శాంతిభద్రతలు నశించినవి. జాతీయ కాంగ్రెసు రెండు చీలికలైనది; హాస్యాస్పదమైనది. ఒకచీలిక పేరు వేళాకోళంగా 'కాంగో' (Congo) అనగా కాంగ్రెసు ఆర్గనైజేషన్ అంటున్నారు. అదేరీతిలో రెండో చీలిక పేరు 'కాంగి' (Congi) అని వ్యవహరిస్తున్నారు. అనగా కాంగ్రెసు ఇందిర. సారస్వత ప్రియుడైన ఒక కాంగో సభ్యుడు వ్యంగ్యంగా శ్రీనాథకవి సార్వభౌముడి ఇందిరా స్తుతి పఠించినాడు.

పండితు డాతడాతడు, ప్రభావసమగ్రు డతండు, శూరు డా
తండు, వివేకి యాతడు, వదాన్యు డతండు, మహాకులీను డా
తండు, కళావిదుండతడు, ధన్యు డతండు, మనోజ్ఞమూర్తి యె
వ్వండు భవత్కృపాకలనవై భవలక్ష్మికి బాత్రుడిందిరా !

కమలనయన నీవు కలచోటు సరసంబు
నీవులేనిచోటు నీరసంబు
కంబుకంఠి నీవు కలవాడు గలవాడు
లేనివాడు నీవు లేనివాడు

ఈ చీలికల ప్రభావం ప్రతి రాష్ట్రంలోనూ ప్రస్ఫుటంగా గోచరిస్తున్నది. ఆంధ్రప్రదేశంకూడా తప్పించుకోలేదు. అయినా కవిసమయంలో మనరాష్ట్రం కల వాటిలోలెఖ్ఖ, ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి కలిగినవాడు. కాంగికే మనరాష్ట్రంలో ఎక్కువ పలుకుబడి. దక్షిణాపథం నాలుగురాష్ట్రాలలోనూ మన రాష్ట్రంలోనే ఈ

సంస్థ సుస్థిరంగా నిలువగలిగినది. తత్కారణంగా, అఖిలభారత స్థాయిలో, అధికారంలోవున్న బ్రహ్మానందరెడ్డి పరిమాణం మరింత పెరిగినది.

కాంగ్రెసు చీలిక కారణంగా మనరాష్ట్రంలో సంభవించిన మార్పు వి.బి. రాజు నాయకత్వాన అవతరించిన యునైటెడ్ ఫ్రంట్. రాజ్యసభ ఎన్నికలలో ఇతర రాష్ట్రాలలోవలెనే కలిగిన కొద్దిపాటి 'కాంగ్రె' వోటమి. ఎన్నికలకి నిలిచిన రాజు 'కాంగో' మద్దత్తుతో రాజ్యసభ సభ్యుడై, రాష్ట్ర శాసన సభకి రాజీనామా ఇచ్చినాడు. బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వం పడగొట్టాలి అని అన్ని పార్టీల సహాయం అర్థించినాడు. ప్రత్యేక తెలంగాణా రావాలి, లేదా, ప్రజాభిప్రాయం సేకరించాలి అన్నాడు. ఇప్పుడు రాజు ఇన్నాళ్లుగా ఆంధ్ర కవచం ధరించిన తెలగాణ్యుడన్నారు.

1970 ఫెబ్రువరి ఆఖరికి బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా మూడు సార్లు ఏకగ్రీవంగా ఎన్నుకోబడి ఆరు సంవత్సరాలుగా ఆ ఉద్యోగంలో నిలువగలిగినాడు. దక్షిణదేశ రాజకీయ చరిత్రలో ఇది రికార్డు.

1964 బడ్జెటు సమావేశం జరుగుతూవుండగా ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసినాడు. ఆ బడ్జెటులోనే ఫిల్ము అవార్డులకీ, బ్రహ్మానంద చిత్రపురికీ ఏర్పాట్లు జరిగినవి. సమావేశానంతరం రాష్ట్రమంతా సంచారం చేసినాడు. అప్పటికి పరిపక్వమైన 55 సంవత్సరాల వయస్సు. 32 సంవత్సరాల రాజకీయ అనుభవం, పరిజ్ఞానం.

ఆనాడు రాష్ట్ర వ్యాప్తంగా గ్రామాధికారులు సమ్మె సమకట్టినారు. ఒకనాడు ముఖ్యమంత్రికూడా వారసత్వపు గ్రామాధికారే. తోటివారితో సానుభూతి సహజం. ముఖ్యమంత్రిగా బాధ్యత తప్పదు. వారిమాటలు విన్నాడు. శాంతిపరిచినాడు. గ్రామంలో నిలబడి రాష్ట్ర కేంద్రంకేసి దృష్టిసారించినాడు. ఇటునించి అటుచూసినాడు. రెండుదృక్పథాలలో గోచరించిన లోటుపాట్లు గమనించినాడు.

వెంటనే గ్రామ స్థాయినుంచి రాష్ట్ర స్థాయివరకూ వున్న పరిపాలనా యంత్రాంగంలోనూ, ఆ యంత్రం నడిపించే ఉద్యోగుల తంత్రంలోనూ సంస్కరణలు రూపొందించి, శ్రేయోరాజ్య సంస్థాపనకి మార్గం సుగమ్యం చేసినాడు. రాజ్య రథానికి కందెన వేసి నూనె పోసినాడు. ఆదిలోనే పరిపాలనాదక్షతా, చాతుర్యం ప్రదర్శించినాడు. ఏ సమర్థుడైనా దేశపరిపాలనాచరిత్ర వ్రాసిననాడు, ఆ చరిత్రలో బ్రహ్మానందరెడ్డికి అగ్రస్థానం వుండగలదు.

గ్రామసీమ బాగుపడి, పరిశ్రమలు అభివృద్ధిపొంది, అందరికీ పనిపాట్లు అందుబాటులో వుండాలీ అంటే విద్యుచ్ఛక్తి ముఖ్యావసరం అని గమనించినాడు. అదనపుగ్రాంట్లు మంజూరు చేసినాడు. శక్తిఉత్పాదన అధికం చేసినాడు. ఉత్పత్తి

అయినకొద్దీ అవసరంకూడా ఎక్కువ అవుతున్నది. ఆ కొరత తీర్చి ఇంటింట దీపావళి కల్పించడమే ముఖ్యమంత్రి ఆశయం.

ఎంతోసహజ సంపదవున్నా, చారిత్రక కారణాలవల్ల, వెనుకబాటుగానే వుండిపోయిన ఆంధ్రప్రదేశం వర్ధిల్లాలి అంటే భారీ పరిశ్రమలు స్థాపించాలి. మన రాష్ట్రం వైశాల్యంలో భారతదేశంలో దాదాపు పదోవంతు వున్నది. వైశాల్యాన్ని బట్టి మనది రాష్ట్రాంలో అయిదోస్థానం. జనాభాప్రకారం నాలుగోస్థానం. అయినా తలసరి సాలీనా ఆదాయంలో పధ్నాలుగో స్థానం. మనకంటె చిన్న రాష్ట్రాలలో తలసరి ఆదాయం ఎక్కువగా వున్నది. తలసరి ఆదాయమే దేశసౌభాగ్యానికి గీటు రాయి. ఇది వృద్ధి చెయ్యడానికి పరిశ్రమలే ఆధారం. జాతీయ తలసరి ఆదాయంతో మనరాష్ట్ర తలసరి ఆదాయం తులతూగాలంటే, 1500 కోట్ల రూపాయల పెట్టు బడితో భారీయెత్తునా, చిన్నతరహాగానూ, పబ్లిక్ ప్రైవేటురంగాలలో పరిశ్రమలు స్థాపించాలని అంచనావేసినాడు. కేంద్రప్రభుత్వాన్ని అర్థించినాడు, దేశసంచారం చేసి పెట్టుబడిదారుల్ని వొప్పించినాడు, రాష్ట్ర ప్రభుత్వంద్వారా అనుకూలాలూ, సదుపాయాలూ అమర్చినాడు. కొంతవరకు కృతకృత్యుడైనాడు. ఇల్లు అలికించి నాడు. కాని, 'ఈసునబుట్టి డెందమునహెచ్చిన శోకదవానలంబుచే' కొందరు మాజీ సహచర్యులు పండుగ చెయ్యకుండా పాడుచేసినారు.

ఎంతచేసినా వచ్చేవారు వస్తూనేవున్నారు. పెరిగే పరిశ్రమలు పెరుగుతూనే వున్నవి.. కేంద్ర ప్రభుత్వ సహాయంతో అగ్నిగుండాలలో పురాతన రాగి, సీసం గనులు పునరుద్ధరించినాడు. వాటితో దేశంలో కొరత ఎంతో తీరగలదు. వజ్ర కరూరులో వెనకటి మణినిధులు తిరగదోడించి రాళ్ళసీమ అయిన రాయలసీమని రవ్వలసీమగా మార్చడానికి సమకట్టినాడు.

మన రాష్ట్రంనించి పరిపాటిగా పొగాకు, మరికొన్ని దినుసులూ విదేశాలకి ఎగుమతి అవుతాయి. ఎగుమతి అవకాశం వున్న దినుసులు ఇంకా ఎన్నోవున్నవి. ఈ సందర్భంలో కేంద్ర సంస్థలద్వారా పరిశోధన చేయించినాడు ముఖ్యమంత్రి. జాగ్రత్తగా వ్యవహరిస్తే, సాలీనా 100 కోట్ల రూపాయిల కిమ్మత్తైన సామగ్రి ఎగుమతి చేసే అవకాశం వున్నది. ఆ విధంగా విదేశమారకం ఆర్జించవచ్చు. ఇందుకుగాను ఎక్స్‌పోర్టు ప్రమోషను కౌన్సిలు స్థాపించినాడు.

అనావృష్టితో, జలాభావంతో, అనాదిగా నిత్యదారిద్ర్యం అనుభవిస్తున్న కర్నూలు, నెల్లూరు, గుంటూరు జిల్లాలలోవున్న క్షామసీమలు ఏకంజేసి, ప్రత్యేక సదుపాయాలు కలగజెయ్యడానికి ఒంగోలు జిల్లా ఏర్పాటు చేసినాడు. ఇరవై యొకటోజిల్లాతో ఆంధ్రప్రదేశ పటంలో మార్పు కలిగినది. ఆ పటం పచ్చగా

చెయ్యడమే ముఖ్యమంత్రి ఏకైక లక్ష్యం. అది నిష్పచ్ఛరం చేసి, పటాపంచలు చేస్తామనే వాదన, దౌర్జన్యం ధిక్కరించి నిలిచినాడు, నిలువగలడు.

బంజరు భూములు సాగులోకి తేవడానికీ, దారిద్ర్య నిర్మూలనకీ బీదవారికి భూమిపంపిణీ కార్యక్రమం ముమ్మరం చేసినాడు.

1970 బడ్జెటు సమావేశంలో ఏటివరస లాంఛనమైన విశ్వాస రాహిత్య తీర్మానం ఉఫ్‌మని వూదిపారేసినాడు. ధైర్యంగా అడిగినాడు: "నామీద వ్యక్తిగత కక్షతో, రాష్ట్ర విచ్ఛిన్నం తలబెట్టిన మహానాయకులంతా, ఈనాడు రంధ్రాన్వేషణతప్ప, తాము అధికారంలో వుండగా ఏమివెలగబెట్టినారు? రాష్ట్రాభివృద్ధి, ఎన్ని ఆటంకాలు తలపడినా, నా హయాంలో జరిగినది. ఏవన్నా కొత్తపరిశ్రమలు వస్తే నా మూలాన్ని వచ్చినవి. ఇంకారాగలవు. విశాఖపట్నం ఉక్కు కర్మాగారం రాకతప్పదు. జింకు కర్మాగారం కూడా వస్తుంది. విశాఖపట్నంతో సహా రేవులన్నీ బాగుపడుతున్నవి. రంగులు మార్చి, పార్టీలు ఫిరాయించి, అపోహలు కల్పించి, అబద్ధపు ప్రచారం చేస్తే, ప్రజలు ఆట్టేకాలం ఆ కల్లిబొల్లి కబుర్లు నమ్మజాలరు."

శాసనసభా సమావేశానంతరం, ఉద్యోగుల సమ్మె సద్దుబాటుచేసి, బ్రహ్మానందరెడ్డి, సతీసమేతంగా, హిమాలయ పర్వత సీమలో, భగీరథ ప్రయత్నంవల్ల, గంగాభవాని ఎక్కడకొండదిగి, భూదేవిని పండించినదో, అటువంటి తపోవనమైన హృషీకేశయాత్ర చేసినాడు. సర్వసంగ పరిత్యాగం చేసినా, సన్యాసి ఆశ్రమంలో కూడా, ఆంధ్రాభిమానం విడిచిపెట్టలేక, సీతనగ క్షేత్రముఖద్వారంలో, గంగాతీరాన, శ్రీ సత్యానంద సరస్వతీస్వాములవారు నిర్మించిన విశాల ఆంధ్రాశ్రమం, వసతి గృహం, దేవస్థలాలు సందర్శించి, సంతోషించినాడు.

మండువేసవిలో కూడా, మంచువలె చల్లగా ప్రవహించే గంగలో, సరి గంగ స్నానాలుచేస్తూ, దక్షిణ గంగ గోదావరిని తల్చుకున్నాడు. స్వస్తిశ్రీ సాధారణ ఉగాది పండుగ విశ్రాంతిగా ఆ పుణ్యక్షేత్రంలో, తపోధనులమధ్య గడిపినాడు. అక్కణ్ణించే రాష్ట్రప్రజకి స్వస్తివాచకంతో, ఉగాది సందేశం అందజేసినాడు.

ఆంధ్రప్రదేశం 'నదీసీమ'. కృష్ణా గోదావరీ నదులతోసహా ముప్పైరెండు చిన్నపెద్ద వాహినులు ఆంధ్రావనీస్థలిని పునీతం చేస్తున్నవి. ఏ ఋషులు చేసిన నామకరణాలో? ప్రాణహిత, మంజీర, కిన్నెరసాని, నాగావళి, వంశధార, చంపావతి, మహేంద్రతనయ వినసొంపు. ఆ గంగమ్మతల్లి అమృతస్పర్శ ఇంకా అన్ని ప్రాంతాలకి లేదు. దేశం ఇంకా సస్యశ్యామలం కావాలి. అందరి తృష్ణా తీర్చాలి. ఆ పని పెట్టుకున్నాడు.

రాష్ట్రానికి తిరిగి రాగానే జైత్రయాత్ర ప్రారంభించినాడు. నూటఇరవై అయిదు సంవత్సరాలక్రితం, సర్ ఆర్థర్ కాటన్ మహాశయుడు నిర్మించిన గోదావరి ఆనకట్ట పాతబడిపోయినది. నిపుణులు కొత్తకట్ట అవసరం అన్నారు. ఆ అన్నదాత పేరుమీదే కొత్త గోదావరి బరాజి సంకల్పించినారు. దానికి శంఖుస్థాపన చేసినాడు. దారిలో ఎన్నో నిర్మాణ కార్యక్రమాలకి ప్రారంభోత్సవాలు చేసినాడు. పూర్తిఅయినవాటిని ఆవిష్కరించినాడు. శ్రీకాకుళం జిల్లాలో తిరగవేసిన వంశధార ప్రాజెక్టుకి పునాది వేసినాడు. ఆ ముహూర్తంలో పూలవర్షంలాగ వాన కురిసినది. నాలుగు నదులున్నా, ఏ ప్రాజెక్టులేని జిల్లా అదొక్కటే. ఆ కొరత తీర్చినాడు, గిరిజనులికి ధైర్యవచనాలు పలికినాడు. "ఈ జిల్లా కష్టాలు ఈ ప్రాజెక్టుతో కొంతవరకు తీరగలవు. గోదావరీ జలాలు విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలకి మళ్ళించడానికి పథకం వేయిస్తున్నాను. నేను కాకపోయినా, నా వారసుడైనా ఆ పని పూర్తిచెయ్యగలడు. గోదావరి బరాజికి, డెల్టా డ్రెయినేజి స్కీముకి, పోచంపాడు ప్రాజెక్టుకి వరల్డు బ్యాంకి సహాయం రాగలదు. రాష్ట్రం అలజడులు లేకుండా, ప్రశాంతంగా వుంటే, ఎన్నిపనులైనా సాగుతాయి. దేశం సుభిక్షం కాగలదు" అన్నాడు. నిజమే.

ఇంతలో ఏప్రిల్ 17 న ప్రధాన మంత్రి మూడు కొత్త ఉక్కు కర్మాగారాలు నిర్మాణం చెయ్యాలని కేంద్ర ప్రభుత్వం నిశ్చయించినట్టు ప్రకటించినది. ఒకటి ఆంధ్రప్రదేశంలో విశాఖపట్టణం; రెండు తమిళనాడులో సేలం; మూడు మైసూర్‌లో హోసపేట. అందరూ సంతోషించినారు.

ఒక్క దక్షిణాపథమేకాదు, ఆరోజున సర్వమానవలోకం సంతోషించినది. కారణం: చంద్రమండలయాత్ర మధ్యలో చెడిపోయిన అపాలో 13 అంతరిక్ష నౌకలో సురక్షితంగా భూలోకం చేరుకున్నారు ముగ్గురు వ్యోమగాములు. ఆ అపాయ స్థితిలో జాతిమత దేశ వివక్షతలు లేకుండా, మానవకోటి యావత్తూ, ఒక హృదయమై, ఒక కంఠంతో సర్వేశ్వరుణ్ణి ప్రార్థించినది. ఆ ప్రార్థన ఫలించినది. లోకం నిట్టూర్చినది.

నవవసంతకాలంలో గున్నమామిడి పూచినది; మత్తకోకిల పాడినది.

ఇందిరాదేవితో తమిళనాడుయాత్ర చేసివచ్చిన బ్రహ్మానందరెడ్డి భార్యా సమేతుడై, అరవై సంవత్సరాలక్రితం తాను జన్మించిన గ్రామం చిరుమామిళ్ళ సందర్శించాడు. అక్కడ గాంధీ హరిజనవాడ ప్రవేశకార్యక్రమం ప్రారంభించినాడు. కాసువారి కుటుంబం తరఫున 5,500 రూపాయలు గ్రామనిధికి విరాళమిచ్చినాడు.

స్వగ్రామమైన తూబాడులో తుపానుబాధితులకోసం నిర్మించే ఇళ్ళకి శంఖు స్థాపన చేసినాడు. తల్లి ఛాయమ్మపేరుమీద 20,000 రూపాయలు విరాళం చదివించినాడు.

శ్రీశైలయాత్ర చేసినాడు. స్వతంత్ర రెడ్డిరాజ్యం స్థాపించేముందు, ప్రోలయ వేమారెడ్డి, శ్రీశైలవాసుడైన మహాయోగి. ఘోడెరాయగంగ ఆశీర్వచనం పొంది నాడు. బ్రహ్మానందరెడ్డి అతిరుద్ర మహాయాగం నడిపించినాడు. ఆ యాగలక్ష్యం ప్రపంచశాంతి, విశ్వమానవ కల్యాణం.

త థా స్తు !



చిరుమామిళ్ళలో బ్రహ్మానందరెడ్డి పుట్టిన ఇల్లు



తూబాడులో కాసువారి లోగిలి



తూబాడులో కాసువారి పూర్వులు కట్టిన చర్చి



పాదిరీల గృహం - ప్రస్తుతం పాఠశాల



వెంకటకృష్ణారెడ్డి పార్కు - తూబాడు



14 సంవత్సరాల వయస్సులో



ఛాయమ్మ స్మారక చికిత్సాలయం - తూబాడు



ఆంధ్రప్రదేశ అవతరణ సమయంలో మంత్రిగా ప్రమాణ స్వీకారం



ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం



రాజేంద్ర ప్రసాద్, రాధాకృష్ణన్‌తో



ప్రధాని నెహ్రూతో



ఇద్దరు మిత్రులు



ప్రధాని శాస్త్రితో



రాష్ట్రపతి జాకీర్ హుసేన్‌కి స్వాగతం



జన్మదినోత్సవంనాడు కుటుంబంతో



ఇందిరాజీతో ఆలోచన



రాష్ట్రపతి గిరికి స్వాగతం



షష్ఠిపూర్తినాడు అభినందిస్తున్న ఉప ముఖ్యమంత్రి



దంపతులిద్దరూ భక్తులు

